# అభినవసరస్వతి

సంపుటము ౨౩ { ప్రజోత్పత్తి నామ సం॥ జ్యేష్ఠమాసము. } సంచిక ౩

## బ్రాహ్మణమహాసమ్మేళనము

అనేక దుర్మతములు ప్రబలి సనాతనధర్మమును సన్నగిల్లఁజేయుచున్న యీకాలమునఁ దత్ప్రాచీనధర్మపరిత్రాణమునకుఁ బాటుపడు ప్రజలుగాని పత్రికలుగాని మిక్కిలి తక్కువగానుండుట పలువురకుఁ దెలిసినవిషయము. అందొకించుక మనదేశమునకన్న నుత్తరదేశము పాటుపడుచున్నయది. ఆ యుత్తరదేశీయులైన పండితులు పెక్కండ్రు పరిషత్తులు జరుపుచును పత్రికలు ప్రకటించుచును ప్రాచీనధర్మము పడిపోకుండఁ గాపాడుచుండుట మా పత్రికాపాఠకులకుఁ బరిచితపూర్వంబ. అట్టిపత్రికలలో వారాణసీపురిని వర్తించెడి బ్రాహ్మణమహాసమ్మేళనము ప్రధానస్థాన మాక్రమించియున్నది. అయ్యది యమరభాషను హిందీభాషను గూడఁ బ్రచురింపఁబడుచున్నది. అందమరభాషలోఁ బ్రకటింపఁబడెడి యీ బ్రాహ్మణమహాసమ్మేళనపత్రికనుండి శ్రీ జగన్నాథోపాధ్యాయుల భారతేశ్వరనికటనివేదనమనెడి వ్యాసమును దెనిఁగించి దిగువఁ బ్రచురించుచున్నవారము.

## ఇండియాచక్రవర్తికి విజ్ఞాపనము

ప్రభూ!

మంచిపరిపాలకుఁడు లేకున్నఁ బ్రజ సముద్రములోని కర్ణధారుఁడులేని పడవవలె నిరాధారమై యుపద్రవముఁ బొందుననునది నీతివిదులకుఁ దెలియనివిషయముకాదు. కావున సర్వవిధములచేతను వారి యోగక్షేమముల విచారించుటకు రాజందఱికైనను వ్యవస్థాపితుఁడు. కనుక నెట్టిపనిచేఁ బ్రజలకు సర్వదా కొఱ్ఱులేని మేలు సంభవించునో యట్టిపనికిఁ బ్రయత్నించుచుండుట రాజుల కవశ్యకర్తవ్యము. అందఱి యవశ్యకర్తవ్యము నుపపాదించెడి యస్మదీయశాస్త్రములైన శ్రుతిస్మృతి పురాణేతిహాసముల యవలోకనముచే రాజులుచేయవలసిన పని తెలియనయ్యెడిని. ఎవఁడు రాజపద మధిష్ఠించి ప్రజల యోగక్షేమార్థమే యెల్లప్పుడు హృదయపూర్వక

ముగా యత్నింపఁడో వాని రాజ్య మీలోకమునం దపకీర్తి కాకరమై యచిరంబ నశించి పరలోకమున నరక మనుభవింపఁజేసి మృగపశ్వాది తిర్యగ్యోనులం బుట్టఁ జేయును. అందువలన రాజు ప్రజల హితమే ప్రయోజనముగాఁగల సింహాసన మధిష్ఠించి క్షణభంగురమైన స్వశరీరమునందలి చింత వెట్టకొనక వచ్చిపడెడి శారీర మానస సర్వవిధక్లేశజాలమును సహించి లోకసంరక్షణరూప నిజకర్తవ్యము నుండి యొకప్పుడును స్ఖలింపఁగూడదు. అట్లుకానిచో నైహికాముష్మికముల రెంటి నుండి యెన్నాళ్ళకైనను బతనము గలుగును. అతని కర్తవ్య మపరభాషలో ధర్మ మను మాఱుపేరుతో నుండియున్నది. రాజధర్మోపవర్ణనమను పేర రాజకర్తవ్య మున్నదియున్నట్లు సకలశాస్త్రములందును జెప్పఁబడియున్నది. వర్ణధర్మములను నాశ్రమధర్మములను బ్రతిపాదించెడి ధర్మశాస్త్రములచేఁ దమ కేధర్మము చెప్పఁబడినదో దాని ననుసరించి వ్యవహరించెడి భూపతుల కెప్పటికిని నిహపర లోకములనుండి కొట్టు సంభవింపదు. రాజుల కట్టికర్తవ్యము ప్రతిపాదించి ప్రజలకు రాజు సాక్షా ద్విష్ణ్వంశమనియు విష్ణునింబోలె నతనిని సన్మానింపుఁడ నియు నతని యాజ్ఞ నీశ్వరాజ్ఞంబోలెఁ బాలింపుఁడనియు ధర్మాత్ముఁడగు ప్రభువు నవమానించిన నరకమునఁ బడుదురనియు రాజద్రోహులు పాతకు లగుదురనియు రాజు లేకున్న లోకస్థితియే నశించుననియు రాజద్వారముననే ప్రజలకు సర్వవిధ సంరక్షణము నగును గాన మనఃపూర్వకముగా రాజశాసనమం దప్రమత్తులు కండ నియు సర్వవిధములచేతను రాజాజ్ఞను రక్షించినఁ బ్రజలు రక్షితులగుదురనియు జనము చేతఁగాని ధనముచేతఁగాని రాజునకు సహాయముచేయుటయే స్వరక్షణమనియు నీతిశాస్త్రములు ధర్మమును జెప్పుచున్నవి.

శ్లో॥ పర్జన్య ఇవ భూతానా మాధారః పృథివీపతిః
వికలేపి హి పర్జన్యే జీవ్యతే నతు భూపతౌ.

(మేఘునివలె భూతములకు భూపతి యాధారము. ఒకప్పుడు మేఘము వర్షింపకున్నను జీవింపవచ్చునుగాని రాజు లేకున్న జీవింపఁదరముకాదు) అని యిట్టి ధర్మ శిక్షఁజేసి ప్రజలచిత్తములఁ బరమభక్తి నుదయింపఁజేయు వేదశాస్త్రముల యాజ్ఞా ప్రకారము ప్రభువులు ప్రవర్తించుచోఁ బ్రజలు వారి ననుసరించి వర్తింతురు.

శ్లో॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః
స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే.
యథా రాజా తథా ప్రజాః

అను ప్రత్యక్షనియమముల ననుసరించి స్వయముగానే నీతినుల్లంఘించు స్వపరిపాలకుని జను లెప్పుడు వీక్షింతురో యప్పుడతని ననుసరించి వారును దదాజ్ఞప్తమైన నీతి నవశ్యముగా ననాదరింతురు. కనుక క్షేమార్థియైన క్షితిపతి నీతివచనానుసారముగాఁ బ్రజలయెడలఁ బ్రవర్తింపవలయును. ఎవఁడు ప్రజల ననేకోపాయములచే రంజింపఁజేయునో వాఁడు రాజని చెప్పఁబడియెడి. రంజనముగూడఁ దండ్రినిజూచి కొడుకువలె రాజునుజూచి ప్రజ యానందపడునట్లుండవలయును. కనుకనే రాజనీతి నుపదేశించుచు నీతివిచక్షణశిరోమణియగు కామందకాచార్యపాదులు రాజగుణముల బహువిధములం బ్రథమము ప్రతిపాదించి పదపడి

శ్లో॥ ఇత్యాదిగుణసంపన్నే లోకయాత్రావిది స్థితే
నిర్వృతిః పితరీవాస్తే యత్రలోక స్స పార్థివః.

(ఇత్యాదిగుణసంపన్నుఁడును లోకయాత్రావిదుఁడును స్థిరుఁడును నగు నెవని వలననుండి జనము తండ్రివలననుండివలె సుఖియించునో వాఁడు పార్థివుఁ) డని వాక్రుచ్చియున్నవాఁడు. ఎవనినుండి యెట్టిభయమును లేక నిస్సంశయముగాఁ బ్రజలు స్వకార్యముల నెఱవేర్చుకొనఁగలుగుదురో వాఁడే నిజముగాఁ బార్థివుం డయ్యెడిని. ఇట్లు రాజధర్మ తత్పరుఁడైన దిలీపమహారాజును వర్ణించుచుఁ గాళిదాస మహాకవి

శ్లో॥ ప్రజానాం వినయాధానా ద్రక్షణా ద్భరణాదపి
స పితా పితర స్తాసాం కేవలం జన్మహేతవః.

(ప్రజలకుఁదండ్రులు కేవల జన్మహేతువులే కాని వినయముగఅవుటవలనను రక్షించుటవలనను భరించుటవలనను దిలీపుఁడే తండ్రి) అని పితృతుల్యత్వమే రాజలక్షణముగా వక్కాణించెను. ఇట్లు రాజనీతిచేఁగూడ జనకుఁడు సంతతినిమనుపనెట్లుప్రయత్నించునో యట్లే తత్త్వానాపన్నుఁడగు ధరణీపతియును బ్రజల పరిస్థితి వ్యవస్థాపింపవలెనని స్పష్ట ముపదిష్టము. సమగ్రతలేనపుడు సంరక్షణము సంభవింపదు కనుక క్ష్మాపతికి శక్తినిగలిగించుటకై ప్రజలు పన్నులమూలమున ద్రవ్య మర్పించుట ధర్మముగా నియమింపఁబడినది. దారిద్ర్యస్థితియందు రాజు హస్త్యశ్వరథపాదాతరూపమును నమాత్యగణరూపమును నగు సహాయసంపత్తి నేర్పఱచుకొనుటకెట్లు సమర్థుఁడయ్యెడిని?

శ్లో॥ స్వామ్యమాత్యశ్చ రాష్ట్రంచ దుర్గం కోశో బలం సుహృత్
పరస్పరోపకారీదం సప్తాంగం రాజ్య ముచ్యతే.

(ప్రభువు, మంత్రి, దేశము, కోట, బొక్కసము, బలము, స్నేహితుఁడు, పరస్పరోపకారులైన యీ సప్తాంగమును రాజ్యమని చెప్పఁబడును) ఇట్టిలక్షణములు గల సత్వభూతమైన రాజ్యమే లేకున్నఁ బ్రభుశక్తి విహీనుఁడగు రాజు ప్రజల యాపదలఁ బరిహరించుట కెట్లు శక్తుఁడగును? రాజ్యము పైనుదహరింపఁబడు సప్తాంగములలో నొకటిలేకున్నను వికృతాంగమగు తేరువలె నిఖిలమును నిరర్థకమే యయ్యెడిని. అట్లుగావున నఖిలసహాయసంపదలకును నాద్యకారణమును నత్యంతావశ్యకమును నగు నర్థసంపద నాత్మకర్తవ్యపూర్త్యర్థ మవనీపతి రాష్ట్రమునుండియే యాకర్షింపకున్న నెన్నటికిని నాసంపద గగనమండలమునుండి వారిధారలంబోలె స్వయముగా నావిర్భవింపదని పన్నుగట్టుట ప్రజలకును బుచ్చుకొనుట భూపతులకును శాస్త్రసమ్మత ముఖ్యధర్మ మైనయది. ఇఁకఁ బ్రకృతిరక్షణమే ముఖ్యప్రయోజనముగాఁగల కరరూపవిత్తము ప్రజలవలననుండి ప్రభు వెట్లు తీసికొనవలయునన్న రాజధర్మ ముపదేశించుచు భగవంతుఁడగు మనువు

శ్లో॥ యథాల్పాల్పమదం త్యాద్యం వార్యోకోవత్సషట్పదాః
తథాల్పాల్పో గ్రహీతవ్యో రాష్ట్రా ద్రాజ్ఞాబ్దికః కరః.

(జలగ లేఁగ తుమ్మెద కొంచెముకొంచెముగా నొకటిసారము గ్రహించి నట్లు రాజు రాష్ట్రమునుండి ప్రతిసంవత్సరముఁ బన్ను కొంచెము కొంచెముగా గ్రహింపవలయును) అని చెప్పియున్నవాఁడు. చిరస్థాయినియగు స్వసంపద నభిలషించు రాజుల కిది మిక్కిలి విచారింపఁదగినవిషయము. నియమము నతిక్రమించినఁ దొరగనో యాలస్యముగనో యేదో యనిష్టము గలుగునని నీతిమంతులకుఁ దెలియకయుండఁలేదు. మీఁది జలౌకోవత్సషట్పద దృష్టాంతములచేఁ బన్నుపుచ్చుకొనుటలోఁ బ్రభువు ప్రజల నించుకంతయుఁ గష్టపెట్టఁగూడదని స్పష్టపడుచున్నది.

రక్తమే జీవికగాఁగల జలగ ప్రాణుల నెత్తురు పీల్చుట కవయవములలోఁ బ్రవేశించుటయును దెలియఁబడదు. మెల్లగాఁ దృప్తియగునంత పర్యంతము రక్తమును బీల్చి విడుచునటకును దదాహారాధారభూతమగు ప్రాణి తనరక్తము హరింపఁబడుచుండుట యెఱుఁగక సుఖముగానే యుండును. ఇతరుల నించుకంతయుఁ గష్టపెట్టకుండ జలగ యీయుక్తిచే రక్తము హరించుచున్నది. కనుకనే జలగ విడిచి

పోయిన తరువాత నది వేసిన రంధ్రమునుండి కాలువ నెత్తుకు చూచి జలగపట్టినదని ప్రాణి యూహించుచున్నది. రక్తముగూడ శరీరుల కనిష్టముగలుగ నంతగానే స్రవించెడిని. జలగ హితవివేకమువలన నట్లు చేయుటలేదు. వికృతమైన రక్తమే రుచించుటంజేసి స్వభావముచేతనే యది యట్టిదిగాయున్నది. దానిచేష్టవలన మానవులకు బాధయుం గలుగుటలేదు. బ్రతుకుటకుం బ్రతిబంధము నగుటలేదు. ప్రాణత్రాణమగుటవలనం బ్రజల పద్ధతి నిర్విశేషమగు ద్రవ్యమును జలగవలె నత్యల్పముగను నబాధకముగను నజ్ఞాతకల్పముగనే రాజు తీసికొనవలయును. ప్రజ మదించి తనమాట వినకుండ నుండనియంతగాం బన్నువసూలుచేయుట ప్రభుకర్తవ్యము. నరపతి నాదగ్గర ద్రవ్యముతీసికొనుచున్నాండని భారముగాం దలంచుకొనకుండ స్వగుణములచే ననుగ్రహింపంబడిన ప్రజ బుద్ధిపూర్వకముగాం గానుకనిట్లునది గ్రహింపవలెనని యనుసంధానము చేసికొనునది.

వత్సదృష్టాంతమువలనంగూడ నదే యభిప్రాయము గనుచున్నయది. ఆవులు లేగల యెడలం బ్రసన్నములై వానిం జూచుటతోడనే స్వయముగాం బాలు చేపినట్లు ప్రభువు ప్రజల రంజింపంజేయవలయును. ప్రజలకుం గలిగెడి విఘ్నముల నత్యాసక్తిచే దూరమునకుం బాఱందోలుచు సర్వదా వారిమీంద దయాదృష్టి యుంచుచు వారిదుఃఖమే తనదుఃఖమనియు వారిసుఖమే తనసుఖమనియు హృదయమందుం దలంచుచున్నవాండై వ్యవహరించుచో స్వరక్షణనిమిత్తము ప్రయత్నించుచు నెట్టి యిక్కట్టును బెట్టని యట్టి రాపట్టి కండలును దూడ కావువలె స్వయముగా నర్పించుట కవశ్యము యత్నింతురు. రాజు రాజోచితములైన తనగుణములచే ననురక్తులై యసువులనైనను నర్పించుటకు సంసిద్ధులైయున్న జనులవలననుండి యెంత తీసికొనిన నొకింతయు రాజధర్మము బాధింపంబడదో యంతద్రవ్యమే తీసికొనవలయును. అక్కడంగూడ "గర్భాదుత్పతితే జంతౌ మాతుః ప్రస్రవతః స్తనౌ" (గర్భమునుండి జంతు వుదయించుచుండంగాం దల్లిచనులు స్రవించును) అను న్యాయమున మాతృస్తనములం బరమాత్మ స్తనంధయనిర్వాహార్థమే పాల నేర్పఱచును. లోకులును శిశుసంరక్షణార్థ మేర్పఱుపంబడిన యాతల్లి పాలు మఱియొక రనుభవింపవలెనని ధర్మము నిర్ణయించుట కెన్నటికిని శక్తులుకారు. ఇదియునుంగాక దూడగూడం దన తల్లిపాలు సర్వాధికారస్వాయత్తమై యున్నను నన్నియు ననుభవింపక మనస్సంతోషపర్యంతమే కుడుచుచు నడవినుండి తేంబడిన గడ్డిమొదలైన యాహారముల

వలననే యాత్మను సంతృప్తిపఱచుకొనును. కనుకనే యవేపాలచేత దేవపితృమానవ కార్యములు సాధింపఁబడుచున్నవి. పాలన్నియుఁ గ్రోలినచో మొదలు తెగకే ప్రాణాంతము సంభవించును. మఱి యంతకంటె నెక్కువ "ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" అను నియమము ననుసరించి గోసంరక్షణముగూడ నెవ్వరుం జేయఁబూనరు. దేవర్షులను బితౄన్ను నర్చనతర్పణములు లేక విపత్తునే పొందుదురు. ఇట్టి పశువులైన చిన్నదూడలే ప్రకృతిసిద్ధస్వభావమునుండి కొంచెపాలే క్రోలి భాగ్యవశంబునఁ బరోపకారులగుచుండ మనుష్యులలోఁగూడ సర్వశ్రేష్ఠతా [illegible]లై యట్టి దేవునివలెఁ బూజింపఁబడు ప్రభువులు తమ్మే నమ్ముకొనియున్న ప్రజలవలననుండి వారి యన్ననిర్వాహసాధనమగు నాయమును వ్యయమును యథావస్తుగా విచారించిరేని ద్రవ్యము తీసికొనవలయుననునది వివేకసాధ్యము. ఇయ్యది వత్సదృష్టాంతము.

ఇఁకఁ దుమ్మెదలపై దృష్టినిల్పుదముగాక. అవి మధుసంచయాత్మక స్వకర్తవ్యసాధనార్థ మనేకవిధపుష్పములనుండి రససారమును గ్రహించుచున్నవి. పుష్పముల యంతర్మర్మములనుండి తత్త్వసార మాకర్షించుచును దానియ తేజోవిఘాత మించుకైనఁ జేయుటలేదు. లోపలఁ బ్రవేశించి రసమును పీల్చుచున్నను కుసుమములు వాడిపోవుటలేదు. ముడుచుకొనిపోయినను మృదులములగు వానిదళము లొకటియుఁ బడిపోవుటలేదు. రసాదానప్రాగవస్థయందువలెనే తదనంతరమునఁగూడఁ దదీయ కాంతి యవికృతమును బ్రకృతిసిద్ధమును నై కనఁబడుచున్నది. ఏ వివర్ణత్వమును దుమ్మెదలు వానియందుఁ గలిగించుటలేదు. ఈపుష్పమునుండి తుమ్మెదలు మధుపానము చేసినవని యెవరును ననుమానించుటకు శక్యమగుటలేదు. ఏభాగమునందలి మధువును భ్రమరములు పానముచేయుచున్నవో యాస్థానము శూన్యమై కనుపట్టవలయును. కాని నిష్కాసితరస మీపుష్పస్థానమని యెవ్వరును నెఱుఁగుటలేదు. అనుమానించుటకుఁగూడ నేవిధమునను శక్యముగాదు. ఇట్టే ప్రజారూపపుష్పములనుండి కరరూపమైన యర్థమధువు భ్రమరంబులుంబోలె వికారలేశము గూడఁ గలిగింపక కొంచెముకొంచెముగాఁ దీసికొని భూపాలుఁడు బొక్కసము నుంచవలయును. మార్దవముయొక్క యంతిమసీమ నెక్కడ వెదకినను నిస్సంశయముగాఁ బుష్పముల యందే దొరకవలయును. పుష్పములను వదలిపెట్టిన నితరత్ర యెచ్చటను నట్టి మృదుత్వము దొరకఁబోదు. అట్టి కోమలకుసుమదళముల యంతఃకోశములయందే సమగ్రముగాఁ బ్రవేశించి వాని స్థితికి వికృతిగలిగింపక రసములలోఁగూడఁ బరమా

త్కృష్టమగుచుఁ దదాస్థానిదానభూతమైన రససారమును గ్రహించు తుమ్మెద తాఁగ్రహించిన మధువుచే జగత్కార్యమును సాధింప సమర్థమగుచున్నప్పు డఖిల ప్రజలచేత నల్పమల్పముగా నర్పింపఁబడు నర్థముచే నింపఁబడు రాజకోశము ప్రజా సంరక్షణమందుఁ బ్రభవమగునా కాదాయని యిటు వికల్పమెందుకు? ప్రజల సంతోషపెట్టి గుణముగ్ధులైన యవ్వారిచే నుపదీకృతమైన యల్పార్థముం దీసికొని కార్యనిర్వాహముచేసికొను రాజును సంపదలు స్వయముగానే యాశ్రయించును. ప్రజలపైఁ బ్రభు వెట్టియంతరాత్మతోఁ బ్రేమ చూపవలసినదియు షట్పదదృష్టాంతము వలనఁ దెలియనయ్యెడిని. తుమ్మెద తన్నాశ్రయించి రసమునుగ్రోల నారంభించిన ప్పుడు ప్రకృతినియమమునుండి సూర్యుఁ డస్తమింపఁ గమలము ముకుళించును. అపు డా తుమ్మెద నిర్గమనద్వారాభావమున నవరుద్ధనిశ్వాసమై చచ్చికూడఁ బోవుచున్నది. కాష్ఠభేదనమందుఁగూడ నప్రతిహతమగు శక్తిగలిగిన యా తుమ్మెద ప్రాణసంకట సమయమునఁ గోమలమగు తామరపువ్వును భేదించి వెలుపలికివచ్చుట కశక్యము నసమర్థమగుచున్నది. ఇఁక దాని కృతజ్ఞత యేశబ్దములచే వర్ణింపవలయునా? ఏకమల మందుఁ జచ్చుచున్నదో యా కమలమును భేదించుటకు వాఢిగా దానికిఁ బ్రవృత్తి కలుగుటలేదు. దేనిరసముచేత యావజ్జీవము స్వీయకర్తవ్యము సాధింపఁబడినదో యేది లేకున్నఁ దనకు సత్తగూడ నుండదో దేని యాశ్రయముచేఁ దరువాతఁగూడ స్వార్థము సాధింపఁదగియుండునో దానినే భేదించుటకు సహృదయు లెట్లు ప్రవ ర్తింతురు? మరణ మెప్పుడో యొకప్పుడు నియతమై యుండనే యున్నది. కావున షట్పదానుకరణము ధర్మాత్ములగు రాజుల కాదిష్టము.

అవశ్యకర్తవ్యమని శాస్త్రశాసనము ననుసరించి ప్రజలు నిర్వివాదముగా యథాశక్తిఁ బ్రభువులకుఁ బన్ను గట్టుచునే యున్నారు. ఒకవేళ వ్యసనోపద్రు తులై వారే విపత్తుపాలగుచోఁ బ్రభు వుద్ధరించుటకుఁ బ్రయత్నించుట ధర్మము. తమ కాపదవచ్చినప్పుడు స్వమరణముగూడ రాజు గణింపనిచో నాతనిపట్లఁ బ్రజలు స్వయముగా ననురక్తులై యుందురు. స్వార్థమునే సాధించుకొనఁజూచుచుఁ బ్రజలు పరమాపదపాలైన దయాదృష్టిపెట్టకున్న రాజధర్మము ఖండితమే యయ్యెడిని. ప్రభువే తనధర్మమును దాను దప్పినడువ నారంభించినప్పు డతనిచేత శాసింపఁ బడుచు నతని ననువర్తించు ప్రజలు తమధర్మములనుండి తా మేల చలింపకుందురు? ప్రభువు యథాపేక్షితమైన సంరక్షణముఁ జేయక ప్రజాపీడనముచేయ నారంభించిన నారియందు శాంతి యేప్రకారము నెలకొనును? అన్ని విధములయధికారము

నర్పించి యందఱిమీఁదను బాలించుట కధికృతుఁడగు నవనిపాలుఁడే యన్యాయ్య మాచరించిన నఖిలలోకస్థితి యన్యు నెవని నవలంబింపవలసియుండును? అన్యాయ్య లాచరించు ననేకవిధములగు నన్యాయ్యముల నపవారించుసామర్థ్య మవనీశులకే యుండియున్నది. ఏరాజు తన్నాశ్రయించుజనులపై దయ యెంతవెంచుచుండునో యారాజు నైశ్వర్యమును నంతవెరుఁగుచుండును.

శ్లో॥ దయా మాస్థాయ పరమాం ధర్మా దవిచల న్నృపః
పీడితానా మనాథానాం కుర్యా దశ్రుప్రమార్జనం.

(ప్రభువు పరమదయాళుఁడై ధర్మమునుండి చలింపక పరిపీడితులైన ప్రజల కన్నీళ్ళు తుడుచుచుండవలయును) అని కామందకుఁడుగూడ నిట్లు చెప్పియున్నాఁడు. రాజులకు నేధర్మములు చెప్పఁబడియున్నవో యాధర్మముల నుల్లంఘింపక యెల్లప్పుడు ననన్యరక్షకులగు ప్రజల యాపదల నివారింపవలయును.

శ్లో॥ నహి స్వసుఖమన్విచ్ఛ న్పీడయే త్కృపణం నృపః
కృపణః పీడ్యమానో హి మన్యునా హంతి పార్థివం.

(దీనుఁడు పీడ్యమానుఁడై క్రోధముచేఁ దన్నుఁ జంపునుగాన రాజు స్వసుఖమును గోరుచు వానిఁ బీడింపఁగూడదు) సర్వవిధసామర్థ్యసంపన్నుఁడగు రాజలక్ష్మిని గృపణుఁడు కుపితుఁడయ్యుఁ దిరస్కరించుట కెట్లు శక్తుఁడగునని యిచ్చట శంకగలుగుచున్నది కాని) యట్టియహంకారము ప్రభుత్వమదముచే వివేకశక్తి నశించినపు డుద్భవించుచుండును. ఎవనికెట్టిశక్తి యెంతయుండునో యది యున్నదియున్నట్లు కాపాడుకొనవలయును. ఇంద్రునిరాజ్య మొకపుడు దేవతలచే నహుషునధికారమం దుంచఁబడుటయు నతఁడు స్వర్గాధికారమదముచే స్వచ్ఛందాచార మవలంబించి వేల్పులకుఁగూడ దొరనే యయినపుడు నన్నెవఁడేమిచేయఁగలఁడునని శచీదేవిని రమింపనిచ్ఛయించెను. అయ్యింద్రాణి యనేకవిధముల హితబోధచేసినది. కాని మదాంధుఁడైన యతఁ డేకాకినియు నబలయు నగు నాయమ నేమనిగణించును? చివర కాశచి బ్రాహ్మణులు మోయు పల్లకి నెక్కి నా దగ్గఱకు వచ్చుట కనుగ్రహించెదవేని నీ కవశ్యము నర్ధాంగినగుదునని వచియించెను. ఇఁక నిక్కడ మదాంధు లేమిచేయఁజాలరు? గోచిపాతలరాయులై పైరమెత్తు బాపలడవికొంపలలో నుండియే యున్నవారు. అంత నైదాఱుగురు రవసుకులఁ బట్టితెప్పించి తానెక్కినపల్లకి మోయించుచు సంతోషముతో శచీమందిరాభిముఖముగా బయలుదేఱి పోయెను. దీనులైన యా బ్రాహ్మణులు పురుగులు మొదలగు సూక్ష్మజంతువులు కాళ్ళక్రిందఁబడి వచ్చునని

మెల్లమెల్లగా నడుపవలెంగదా. కాని యీ కాలమందున రాజపదము నిమిషము
గూడ సంవత్సరతుల్యము కాఁజొచ్చుటయు శీఘ్రముగా నడచుటకేగుటకు 'సర్పసర్ప'
(నడు నడు)యని కాళ్ళతోఁ దట్టనారంభించెను. అతని యీ మదాంధతకును నవీతిజ్ఞ
తకును ననాచారాభిసుఖతకును నసహిష్ణులగు నవనిర్వైవతములలో దుర్వాసుఁడుగూడ
నొకఁడు. ఆకోపమూర్తిగూడ నట్టి యత్యాచారము నెట్లు సహింపఁగలఁడు? 'త్వమేవ
సర్ప'యని తక్షణము ధాత్రిం బడఁద్రోసెను. కథయున్నదైనను నన్యాయముగాఁ బీడిం
చిన నహుషాత్మక రాజకుని శక్తి నశింపఁజేయునని యిందలి యభిప్రాయము.
వీఁగు దుర్బలుఁడని యనుకొనుట వివేకశక్తి లేకపోవుటవలననే. అటుఁగాక. ప్రభు
శక్తి ప్రజాభ్యాసముననే కలుగుచున్నది. ప్రజలకు భక్తి దృఢమైనకొలఁది ప్రభువు
నకు శక్తి దృఢమగుచుండును. కావునఁ బ్రభువులు ప్రజల నెటికన్నను జెట్టుకొందుట
యావశ్యకము.

కావునఁ బ్రజలకుఁ బ్రాణప్రదమై యుండిన యీ ప్రభుత్వ మిట్లు ప్రార్థించు
చున్నవారము. భారతదేశమునకుఁ బన్ను లెక్కువచేయుటయందు ప్రయోజనము
లేదని కనుపట్టుచు. హైందవు లాత్మదేశసంభవములైన వస్తువులచేతనే యఖిలాత్మీయ
కార్యనిర్వాహము నాచరించుకొనుచున్నారు. ఇండియా సంరక్షణార్థ మెంతఖర్చు
నపేక్షింతురో యంతయే యీ దేశమునుండి పుచ్చుకొనిన నెన్నటికిని బ్రజలయం
దశాంతి యేర్పడదు. వాణిజ్యవ్యయము వాణిజ్యద్వారముననే యార్జించుట మంచిది.
ఇదిగూడ శ్రీవారే విచారింపకున్న జగమం దస్మద్ధితచింతకుఁ డన్యుఁడెవఁ
డున్నాఁడు? భారతభూమి రత్నగర్భమైనను బ్రజలు రేయింబవళ్ళు శ్రమపడి
వ్యవసాయముచేయుచుఁగూడ జీవనోపాయములేక యేడ్చుచుం దిరుగుచున్నారు.
వీరి దారిద్ర్యకారణ మేమైయుండును? ఎచట నుద్భవించు భోజనాచ్ఛాదనసాధన
వస్తువులచే నితరదేశీయులకుఁగూడఁ గార్యనిర్వాహ మగుచున్నదో యాభారతవర్ష
మందే యొక తృణముగూడ నూగకుండక చెఱుటచేఁ దడియుచు సగముకడుపున
కైనను పట్టెడు మోటతిండి దొరకక యెన్నిదినము లిట్లుండవలయును? పుత్రులమీఁద
వచ్చిపడిన దారిద్ర్యమునుగూర్చి పోషకులు లాలోచింపఁగూడదేమి? ఇట్టిపట్లఁగూడ
మాటిమాటికిఁ బన్ను లెక్కువ చేసెదరేని యెట్టిప్రజ శాంతి నవలంబించును? రాజ
ధర్మముతో రాజు ప్రవర్తింపవలయును. అట్లు ప్రవర్తించినను బ్రజ లుపద్రవము
గలిగించుచో, దండనీతి న్యాయ్యమయియే యున్నయది. రాజవర్గము సంసార
బాహుళ్యము పెట్టుకొని దానికంతటికిని బన్ను లెచ్చించి ప్రజలవల్లఁ బూర్తిచేసి

కొన నిద్వగింప నది యెట్లు సాధ్యమగును ? వివిధవిలాసముల యొక్క కాని విమానములు మొదలగు వివిధవిషయములయొక్క కాని పరిపూర్తికిఁ బ్రజలవలనఁ బన్ను తీసికొనవలయుననుటది మా నీతికి విరుద్ధము. ఎంతకార్య మిండియాజనుల క్షేమార్థమభిలషింతురో యంత పూర్తియగునంతవఱకే వారివలన నుండి ద్రవ్యము తీసికొనవలయును. అట్లు కానిచో నెప్పుడు దారిద్ర్యానలముచే సంతాపితులైన ప్రజలకుఁ బ్రాణసంకటోపాయముగ నెక్కుడుగ నఁబడదో యప్పుడే డెక్కన యుపద్రవము గలిగించుటకు నిస్సందేహముగా నారంభింతురని మా నీతిశాస్త్రములయం దనుశాసితము. అందువలనఁ బ్రజల యోగక్షేమసాధనము మిక్కిలి సంభవించులాగునను రాజధర్మము చక్కఁగాఁ బరిపాలింపఁబడులాగునను బ్రజలకుఁ బ్రభువుపై భక్తి తఱుఁగకయుండులాగునను శ్రీవారి శాసనము భరతఖండమున దృఢముగాఁ జెల్లులాగునను పునఃపూర్వకముగాఁ బ్రయత్నింపవలయునని శ్రీవారిని సవినయముగా యాచించుచున్నవారము.



## —* కృతివిమర్శము. *—

శ్రీ జటప్రోలుసంస్థానాధీశ్వరులగు రాజా సురభి వెంకటలక్ష్మారావు నిజాంనవాజ్వంత్ బహద్దరుగారిజీవితము. గ్రంథకర్త వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు బి.ఏ.గారు. వీరు పూర్వము శ్రీ తేలప్రోలుజమీందారులగు రాజా శోభనాద్రిఅప్పారావు బహదరుగారి జ్యేష్ఠపుత్రులగు రాజా విజయాప్పారావుగారి కాంగ్లవిద్యోపాధ్యాయులు. విజయాప్పారావుగారు సురభి వెంకటలక్ష్మారావు బహదరుగారి దౌహిత్రులు. వారు మాతామహులైన వెంకటలక్ష్మారావు బహదరుగారు చెన్నపురియం దుండ వారిసన్నిధి కరుగుచు నింగ్లీషు చెప్పు నీ రామసుబ్బారాయఁడుగారిని దోడ్కొనిపోవుటయు నచట వారికి లక్ష్మారావుబహదరుగారి సందర్శనభాగ్యము గలిగినది. నాటి

నుండి వారిపై నా రాజాగారి ప్రేమాంకురములు క్రమక్రమముగాఁ బెరిఁగినవి. అట్టిపట్ల శ్రీనాథాదివిరచిత నైషధాది మహాప్రబంధములు రామసుబ్బారాయఁడుగారిచేఁ జదివించుచును రసవంతములగు పద్యములు విని యానందించుచును యావజ్జీవము సురభివంశజుల కాంగ్లవిద్యోపాధ్యాయులుగా నుండునట్లు శాశ్వతజీవనము కల్పించి స్వసంస్థానమునం దుంచుకొని పదపడి స్వజీవితమును వ్రాయ నానతిచ్చుటయు నట్లుకావించిరి. ఏతద్గ్రంథకర్త గ్రామ్యయేటయినను గవిత్వశక్తియుక్తుఁడై యాంధ్రభాషాపాండిత్య మలవఱిచికొనియుండుట గతమాసమునఁ బ్రకటింపఁబడిన యభినందనపద్యములే చెప్పకే చెప్పుచున్నవి. వీరు వ్రాసినచరిత్ర చాల శ్రావ్యముగానున్నది. ఆచరిత్రయొక్క సంగ్రహము దిగువ నుదాహరింపఁబడియెడిని.

ఈ రాజధాని హైదరాబాదున కాగ్నేయమున నూఱుమైళ్లదూరమునను గర్నూలుపట్టణమున కీశాన్యమున ముప్పదిమైళ్లదూరమునను శ్రీశైలక్షేత్రమునకుఁ బశ్చిమమున నేఁబదిమైళ్లదూరమునను దనరారుచున్నది. కృష్ణా తుంగభద్రానదులు దీనికిఁ దూర్పుగా మైలునరదూరముననే ప్రవహించుచున్నవి.... తూర్పున నింగ్లీషురాజ్యము దక్షిణమున నిజాంరాజ్యముఁ బశ్చిమమున వనపర్తిసంస్థానము నుత్తరమున నిజామునకుఁ జేరిన దేవరకొండదేశముం గలవు. ఇందుఁ బురాతనంబగు జటేశ్వరాలయ మున్నది. ఇదియే జటాయుర్వధాస్థానము. శ్రీరామునిచే జటాయుర్నామమున లింగము ప్రతిష్ఠింపఁబడినదని వాడుక. ఈదేవునిబట్టియే యీరాజధాని జటప్రోలని ప్రసిద్ధిఁగాంచె. ఈదేవుని కిప్పటికి నిత్యపూజామహానైవేద్యములు యథావిధిగ జరగున్నేర్పాటులు శ్రీరాజాగారిచేఁ జేయఁబడినవి.... ఈస్వామికిఁ గృష్ణానదీజలములచే ననుదినము నభిషేకము జరుపఁబడుచుండును. ఈరాజధా

నికి మూలపురుషులు సురభివంశస్థులు. ఈసురభివంశమునకు మూలపురుషుఁడు చెవ్విరెడ్డియను నామాంతరముగల పిల్లలమఱ్ఱి బేతాళనాయఁడు. ఈపురుషుఁడు క్రీస్తుశకము పండ్రెండవశతాబ్దము కడపటిభాగము మొదలు పదుమూఁడవశతాబ్దము నాదిభాగములోఁ గొంతవఱకున్నట్లు శాసనాదులవలనఁ దెలియవచ్చుచున్నది. ఈ రాజశిఖామణి ఘనతగాంచిన రాజా వెంకటలక్ష్మారావుబహాదరుగారి కిరువదియేడవ పురుషుఁడు. ఈమహాప్రభువును ప్రతాపరుద్రమహారాజుగారి మాతామహులైన గణపతిదేవరాయలును సమకాలీనులు. ఈసురభివంశస్థులలో... సర్వజ్ఞసింగభూపాలుఁడు మొదలగువారు ప్రధానులు... శ్రీనాథుఁడు రచించిన యీక్రిందిపద్యమువలన సింగభూపాలుని విద్యావైదుష్యము స్పష్టమయ్యెడిని.

సీ॥ దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల.
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు.
పగులగొట్టించి యుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క.
చంద్రశేఖరక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

మోఁదులు మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగమహీపాలు సేవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరసస్త్రాణనికురుంబ! శారదాంబ!

... వెంకటలక్ష్మారావుబహద్దరుగారు నెల్లూరుజిల్లా... వేంకటగిరిసంస్థానాధీశ్వరులగు రాజా సర్వజ్ఞకుమార యాచమనాయుఁడుగారి నాల్గవపుత్రులు. జటప్రోలుసంస్థానాధీశ్వరులగు రాజా వెంకటజగన్నాథరావుబహద్దరుగారు... వారినిదత్త... స్వీకారమొనరించి... రి ... శ్రీవారు... వేములవాడ... దేశాయి... కోనారావుగారి కొమార్తెయైన రాణి వెంకటరత్నమాంబగారిని వివాహమాడిరి ...కర్నూలుకు ముప్పదిమైళ్లదూరములోనున్న యొకచిన్నగ్రామము... పెద్ద... జేసి... కొల్లాపురంబను నామమిడి... యందు... వసించిరి. ఇది శ్రీనిలయంబై మనోహరంబై... వెలయుచున్నది ... ఈయుద్యమమే ... ప్రజలకు శ్రీవారియెడలఁ గలుగు భక్తికిఁ గారణము... ప్రజాసౌఖ్యాభివృద్ధియే రాజుల సౌఖ్యాభివృద్ధికిఁ బ్రథమసోపానంబని యెంచు ప్రభువుల సంఖ్య బహు స్వల్పము. ప్రజల క్షేమమే తమక్షేమముగఁ బాటించి జన్మంబునకు సార్థకతగాంచిన రాజశిఖామణులను... ప్రజలు తల్లిదండ్రులుగను గురువులుగను వేయేల దైవములుగను దలంచి భక్తివిశ్వాసపరవశులై తత్సేవాపరాయణులై వన్నె కెక్క రే?... రాజాగారు... రాజవీథులను... ఆసుపత్రులను ధర్మశాలలను... న్యాయస్థానంబులను... నిర్మించి సకలవస్తుసామగ్రిసంపత్తియు... సౌఖ్యంబును గలుగఁజేసి కొల్లాపురంబును విరచించిన సాహసౌదార్యభవ్యులు... ఈనగరిచుట్టును నత్యున్నతంబగు ప్రాకారము కలదు... గోశాలలు... గజాశ్వశాలలు నీపురము నలుప్రక్కలఁ గలవు. శ్రీవారు గోసంరక్షణమన్న ముందంజవేయు మహామహులు... నిరంతరమును గవులను బ్రోత్సహించుచుఁ బండితుల నాదరించుచు రసవంతములగు ప్రబంధములను... నవలలను... వెలువడునట్లుచేయుచు భాషాసేవసేయుచుండెడివారు... వెల్లాల సదాశివశాస్త్రిగారిని దమ యాస్థానపండితులుగ నియమించి

శ్రీ మాధవరాయకృత చంద్రికాపరిణయమునకుఁ జక్కని వ్యాఖ్యా
నము వ్రాయించి... ముద్రింపఁజేసియు సర్వజ్ఞసింగభూపాలీయమను
నామాంతరముగల రసార్ణవసుధాకరమను నలంకారశాస్త్రంబును...
అచ్చువేయించియుఁ బండితులకును విద్యార్థులకును నామోదమొసం
గుచున్నారు... శ్రీవారు బాల్యమాది నేఁటిదనుక 139 పెద్దపులు
లను దునుమాడిరని... స్పష్టపడుచున్నయది... తన పరిపాలనమ్మున
నెట్టియిక్కట్లు జనింపఁగూడదని ఘాతుకజంతువుల ఖండించె... ఇన్ని
... బెబ్బులులఁ జంపిన... వీరశిఖామణి ప్రస్తుతప్రభువరేణ్యులలో లేరని
నొక్కి వక్కాణింపవచ్చును... రాజాగారు... తమకుఁ బురుషసంతతి
లేమి... బొబ్బిలిసంస్థానాధీశ్వరులగు శ్రీ మహారాజా శ్వేతాచలపతి
వేంకటరంగారావుబహదరుగారి ద్వితీయపుత్త్రులగు రాజా రామకృష్ణ
రంగారావుబహదరుగారి ద్వితీయపుత్త్రులగు రాజా రాజగోపాలరావు
బహదరుగారిని... స్వీకరించి తమ జనకు నామధేయమగు రాజా జగ
న్నాథరావుబహదరుగారని యభినవనామ మొసంగిరి... ఏప్రియల్
**15, 1928** వ సం... మన శ్రీ లక్ష్మరాట్ప్రభాకరుం డస్తమించె...
ఎందాఁక శ్రీ గంగా యమునా సరస్వతీ గోదావరీ కృష్ణా తుంగ
భద్రా కావేరీముఖ పావన జీవనదు లీధాత్రిఁ బ్రవహించుచుండునో
యందనుక మా లక్ష్మరాయ యశశ్చంద్రుఁడు ప్రకాశించుఁగాక.

<u>పతివ్రతాశతకము</u> — ఇది పూర్వకవిశిఖామణుల గ్రంథముల
నుండి సంగ్రహింపఁబడిన పద్యములుగల యొక చిన్నగ్రంథము.
చేబ్రోలు సరస్వతీదేవిగారిచే సంగ్రథితము. ఈయమ పైని బేర్కొనఁ
బడిన వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారికి శిష్యురాలని
తెలియవచ్చెడిని. ఏతద్గ్రంథాద్యభాగంబున మీర్జాపురపు స్టేటు

జమీందారులగు రాణి భూదేవమ్మరావుగారు ప్రధానరాజపోషకులుగాఁ గనఁబడుచున్నారు. అందువలన నేతద్గ్రంథకర్త్రి యారాణిగారి యాస్థానమున విదుషిగా నుండియుండవచ్చునని తోఁచెడిని. ఈగ్రంథమునందలి పద్యము లన్నియుఁ బ్రాచీనగ్రంథములలోనివే యగుటవలన నీమె విద్వత్తగాని కవితగాని యిట్టిదని నిర్ణయించుట కాధార మేదియు దొరకకున్నను బాతివ్రత్యబోధకములగు పద్యముల నేరి శతకముగూర్చుటచే యీయావిడ స్వాతంత్ర్యాభిలాషిణులగు నవనాగరికస్త్రీలవలెఁగాక పూర్వాచారపరాయణయుఁ బతివ్రతయు నని చెప్పక చెప్పుచున్నది. ఈదృగ్గ్రంథప్రచురణమునకుఁ దోడుపడిన రాణి భూదేవమ్మరావుగారి సనాతనధర్మతత్పరతయు భాషాపోషణమును విద్వదాదరమును వెల్లడియగుచున్నవి. ఇట్టివారిపట్ల నీశ్వరుఁ డెంతయుం గృపాళుఁడై యుండుఁగాక. ఈగ్రంథము వెల 0-4-0. లు. వలయువారు గ్రంథకర్త్రిభర్తయగు చేబ్రోలు రాజగోపాలరావుగారిపేర వ్రాసికొనవలయును.

6/443 కొత్తపేట, నూజవీడు, కృష్ణాజిల్లా

పతివ్రతాధర్మబోధకములగు నిందలి పద్యము లొకకొన్ని దిగువఁ దిలకింతురుగాక.

చం॥ మగువయొనర్చు వశ్యవిధి మందులు మాకులు నొందుచందమై
మగనికిఁ దెచ్చు రోగములు. మానక మూకజడాదిభావముల్
మొగి నొనరించు. నద్దురితముల్ తనచేసిన చేతలై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్.

(నన్నయభారతము, అరణ్యపర్వము)

సీ॥ తలఁపులో నాత్మేశు దైవంబుమాఱుగాఁ
దరశాక్షి యనురక్తిఁ దలఁపవలయు.
విభుఁడు సెప్పినమాట వేదమంత్రంబుగా
నెలఁత నెమ్మనమున నిలుపవలయు.
జనపతి నియమించినది నిజవ్రతముగా
జలరుహాయతనేత్ర సలుపవలయు.
చెలువుఁ డాదరణ నిచ్చిన పదార్థము పది
వేలుగా నాత్మ భావింపవలయు.

గీ॥ వలయుఁ బ్రియమునఁ బెనిమిటివంకవారిఁ
బ్రాణబంధులుగాఁ జూడ భామినులకు.
వలన దధిపతి పగవారివలన మైత్రి
సేయ నెన్నంగఁ జూడ రాదవముఖికి.

గీ॥ కనకశైలంబు తలయంపిగా శయించి
చిలిపిరా లేఁబోయిన చెలువుగాఁడె
ఇహాపరములిచ్చు పతిభక్తి నెడలి యతివ
మొందువిధమున మోక్షంబు నొందఁజనుట.

(ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రము చతుర్థాశ్వాసము)



యందు మిగుల ననురాగయుక్తుఁడవై యుందువు. ఏలయన నామె నిన్నుఁబోలిన చంద్రశేఖరులను గరళగ్రీవులను ఫాలనేత్రులను గను చున్నది. గౌరియు గంగయు నన్ననో నీకు విరుద్ధస్వరూపులైన గజ వదనుని షడాననునిఁ గనినారలు.(కాశియం దెల్లరును శంకరస్వరూపు లని భావము.)

శ్లో॥ గమిష్యామః కాశీనగర మగరాజస్య తనయా
కరాందోళద్దర్వీతలసులభభిక్షామృతరసం
యదంతర్వాస్తవ్యైస్సతత మపనిద్రైస్సుకృతిభి
ర్నిశాసు శ్రూయంతే హరవృషభఘంటాఘణఘణాః.

ఉ॥ ఆఁకొనియున్నవారల కహర్నిశ మెందు నగాత్మజాత ద
ర్వీకమనీయహస్తమునఁ బ్రేమ సుధారసభిక్ష వెట్టునో
ప్రాకృతపుణ్యపాకమున రాత్రిఁబవ ల్వెట శంభువాహఘం
టాకలనాదముల్ చెవిఁబడంగల వేగేద మట్టి కాశికిన్॥ 12

ఏ పట్టణమునం దాఁకొనియున్నవారలకు నగాత్మజాత దర్విచే మనోహరమైన హస్తముతో సుధారసభిక్షను బెట్టుచున్నదో యేపుర వరంబున సుకృతవశంబున ననారతము శంభువాహనమైన నందీశ్వరుని ఘంటానాదము శ్రవణపేయముగ వినవగుచున్నదో యట్టి కాశీపుర మున కేగెదము.

శ్లో॥ ఆకంఠం సలిలే నిమజ్జ్య పులినాభోగోపధానే శిరః
కృత్వా శైలసుతాపతే! పురరిపో! గంగాధరేత్యాలపన్
గృహ్ణన్ కర్ణపుటే శివేన కృపయా ప్రత్యాహృతం తారకం
తీరే జాహ్నవి! జహ్నునందని! కదా మోక్షే శరీరం ముదా.

మ॥ గళదఘ్నంబు మునింగి నీజలమునన్ గంగా! శిరంబున్ భవ
త్పులినంపుం దలయంపిఁ జేర్చికొని శంభూ! పార్వతీశా! యటం
చు లలిన్ గర్ణపుటిన్ శివుండు కృపమై సూచించు నా తారకో
జ్జ్వలమంత్రంబు గ్రహించి తృప్తి నెపుడేఁ జాలింతునో దేహమున్॥

గంగా ! నీజలములం దాకంఠము మునింగి శిరంబును నీ సంబంధములగు నిసుకతిన్నె లనుతలగడయందుఁ జేర్చికొని శంభూ ! పార్వతీ రమణా ! పురహరా ! గంగాధరా ! యని వాకొనుచుఁ గృపతోడ శివుండు గర్ణపుటమునందు సూచించు మహనీయమగు తారకమంత్రమును గ్రహించి సంతృప్తుఁడనై యెన్నఁ డీదేహమును ద్యజియించెదనో కదా ?

శ్లో॥ కాశ్యాం నవీనరుద్రాణాం భూషార్థై భోగిమండలే
అశేషే నిర్గతే శేష శ్శేషోభూ న్న ఫణీశ్వరః.

గీ॥ కాశి నూతనశివపరిష్కారములకు
భోగిమండల మంతయుం బోవ నందు
నాది శేషుఁడు శేషుఁడే యయ్యెఁగాని
కాకపోయెను దా ఫణిలోకవిభుఁడు॥ ౨౯

కాశికానగరమందలి క్రొత్తరుద్రుల యలంకారార్థమై పాతాళమునందలి సర్పసమూహ మంతయుం గదలిపోవ నాది శేషుఁడు శేషుఁడే (మిగిలినవాఁడే) యయ్యెఁగాని ఫణీశ్వరుఁడుమాత్రము గాకపోయెను. సర్పము లుండినఁగదా శేషుఁడు ఫణీశ్వరుఁడగుట? సర్పములన్నియుం బోయినపిమ్మట శేషుఁడు శేషుఁడు మాత్రముగాక యేనికి రాజగును ? కాఁడనుట.

శ్లో॥ ధ్యేయః కాశీవిశ్వనాథో మహేశో
రుద్రాక్షో వై భూతి రామ్నాయవేద్యా
మంత్రాధీశో భాతి పంచాక్షరీయం
నిస్తుల్యోఽయం శుద్ధకైవల్యమార్గః.

గీ॥ ధ్యేయుఁడు మహేశుఁ. డాగమోద్దీరితములు
భూతిరుద్రాక్షములు ధార్యములును. జాప్య
మిద్ధపంచాక్షరీమంత్ర. మిదియె సుమ్ము
పరమకైవల్యమార్గమ్ము. నిరుపమమ్ము॥ ౩౦

మహేశ్వరుఁడే ధ్యానింపఁదగినవాఁడు. వేదచోదితములైన విభూతిరుద్రాక్షలే ధరింపఁదగినవి. మహామహిమోపేతమగు పంచాక్షరీమంత్రరాజమే జపింపఁ దగినది. నిరుపమానమును బరమకైవల్యప్రాప్తికి మార్గమును నిదియే !

శ్లో॥ క్షేత్రాణి సంతి కతి నాబ్జభవాండమధ్యే
నశ్యంతి తాని కథితాని యుగేయుగేచ
ఏకా కళాధరకళాధరరాజధానీ
కల్పాంతకేషు న వినశ్యతి వారణాసీ.

గీ॥ యుగయుగంబున నాశమునొందునట్టి
క్షేత్రములు గల వెన్నియో క్షితితలమునఁ
గాని శశిశేఖరుని రాజధాని కాశి
కార్తి లేదు కల్పాంతమునందునేని॥ ౩౦

శ్లో॥ మహారాజోపి తే తోయే మజ్జన్భిక్షు ర్దిగంబరః
గంగే! తుంగతరంగాఢ్యే! మాదృశాం కీదృశీ గతిః.

గీ॥ రాజరాజైన నీదు నీరములఁ దోఁగి
భిక్షువు దిగంబరుండునౌఁ బృథివి ననఁగ
నింక మాదృశజనముల కేమిగతియొ
రంగదుత్తుంగమహితతరంగ గంగ ! ౩౧

మహిమోపేతములై మనోజ్ఞములై యుత్తుంగములైన భంగములచే నలరారు నో గంగాభవానీ ! మహారాజునైతము నీజలములందు మునింగి భిక్షువును దిగంబరుండును నగునన నింక మాబోటుల గతి యేమియో యెవ్వరు చెప్పఁగలరు ? (శంకరుఁడగునని భావము.)

శ్లో॥ కదా శయానో మణికర్ణికాయాం
కర్ణే జప త్యక్షర మిందుమౌళౌ
అవాప్య నిద్రాం గతమోహముద్రాం
నాలోకయామీహ పునః ప్రపంచం.

చం॥ అల మణికర్ణికాతటమునందు శయించిన నాశ్రివస్సులో
పల నుడురాజమౌళి ప్రణవం బుపదేశము సేయుచుండ ని
స్తులగతమోహముద్రియగు సుప్తిసుఖం బెపు డొంది వెండియుఁ
గలితమహోగ్రపాపపరికల్పిత మీభువనంబుఁ గాంచనో॥ 33

మణికర్ణికాతీరమున శయనించిన నా శ్రవణపుటమునందు శంకరుఁడు ప్రణవమంత్రము నుపదేశించుచుండఁగాఁ బోయిన మోహముద్రగలిగిన నిద్రాసుఖము ననుభవించుచు మరల నేన్నఁ డీ మహోగ్రకలుషసంభరితమైన ప్రపంచమును గాంచకుండుదునో కదా?

సీ॥ కాశిసారము దీని శంకరకృతమ్ము
నాంధ్రమొనరించినాఁడను. హారితుఁడను
నిరుపమోదాత్తసద్గుణనిధిని. మక్క
పాటి వేంకటాచల తనూభవులలోన
నగ్రజుఁడ. రత్నకవియనునతఁడ నేను॥ 3౪

సీ॥ కాశికావిశ్వనాథుని కరుణచేత
నస్మదీయ మిదంకావ్య మఖిలసుగుణ
బోధకంబయి తా బుధారాధితమయి
ప్రబలుఁగావుత మాచంద్రభాస్కరంబు॥ 3౪

తే॥ శ్రీమ దనమనమూరుపురీవరమున
నెసక మెసఁగెడు కాశివిశ్వేశు పాద
కమలముల నాంధ్రకాశిసారమును దీని
నర్పణము సేయుచున్నాఁడ నధికభక్తి. 3౬



చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

సీ॥ ధనమిచ్చినప్పుడు తటుకున దరిఁజేరు.
ధనమీయకుండినఁ దగవులాడు.
సొమ్ములిచ్చిననాఁడు సొగసులు చూపించు.
సొమ్మీయకుండినఁ జులుకసేయు.
చీరలిచ్చినవేళ సారెకు సుఖపెట్టు.
చీరె లీకుండినఁ జీదఱించు.
మాన్యంబులిచ్చిన మమతను హెచ్చించు.
మఱుమాటఁజెప్పిన మండిపడును.
అడిగినది తెచ్చియిచ్చినయపుడు నీవ
ఇంద్రుఁడవు చంద్రుఁడవటంచు హెచ్చుఁజేసి
కలసిమెలసిప్రవర్తించి యెలమిఁగూర్చు.
ఈయఁ దడవైన నావలకేగి పండు.

ఉ॥ తక్కువఁజేయ కెల్లపుడు ద్రవ్యము నిచ్చుచునుండ్రుగాక. పెం
మక్కువతోడఁ జీఱి యణుమాత్రి మొసంగని త్రిగాండ్రకుఁ
పక్కలువేసి వారికడఁ బండుచు నక్కట! వారకాంత బల్
రొక్క మొసంగువారల నిరోధము సేసెడి సేవగించుచుఁ.

వారి ననసేల? ఏమిచేసినను వారి పంచలఁబడియుండు పురుషాధములు లోకమున నుండఁబట్టియే వారియాటలు సాగుచున్నవి. నేనును నాచందంబునఁ బాపిష్ఠభ్రమమునఁ బడి యసమానరూపరేఖావిలాసభాసురయగు నర్ధాంగిని వంచించితిని. అకటా! కన్నులుండియుఁ గబోదినై నాప్రాణేశ్వరిని గృహలక్ష్మిని బహిఃప్రాణము నొప్పులకుప్ప నిదివఱకుఁ గనులారఁ గాంచనైనను గాంచనైతిని. ఏమీ దీనియందము?

సీ॥ ఆననవిధుబింబ మంశుభృత్యులఁబంపి
శుద్ధపూర్ణిమచంద్రు సుంకమడుగు.
మైధాగిధగ్యంబు మాటిమాటికిఁబోయి
బంగరుకొండతోఁ బందెమాడు.

ఈక్షణంబులజంట యెపుడుఁ గురంగాళి
చెంతకుఁబిలిపించి శిక్షఁజేయు.
అలకలనీలిమ హరినీలమణులను
గండుతుమ్మెదలను బెండుపఱచు.
అహహ! ఏమందు దీని శృంగారభంగి?
అందమున కిక్కయగునట్టు లజుఁడు దీని
ఉర్విపైఁ దాను సృజియించియుండఁబోలు.
కానిచో నేల యీసోయగంబు కుదురు?

ఉ॥ ఆ నగుమోముచక్కదన మా నయనాబ్జవికాస మార! ఆ
మేనివిలాసవైఖరియు మించిన సిబ్బెపు గబ్బిగుబ్బ లా
కానుహారంగు లానడలఁగల్గిన తిన్నదనంబు ధాత్రి నే
చానకుఁగూడఁ గల్గదు. ప్రజాపతి దీని నెటుల్ సృజించెనో.

ఈకాంతయేకాదు. లోకంబున వెలయాండ్రమరగి వెతలు పడువారి భార్యలందఱుఁ జక్కనివారలే. దుర్భ్రమము వారి నాడించు చుండుటఁ గనుగొనలేకుండిరి. వెలకాంతలు నిజముగాఁ గులకాంతల కాలిగోరులకైనను గొఱగారు. ఇప్పటికైనను నాపూర్వపుణ్యంబునంజేసి యామాయలాడిని విడిచి నామదిరాక్షిఁగూడుభాగ్య మబ్బినది. విశేషమే. ఇఁక జీవితేశ్వరి సరసఁజేరి నాయజ్ఞానమును క్షమింపవేడుకొని మన్ననలొందెదఁగాక.

మాంచాల॥ (ప్రవేశించి) ప్రాణేశ్వరా! మేల్కాంచితివే? ఇవే నావందనము లందుకొనుము.

బాలుఁడు॥ ప్రేయసీ! నేను నిద్రించుటలేదు. నీయందచందంబులుగని కన్నులు మూఁతపడినవి. రమ్ము. నీకై యువ్విళ్ళూరుచు క్షణ మొకయుగంబుగాఁగడపు నాయం దనుగ్రహించి నీ సరసవచన రచనలచే మనస్తాప మడంపుము.

మాంచాల॥ నాథా !

మ॥ ఇదియేమిా? యెటో పల్కుచుంటి. తగునే యీపిచ్చిమోహంబు? నీ
వెద నన్నెవ్వతెగాఁ దలంచితివో యెంతే నిద్రలోనుండి? నె
మ్మదిగాఁ గన్నులువిప్పిచూడుమియిటుల్. మాంచాల నాపేరు. నీ
హృదయంబుం గయికొన్న సుబ్బమనుగా. నీమాటలింకేటికిఁ?

కొత్తతావగుట నిదురపట్టక కలవరించుచుంటిరా యేమి? కన్నులుతుడిచికొని నిదానించిచూడుఁడు. ఒక్కనాఁటికే యీ మోహనాంగివియోగ మెంతదుస్సహమైనది? అవును. అనుకూలదంపతుల కట్లే యుండును. పాపము మిాకొఱకు కాంతయు మిావలె నెంతపరితపించుచున్నదో?

బాలు॥ బాలా! కడచినదాని నెత్తిపొడిచి యేల రట్టుపెట్టెదవు? నే నిదివఱకుఁ గావించిన దంతయు జ్ఞానవిహీనమైనపనియే. నీ యసమానవయోవిభ్రమాదుల నెంచక వెలయాలివలలోఁ జిక్కి వ్యర్థుఁడనైతిని. కడచినదానికై వగచుట గతజలసేతుబంధనము.

చం॥ మునుపటిజో కుకర్మమున బుద్ధి యమార్గముఁబట్టిపోవ నా
ధనసతిమాయలందగిలి దగ్ధమొనర్చితి నాదుప్రాయు. మే
మనఁగల? నేఁటికిం దెలియనాయెను. చింతిలుచుంటి దానికే
మనమున. నీవు దానిపయి మాటికిమాటికి దెప్పనేటికిఁ?

మాం॥ అయ్యయో! ఎంతమాట. నేను దెప్పుటయా?

చం॥ పురుషుల కేరిపై మనసు పోవునో వారిదె లోకమంచు సం
బరపడుకొంచు లోనఁ బెరభావములేక సదానురక్తి నా
తరుణులతో మెలంగుట విధాయక మెందు. ధరిత్రి సాజమై
పరఁగెడి. దాని కింత వలవంతనుబొందఁ బనేమి నీకిఁక?

నేఁడు మిానోసటనే పొద్దుపొడువలేదు. అందు నాటవెలఁదులమరగినవారిసంగతి యడుగవలసిన పనియే లేదు.

తే॥ ఆలకింపవె మును కౌశికాదిమునులు
పడపుఁగాంతల వలలోనఁ బట్టువడుట ?
వారికంటెను మిముబోటివారు ఘనులె ?
లోకసహజంపుఁబని కేల నీకుఁ జింత ?

తొలిజన్మమునఁ బురహరుని బూలం బూజించుటంబట్టి మీవంటి రసికశిఖామణులపొందు దానికి లభించినది. నిప్పులపూజ చేసియుంట నా కాభాగ్య మబ్బదు. అయినను వెలసతికిని గులసతికిని భేద మెంతయో కలదు.

బాలు॥ ఏమో; నా కేభేదముఁ గనఁబడదు.

మాం॥ పాపము. కనఁబడదుకా ?

బాలు॥ తరుణీ ! నీవూహించినభేద మేమి ?

మాం॥ నాకుమాత్ర మేమి తెలియును ? నేను బురుషుఁడనై వెలవెలందుల పొందు కావించితినని యడుగుచుంటిరా ? కాని మీబోటి రసికవరుల యభిప్రాయమని గ్రంథములలోఁ జదివియుంటిని. అది యథార్థమే.

బాలు॥ ఏమని ?

మాం॥ వినుఁడు

సీ॥ నవరసాలంకారనాట్యము ల్ప్రొనరించి
ఎల్లరమది హరియింపఁగలరు.
సాహితీసముపేత సరసభాషణముల
కృతి మనంబులు కరఁగింపఁగలరు.
సంగితముం బాడి సభయంతటికిఁగూడ
నెంతయు నానంద మీయఁగలరు.
కౌశీతిబంధము ల్నెక్కుఁ బ్రదర్శించి
సంచాస్త్రి కేళి మెప్పించఁగలరు.

వింతసొగసులు చూపి కోవిదులఁగూడ
మోహవారిధిలోపల ముంచఁగలరు.
ఏ కులాంగన లెఱుఁగని యెన్నొపనులు
చేయఁగలరు ధనాంగన ల్వేయునేల?

చం॥ అనయము నింటికర్జములయందు మునింగి చరించుచుంటచే
పనిపడి విద్దెలం గఱచు భాగ్యమె కల్గదు. కల్గెనేనియుఁ
ఘనమగు పాండితీగరిమఁ గాంచరు. వారమృగాక్షివోలె నిం
పునుగనిపింపఁజాలు ననువుం గులకాంత లెఱుంగ రోవిభూ!

బా॥ ఇదియా? సరిసరి. ఇవి నాబోటి యుక్తాయుక్త పరిజ్ఞానశూన్యులు వ్రాసిన వ్రాఁతలు. వెలయాండ్రవిధములు నికృష్టములు. కపటములు. అసహ్యకరములు. పంది బురదమెచ్చినట్లు విటులు వారిచంద మెఱుంగక భ్రమపడుచుఁ జిందులు ద్రొక్కుచుందురు; కాని వారివద్ద సర్వము సున్నయే.

సీ॥ పాండితిలేకయుం బలుమందికడఁజేరి
పదిమాటలెక్కువ వదరుటయును
సంగీతవిద్యాప్రసక్తి లేకున్నను
జావళీలను బ్రొద్దు జరపుటయును
గడియకొక్కవిధంబుగా మార్చి వేషముల్
పురుషుల వెస మోసపుచ్చుటయును
ధనకాంక్షచే మదిం దాపంబుచెందుచు
బహువిధకపటము ల్పన్నుటయును
గాక మాటలసరళతగాని విద్దె
లందుఁ జతురతగాని పణ్యాంగనలకు
కంచుదివిటీలవెదకినఁ గానరాదు.
విగ్రహపుభూషణమెకాని వేఱులేదు.

కులసతు లెంతసంసారభారనిమగ్నలై కృత్రిమాలంకారములు దెచ్చిపెట్టుకొని ప్రాణనాథుల మెప్పింపఁ బ్రయత్నింపకున్నను సహజసౌందర్యాదులే సర్వశోభాయమానములై స్థిర

సౌఖ్యదాయకములై యుండెడిని. అంతయేల? నీసౌందర్యమునకును సరసచతురమృదుభాషలకును నా వెలయాలి సౌందర్యమునకును వర్తనాదులకును హస్తిమశకాంతరమున్నది.

మాం॥ బలే! నాథా! భోగకాంతల సాంగత్యముఁజేసినందులకు వారి టక్కులు ముఖస్తుతులు బాగుగ నేర్చుకొంటిరి. అవును. ఆఱు నెలలు సహవాసముఁజేసిన వారు వీరగుదురన్నసామ్యమూరక పుట్టినదా? అవురా! ఎన్నినయగారములు నేర్చుకొంటిరి. చాలుఁజాలు.

బాలు॥ ఇంతీ! నాస్వాంత మింకను గనుగొనలేకుంటివికా? గతించిన దానికిఁ బశ్చాత్తప్తుండనైన నన్నుల్లసములాడఁజూచుట పతివ్రతాలక్షణమే?

సీ॥ జీవితేశునకుంజు చింతల నెడఁబాసి
అలరించునదియె యిల్లాలుసూవె.
నాథు విరుద్ధంపు నడనడి మాన్పింప
యత్నించునట్టిదే పత్నిసూవె
సాధుమార్గంబునఁ జక్కగా నడపించి
పతి నేలునట్టిదే భార్యసూవె.
ప్రాణేశు మోక్షసంప్రాప్తికి మూలమై
సంచరించునదియె సాధ్విసూవె.
పనుల దాది యాలోచనపట్ల మంత్రి
పోషణంబునఁ దల్లి రూపునను లక్ష్మి
శయనమున రంభ యోర్పున క్షమయగుచును
మగని కుపకరించునదియె మగువ సూవె.

మాం॥ (తనలో) ఆహా! ఇట్టి నవరసాలంకారసనాథుఁడు నాథుఁడైనను వానితో సుఖించుభాగ్య మబ్బదయ్యె. నాతల్లియుపదేశ మెంత కష్టదాయకమైనది? (ఆలోచించి) అవుఁగాక. ఇన్నిదినంబులు శాంతించినదాన నిఁకఁగొంతకాల ముండఁజాలనా? దైవానుకూలముగా జరుగునుగాక. మనుజు లెందు నస్వతంత్రులు.

బాలు॥ కాంతా! నాయందెన్ని దోషము లున్నను భరించి నన్నేలుట నీకు విధాయకము. అందుఁ దొల్లింటికార్యమునకుఁ బశ్చాత్తప్తుండనైనవాని నాదరింపక నీకుఁ దప్పదు రమ్మా. నీకీగంటి చూపులను నమ్ములచే మాటిమాటికి నను బాధించుచున్న సుమశరుని శరమ్ముల రయమ్ముగ వమ్మొనరించి పిపాసాయత్తుఁడనైన నాకు నీ యధరసుధారసంబిచ్చి యాదరింపుము. (అని బలాత్కారముగా లాగును.)

మాం॥ (మెడలోనిహారము తెగి చిందఱవందఱగా నేల రాలును) (తనలో) ఏసాకుచెప్పి తప్పించుకొందునాయని యోజించుచుండ దైవము మంచిసాయము చేసినాఁడు. దీనిమూలమున మిగిలిన యామముగూడఁ గడపి వీని నాలమున కనిపెదఁగాక. (ప్ర) నాథా! ఇదేటిసరసము? రాక్షసార్హములగు నీచేఁత లెందు నేర్చితిరి? అక్కటా! ప్రియమైన నాముత్యాలహారము నేల్లుచేసితివి? ఆ పాపపు రోపడఁతి నన్నిట్టు లవమానపఱుప బోధించిపంపెనా?

బా॥ చంద్రవదనా! కామోద్రేకముచే యుక్తాయుక్త మెఱుంగనైతిని. చెదరిపోయిన ముత్తియములఁ బోగుచేసి మరల హారముగుచ్చి యిప్పుడే నీకంఠసీమ నలంకరించువాఁడ. అది లేకుండుట నీమోము చెన్నుదఱిఁగినది. (ముత్తెములనేఱి పోగుచేసి) చెలీ! ఈదారముకొనను బట్టుకొనుము. నేను గుచ్చెద.

మాం॥ (తనలో) ఇప్పటికే చాలకాలము గడపితి. ఈహారము గుచ్చుటలో మిగిలినరాత్రియుఁ గడపి తెల్లవాఱినవెనుక వీనిఁ బంపెద. (ప్ర) నాథా! అట్లే కానిండు. (అని దారముఁబట్టుకొని కొన్ని గుచ్చినపిదప గుచ్చినపూసల రహస్యముగా జాఱవిడుచును)

బా॥ ఎంతగుచ్చినను దీని కంతములేకున్న దేమిచెపుమా? నీవేమైనను గారడముచేయుచుంటివా?

మాం॥ అయ్యో! నాకేమి తెలియును?

బా॥ సరే. ఏమైననుగానిమ్ము. దండను బూర్తిగా గ్రుచ్చుట మనకుఁ గావలసినపని. (అని క్రిఁగంటఁజూచుచు) టక్కరీ! నన్నులయింపఁదలఁపడి గ్రుచ్చినపూసల రహస్యముగా రాల్చుచుంటివా?

మాం॥ (తనలో) కనుగొనినాఁడు. తప్పించుకొనవలె. (ప్ర) నాథా! మిమ్ములయింపఁజూచునంతటి వ్యర్థురాలనే? మీవలె నేనును మరుబారికిఁజిక్కి యిదివఱకు మీరు నన్నెల్లిదపఱచినకారణమున వెంటనే మీపాలఁజేరఁ దెగింపనైతిని గాని ప్రకృతము నాశక్తికి మీటి యేది యెట్లగుచున్నదో కనిపెట్టలేకుంటిని. ఏమీ! మీరు గ్రుచ్చినముత్యములు రాలిపోవుచున్నవిగా? దారము గట్టిగాఁ బట్టుకొనలేదుకాఁబోలు! అయ్యో! మిమ్మెంత శ్రమపెట్టితిని. ఈపర్యాయము జాగ్రత్తతోనుండెద.

బా॥ దారమును గట్టిగాఁబట్టుకొనుము. (అని గ్రుచ్చి పరికించిచూచి) కలికీ! కొలికిపూస యేది?

మాం॥ (ఆశ్చర్యవిచారములతో) ఏమీ! కొలికిపూస లేదా? ఏమాయె? ఎట్లుపోయె? ఎందుఁబోయె? ఏమిచేతు? నాహారములోని కొలికిపూసయే? మన యిగుపుర బంధమగు పెండ్లిలోఁగట్టిన కొలికిపూసయే? (వెదకుచు) ఎక్కడను గానరాదే? ఏమైపోయె? హా! తెలిసెఁ దెలిసె. వెలయాలి కీవచ్చునని దాఁచుకొంటివి కాఁబోలు! అందుకనియే హారమును గావలెనని తెలిపితివి. అట్లని యడిగిన నే నీకుందునా? ఇంతమాయ యేల?

బా॥ ఛీ! దానికిచ్చుట కింతకన్నను లేదా? దీనిఁగోరుటకు దానికేమిపని?

మాం॥ దీనిపై భ్రాంతిపుట్టి యడుగఁగూడదా?

బా॥ అడిగినంతమాత్రమునఁ గొనిచని యుక్తాయుక్తమెంచక దానికిచ్చునంతటి మూర్ఖుఁడనా?

## రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ, ఆదిలక్ష్మమ్మ బహాదరు గారు, గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు, హంపి.
౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వాములవారు, పుష్పగిరి.
౩ పాకరాజు పరాంకుశరావుదేశాయి గారు. గూడిపరం.
౪ రామసింగు గారు - నెల్లుట్ల.
౫ ఇవిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖు గారు - ఆత్మకూరు.
౬ తింగాక నరసింహారావు గారు, కరణం, మొజ్జంపాడు.

## పోషకులు.

౧ రాజా వెంకటాద్రిస్వామిరావు, బహాదరు జమీందారు గారు-నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యా గారు, మానుకోండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడు గారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావు గారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖు గారు, కుందవరము
౬ చాపిబుడ్డి రత్నారెడ్డిపటేలు గారు, న్యాలపోగుల
౭ రామరాయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మినర్సాపురము.
౮ టి. లక్ష్మణసింగు గారు, జనగాం
౯ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు గారు. లింగగిరి.
౧౦ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, రాజమండ్రి.
౧౧ శ్యామపంతుల వెంకటేశ్వరరావు గారు, సెషన్సు తహశీల్దారు, హనుమకొండ.
౧౨ లింగాల రంగారెడ్డి దేశముఖు గారు, గణపురం,
౧౩ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు, జమీందారు గారు-దేవిడి.
౧౪ సాకుంట కిషన్ రావు దేశముఖ్ గారు, జగితాల.
౧౫ కురికాల వెంకటేశ్వరరావు గారు దేశముఖు, పరకాల.
౧౬ కొత్వాలి వెంకటేశ్వరరావు గారు, సంగెం.
౧౭ రామారి సుబ్బయ్య, వెంకటరామయ్య శాస్త్రి గార్లు,
శ్రీ జగద్గురు విరూపాక్షసంస్థానామాత్యులు.

## సహాయులు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖు గారు, నల్లపల్లి
౨ భీంరాయల హనుమంతరావు దేశపాండ్యా గారు, రాజుగిరి
౩ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౪ నెల్లుట్ల కేశవరావు దేశముఖు గారు, సాపురం.
౫ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి గారు, చెన్నపట్టణము.
౬ పెద్దిభొట్ల వీరయ్య గారు, ప్లీడరు బెజవాడ
౭ తిప్పరాజు కామేశ్వరరావు గారు, కరణం, దుగ్గిరాల

## —* చందాదారులు *—

౧ చల్లా సూర్యనారాయణరావుగారు, మీరుమునిషి మద్దర్గారు [జంగ్లాతు
౨ వేముగంటి వెంకటరామకిషన్‌రావుగారు, వకీలు, కంభంమెట్టు
3 దేవళ్ళాిజు లక్ష్మీకాంతరావుగారు, ఆత్మకూరు
౪ కురికాల మాధవరావు దేశముఖుగారు, పరకాల
౫ దేవులపల్లి రామకిషన్‌రావుగారు, వంగపాడు
౬ రాజరాజనరేంద్రాంధ్రభాషానిలయము, హనుమకొండ
౭ ఇంగువ శ్రీకృష్ణయ్యగారు, ప్లీడరు, నెల్లూరు
౮ మంచికంటి వెంకటరామయ్యగారు, కంట్రాక్టరు నర్సారావుపేట
౯ గుంటుపల్లి పేరయ్యగారు, కరణం చెన్నుపల్లె
౧౦ మల్లాది సోమసుందరముగారు, సబ్ మేజస్ట్రేటు బాపట్ల
౧౧ మక్కపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, అనమనమూరగ్రహారం
౧౨ ప్రతివాదిభయంకర వెంకటరంగాచార్యులుగారు, చామర్లకోట
౧3 విద్వాన్ వెల్లాల శంకరశాస్త్రిగారు, కర్నూలు
౧౪ బ్రహ్మయ్యగారి బాలసుబ్బయ్యగారు, అలంపురి
౧౫ వెల్లాల శివరామశాస్త్రిగారు, అయ్యవారిపల్లె
౧౬ గడియారము వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి
౧౭ సరావు వాసుదేవరావుగారు, హైదరాబాదు
౧౮ ఖాత్రిక వీరయ్యగారు, మేడిచెలిమ
౧౯ నరసింహారావుగారు, కరణం బొంతపల్లి
౨౦ బిదరు కృష్ణయ్యగారు, తూపరాణి
౨౧ మొలుగు రామయ్యగారు, మసీదుపల్లె
౨౨ వకీలు శంకరరావుగారు, మాచాయపేట
౨3 తడిసిన గోపాలరెడ్డిదేశాయిగారు, దొంతి
౨౪ చీదు నరసింహారెడ్డిగారు, కంట్రాక్టరు తూపరాణి
౨౫ రామరాజు లక్ష్మణరావుగారు, బొమ్మరుసుపేట
౨౬ నరసింహారావుగారు, మక్తేదారు గావులపల్లి
౨౭ జగర్లపూడి అమరనాథశాస్త్రిగారు, సికిందాబ్రాదు

౨౮ సి. విఠ్ఠలరావుగారు, హైదరాబాదు
౨౯ చతుర్వేదుల ధర్మారావుగారు, హైదరాబాదు
౩౦ రాఘవరెడ్డిమొ॥గారు, యాముజాల
౩౧ తాళ్ళవెలిమ లింగన్న మొ॥ గారు, గడిపెద్దాపురము
౩౨ జూపూడి నారాయణరావుగారు, ఆ॥ కరణం గడిపెద్దాపురము
౩౩ తిగుళ్ల కృష్ణారెడ్డి మొ॥గారు, ముసలాపురము
౩౪ వేలేటి రాఘవశాస్త్రిగారు, మిడిలుస్కూలుటీచరు హైదరాబాదు
౩౫ రాయప్రోలు వెంకటరామసోమయాజులుగారు, ప్రొఫెసరు నైజాంకాలేజి, హైద్రాబాదు
౩౬ బుఱ్ఱా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, సికింద్రాబాదు
౩౭ చివుకుల వెంకటాచలశాస్త్రిగారు, సికింద్రాబాదు
౩౮ మల్లావఝ్ఝుల రాజగోపాలుగారు, భువనగిరి
౩౯ మొసలి పాపిరెడ్డి మొకద్దంగారు, కొమ్మెపల్లి
౪౦ కాచరాజు రామచంద్రరావు దేశపాండ్యాగారు, సింగరాజుపల్లె
౪౧ నారాయణరెడ్డి దేశముఖుగారు, చినమడూరు
౪౨ హకీం నరసయ్యగారు, నెల్లుట్ల
౪౩ ఆగంరెడ్డి మొకద్దంగారు, నాగిరెడ్డిపల్లె
౪౪ తాండ్ర రాజారెడ్డిదేశముఖుగారు, వెలికట్టె
౪౫ దేచిపతి సీతారామయ్యగారు, చుంచనకోట
౪౬ సుద్దాల లక్ష్మారావుగారు, కరణం బొందుగుల
౪౭ అనుముల విశ్వనాధశాస్త్రిగారు, మడికొండ
౪౮ విశ్వేశ్వరగ్రంథాలయము, హుజూరాబాదు
౪౯ దంటు లక్ష్మీకాంతరావుగారు, సుద్దపల్లి
౫౦ దండెంరాజు లక్ష్మీనరసింహముగారు, పిడుగురాళ్ల
౫౧ లంకా అంబయ్యశాస్త్రిగారు, అంబాపురం

---

సంపుటము ౨౩ { ప్రజోత్పత్తి నామ సం॥ ఆషాఢమాసము. } సంచిక ౪

## కృతి విమర్శనము.

హరిశ్చంద్రోపాఖ్యానము— ఇది గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా బోదిలివీడు గ్రామనివాసులగు పోకూరి కాశీపతిగారిచే నిరోష్ఠ్యముగను నిర్వచనముగను శుద్ధాంధ్రంబున రచింపఁబడిన ప్రబంధము. శ్రీమద్గద్వాలసంస్థానాధీశ్వరులగు శ్రీమంతు మహారాజా ముష్టిపల్లి సీతారామభూపాలరావు బలవంతు బహద్దరుగారికిఁ గృతి యీఁబడి యింతేఁ గీర్తిశేషుఁడయిన యాభూపాలుని పట్టపుదేవి యగు శ్రీమతి మహారాణి, ఆదిలక్ష్మీదేవమ్మగారివలన నాదరింపఁబడి తద్గద్వాలవాస్తవ్య బ్ర॥ శ్రీ॥ భాస్కరం సుబ్బావధానులుగారి లక్ష్మీముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపఁబడినది. కూచిమంచి తిమ్మకవి మున్నగు కొలఁదిమందిమాత్రము రామాయణము, నీలాసుందరీపరిణయము లోనుగాఁగలవి రచించిరికాని యచ్చతెనుఁగునఁ బ్రబంధము రచించుటయే కష్టము. ఆధునికులగు నయ్యనకోట పార్థసారథి శ్రేష్ఠి, రాయవరపు గవర్రాజు మొదలగువా రచ్చతెలుఁగులో నీ హరిశ్చంద్రచరిత్రను విరచించిరి. అందుఁ గందుకూరి వీరేశలింగము పంతులుగారు నిరోష్ఠ్యముగఁగూడ నొనర్చి తన యప్రతిమప్రతిభను గనఁబఱచిరి. అయ్యది ప్రసిద్ధంబై యున్నయది. ప్రకృతకవియుఁ బ్రాగుక్తులపద్ధతుల నెల్లం బరిగ్రహించి పండితకవులకుఁ బరితృప్తి కలిగించెను. మచ్చునకై యిందలి పద్యములు కొన్ని కనంబఱతును.

కం॥ కడు నెనరున నాకైతకు
చెడుగులు నొడఁగూడనట్లు చేయుటకొఱకై
ఉడుగక తలఁతు నెలుక త
త్తడిరౌతును దొడ్డడొక్కదంటను గోర్కిన్. ప్ర॥ ఆ॥ ౭

మ॥ నడలా చూడఁగ గారు. నెన్నుదురులన్నన్ లేనెలన్ దూఱు నా
జడలా తాఁచులతీరు. కన్నులు తొగల్ జానొందఁగా గేరు. నా

తొడలా లేఁతయనంటిసారు. ననగుత్తుల్లాఁ జను ల్గీరు. నా
నుడులా తేనెలుగాఁ జుక్కలనఁ జెన్నుంగుల్కు లేగోరులా.

ద్వి॥ ఆ॥ ౪౮

సీ॥ గుంజల నిలిచిన కురుఁజు నీ కొక హొన్న
గద్దెయై తనరెనుగా దునీఁడ!
ఎక్కుడుగాఁ గూయు నక్కలు నీకిందు
కైగాణ లైనారుగా దునీఁడ!
చిచ్చుగల్గిన కొఱకచ్చులు నీకిందు
కాగడాలై చెల్లెఁగా దునీఁడ!
డాకినిసుతదండి డగరలు నీకిందు
కటికలై యొసఁగిరిగా దునీఁడ!
కాడు నీకొక యయోధ్యగా దునీఁడ!
కైనిగల దుష్టు రాగుడెగా దునీఁడ!
కడఁగి యేరిని దూఱుదుగా దునీఁడ!
కటకటా! ఎంతయొనఁగూడెఁగా దునీఁడ! తృ॥ ఆ॥ ౧౦౨

ఉ॥ ఏటికి నింగి కేనరిగి? తేగితినో కటిచెంతఁ జేరఁగా
నేటికి? చేరినానె యననీ. యట కయ్యెడ సత్రితండ్రి రా
నేటికి? చేరినాఁడె యననీ. యతఁ డన్నది కల్లయంట నా
కేటికి? కాదు కల్లయననీ. యటులెందుల కాన నూనితిఁ. ౧౫౬

చం॥ కనుగొన నింగికేగి తెఱగంట్ల కురంగట సత్రితండ్రితో
కనలుచునే నయోధ్యదారఁ గల్లరిఁజేసెదఁ జేయకున్న నో
చినదఱ యిచ్చి యీడుసత జేజెజుగాలను నేల నేలఁగా
నొనరిచి గట్లగొంగజత నుంచెదఁజూ యని యానసూనితిఁ. ౧౬౫

ఈ గ్రంథంబున వ్యాకరణదోషంబు లున్నయవి కాని ప్రయోగశరణంబులగుటం గొన్నియును జిన్నచిన్నవియగుటం గొన్నియును నగణ్యంబులు. మీఁది కందముగాఁ గనఁబడినను నర్థములేని పదములిం దనేకములు. గ్రంథము గద్యాలసంస్థానముం దుచితముగా నొసంగఁబడును.

---

## రాజబహదూరు కృష్ణమాచార్యులుగారు బాలికావివాహ నిషేధశాసనమునఁ జేయఁబూనిన సవరణము.

ఇటీవల శాసనసభల కెన్నుకొనఁబడిన ప్రజాప్రతినిధులు ఢిల్లీలోని సామ్రాజ్యశాసనసభలోఁ జేరి తమధర్మము నెరవేర్చుచున్నారు. అట్టివారిలో రాజబహదూరు కృష్ణమాచార్యులుగా రొకరు. తిరుచినాపల్లి తంజావూరు మండలవాస్తవ్యులు వీరిని దమకుఁబ్రతినిధిగా నెన్నుకొనియుండిరి. వీరు బాలికావివాహ మొనర్చు నాచారము గల బ్రాహ్మణా ద్యనేకజాతులవారికిఁ జెల్లకుండున ట్లాదుష్టశాసనము మార్పఁ బ్రయత్నించుచున్నారు. ఆప్రకారము సవరింపఁబోవు చిత్తుచట్ట మనతికాలముననే చర్చకు వచ్చుటకు ప్రభు వంగీకరించియున్నాఁడు. కావున నీయాచార్యులుగారి సవరణ ననుసరించి మార్చవలసినదిగా నిండియా చక్రవర్తి ప్రతినిధికిని సామ్రాజ్యశాసనమందలి దొరతనమువారి ప్రతినిధికిని సామ్రాజ్యశాసనసభాధ్యక్షునకును విన్నపములంపిన మనయత్నము ఫలించును. వర్ణాశ్రమధర్మపరులగు హిందూప్రజాసంఘములు సభలు కావించి యీదుష్టశాసనము మార్పవలసినదను తీర్మానములు పైని పేర్కొనఁబడిన యధికారులకుఁ బంపఁ బ్రార్థితులు. ఆచార్యులుగారి నెదుర్కొను వర్ణాశ్రమధర్మద్వేషులా సభయందున్నవారు. ఏతద్దుష్టశాసనకారకుఁడగు హరవిలాసశారద యీ తడవ గూడ నందుసభ్యుఁడే. ఆచార్యులుగారి నితరసభ్యు లెదిరించినను నెదిరింపకున్నను నీయనమాత్ర మూరకుండఁడు. వర్ణాశ్రమధర్మములకుఁ గట్టుపడి బాలికావివాహములు చేయు బ్రాహ్మణాదులఁ బొలియించు నుద్దేశముతో నీయన యీశాసనము దెచ్చిపెట్టెను. ఇతఁ డార్యసామాజికుఁడు. జాతిమతభేదములు పాటింపఁడు. వానిధ్వంసమున కెప్పుడును మార్గములు వెతకుచుండును. అట్టిమార్గములలో బాలికావివాహనిషేధశాసనము నొక్కటి. దీనిద్వారమున నల్పసంఖ్యగల బ్రాహ్మణులఁ జెఱచుచో హిందూదేశమున జాతిమతభేదము లిఁక నుండనేరవు. ఇప్పటికే యట్టిస్థితికి బ్రాహ్మణజాతివచ్చినది. కనుక నీశాసనము బాలికావివాహములొనర్చు బ్రాహ్మణాద్యనేక కులములకుఁ జెల్లదను తీర్పు సామ్రాజ్యశాసనసభాసభ్యు లొనర్తురేని కోఱలు పెఱికిన పామువలెఁదగి శిష్టస్మృతియందుండెడిని. ఇప్పుడున్నతీరున నుండెనేని బ్రాహ్మణులఁదప్పక బాధించును. కాఁబట్టి యిందువిషయమై వర్ణాశ్రమధర్మనిరతులు గాఢ ప్రయత్న మొనర్తురుగాక.

శారదాగారియింటియంజే నింద్యమని యీశాసనము నతిక్రమించియున్నారు. ఆయన సోదరుని పుత్రుఁడగు నమరచందజీ శారదా యీవైశాఖ శు ౨ లు ౧౨ సం॥

వయస్సుగల తనపుత్రికను లాదూలాలజీయను నజ్మీరునివాసి పుత్రున కిచ్చి పెండ్లి చేసెను. హరవిలాసశారదా యాపెండ్లి జరుగకుండుటకయి యెన్నియో యాటంకములఁ గల్పించెనఁట కాని ధర్మాభిమానియగు నమరచందజీశారదాగారు లక్ష్యపెట్టక తనకుమార్తెకుఁ బెండ్లిచేసెనఁట. ఇట్లు శారదాగారి కుటుంబమునందే ధర్మవిరుద్ధము దేశారిష్టదాయకము నని యీశాసనము నతిక్రమించుచుండఁగా ధర్మాభిమానియగు నితరుఁ డెవ్వఁడు లోఁబడును. కనుక యథాపూర్వముగా సకాలముననే బాలికలకు వివాహములు కావించుచు శాసనము మాఱుటకు సకలప్రయత్నములను సనాతన ధర్మాభిమానులు సల్పుదురుగాక. ఇంట గెలిచి రచ్చ గెలువవలె ననుసామ్యమును శారదాగారు స్మరింతురుగాక !

---

## బాలికావివాహనిషేధశాసనపు సవరణ చిత్తుచట్టము.

వివాహమునకు సంబంధించినది వైదికసంస్కారము. ఈసంస్కారమును హిందువు లందఱును పెక్కేండ్లనుండి వంశపరంపరగా విచ్ఛిన్నములేక యనుష్ఠించు చున్నారు. అది కావించుకొనుట వారికి విధియును బవిత్రతాహేతువును నైయున్నది. బాలికావివాహనిషేధశాసనము హిందువుల సంప్రదాయము ప్రకారము గావింపఁబడు వివాహసంస్కారమునకుఁ జెల్లదు. దీని నుల్లంఘించి వివాహములుచేయు బ్రాహ్మణులు మొదలగువారు శిక్షకుఁ బాత్రులుకారు. బాలికావివాహములే చేసికొను నాచారముగల బ్రాహ్మణులు మున్నగువారి నీదుష్టశాసనము బారినుండి తప్పించుటకే సవరించుట. ఇది కావింపఁబడి యనుష్ఠానమునకు వచ్చిననాఁటంగోలె బ్రాహ్మణాదులకుఁ గలిగిన మనోవ్యథ సవరణవలనఁ గొంతవఱకుఁ దొలఁగును. బాలికావివాహము లనుష్ఠించు నాచారముగల బ్రాహ్మణాదులలోని దాంపత్య మవిచ్ఛిన్నమైనది. ఆవివాహములకు మోక్షములేదు. వైదికసంస్కారము గడసి వివాహితలైన హైందవస్త్రీ పునర్వివాహమున కర్హురా లెంతమాత్రము కాదు. భర్త స్వర్గస్థుఁడైనను దానికిఁ బునర్వివాహయోగ్యత లేదు. స్త్రీకి బుద్ధివచ్చినవెనుకఁ బశ్చిమ ఖండములో జరుగు రజస్వలావివాహములకు న్యాయస్థానములలో ముక్తియుండును. అట్టిది వైదికమతాచారప్రకారము జరుగు బాలికావివాహములకు లేదని భావము.

వివాహము జరిగినవెనుకఁ గొన్నినెలలకో యేండ్లకో వివాహిత రజస్వలయగును. అట్టిరజస్వలకును దాని భర్తకును జరుగు గర్భాధానము మిక్కిలి ముఖ్యమైన వైదికసంస్కారము. ఈసంస్కారము వివాహిత రజస్వలకానిచో జరుగదు. ఏడవ

యేటనో యెనిమిదవ యేటనో వివాహమైన చిన్నది రజస్వలయైన వెనుక గర్భాధానమను వైదికసంస్కారము జరుపుట విధిగా స్మృతికర్తలెల్లరు నేకగ్రీవముగ వక్కాణించియున్నవారు. రజస్వలావివాహము శాస్త్రము నిషేధించుచున్నది. అందువలన బ్రాహ్మణాదు లేడవయేటనో యెనిమిదవయేటనో పెండ్లిండ్లు చేయుచున్నారు. అట్లెనిమిదవయేట వివాహముకాని స్త్రీలు శూద్రస్త్రీలకు సమానలయ్యెదరు. వారి వివాహమాడినవారు వృషలీపతులు. హిందూస్త్రీలు పండ్రెండేండ్లలోపలనే రజస్వలలగుదురు. బాలికా వివాహనిషేధశాసనము పదునాలుగేండ్లలోపలఁ బెండ్లిచేసిన శిక్షింపవలయునని చెప్పుచున్నది. ఆశాసనము ప్రకారము బాలికావివాహముచేయు నాచారముగల బ్రాహ్మణప్రముఖులు తమకూఁతుండ్రకు రజస్వలలైన వెనుకనే వివాహముచేయవలయునని నిర్బంధమేర్పడెను. రజస్వలావివాహవాదులగు సంఘసంస్కర్తల మాటయే యిపుడు చట్టమయ్యెను. శాస్త్రనిషిద్ధమైన రజస్వలావివాహములు చేయకున్న మిమ్ము శిక్షించెదమని దొరతనమువారు వర్ణాశ్రమధర్మరతుల యాచారవ్యవహారములం దనవసరముగఁ బ్రవేశించిరి. విక్టోరియామున్నగు ప్రభుసత్తములు మీమతాచారములందు మేము ప్రవేశింపక హద్దుమీఱి ప్రవేశించిన నియోగులను శిక్షింతుమని చాటిన వాక్యములకుఁ బ్రత్యక్షవిరుద్ధము. ఈచట్టముద్వారమున దొరతనమువారును శాసనసభాసభ్యులును బాలికావివాహములొనర్చు హిందువుల శిక్షార్హులం జేసిరి. ఇంతపర్యంతముండిన మతసంబంధస్వాతంత్ర్యమును వారు కోల్పోయిరి. ఢిల్లీసామ్రాజ్యశాసనసభాసభ్యులు ప్రజలచే నార్థికరాజకీయవ్యాపారవిషయములం దర్హమంత్రములొనర్పఁ గోరుకొనఁబడిరి కాని హిందూమతమునకు సంబంధించిన బాలికావివాహనిషేధాది దుష్టశాసనము లొనర్చుటకుఁ గాదు. అట్టిశాసనములు కావింప వారికి సుంతయు నధికారము లేదు. గర్భాధానవయోనిర్ణయసభాసభ్యులుగూడ సామ్రాజ్యశాసనసభాసభ్యు లిట్టిశాసనము లొనర్పఁదగినవారు కారని నుడివిరి. శాసనసభవారు మతము నాధారముగాఁ గైకొని జను లనుష్ఠించు నాచారమును దాము మార్పక తన్మతస్థులకే వదలిపెట్టిరి. సంఘసంస్కర్త లొకకొందఱును బశ్చిమఖండవాస్తవ్యుల యనుగ్రహముపొంద నపేక్షించి వారిచిత్తవృత్తి కనుగుణముగ వర్తింప నిచ్చగించిన రాజకీయవేత్త లొకకొందఱును నంగీకరింపకున్న బ్రిటీషుప్రభుత్వమువారు పెట్టఁబోవు స్వరాజ్యభిక్ష పెట్టరను భీతి నీశాసనము కోరిరే కాని హిందువులలో నధికసంఖ్యాకులు కోరలేదు.

అట్టిస్థితిలో దొరతనమువారు దానికిఁ దోడ్పడుట చిత్రము. వారీశాసనము చర్చకుఁబెట్టుటకుఁ బూర్వము మతాధిపతులను దమ మహామహోపాధ్యాయులను

నడిగి తెలిసికొనినపుణ్యాన్నఁ బోయినవారు కారు. ఇఁక నెవరినడిగిరి? క్రైస్తవమత బోధకులను బశ్చిమఖండనాగరకతావ్యామోహమునఁ బడి కొట్టుకొను లాయర్ల సంఘములను సంఘసంస్కర్తలను—వారెల్లరును వర్ణాశ్రమధర్మములకు విరోధులగుట వలన నాశాసనము వలయుననియే కోరిరి. వారికోర్కె ననుసరించి ప్రభుత్వమువా రీశాసనము కావించుటకుఁ దోడ్పడుట తొలుత విక్టోరియాప్రభృతులు హిందూమతా చారవ్యవహారములలోఁ బ్రవేశింపమనిచేసిన వాగ్దానమునకు విరుద్ధమని నుడువఁ బని లేదు. హిందూదేశస్థులలో నేజాతిమతాచారవ్యవహారములకును భంగముగలుగుతీరున శాసనసభలు శాసనములు చేయఁగూడదను వాక్యము పదేండ్లక్రిందబ్రిటీషుపార్లమెం టనుగ్రహించిన యిండియాయాక్టులోఁ గలదు. అట్లందుఁగల వాక్యమునకు విరుద్ధ ముగ నీశాసనము సభలోఁ జర్చకుఁబెట్టిన సంఘసంస్కర్తృసభ్యునకు మే మంగీకరిం పమని చెప్పవలసిన దొరతనమువారు మామతాచారములకు విరుద్ధముగ శాసనము చే యుట ధర్మమాయని ప్రాచీనాచారపరాయణుఁ డడిగినపుడు మీరు సభ్యులుగ నేతిపంపిన మీప్రతినిధులే కావలయునని కోరినపుడు మే మేమిచేయఁగలమని ప్రత్యు త్తరము పలికిరి. అట్లు వారుపలికినది సహేతుకమైనమాట కాదు. హిందూదేశమున మూఁగవారని యనఁదగియుండు ముప్పదికోట్లజనులను బాలించుటకుఁ బాటుపడినవా రము మేమని పలికిన సర్ జైనాల్డుకార్డాకను దొరతనమువారి ప్రతినిధి ధర్మముఁ బొలియింపఁ బ్రయత్నించు నీసంఘసంస్కర్తల యుద్యమము ఖండించి మీకుఁ దోడ్పడమని నిర్దాక్షిణ్యచిత్తముతోఁ జెప్పి హిందువుల ధర్మము కాపాడవలసిన వాఁడు కాఁడా? జనుల ధర్మము హిందూదేశపుఁ బ్రధానప్రభుత్వమువారే రక్షింప వలసినవారు. సృష్ట్యాదినుండి నేఁటిదనుకఁ గర్మభూమియను పేరు హిందూదేశమునకే కలదు. కాని వేఱొండురాజ్యభాగమునకు లేదు. ఆపే రీదేశమునకుఁ గలుగుటకుఁ గారణము వేదోక్తపద్ధతిని జేయఁబడు వివాహసంస్కారమే. అట్టి పవిత్రమైన వివా హమునకు బ్రిటీషుప్రభుత్వమున హిందూమతసంప్రదాయము తెలియఁగని నవనాగరికులు బాలికావివాహమని పేరుపెట్టిరి. పెట్టినఁ బెట్టుదురుగాక. దానివలన నష్టిలేదు. ఆవి వాహసంస్కారమును బహుభంగుల దూషించి యనర్థములుగలుగునని రూపుమాపఁ బ్రయత్నించి యిట్లుచేసిరి. పవిత్రమగు నీవివాహసంస్కారమువలననే యారోగ్య వంతులును బలవంతులును బుద్ధిమంతులును నైన మహాపురుషులు జననమొందిరి. అనసూయమున్నగు మహాపతివ్రతలును జనించిరి.

ఇట్టిగొప్పసంతతి యేదేశమునను జనించియుండలేదనుట యతిశయోక్తి కాదు. హిందూదేశంబునంబోలె వైదికవివాహసంస్కారమువలన జననమొందిన మహనీయులు

తమదేశమునఁ బుట్టలేదని వగచు నన్యదేశస్థు లనేకులు గలరు. పశ్చిమఖండమందలి నవీనశాస్త్రజ్ఞులు బాలికావివాహమే శ్రేష్ఠతమమని యిటీవలఁ దమ యనుభవము వలనఁ దీర్పుచేసిరి. గర్భాధానవయోనిర్ణయసంఘసభ్యులు బర్మాలో సంచరించి యా దేశమున రజస్వలావివాహములే యనుష్ఠానములోనున్నను జంటబిడ్డలమరణ మధికముగా నున్నదనియు నతిబాల్యవివాహములు జరుగు నొరిస్సా బీహారులలో బర్మాలో వలెఁగాక యల్పసంఖ్యగల జంటబిడ్డలు మరణించుచున్నారనియు వక్కాణించియున్నారు. ఆసభ్యులే హిందూదేశమునఁ బెక్కుతావులలోఁ దిరిగి బాల్యవివాహములు లేనిజాతులలోఁ జంటబిడ్డల మరణ మధికమని వాక్రుచ్చియున్నారు. ఆగర్భాధానవయోనిర్ణయసంఘము నెదుట సాక్ష్యము చెప్పిన వా రెల్లరును బ్రాహ్మణులలోఁ జంటబిడ్డల మరణములు చాలఁ దక్కువయని చెప్పియున్నారు. ఈ బాలికావివాహనిషేధశాసనము రజస్వలావివాహములుచేయువారిని బాధింపదు కాని బాల్యవివాహములు చేయు బ్రాహ్మణవైశ్యాదులను దప్పక బాధించును. వారి నీశాసనమునుండి తప్పించుటకై పెట్టిన యీచిత్తుచట్టమును శాసనసభాసభ్యులు మార్చి దానివలనఁగలుగు బాధ బ్రాహ్మణాదులకు లేకుండునట్లు తోడ్పడఁ బ్రార్థితులు.

---

## —♦ ధర్మప్రాణ ద్రావిడ లక్ష్మణశాస్త్రిగారి నిర్యాణము ♦—

సీ॥ వారాణసీపురీవాస్తవ్యులైనట్టి యఖిలపండితులలో నగ్రగణ్యుఁ
డనయంబు వేదశాస్త్రాదిప్రచారంబు కావించినట్టువంటి ఘనమనీషి
వేదోదవసితాది విద్యావిధానమ్ము లొనరించి విద్యల నొసఁగుమేటి
భారతవర్షీయ వర్ణాశ్రమస్వరాజ్యము పేరి సంఘంపు స్థాపకుండు
న్యాయవేదాంతముఖదర్శనప్రవచనమందు శంకరుఁడని కొనియాడఁబడిన
ద్రావిడాన్వయవంశాబ్ధితారకాధిరాజు లక్ష్మణశాస్త్రి స్వర్గతుఁ డయారె!

కటకటా! ఎంతఘోరవార్త వినవలసివచ్చినది. శాస్త్రిగారు పరమపదించి ప్రాచీనాచారపరాయణులకుఁ బరితాపము గలిగించిరి. వీరితండ్రి రామచంద్రశాస్త్రిఘనపాఠిగారు. తంజావూరుజిల్లా కుంభకోణనగరమునకు సమీపమందున్న తిరిశనవల్లూరున వసించువారు. తత్పితృపితామహప్రపితామహాదులందఱును జటాపాఠులును హరిభక్తిపరాయణులును. రామచంద్రఘనపాఠిగారయాచనవ్రతశీలురై సర్వదా వేదపారాయణ భగవన్నామసంస్మరణములతోఁ గాలముగడపి తుదకుఁ గళత్రసహితముగాఁ గాశీవాసముం గావించిరి. అయాచనవ్రతపరులగుట నప్పుడప్పు డయిదారేసిదినము లన్న మమరక యమరాపగాంభః పానముతోడనే యాప్యాయనము చెందవలసివచ్చుచుండెను. అయినను నావ్రతమును

వదలలేదు. కాశీవాసులైనతరువాత జటాపాఠియను పేరుమనామమే వారాణసీ పురిని వ్యాపించెను. విద్వాంసుఁడును విరాగియు విశ్వేశ్వరారాధకుఁడును నైకోపవాసములతో జీవయాత్ర చేయు జటాపాఠిగారిని జూచి సంపన్నుఁడగు నొక బంగాళీ బ్రాహ్మణుఁ డన్నపానాదులకుఁ దగు నుపాధి గల్పించుటయుఁ గ్రమముగా నలుగురుకుమారులను గాంచెను. అందు మన లక్ష్మణశాస్త్రిగారు ద్వితీయులు. వీరు తండ్రిదగ్గఱఁ గృష్ణయజుర్వేదమును గురునాథజీభట్టుగారిదగ్గఱ ఋగ్వేదమును సమగ్రముగాఁ బఠించిరి. ఒకపర్యాయము విన్న మంత్రమును సస్వరముగ గ్రహించుచుండువారఁట. కృష్ణశాస్త్రిగారిదగ్గఱ సాహిత్యమును మహామహోపాధ్యాయ సుబ్రహ్మణ్యశాస్త్రిగారిదగ్గఱ సాంఖ్యవేదాంతశాస్త్రములను మ॥ మ॥ కైలాసశిరోమణి భట్టాచార్యులుగారిదగ్గఱ న్యాయశాస్త్రమును నభ్యసించిరి. కలకత్తా కాశీ సంస్కృతకళాశాలలందుఁ గల సకలశాస్త్రములందును బరీక్షయిచ్చిరి. వీరిపాండిత్యమును బోధకతాశక్తియు శిష్యప్రశిష్యులద్వారమున దేశదేశంబుల వ్యాపించుటయు నాశుతోషబాబుగారు స్వయముగాఁ గాశికివచ్చి కలకత్తా యూనివర్సిటియందుఁ బ్రొఫెసరుపదవి నంగీకరింపుఁడని కోరినను గాశీక్షేత్రమును విడుచుట కిష్టపడకపోయిరి. విద్యాపక్షపాతియగు నాశుతోషబాబుగా రంతతో విరమింపక శాస్త్రిగారి సతీర్థ్యులగు మ॥ మ॥ ప్రమథనాథతర్కభూషణ రాజేంద్రనాథ విద్యాభూషణులఁ గాశికిం బంపుటయు వా రచటఁ గొంతకాలముండి యెట్లో సమ్మతింపఁజేసి కలకత్తాకుఁ దోడ్కొనిపోయిరి. 10 సం॥ వఱకుఁ గలకత్తాయం దుండిరి. న్యాయవేదాంతాదిదర్శనముల బోధించుటలో శాస్త్రిగారికిఁగల సామర్థ్య మపారము. కలకత్తాయందున్నకాలమున సుమారు ౮ లక్షలరూపాయలు ప్రోగుచేసి శివకుమారభవనమను పేర నొకదాని నిర్మింపించి సంస్కృతవిద్యార్థుల గృహాభావతం దీర్చివైచిరి. వేదశాస్త్రములకుఁ గలుగు నవనతస్థితికి ఖిన్నులై తదుజ్జీవనార్థము ప్రయత్నించి యుద్యోగ మందులకుఁ బ్రతిబంధకమగుట మాసమునకు ౫౦౦ రూపాయల వేతనముగల ప్రొఫెసరుద్యోగము తృణప్రాయముగ వదలి కాశియందును గలకత్తాయందును సాంగవేదవిద్యాలయము స్థాపించిరి.

ఈవిద్యాలయమున కనుబంధముగ నాయుర్వేదపాఠశాల యౌషధాలయము విద్యార్థుల కుచితభోజనశాల మున్నగునవి చేర్పఁబడెను. ప్రకృత మీపాఠశాలలందు ౨౫౦ విద్యార్థులు వివిధశాస్త్రముల నభ్యసించుచున్నారు. కేవలము వేదము చదువుకొన్నవారికిఁ బ్రోత్సాహజనకముగఁ గొంతద్రవ్యమును గూర్చి శాస్త్రిగారు నిధినొక్కటి స్థాపించిరి. తు చ తప్పకుండ ఘనాంతముం బరీక్షయిచ్చిన వేదపాఠకునకుఁ బ్రతిసంవత్సరము నూఱేసిరూపాయ లిప్పించెదరు. కాశీనగరమున శాస్త్రిగా రొక

సంస్కృత విద్యాపీఠమును స్థాపించుటకును తద్విద్యాపీఠశాఖలు భరతఖండస్థ ప్రధాననగరముల నెలకొల్పుటకును దమయిండ్లనుండియే విద్యాభిలాషులగు విద్యార్థుల కుచితముగ విద్యను బోధించు పండితులకుఁ బారితోషికరూపమున ధనసహాయమొనర్చుటకును ౧౦ లక్షలరూపాయలతో విద్యాసంస్థ నేర్పఱుపఁ బ్రయత్నించిరి. సుమారు 3 వత్సరములనాఁడు కాశీక్షేత్రమం దఖిలభారతవర్షీయ బ్రాహ్మణ మహాసమ్మేళనము జరిపించిన దీమహానుభావుఁడే. తేనెపూసినకత్తులవలెను గోముఖవ్యాఘ్రములవలెను వర్ణాశ్రమాచారములతో మేము జోక్యముకలిగించుకొనమని చెప్పుచు వాని సమూలముగం బెకలించివైచు శారదాబిల్లు నశెంబ్లీయందుఁ బ్రవేశపెట్టిన దేశనాయకుల దుస్సంకల్పమునకును వారికిఁ బ్రోత్సాహమొసఁగిన ప్రభుత్వమువారి కూటనీతికిని దనకుఁగల యసమ్మతిని బ్రకటించుటకై ప్రభుప్రదత్తమగు మహామహోపాధ్యాయబిరుదమును వదలి సనాతనధర్మపరాయణులుగూడ రాజకీయవిషయముల జోక్యముకలిగించుకొననియెడలఁ బాశ్చాత్యమానసపుత్రులగు నిప్పటి రాజకీయులు సనాతనధర్మమునకుఁ బెక్కనర్థములు తెచ్చిపెట్టఁగలరని కాశిలో వర్ణాశ్రమస్వరాజ్యసంఘమును స్థాపించి దేశమునం దంతటం దత్ప్రచారము చేయుచు ప్రమోదవత్సరమున జలగాంనగరమందు వార్షికసమావేశమొనర్చిరి. అట్లు పరదేశములు తిరిగి ధర్మప్రచారముచేయుటలో సకాలమునకుఁదగిన యాహారాదికము లేక దస్సి కలకత్తాచేరి క్రమముగాఁ బ్రవృద్ధానారోగ్యులై యీ ప్రజోత్పత్తి సం॥ జ్యేష్ఠ బ ౯లు కాశీక్షేత్రముం బ్రవేశించి శరీరముం బరిత్యజించిరి. వీరిప్రాయము ౭౨ సం॥ లు. న్యాయాచార్యరాజేశ్వరశాస్త్రిగారొక్కరే వీరికిఁ గుమారులు. పితృతుల్యులు. లక్ష్మణశాస్త్రిగారి శిష్యులలో మహామహోపాధ్యాయులు తర్కవ్యాకరణవేదాంతసాంఖ్యతీర్థులు మున్నగువారు శతాధికు లున్నవారు. దేశోపకార ధురంధరులయిన యిట్టిమహాపండితుని గోలుపోయినందులకు సనాతనధర్మరతు లెంతయు దురదృష్టు లనక తప్పదు. ఊర్ధ్వలోకగతు లయియే శ్రీశాస్త్రిగారు సనాతనధర్మమునకు సహాయమును సల్పుదురుగాక.

---

## —బాలురును బాలికలును గలిసిచదువుటవలనఁ గలిగినదురవస్థ—

(బ్రాహ్మణమహాసమ్మేళన పత్రికనుండి యాంధ్రీకరణము)

చునారునగరసమీపమునఁ గల సోనపూసుగ్రామమం దార్యసమాజమువారు పెట్టిన పాఠశాలయొకటి కలదు. అందు వయసువచ్చిన బాలురును బాలికలును గలసియే చదువుచుందురు. అందువలన మంచికంటెఁ జెడుగే యెక్కువ. అది పనికిరాదని పూర్వాచారపరాయణు లందురు. యుక్తాయుక్తవిచారణలేక పూర్వాచారపరాయణకృతమునకు వ్యతిరేకముగఁ జరించుటయే యార్యసమాజీయులును బ్రహ్మసమాజీయులును ధర్మముగాఁ బెట్టుకొనియున్నారు. పైపాఠశాలయం దొక యవివాహిత

యువతి యుపాధ్యాయునివలననుండి గర్భమును ధరించెను. అతఁ డాగర్భము నేను జేయలేదనియు నొకవిద్యార్థి చేసెననియుఁ జెప్పుచున్నాఁడు. ఉపాధ్యాయునిపార్టీకిని గర్భవతియగు శిష్యురాలి తండ్రిపార్టీకిని గలహ మారబ్ధమై క్రమముగాఁ బెనఁగులాటవఱకుఁ బెరుగుటయుఁ బిల్లవైపువారు జిల్లామేజస్ట్రేటుదగ్గఱ నుపాధ్యాయునిపై నభియోగము దెచ్చిరి. ఈపాపిష్ఠసంఘమునకు భయపడి యందఱు నొక్కపెట్టునఁ దమబాలికల నాపాఠశాలకుఁ బంపుట మానుకొనిరి. స్త్రీసంరక్షణార్థము చిరకాలము నుండి మనవా రవలంబించుపద్ధతు లన్నియు విడనాడి వయసువచ్చిన బాలురను బాలికలను నిట్లు స్వేచ్ఛగా మసలుట కవకాశమిచ్చినఁ గలుగఁగల ఫల మింతకంటె వేఱుగా నుండదు.

## —♦ కాంగ్రెసు వాలంటీర్ల దురంతము ♦—

(త్రిలింగ)

...కాంగ్రెసుకార్యమునఁ బాల్గొని దేశసేవచేయు నొకయువతి యేకాకినిగాఁ జునారుతాలూకాకుఁ బోయి... కార్యమును సాగించి వచ్చుచుండఁగా నదల్పుర మను గ్రామమునఁగల కాంగ్రెసువాలంటీయరులు జట్టుగా వచ్చి యామెను ముట్టడించి నానాబీభత్సము చేసి నడిదారిలో వదలిపోయిరి. ఆమె వివశయై పడియుండ రస్తానుబోవువారును సమీపగ్రామాధికారులును వచ్చి చూచి...బండిమీఁదఁ గాశికిఁ జేర్చిరి. ఆస్త్రీ వాలంటీర్లు...తన్నుఁ గాశికిఁ బిలుచుకొనిపోవుటకుఁగాను గాశినుండి పంపఁబడితిమని నమ్మకముపుట్టించి...చేసిన భంగపాటును...చెప్పుచుండఁగా విను వారి గుండెలు నీరైపోవుచుండెను...స్త్రీపురుష(వివేచన)లేక దేశదేశములకుఁ దిరిగి చేయవలసిన పికెటింగుమున్నగు కృత్యములకు స్త్రీల వినియోగించుట ముత్యముల నమ్మి రేగుపండ్లు కొనుటవంటిది. ౫౦ ఏండ్లుదాఁటిన స్త్రీలు కొందఱుచేసినఁ జేయుదురుగాక. నడివయసులోనున్న స్త్రీల బజారులోఁ బికెటింగునిమిత్తము వదలుటయు దేశదేశములకుఁ బంపుటయుఁ బత్రికాధిపతులకును వారివ్రాతలే సిద్ధాంతములని విశ్వసించువారికిని గౌరవముగా నుండిన నుండవచ్చును గాని...సంఘక్షేమ మెన్నటికిం గాఁజాలదు. ఈదేశసేవకురాండ్ర యుద్దేశమెట్లున్నను బలువురు వేషభాషలందుఁ బాశ్చాత్యపద్ధతుల నామోదించువారున్నారని చెప్పుటకు విచారముగానున్నది. కొందఱు ప్రాణములనుగూడవదలి స్వరాజ్యసంపాదనమునందే మనస్సును లగ్నమొనర్చియున్నామని... ప్రసంగించుటకలదు. కాని యర్థము తెలిసి యామాటలఁ బ్రయోగించుటలేదు. ఆంగ్లమానసపుత్త్రులగు దేశనాయకులమని యనుకొనువారిలోఁ గొందఱు పలికెడి చిలుకపలుకుల కివి యనుకరణములు. కావున విమర్శనీయములు కావు. మిత్రులగు దేశనాయకులు త్వరలో మేల్కాంచి రాటము మున్నగు గృహపరిశ్రమలందు యువతులను, వయసుచెల్లిన స్త్రీలను బురుషులను బికెటింగు మున్నగు కార్యములందును వినియోగించి సంఘస్వాస్థ్యమును దేశస్వాస్థ్యమును గాపాడెదరుగాక.

క. మార్కండేయశర్మ.

## —♦ మా ధ వ స్త వ ము ♦—

(రాయచూరు బండారావుగారు.)

ఉ॥ పాలన సేయరాద ? (పశుపత్యజముఖ్యులఁ బ్రోవలేద ? గో
పాలన నీదికాద ? (నిజభక్తుల) భక్తునితోడ వాద ? పా
పాలకు నేన పాద ? పరిపాలనసూత్రము దాఁప సాద ? పా
పాలను బాపు మాద గురుపాలి త్వదీయముఁజూపి మాధవా ! ౧

ఉ॥ కావఁగరాద ? (నేనుదిగ) కాలము(లందును జేయుచున్న నీ)
సేవ(కుఁ దృప్తికా) ద? (మునుచేసిన మామకమైనయట్టి)దో
షావళిఁ బాపరాద? (ఇఁకనైనను దర్శనమిచ్చి నన్ను సం
భావనచేయ)రాద? దయఁ బావనుఁ జేయఁగరాద మాధవా ! ౨

ఉ॥ వాసమువీడి యల్ల గురువాసమునన్ నివసించునాఁటి సా
వాసి భవన్నివాస మొకవాసరమం దరుదేర భక్తివి
శ్వాసమెలర్పఁగాఁ దగ నివాసితుఁజేసి యనూనసంపదన్
వాసవుమీఁఱఁజేయుకృప వావిరి నాపయిఁ జూపు మాధవా ! 3

ఉ॥ సారవిహీన(మైనను స) సారమటంచని యెంచి ఘోరసం
సా(రమహోదధిం బడి) విచార(కబంధనిమగ్న) మానసాం
భోరుహుఁడైన నన్నుఁ బరిపూర్ణకృపామయనావపై మహో
దారతఁ జేర్పరా దరి విదారితశాత్రవసైన్య! మాధవా! ౪

ఉ॥ నేరము లెన్నిచేసినను నేరుపునన్ నినుఁ (గొల్చువారి యా)
నేరము లెన్న(కెంతయును నిర్మలమైనమనస్సుతో దరిన్
జేరిచిప్రోచువాఁడవని నీపదకంజములందు దీనతన్
సారెకుసారెకుంబడి ప్రణామముసేయుచునుంటి)మాధవా! ౫

ఉ॥ ఎందఱొ తావకాంఘ్రియుగ మెంతయుఁ గొల్చిన(వారలై యిలన్)
పొందఁగరానికోరికలఁ బొం(దుచునుండినవారు చూడ-నే)
నందఱిలాగు నిన్గొలువ(నయ్యయొ! ఈ)విముఖత్వ మేఁల? వీఁ
డిందుకుఁ గాఁడు పాత్రుఁడని (యెంచెదవే మదిలోన) మాధవా! ౬

ఉ॥ పాలసురాలు (పూతన స్వబంధువురాలివలెన్ విషంబుతో
మేళనఁజేసి తాఁగుడుపు మృత్యుదమౌ చనుబాలు గ్రోలియున్

తూలక భక్తుఁబోలె దయతోఁగని దానిని ముక్తిదుండవై
యేలితి. పాలసుండనని యేల యపేలవునన్ను)మాధవా! ౭

ఉ॥ పాతకమచ్యుతా! యనుచుఁ బాడిన నంచని ప(ల్కలేదు. సు
శ్రీ)కలితంబు నీయురమి సీయనఁ) గాలను దన్న(లేదు. దు
ర్నీతిని నూఱుతిట్టులకు ని స్తుతిచేయఁగ లేదు. కాన) సం
ప్రీ(తుఁడవౌచు నిం) కెటులు ప్రేమడిఁగాంచెదు నన్ను మాధవా! ౮

ఉ॥ నిక్కము(గం బవిత్రమగు నీయభిధానము సంస్మరించుచో
నక్కటికంబున న్మిగుల నగ్గలమౌ విభవంబొసంగు పే
రెక్కవ? ముక్తిదాయకుఁడవే యగుడంచని సంయమీశ్వరుల్
మిక్కిలియందు(.నాయెడల మిథ్యయెనర్చితివద్ది)మాధవా! ౯

ఉ॥ సాధు(తరంపుఁ ద్వన్మహిమ) సాగరనిమ్న మెఱుంగలే కిలన్
సాధుజనమ్ము యోగమనుసాధననీఁ (ది సమస్త లోకులన్
సాధులఁ జేయఁ బూని (యు నశక్తులుగా బుపభుండవై తగన్)
సాధులఁ జే(సినాఁడ. వెదిసాధ్యముకాదిఁక నీకు)మాధవా! ౧౦

ఉ॥ పట్టణముం(ద్యజించి వెసఁ) బాఱుటయున్ యవనుండు గాంచి నిన్
బట్టకవీడువాఁడనె వనమ్ములఁ జొచ్చిన సాగరంబులన్
గుట్టుగడాఁగఁ జూచినను (గూ)రయటంచును వెంటనంటు నా
చెట్టకుఁ జూపురూపమును శీఘ్రము చూపుము నాకు)మాధవా! ౧౧

ఉ॥ గట్టిగ నిన్నుఁ బట్టటకుఁ గా)ర్యము మైయవనుండు (వచ్చుడున్
క)ట్టెదుటన్ నిలంబడి (ఘనంబుగ శార్ఙ్గము వే కరంబునన్)
బట్టి శరాళి గుప్పకయ పాఱుట భక్తుని గావనౌతలం.
పట్టెఁడవంచుఁ గాదె నినుఁ బ్రార్థనసేయుచునుంటి మాధవా! ౧౨

ఉ॥ అట్టులఁకాదయేని ఘనుఁడా జరసూనునికన్నఁ (జూడఁగన్?
గట్టెఁడ వ్యోమకాసురునికంటెను?) ముష్టికుఁబోలువాఁడ? (యా
డిట్టకుఁ గేశికిన్ సముఁడ? ధీరతఁ గంసునికన్న నెక్కుడా?
ఎట్టెఁకవీడితయ్య యవనేశ్వరు నయ్యెడనీవు)మాధవా! ౧౩

ఉ॥ వీనులనీదు పేరు విన వేసరి దుష్టుఁడొకండు గంటలన్
పూని తదేకసంస్మరణ నోలిఁ జరించెడివేళ నైన ముక్

వానిముదంబునం గనినవాఁడ నహంకృతిచిక్కి భక్తి నా
చే నిటఁ గొల్వఁ(గాఁబడఁగఁ జేసిరఁ జేయవె కోర్కి) మాధవా! ౧౪

ఉ॥ రమ్మని పిలిచిన(న్ను మదిరక్షణఁ జేయవ)దేల? యెల్లకా
ర్యమ్ముల నాకుఁ(దొల్లిటిది యయ్యెడి) భక్తజనాళిఁ బ్రోచుటం
చిమ్ముగఁ బల్కుచుందు (కద! యీవిఁక) నేఁ డిటుఁ నట్టివా క్కస
త్యమ్ముగఁ(జేయఁ బూనితివి)అట్టికృతఘ్నుఁడనో కో మాధవా! ౧౫

ఉ॥ గోగణముల్ మరల్పుతఱి గోపకిశో(రులు వేడ్క)డోలిపై
నూఁగఁగఁ జేయుచున్ నిను మహోరగరూపపు దైత్యుకోటిలో
పోఁగను మమ్మునందఱిని బూర్ణకృపామృతదృష్టిఁ గాచితో
భోగిశయాన! కృష్ణ! యనిపొం(గుట నెప్డుఁ)దలంతు మాధవా! ౧౬

ఉ॥ రాక్షసవంశకాననవిరాజితపావక! లోకపాలకా
ధ్యక్ష! స్వభక్తమానసవిహార! విచక్షణ! దుష్టశిక్ష! రూ
క్షేక్షణ శాత్రవప్రబలశేవధిసైన్యవిదారణక్షమా!
దక్షవిపక్షపూజిత! సుదక్షిణరక్షక! ప్రోవుమాధవా! ౧౭

ఉ॥ కారణవిగ్రహా! విలయకారణ! భూరివిభూతిజాల! స
త్కారణ! కార్యకారణవికారపరిష్కృతవస్తుదూర! దృ
క్కారణ! విశ్వకారణ! వికాసితకంసనివాసభేదకా!
వారణ(గామి! వైరి) రణవారణ! సత్కృపఁ బ్రోవు మాధవా! ౧౮

చం॥ సమరతలంబునన్ విజయు సారథివై విజయుండు భీష్మతో
సమముగ నాజిఁ బోరుటకుఁ జాలమిఁ జక్రము చేధరించి నిన్
సమయఁగఁ జేతు భీష్మ! యని సన్నిధికేగఁగఁ జూచుటెల్ల నా
సమయమె ముక్తుఁ జే(యుటకు సమ్మతమౌటను గాదె) మాధవా! ౧౯

చం॥ కురుపతిసేనలం గలయఁ గ్రుమ్మతి (బంధుసుహృద్ధితాళులన్
దురమున బిల్కుమార్చుటకు దుః(ఖముపొందు కిరీటికిన్ మహా
త్తరమగు తత్త్వముప్పుడిని తద్దకృపామతిఁ జూపినట్టినీ)
నిరుపమ(మైనరూపమును) నేఁడిటుఁ జూపు(ము నాకు)మాధవా! ౨౦

ఉ॥ ధాత సగోపగోగణము దాఁచు(ట మానసమందెఱింగి సం
ప్రీతిని వానిరూపములు) భేదమొకింతయు లేక (యుండున

ప్రాతఁజేఁదాల్చి యాతని యహంకరణంబు నణంచియుంటి. వా
చాతురి యేమనంగలను సారసపత్రసునేత్ర!) మాధవా! ౨౧

చం॥ కలియుగవేళ (నిం దలఁపఁ) గల్గిన నొక్కని మేషమేని నీ
వలనిసుఖంబులబ్బునని పల్కు శ్రుతిస్మృతిసూక్తులెన్నియేఁ
పలుమరు సంస్మరించి నినుఁ బ్రస్తుతి సేయఁగడంగినాఁడనే.
నలఘుకృపామృతంబు (కరమారసి) నాపయిఁ జిల్కు మాధవా! ౨౨

ఉ॥ చేసితినీదుసంస్తవముఁ. జేకొను మిర్వదిరెండువృత్తముల్.
దోసిలియొగ్గెదం గరుణ దోసములున్న గణింపకిబ్బుఁడిన్
భాసిలఁజేయు(మెంతయును) భాస్కరచంద్రములుండుదాఁక నీ
దాసుని యాశ్రితంబు సముదారతఁ బైకొనుచుండ మాధవా! ౨౩

---

## స్వవిషయము

తే॥ అక్కటా! ఎంతదుష్కాల మరుగుదెంచె. ఏమిచేయుటకుంగూడ నెదనుదోఁచ.
దెట్లుకడతేర్చెదో పరమేశ నీవు. నినువినా యేరిఁ బ్రార్థింపనేర నేను. ౧

కం॥ సుకముగనో కష్టముగనో ప్రకటింపఁగఁజేయుచుంటి పత్రిక నాచే.
ఇఁకఁ గొన్నిసమలుగూడను వికలముగాకుండఁ బ్రోవవే పరమేశా! ౨

కం॥ అభినవసరస్వతిపయిం బ్రభువులు ప్రాచీనధర్మపరులు ధరిత్రీ
బుభువులు మొదలగు పెక్కం డ్రభిమానముఁ జూపి రిన్నియబ్దంబులునన్. ౩

కం॥ కొందఱుపేక్షవహించినఁ గొందఱు నూతనులు మరలఁ గూడుచునుంటన్
తొందరలులేక పత్రిక యుందనుకన్ నడచుచుండె నీశ్వరుకరుణన్. ౪

కం॥ పైకముదొరకమిఁ జందా యీకుండని పత్రికను గ్రహించుచునున్నార్
ప్రాకటముసుజులె పెక్కం డ్రికరణిని నడపఁగలనో యిఁక నేను గటా! ౫

కం॥ వీ. పీ. కి మూఁడుదినములె యా పోస్టులువా రొసంగి రవకాశము దా.
మీపాటిగడువులోఁ గొననోపక గ్రాహకులుపేక్షనూనఁగ వలసెన్. ౬

ఆ॥ కాల్గఁబడినపాము కటువకమూన దో పత్రికన్ గ్రహించు ప్రాజ్ఞులార!
కష్టపెట్టకే సకాలానఁ జందాలు కృప నొసంగఁజూడుఁడీ నుతింతు. ౭

---

మాం॥ మూర్ఖత గాదు. కాముకత.

బాలు॥ చెలీ! ఏల రద్దిచేసెదవు? నాయొడిలోఁ బడెనేమో చూపనిమ్ము, తొందరపడకుము. (అని దట్టీని విదిలింపఁ బూస కనుపించును) ఇదిగో పూస. సుంతలో నన్నెంత రవ్వయొనర్చితివి.

మాం॥ నాథా! దానియందలి మక్కువచే నంతటి యవ్యక్తురాలనైతిని. క్షమింపుఁడు. (అని పాదములమీఁదఁ బడును).

బాలు॥ లెమ్ము (పరికించిచూచి) అదుగో తెల్లవాఱు వచ్చుచున్నది. చూడుము.

సీ॥ పొలయుల్క లెడలి యిమ్ములఁ బిన్నవయసు దం
పతులు రతిలోలుగతులఁ జిక్క
సంకేతములనుండి జారిణీజారు లొం
డొరులు వాయుటకునై యుబ్బు దక్క
సందుగొందులలోనఁ జక్కగం బరువెత్తఁ
జాలక తస్కరు ల్చాల సురిక్క
ప్రస్థానసముచిత పాథేయములుగొని
చను పాంథులకు మహోత్సాహ మెక్క
అంబరస్థలిఁ గనుపట్టె నపుడె సమయ
ఫణిఫణాభోగ భాగ భాస్వ్రణిసమగ్ర
జాగ్రదకలంకరత్నరాజం బనంగ
వింతయొరపులకిక్క యవ్వేగుచుక్క.

మఱియు,

చం॥ కులసతి నింతకాలమును గోడునముంచినవాఁడనంచు ని
ట్టలు పరితప్తచిత్తతఁ గడుంగడుఁ గూరిమితోడ వెండియుఁ గ
కలయఁగవచ్చినాఁ డనెడు కౌతుకముం బ్రకటించెనోయనఁ గ
కలకలముంబొనర్చె విహగంబులు నిద్దురలేచి మెల్లగ౯.

సఖి! ఇప్పటికే కాలము దాటిపోయినది. దీపములు క్రమముగాఁ గాంతివిహీనములగుచున్నవి. కాని మదనాగ్ని తేజముఁ బాయుటలేదు. రమ్ము. నా మనోరథం బీడేర్చి తాప మడంపుము.

మాం॥ నాథా! ఇది సురతకేళికి సమంజసమైనకాలము కాదు. త్వర యేల? ఇఁక దినములు లేవా?

బా॥ అందాఁకఁ దాళఁగలనా? మదనార్తి యణంచుట కిది యద నని యిది గాదనియు నున్నదా?

తెరలో॥ (రణభేరి మ్రోఁగును.)

బాలు॥ తరుణీ! ఆ ఘోరరవ మేమైయుండును? నిష్కారణముగ నాసుఖమునకు విఘ్నకారులగు నా యధమాధముల నిప్పుడే మట్టుపెట్టివచ్చెద. ఆలసింపక నాఖడ్గ మిటు తెమ్ము.

మాం॥ వీరశిఖామణీ! ఎంతవెఱ్ఱినిబడుచుంటిరి? అది నీసహచరులు వేయించిన రణభేరి. అయ్యో! కాముకత నిన్నెన్ని కానికార్య ములకుఁ దింపుచున్నది. సోదరులనే వధించి శూరతగనఁబఱ చుటయే కా వీరపురుషోచితలక్షణము?

బాలు॥ నాసోదరులకు రణభేరివేయించునంతటి యావశ్యక మిప్పుడేమి వచ్చినది?

మాం॥ మఱచితిరా? కారెమపూడికదనమునకుఁ బయనమై వచ్చి నడుమఁ గాముకతం జరించు నీకుఁ బ్రయాణోన్ముఖులగు నీసోదరులు జ్ఞాపకముచేయుచుండిరి.

బాలు॥ చెలీ! నిజమునిజము. అన్నివిధముల నాబుద్ధి లోకవిరుద్ధము గానే పరిణమించుచున్నది. అడిగినఖడ్గము నడిగితి. తెమ్ము తమ్ములఁ గలసికొనిపోయి

ఉ॥ శూలియొ కాలుఁడోయనుచుఁ జూపఱు మిక్కిలి భీతినొంద నే
నాలములోన వైరుల గతాసులఁజేసి జయంబుగాంచి సు
శ్రీలఁ జెలంగు సద్యశము శీఘ్రముగాఁ గొని పల్లెనాడు వీ
రాలయమన్న మేటిబిరుదావళి ధాత్రిని నిల్పఁజూచెదన్.

మాం॥ మంచిది. వీరలక్షణ మిట్లుండవలయు. ఇదిగో ఖడ్గము. కదనమున కేగి నాకుఁగల వెలయాలి సవతిపోరు దప్పించి సుస్థిరకీర్తికాంతను సవతిగా నొనర్చుఁడు.

బాలు॥ దేవీ! సెలవు. తడవొనర్చుటకుఁ దరుణము లేదు.

మాం॥ మంచిది. కాని నాదొక చిన్న మనవి కలదు. అనపోతు బ్రాహ్మణుఁడు. పైని వేగిరకాఁడు. కదనమునం దెటుపోయి యెటు వచ్చునో? బ్రహ్మహత్యాపాతకంబు సంభవించు. కాన వాని నెటులేని యుద్ధవిముఖుం జేసి వెనుకకుఁ బంపవలయును.

బాలు॥ చెలీ! ఇదియు హితోపదేశమే. అటులే కావించెద. సెలవిమ్ము. పోయివచ్చెద.

మాం॥ మంచిది. (అని నిష్క్రమింతురు).

ఇది శ్రీమేళ్ళచెఱువు కుటుంబరాయవిరచిత

పల్నాటి వీరచరిత్రనాటకమున

చతుర్థాంకము.



# పల్నాటివీరచరిత్రనాటకము

## పంచమాంకము.

(అనపోతు బాలచంద్రుఁడు సేవకుఁడు మొదలగువారు ప్రవేశింతురు)

బా॥ తమ్ముఁడా! అనపోతరాజా! నా యంగుళీయకమును మా వదినె దగ్గఱ మఱచి వచ్చితిని. దానికొఱకుఁ బరులఁబంపుట నిందాస్పదము - అయినను మనలో మన కట్టిభేదములు లేకుంట నీవ తగినవాఁడవు. దానిఁగైకొని త్వరగవత్తువే?

అనపో॥ అగ్రజా! ని పని నాయది కాదా! ఆజ్ఞాపించు బాధ్యత గలిగియు నేఁడు లేనిపోని యుపోద్ఘాతమునకు మొదలిడి క్రొత్త మార్గము త్రొక్కుచుంటివి. మేలు మేలు. ఇదుగో! రయంబున నేగి వదినెగారి నడిగి ముద్రిక గైకొని వచ్చెద.

బా॥ మిత్రమా! మనలో మన కార్జ్ఞయా! మంచిది పోయిరమ్ము. నీవు వచ్చుదాఁక మే మీవృక్షముచెంత నిలిచి యుండెదము.

అన॥ (నిష్క్రమించును)

బా॥ అనుజులారా! అనపోతరా జగ్రజన్ముఁడు. మనకుఁ బూజనీయుండు. సంగరంబునఁ గడపటిసంగతు లెట్లుండునో నిర్ణయింపఁజాలము. బాగుగానుండిన నెల్లరకును మంచిదే. దైవయోగమున బాగుదప్పిన బ్రహ్మహత్యాపాతకంబునఁబడి పోవలసి వచ్చును. అది యట్లుండ సంగరకళాపాటవముగల వీరులు బ్రాహ్మణసహాయ మపేక్షించుట ధర్మంబుగాదు. కావున నాతని వదలి మనమే యుద్ధమున కేగుట సమంజసమని యూహించి వాని కొక మిషగల్పించి వెనుకకుఁ బంపితిని. అతఁడు త్వరలో మరలిరాఁగలఁడు. వచ్చినా మనవెంట రాక

మానఁడు. వలదనిన వినువాఁడు కాఁడు. వాని కీయుదంతం తెలుకపఱచుట కిచట నెదియేని యానవాలిడి పోవుదము. తాళపత్రమును లేఖిని నిటు తెండు (తెచ్చియిచ్చుటయు దానిపై వ్రాయుట యభినయించి) అనపోతరాజా! నీవు బ్రాహ్మణుండవు. యుద్ధకౌశల్య ప్రసిద్ధులగు శూరులకు బ్రాహ్మణసహాయ మపేక్షణీయము కాదు. కావున

చం॥ సరసవరేణ్య! నీ మదిని సంశయముంచుచు వేఱుఱీతిగా
నరయక మా యశంబునకు నర్మిలిఁ జింతిలువాఁడవేని సం
గరమున నీకు నియ్యెడలఁ గల్గిన మక్కువ వీడి వెన్కకున్
మరలి మదుక్తభంగి సదనంబున నుంచుము గెల్పుఁ గోరుచున్.

అందఱు॥ (విని) బాగు బాగు.

బాలు॥ అతని కగుపడునట్లు దీని నీవృక్షశాఖకుం గట్టిగ గట్టరండు.

సేవకుఁడు॥ (అట్లుచేసివచ్చును.)

బాలు॥ సరి. దానిఁజూచుకొని యింటికి మరలిపోఁగలఁడు. ఇఁక మనము పోవుదమురండు. (అని యందఱును నడతురు.)

సేవకు॥ బాలచంద్రా! ఇపుడు మనము నడచుచున్న సమప్రదేశము మున్ను దారికడ్డమైన విస్తీర్ణ పర్వతరాజము. మీయయ్య దీని భేదించి దారి నేర్పఱచె. దానికి నాయకురాలు గినిసి దీనికడ్డముగాఁ బంగ చాఁచి నిలిచియుండె.

బాలు॥ ఏమీ!

చ॥ అనదయొకర్తు స్వాంఘ్రియుగి నడ్డముపెట్టు బిలంబుదూఱుటల్
మన కపకీర్తిహేతు. వవమానము దెచ్చెడి. నంతరిక్షమం
దనువునఁబోఁగలట్టివిధ మారయనౌను. విలంబ మిప్పు చే
సిన మనకార్యమూ చెడును. సీయని రోయుదురెల్లవారలున్ ॥

(పరికించిచూచి) సేవకా! ఈకనుమ పైభాగమునుండి పో వీలుకనుపట్టుచున్నది. అటుపోవుదమురమ్ము. (అని పైభాగమునుండి నడచుచు) సేవకా! ఆదెసఁగనుగొనుము. ఉత్తరంబుగ ననతిదూరంబునఁ గొంతసైన్యము విడిసినట్లున్నది.

ఆ సైన్య మెవ్వరిదో? ఆపటకుటీరము లెవ్వరివో సకుఁదెలిసి యున్న నెఱింగింపుము.

సేవకు॥ మహాత్మా! భవదీయచమూపతులు కారణాంతరముచే భూమి నవతరించిన దేవతలుగాని సామాన్యులుగారు. వారి మహిమ లనంతములు. అప్రతీతములు. వినుఁడు. వజ్రములుదాపిన కలశంబులుగల యీ నూతనపటాలయంబున మీతండ్రి బ్రహ్మ నాయుం డుండు. దాని కావలనుండు చామీకరపిశంగచంచ త్పరిధానసదనంబు పేర్నిడుండునోటు. మంజులమణిప్రభాభాసి తంబగునది పెద్దనాయఁడుండు మందిరంబు. మరకతమాణిక్య వినూత్నవస్త్రప్రావృతంబైనది సూర్నిని గుడారము. వానినడుమ విద్రుమహారనీలా ద్యమూల్యమణివితానమహనీయరుచివిస్ఫురి తపట్టాంబరనిలయములు బాలమల్లదేవనృపతులవి. వానికి దక్షి ణమున సుంకరదామానాయని గుడారము. దానికావల విచి త్రకాంతుల నొప్పు భవనంబు కన్నమదాసుఁ డుండునది.

బాలు॥ ఓకీ! మనవారిగుడారంబులఁ గాంచినప్పటినుండియు నాకు సమరోత్సాహ మినుమడియగుచున్నది. కానఁ దండ్రిగారిని దర్శించి యాజ్ఞఁ గైకొని విరోధివర్గంబుల సదమద మొనరించెద. పోదము - త్వరగ రమ్మా, (అని నిష్క్రమింతురు.)

(తెరలో)

చం॥ పయనముసేయఁ గళ్లెమునుబట్టినంతనె వీపునఁ దట్టినంత నా
జయమునుగోరినట్లు వెలుచన్ సకిలించుచుఁ దోఁకవీచుచున్
రయమునఁ బేరెమెత్తు హయరాజము నీవు తలంప. నిప్డు కా
లయినఁ గదల్పవేమి యకటా! కొరడా లెగ నెంతకొట్టినన్.

అనపోతు॥ (ఖిన్నవదనుఁడై ప్రవేశించి తనలో) అక్కటా! నా హయ రాజంబు నాతురతఁగొలఁదిఁ గటికవానికుగిడిఁ గొట్టితిని. కాని యది కదలదు. మిత్రు లుందుమన్నచోట నుండరైరి. వెనుక వచ్చునను మూహఁ జనియుండఁబోలు. నేనును వారిననుసరించి

కదనరంగంబున కేగెద. (అని పోవుచు వృక్షశాఖయందుఁ గట్టిన చీటినిజూచి) అదుగో! ఒకచీటి యందు వ్రేలాడు చున్నది. అన్యథా భావింపకుండ స్వవిధానమును నా కెఱిం గించుచు నా కర్తవ్యమును బోధించుపత్రి మిట నుంచిపోయి యుందురు. సంతోషము. (పత్రిమును విప్పిచూచి) సందే హము లేదు. ఇవి బాలచంద్రి హస్తలిఖితాక్షరములు. అవురా! ఎంత చక్కగనున్నవి? ఇదేమి? తానొకటితలఁప దైవమొకటి తలఁచినట్లున్నది. (చదివి) శ్రీగిరీశునియానయఁట. ఎందులకు? మాచెర్ల చెన్నునియానయఁట. మలిదేవుని యానయఁట. అబ్బా! ఇన్ని యానలిడుటకు నేనేమి పాతక మొనరించితిని. తండ్రి బ్రహ్మనాయని యానయఁట. ఒక దాని నొకటి మించి పోవుచున్నదే! అణువదార్గురు వీరనాయకుల యానయఁట. అక్కటా! బాలచంద్రా! కారణము దెలుపకుండ నిన్ని యానలను బెట్ట నే నేమి కానికార్య మొనరించితిని. (మఱియుఁ జదివి) ఈ యశ్వత్థతరువును దాఁటిన మహాపాతకమఁట. బాల చంద్రా! అకారణముగా నన్ను బంధింప నీకేల బుద్ధిపుట్టినది?

ద్విపద॥ దంటనా నను వీడ ధర్మమా నీకు
నిజమువిచారించి నీవున్న కడకు
వచ్చితి విడనాడి వడి నేగినావు.
కలిమికోసము వచ్చి కలియుట లేదు.
కులమునఁ గోదవని కూడుట లేదు.
తల్లిని దండ్రిని దాయాదజనుల
నెడఁబాసి నీపొందు నే నమ్మియుంటి.
పాసిపోఁదగునయ్య బ్రహ్మన్నతనయ!
న్యాయంబువిడనాడి నమ్మినవాని
నొంటరిగానుంచ నొప్పెనా చిత్త?
మెన్నడు నాలావు నిసుమంతయైన
కనుగొన్నవెతివి కట్టిడివాఁడ!

(ఇంకను జదివి వెలవెలఁబోవుచు) ఆఁ ! చివర కిదియా నీయభిప్రాయము నేను బ్రాహ్మణుండనగుట యుద్ధార్హుఁడఁ గానని విముఖుని జేయ నెంచితివి కా ? అకటకటా ! నీ వెంతలో మాఱిపోయితివి ?

సీ॥ తొలిజన్మపరిపాకకలనను వేర్వేఱు
కులమువారలమైన కొదువె కాని
జననంబు నొకలగ్నమునను నొక్కదినాన
ఒక్కనివరమున నొక్కచోట
పెరుఁగుట యొకయింట విడువక యొక్కని
ఒకరొక్కఋణమైన నొక్కతల్లి
కడుపున జన్మించు బుడుతలకం టెను
మించినమైత్రి వర్తించుచుందు.

మన్నదమ్ముల యాగ్గరియందు భేద
మెపుడురాదని జగమెల్ల నేకరీతి
మాఱుమ్రోఁగుచునుండ నీమాటలెల్ల
వ్యర్థములుసేయఁజూచితే బాలచంద్ర !

అవురా ! బ్రాహ్మణులు యుద్ధమొనర్ప లేరని నీతలంపు కాఁబోలు ! పిఱికివారని నీయూహ కాఁబోలు ! ఏదేని కారణంబున నన్నవమానపఱచినఁ బఱతువుకాని నాకులంబున కంతకు నపయశంబు దెచ్చి పెట్టఁదలంతువే ?

సీ॥ రాచకులంబు హా పీఁచంబడంచిన
పరశురాముఁడు మహీసురుఁడు కాఁడె ?
శకటాదికవ్యూహసంధానచణుఁడు ద్రో
ణాచార్యుఁ డరయ బ్రాహ్మణుఁడు కాఁడె ?
కురుపాండవులకు నందఱికిని శస్త్రాస్త్ర
గురుఁడైనకృపుఁ డగ్రకులుఁడు కాఁడె ?
ఉపపాండవాదుల నుగ్రతం జంపిన
గురునందనుఁడు ధరామరుఁడు కాఁడె ?

## శివరాత్రిమాహాత్మ్యము

వ॥ ఇచట మీకుఁ బూర్వము భర్తృయజ్ఞునకును నశ్వసేనునకును నడచిన సంవాదరూపమగు గాథను వాక్రుచ్చెద. ధర్మపరుఁడును వేదవేదాంగపారగుఁడును నానర్తదేశాధిపతియునై తొల్లి యశ్వసేనుఁడని యొకరాజుండెడి. నాయశ్వసేనుఁడు దినక్రమమునవచ్చు కలికాలమును వీక్షించి కుతూహలంబున భర్తృయజ్ఞుదిక్కు మొగంబై ౨౦౭

క౦॥ "కలికాలంబున శ్రమముం గలిగింపకె యధికపుణ్యకరమును బాపం
బుల నెల్లం దెగఁగార్పంగలదియు నగునొక్కవ్రతము కరుణం జెపుమా ౨౦౮

ఆ॥ నరుల కాదియుగమునం ద్రేత ద్వాపరమందుఁ గొలఁదియాయు వరసిచూడ
కలియుగంబు రా నీకం గూడఁ గరమల్పమనుట కేమి సంశయంబు ; లదు?

ఆ॥ కాన నేఁడల్పపుణ్యుల్ కావింపఁదగినట్టి వ్రతము కాక యొక్క వాసరంబె
చేయఁదగినదున్నఁ జెప్పుమీ భర్తృయజ్ఞాభిధానమహీసురాగ్రగణ్య! ౨౧౦

క౦॥ రేపటిపని యీదినమును మాపటిపని పగలెచేయు మతిమంతుఁడు తా.
పాపిష్ఠమృత్యువాఁగునొకో పనికాకున్ననైన నోమహనీయా!" ౨౧౧

వ॥ అనివచించుటయు నుదారబుద్ధియగు భర్తృయజ్ఞుండు దివ్యచక్షుస్సునఁ దడవు వీక్షించి ౨౧౨

తే॥ "అనఘ! శివరాత్రినామకైకాహ్నికవ్రతము సమస్తాఘనాశక మమితపుణ్య.
మపుడొనర్పఁగఁబడు దానహవనజపములెల్ల నక్షయఫలము లిఁకేమికలదు?

సీ॥ అప్రాప్తతనుజాతుఁడైన మర్త్యుండు తా నాప్తతనూజాతుఁడగును రాజ!
పుట్టుదరిద్రుఁడై పొక్కెడు జనుఁడు తా నత్యంతధనవంతుఁడగును ఱేఁడ!
అల్పాయురన్వితుఁడైన మానవుఁడు తా నధికదీర్ఘాయుష్కుఁడగు దుసీఁడ!
అరితిరస్కృతుఁడైన నరనాయకుండు తా నరివీరులను గెల్వనగు ధరేశ!
ఎవ్వరేకోరికఁ గోరి యీవ్రతంబు సేయుదురో వార లాకోర్కె శీఘ్రముగను
పొందుదురు. కోర్కెలేకుండఁ బొనరుచు ప్రజ పొందు నిశ్శ్రేయసంబు నోభూమిపాల!

ఆ॥ దానధర్మములను దగనాచరింపని పిసినియేని రాత్రి వేళ జాగ
రంబుచేయ వత్సరం బొనరించినయఘమునుండి ముక్తుఁడగును భూప! ౨౧౫

క౦॥ స్థిరములు చరములునగుచుం బరఁగెడి లింగంబులందుఁ బరిపూర్ణుండై
హరుఁడుండు రాత్రియగుటను ధరణిని శివరాత్రియండ్రుదాని నభిజ్ఞుల్. ౨౧౬

క౦॥ లోకానుగ్రహకాంక్షను నాకేశుఁడు చంద్రచూడు "నందితురంగా!
ఈ కలికాలము సకలాఘాకర. మటుగాన యుష్మద్దర్శన వలనన్ ౨౧౭

ఆ॥ జనులు పూతులగుచు సంవత్సరాంహస్సునుండి ముక్తులగుట కుర్వి మీఁది
కరిగి యొక్కదివస మధివసింపుము దేవ! నిన్ను మిగుల వేడుచున్నవాఁడ. ౨౧౮

ఆ॥ అంతవారిచేత సర్పింపఁబడినది వేల్వఁబడినదియును వేగ మాకు
చేరఁగలదు. మున్ను వారిచ్చునుచ్ఛిష్ట మఖిలమకట! వ్యర్థమగుచునుండె. ౨౧౯
కం॥ కలికాలమున నశుద్ధాత్ములచే నీఁబడు పరిభూతమును శంకర! మా
కు లవంబేనియుఁ జెందదు. తిలకింపు" మటంచుఁ గరము దీనతఁబలుకన్ ౨౨౦
కం॥ శితికంఠుఁడు "మాఘాసితచతుర్దశీతిథిని రాత్రి క్ష్మాస్థలమునకున్
శతమన్యూ! సంవత్సరకృతపాపవిశుద్ధికొఱకుఁ గృపతోడను నేన్ ౨౨౧
కం॥ స్థిరచరలింగంబులనెల్ల రహింజని సంక్రమింతు. లలి నయ్యెడ నే
నయుఁ దపస్మత్పూజనమును జరుపు నఘౌరాయముఖ్య సన్మంత్రములన్ ౨౨౨
కం॥ పాపవినిర్ముక్తుఁ డగునతఁ. డీపగిదిని వక్ష్యములను హితమతిసుమనో
ధూపాదులనర్చించి మహాపూజ యీవలయు నర్ఘ్య మీమంత్రమునన్ ౨౨౩

శ్లో॥ గౌరీవల్లభ దేవేశ సర్వాద్య శశిశేఖర
వర్ష పాపవిశుధ్యర్థ మర్ఘ్యో మే ప్రతిగృహ్యతాం.

కం॥ పదపడి యశనము వసనము మొదలగు ద్రవ్యములచేతఁ బూజించి గుణా
స్పద! విత్తశాఠ్యమును విడిచి దక్షిణ యొసంగవలయు క్షితిదేవులకున్. ౨౨౪
ఆ॥ ధర్మకథలతోడఁ దాండవంబులతోడ జాగరంబు రాత్రి సలుపవలయు.
ఒక్కయేఁడు చేసియుండినయఘమువోఁ దద్వ్రతమ్ము పాచితమ్ము చుమ్ము"
కం॥ అనవిని వేలుపులెల్లరు ఘనమోదముతోడ గరళకంఠునకున్ మ్రొ
క్కినవారయి తమయిండ్లకుఁజని శివరాత్రిమహిమంబు క్ష్మాస్థలిఁ దెలుపన్
కం॥ నారదుఁ బంపించుటయును ధారుణియెల్లం జరించి తన్మని ప్రజలన్
గూరిచి బోధించెఁ. గడుం బేరువహించె శివరాత్రి పృథివీశ! యటన్. ౨౨౭
కం॥ ఈ విషయంబున నొకకథ వేవచియించెదను వినుమ. విఖ్యాతంబౌ
పావనమై మిశవనమున వావిరి నొకలుబ్ధకుండు వసియించెను దాన్. ౨౨౯
ఉ॥ ద్యూతము మున్నుగాఁగలుగు దుర్వ్యసనంబులఁ జిక్కువాఁడు వి
ఖ్యాతికివచ్చెఁ జౌర్యమున. న్లుచరించి చరించి యంతఁ దా
నాతత పుణ్యదాత్రియగు నాశివరాత్రిని భక్తులె నుల్
ప్రీతి శివాలయస్థులయి పెక్కురు జాగరణంబు సేయఁగన్ ౨౩౦
ఉ॥ "సొమ్ములు పెట్టుకొన్న యొకసుందరి తాగుడినుండి వచ్చుచో
హాయమ్మని పట్టికొట్టి యెటులో హరింపఁగనో" నటంచుఁ జి
త్తమ్మున నిశ్చయించుకొని తత్సవిధస్థలినుండు కర్ణికా
గమ్మున నెక్కి గుప్తముగ రాతిరియెల్ల వసించె నేమనన్. ౨౩౧

ఉ॥ ఏకడనుండి యెవ్వరిత యీవలకుం జనుదెంచునో యటుం
చాకుజనుండు శీతమున కార్తిని జెందుచుఁగూడ దానిపైన్
వీఁకవసింప నించుకయు నిద్దురపట్టదు. దొంగ తత్తరయైన తా
నా కథవింటమాని బహిరాగతకాంక్ష నే మనస్సులెన్. ౨౩౨
కం॥ తానెక్కి కూరుచుండిన మ్రానునకుం గ్రిందనొక్క మహనీయత్వం
బూనిన లింగంబుండఁగ నానీచుఁడు తోఁచితోఁచ కాకులఁ బూలున్ ౨౩౩
ఆ॥ తెప్పించివైచుటయును దిన్నగా నవి శివలింగమందుఁ బడియె లీలఁబోయి.
జారచోరసంఘసంకటకారుఁడై యంతలోనఁ బొడిచె నర్యముండు. ౨౩౪
కం॥ అంతట స్త్రీలుం బురుషులు శాంతమనస్కులను లేచి శంకరునకు న
త్యంతమ్ము మ్రొక్కి స్వస్వనిశాంతములకుఁ జనిరి హరహరాయను నుడులన్. ౨౩౫
కం॥ ఆ దొంగవాఁడుగూడను వేదిగి నన్నెరనుండి విహ్వలమతియై
ఏదెసకో పలాయితుఁడయి తాఁదనువును విడిచెఁ గొంతతడవునకు నృపా! ౨౩౬
తే॥ అంత యాదృచ్ఛికంబుగనైన యట్టి జాగరాదుల వలననే వేగనాతఁ
డల దశార్ణాధిపతియయ్యె. నంతఁబోక యయ్యె జాతిస్మరుండును. నహహా! వింటె.
కం॥ పితృపైతామహ సకలక్షితినాయకతన్వహించి శీఘ్రంబుగ ను
న్నతి మునుపూజించిన పశుపతిలింగంబునకుఁగట్టెఁ బ్రాసాదంబున్ ౨౩౭
కం॥ ప్రతిసంవత్సరమును నాక్షితిపతి శివరాత్రి నుపవసించి పురాణం
బితిహాసంబును వినుచుం గృతజాగరుఁడగుచు వచ్చెఁ గేవలభక్తిన్. ౨౩౮
సీ॥ సుస్నాతుఁడును బరిశుద్ధాంశుకచ్ఛన్నుఁడు పవిత్రుఁడునునయి యుపవసించి
తొంటి మంత్రంబులతోడను శివలింగమున కష్టపూజనమును బొనర్చి
ఆటపాటలతోడ హరకీర్తనముతోడ రాత్రియంతయు జాగరంబొనర్చి
రమణీయతమపదార్థ ప్రదానంబుచే ధరణిదైవతములఁ దనియఁజేసి
నిజనివాసంబునకుఁ బోవునృపతియొకటఁ బులహాగాలవ గార్గ్యాది పుణ్యమునులు
తచ్ఛివాలయమున వచ్చిదర్శనంబు నిచ్చుటయు వారికెల్లర కెరఁగి భక్తి ౨౪౦
కం॥ తదనుజ్ఞాతుండై యట మదమునఁ గూర్చుండుటయును మునివరులెల్లన్
సదయతఁ బురాణగాథలు చదివివినిచి కొంతవడికి క్ష్మాపతితోడన్ ౨౪౧
ఆ॥ "రాజ! యడుగువార మోజ నిన్నొక్కటి దేవునెదుట నిజముదెల్పవేని"
అనుడు "నట్లె చెప్పెదను మీకు నాతోడెఱింగియున్న" ననుచు నృపతి పలికె.
ఉ॥ అంత మునీంద్రులిట్లని. "ఇలాధిప! దానముఁదొట్టి యెన్నొ య
త్యంతమునాచరించుటకు నర్హములైనవి యుండ వాని నీ

చింతయు వీడి జాగరము నే పొనరింపఁగవచ్చుచుండు కా
లాంతకునాలయంబునకు - నందలిసత్త్రయొఱుంగ మెద్దియో. ౨౪౩

ఉ॥ గోప్యముగాకయున్నది కొంచెము మాకును జెప్పుమయ్య కా
శ్యప్యధినాథ!" యంచునిటులాడ విలక్షణమైన నవ్వుతో
"గోప్యమ. యౌను గాక. మునికుంజరులార! వచింతు దేవుసా
మీప్యమునన్ వచింతునని మీకడ వాకొనియుంట" నంచటన్ ౨౪౪

సీ॥ తొలుతటి భవమున దొంగయై శివరాత్రి వచ్చియీగుడిలోనఁ జొచ్చుటయును
యాదృచ్ఛికంబుగా నవనీరుహాముక్రింది శివలింగమున కర్చ సేయుటయును
ఉపవాసకృశతమైఁ గృపణభావమునూని యొగినందు జాగరంబుండుటయును
పూర్వజన్మజ్ఞానమును వీడకియ్యెడ భూపాలకునియింటఁ బుట్టుటయును
వరుసగావచింప వాచంయమ శ్రేష్ఠులు మేలటంచుఁ బొగడి మిక్కుటముగ
దివసంబులిచ్చి వావిరినారాత్రి జాగరంబుసల్పి చనిరియవల.

కం॥ ఆ ప్రేఁడుగూడ శంభు నుదారతఁబూజించి యోగధారులయెడలన్
గౌరవముఁ జూపి జాగర పూరాత్రిరి సల్పిచనియె స్వాలయమునకున్

కం॥ శివరాత్రి యీవిధంబున నవనీతలమందు వెలసె. నటుగావున నీ
శివరాత్రి నామకవ్రత మెవరికినిం గాదృశ. మింక నేమనవలయున్. ౨౪౬

సీ॥ నలుని దిలీపుని నహుషుని మాంధాత ధుంధుమారు యుయుత్సుఁ దొట్టినృపులు
శ్రీసరస్వతి శచి సీత యరుంధతి సావిత్రి మేన ద్రుపదద్వతి స్వధ
స్వాహా ప్రభావతి సంప్రీతిగాయత్రి రంభాదికాప్సరల్ రతి మొదలగు
నుత్తమస్త్రీలు దా నొనరించి యీవ్రతం బాత్తస్వకామ్యలై యలరియుండి.
శివుని భూతినిచ్ఛయింతురో కలికాల మీవ్రతంబు వారి కింకముఖ్య.
మెవ్వఁ డీసుగాథ నీశ్వరుసన్నిధిం జదువు వానికిల్బిషంబు వాయు. ౨౪౭

ఆ॥ గంగననుకరించు ఘనతీర్థములు లేవు లేవు శివునిబోలు దైవతములు
క్షితిని గానఁబడదు శివరాత్రితో సమంబైనతపము. సత్యమరయనిద్ది. ౨౪౮

ఆ॥ నిఖిలరత్నమయము నిజముగా మేరువు. నిఖిలవిస్మయములనిలయము తప.
మఖిలధర్మరూపమగును దా శివరాత్రి. అశ్వసేన! ఇంత కధిక మెద్ది? ౨౫౦

కం॥ గరుడుండు పక్షులకుంబలె సరిత్తులకునెల్ల నల్లసాగరుపోల్కిన్
వరధర్మంబులకెల్లను ధరణిని శివరాత్రి దాఁ బ్రధానంబు నృపా! ౨౫౧

౮ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసర్కిలిన్‌స్పెక్టరు, నర్సారావుపేట.

౯ నారాయణరావుగారు, దాతారుపల్లె

౧౦ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు

౧౧ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ

౧౨ వేలూరి రామన్న గుప్తగారు, సదాశివునిపేట

౧౩ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౪ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్‌స్పెక్టరు - పరుచూరు.

౧౫ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.

౧౬ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - శాతాపురం

౧౭ కిషన్ రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి

౧౮ చివుకుల శ్రీరామశర్మగారు - నాగులుప్పలపాడు

౧౯ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౨౦ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు - శైదపీడు.

౨౧ చేకలపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

౨౨ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.

౨౩ చిక్కరాజు మట్టపల్లిరావుగారు - చెలకుర్తి.

౨౪ మునిపల్లె పట్టాభిరామారావుగారు - తిరుమలగిరి.

౨౫ కూడ వెంకటరామారెడ్డి దేశముఖుగారు - ఇటికాలపల్లి.

౨౬ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు
శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు ఏజంటు

౨౭ పోతుకూచి వెంకటరాయుడుగారు - కొప్పరప్పాలెం అగ్రహారం.

౨౮ రామరాజభూషణ భాషానిలయము - వెంట్లవెల్లి.

౨౯ వలిపె వెంకటరావుగారు, వకీలు - కొల్లాపురము.

30 శ్రే॥ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు - హైదరాబాదు.

# అభినవసరస్వతి

సంపుటము ౨౩ { పరిజోత్పత్తి నామ సం॥ శ్రావణమాసము. } సంచిక ౫

## కృతి విమర్శనము

అనర్ఘనారదము — ఇది కింకవీంద్రఘటాపంచాననులగు తిరుపతి వేంకటేశ్వరకవులు రచించి యిప్పటి కిరువదిరెండేండ్లనాఁడె ముద్రింపించియున్న యొకనాటకము. తిరుపతి వేంకటీయమ్మగుటనే యిందలి కవితావిశేషమును రసోత్కృష్టతయు వేఱ చెప్ప నవసరము లేకయే యందఱకును దెలియునదికావున నా విషయము విడిచెదను. ఇందలి వృత్తము మాయను జయించితినని గర్వపడిన నారదుని విష్ణువు మాయలోఁ బడవేసి పెండ్లాడించియుఁ బిల్లలఁ గనిపించియుఁ గర్వపరిహారముం గావించుట. అందువలననే యనర్ఘనారదమని యభిధాన మేర్పడియెను. నారదుఁ డొకపరి లక్ష్మీసహితుఁడై చదురుదీర్చి యున్న విష్ణుని దర్శించి తన్నుఁగాంచి దిగ్గున లేచి లోపలికరిగిన యా లక్ష్మిపైఁ గనిసి గర్వంబున హరిదిక్కుమొగంబై,

కం॥ విటుఁడనో ధూర్తుండనో నే?
జటిలుఁడ జితమాయుఁడం బ్రశస్తహృదయుఁడన్.
తటకున ననుఁగని చనె లో
గిటిలోనికి లక్ష్మి. ఇదియుఁ గీర్తిదమగునే?

అని ప్రశ్నించుటయు

కం॥ పతిఁదక్క నన్యసన్నిధి సతి నిలువందగదు. నీతిచందం బిది. ప
మతిమంతులైన మాయాగతికిక్ లోఁబడకయుండఁగాఁగలరె మునీ!

కం॥ జితమారుతులును సాంఖ్య
స్థితివేత్తలునైన మునులు దేవతలును ద

ద్గతులగుచునుండ మాయా
గతి గీతజ్ఞునకు నీకుఁ గడవఁదరంబే ?

అని ప్రత్యుత్తరమొసంగి "స్వామీ ! మీరు నన్ను గీతజ్ఞుఁడని యాక్షేపించితిరి ... చిరకాలమునుండి మీరందఱును సమ్మానించుచుంటిరనుకారణమున నే నిద్దానియం దభిమానముగలిగి వర్తించుచున్నాఁడను గాని మీ రీసడించిన యీ విద్య నా కేమిచేయుటకుఁ బనికి వచ్చెడి"నని వీణ బ్రద్దలుచేయఁబోయిన యాతని చేయిపట్టుకొని "నారదా ! గానవిద్య మంచిదికాదని నాతాత్పర్యముకాదు. అయ్యది మాయను మఱింత వృద్ధిపఱచునేమోకాని యణఁగింపనేరదు. ఇది గాక యీవిద్య నిత్యవ్యభిచారిణులగు నచ్చరలచేఁ జిక్కియుండుటచే దీని నలవఱుచువారుగూడఁ దఱచుగా వారలకుఁ జేఁజిక్కవలసి వచ్చుచుండును. అక్కతమున నే గాయకులం జూచుటకుఁ బతివ్రతాంగనలు సంశయింతురు. ప్రకృతము శ్రీదేవిగూడ నిందులకే సంశయించెనని తోఁచుచున్నది.

ఉ॥ నీ వటువంటివాఁడవని నేను వచింపఁజుమీ యమీంద్ర ! స
ద్భావుఁడ వీవు. నిన్నుబలెఁ బల్వురుగాయకులుండఁబోరు. కా
మావిలచిత్తులై చెడినయట్టిరె గాయకులెల్ల. నింతెకా.
దీవిషయంబు జ్ఞానమున కించుకయుం బనిసేయ దెయ్యెడన్.

అని సమాధానముచేసెను. ఈ నారదుఁడే సృంజయమహారాజు నింటఁ గొంతకాలముండ నాయన కొమిరె మదయంతి యమ్మునియొద్ద గానము నేర్చుకొని తుద కాతనిఁ బెండ్లాడఁదలంచుటయుఁ దండ్రి చింతించి లోకులగుఱించి

చం॥ అనుభవపూర్వకంబగు రహస్యమొకండు వచించుచుంటి. జ
వ్వనములరారు మేల్మి కులబాలికలన్ స్వరవిద్యకంచు స
జ్జనుఁడగునట్టి గాయకుని సన్నిధినేనియు నొప్పఁజెప్పకుం
డవలెఁ. డు నారదుం డితనికన్న మఱెందును యోగ్యుఁడుండునే ?

ఆ॥ గానవిద్య కొఱకు దానికే కాదు మీ రిఁకవచ్చినట్టి యెన్మొలాఁడి
నితరపురుషునొద్ద నెందులకేనియు నొప్పఁజెప్పకుండు యోగ్యులార!

అని బోధించెను. ఇందలిగాథ యిట్టిది. ఇది ప్రకృతానుభవమునకుఁగూడ సరిపోవనిదికాదు. కాని నవనాగరికులు పురుషులతోపాటు తరుణులనుగూడ సర్వవ్యవహారములలోనికిం దించుట విచారకరము. భేదములేకుండ ననవరతముఁ బురుషులతోఁ గలసిమెలసి వర్తించుచుఁ బికెటింగుచేసియు నుద్యోగములొనర్చియుఁ బురుష సభలలో నుపన్యసించియు యువతులుగాని యిఁక స్వరాజ్యము సంపాదింపరు !

ఈ గ్రంథము వెల రు 0-8-0 తూర్పుగోదావరిజిల్లా కడియమునకుఁ జెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి పేరఁగాని కాకినాడకుఁ దిరుపతి శాస్త్రిగారి కుమారుఁడు దివాకర్ల వేంకటావధానిగారి పేరఁగాని వ్రాసికొనవలయును.

—:o:—

## ప్రస్తుతపు, ఆర్థికస్థితి

ఏ కారణము చేతనైననేమి ప్రస్తుతము ప్రపంచస్థితి వ్యత్యస్తమైనది. ఏనోటఁ జూచినను డబ్బులేదు, డబ్బులేదన్న మాటయే వినవచ్చెడిని. మొన్న మొన్నటివఱకును బ్రజలు ధనమదాంధులై క్రిందుమీఁదులెఱుఁగక పెండ్లిండ్లకనియుఁ బేరంటములకనియు నుత్సవములకనియు నూరేగింపులకనియు విందులకనియు వేడుకలకనియు వ్యాజ్యములకనియు వెదఁజల్లుచు వచ్చిరి. ప్రస్తుతము పైసా పెకలుటలేదు. చిల్లిగవ్వయైనను నప్పుదొరకదు. గిద్దెఁడుగింజ లిచ్చువాఁడు లేఁడు. ఏయూరఁ జూచినను దివాలాలే. ఇన్సాల్వెన్సీలే. అప్పులేనివాఁడు లేఁడు. ఊరి కేనలుగురైదుగురో ఋణగ్రస్తులుకానివారు. ధరలు ముండమోపినవి. వడ్లు పుట్టి ౪౦,౪౫ అమ్మునప్పటికిఁ బెటపెటలాడుచున్నది. ఆధరలకైనను నడుగువాఁడు లేఁడు. కొనుదిక్కులేదు. పైసయూ లేదు. అప్పుపుట్టదు. ధరలా శూన్యము. కందులు పెసలు మినుములు బెల్లము చింతపండు కాయలు కూరలు సమస్తము కడుచవుక. ఎంతచవుకైననేమిలాభము ! చేతిలో దమ్మిడి యుండినఁగదా ! వెనుక రూపాయి

దమ్మిడిగాఁ జూచెడివారికిఁ బ్రస్తుతము దమ్మిడి రూపాయిగానున్నది. వెనుకఁ బెండ్లిండ్లయినఁ గట్నాలనియుఁ గానుకలనియు వేయినూటపదియాఱులనియు విఱుఁగఁబడెడివారు. ప్రస్తుతము కట్నాలును లేవు. కానుకలును లేవు. ఆబడాయి యంతయు నడుగంటినది. ఇంకొకసంగతి. భూముల కవుల్లుగూడఁ దలక్రిందులగుచున్నవి. వెనుక నెకరమునకుఁ బది యిరువది ముప్పది నలుబది యిచ్చెడివారు. మేము చేసెదమన్న మేము చేసెదమనెడివారు. ప్రస్తుతము బ్రతిమిలాడినను జేయుదిక్కు లేదు. పల్లెలపనియేగాక పట్టణములపనికూడ నంతంతమాత్రముగా నేయున్నది. బేరసారము లడుగంటినవి. ఎగుమతి దిగుమతులు స్తంభించినవి. సంపాదనము సున్న. వ్రయము యథాపూర్వము. వర్తకులపని తీఱినది. ఉద్యోగులపనియు నంతంతమాత్రమే. నెలజీతములుతప్పఁ బైని బైసయు లేదు. ఇదివఱ కేమిదోఁచినను దోఁచెడివారే. ప్లీడరుల పనికూడఁ బాడఱినది. న్యాయాన్యాయములును గరుణాకటాక్షములును లేక పరమలోభులైన కటికసాహుకారులును దండ్రిసంపాదించినయాస్తి చూచుకొని కన్నుమిన్నెఱుంగక పిన్నపెద్దవివేకములేక మదించితిరిగెడి క్రొత్తప్రైవేట్లును దెచ్చు నేకొన్నియో తప్ప వచ్చు వ్యాజ్యములేవి. పార్టీలేరి? స్టాంపుఫీజు వకాల్తుఫీజు దగ్గఱనుంచి యెదుఱుపెట్టుమనుచున్నారు. ప్లీడరుగుమాస్తాల పటాటోపములు పూర్తిగాఁ దగ్గినవి. ఇఁకఁ దక్కినవారిపని యెటులుండునో యోజింపుఁడు. డబ్బుకు దేశము మొగమువాఁచినది. అది లేకుండ గడచుట కష్టము. డబ్బులేనివాఁడు డుబ్బుకుఁగొఱగాఁడు. అర్థములేనివాని బ్రదుకు వ్యర్థము. ధనమూలమిదం జగత్. అర్థములేకున్ననవర్థకమే. భావిగతి యేమో, పరమేశ్వరానుగ్రహ మెట్టులున్నదో.

---

## ప్రశ్నోత్తరములు

(బ్రాహ్మణమహాసమ్మేళనపత్రికనుండి యాంధ్రీకృతము)

సంఘాధినివేశనసభయందు సంఘసంస్కర్తృనామక సమాజ ప్రతినిధులగు పండితంమన్యు లనేకులు తమ యల్పశంకలకు సమాధానముగోరుచు వివిధస్థానములనుండి వేంచేసిరి. ప్రకాశమానమగు చరమదిన విద్వత్సభయందుఁ బూర్వోక్తులు చేసిన ప్రశ్నములును వానికిఁ బూజనీయులగు పండిత రాజరాజేశ్వరశాస్త్రిగా రిచ్చిన యుత్తరములును జనతానుకూలభాషలోఁ బాఠకులకుఁ గానుకపెట్టుచున్నవారము.

౧ ప్ర॥ అంత్యజులకు హిందూధర్మశాస్త్రసమ్మతిచే హిందూధర్మములందుఁ బ్రవేశ మున్నదా లేదా ?

ఉ॥ ధర్మవిషయమున ధర్మశాస్త్రమేకదా ప్రమాణము ? అప్పుడు మనుప్రభృతులచేఁ గర్తవ్య ముపదేశింపఁబడియుండుటవలన నిస్సంశయముగా నంత్యజులకు హిందూధర్మములయందుఁ బ్రవేశమున్నది.

౨ ప్ర॥ ఇఁక వర్ణాశ్రమధర్మములయందును వారి కంతర్భావమున్నదా లేదా ?

ఉ॥ మీప్రశ్నమునుబట్టి కనఁబడెడి హిందూధర్మములకును వర్ణాశ్రమధర్మములకును గల భేదము కేవలము వ్యాప్యవ్యాపకత్వరూపమైనదే. వర్ణశబ్దము హిందూజాతిలోని బ్రాహ్మణాది చతుర్వర్ణములనే చెప్పునదియగుటవలన వ్యాప్యము. (తక్కువది) హిందూశబ్దము బ్రాహ్మణాదులనే కాక వర్ణసంకరులనుగూడ బోధించునదియగుటచే వ్యాపకము(ఎక్కువది). ఈప్రకార మాశ్రమశబ్దముగూడఁ దృతీయసంస్థ తోఁపింపఁజేయుచున్నది. వర్ణశబ్దమునకు "బ్రాహ్మణాః క్షత్రియా. వైశ్యా స్త్రయోవర్ణా ద్విజాతయః, చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమ"యని మనుస్మృతి యర్థముచెప్పుచున్నది. బ్రాహ్మణులుమొదలైన మూఁడువర్ణములవారును బుట్టుకవలనను సంస్కారమువలనను రెండువిధములుగా నయినవారై ద్విజాతులని చెప్పఁబడు

చున్నారు. సంస్కారరూపమగు ద్వితీయజన్మము శూద్రునకు లేనందున నొక్కటే జాతి. ఇట్టి నాలుగువర్ణములవారికిని మించిన యయిదవజాతివాఁ డొకఁడును లేఁడు. ఈనాలుగువర్ణముల యాను లోమ్యప్రాతిలోమ్యక్రమమునుండియే యేర్పడిన సంతతి వర్ణసంకరమ నుపేర వర్తిల్లెడిని. వర్ణసంకరులకును బైనిజెప్పిన నాలుగువర్ణముల యందు సమావేశము లేదు. ఈవిషయమును యాజ్ఞవల్క్యస్మృతి గూడ నిట్లే వ్యాఖ్యానము చేయుచున్నది. ఈవిషయము విస్తరము సనాతనధర్మప్రదీపమను గ్రంథము 328 పుటపర్యంతము చక్కగా నున్నయది. వర్ణసాంకర్యమునుండి యేర్పడిన సంతతి నిట్లు వర్ణించి ముందటికిఁబోయి మనుస్మృతి "శూద్రా దాయోగవః క్షత్తా చాండాల శ్చాధమో నృణాం వైశ్యరాజన్యవిప్రాసు జాయంతే వర్ణ సంకరా" యని చండాలజాతి నిట్లు నిర్దేశించుచున్నది. శూద్రునివలన వైశ్యస్త్రీయందుఁ బుట్టినవాఁ డాయోగవుఁడనియు క్షత్రియస్త్రీ యందుఁ బుట్టినవాఁడు క్షత్తయనియు బ్రాహ్మణస్త్రీయందుఁ బుట్టిన వాఁడు మనుష్యులలో నధముఁడగు చండాలుఁడనియు వేఱువేఱు సంజ్ఞలు గలవారగుచున్నారు.

3 ప్ర॥ వీరిని దెలియఁజేయుటకు శాస్త్రములయందుఁ జాండాల శబ్దప్రయోగముగాని యంత్యజశబ్దప్రయోగముగాని దొరకునా ?

ఉ॥ బహుప్రకారులగు వీరి యుచ్చారణము శాస్త్రములయం దనే కశబ్దములఁ గనుపట్టుచున్నది. చూడుఁడు. అత్రిసంహిత 195 శ్లో॥ రజక శ్చర్మకారశ్చ నటో బురుడఏవచ। కైవర్త మేద భిల్లాశ్చ సప్తైతే చాంత్యజా స్స్మృతాః॥ సప్తవిధసంకరజాతీయుల నుచ్చరించి సాంకర్య భేదముచే బహుప్రకారులగు నితరులుగూడ ననేకులున్నారని చశబ్ద ముచే స్పష్టీకరించుచున్నది. ఇట్లనేకస్థలములం దుపన్యసింపఁబడు తదుచ్చారణములచే వీరికి స్వతంత్రమగు జాతి లేకునికిని వర్ణసంకరుల యందే సమావేశముచు దలిదండ్రులజాతి ననుసరించి హిందూత్వమును నిశ్చయించుటకు శక్యమయ్యెడిని. చండాలురు వర్ణసంకరులయందును జివరవారుగా నెఱుఁగఁబడుచున్నారు. అంత్యజుఁడనునది సంకరజాతి

బోధకమగు సామాన్యశబ్దము. దీనికిఁ బ్రమాణ్యము వేదవ్యాస స్మృతియందు "చర్మకారో నటో భిల్లో రజకః పుష్కరో త్తరః, వరాటో మేద చండాలా దాస శ్వపచ కాలికాః, ఏ తేంత్యజా స్సమాఖ్యాతా యేచాన్యేచ గవాశనాః, ఏషాం సంభాషణే స్నానం దర్శనా దర్క-వీక్షణ"మ్మని యిట్లు కనఁబడెడిని.

౭ ప్ర॥ ప్రథమమం దీ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లను నాలుగువర్ణములవారి యుద్భవ మెటు లయ్యెను?

ఉ॥ సమానజాతీయస్త్రీపురుషులైన బ్రాహ్మణునివలననుండి బ్రాహ్మణి యందును క్షత్రియునివలన క్షత్రియయందును వైశ్యునివలన వైశ్యయందును శూద్రునివలన శూద్రియందును బుట్టి క్రమముగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రవర్ణము లేర్పడినవని యాజ్ఞవల్క్య స్మృతి "సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతేహి సజాతయ" మొదలగు వానిచే ఘోషించుచున్నది. ఈమీప్రశ్న మారంభకాలీనోత్పత్తివిష యికమే యైనయెడల ననంగతమే. సృష్ట్యారంభము మీమాంసాది శాస్త్రమతమున "నకదాచిదనీదృశంజగ" దిత్యాదిశ్రుతిప్రమాణముల నుండి ప్రమాణసిద్ధమే కాదు. అట్టిప్రశ్నము చతుర్వర్ణాదిమానవుల యుత్పత్తి ననుసంధానముచేసినను గుదురదు. మృగపశ్వాది తిర్యగ్యోని విషయకము నుద్ఘాటనచేయుటకును బొసఁగదు. విరాట్పురుషవర్ణన పరమగు "బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూ రాజన్యః కృత" ఇత్యాది శ్రుతివాక్యముగూడ భూతముల యాదిసృష్టిని బ్రమాణీకరించుటకు సమర్థముకాదు. కనుక సృష్టియొక్క యాదికాలికప్రశ్న మెంతమాత్రము నుపపన్నము కానేరదు. శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశ॥ యను గీతయందలి భగవద్వాక్యము పూర్వజన్మములయందలి గుణకర్మముల ననుసరించియే పరమాత్మ జీవులను దత్తజ్జాతులయందు నియమించుచున్నాఁడని స్పష్టగించుచున్నది. ఈ ప్రమాణ్యము శ్రుతియందు "రమణీయచరణా రమణీయాం యోని మాపద్యంత" యని యిట్లున్నది. బ్రహ్మాండపురాణము చతుర్థాధ్యాయమునుండియు సృష్టియొక్క యారంభాభావము సర్వథా

పిస్తించుచున్నది. అట్లు సృష్టియొక్క యారంభమే లేనప్పుడు బ్రాహ్మణాది చతుర్వర్ణములకథ యేమియుండును ?

౫ ప్ర॥ హిందూధర్మములకును వర్ణాశ్రమధర్మములకును నాది గ్రంథము లెవ్వి ?

ఉ॥ హిందూధర్మములకును వర్ణాశ్రమధర్మములకును గల వ్యాప్యవ్యాపకత్వము పూర్వమే చెప్పియుంటిని. అంతమాత్రమున వానికి భేదమే లేనప్పుడు తత్ప్రతిపాదకగ్రంథములకుఁగూడ భేదము సంభవింపదు. కనుక వాని కాదిగ్రంథములు వేదములే.

౬ ప్ర॥ అంత్యజు లస్పృశ్యులనుట కేమిప్రమాణము ?

ఉ॥ ఛాందోగ్యోపనిషత్తునందు "రమణీయచరణా రమణీయాం యోని మాపద్యంతే. కపూయచరణాః కపూయాం యోని మాపద్యంతే. శ్వయోనింవా సృగాలయోనింవా" మొదలగుప్రమాణము లిట్లున్నయవి. ఇక్కడఁ గపూయశబ్దము కుత్సితుని నపవిత్రుని బోధించును. వెనుకటిజన్మమం దెవ రెట్టికర్మము ననుష్ఠింతురో తదనుసారముగా వారు శుభకర్మముచే శుభయోనిని నశుభకర్మముచే నింద్యయోనిని బొందుదురని దాని యర్థము. దానిననుసరించి చండాలజాతి యపవిత్రమగుటచేఁ దత్సంసర్గముగూడ నపవిత్రమని శాస్త్రములు నిర్ధారణచేసినవి. వేయేల ? చండాలగృహమునుండి తేఁబడిన "శుచి ర్వ్రతతమ శ్శుచి"రను శ్రుతిచే స్వభావపూతమగు నగ్నినిగూడ "అశుచితరఇవ వైషయదభ్యాదావ్యో యదగ్నయే శుచయే శుచిమేవైనం మేధ్యం కరోతి" యను మైత్రాయణీసంహితామంత్రాంతరితమగు నభ్యాదావ్యపదమున కర్థము చెప్పుచుఁ గాత్యాయన సూత్రము మిక్కిలి యపవిత్రమైనదానినిగా నిర్ధారణచేయుచున్నది. ఇక్లే శతపథబ్రాహ్మణము ప్రథమకాండయందు "యద్వోఽశుద్ధాః పరాజఘ్ను" రనుదానియర్థమును నశుద్ధుఁడు వడ్రంగియా మఱియొకఁడా యనివిచారించి చండాలుని సంగతి చెప్పునది యేమియున్నది ? వడ్లవాఁడు చేసిన యజ్ఞపాత్రమును శుద్ధముచేసియే ప్రయోగింపవలయునని తద్విధిగూడ సవిస్తారముగానున్నయది.

౭ ప్ర॥ కటకటా! అదియంతయు నట్లుండుఁగాక. అంత్యజులకు వేదాధ్యయనమం దధికారము లేదనికూడఁ బ్రమాణమున్నదా?

ఉ॥ గర్భాధానాది సంస్కారములవలన ననేకవిధములుగా శుద్ధి పొందింపఁబడిన ద్విజపదాభిహితులగు నే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల కుపనయనానంతరమందే సంస్కారాత్మకమగు ద్వితీయజన్మ మేర్పఱచి వేదాధ్యయనవిధి యుపదేశింపఁబడుచున్నదో వారికిని వ్రతబంధనమున కంటెఁ బూర్వము తదధికారము లేకయుండ సంస్కారరహితులైన యీ చండాలుర కేఁక నేమి యధికారముండును? స్త్రీ శూద్రౌ నాధీయాతాం మొదలుగాఁగల నిషేధాత్మకవచనప్రమాణములు పెక్కు లున్నయవి. కనుకనే 'స్త్రీ శూద్రద్విజబంధూనాం త్రయీ నశ్రుతి గోచరా, ఇతి భారత మాఖ్యానం కృపయా మునినా కృత'మని పురాణములయందును శ్రుతిసార గర్భితమహాభారతాది గ్రంథముల కంత్యజోపకారిత్వము నిర్దిష్టము.

౮ ప్ర॥ దేవాలయప్రవేశాధికారము లేనిచో నంత్యజులు స్వతంత్రముగాఁ జేయఁదగిన యితరధర్మ మెయ్యది?

ఉ॥ స్వజాతీయదేవాలయములలోఁ బ్రవేశించుటకు వారి కధికార ముండనే యున్నది. ఇఁక స్వతంత్రధర్మకల్పనతో నుండిన ప్రయోజన మేమి? స్త్రీలకు సాలగ్రామదేవతార్చనము శాస్త్రనిషిద్ధమై యున్నది. అంతమాత్రమున వారు హిందూధర్మములం బ్రవర్తించుట లేదా? వారికిని స్వతంత్రముగా మఱియొకధర్మము కల్పింపవలసినదేనా? అస్పృశ్యులు వేఱుగా మందిరములు కట్టుకొని యిష్టదేవతాపూజనాదులచేఁ దమ్ముఁదా ముద్ధరించుకొనుటకు సమర్థులయియే యున్నవారు. ఇట్టిమందిరము లనేకములు పండరీపురము మొదలగు స్థలములయం దుండనే యున్నయవి. ఆవశ్యకమయిన నట్టిమందిరములు వారికి మఱికొన్ని కట్టించి యీ వచ్చును.

౯ ప్ర॥ అంత్యజు లిచ్చుదానము లెవరి కీయవలయును?

ఉ॥ వారలిచ్చుదానములు వారిబ్రాహ్మణులకే యర్పింపవచ్చును. వంగదేశము మొదలైనచోట్ల నంత్యజబ్రాహ్మణులు దొరకనుగూడ

దొరకుదురు. కాని యట్టిబ్రాహ్మణు లితరబ్రాహ్మణులతోఁ బరస్పర వ్యవహారము నడపుట కష్టములుగారు.

౧౦ ప్ర॥ అట్లయినఁ జాతుర్వర్ణ్యాంతర్గత బ్రాహ్మణకక్షలో నంత్యజ బ్రాహ్మణులకుఁ బ్రవేశాధికార మేల లేదు?

ఉ॥ అట్టి నవీనకల్పితబ్రాహ్మణసంస్థ వేఱుగానే యుండవలసినదని బోధాయనసూత్రము బోధించుచున్నది కావునఁ జాతుర్వర్ణ్యాంతర్గత బ్రాహ్మణులతో వివాహభోజనపానాదికము కూడదు.

౧౧ ప్ర॥ హిందూధర్మములలో విధవావివాహావిధానము లేకుండుటవలన స్వరక్షణము చేసికొనలేక వారు తురకల నాశ్రయించుచున్నారు. అది తప్పించు నుపాయ మెయ్యది?

ఉ॥ స్త్రీలు వాస్తవముగా యవనధర్మములయందలి శ్రద్ధచే నా జాతులయందుఁ బ్రవేశించుట లేదు. లోభమోహాదిమూఢలగుచునే కదా ప్రవేశించుచున్నారు. నూలతియను గోల మ్లేచ్ఛునితో స్వయంవర మవలంబించిన ట్టితరస్త్రీలగతియు నయ్యెడిచో వారి నాపుటకుఁ దలిదండ్రులకు మాత్ర మేమి చేతనయ్యెడిని ? కనుక నట్టి నింద్యకర్మము వారు చేయకుండ నుండుటకు బహువారములు ధర్మోపదేశప్రచారము చేసి తదంతఃకరణదుర్బోధమాలిన్యమును బోఁగొట్టుటయే ముఖ్యము.

౧౨ ప్ర॥ ఒకవేళ జారులైన తురుష్కులు బలాత్కారముగా విధవల నెత్తుకొనిపోవుచో వారి రక్షించుట కెట్లు ప్రయత్నింపవలయును?

ఉ॥ జారులబారినుండి తప్పింపవచ్చునను నదియే నవనాగరికులకు విధవావివాహసమర్థనార్థమైన బ్రహ్మాస్త్రము - కావున స్వాభిప్రాయానుసారముగాఁ బునర్వివాహమే తద్రక్షణోపాయమని చెప్పుచున్నారు. కాని హిందూవీరులముండఱ యవనులు విధవలఁ బట్టుకొని చెఱచుట లజ్జాస్పదము కాదేమి ? హిందూసింహములు వారిని గాపాడఁ జాలమికి సిగ్గిలవలయును.

౧౩ ప్ర॥ ఆమరణము ననేకకష్టము లనుభవింపవలసియుండుటచే విధవలకుఁ బెండ్లి చేయకుండుటకు విచారింపవలవదేమి ?

ఉ॥ పాతివ్రత్యభూషితలైన భారతస్త్రీల ముఖము లితరస్త్రీలముఖములకంటెఁ దేజోవంతములై యుండుట లేదా ?

౧౭ ప్ర॥ పూర్వపతిసంబంధమైన వ్రతమును బరిపాలించెడి కుల స్త్రీల ముఖము లవశ్యము తేజోవంతములై యుండుననునది సత్యమే కాని కామార్తుల కేమియాధారము?

ఉ॥ కామోద్రేకముగలిగి పిచ్చియెత్తించినప్పుడు స్త్రీ కాముకుని దగ్గఱకుఁ బోవుచున్నది. కాని యది యెవరియాజ్ఞయుఁ దనపై లేక యుండిన నన్యమతస్థునిగూడ ననుసరింప నారంభించునని కామ శాస్త్రసిద్ధాంతము. కనుకఁ బునర్వివాహము చేసినమాత్రమున వారు నిస్సంశయముగా నన్యమతములఁ బ్రవేశింపకుందురనుట సర్వదా భ్రాంతి. స్త్రీ లేవిధముననుగూడఁ గామవేగము నణఁచుకొనలేనపుడు మరల వివాహము చేసికొని పౌనర్భవకులమందు స్వనిర్వాహము చేసికొనుటకు సమర్థులగుచున్నారు. అట్టిసంఘము శాస్త్రసిద్ధమైన స్వానుకూలధర్మము నాశ్రయించి పవిత్రులైన బ్రాహ్మణులకంటె వేఱుగానుండుట కవశ్యముగా నధికారమున్నది. కాని వేదోక్తమైన పాతివ్రత్యము యథావిధిగా ననుష్ఠించి యాత్మ నరికట్టి కామక్రోధాది శత్రుషట్కమును దిరస్కరించి జీవిత మంతయుఁ బవిత్రముఁ జేయు స్త్రీలకు లభింపఁదగిన విశిష్టస్థానము కామవశలై యింద్రియముల స్వాధీనముచేసికొనలేని యితర స్త్రీలకు నిర్దేశించుట కెట్లుశక్యమగును?

౧౮ ప్ర॥ పౌనర్భవజాతికిఁగూడ నొక సంస్కార మున్నదా ?

ఉ॥ వేదచోదితమైన యట్టి సంస్కార మేదియు లేదు. తాంత్రిక ములుఁ బౌరాణికములు నైన సంస్కారములు శాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నవి. వాని ననుసరించి యా పౌనర్భవులు ప్రవర్తింప వలయును.

౧౯ ప్ర॥ స్త్రీలు ప్రకృతము రోగనివారణార్థము మందులకనియు మాఁకులకనియు నన్యమతస్థుల యంతికమున కనుపఁబడుచున్నారు. అట్టిపట్ల వారుండు స్థలముల భృత్యులున్నగువారి నుంచక తప్పదు. దాన వారి పాతివ్రత్యమునకు గొప్ప కొట్టు సంభవించుచున్నది. కానఁ దత్ప్రతీకారార్థ మితరోపాయము లేవేని యున్నవా లేవా ?

ఉ॥ ఇట్టి ప్రధ శాస్త్రప్రకారము నడచుటలేదు. అక్కడ యథా యోగ్యమైన యుపాయ మనుసంధించి కొట్టులేనట్లు వైదికధర్మ

మర్యాదావిరోధముగా నంతటను సందటును వ్యవహరింపవచ్చును. అందువలన శాస్త్రవిరుద్ధమును హితప్రదమును నగు నొక ప్రథ మనము స్వయముగా వెదకవలయును.

౧౭ ప్ర॥ ఏబదియేండ్ల వృద్ధున కెనిమిదేండ్ల కన్యనిచ్చి వివాహము చేయఁబడుచుండఁగా విధవావివాహ మేల యావశ్యకము కాదు? ఆ సన్నమరణులైన యా ముసలివాండ్రు పెండ్లిచేసికొన్న పిల్లలకు వయస్సు రాకపూర్వమే వైధవ్యము గలిగించుచున్నారు. ఈ ప్రకారముగానే విధవలు లెక్కకు మిక్కిలి యగుచున్నారు.

ఉ॥ పునర్వివాహితయైన విధవను సంఘమునుండి వేఱుచేయవలసినదే. ఇచట శాస్త్రనిషేధము నివారింపఁదగినదికాదు. కాని మగఁడున్నప్పటికిని గామములీలని మగువ కేమి యౌషధము చెప్పెదరని మిమ్మడుగుచున్నవారము. ఆత్మ నుద్ధరించుటకుఁ జేయఁదగిన యుపదేశముఁ జేయుటయే ప్రయోజనముగాఁగలదికాని శాస్త్రము కామము దీర్చునదికాదు.

౧౮ ప్ర॥ శాస్త్రపాశహేతువువలననే స్త్రీలు పరమతములం బ్రవేశించుచున్నారు. ఏతద్రక్షణోపాయ మింక నెయ్యది?

ఉ॥ కామముచే నాక్రమింపఁబడినపుడు స్త్రీలవలెఁ బురుషులును నన్యధర్మముల నాశ్రయించుచున్నారు. కనుక వైధవ్యమే పరధర్మప్రవేశమునకుఁ బ్రబలకారణమను మాటనుండి పరధర్మవైధవ్యములకుఁ గార్యకారణభావ మెట్లుసిద్ధించును? వనితలు వైధవ్యహేతువునుండి యన్యధర్మముల నాశ్రయించుటలేదు. రక్షకుఁడులేకయు నంతఃకరణశుద్ధిలేకయు నాశ్రయించుచున్నారు. ధర్మోపదేశము మొదలైనవానివలనఁగాని తత్సంగాదులవలనఁగాని వారిని వారింపవలయును. శాస్త్రవిరుద్ధమైన పునర్వివాహము దెచ్చిపెట్టి కులస్త్రీలయందలి యాంతర్భావములను సంస్కరించుటకంటె వైదికధర్మరక్షణపురస్సరమగు నధ్యాత్మజ్ఞాన మనిశముం బ్రచరింపఁజేసి వారి కుభయలోకసాధనము నొడఁగూర్చుటయే యన్నివిధములను శ్రేష్ఠమయినపని. వైదికధర్మమర్యాదయందుండి బ్రహ్మచర్యమును బరిపాలించు

స్త్రీలనుగూడ సజ్జనగర్హితమైన యీ దురాచారమునందే బలాత్కారముగాఁ బ్రేరేపించుచు నేవిధమునఁగూడ నట్టిజ్ఞానము సంభవింపని స్త్రీలకు సంఘమందలి ప్రాగుక్తస్థానమే యీయవలయునని యేటి కీదురాగ్రహము ?

౧౯ ప్ర॥ పురుషుల కున్నంతధైర్యము స్త్రీలకు లేదని యిదికూడ నున్నదా ?

ఉ॥ సంశయాత్మా! ఈ కల్పనయైననో మిక్కిలి భ్రమావృతము. వినీతలైన పతివ్రతలకుఁ బతిమీఁదనుండు భక్తికంటె నతిశయమైన ధైర్యముండును. నమ్మకము లేకున్న సుశీలకులవనితలైన సీత దమయంతి మొదలగు పతివ్రతల చరిత్రము పరికింపవచ్చును.

౨౦ ప్ర॥ విధవ లవశ్యము తల గొఱిగించుకొనవలసినదని శాస్త్ర వచనప్రమాణ మున్న దేమి ?

ఉ॥ అందులకు శ్రుతియందు "మాత్వం వికేశ్యుర ఆవధిష్ఠా" (ఓవనితా! నీవు విగతశిరోరుహవగుచు రొమ్ము బాఁదుకొనకు) అని పతిశోకనివర్తనపరమగు ప్రమాణవచనము దొరకుచున్నది. దానిని బట్టి విధవల కేశవపనము ధర్మమైనకార్యమని స్పష్టముగాఁ దోఁచెడిని. మాత్స్యాది పురాణములయందును గాశీఖండాదులందును ననేకములైన మఱికొన్ని ప్రమాణములును గలవు.

౨౧ ప్ర॥ వర్ణాశ్రమస్వరాజ్య సంఘసభ్యులే కొందఱు తమరక్షణ ముందున్న స్త్రీలకుఁ గేశఖండనము చేయింపనిచో వారిని సంఘము నుండి పృథక్కరింపవలయునా వలదా ?

శాస్త్రమర్యాదను యథాశక్తి రక్షించుట సంఘముయొక్క ప్రధానోద్దేశము. అగ్నికార్యము మున్నగు పెక్కు నిత్యకర్మములు శాస్త్రోక్తములై యున్నయవి. కాని యనేకవిధములగు నాపదల కాకరమైనకాలమున శాస్త్రోక్తములైన సర్వకర్మములును యథావిధిగా నాచరించుట కశక్తులగుచున్నారు. పరిస్థితి ననుసరించి వానిలోఁ గొన్ని యథాశక్తి యాచరించుచు శాస్త్రమందు శ్రద్ధగలవారై విపద్దశయం దెట్లో కష్టకాలమును గడపుచున్నవారు. అట్లు ధర్మమును ధర్మముగాను నధర్మమును నధర్మముగాను జూచుచున్నచో నేకొంచి

మంది పరిస్థితిననుసరించిన విఘ్నములవలన శాస్త్రోక్తమైన సకలకర్మ జాతము ననుష్ఠించుటకు శక్తి లేకున్నను సంఘసభ్యులగుటకు సమర్థులగుచున్నారు. ఎవరు శాస్త్రప్రామాణ్యమున శ్రద్ధలేనివారై యధర్మమును ధర్మముగాను ధర్మ మధర్మముగాను నిర్ధారణసేయుచు స్వకపోల కల్పనారూపకమగు పొరపాటు పడుచున్నారో వారల గత్యంతరము లేకుండుటం జేసి యవశ్యము పృథక్కరింపవలసినదే.

౨౨ ప్ర॥ శ్లో॥ నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ। పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే॥ అను ధర్మశాస్త్ర వాక్యము విధవాపునరుద్వాహకర్మమునం దేల ప్రమాణము కాఁజాలదు?

ఉ॥ ఈ శ్లోకము వివాహప్రకరణమునఁ గనఁబడుట లేదు. ఇఁక నేమన పరాశరస్మృతి ప్రాయశ్చిత్తప్రకరణమున "యస్యా మ్రియేత కన్యాయా వాచాసత్యేకృతే పతిః, తా మనేనవిధానేన నిజో విందేత దేవరః" (ఒకని కీనిశ్చయించినతరువాతఁ బెండ్లికాకముందు వాఁడు మరణించిన వాని తమ్ముని కాకన్నియ నీవలయును)అని విధిఁజెప్పి మఱి యొకఁడును దానిఁబెండ్లాడవచ్చునని యితరవ్యవచ్ఛేద (నివృత్తి) పరిహారార్థ ముపన్యాసము చేయఁబడినది. పతిరన్యో విధీయతే యనఁగా మొదటఁజూపిన మఱఁదినిగాక తదితరునిగూడఁ బెండ్లిచేసికొనవచ్చునని యర్థము. తద్వచనాభిప్రాయము విధవావివాహవిధానార్థపరము గాదు. ఇట్లు మనుస్మృతి నవమాధ్యాయాంతర్గత "నాన్యస్మిన్ విధవా నారీ నియోక్తవ్యా ద్విజాతిభిః, అన్యస్మిన్ హి నియుంజానా ధర్మం హన్యుస్సనాతన" మను నఱువదియైదవశ్లోకము బ్రాహ్మణక్షత్రియవైశ్యు లెప్పటికిని విధవావివాహము చేయుటకు సాహసింపఁగూడదనియు నట్లు సాహసించినయెడల వీరియందును శూద్రలక్షణము ఘటించుననియు నీవీరి వ్యవసాయము పశుధర్మమనియు స్పష్టముగా నిషేధించినది. అటుతరువాత దశమాధ్యాయాంతర్గత పంచషష్టితమమగు "నవివాహవిధావుక్తం విధవావేదనం క్వచిత్, అయం ద్విజైర్హి విద్వద్భిః పశుధర్మో విగర్హిత" యనుశ్లోకము వివాహవిధియందెచ్చటను విధవావేదనము చెప్పఁబడలేదనియు విద్వాంసులైన ద్విజులచే నీ పశుధర్మము నిందింపఁబడినదనియు బోధించుచున్నది.

## —♦ మాతృస్మృతి ♦—

(రాయచూరు బండారావుగారు)

తే॥ శ్రీప్రజోత్పత్తివత్సరజ్యేష్ఠబహుళ(మునఁ జతుర్థిని గురువారమునను నాదు
మాతృదేవత తనకీర్తి ధాత్రినిల్పి) అసువులనుబాసి (దివమున కరిగె నకట!) ౧

తే॥ తొలుతజన్మించుకతనఁ దొల్దొలుత నీవె యిలను బాయుమటంచని నలువ నుదుట
లేఖనముఁజేసెఁ గాఁబోలు లేకయున్న (నేఁడు తమ్ములఁ జెల్లెండ్రి వీడి చనెదె. ౨

మ॥ నవమాసంబులుమోసి కన్నది మొద ల్నానావిధానంబులన్
పువుగాఁజూచుచుఁ బ్రేమ నన్బెనిచి మత్పుత్రా! చిరాయుస్స్వై
భువి వర్ధిల్లు(మురా యటంచు మది నా భూతిం గడుం) గోరుచున్
ది(వముంజేరఁగఁబోయినావె జననీ! నే నెంతయుం గుందఁగన్. 3

మ॥ (దయలే కీగతిఁ బోవనౌనె దివికిం దల్లీ!) కనన్ శూన్యమా
బయలే తోఁచెడు. నెట్టులూఁదనగు నాపాదంబు లీ యుర్విపై?
(అయయో! నీవెనువెంటవచ్చుటకు నీ యాసిస్సె యడ్డయ్యె. నే
చెయువుందోఁపదు. దేహయాత్ర యెటు నేఁ జేయంగలాఁడం గటా! ౪

ఉ॥ అక్కునఁజేర్చి రేఁబవలు నక్కజమౌకృపఁ గాంచు నీవె నా
యక్కఱ (తీరెనంచు మమునందఱ నిచ్చట) డించి స్వర్గమున్
మక్కువఁజేరఁబోయితివి మాదురదృష్టవశంబునం గటా!
(దిక్కిఁక మాకు నెవ్వరో సతీ! వివరింపఁగదమ్మ మ్రొక్కెదన్) ౫

ఉ॥ పుట్టినదాదిగా మివులఁ బూతచరిత్రవు నీవు చూడ. నె
ప్పట్టున నీకు జాడ్య(ములు వచ్చియెఱుం)గవు. షష్టివత్సరా
లిట్టులు దాఁటు నీకుఁ దుద కేర్పడె దుర్జ్వర. మైదురాత్రు లా
పట్టినపట్టుఁ బోవిడక ప్రాణము (లన్ హరియింపఁగల్గె హా! ౬

చం॥ అయిదవయేట నన్నయకు నంధత వాటిల నాఁటఁగోలె నే
నియమముతోడ సాఁకితివొ. నిండెను నల్బదియేడులింత. కా
నయ(మునువీడి నేఁ డకరుణన్ విపదంబుధిలోనఁద్రోసి హా!
ప్ర) యనముఁజేసి తద్దివికిఁ(బాపమునాకు ప్రసూ! ఇఁకేమనన్. ౭

శా॥ అమ్మా! యర్వదియే(ండ్లైకాని శతసంఖ్యాబ్దమ్ములా లేవు) రో
గమ్ముల్ పెద్దగ(వచ్చి యేవియును సుర్)క్కుంజేయఁగా లేదు. స్వాం
తమ్మా నాపయి నెన్నఁడేని విసువుం దా నొందఁగాలేదు. నా
కమ్మం (గూరిచి యేలపోవలసెనో కా నీ కకాలమ్మునన్ ౮

చం॥ జ్వరపడియున్నవేళ సహజన్ముఁడు రాములు లే(మి నాయనన్
గరమనురక్తిఁ జేటుటయొ) కాక సదా యల రామనామమే
మఱవక యుచ్చరించుటయొ మా(కెదియం చెఱుఁ) గంగనాను ? ఏ
(కరణినొ రామ) రామయనఁగాంచితి ముక్తి (నిజెంది తమ్మరో! ౯

ఉ॥ (చిన్నతనాన మాదుపిత) చేతసము న్విడనాడ మమ్ము న
త్యున్నతి నీదుసోదరుని యూఁతను బె(ంచితి వింతదాఁక నీ
వెన్నఁగ) నంత్యకాలమున నే ముపచారము (లం బొనర్పఁగా
నున్నను వానిఁ గైకొన కయో! కడతేఱితి వేమిచేయుదున్ ౧౦

తే॥ నాదుకరముల (నినుఁ జితి) నడుమనునిచి యగ్గిదరికొల్పినంతట బగ్గుమనుచు
మండుమంటలు హృదయమందుండఁగలిగి యార్తిగ(లిగించె నేమియొనర్తుఁదల్లి ౧౧

సీ॥ అరిగితే మమువీడి యనయమ్ము ననివార్యదుఃఖాంబుధింబడి తూలుచుండి
ఏగితే మమువీడి యేవేళఁ(గూడను నేపున నెవ్వగ యేఁ)చుచుండ
పోయితే మమువీడి బొందిలో జీవము ల్కాలదాఁక మనమందుఁ గలఁగుచుండ
చనితివే మమువీడి జన్మాంతముంగూడ నమితకష్టంబుల నందుచుండ
సుతసహోదరసోదరీస్నుప(లుఁ జెలులు) రేయుఁబవలును నీకు నీరీతి వగవ
(ముంచుమీ మీవిచారము లీమ్రతలలనె) కొట్టుకొండని దివినయో! మెట్టితమ్మ ౧౨

తే॥ అంబ! నీవు మదీయహృదంతరాళజనిత మోహ (ధనంజయజ్వాలలెల్ల
వేగ భవదీయసత్కృపావృష్టిగురిసి యార్పఁజూడుము) సుజ్ఞాన మ(లవడంగ) ౧౩

తే॥ ఉండు జనయిత్రి! రవిసోములుండు(దాఁక నరిగి వైకుంఠమందుఁబ్రహర్షమునను
యుష్మదాత్మకు సంతృప్తి(నొసఁగునటుల దండమర్పించుచుండు) గదాధరునకు.

—:o:—

అట్టి బ్రాహ్మణ తేజంబు నరసియున్న
వాఁడవయ్యును నాకర్మవశత నేఁడు
మఱచి సర్వంబు వేఱొకమాడ్కి భేద
బుద్ధి నెల్లిదపఱుపంగఁ బూనినావె ?

నిన్ననఁ బనిలేదు. "బుద్ధిః కర్మానుసారిణీ" యనునట్లు నాకర్మము ననుసరించి నాపై నీకిట్టి కనలు పొడమినది. అయిన ను నిపుడు మించిన దేమి ? ఎద్దాని కారణంబున మాతృదేశం బధిక దీనదశయందున్న సందిగ్ధసమయంబున దేశహితంబునకై దేవులాడు సంగడీండ్రతో ననుగమించుటకు వీలు లేకపోయెనో యెద్దాని కారణంబున నిజపౌరుషాభిమానములు నీరసంపడ ముండవిధంబున మూల డాఁగియుండవలసెనో యాబ్రాహ్మణత్వముతో నాకిఁకఁ బనిలేదు. ఆకారణంబునఁగదా బాలచంద్రుఁడు నాయోగమనంబున కష్టపడియె ! మాతృదేశహితంబున కనువుపడని యగ్రజత్వముతోఁ బనియేమి ? ఇప్పుడే త్యజించి నావారిని గలసికొనియెద. (జందెమును జేతఁబట్టుకొని) పూజ్యమగు నో యజ్ఞోపవీతమా !

సీ॥ నీమూలముననఁగదా నిగమాదివిద్యల
నభ్యసింపఁగ యోగ్యులగుట యెల్ల !
నీమూలముననఁగదా నిస్తులంబగు బ్రహ్మ
చర్యాదికంబులు సాగుటెల్ల !
నీమూలముననఁగదా నిరవద్యమగు తుది
పురుషార్థ మవలీల దొరకుటెల్ల !
నీమూలముననఁగదా భూమి నెల్లర చేత
భక్తినైనఁ బూజింపఁబడుట యెల్ల !

అట్టి నీయోగ్యతను మది నరసియుండి
దేశకాలానుగుణముగఁ దిరుగుచుండు

కారణంబున నిను వీడు క్రూరమతిని
కరుణఁజూడుము గాయత్రి ! కసరుకొనక.

(అని యజ్ఞోపవీతమును దెంచివైచి వీరావేశముతో) ఇప్పటికి యద్ధార్హుఁడనైతిని. బలే !

ఉ॥ గంగసుతుండొ యర్జునుఁడొ కంసహరుండొ యటంచు నెల్లవా
రుం గలయంగఁజూచి నను రోషమువీడి రయంబ పాఱిపో
సంగరభూమిఁజొచ్చి నిజసాహసముం బ్రకటించి నేర్పుగన్
భంగముసేయువాఁడ రిపువర్గములన్ నిముసంబులో పలన్.

(అని పోవుచు నెదుట నొకవ్యక్తియున్నట్లు పొడకట్టనున్మాదంబుతో ) తల్లీ! నీవెవ్వరవు ? న న్నాపఁజూచుచుంటివేల? (వినుట నభినయించి) ఏమనుచుంటివి ? దేశమాత ననియా ? కాదు. నీవొకమాయాస్వరూపవు. నన్ను మోసగింప శాత్రవులచేఁ బంపఁబడిన తుచ్ఛురాలవు. నిన్ను నమ్మను. పొమ్ము. పోకున్న నీయనపొ తూరకుండఁడు. వీనిఁ దొల్లిటి బ్రాహ్మణునిగాఁ దలంపకుము. ఆహవకేళి కడ్డుదగిలిన యగ్రజత్వమును త్యజించిన వీరరసాధిదేవతగా భావింపుము. (వెట్రిచూపుల నించుక నిదానించి) అయ్యో! కదలవేమి? (మఱియు నిదానించి ప్రసన్నతవహించి యున్మాదావస్థనుండియే) మాతా! వినయరహితుండనై నీయెడల నవిధేయత గనఁబఱచితినని కంట నీరిడుచుంటివా? బుద్ధిబుద్ధి. తప్పొనరించితిని. నాతప్పునైరించి దారి కడ్డమురాకుము. నీకు నమస్కరించెద. (అని మేడపినుండి యుద్ధభూమికి ఫలాహారములఁగొనిచను పిన్నక్కయను దాసి పాదములపైఁ బడును).

పిన్న॥ (నిలిచి విభ్రాంతితోఁ దనలో) కారెమపూడి కదనరంగమున కమితోత్సాహముతో బాలచంద్రాదులతోఁ గలసివచ్చిన యనపోతరా జిచ్చట నొంటరిగానుండుటేమి? నాకు మ్రొక్కుటేమి? (దూరముగాఁ బోయి) అగ్రజన్మా ? మేడపిలో నంతః

పురపరిచారికనగు నాకు భూసురశ్రేష్ఠుండవై రాజపుత్రిల చెలికాఁడవై మెలంగునీవు మిత్రుక్కూట వింతగనున్నదిచుమీ !

అనపో॥ అమ్మా ! అంతఃపురపరిచారికవా ? (నిస్పృహతో) అయిన నేమాయె ?

పి॥ భూసురాగ్రణీ! అట్లనరాదు. శ్లో॥ దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్, తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమ దేవతా॥ యని శ్రీకృష్ణుఁడు చెప్పియుండఁడే ?

అన॥ ఉండిన నుండవచ్చును. అవి యెప్పటిమాటలో·కాని ప్రస్తుతము నకుఁ బనికిరావు. ఎక్కువతక్కువలు విచారించుయోగ్యత పోయినది.

పి॥ భూసురాగ్రణీ! ఎదియేనికారణంబున జనించినవిసుఁగుచే లేదన్న మాత్రమునఁ బుట్టుకచేఁగలిగిన దైవనిర్ణీతమగు పూజ్యత పోవునా ?

అ॥ పోనిమ్ము, పోకుండనిమ్ము. కాలానుగుణముగా నెవరిగౌరవము వారు కాపాడుకొనుట కర్తవ్యము.

తే॥ సర్వవిధముల మాతృదేశంబు హితముఁ
బాసి పలుక్షోభలందెడు పట్టునందుఁ
గూడఁ గులగౌరవంబులఁ జూడనగునె ?
తలఁప నభిమానహీనమా కుల మదేల ?

పి॥ అట్టివిచార మిప్పు డేటికివచ్చినది ?

అ॥ ఏటికివచ్చినదని చెప్పఁగలను. గ్రహచారవశమున. పూర్వజన్మపాప ఫలంబున. మత్కులప్రభావమున. భ్రాతృసమానునిగాఁ దలపోసి నిష్కాపట్యమున బాలచంద్రుని గొలుచుచున్న కారణమున.

పి॥ విప్రోత్తమా ! నీమాటలు వింతగనుండి నాకు బోధపడుటలేదు.

అ॥ చాలని వేళలం దట్టులే తటస్థించుచుండును.

పి॥ అయ్యా! చిరాకుపడక సవిస్తర మాలోచింపుము.

అ॥ ఆలోచించుట కేమున్నది? తల్లీ! నీవిప్పు డెందరుగుచుంటివి?

పి॥ కదనరంగంబున కేగిన వీరనాయకులకు ఫలహారములం గొనిపోవు చుంటిని?

అ॥ మాతా! కాదు వీరమాతా! నాజన్మముకంటె నీజన్మమే పరిపక్వమైనది.

ఉ॥ ఎయ్యది మాతృదేశహితమే ప్రకటింపంగ యోగ్యమయ్యెనో
ఎయ్యది వీరవర్యులకు నెప్డు విహారభూమియయ్యెనో
ఎయ్యది శూరులాత్మలను నెప్పుడుం గోరుచునుండెనో యట్టిదా
కయ్యముసేయు వైఖరులం గాంచుభాగ్యము నీకుంగ లైంగా!

పి॥ నీవును దక్కదనరంగంబున కేలపోకుంటివి?

అ॥ తల్లీ! చెప్పితినిగదా! బాలచంద్రుని నియోగమున నాకిట్టిపాటు తటస్థించినది. ఆసంగతి పూర్ణముగ వినిపించెద వినుము.

ఉ॥ ఆఱుగు రన్నదమ్ములము నాహవభూమికిం బోయి ధీరతన్
పోరొనరించి దేశహితముం బ్రకటించుటకున్ దురాత్ములౌ
వైరుల యుక్కడంచుటకు వచ్చుచునుండంగ నింతలోన నీ
తీరున నాకు బాలుండు విధించె, నిం కేమని చెప్పనోపుదున్.

పి॥ ఏమేమీ? మీలో మీకే భిన్నాభిప్రాయము లేర్పడెనుగా?

అ॥ అందఱియెడలను లేదు - నాయొక్కనియందే.

పి॥ ఎట్లు?

అ॥ ఎట్లని చెప్పంగలనమ్మా!

ఉ॥ బాలుండు నన్ను వెన్కకెటొ పంపంగ నాత్మం దలంచియుండెగాం
బోలును! అందుకై తనదు ముద్దులయుంగరమొండు రాత్రి మాం
చాలకు నిచ్చివచ్చితిని, తయ్యన దానిని గొంచు రమ్మనన్
మేలని వాని మాయ గననేరక యాపనిమీంద నేగితిన్.

పి॥ మంచిమాటయే. నీయం దపక్షపాతప్రవృత్తియుండుటచేతనే కదా యంతఃపురకాంతల చెంతకుఁ జిన్నసిపినది!

అ॥ అట్లనఁబోకుము. అపక్షపాతప్రవృత్తిగాదు. కపటవర్తన. వచ్చులోపల నా కెన్నియో యూహలుపుట్టి వెనుక కేగుమని తెలియఁజేయు లేఖ నీతకున్నఁ గస్తి తక్కినవారలంగూడి కదనరంగంబున కేగినాఁడు.

పి॥ అట్లుచేయుటకుఁ గారణ ముండవలదా?

అ॥ వేఱు కారణము లేదు. నాయం దెట్టిలోపమును లేదు. కాని

ఉ॥ నేనఁట బ్రాహ్మణుండనఁట. నిల్చి రణంబునఁ బోర నర్హుఁడన్
గానఁట నన్ను వెంటఁగొని కయ్యముకేగిన బ్రహ్మహత్యదో
షాన నతండు పోవునఁట. అందుల కట్టి కుయుక్తిఁ బన్ని యి
ట్లానతియిచ్చెనంట. కలవా భువి నింతకుమించు కార్యముల్.

పి॥ దుర్భరమే. ఇది నీకు మచ్చం దెచ్చిపెట్టినట్టె యగు. బాలచంద్రుఁ డీవిషయమున మిగులఁ బొరపడినాఁడనవలయును.

అ॥ అనరాదు. అతనికిఁ బొరపాటె లేదు. అది నాగ్రహపాటు

ఉ॥ వీరుఁడనై మదించు నరివీరుల తేజ మడంచి యుద్ధసం
చారము చేయుచున్ హితులచాడ్పునవర్తిలు భాగధేయ మీ
పాఱున కుండకుండుటను భ్రాతృసమానుఁడు బాలచంద్రుఁడా
తీరునఁ జేసెఁగాని కలదే యరయంగఁ బరాకు వానికిన్.

ఇది దైవకృతముగా భావింపవలయును. అన్నివిధములను వ్యర్థుండనైతిని. ఇటు సోదరులకును నటు దేశమునకును గొఱగాని జన్మ మెత్తితిని. ఈ నిరర్థకజన్మమున మొండినై జీవించి నను నేమిప్రయోజనము? చావెప్పటికైనను రాకయుండునా? తనవారికిని దనదేశమునకును సమయమువచ్చినపు డుపయోగింపని జీవి జన్మ మొకజన్మమని చెప్పనగునే? నాయీశుష్కవేదాంతములతో నీహృదయమున కాటంకము గలిగింపరాదు. కావున నావిన్నప మాలకించి యీవొప్పులోని యజ్ఞోపవీత

మునకుఁ దోడు నార క్తమాంసముల నింపుకొనిపోయి బాలచం
ద్రున కొసంగి వానితోడను దక్కటిసంగడీండ్రతోడను

సీ॥ ఏయది యాటంకమా యెన్నో ననునీవు
వీడ నాబాహ్మ్యాంబు వీడెననుము.
కలకాల మతిమైత్రిఁ గలసియుండెడు వాని
నోంటిఁ జేయు టనన్యాయంటిననుము.
మాయినైన హితుసై మమత్వంబు వీడుట
చెనటితనంబని చెప్పెననుము.
జన్మజన్మంబునఁ జక్కగా నీయాజ్ఞ
శిరసావహించి వసింతుననుము.
సంగడీండ్రకు మాతృదేశంబునకును
పనికిరానట్టిజన్మంబు వ్యర్థమనుచుఁ
దలఁచి యనపోతు దాఁఖాబ్ధి దాఁటలేక
వికటములు పల్క క్షమియింప వేఁడెననుము.

మఱియు

సీ॥ నిజదేశరక్షణనియతి నుండఁగఁజాల
నందుల కెంతయుం గుందెననుము.
యుద్ధరంగంబున నుపయోగపడనట్టి
తనువు వ్యర్థమటంచుఁ దలఁచెననుము.
మర్త్యుడైన కెపుడైన మరణంబుతప్పదం
చెదలోన మఱి నిశ్చయించెననుము.
వీరులు సర్వదా విహరించు దివి నింక
వసియింప వ్రతమును బట్టెననుము.
తద్వ్రతంబున కపుడె యుద్యాపనంబు
సలుపుటకుఁగాఁగ ననపోతు శౌర్యమునను
కఱకుకత్తిని దనతల నఱకి కొనకు
హరహరాయంచు స్వర్గతి కరిగెననుము.

(అని కత్తితోఁ దలనఱకికొని పడిపోవును)

పి॥ (చూచి విస్మయముతో) ఆహా! ఎంత ధైర్యము! ఎంత తెంపు! ఎంత శూరత ! మాతృదేశభక్తియన నిట్టులకదా యుండవలయు !

ఉ॥ వాసికి లేనిపోనియలవాట్లుగ వేదికలందుఁ బెక్కుప
న్యాసములిచ్చి యిచ్చఁ గ్రియలందున మూలలడాఁగు నాదుర
భ్యాసులరీతిఁగాక నిజపౌరుషముం బ్రకటించి ప్రాణముల్
దోసిట వీడె. నీయనఘుతో సరివా రిలఁ గల్గనేర్తురే !

అబ్బా ! క్రిందఁబడినతలయుఁ జెఱునవ్వు వెలయించుచుఁ జూపఱ కానందకరమగుచుండె. ఇట్టిపౌరుషశాలు లుండుట చేతనే భారతభూమి కేనాఁటికిని ఖ్యాతి తఱుఁగకున్నది. ఈయనఘుని యభీష్టప్రకారము కొన్ని కండలు దోన్నెలోఁ బెట్టుకొనిపోయి బాలచంద్రున కొసంగి సర్వము నివేదించెద.

(అని నిష్క్రమించును).

(యుద్ధభూమి సమీపమందలి శిబిరములచెంత మలిదేవుఁడు కొమ్మరాజు బ్రహ్మనాయఁడు కన్నమదాసు చింతపలిరెడ్డి కోటకేతుఁడు ప్రవేశింతురు)

బ్రహ్మనాయ॥ చింతపలిరెడ్డి ! చివరకు నీనిశ్చితాభిప్రాయమేమి ?

చింతపలిరె॥ వేఱభిప్రాయమేమున్నది ? ఎట్లైనను దొలుతటిప్రసంగములు మాని చిరకాలజనిత క్రోధానలముఁ జల్లార్చి సంధి సేయుట యుత్తమము.

మలిదేవు॥ తండ్రి ! మరల నిదేటివిపరీతము ? ఎక్కడిరాయబారము ?

చం॥ దురమన నెంతయుఁ మదిని దొట్రిలు చాదిని సంధికంచు వే
మఱు మన మెన్నొ యత్నములు మంచిగఁ జేయ గ్రహింపలేక భీ
కరరణమొందు గూర్చి లయకాలము దాపురమైనయట్టి యీ
తరుణమునందు సంధికి వృథా తలపోఁతలు సిగ్గుగాదొకో ?

ఈయత్నముచేతనే యలరాజును జేతులారఁ జంపుకొంటిమి. ఇప్పు డింకేమికావలెనని మీతలంపు ?

కొమ్మరా॥ కుమారా! నిజముగ్రహించితివి.

తే॥ ఆత్రికాఁపని వేని బిట్టిపహసించు
చుందువో యట్టి పేర్మిని యూహలెల్ల
నిజములంచని తెలిసెనా నేఁటికైన?
అన్నిటికి బ్రహ్మనాయఁ డొజ్జగునుగాదె!

బ్రహ్మనా॥ (తనలో)మత్కాఁపునకు క్రోధము నణంచుకొనలేక పుత్త్ర మరణకారణమైన జనినాటి యుద్ధముతో చల్లారిన కొమ్మరాజు క్రోధాగ్నిని నిజవాగింధనములు గుప్పి మరలఁ బ్రజ్వరిల్లఁజేయు చున్నాఁడు.

చింతపలి॥ (కోటకేతువైపు చూచును)

కోటకేతు॥ (జనాంతికముగఁ బంగపలితో) ఇంతలోఁ దొందరపడ నేల? వారివారి ప్రత్యేకాభిప్రాయముల వ్యక్తపఱుపనిమ్ము.

కొమ్మ॥ నీరాగిణి! ఎందుల కీయసహాయనిశ్చేష్టత?

ఉ॥ శాంతి ప్రశాంతియంచు మనశక్తి నణంచుట నేర్చెఁగాని ర
వ్వంతయుఁ గ్రూర శాత్రవుల వర్తనలం దలపోయఁడాయె. వి
భ్రాంతిపడంగ నేల పరిపాటిగనుండిన మాటలందు? ఈ
పొంతలఁగూడ నుండ కొన పోదము. నాయఁడె సంధిఁజేసెడున్

బ్రహ్మ॥ బావా కొమ్మరాజా! బేలలు (అను వక్రోక్తిలో)

కొ॥ నిజమే. నీయాజ్ఞ దాఁటలేక యెన్నడుంటిమో నాఁడే బేలల మైతిమి.

మలిదే॥ నిజము. కొమ్మరాజు సత్యమును బలికినాఁడు

ఉ॥ అంతమునంతు లేనివసులంమనె భక్తి నిగుడ్చి మాకు నే
వంతలు చుట్టుకొన్న మది వాని నలక్ష్యముసేయుచుంట న
శ్రాంతము మా పరాభవ శౌర్యములన్నియుఁ జెరుమాసెఁబో
కాంతలకంటె హీనులముగా మనుచుంటిమి ధాత్రి నక్కటా!

## —♦ తులాపురుషదానమాహాత్మ్యము ♦—

ఆ॥ కాన నుభయలోకకాంక్షియౌ విద్వత్ప్రయాంసుఁ డోమహీశ ! మనమునందు
చంద్రసూర్యులు నిల్పి శ్రీద్ధ నీశివరాత్రివ్రతము నాచరింపవలయుఁ జుమ్మి " ౨౫౨

ఆ॥ అనుడు నశ్వసేనుఁ " డార్య ! సిద్ధేశ్వరమహిమ మెఱుఁ నామనమునకి బోధ
కా వచింపుమయ్య, కరము కుతూహలపడుచుమంటి నేను భావమందు " ౨౫౩

ఆ॥ అనిన భర్తృయజ్ఞుఁ " డనఘ ! సిద్ధేశ్వరోత్పత్తి మున్ను నీకుదెలిపియుంటి.
తఁగ వచింతు నిపుడు తద్దేవు దర్శించి చేయుదానమునను జెందుఫలము. ౨౫౪

కం॥ ఇలయెల్ల నేలనగుఁబో తులాపురుషదానమునను దోడఁ యన " నే
లలి సలుపవలెనో చెపు మత్తులాపురుషదాన " మనుచు నొక ప్రశ్నింపన్ ౨౫౫

సీ॥ " రవియును జంద్రుండు రాహుకేతువులచే గ్రసియింపఁబడినట్టి కాలమందో
మకరకర్కటకంబులకు గ్రహనాథుండు సంక్రమించెడి పుణ్యసమయమందో
చంద్రుండు పూర్తిగా సంక్షయంబందిన వరతిథియగు నమావాస్యయందో
పావనజలములౌ భాగీరథీముఖ హ్రదినీ పుణ్యతీర్థములయందో
విషువమందో సాధువిప్రుల కీతులాపురుషదాన మెలమి నొసఁగవలయు.
నని ప్రశంసఁజేతు రార్యులు భూపాల ! వినుము దానితెఱఁగు వినుతు నింక. ౨౫౬

కం॥ ప్రాగుత్తరముల వాలై బాగుగఁ గనఁబడుచునుండు పావనదేశం
బేగి పదియాఱుమూరలతోఁ గావింపఁగవలయు దొర ! మండపమున్. ౨౫౭

ఆ॥ దాని నడుమను యజమానుని మూరతో మూరెఁడెత్తు నాల్గుమూరల పొడ
వు వెడలుపును గలిగి పొలిచెడి యరుగొకం డమరిపింపవలయు నశ్వసేన ! ౨౫౮

కం॥ నాలుగుదిక్కులయందును నాలుగుమూరల చదరపు నాలుగుకుండా
లోలిని నైశాన్యంబగు మూలను నొకమూరకుండమును మఱియొకడున్ ౨౫౯

ఆ॥ వేయఁజేసి యచటఁ బిడివెత్తిమూరెఁడు గ్రహములుంచవలయుఁ గాశ్యపీశ !
ఇద్దరిద్దరినిగ నెల్లకుండంబులయొద్ద ఋత్విజాలను నుంచవలయు. ౨౬౦

తే॥ తచ్చతుర్వేదశాఖల ధరణిసురుల ద్వారమున వేల్పవలయును వహ్నియందు.
లలిని దక్షిణగమంత్రంబులను జపంబు శక్తియున్నంతవఱకును సలుపవలయు. ౨౬౧

ఆ॥ మూగలావు నాల్గుమూరల పొడవును గలుగు రెండు స్తంభములను వేది
ప్రక్క నుత్తరముగఁ బాఁతించి యాదెజాతికట్టె వాని నడుమఁ బెట్టవలయు. ౨౬౨

సీ॥ మంచిగందపుమ్రానో మఱి దేవదారువో మారేడువృక్షంబో మఱిచెట్టో
చండ్రనో యశ్వత్థశాఖియో తుమికినో పేఁకమ్రాఁకో యట శ్రీకరములు.
ఈయెన్మిదింటిలో నేదేని యొకదానితో రెండుస్తంభము లూగ్గుముకొని
ఉట్లరెండుండిన యొకత్రాసు రచియించి స్నాతుఁడై శుభ్రవస్త్రములు దాల్చి

శ్వేతమాల్యానులేపనాన్వితుఁడగుచు లోకపాలురఁ బూజించి యాక్రమమునఁ
గంధమాల్యాదికంబులం గంబములకుఁ బూజ గావింపవలయును భూమినాథ! ౨౬౩

తే॥ తులకుఁ బుణ్యాహవాచన మెలమి సలిపి తనువునంగల సకలాయుధములతోడ
ప్రాఙ్ముఖంబుగఁ బడమటిపార్శ్వమందు నిలిచి యంజలి జోడించినిశ్చలముగ ౨౬౪

శ్లో॥ బ్రహ్మణో దుహితా నిత్యం సత్యం పరమ మాశ్రితా
కాశ్యపీ గోత్రతశ్చైవ నామతో విశ్రుతా తులా. ౨౬౫

త్వం తులే సత్యనామాసి స్వాభీష్టం చాత్మన శ్శుభం
కరిష్యామి ప్రసాదం మే సాన్నిధ్యం కురు సాంప్రతం. ౨౬౬

మ॥ అను మంత్రంబు జపించి యంతఁ దులయం దారూఢుఁడై శక్తియుం
డినయంతన్ రజతంబొ పుత్తడియొ యన్నంబైన స్వాభీష్టవ
స్తునికాయంబొ సమార్జితంబయిన దచ్చో నొండుశిక్యంబునన్
తనతోఁ దూఁగెడునంతయో యధికమో ధాత్రీశ! పెట్టింపనౌ. ౨౬౭

తే॥ ఉట్టిలోఁ గూరుచుండి యవ్యాజ నంత నభిమతంబగు దేవత నాత్మఁ దలఁచి
తత్ప్రియంబుగ సతిలాక్షత కలధౌతముగను విడువంగవలె జలములను జలము.

ఆ॥ ఉట్టివలననుండి యొయ్యన దిగి యంతఁ దక్కనుట్టినున్న తత్సమస్త
మవనిసురుల కొసఁగు నవ్వాని పున్నెంబు నవహితుండవగుచు నాలకింపు. ౨౬౮

సీ॥ జ్ఞాత మజ్ఞాతమౌ సకలపాపంబును బొలియించు నీతులాపురుషదాన.
మెంత యతీతమౌ నంతపాతకమును విరియించు నీతులాపురుషదాన.
మఖిలాపదలఁగూడ నంతంబునొందించుఁ ద్వరలోన నీతులాపురుషదాన.
మాధిని వ్యాధిని నావలఁదఱుముఁబో నరపాల! యీతులాపురుషదాన.
మొదవ దాత్మీయబంధువియోగ మెప్డు నీతులాభారమునఁజేసి భూతలేంద్ర!
మఱియుఁ గలియుగమున దీనిమహిమ మింతయని వచింపంగఁ దరము కాదవనినాథ!

సీ॥ ఇక్ష్వాకువంశమం దెవలేని సత్కీర్తి స్థాపించినట్టి దిలీపనృపతి
కరసహస్రంబుచే నరితిరస్కృతిసల్పి యలరిన కార్తవీర్యార్జునుండు
పృథివిని నేర్పుమైఁ బృథుగోవుగంజేసి యోషధులం బిండియున్న పృథువు
చక్రవర్తులలోన సమధికంబగు ఖ్యాతి గొనియున్న యల పురుకుత్సరాజు
మఱియుఁగొందఱు నీతులాపురుషదాన మాచరించి మహాధన్యులైనవార.
లట్లుగావున సిద్ధేశ్వరాంతికమున ముఖ్యకర్తవ్య మియ్యది భూమిపాల! ౨౭౦

తే॥ క్షితిప! శ్రీహాటకేశ్వరక్షేత్రమందుఁ గల సకలతీర్థములు దేవనిలయములును
నొకటి నిరీక్షింపఁగను నొకటి చూచుచు బ్రహ్మకైనఁ జేత వచింపఁగఁ జాలఁడేమొ వసుమతీశ.

కం॥ ఆదేవుని దర్శనమో కాదేః దత్స్వర్శనంబో కా కర్చనమో
ఏదేని తన్కునన్నియునీఁదగు సమధికఫలంబు నిచ్చునృపాలా ! ” ౨౨౨

## —♦ భూదాన మాహాత్మ్యము ♦—

వ॥ అని యిట్లు భర్తృయజ్ఞుండు వాక్రుచ్చుటయు నానర్తదేశాధిపతి ౨౨౩

కం॥ “ ఏకర్మం బొనరించినఁ బ్రకటమగు చక్రవర్తిపద మేతద్భూ
లోకమునఁ బడయనగునో వాకొను మోసంయమీంద్ర! వరగుణసాంద్రా! ” ౨౨౪

వ॥ అని యడుగుటయు వెండియు భర్తృయజ్ఞుండు ౨౨౫

సీ॥ ఉగ్రతపంబెంతొ యొనరించినంగాక మహీపతియగునె సామాన్యముగను ?
నియమంబు లెన్నియో నెఱవేర్చినంగాక యూరకయున్నదే యొదయఁదగుట ?
దానంబులెన్నియో తగఁ జేసినంగాక జననాథుఁడగుటకు సాధ్యమగునె ?
వ్రతము లనేకముల్ కృతములైనంగాక పార్థివంబబ్బునే ప్రజలకెందు ?
అట్టి దుర్లభమైనట్టి యవనివిభుత పొందినట్టి హిరణ్మయభూమి గౌత
మేశ్వరునియొద్ద శ్రద్ధమై నిచ్చెనేని చక్రవర్తియు నగునంచుఁ జాఁటె నలువ.

సీ॥ దైవతములకునుం దగుసహాయముచేసి వీరుఁడైనట్టి పురూరవుండు
దశవదనాద్యుగ్రదైత్యుల దర్పంబు నణఁచిన కార్తవీర్యార్జునుండు
శ్రమములన్నియు నోర్చి సత్యముం గాపాడఁజాలిన యల హరిశ్చంద్రరాజు
కురుపాండవాదుల కురువంశకర్తయై పరఁగియుండినయట్టి భరతనృపతి
ధుంధుమారుండు మాంధాత తొల్లి చక్రవర్తు. లవ్వార లాచక్రవర్తిపదము
గౌతమేశ్వరుసన్నిధిం గనకమయమయిన మహిం దగ నిడియె కా యొనసియుంట!”

వ॥ అనవుడు నశ్వసేనుండు ౨౨౭

కం॥ “ భగవానుఁడ ! యాభూమి నొసఁగఁదగు విధి యేదొ చెపుమ. సత్యంబుగ నే
నగుదును దాదృగ్దాతను బగతుర నిర్జించి చక్రవర్తినగుటకున్ ” ౨౨౯

వ॥ అని వాక్రుచ్చుటయు భర్తృయజ్ఞుండు మఱియు నిట్లనియె. ౨౩౦

తే॥ “ పలశతంబొ తదర్ధంబొ పంచవింశతిపలములొ స్వర్ణముం బెట్టి తీరిపింప
వలయు వర్తులముగ నుర్వి. నలుపఁదగదు విత్తశాఠ్యంబు భూదానవిధిని భూప! ౨౩౦

సీ॥ లవణేక్షుదధిదుగ్ధభువనమయంబులై చెలఁగుచుండెడి సప్తసింధువులను
పలయు మహేంద్ర హిమవదాదినామము ల్గలిగిన తత్ప్రస్తకులగిరులను

జంబూ కుశ క్రౌంచ శాకాదికంబులౌ దీపించు నయ్యేడుద్వీపములను
న్యగ్రోధనీపజంబ్వాదివృక్షములను గంగమున్నగునట్టి ఘనసదులను
మేరుగిరి మధ్యమందుండఁ జారుతరముగాను బంచపలంబులకేని కొదవ
గాని బంగారమునఁ జేయనైన భూమియందుఁ జిత్రింపఁదగు సంతటన్ మునీంద్ర!

తే॥ అట్టి సౌవర్ణమయభూమి నచరిపించి మండపములు తోరణంబును మండపంబు
గ్రహమహీసురపూజనకుఁగా రచించి యురుఁగు వేయింపవలె మధ్యమందు సరిగ.

అ॥ అచటఁ బంచగవ్యమాచరించి ప్రతిష్ఠితంబుఁ జేయవలయు ధాత్రి నంత
పావమానముఖ్యబహుమంత్రములను జేయింపవలయు స్నాన మింక నరుస. ౨౮౪

తే॥ అట్లు స్నానంబుచేయించి యంబరము ధరింపఁగంజేసి చక్కఁ బూజింపవలయు.
అట్లు పూజించి ధౌతాంబరావృతుఁడయి యంజలింబట్టి నిల్చి తద గ్రమందు ౨౮౫

శ్లో॥ త్వయా సంధార్యతే విశ్వం జగదేత చ్చరాచరం
తవ దానం కరిష్యామి సాన్నిధ్యం కురు వేదిని. ౨౮౬
శరీరేష్వపి భూతానాం త్వం దేవి ప్రథమం స్థితా
తత శ్చాన్యాని భూతాని జలాదీని వసుంధరే. ౨౮౭
యే త్వాం యచ్ఛంతి తే భూయ స్త్వాం లభంతే నసంశయః
ఇహలోకే పరేచైవ పార్థివం రూప మాశ్రితాః. ౨౮౮

క॥ అను మంత్రంబులచేతను ఘనముగ స్తుతియించి కలము గైకొని శ్రీవి
ష్ణుని హృదయపీఠఁజేరిచి కనుదమ్ములు రెండుమూసి కడుభక్తిమెయిన్ ౨౮౯

శ్లో॥ పాతాళా దుద్ధృతా యేన పృథ్వీ సా లోకకారిణా
అస్యా దానేన చ సదా ప్రీయతాం మే జనార్దనః ౨౯౦

క॥ అను మంత్రి ముచ్చరించుచు మును చేఁగొనియున్న సలిలమును సలిలమునన్
గొనకొని విడువఁగవలయును. చన దది బ్రాహ్మణునిచేత, క్ష్మాపయి విడువన్

శ్లో॥ ఆగతా చ యథాన్యాయం పూజితా చ యథావిధి
అస్మాకం త్వం హితార్థాయ యతేష్టం తత్ర గమ్యతాం. ౨౯౨

క॥ అను మంత్రంబున భూదేవిని వేగమ సాగనంపి విప్రులకున్ భ
క్తిని దా "నసాప్రవేదా" యను మంత్రి మ్ముచ్చరించు దర్పింపఁగనౌ. ౨౯౩

క॥ ఈవిధిచే భూదానము గావించిన పుణ్యరాజు ఘనకులమునన్
భూవర! రాజ్యభ్రంశం బేవడి ఘటియింప. దింక నేమనవలయున్. ౨౯౪

క॥ ఎవరు స్వరాజ్యభ్రష్టత నవమానముఁ బొందుచుందొ యవ్వారెపుడున్
సవినయముగ భూదానం బవనీసురులకుఁ బొనర్పనట్టిరు తలఁపన్. ౨౯౫

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణి, ఆదిలక్ష్మమ్మ బహద్దరుగారు,

గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు, హంపి.

౨ శ్రీ శ్రీ జగద్గురు అభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వాములవారు, పుష్పగిరి.

౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాదవరం.

౪ రామసింగుగారు - సెల్లుట్ల.

౫ ఇనిగెల వెంకటధర్మారెడ్డి సర్దేశముఖుగారు - ఆత్మకూరు.

౬ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

## పోషకులు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహద్దరు జమీందారుగారు-నూజవీడు.

౨ గూమారి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, హనుమకొండూరు

౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు

౪ సెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం

౫ చాగబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల

౬ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.

౭ టి. లక్ష్మణసింగుగారు, జనగాం

౮ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.

౯ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, రాజమండ్రి.

౧౦ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,

౧౧ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు, జమీందారుగారు-దేవిశి.

౧౨ సాకుంట శివరాజరావు దేశముఖ్ గారు, జగిత్యాల.

౧౩ కురికాల వెంకటేశ్వరరావుగారు దేశముఖు, పరకాల.

౧౪ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం.

౧౫ రామూరి సుబ్బయ్య, వెంకటరామయ్యశాస్త్రిగార్లు,

శ్రీ జగద్గురు విరూపాక్షసంస్థానామాత్యులు.

# అభినవసరస్వతి

సంపుటము ౧౩ | ప్రజోత్పత్తి నామ సం॥ ఆశ్వయుజమాసము. | సంచిక ౭


## కృతివిమర్శనము.

అజ్ఞానతిమిరభాస్కరము-ఇయ్యది రంకుసన్యాసియని పేరన్నికగన్న కె. యస్. బి. సరస్వతియను నొకకపటయతిచేఁ బ్రచురింపఁబడిన గ్రంథాభాసము. నిజాము రాష్ట్రమందలి కరీమునగరముజిల్లా చొప్పదండియను గ్రామమునఁ గూర్మయ్యపంతులను నొకగృహస్థు మేనగోడలు కామాంధతచే గ్రహగ్రస్తయయినట్లు నటించి స్వచికిత్సాకరణరూపశ్రమములకుఁ బతిబంధుప్రముఖులఁ బాత్రులంజేయుచు నుండు నెడ మార్గవశంబున నిక్కపటసన్యాసి యాగ్రామంబునకుం జని తద్గ్రహోచ్చాటనం బొనరింతునని వారియింటం బ్రవేశించి కొన్నిదినంబు లుండి యాపె కాంతరంగికమిత్రుఁడై తత్పతిబాంధవాదులచే వెడలఁగొట్టఁబడి యాకె గాంధర్వవిధివివాహితయైన తన భార్యయని యభియోగము దెచ్చి పరాజితుఁడగుటయే యీయన రంకుసన్యాసియని పేరన్నికగాంచుటకు ముఖ్యకారణము. దీనివలననే యాయన తత్త్వమంతయుం జదువరులకు బోధపడియెడు. ఇట్టి యసభ్యుఁడు వ్రాసి ప్రచురించిన గ్రంథ మెంత దౌర్భాగ్యముగానుండునదియు వేఱవ్రాయ ననవసరము. అయినను దిఙ్మాత్రముదాహరింతును. తనతో వ్యభిచరించిన స్త్రీ గాంధర్వవిధివివాహితయని రచ్చకెక్కినట్టి యితఁడు స్త్రీస్వాతంత్ర్యము స్త్రీశూద్రవేదాధికారము నానాజాతిసమ్మేళనము మున్నగునవి సాధింపఁజూచు నవనాగరికుఁడు. ఈయన దుర్వాదములఁ గృష్ణాజిల్లా గుడివాడతాలూకా శాయిపురాగ్రహారవాస్తవ్యులైన కూనపులి పూర్ణయ్యశాస్త్రిగారు సభాముఖంబునను బత్రికాద్వారంబునను శతధా ఖండించివైచినను దానే గెలిచితినని తనకుఁదగిన యాత్మజ్ఞులు సంతసింప నీగ్రంథముం బ్రచురించియున్నవాఁడు. పూర్వోత్తరసందర్భములు గ్రహింపక కొన్నిమంత్రములలో శూద్రాదిశబ్దము లున్నంతమాత్రమున వారికి వేదాధికారము నుపనయనగాయత్రీమంత్రోచ్చారణాధికారము నున్నట్లు వ్రాయుచు నాశూద్రాదుల కాశగొలిగించుచున్నాఁడు. శ్రుతిస్మృతిసూత్రభాష్యాదులలోని పంక్తులను జక్కగా నన్వయించుకొను పాండిత్యముగూడ నీయనకు సున్న. అయినను దయానందుఁడు వ్రాసిన పురుషార్థప్రకాశికలోని పంక్తులే కొన్ని తీసికొని యాయనపోయిన పోకయే యీయనయుఁ బోయి స్త్రీశూద్రాదులకు వేదాధికారముం గల్పించియున్నాఁడు. సంస్కృతమునందే కాక యాంధ్రమునఁగూడ నీగ్రంథకర్తకు సరియైన పాండిత్యము లేనట్లు లిందలి పంక్తులం బట్టి సుస్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. కూనపులి పూర్ణయ్యశాస్త్రిగారి సంస్కృతవాదివచనము లిందుదాహృతములు. అవి తప్పులతో నిండి శాస్త్రిగారి విద్వత్తకే కళంకముగఁ గలిగించునవిగా నున్నవి.

అయితే శాస్త్రిగారి విద్వత్తయు జి.యస్.బి.సరస్వతిగారివిద్వత్తయు నెఱింగినవారలు తత్త్వమే గ్రహించితీరుదురు. ఈగ్రంథమందుఁజేర్చిన యితరుల సంస్కృత వాక్యములు ముద్రణదోషములతో నిండియుండుటట్లుండ గ్రంథకృల్లిఖితాంధ్రభాషగూడ వ్యాకరణదుష్టమై కర్తృకరణరహితముగా నాంధ్రభాషావిదుల కన్వయించుకొనుటకే వీలులేని స్థితిలో నుండియున్నయది. దయానందు ననుకరించుచు నీయనయు గుణకర్మవాద మొనరించి దానికిఁదగిన చెత్తతోడనే గ్రంథమంతయు నింపియున్నాఁడు. ఈయన శూద్రవేదాధికారమును గుణకర్మవాదమును ఖండించి మల్లాది యాంజనేయశాస్త్రిగారియభినవసరస్వతిలోఁ బ్రచురించియుండిరి. శివపురపు వీరభద్రపాకయాజిప్రభృతు లీయనవెంటఁబడి పట్టుకొని తెనాలితాలూకా వెల్లటూరు మున్నగుగ్రామములలో సభలుజరిపి యాసభలలో నీయననోరు మూయించి సభాస్తారులగు శూద్రమహాజనులచేతనే బుద్ధిఁజెప్పించి యాకార్యక్రమమంతయుఁ బత్రికల ద్వారమున బహుధా ప్రచురించియున్నారు. అప్పట్ల నభినవసరస్వతియుఁ దత్సమాచారములు పలుమాఱు వెల్లడించియున్నది. ఏమేని యయియుండుఁగాక. ఇతఁడు శాస్త్రబద్ధమగు క్రమవాదమునకు వచ్చి నిలిచి తత్సిద్ధాంతితమైనవిధమున వర్తించువాఁడు కాఁడు. వేదాధికారమున్నదనియు బ్రాహ్మణ్యము సాధింపవచ్చుననియు బోధించి తల్లాలసులగు శూద్రుల వశవర్తులంజేసికొని స్వయముగను దచ్ఛాత్రద్వారమునను దుర్వాదములుచేయుచును బండితపరిషత్తులకుఁ బరాఙ్ముఖుఁడగుచును బరాజితుఁడయ్యుఁ బ్రతివాదులే పరాజితులైరని ప్రకటించుచును దేశమంతయు నల్లకల్లోలముఁజేయుచును దిరుగుచుండుటయే యీయనపని. కొంతకాల మేతన్మాయలకులోనై తెనాలి రేపల్లె గుడివాడ మొదలగు తాలూకాలలోని శూద్రు లనేకులు మెడకు జందెములుతగిలించుకొనియు నుపనయనములుచేసికొనియు వేదాలు సదువఁగడఁగియు బ్రహ్మద్వేషభూయిష్ఠులై పరాక్రమించుచుండిరి. ప్రకృతమంతయు నడుగువట్టినది. అన్నద్వేషముతోపాటు బ్రహ్మద్వేషమును వారిపతనమునకే యైనయది. ఎక్కడఁజూచినను దానరై యల్లరిమూఁకంగూర్చుకొని గోలసేయు జి.యస్.బి.సరస్వతిగారు ప్రకృతి మెటసంతర్ధానమయిరో వారిజాడయుఁ గనఁబడుటలేదు. అజ్ఞానతిమిరభాస్కరమనఁగా నిట్టివారురచించిన గ్రంథాభాసము కాని సార్థకమైన ప్రమాణగ్రంథము కాదు. తిలకాష్ఠమహిషబంధనవిధంబున నిది యిట్లపార్థముగాని యన్వర్థ*మేమాత్రమును గానేరదు.

<u>అద్వైతబ్రహ్మేశ్వరీతారావళి.</u> ఇది ప్రకృతము నెల్లూరులో నసిస్టాంటు జిల్లారిజిస్ట్రారుగా నుండిన భువనగిరి కోదండపాణిగారిచే వ్రాసి ప్రచురింపఁబడిన ౨౭ పద్యములుగల చిన్నపుస్తకము. భువనగిరివారు వఠ్యమువారు గుండువారు మొదలగువా రందఱును సమీపబంధువులు. వీరి పూర్వులకు గుంటూరుజిల్లాలో రేపల్లెకు ౩ మైళ్లదూరమందున్న కారుమూరు నివాసమైయుండ నందు వఠ్యము రామస్వామి శాస్త్రిగారు కాంచీపట్టణమున విద్యనభ్యసించి యన్యమతస్థులతోఁ జర్చించి యద్వైతసిద్ధాంతముల దృఢపఱచినకలంబునఁ దగ్గరుపు లద్వైతపరబ్రహ్మశాస్త్రియని పొరుష

నామం బొసంగినట్లును వీరు కాలధర్మమునొందినపిమ్మట వీరి ప్రియసోదరుండగు శ్రీకృష్ణశాస్త్రిగారు శోకాతిశయమున నొడలు తెలియకయుండుటయు దుఃఖ పడం చికొని రుద్రభూమిఁ బరీక్షింపుమను వాక్కాకసమునుండి వినఁబడినట్లును నట్లు చని చూడ నట లింగాకారము వెలసియుండినట్లును నంత నయ్యద్వైతపరబ్రహ్మశాస్త్రి గారి పేరుతో నాలింగంబును నద్వైతబ్రహ్మేశ్వరియను పేరుతో నమ్మవారిని బ్రతిష్ఠించి గుళ్లు గోపురములు కట్టించినట్లును నీ యద్వైతబ్రహ్మేశ్వరీతారావళీ పీఠికలో నుండు సూర్యానంతనరహరిరావుగారు వివరించియున్నవారలు. అటుతరువాత నీకుటుంబములయం దద్వైతబ్రహ్మేశ్వ ర్యద్వైతబ్రహ్మేశ్వరుల పేరు లనేకులకుఁ బెట్టుచువచ్చుచుండిరి. ఈ గ్రంథకర్త తల్లి పేరును నద్వైతబ్రహ్మేశ్వరమ్మ. ఆ పేరఁ బరంగు మాతృదేవతమీఁది భక్తిచేతనో తండ్రిగారి దేవ్యుపాసనమీఁది గౌరవము చేతనో వీరి పూర్వుల గ్రామమగు కారుమూరుమీఁది యభిమానముచేతనో కోదండపాణిగారీతారావళిని వ్రాసి ప్రచురించిరి. కవిత్వము మృదుమధురంబై యున్నది. వీరీగ్రంథమే కాక నాటకములు భాషాంతరీకరణములు పెక్కు వ్రాసియుండిరి.

అన్నపూర్ణ. ఇది యొక సాంఘికమైననవల. గ్రంథకర్త పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారు. అన్నపూర్ణయను నొక యువిద పాశ్చాత్యస్త్రీలవలెఁ బ్రౌఢయై స్వయంవరవివాహము చేసికొనుటయు నందువలనఁగలిగిన ఫలితము నిందలి ముఖ్యవిషయము. సనాతనధర్మవిషయమున మిక్కిలి పాటుపడుచున్న కనుపర్తి మార్కండేయశర్మగారు తమ స్వధర్మప్రకాశినిలోఁ బ్రచురించియుండుటయే యీనవలయొక్క ప్రాశస్త్యమును సనాతనధర్మబోధకతను జాటుచున్నది. పరిచ్ఛేద ప్రారంభములయందు మృదుమధురపదగుంభనగల యొక్కొక్కపద్యము తత్పరిచ్ఛేద కథాసూచకముగను నీతిబోధకముగను జేర్పఁబడియున్నయవి. ప్రస్తావానుగుణముగ నచ్చటచ్చటఁ గావ్యపురాణస్థ శ్లోకములుగూడ నిమిడ్చి గ్రంథకర్త తన తీర్థబిరుదమును సార్థకపఱచుకొని యున్నవాఁడు. గ్రంథమంతయుఁ జాల మనోహరము. వెల 1-0-0 "ఎడిటరు, స్వధర్మప్రకాశిని—కీలుపాకు, మదరాసు" అని వ్రాసినఁ బడయఁగలరు.

---

## — ♦ తత్త్వకథనము ♦ —

(మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులుగారు. పుష్పగిరిసంస్థానము)

హిందూసాంఘిక (అణఁచఁబడినజాతులవారి) స్థితియను శీర్షికతో నొకవ్యాసము...త్రిలింగలోఁ బ్రకటింపఁబడినది. దానిని వ్రాసినవారు స్థితిగతులను జక్కఁగ విమర్శించి సాంఘికస్థితిని దొలఁగించి లోకమునకు మేలుగలుగఁజేయవలెనను సదుద్దేశముతోడనే వ్రాసియుందురు. కాని శాస్త్రమును సరకుగొనక తా మనుకొనునదే ధర్మమని తలంచి పాపకార్యములఁ గొన్నింటి నవశ్యకర్తవ్యములుగను విధులుగను వ్రాయుచు సనాతనధర్మనిష్ఠులఁ దూలనాడిరి కాన దీని నిజము సమచిత్తులగు బుద్ధిశాలులకుఁ దెలియుటకై నే నీవ్యాసమును వ్రాయుచున్నాఁడను.

(౧) నవీనచరిత్రకారు లందఱును నొక్కి వక్కాణించి ఆర్యులు కొన్ని వేలసంవత్సరములకుఁ బూర్వ మధ్యఆసియాప్రాంతములనుండి హిమాలయమార్గమున భరతఖండమునకు వచ్చి యిదివఱ కిక్కడ నున్న జాతు లన్నియు దిగఁద్రొక్కి దేశము నాక్రమించిరని వ్రాసిన వ్రాఁతలను వీరు నమ్మక యార్యులు మొదటినుండియు భరతఖండవాసులే యనియు వీరు తమ విజ్ఞానశక్తిని ఇతరద్వీపములకుఁగూడ వెదఁజల్లిరనియు గ్రహించినందులకుఁ జాలసంతసింపవలసియున్నది. మానవజాతిసృష్టికి మూలపురుషుఁడగు స్వాయంభువమను వార్యావర్తమునం దవతరించినట్లు పురాణములు చెప్పుచుండఁగాఁ దత్సంతతియగు మనము దేశాంతరమునుండి వచ్చితిమనుటకుఁ దగిన నిదర్శనములు మృగ్యము. దూరదృష్టి దూరశ్రవణము మున్నగు శక్తులుగల మహాఋషులు ఖండాంతరములకు సంబంధించిన కొన్ని గాథల వ్రాసియుందురు. అంతమాత్రముచే వా రచ్చటివా రనుట యసంగతము.

(౨) పంచములు చాతుర్వర్ణ్యధర్మముఁ జక్కఁగ నిర్వర్తింపనందున బహిష్కరింపఁబడిన వ్యక్తులతోఁగూడిన సంఘమయ్యెనని వీరు వ్రాసిరి. ఇదిసరి కాదు. బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలనఁ గలిగిన సంతానము చండాలురని మన స్మృతులు చెప్పుచున్నవి. ఇటులే బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో నుత్తమజాతిపురుషులవలన నికృష్టజాతిస్త్రీలయందుఁ గలిగిన సంతాన మనులోమసంకరమనియు నికృష్టజాతిపురుషులవలన నుత్తమజాతిస్త్రీలయందుఁగలిగిన సంతానము ప్రతిలోమసంకరమనియు వారిధర్మములు వేఱువేఱనియు ధర్మశాస్త్రగ్రంథములు చెప్పుచున్నవి. శ్లో॥ స్యాచ్చండాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేనయ యని రమారమి రెండువేలసం॥ల క్రిందట నైఘంటికుఁడగు నమరసింహుఁడు చెప్పెను. గౌతమస్మృతి. అనులోమానన్తరైకాన్తర ద్వ్యన్తరాసు జాతా సవర్ణాంబష్ఠోగ్రనిషాదదౌష్మన్తపారశవాః. ప్రతిలోమాస్తు సూతమాగధాయోగవక్షత్తృవైదేహికచండాలాః — ఇత్యాదివచనములు కొండలలో నివసించు నుగ్రనిషాదాదుల ననులోమప్రతిలోమసంకరులలోనివారని చెప్పుచున్నవి. ధర్మశాస్త్రమిట్లు స్ఫుటముగఁ జెప్పుచుండఁగా నీ చండాలాదు లార్యులకంటెఁబూర్వ మీ దేశమున నివసించెడి ప్రజలని కొందఱును చాతుర్వర్ణ్యములోనివారలే స్వధర్మముల నాచరించనందున సంఘమునుండి బహిష్కరింపఁబడిరని మఱికొందఱును జెప్పుట నమ్మఁదగినది కాదు. ఈకులము లుత్పత్తిసాంకర్యమువలనఁ గలిగినవి కాని ధర్మసాంకర్యమువలనఁ గలిగినవి కావు. అనులోమసంకరు లుత్తములనియుఁ బ్రతిలోమసంకరులు నికృష్టులనియు వారిలోఁ జండాలురు చాలఁ దక్కువతరగతియనియు స్మృతులు చెప్పుచున్నవి. శబరు (లనియుఁ గి) రాతులనియు వ్యాధులనియు వాడఁబడు చెంచులును గోయలనియు ఘూంటాలనియు వాడఁబడు జాతులును సాంకర్యతారతమ్యమునుబట్టి చండాలురకంటె నెక్కువగనే మతవిషయమున గౌరవింపఁబడుచున్నవారలు.

(3) "హిందువులలో నాలుకోట్లజనులు పంచములని నీచముగఁ జూడఁబడుచున్నకతమున వారు మహమ్మదీయులలోను క్రైస్తవులలోను జేరుచున్నారు. అం

రులవలన మనసంఘము క్షీణించుచున్నది. కనుక వారి యస్పృశ్యతను దీసివేయవలయును. వారలను మనదేవాలయములలోనికి రానీయవలెను. పీఠాధిపతులును సన్న్యాసులును బయలుదేరి యిట్టిప్రబోధము సలుపవలయును” అని కొన్ని యూహలు కనఁబఱచిరి. ఇందుకు సమాధానము. హిందువుల సంఘము పరమతక్రాంతిచే క్షీణించుచున్నమాట సత్యము. ఆవిషయమయిన ఖేదము నవనాగరికులకంటె సనాతనధర్మపరులకు సహస్రగుణ మధికముగఁ గలదు. కేవల మీయొక్కదానివిషయమయియే కాదు. బ్రాహ్మణాది సద్వంశములలోఁ బుట్టియు నాంగ్లేయశిక్షావ్యామోహితచిత్తులై ఖైదీలవలెఁ జుట్టలు కత్తిరించికొని సకలపాపక్షయహేతువులగు సంధ్యావందనాదులుగూడ మాని భక్ష్యాభక్ష్యనియమములేక మడిమైలలఁ బాటింపక యందఱితో భుజించుచుఁ దమవలె నందఱును వర్తింపవలెనని బోధించు దేశనాయకుల మనుకొను వారివిషయమైనఁగూడ నింతకంటె నధికమగు ఖేదము గలదు. మహమ్మదీయులకు ఖురాను ప్రమాణగ్రంథము. క్రైస్తవులకు బైబిలు ప్రమాణగ్రంథము. హిందువులకు శ్రుతిస్మృతిపురాణములు ప్రమాణగ్రంథములు. ఆయాప్రమాణముల నుల్లంఘించిన యెడల నాయామతములనుండి భ్రష్టులగుదురు. ఖురానులోను బైబిలులోను... నే కులమువాఁడయినను దన్నియమానుసారముగ సంస్కారముల నొంది తన్మతములోఁ జేరవచ్చుననియు వారితో సహభోజనవివాహాదిసంబంధముల నందవచ్చుననియుఁ జెప్పఁబడియున్నందునఁ దచ్ఛాస్త్రప్రకారము వా రితరమతస్థులను దమమతములోనికిఁ జేర్చికొందురు. సున్నతులు సేసికొనమనికాని పందిమాంసమును భుజింపక మానమనికాని యెవ్వఁడేని పట్టుఁబట్టినయెడల నట్టివానిని మహమ్మదీయులు తమమతములోనికిఁ జేర్చుకొనరు. ఆదివారమునాఁడు దైవప్రార్థనముఁ జేయమనియు విగ్రహారాధనఁ జేయుదుమనియు నెవ్వఁడేని పట్టుఁబట్టినయెడల నట్టివానిని బ్రొటెస్టెంటుక్రైస్తవులు తమసంఘములోనికిఁ జేర్చుకొనరు. ఇట్టి మతనియమము లెన్నియో వారిలోఁ దండోపతండములు కలవు. హిందూమతమునకుఁ బ్రమాణములు శ్రుతిస్మృతిపురాణములు. వానియందు జాతిభేదములును స్పృశ్యాస్పృశ్యవిభాగములును నన్నియు సవిస్తరముగఁ జెప్పఁబడియున్నవి. హిందూమతమునకు సంబంధించిన యేజాతివాఁడైనను స్వజాతికి శ్రుతిస్మృతిపురాణములచే విధింపఁబడిన ధర్మముల నాచరించితీరవలయును. జనులు తిరుగుబాటుచేసినయెడల ధార్మికులైన ప్రభువులు శిక్షాప్రకారము వారిచే నాధర్మముల నాచరింపఁజేసెడివారలు. శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారి కాలమునుండియు నీధర్మనిర్ణయప్రాయశ్చిత్తవిధానాధికారము పీఠాధిపతులచేత నెఱవేర్పఁబడుచుండెడిది. ప్రభువులు వారలకుఁ దగుసాహాయ్యము చేయుచుండెడివారలు. కొంతకాలముక్రిందటివఱకు నిటులే వచ్చినది. ఇప్పుడన్ననో కలిప్రాబల్యముచేతనో పాశ్చాత్యవిద్యాపాండిత్యమహిమచేతనో జను లవినీతులై ధర్మమోక్షముల జోలికిఁ బోక యర్థకామములే పురుషార్థములుగ నమ్మి శ్రుతిస్మృతిపురాణములన్న నపహాస్యముచేయుచుఁ దమకుఁదోచినదే ధర్మమనియెంచి చార్వాకప్రాయులయి చండాలుర స్పృశించుచు వారితో భుజించుచు నితరులఁగూడ నట్లు చేయుఁడని యుపన్యసిం

చుచు రజస్వలావివాహము విధవావివాహము నసవర్ణవివాహము స్త్రీస్వాతంత్ర్యము సముద్రయాత్ర మొదలగు పనులు తాముచేయుచు నొరులఁ బురికొల్పుచు నట్టిపనులు శాస్త్రనిషిద్ధములుగనుక వానిమానుఁడనిచెప్పెడిసనాతనధర్మపరులను బండితులనుమతాధిపతులను దూలనాడుచు నిరంకుశులై వర్తించుచున్నవారలు. వీరికి రాజదండనము కూడఁ గార్యకారిగఁ గనఁబట్టదు. మొండివాఁడు బలవంతుఁడను సామెత యిప్పటిది కాదు. దీనికి సత్యాగ్రహమని యొక గౌరవనామ మిడియున్నారు. పట్టినపట్టు శ్రుతిస్మృతిప్రమాణసిద్ధమయినయెడల సత్యాగ్రహమే యగును. అట్లు కానియెడల దురాగ్రహము. వీరిది దురాగ్రహముకాని సత్యాగ్రహము కాదు.

(౮) పంచములుమున్నగు కడజాతివారలందు మనసంఘమునకు మంచిదయయే కలదనుటకు నిదర్శనములు పెక్కు గలవు. చచ్చినపశువుల చర్మములను హిందువులు పంచములకే యుచితముగ వదలివేయుదురు. అమ్మికొనుటలేదు. చర్మములచేఁ జేయఁబడిన పనిముట్లను వారలయొద్దనే కొనెదరు. వ్యవసాయముచేయుటలో వారిని బాలేరులుగను గూలివాండ్రుగను నియమించి పోషించెదరు. కఱవుకాలములోఁగూడ నెవరిపాలేరులను వారు శక్తికొలఁదిఁ బోషించి సాయముచేయుదురు. చర్మవిక్రయము నితరకులస్థులు చర్మవ్యాపారముచేయుటయు నవనాగరికుల కాలములోనిదే. ధర్మశాస్త్రములందుఁ బంచముల గృహములు గ్రామములకు వెలుపలగా నుండవలయుననియు వారి బావులు ప్రత్యేకించి యుండవలయుననియుఁ జెప్పఁబడియున్నందున ననాదికాలమునుండియు నట్లే జరుగుచున్నది. ఇది ధర్మనిబంధనముకాని ద్వేషనిబంధనము కాదు. నవనాగరికులయొక్కయుఁ గ్రైస్తవులయొక్కయు దుర్బోధలు ప్రసరించనిస్థలములలోని పంచములకును బ్రాహ్మణాదివర్ణములకు నునీకాలమునఁగూడనత్యంతమైత్రియే కలదు. ఏమాత్రము ద్వేషభావము లేదు. వారిని దమపంక్తిలోభుజింపఁజేయటవలనను దేవాలయము లోనికి రానిచ్చుటవలనను మైత్రి కలుగదు. ఉపకారాపకారములు సఖ్యమునకును ద్వేషమునకును హేతువులు. శ్లో॥ ఉపకారాపకారౌ హి లక్ష్యం లక్షణ మేతయోః అని ప్రాజ్ఞుఁడగు మాఘకవి చెప్పెను. అన్నదమ్ములకు సహభోజనాదు లుండినను గొన్నిస్థలములలో ద్వేషములు మనము చూచుచున్నాము. మనతోఁ బంక్తిభోజన దేవాలయప్రవేశాదులుగలవారలై యొందఱో స్త్రీకాంక్షచేతనో యుద్యోగలాభదృష్టిచేతనో క్రైస్తవులలోఁ గలయుట మన మెఱుఁగనిసంగతికాదు.

(౯) పంచములను మనసంఘములోనే యుండునట్లు ప్రబోధముచేయుట బ్రాహ్మణాదులకు ముఖ్యకర్తవ్యము. ఆప్రబోధ మిట్లుండవలయును.

ఓ పంచములారా! మీరు హిందూసంఘములోనివారలు. మనమందఱ మొక సంఘము. మనదేవుఁడు పరమేశ్వరుఁడు. ఆయనయే సాంబమూర్తిగను విష్ణువుగను మహాకాళీ మహాసరస్వతీ స్వరూపముగను బ్రకాశించి భక్తులకు భోగమోక్షముల నిచ్చును. మీ రట్టి పరమేశ్వరుని భజించవలయును. శివశివా రామరామ యనియు జగదంబాయనియు భగవన్నామముల నెప్పుడు జపింపుఁడు. మందిరములు కట్టుకొని భజనచేయుఁడు. గుళ్లుకట్టుకొని వానిలో దేవునివిగ్రహములను బెట్టుకొని పూజనే

యుండు. మేమును మీగుళ్లకు ధనసాహాయ్యము చేయుదుము. మీరు మాదేవాలయములలోనికిఁగాని బావులకడకుఁగాని రాకుఁడు. మేమట్లురానీయలేదని ద్వేషముచెందకుఁడు. మీయందు మాకు ద్వేషములేదు. మనము హిందువులముగనుక వేదశాస్త్ర పురాణములు ప్రమాణములు. అట్టిగ్రంథములం దుత్తమవర్ణస్థులు పూజించెడు దేవాలయములలోనికిఁ దక్కువవర్ణములవారు పోయినయెడల నాయాలయము లపవిత్రము లగుడు వానిని జెడఁగొట్టినపాపము మాకువచ్చునని యున్నందున మేము రానీయము. బ్రాహ్మణులలో వేదశాస్త్రములను నమ్మని నాస్తికులు మిమ్ముఁ దమపంక్తిలో భుజించుటకు రండని పిల్చినను మిమ్ముఁ జెడఁగొట్టినపాపము మాకుఁ వచ్చునుగనుక మేము రామని చెప్పవలెను. క్రైస్తవులును మహమ్మదీయులును మనదేవులయిన రామకృష్ణాదులను నిందింతురు. మన కనాదికాలమునుండి ప్రమాణములుగానున్న వేదశాస్త్రపురాణములను దూషింతురు. అట్టివారి మతములలోఁ జేరుట మనతండ్రితాతల కపకారము చేయుటయే యగును. "స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మోభయావహః" అనియు "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్" అనియు మనదేవుఁడగు శ్రీకృష్ణమూర్తి యేకులమువాఁ డాకులము ధర్మములో నుండుటయే మేలనియు నితరులధర్మములనాశ్రయించుట పాపకార్యమనియుఁ జెప్పెను. తనభర్త తన్ను మర్యాదగాఁ జూడలేదనికాని బీదవాఁడనికాని విడనాడి మఱొకపురుషుని బొందినస్త్రీ పతివ్రతకాఁజాలదు, లంజయనిపించుకొనును. హిందూమతమును విడనాడినయెడల మీగతియునంతియే. దేశీయక్రైస్తవుల నసలు తెల్లవారు పంక్తికి రానీయరు. అసలు తురకలు క్రొత్తగఁ జేరినవారి నట్టేచేయుదురు. కనుక మీరు దైవభక్తికలిగి పైవర్ణములవారలం దాదరము కలిగి భగవన్నామము జపించుచు దేవునిబూజించుచుఁ జరించినయెడల నింతకంటె నుత్తమజన్మమెత్తి కృతార్థులగుదురు. పరమతములలోఁ జేరవలదు.

అని యీరీతి బోధించుట న్యాయ్యము. పంచములతో భుజించినయెడలను వారిని స్పృశించి తగుప్రాయశ్చిత్తము చేసికొననియెడలను బ్రాహ్మణుఁడు పతితుఁడగును. ఆకార్యము చేసినందున వారును పతితులగుదురు. ఇట్టియధర్మకార్యము చేసినందునను జేయించినందునను దేశమే భ్రష్టమగును. "ధర్మఏవ హతో హంతి ధర్మోరక్షతి రక్షిత" అను మనుస్మృతివచనము ధర్మము హతమయినయెడల జనులనుహతము చేయునని చెప్పుచున్నది. ఇట్టి దుష్కార్యములు చేయువారికిఁబుణ్యఫలమగు స్వాతంత్ర్యము స్వప్నములోనయినను ఘటించుట దుర్లభము. అధికవిద్యావంతులగు మనకిందఱకు ధర్మముగఁదోఁచిన పంచమసంపర్కాదులను బూర్వాచారపరాయణులు కూడదనుట యుక్తముకాదని కొందఱందురు. ఇందుకు సమాధానము. అధర్మం ధర్మమితి యా మన్యతే తమసా వృతా, సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ (అధర్మమును ధర్మముగాను ధర్మమునధర్మముగను సకలపదార్థములను విపరీతములుగను దామసబుద్ధికలవారలు గ్రహింతు) రని శ్రీకృష్ణుఁడే యానతిచ్చెను. శాస్త్రనిషిద్ధములయిన చండాలసంపర్కాదులు విధులని బోధించెడి దేశనాయకులందఱును దామసులే గాన వారు చెప్పినట్లు వర్తించుట పాపకార్యమగును.

“ ఈసంస్కరణమును సనాతనులు ప్రసాదింపకపోవచ్చును. కాని వారి దివ్య ప్రసాదమున కిచ్చట నెవ్వరును జెయిచాచి కూర్చుండలేదని” యావ్యాసమున వ్రాసిరి.

ఇది నిజమే. “ శ్రుతిస్మృతిభ్యాం సుజనో నియమ్యతే, పరాపవాదేనతు మధ్యమోజనః, కషాయతోయాహతి చర్మఖండవ ద్దండేన నీచ స్సముపైతి మార్దవ” మని యభియుక్తులు చెప్పిరి. సత్పురుషుఁడు వేదశాస్త్రములకు బద్ధుఁడగును. మధ్యముఁడు పరాపవాదభీతుఁడగును. వీరికిఁ బరాపవాదభయము సున్న. మేము శ్రుతిస్మృతిబద్ధులము. మావద్ద దండశక్తిలేదు. అన్నపెట్టినది పెట్టకపోయిన వారు వినరు. మేము పాకము ముదిరినవారి కీవ్యాసము వ్రాయలేదు. సనుచిత్తులై హిందువుల మనుకొనువారి కొఱకు వ్రాసితిమి. శ్రుతిస్మృతిపురాణబద్ధుఁడు కానియెడల హిందువేకాఁడు. ఖురానుకుబద్ధుఁడు కానియెడలఁదురకయే కాఁడు. బైబిలుకు బద్ధుఁడు కానియెడలఁ గ్రైస్తవుఁడు కాఁడు. ఏప్రమాణములను నమ్మనివాఁడు మానుషకోటిలో లెక్కింపఁబడఁడు. వారి మాటలు మాకు గ్రాహ్యములుకావు. కాంగ్రెసునాయకులు రాజకీయప్రయత్నముల తోపాటు వర్ణాశ్రమధర్మ సంరక్షణముగూర్చియుఁ దీవ్రప్రయత్నము సలిపినయెడలఁ బరమేశ్వరసహాయముచే వీరికార్య మిదివఱకే నెఱవేఱెడిది. వీరు ధర్మధ్వంసమునకు నడుముకట్టిరి. కాన ధర్మసంస్థాపకుఁడగు పరమేశ్వరుఁడు వీరికిఁబ్రతికూలుఁడు గాకమానఁడని మాతలంపు. ఇఁక మేము చెప్పినపిషయములు ప్రమాణసిద్ధములనుటకుఁ గొన్ని వచనముల వ్రాయుచున్నాము.

పరాశరస్మృతి. అ ౬. శ్లో. ౪౬. గృహస్యాభ్యంతరం గచ్ఛే చ్చండాలో యదికస్యచిత్, తమాగారా ద్వినిర్వాస్య మృద్భాండంతు విసర్జయేత్, గోమయేనతు సమ్మిశ్రైర్జలైః ప్రక్షాళయేద్గృహం.(చండాలుఁడింటిలోనికి వచ్చినయెడల నతని వెడలఁగొట్టి కుండలుపాఱవైచి గోమయముతో నిల్లునలకవలెను) ఇది శుద్ధియని చెప్పఁబడినది. ఇట్టి చండాలుని దేవాలయములోనికి రానీయవలసినదని చెప్పెడివారు నాస్తికులుగాక మఱియెవ్వరు ?

పరా. అ. ౬. చండాలభాండసంస్పృష్టం పీత్వా కూపగతంజలం, గోమూత్రయావకాహార స్త్రిరాత్రా చ్ఛుద్ధిమాప్నుయాత్. (చండాలుగ కుండలతోఁ గలిసియున్న బావినీరు త్రాఁగినయెడల గోమూత్రముతోఁగాచినగంజిని మూడుదినములు త్రాఁగిన శుద్ధియగును) ఇట్టి చండాలురచే బావులలో నీరు తోడనిచ్చుట యెట్లు ?

పరా. యుగం యుగద్వయంచైవ త్రియుగంచ చతుర్యుగం, చండాల సూతికోదక్యా పతితానా మధఃక్రమాత్. చండాలురకు ౪ బారల యెడముగా నుండవలయునని చెప్పఁబడినది. ఇట్టివారిని స్పృశించుట యెట్లు ?

రజస్వలా వివాహము కూడదనుటకు శ్లో. కారవంతు రజస్వలాం. ఇత్యాదికము ప్రమాణము.

విధవావివాహము కూడదనుటకు ..కృత్వా ప్రదీయతే ఇత్యాదికము ప్రమాణము.

స్త్రీ స్వాతంత్ర్యము కూడదనుటకు పితారక్షతి కౌమారే భర్తారక్షతియౌవనే, పుత్రోరక్షతి వార్ధక్యే నస్త్రీస్వాతంత్ర్యమర్హతీత్యాదికము ప్రమాణము.

సముద్రయాత్రానిషేధమునకు "ద్విజస్యాబ్ధౌతు నౌయాతుః శోధితస్యాపిసంగ్రహః" ఇత్యాదికము ప్రమాణము. ఇట్టివి పరస్పరాసవచనములు కలవు. ధర్మములు నీకాలమునుబట్టి మార్చవలెనని కొందఱు నవనాగరికులందురు. అది సరి కాదు.

ధర్మాధర్మము లెల్లప్పుడు నేకరూపములు. ఈసంగతినే భగవద్గీతలయందు శ్రీకృష్ణభగవానులు: "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయం" అను శ్లోకము మొదలుకొని "సకాలే నేహామహతా యోగో నష్టః పరంతప, సఏవాయం మయాతేద్య యోగః ప్రోక్తః పురాతనః" అను వచనమువఱకు సృష్ట్యాదియందు నేను వైవస్వతమనువునకు ధర్మము నుపదేశించియుంటిననియు నట్టిధర్మము కాలక్రమముచే నశించినదనియు మరల నీకు నేనాధర్మమునే యుపదేశించుచున్నాననియు నిది బహురహస్యమనియుఁ జెప్పెను. దీనివలన సర్వకాలములందును ధర్మ మేకరూపము నియే స్పష్టము. ఏకాలమందైనను దొంగతనము వ్యభిచారము పుణ్యకార్యములగునా? సత్యముఁబలుకుట పాపకార్యమగునా? ఈకాలమందు సత్యమును జనులు పలుకఁజాలరు గనుక నసత్యముఁ బలుకుటయే న్యాయ్యమని యార్డ్లుచేయుట న్యాయ్యమగునా? ఇంద్రియనిగ్రహము దుస్సాధ్యముకదా యని వ్యభిచారమే ధర్మమని శాసనము చేయవచ్చునా? అట్లు చేయరాదు. ఎప్పటికిని సత్యమే ధర్మము. పాతివ్రత్యమే ధర్మము. అట్లే చండాలస్పర్శ మెప్పుడును నధర్మమే. యుగాంతములందుఁ గొందఱు మహర్షులు వాసనావశముచేఁగొన్ని యధర్మములఁజేసినను మంత్రశక్తిచేతను దపోబలముచేతను పాపమును నివర్తించుకొనెడివారలు. కలియుగమందు మంత్రశక్తియుఁ దపశ్శక్తియుఁ దగ్గినందున నట్టికార్యమును బొత్తిగా మానవలసినదని ధర్మజ్ఞులగు మహర్షులు వ్యవస్థచేసిరి.

భృగుః. సదోపవీతినా భావ్యం సదా బద్ధశిఖేనచ, విశిఖోఽనుపవీతశ్చ యత్కరోతి న తత్కృతం.

వ్యాసః. వినాయచ్ఛిఖయాకర్మ వినా యజ్ఞోపవీతతః రాక్షసం తద్ధి విజ్ఞేయం సమస్తా నిష్ఫలాఃక్రియాః, (శిఖలేకచేసిన సంధ్యాదికర్మములు రాక్షసములఁజెందును, నిష్ఫలములగును) అని స్మృతులు చెప్పుచుండఁగాఁ బగటివేషములవారివలెఁ గొందఱు ముండితముండులును మఱికొందఱు లుంఛితకేశులునై తమ పూర్వపురుషులవేషముల

నైన స్మరింపక సంధ్యావందనాది సులభసాధ్య సత్కర్మములఁగూడ మాని యొరులకుఁ దమ ధర్మముల బోధించుట హాస్యాస్పదము కాకమానదు.

గుంటూరులోని బ్రాహ్మణవైశ్యవివాదము లిట్టి యవకతవక వ్రాఁతలవల్లనే కలిగినవని యొక్క సుభాషితమును వీరు వ్రాసిరి. ఎవ్వరేని తనకు బాగుగాఁదెలిసిన సంగతినే వ్రాయవలయునుగాని యధికము వ్రాసినయెడల నదియే యవకతవక యగును.

పూర్వము శ్రీ శృంగగిరి పీఠాధ్యక్షులను గొందఱు శిష్యులు "ఇప్పుడు కొందఱు వైశ్యులు తమతండ్రితాతల యాచారమునకు భిన్నముగా వైదికసంస్కారములు చేయించుకొనుచున్నారు. ఇది న్యాయమా కాదా? గ్రంథరూపముగా సెలవీయవలయు"నని ప్రార్థింపఁగా వా "రాపస్తంబధర్మప్రశ్నములో "యస్యప్రపితామహాదినాను స్మర్యత ఉపనయనంతే శ్మశానసంస్తుతాః, తేషామభ్యాగమనం భోజనం వివాహమితిచ వర్జయేత్, తేషామిచ్ఛతాం ప్రాయశ్చిత్తం ద్వాదశవర్షం త్రైవిద్యకం బ్రహ్మచర్యంచరేత్, అథోపనయనం తత ఉదకోపస్పర్శనం పావమానాదిభిరితి ప్రతిపూరుషం సంఖ్యాయ వత్సరాన్ యావంతోఽనుపేతాస్స్యుః" (ఎవ్వని ముత్తాత మొదలగు వారికి (ముత్తాతకుఁ దాతకుఁ దండ్రికి) ఉపనయనము వేదమంత్రములతో జరుగలేదో యట్టివారితో భోజనవివాహాదిసంబంధము మానవలయును. అట్టివాఁ డుపనయనము కోరినయెడల ద్వాదశవర్ష బ్రహ్మచర్యము (పండ్రెండుసంవత్సరములు బ్రహ్మచర్యము) చేయవలయును. అటుపైనెందఱు మూలపురుషుల కుపనయనము కాలేదో యన్ని సంవత్సరములు కొన్ని మంత్రములతో నుదకోపస్పర్శనము చేసికొనినతరువాత వాని కుపనయనము చేయవలసినదని చెప్పఁబడినది. ఇప్పటివైశ్యుల కెన్నితరములక్రింద వైదికసంస్కారము నిలిచిపోయినసంగతియు నెవ్వరికిని స్ఫుటముగాఁ దెలియదు. గోత్రసూత్రశాఖాప్రత్యభిజ్ఞానములు నశించినవి. కనుక వారితండ్రి తాత ముత్తాతలతో పాటు ధర్మముల నాచరించుటయే శ్రేయస్కర)మని ధర్మాచార్యులు గనుక గ్రంథరూపమున వెల్లడించిరి.

ధర్మశాస్త్ర మెట్లున్నను సరే. మేము వైదికసంస్కారములనే పొందెదమను కొందఱు వైశ్యులు తమ యుద్దేశమునకు వ్యతిరేకముగాఁజెప్పిరి కనుక పీఠాధిపతుల సత్కరింపఁగూడదని తీర్మానము చేసికొనిరట. దానంజేసి గుంటూరులోఁగొంత వైశ్యసంఘము శ్రీ పుష్పగిరి పీఠాధ్యక్షు లాపురమునకు విజయము చేసినప్పుడు ప్రతికూలముగా వర్తించిరి. ధర్మశాస్త్రవిశ్వాసముగల మఱికొందఱు వైశ్యోత్తములు

పీఠాధిపతులు ధర్మశాస్త్రప్రకారము చెప్పిరి గనుక వారిని మాతండ్రి తాతల ప్రకారము సత్కరించెదమని భిక్షాపాదపూజాదిసత్కారముల జరపిరి. ఇది గుంటూరువృత్తాంతము. "యత్రిస్వప్రతిభామానం తస్మై శ్రీకలయే నమః" అని యభియుక్తులు చెప్పిన తెఱంగునఁ దాననుకొనినదానిఁ గాదన్నవాఁడు దుర్మార్గుఁడు. ఔనన్నవాఁడు ఘనుఁడనియే తేలినదికాని లోభమోహముల కధీనులుగాక ధర్మస్వరూపమును నిష్పక్షపాతముగాఁ జెప్పిన మహనీయులు పరమేశ్వరస్వరూపులే యనుదృష్టి జనులకుఁ దొలఁగిపోయినది. ఇదియంతయుఁ గలివిలాసము.

"ఏఖండమునను లేని వర్ణాశ్రమవిభాగము స్పృశ్యాస్పృశ్యభేదము నీభారతఖండమందేల యుండవలెను? ఇది లేనియెడలఁ దక్కినఖండములవారి కేమికొఱంత వాటిల్లినది? ఈభేదము నశించినను మాకు నష్టములే" దని కొందఱు పాశ్చాత్యవాసనావాసితులు వాదింతురు. ఇదంతయు నజ్ఞాన విలసితము. భూలోకమం దన్నిఖండములకంటెను శీతోష్ణసామ్యమునను నాధ్యాత్మిక విద్యాసంపత్తియందునను బాడిపంటలందునను నగ్నిపర్వతస్ఫోటన భూకంపాది మహోత్పాతములు లేకుండుటయందును బ్రధానతమమును సౌఖ్యమున కాటపట్టును భరతఖండమే యని యంద ఱంగీకరించినసంగతియే. సౌఖ్యాతిశయము ధర్మాతిశయమువలనఁగాని కల్గదు. ధర్మక్షేత్రే కురుక్షేత్రే త్యాది స్మృతివాక్యములు భరతఖండపుఁ బ్రత్యేకభాగములలోని నదులయొక్కయు క్షేత్రములయొక్కయు మహిమలను వెల్లడించుచున్నవి. చందనవృక్షములు మలయపర్వతమునందుఁ దక్క పెరుఁగవు. మఱొకచోటున నాటినను వెంటనే యెండిపోవును. కుంకుమపువ్వు కాశ్మీరమునఁగాని ఫలింపదు. కస్తూరీమృగము నేపాళమునఁగాని జీవింపదు. అటులే వర్ణాశ్రమధర్మము లీధర్మక్షేత్రమునఁగాని వృద్ధిఁగాంచవు. ఖండాంతరములందును ఋషభపుత్రులు పరిపాలించిన కాలములో వర్ణాశ్రమధర్మము లుండినట్లు పురాణములలోఁ గాన్పించును. అటుతరువాతఁ గాలక్రమమునఁ బరిపాలకుల యజాగరూకతవలన నశించియుండును. భరతఖండము సృష్టికర్తను దత్సంతానభూతులగుమన్వాదులకును వేదశాఖాప్రవర్తకులగు వశిష్ఠవిశ్వామిత్రాది మహర్షులకును నవతారభూమి యయినందున వారి తపోబలముచేత నిక్కడ నట్టిధర్మములు నిర్మూలముగ నశించలేదు. ఈభేదములు లేనందున నితరఖండములవారలకు నేమికొఱంతయని కొందఱు వాదింతురు. వారలకు సమాధానము. సప్తకోటిమహామంత్రములు జపించుటకును, బ్రహ్మలోకపర్యంత మహాపదవుల నందఁదగిన మహాక్రతువుల నాచరించుటకును నణి

మాదిసిద్ధుల నందఁదగిన యోగానుష్ఠానమునకును శాస్త్రీయమయిన యధికారము వర్ణాశ్రమధర్మపరులకే కలదు. తక్కినవార లెంత మహాపండితులయినను వర్ణాశ్రమధర్మబహిర్భూతు లయినందున వారి కీయధికారములేదు. అధికారములేకయే చేసినపని బాలక్రీడయగును గాని ఫలప్రదముకాదు. భరతఖండమున శూద్రాదుల కట్టి యధికారము లేకున్నను నట్టియధికారముగల బ్రాహ్మణాదుల శుశ్రూషచేఁ గృతార్థులగుదురు. తమకుఁగల యోగ్యతను సులభముగఁ బోఁగొట్టుకొనవచ్చును. మరల సంపాదించుకొనుట కష్టసాధ్యమగును. ఒకప్పు డసాధ్యముగూడనగును. ఒకకలక్టరకార్యము చేసి తన యుద్యోగమును సులభముగఁ బోఁగొట్టుకొనవచ్చును. అతఁడె మరల నాపనిని సంపాదించుకొనఁజాలఁడు. ఒకప్పుడు వ్యవహారవిషయములో నట్టి యవకాశమున్నను బారమార్థికవిషయమునం దట్టియవకాశ మెంతమాత్రములేదు. కనుకనే యీపాపిష్ఠ కాలములోఁగూడ నిందఱు విరక్తులు నిందఱు స్వధర్మనిష్ఠులు నిందఱుసన్న్యాసులు వర్ణాశ్రమధర్మనిష్ఠమగు నీభరతఖండమునఁదక్క నింక నేదేశమందును లేరని బహుజ్ఞులు చెప్పుదురు. కనుక నిట్టి భరతఖండమున జన్మాంతరపుణ్యవశమున జన్మించిన మనము ఖండాంతరవాసులఁబోలి యాశ్రమధర్మముల విడనాడుట పాపకార్యమనక తప్పదు. సర్వశక్తులుగల పరమేశ్వరుఁడు దేశప్రముఖుల చిత్తదోషముల శమింపఁజేసి ధర్మమును ధర్మముగాను నధర్మమును నధర్మముగాను బోధింపఁజేసి జనుల కిహపరసౌఖ్యంబు లొసంగుఁగాక. భరతఖండ మింగ్లండుగ మార్పఁబడకపోవుఁగాత.

ఈదేశనాయకులు జాతిమత కులధర్మముల నశింపఁజేసియే స్వరాజ్యము సంపాదింపఁదలఁచినయెడల నది స్వత్వఘాతుక మయినందున స్వరాజ్య మెన్నటికిని గానేరదు. ఆంగ్లరాజ్యమే యగును. అట్టి దుస్థితి మన భరతఖండమున కెన్నటికిని ఘటింపకపోవుఁగాత. ఇప్పుడు మనవారికేర్పడిన ధర్మవిప్లవము దైవికముగఁ బ్రారంభమైనదిగాని వేఱుగాదు. ఇది బ్రాహ్మణ్యమును బరీక్షించుట కేర్పడిన దైవమాయయని తెలియవలయు. దైవమాయామోహితులై చాండాల ధర్మములను స్వీకరించుచున్నారుగాని వేఱుగాదు. బుద్ధిమంతులగువారి కీమాయ ప్రమాదము చేయఁజాలదు. అల్పబుద్ధిగలవారలే దీనికి లోఁబడి చెడిపోయెదరు.

ఇట్లు మాయామోహితులై కులభ్రష్టులైన వారు మనలను నిర్బంధించినసహించుటకుఁదగు మతశ్రద్ధను వహింపవలయు. రాజ్యాధికారమువహించి వీరు చాతుర్వర్ణ్యధర్మమును రూపుమాపఁదలంచుచున్నారుగాని భగవంతుఁడు వీరికట్టివసతిని గలుగఁజేయఁడని తలంపవలయు! తమకార్యము గట్టెక్కవలయునని మాత్రము తలంచుచు

న్నారే కాని యస్పృశ్యతా నివారణముచే బ్రాహ్మణ్యము చెడిపోవుచున్నదని మాత్రము తెలియఁజాలకున్నది. అస్పృశ్యతను బాటించుచున్నపుడు చండాలురను పీడించినదేమాత్రము లేకున్నను నస్పృశ్యతా నివారణములో బ్రాహ్మణ్యము సంచారము చేయ వీలులేని గొప్పప్రమాదము తెచ్చిపెట్టుచున్నారు. బ్రాహ్మణ్యమునకుఁగల స్వేచ్ఛను వీ రక్రమముగ నాశనముచేయు మహాదోషు లగుచున్నారు. చండాలురకుఁగలమాత్రము వసతులనైనను బ్రాహ్మణ్యమునకుఁ గనఁబఱుపక బ్రాహ్మణాగ్రహారములనుసహితము పాడుచేయఁదలంచుటకు మించిన దోష మొకటి కలదా?

బ్రాహ్మణాగ్రహారములను గాపాడి వానియందుఁ జండాలురు రాకుండు వసతులను గనఁబఱుపనిచో బ్రాహ్మణ్యము నశించునుగదా? ఇప్పుడు నిర్బంధముగ బ్రాహ్మణ్యమును జంపినవారే యగుదురు. ఇట్టిప్రమాదములేకుండుటకై బ్రాహ్మణ్యము భగవంతునిబ్రార్థించి తమవసతులకు భంగము లేని సంరక్షణమును సంపాదించుకొనవలయు. బ్రాహ్మణ్యము చాండాలుర పల్లెలలోనికిఁబోనట్లె వర్ణవివేచనము పాటించని ప్రజలు బ్రాహ్మణాగ్రహారములలోనికి రాకుండినచో బ్రాహ్మణులకు వచ్చుచిన్నతనమెద్దియులేదు. అగ్రహారములనువిడిచి పట్టణములకుఁబోవలసిన నిర్బంధ మేర్పడినపుడు మాత్రము మట్లు పోయి మరలివచ్చి ప్రాయశ్చిత్తము చేసికొని స్వధర్మములుకాపాడుకొన వీలుండును. బ్రాహ్మణులందఱును వర్ణసాంకర్యము లేకుండునట్టి వసతులకుఁ దప్పక యత్నింపవలయు. ప్రళయములు వచ్చినప్పుడు గృహములను విడిచిపెట్టి ప్రాణము రక్షించుకొనునట్లె వర్ణసాంకర్య విప్లవ మేర్పడినపుడు పూర్వపునివాసస్థలములను విడిచిపెట్టి బ్రాహ్మణులందఱు నొక యగ్రహారముఁజేరి స్వధర్మ రక్షణమున జాగరూకులై యుండవలయు.

కాంగ్రెసు తీర్మానముల ననుసరించి ప్రజలు వర్తించు మతవిధానములో రానున్న ప్రమాదము దుస్సహమని తలంపవలయు. బ్రాహ్మణ్యమునకు స్వధర్మశ్రద్ధయుండినఁగాని ప్రభుత్వమువారి సహాయమున కవసరముండ నేరదు. బ్రాహ్మణులకే తమ ధర్మమందు శ్రద్ధలేనిచోఁ బ్రజాబాహుళ్యముయొక్క పద్ధతులే పోషింపవలసివచ్చి బ్రాహ్మణ్యమునకు సంరక్షణ ముండ నేరదు.

బ్రాహ్మణ్యము ప్రభుత్వసంరక్షణముతోనే బ్రతికి తీరవలయు. ప్రజాసామాన్యము బ్రాహ్మణులకు విరుద్ధముగానే వర్తించుననుటకు సందేహములేదు.

---

## ప్రాచీనగురుశిష్య పద్ధతి

:o:

(తిరుపతి వేంకటేశ్వరకవులు - శతావధానులు)

శా॥ బెంచీ లక్కఱలేదు. గేమ్సు మొదలౌ ఫీజు లివ్వన్ రాదు. పా
మ్మంచున్ నిర్ధనుఁ ద్రోసిపుచ్చరు గురుల్. ప్యాసైన నేలాభ మిం
దంచున్ నేమములేదు మీచదువునం దాలోక మీలోకమున్
గాంచన్ వచ్చెడి నార్యులార! మిము మ్రొక్కంజెల్లు నెక్కాలమున్. ౧

ఉ॥ తుక్కల నక్కలన్ గుఱిచి కోళ్ళఁ బోతేళ్ళ గుఱించి కాక మీ
రెక్కడఁ జూచినం ద్రిజగదీడ్యచరిత్రుని దేవునిన్ మహా
ఫక్కికమై నుతించు సురభాషను శిష్యులకిచ్చి వారిదౌ
వాక్కును దేహమున్ భవముఁ బావనముం బొనరింతు రొప్పుగన్. ౨

ఉ॥ చెప్పులకాళ్ళు ముండితపుశీర్షము శూన్యలలాటమున్ మఱిన్
గొప్పబడాయివేషములుఁ గుచ్చులపాగలుఁ గోట్లుఁ గంఠమం
దొప్పెడిపట్టము ల్గలుగు నోజ్జలు శిష్యులు నీకు లేరు మా
యప్ప! చిరాయువై బ్రదుకు మమ్మరా! వేదమ! నీకు మ్రొక్కెదన్. ౩

ఉ॥ చాపలె యాసనంబులఁట! జందెములే వర వారవాణముల్.
పాపముపాపఁజాలు నదిపట్టులు శాలలు. పుణ్యలోకముల్
చూపెడి మాలికల్ మెడకుఁ జుట్టినపట్టము. లర్థమీమియే
ప్రాపగు జీత. మిట్టిగురువర్యుల శిష్యుల మ్రొక్కు టొప్పదే. ౪

కం॥ ధనవంతులకన్నను నిర్ధనవంతులె ప్రీతిపాత్రితములగు శిష్యుల్.
వనమాలిఁ దెల్పెడే చదువన మాలిమి నెగడుమీకు నంజలిసేతున్. ౫

సీ॥ అరుణోదయమ్మగునప్పుడ మేల్కాంచి యాత్మానుసంధాన మాచరించి
ఆపగాదులకేగి యట స్నానమొనరించి రవి త్రియీమయుని కర్ఘ్యమ్ము లొసఁగి
తముఁబోలివర్తింపఁదగు శిష్యగణములు వెంబడిరాఁగ గృహంబుఁజేరి
నిన్న దండెంబుపై నించిన నీర్కావిపుట్టముల్ధరియించి భూతిఁదాల్చి
దేవతార్చనమొనరించి దేవదేవనామపూర్వకముగ వేదనాదమును ద
ధంగవిజ్ఞానమును శిష్యులనువదింపఁ గాలమేఁగించు పూజ్యుల గారవింతు. ౬

చం॥ నృపతులువచ్చి ద్వారమున నిల్చి నమస్కృతిఁజేసి పూర్తిగాఁ
దపమును లేచి యాపయిని దగ్గఱకుం జనుదెంచి "మీకు నే
డిపనియొ తెల్పుఁడీ యిపుడె తీర్చెద" మన్న "మాకేమిలోటులే
దపరిమితంబు సౌఖ్య" మనునట్టి తపస్వుల మిమ్ముఁ గొల్చెదన్. ౭

ఆ॥ చంకజోలితోడఁ జనుదెంచునట్టి విద్యార్థిఁ గాంచి బ్రహ్మ యరుగుదెంచి
నట్లు సంతసించి యన్నమ్ము వెట్టు పతివ్రతామణుల నుతింతు భక్తి. ౮

ఉ॥ "వారలు మీకు విద్యనిడ వారము లేమిడఁజాలమే" యటం
చాఱని పేర్మి దేవుగతి నారసి భక్తిని బెట్టి విద్యపై
తీఱనియాస్థఁజూపెడి విధిప్రతిమానుల నగ్రహారపుం
బౌఱుల వారిగేహినులఁ బాయనిభక్తి నుతించి మ్రొక్కెదన్. ౯

శా॥ ఏరాజుంగన నిచ్చలేమి "నెటులో యీపాట్లఁ బోషించియే
తీరంగావలె" నంచు "భైక్ష్య మది యెంతే శ్లాఘ్య" మం చెంచి యా
చారంబొప్ప గృహంబులేగి వెనుకన్ ఛాత్రావళు లారఁగ సం
సారంబీఁదుచు విద్యనేర్పెడి మహాసంస్కర్తలన్ మ్రొక్కెదన్. ౧౦

కం॥ భృతకోపాధ్యాయులఁగని మతిలో నేవమ్ముగాంచు మాన్యులకుం బ్రో
న్నత వేదశాస్త్రవిద్యారతులకు నుతులిడుదు రాజరాజనతులకున్. ౧౧

మ॥ శుచియౌ వేషము శుద్ధమౌ మతము సంశుద్ధంబు దేహం బని
ర్వచనీయంబగుపాండితీగరిమ ద్రవ్యంబం దనాసక్తి పూ
ర్వచరిత్రంబులయందు భక్తియును ఛాత్రశ్రేణిపై రక్తి గ
ల్గు చతుర్వేదుల సాంగులన్ నిరతమున్ లోనెంచి కీర్తించెదన్. ౧౨

మ॥ ఘను లుద్యోగులు వచ్చి "మీసుతునకుం గన్యామణిన్ మేటులౌ
ధనధాన్యాదులతోడ నిచ్చెద" మనం దత్కన్యఁ గైకోమనం
బున నిష్టంబదిలేక "మీర లతులు లప్పూఁబోఁడి మాకన్నె మే
మనఁగా రిక్తుల" మంచుఁ దప్పికొను మిమ్మర్చింతుఁ బుష్పంబులన్. ౧౩

చం॥ ధనమును భూమియుం దమకుఁదామయి యిచ్చెడి రాజులుండ నం
దనులకు విద్యరాదు ధనధాన్యవశంవదులైన నంచుఁ గై
కొనక యెటో కుటుంబమునకున్ భృతిగూర్చుచు నిస్పృహత్వమే
ధనముగఁ గాలమున్ గడపు ధన్యులఁ బూర్వుల నాత్మ నెంచెదన్. ౧౪

ఉ॥ రాజమహేంద్రమునప్పటి కరంటులతోఁటకుఁ గొప్పాత్రివృత
మ్మాజనపాలుఁ డొయ్యఁగని "యార్య! కృతార్థుఁడనైతి మీకు స్వ
ర్భాజము లెక్కలేదయిన భూమియొ ద్రవ్యమొ స్వీకరించి మా
తేజముఁ బెంపుఁ"డన్న గణుతింపనిసూరుల నాశ్రయించెదన్. ౧౪

ఉ॥ పుట్టితి పెట్టులో యిచటఁ బుట్టినయూ రెటువీడవచ్చు ని
ప్పట్టున నే వసించి బుధవర్యులఁజేసెదఁగాక శిష్యులన్
బెట్టెద నేన యన్నమని పేదతనం బనుకోక దాతలన్.
బట్టి స్వశిష్యులంబెనుచువారి నుతించి యశంబు తుఱ్ఱించెదన్. ౧౫

ఉ॥ పెట్టెలు లేవు. కర్గినను బీగము సున్న. విభూతిసంచియే
పట్టు దొకండు భూతినిడు బంగరపుం గనిగాఁగ రాజరా
జట్టిలు శిష్యవర్గమున కన్నము విద్యయు నిచ్చు వేలుపుం
జెట్టల మస్గరూత్తములఁ జెప్పి మఱొక్కరి నెట్లు చెప్పెదన్. ౧౬

---

—* దీ ర్ఘా యు ర్యో గ ము లు *—

( కొండపల్లి లక్ష్మణపెరుమాళ్ళరావుగారు )

సీ॥ లగ్నంబు మఱియుఁ దల్లగ్నాధిపతియు శు
భగ్రహామధ్యభావముననున్న
కోణకేంద్రంబుల గురుశుక్రు లుచ్చులై
కేంద్రకోణముల లగ్నేంద్రుఁడున్న
బలవిహీనుఁడు లగ్నపతిగాక గురుశుక్రు
లం దుచ్చుఁ డాలగ్నమొందియున్న
పాపులు త్రిషడాయభావంబులను శుభ
పీఠాసమక్షపరివిష్టులైన
రహి శుభేక్షితుఁడై శుభగ్రహాసమేతుఁ
డగుచుఁ ద్రిషడాయముల రాహు వలరుచున్న
అష్టమేశుండు గురువీక్ష లందియున్న
ఘనతరాయుస్సహాయయోగంబు నిజము.

---

ఉ॥ ఆతఁడు బ్రాహ్మణుండగుట నాహవకేళి కనర్హుఁడంచు నీ
వీతఱి వీడివచ్చుటకు నెంతయు మానసమందుఁ గుంది వి
ఖ్యాతికిఁగానికాయ మొకకాయమొకో యని చేతనున్న యా
హేతి గళంబు గోసికొని యిమ్మహిఁగూలె. నిఁకేమిచెప్పుదున్ ?

బా॥ అపురా బ్రాహ్మణుని తెంపు ! అతఁడు వచించినది నిక్కము. అతని మరణమునకు నేనే కారకుఁడను. మా సంగడీండ్రలో నొకఁడు తఱఁగినందులకు దుఃఖింపవలసియున్నను దేశాభిమానముచేత దేహాభిమానమును వీడి వీరుఁడై నిశ్చింత నుత్తమ లోకములకుం బోవుటకు సంతసించుచున్నాను. వీరవతంసులారా ! వినుచుంటిరికదా ! తండ్రీ !

ఉ॥ పాలనఁజేసినావు మము బాలముగం గృప. మేము భక్తితో
తాలిమిఁబూని తావకహితంబుల సొదలఁ దాల్చినాము. త
త్కాలము దాఁటిపోయినది. కాదన లాభము లేదు. లేదు నీ
శీలము మాకు, మాదు పరిశీలన నీకును లేదు నేఁటితోన్.

అయినను సమయమునకుఁ బెద్దవాఁడవు సమీపమం దుంటివి. కాఁబట్టి యడుగవలసి యడుగుచుంటిని.

తే॥ ఆలమునకేగ వీరతాంబూలమిచ్చి
దీవన లొసంగి పంపుమీ దేవ! మమ్ము.
లేకయుండిన మఱుమాటలేక వీఁక
మేమెపోదుము నీమాట మీఱనైన.

ఉ॥ లెండిఁక వీరులార ! కడులీల నవక్రపరాక్రమంబునన్
భండనభూమిఁజొచ్చి నిజబాహుబలంబును జూపి ధాత్రిఁ బే
రుండ నరాతికాండముల నుగ్రతఁ బట్టి వధింత మిప్డు. లే
కుండినఁ జచ్చి స్వర్గమున నుందము సుస్థిరసౌఖ్యమందుచున్.

అయ్యయో ! అట్లే చూచుచుఁ గూర్చుండెదరేల?

ఉ॥ రా మలిదేవభూమిపతి ! రమ్ము రయమ్మునఁ గొమ్మరాజ ! రా
వేమయ కన్నమా ! కదలరేమి యశోధనులార లెండు లెం.
డేమని సంధికొప్పుద ? మిఁకేటికి శాంతి ? గతించె నేఁటితో
ఈమహనీయుబోధలకు నెల్లరముం దలయొగ్గియుండుటల్.

(అని యచ్చటివీరుల లాగికొనిపో నుంకించును)

బ్ర॥ (తనలో) ఇది పలనాటిరాజ్యలక్ష్మికిఁ బ్రళయకాలచిహ్నము. నే నడ్డుతగిలినను నిలుచుట కష్టము. అయినను సాధుజనబాధకము గాకుండ మఱియుఁ జెప్పిచూచెద. (ప్ర) కుమారా!

బా॥ (చిరాకుతో) తండ్రీ! కాదు. నాయఁడా!

ఉ॥ చెప్పితివీవుమంచినుడి. చేసితి మట్టులు మేము భక్తితో.
చెప్పుట నీకునుం దగదు. చేయుట మాకును గాదు నేఁటితో.
తప్పె సమస్త మియ్యెడల. ధార్ష్ట్యమె కైకొనఁదగ్గ దింక. నీ
చొప్పున నీవుపొమ్ము. చని చొచ్చెద మేము రణంబులోపలన్.

బ్ర॥ కుమారా! మన్ననతో (అనునయోక్తిలో)

బా॥ నాయఁడా! వలదనుచుండ మఱిమఱిచెప్పవచ్చెదవేల? నా యాకడసారివాక్యము లాలింపుము.

ఉ॥ మన్నన స్వప్నమందు ఋజుమార్గము సాధువులందు సాహసం
బన్నది యుద్ధమందు సమయాప్తిప్రవృత్తము లాత్మయందుఁ బే
రెన్నిక దిక్కులందు నని నీల్గిన ప్రాణులు భూమియందు సౌ
ఖ్యోన్నతి స్వర్గమం దగుత. ఉండదు తద్వ్యతిరేక మింతటన్.

ఇప్పటికైనను నానిశ్చయము వింటిరా? చక్కఁగ గ్రహించితిరా? పొండు.

బ్ర॥ (తనలో) దైవసంకల్పితము రణమనియే స్పష్టపడుచున్నది. అట్లే యగుఁగాక. (ప్ర)కుమారా! యుద్ధమువలదని బోధింపరాలేదు. వీరావేశమున నాభావ మెఱుంగకుంటివి. ఇప్పటికైనను వినుము.

తే॥ వీరతాంబూలమొసఁగి ప్రావీణ్యమొప్ప
శంఖతీర్థమ్మునుం బోసి సమరమునకు
పంపనూహించుచున్న నాభావములను
తెలియలేకుంట నాత్మఁ జింతిలఁగవలసె.

బా॥ తండ్రీ! అపరాధిని. క్షమించి తాంబూలమిమ్ము. (అని చేయిఁ జాఁచును.)

బ్రి॥ కుమారా! తొందరపడకుము. ఇప్పుడుగూడ దీర్ఘ యోజన సేయవలసినవిషయము తటస్థించినది.

ఉ॥ ముందుగ నేను నేననుచు భూరిపరాక్రమవంతు లందఱున్
తొందరఁజెందుచుండిరి కుతూహలతన్ రణభూమి కేగ. మీ
రందఱుగూడ నాకొకటె. అందఱిలోపల ముందు వెన్క లిం
పొందఁగ నిర్ణయించుటకు యోగ్యతచాలక తాల్మిఁబూనితిన్.

కొమ్మ॥ కట్టకడకువచ్చినతరువాతఁగూడఁ గాలహరణమేల ? ఎవరికో యొకరి కిచ్చినఁ గాదనువా రెవ్వరు ?

మలి॥ ఏ నిముసమున కేవిధముగా యోజనలు మారునోయని చేయుచున్న కాలయాపనగాని వేఱుగాదు.

బా॥ తమ్ముఁడు చక్కఁగ గ్రహించినాఁడు.

బ్రి॥ నాయనలారా! మీ యూహలు సరియైనవి కావు. మీ యాతురత వారింపఁజాల. ఒక పన్నిదముఁ బెట్టెద. దాన నెవఁడు గెలుచునో వాఁడే ముందు కదనమున కేగవలసిన వాఁడు.

అందఱు॥ ఆలాగే.

బ్రి॥ ఆపుట్టలో రజతపాత్రమం దొక విడె మున్నయది. దాని ముందందుకొనువారు ప్రథమాహవమునకుఁ గర్తలు. పొండు. మీశక్తిఁజూపింపుఁడు.

అందఱు॥ (నిష్క్రమింతురు)

బా॥ (మఱికొంతసేపటికి విడెముతీసికొని ప్రవేశించి) తండ్రీ! ఆజ్ఞ నెఱవేర్చితిని.

బ్రి॥ బాలచంద్రా! పరమహర్షము.

ఉ॥ ఇచ్చమెయిన్ రణస్థలికి నేగి సుధీరత సంచరించి వి
వ్వచ్చుఁడొ రుద్రుఁడో యముఁడొ భార్గవుఁడోయని యెంచున
ట్లుగా
పెచ్చుపెరింగి శాత్రవుల భీకరలీల భవచ్ఛరాహతిన్
వ్రచ్చి యశంబు భూమిపయి వర్ధిలఁజేయు. మనుజ్ఞయిచ్చితిన్.

బా॥ చిత్తము. (అని నిష్క్రమించును)

(యుద్ధరంగము)

బా॥ (ప్రవేశించి)

ద్విపద॥ శౌర్యంబునకుఁ బాదు స్వర్గంపుఁ ద్రోవ
ఆగర్భశూరుల కాటపరిదేశ
మెల్లదేవతలును నెన్నని మేలు
ధర్మసంరక్షణార్థంబయి బుధులు
కదలక రక్తంబు గార్చెడిచోటు.

బలే! యుద్ధరంగం బెంత మోదావహమై కనఁబడుచున్నది? నాతమ్ము లందఱును రణోత్సాహులై నలుదెసలం గవిసి మహాతో యధిమధ్యస్థ జలచరంబులమ్రింగు తిమింగిలాది మహామీనంబుల చందంబునను యుగాంతకాల పంచానన లలాటవహ్నిజ్వాలలపగిది నసీకినిం గుంతంబుల గ్రుచ్చుచును గుఠారంబుల నఱకుచును ముద్గరంబుల నడంచుచును గదాఘాతంబులం బొడిసేయుచును గరరుహంబులం జదుముచును నురంబులు భేదించుచును శిరంబులు విఱుచుచును రక్తపూరంబులు చేయుచును భూతప్రేతవిహారభూమింగా నొనర్చుచున్నారు. ఇట్లుకదా యుండవలయు!

ద్విపద॥ కమ్మరికాచన్న కడుశౌర్యధనుఁడు
కాంక్షించి తనపాలి కామాక్షిఁ దలఁచి
పరదళంబులమీఁద వ్రాలి ఖండించె
శత్రుసైన్యమునకు సమవర్తియైన
మంగలిపెదమల్లు మహితవిక్రముఁడు
తురగసంఘంబును దునుకలుచేసె.
కోరాడుచుండిన కుమ్మరిపట్టి
విస్రితుండగు జాతవేదునిబోలి
పరదళవిపినంబు భస్మంబుచేసె.
చాకలిచందన్న సాహసాఢ్యుండు
పాతాళగంగను భావమం దుంచి
ప్రకటఘోరవిలయపవనునిచేత

దుష్టశత్రువులను దుములంబునందు
ఆకాశపథమున కరుగంగఁజేసె.
అరరే!

ద్విపద॥ బాలునియనుజుండ బాహుబలుండ
అని చెప్పికొంచు బిట్టడరి రోషమున
వైరైనదళములఁ బెల్లుగఁ బొడిచి
బల్లెపువారిని భంగంబొనర్చి
తురగాళిపై కేగి తుమురుగాఁ గొట్టి
మదదంతిచయముల మరణమొందించి
తెఱచు గాయములకుఁ దాళంగలేక
మాచెర్ల చెన్నుని మదిలోనఁదలఁచి
వెలమదోర్నీఁడదె విడిచెఁ బ్రాణములు.

ఇంకను నేను రంగంబున కుఱుకక యేల నిరీక్షింపవలె? (కొన్ని దుశ్శకునంబులం గాంచి) అకటా! ధైర్యసాహసవిక్రమాదుల జగంబున వెల్లడిసేయ నుత్సాహపడుచున్న నా కీయనిమిత్తములేమి చెప్పుమా? కానిమ్ము. ఈవిఘ్నములు న న్నేమిసేయంగలవు?

ద్విపద॥ తనువు లస్థిరములు. ధనములు కల్ల
కీర్తియొక్కటె భూమి ఖలముగానియది
ధైర్యహీనత వీరధర్మంబు మాని
భంగురంబును మలభాండంబునైన
దేహంబుకొఱకు సత్కీర్తి పోనాడి
వెఱిగిపోయెడునట్టి వెఱ్ఱులు గలరె?
క్షితిలోన శ్రీవీరసింహంబులకును
సమరరంగంబులే సంచారవనులు.
చచ్చిన బ్రదికిన సౌఖ్య మచ్చుటనె.

ఇఁకఁ దడయరాదు. (పోవుచుఁ బరికించి చూచి) ఆహా! నరసింగభూమివల్లభుఁడు సన్నద్ధుఁడై యొకయెడ నరదంబులును మఱొక్కయెడ ద్విరదంబులును నింకొక్కయెడఁ దురంగంబులును వేఱొక్కయెడ వీరభటాళియు నడుప భూమిభ్రమితిమానంబగు మదకరీంద్రం

బుపై సామంతులును దండనాయకులును మాటిమాటికిం బురికొల్ప లయకాలుఁడోయన నీదెసకే వచ్చుచున్నాఁడు. వాని నెదుర్కొనెద
(అని యాదెసకేగును)
నరసింగుఁడు॥ (యథోక్తముగా మఞ్చకమువైపునుండి ప్రవేశించి)
శానురా నీ యుద్ధరంగం బెంతబీభత్సంబై భయానకంబుగాఁ
గనుపట్టుచున్నది ?
సీ॥ మృతకళేబర భక్షణేచ్ఛా సమాగత
కాకాదిపతిత పతాకసమితి
పతితపతాక సమితిభారవిగతాసు
ఘనఘోటకాది వాహననిచయము
వాహననిచయ దుర్భరరక్తమాంసాది
భోజనపరితృప్త భూతగణము.
భూతగణోత్థితాద్భుతరావ సంశ్రవ
ణాపేత జీవద్భటావళులును
భటకరస్థ ముద్గరకరవాలముఖ మ
హాయుధోద్దీప్తిసునిమీలితాక్షివైరి
వీరులును వీరపదఘట్టనోరుజాత
ధూళియును గల్గి రణభూమి దోఁచె. నహహ!
(మఱియుఁ దిలకించి) అయ్యయో! బాలునిధాటికి నిల్వనేరక మా మహారథు లందఱును బరాఙ్ముఖు లగుచున్నారు. ఓహో వీరవరులారా!
ఉ॥ ఆలమునందుఁ గుట్ర లెదుటైన మిముఁ దాఁకినయంతమాత్రనే
బేలలమాడ్కిఁ బర్విలిడ వీరుల లక్షణమా నె? దీనిచే
వేలును లక్ష లబ్దములు విశ్వమునన్ బ్రదుకంగ నేర్తురే?
చాలునుజాలు వెన్నిడక సంగరముం బొనరింపుఁడీ వెసన్.
(మరలఁ బరికించి చూచి) బళే చమూపతులారా! మీధైర్య సాహసములు మెచ్చఁదగినవి. చూచితిరా! ధైర్య మెంతబల వంతమైనదో

ఉ॥ నాలుగుదిక్కులన్ గడసి నాల్గుపయోధులరీతి మిమ్ము గ
గ్గోలొనరించు నల్వురిని గూల్చితి రొక్కక్షణంబులోన. మీ
మేలుస్మరింతు నెప్పుడును. మీవిజయంబు బలుచేతఁ జిక్కె. ఆ
కూళయొకండెకాదె మనకున్ భయకారకుఁ డింక నాజిలోన్.
వాఁడును లెక్కలోనివాఁడు కాఁడు. మీరందఱు నేకమై
వానిఁ గవయుఁడు.

తెగలో॥ ఓరీ నరసింగక్ష్మావల్లభాధమా! చచ్చినవారిఁజూచి విజయమ
య్యెనని తలంపకుము.

ఉ॥ ఒక్కఁడ నేను జాలనె సముజ్జ్వలశక్తి నినున్ వధింపఁగన్?
త్రొక్కకురాని సేన నవలీల జయింపఁడె యొక్క క్రీడి తా?
ఒక్కఁడుగాఁడె మారుతి బలోద్ధతి లంక దహించువేళ? నీ
వెక్కడఁదాఁగినన్ విడువ హీనుఁడ. ఆయువు నిండె నీ కికన్.
ఇదిగో వచ్చుచుంటిని. కాచుకొనుము.

బాలుఁడు॥ (ప్రవేశించి యార్భాటముతో) ప్రాగల్భ్యపరాయణా. నీచాత్మ నీతోఁ బోనీయక వెన్నిచ్చిపోయి ప్రాణములఁ దక్కించుకొననెంచువారలఁగూడ మరల యుద్ధమునకుఁ బురికొల్పుచుంటివికా? అవును. ఒక్కఁడనౌదునను భీతిఁ దోడుతీసికొని పోఁదలంచుచుంటి కాఁబోలు! ఇంకెంతకాల మీభూమిపైఁ జిందులాడెదవు?

నరసింగు॥ ఓరిబాలకా! నోటియుక్కు వేటులో నుండవలయును. నీవారిగతి యేమైనదో నీగతియు నంతియే కాఁగలదు. నీయబ్బ బ్రహ్మనాయఁడు నిన్నెట్లాజి కనిపినాఁడురా? అవురా! ఎంత సాహసిరా? నిర్దయుఁడై యిట్టి పాలుగాఱు మోమువాని నా శస్త్రధార కాహారముగాఁ బంపినను నాకుమాత్రము హింసింప బుద్ధిపుట్టకున్నది. బాలచంద్రా! నామాట లాలించి వెనుకకుఁ దిరిగి గీమునకుఁ బొమ్ము. లేదా నావెనువెంట రమ్ము; మక్కువతోఁ బోషించెద.

బాలు॥ నిక్కువమే. నాతండ్రి నిర్దయుండు. నీవు రండచేతిలోని కీలుబొమ్మవు. ఇం దెవరు మేలో నీవే యోజించుకొనుము. నీరక్షణా

మును నీవు చేసికొనలేక యీఁడుదానిపై భారపడియున్నవాఁ
డవు. పరుల నేవిధిఁ బోషింపఁగలవు? చాలుఁజాలు. ఇపుడు
జరుగుచున్న పని యేమి? నడుము నీ సమాశ్వాసింపు లేమి?
బలే! మెచ్చనగు. చూడఁజూడ నివి భీరువుల లక్షణములు.
ఓరీ! మాటలతోడనే సరిపుచ్చెదవా? ఆజి కరుదెంతువా?

తెరలో॥ ఉ॥ చూచెదవేమిరాజ! రణశూరు లనేకులు సంగరస్థలిన్
పీఁచముపీడి సుగ్రిక్కి రరివీరకరంబులఁజిక్కి నీకునై
రాచరికంపుఁ బాడి విడి రట్టులఁగాంచితి. మింకఁజాలు. మ
మ్మేఁచక పోవనిచ్చిన సుఖంచుచునుండెద మింటిపట్టులన్.

నరసిం॥ ఆశ్చర్యపడకుఁడు. ఇదుగో వచ్చుచుంటిని. బాలచంద్రా!
మనయుద్ధంబున కిదిగాదు తావు. ఆదెస కేగుదము రమ్ము.

బా॥ ఓరీమూర్ఖా! ఏదియో వంకఁబెట్టుకొని పాఱిపోవఁ జూచుచుం
టివా? నా యెదుటఁబడినతరువాతఁ దప్పించుకొనుటకు హరి
హరాదులకును దరముకాదు. సరే! నీయిష్టమువచ్చినచోటికే
పోదముపద. (అని యిరువురును నిష్క్రమింతురు)

(ఇరువురు గంధర్వులు ప్రవేశింతురు)

పెద్దవాఁడు॥ తమ్ముఁడా! చూచితే పల్నాటివీరుల ధైర్యసాహసములు?
పెద్ద లెందఱో యుండ మున్ముందే బాలు రాజికి బయలుదేఱి
శత్రుసైన్యంబుల నెల్లం దునుమాడి రణభూమినంతయు రక్త
ధారలచేఁ దడిపి చిందఱవందఱఁ జేయుచున్నారు. అబ్బబ్బా!
పిశితంపురాశిలో దిగఁబడి కాలు గదలింపలేక యందే కూలు
తురంగంబులును గాంక్షేయధారలచేఁ గరపదంబులు తెగిపడి
విలవిలఁదన్నుకొను వీరభటులును రక్తప్రవాహములోఁబడి
పైకిఁదేలి గిఱ్ఱునఁ దిరుగు చామరచ్ఛత్రములును శకలంబులైన
రథకేతువులును ధర నొఱఁగిన యేనుంగులును మఱియు
నాదెస సేనామధ్యంబున రెండువేల బాహ్లికతురంగంబులును
మూఁడువేల నగసమానస్యందనంబులును రెండువేల ధను
ర్విద్యానిపుణులును నొక్కసారి బాలచంద్రునకుఁ జిక్కి విగత
జీవులయిరి. ఆహా! బాలుని బలపరాక్రమము లేమందును?

—* ఇంద్రుఁడు కపటోపాయమున వృత్రు వధించుట. *—

వ॥ అని వక్కాణించుటయు నుదారబుద్ధియగు బృహస్పతి యింద్రుం దోడ్కొనివచ్చి వృత్రాసురునితో సంధానంబొనరించె. దేవదానవాధిపతు లుభయులును బరస్పర మత్యంతమైత్రి చేసికొని ముదంబున స్వస్వనికేతంబులకుం జనిరి. పదపడి వాసవుండు సర్వదా రంధ్రాన్వేషణంబు గావించుచు వృత్రు ప్రవర్తనమున నించుకేని లోపంబు గనుఁగొనఁజాలక తత్ప్రతాపంబున దహింపఁబడుదునను భీతి నతని పాలికిం బో నశక్తుండై మరల గీష్పతిని విలోకించి. ౩౩౫

ఆ॥ "వృత్రుఁ గనులువిప్పి వీక్షించుటకుఁగూడఁ జాలకున్నవాఁడ సంయమీంద్ర!
ఆత్మతేజమునను గంటివె వ్యాప్తుఁడౌ వాఁ డిఁకెట్లు నాకు వధ్యుఁడగును ? ౩౩౬

ఆ॥ కానఁ దద్దురాత్మ ఘనతేజమును సహింపంగఁదగు నుపాయముం గృపాళు
వగుచుఁ జెప్పుమయ్య యాంగిరసా! వాని బిలుకుమార్చవలయు భీతిఁదొలఁగి"

వ॥ అని సవినయంబుగా విన్నవించిన విని సురాచార్యుండు తడవు ధ్యానించి యిట్లనియె. ౩౩౭

ఉ॥ "వాని శరీరమందుఁ గడు వర్తిలుచున్నది బ్రహ్మతేజ. మ
ద్దానను జేసి చూచుటకె త్వన్నయనంబులు చాలకున్న. వా
దానవు సంహరించుటకుఁ దగ్గయుపాయ మొకండు చెప్పెదన్
నేను. మదుక్తభంగిఁజని నీవు వధింపఁగవచ్చు లీలమై. ౩౩౮

కం॥ ప్రాచీసరస్వతీనది చూచితివో లేదొ ? దాని శుభ్రతటమునన్
వాచంయమవర్యుండు దధీచి తపోనిష్ఠ విధి నుతించుచునుండెన్. ౩౪౦

తే॥ పుష్కరారణ్యమునఁ బెద్దప్రొద్దునుండియుండె నా బ్రహ్మఋషి. వానికసువులంతు
గోఁతవుట్టెను వార్ధకాన్వితుఁడగుట. వెనుకదీయఁడు దేహంబు విడుచుటకును.

కం॥ శతనాగాజనోచ్ఛ్రితం బాక్షితిసురుని కళేబరంబు. శీఘ్రముచని యా
శతముఖ! అడుగు తదస్థులు. వితసేయక ప్రాణములను విడిచి యొసంగున్. ౩౪౨

ఆ॥ వానివలననీకు వజ్రమన్ పేరిటి యాయుధంబు సిద్ధమగును. దాన
చంపఁగలవునీవు శత్రునౌ వృత్రు సుత్రామ! త్రిదివధామ! తథ్యమిద్ది. ౩౪౩

ఆ॥ బ్రహ్మతేజమునను బరిబృంహితంబగు నస్థికలను రచితమైన వజ్ర
ముపశమింపఁజేయు నమితవీర్యుఁడౌ వృత్రుతేజముం ద్రివిష్టపేశ!" ౩౪౪

వ॥ అనినవిని హరిహయుం డఖిలామరసంయుతుండై కోటితీర్థంబుల కాటపట్టగు ప్రాచీసరస్వతీప్రాంతస్థ పుష్కరారణ్యంబునకుం బోయి ముంగిసలుం బాము

లును తేళ్లును సింహంబులు నెలుకలుం బిల్లులు గుడ్లగూబలుం గాకులు వేని తపఃప్రభావంబున సహజవైరంబులు వీడి సంతోషంబుగాఁ బరస్పరం బాడుకొను నా దధీచి మహాముని యాశ్రమంబుం బ్రవేశించుటయు నతండు వృద్ధశ్రవఃపురోగులగు వేలుపులం దిలకించి సంతసించి యెదుర్కొని యర్ఘ్యమిచ్చి ముహుర్ముహురాచరితపరీక్షాముండై పురుహూతు నుద్దేశించి.

కం॥ “ నావలననుండి యేపని కావలసి భవదీయమగు నికాయంబునకున్
దైవతయుతముగ వచ్చితొ వావిరి సెలవిమ్ము వాసవా! యొనరింతున్” 3౪౬

వ॥ అని యనుటయు నింద్రుం డిట్లనియె. 3౪౭

కం॥ “ ఇంటికివచ్చినవానికి వెంటనె యాతిథ్యమిచ్చుట విధి. భవదస్థుల్
కొంటకువచ్చితి నిదె. తెఱగంటులపని సిద్ధిఁబొందఁగల దద్దానన్. 3౪౮

వ॥ అనినవిని దధీచిమహాముని యుప్పొంగి. 3౪౯

కం॥ “ ఆహాహా! నాకు సమానుఁడు మహి నొక్కఁడుగూడ లేఁ. డమర్త్యేశుఁడె నా
గృహమునకువచ్చె నర్థిగ బహుపుణ్యుఁడ నేను. బహుళభాగ్యాన్వితుఁడన్. 3౫౦

కం॥ అనవరతము సురరక్షణమునకై వినియోగపడఁగఁబోవు మదస్థుల్
కనుగొనఁ గడు ధన్యంబులు. కొనుమవి. అసువులను నిన్నుఁగూరిచి విడుతున్ ”

వ॥ అనిపలికి యమ్మహర్షి తత్క్షణంబ ధ్యానంబుఁబూని బ్రహ్మరంధ్రద్వారంబునఁ బ్రాణంబులు విడుచుటయు నాత్మపరిత్యక్తుండై యాతని యంగంబు పుడమిపయిం బడియె. నంత హరిహయుం డాయన యస్థులు గ్రహియించి విశ్వకర్మతో నిట్లనియె. 3౫౨

కం॥ “ ఈయస్థులచేతను వజ్రాయుధమును నీవు చేయనగు వడి. నే నా
యాయుధముతోడఁ బోయి యజేయుండగు వృత్రుమేను చించువిధమునన్ ” 3౫3

వ॥ అనినవిని దేవశిల్పి యాఱుమూలలును నూఱుగనుపులును గలిగి నడుమ సన్నమై భయంకరాకృతిం బొలుచు వజ్రాయుధంబు నిర్మించి సహస్రాక్షునకు సత్వరంబుగా సమర్పించుటయు దానిం గైకొని యతండు వృత్రుండు సమాధిగతుండగుట చారులవలన నెఱింగి సంధ్యాసమయంబునం జని వెనుకనుండి యయ్యాయుధంబున వానిం గొట్టి సందిగ్ధతన్మరణుఁడగుట భయంబునం బరువెత్తి నిర్జనంబును గుల్మసంవృతంబును నగు నొక విషమస్థలంబున సర్వంబును వృత్రమయంబుగా భావించుచు డాఁగియుండె. సురసిద్ధచారణగంధర్వు లతనిఁ గానక వెదకి వెదకి యెట్టకేల కా గుల్మమధ్యంబునం బొడగాంచి 3౫౪

తే॥ “ సపరివారంబుగా వృత్రు సంహరించియును నీ కేల భయంపడెదో బిడౌజ!
హ్యాకత శోభనమును గూడ మేము గంటి. మరుగుటె. మేమెల్ల గిన సురనికాయసహితముగ ”

వ॥ అనిపిలుచుటయు రాక్షసశ్రేష్ఠుండగు వృత్రు మరణశ్రవణంబున వేను గగుర్పొడువ గుల్మంబునుండి బయలువెడలు పురందరు సుగంధభూయిష్ఠుం దేజోవిహీనుం దిలకించి లోకగురుండగు బ్రహ్మ దైవతముల నందఱ దగ్గఱకుం జీరి ౩౫౬

ఉ॥ "వింటిరె? బ్రహ్మభూతుండగు వృత్రు నితం డెదిరింపలేక తా
నొంటి సమాధినుండఁగ నగోచరవృత్తిం బోయి వధించెఁ గాన వె
న్నంటెను బ్రహ్మహత్య. ఇకఁ గ్ర్యాయ్యఁగను. త్యాగము సేయరాని మా
వెంటఁబడుం గొలల్. నిజము విప్పవచించితి మీకు నియ్యెడన్. ౩౫౭

ఆ॥ బ్రహ్మహంతఁ దగుల భాషింపఁ బాపంబు వచ్చుఁ గాకఁ బోయి వాసవునకు
దూరదూరమంద వేఱుగా మండుఁడీ విబుధులార! మీరు విని మనుక్తి. ౩౫౮

ఆ॥ అతని ముట్టుకొనుట యట్లుండఁ గాక. సంభాషణంబుగూడఁ బాపహేతు.
వంతె కాదు. వాని యవలోకనమె కూడ. దఘముచుట్టుకొనెడి నందువలన" ౩౫౯

వ॥ అని వచించుటయు నింద్రుండు విని తథాభూతంబగు తన తనువు చూచుకొని
దైన్యంబునం జతుర్ముఖునకు దండమర్పించి ౩౬౦

కం॥ "నీకింకరుండ. నీవే నాకీయింద్రత్వ మిచ్చినాఁడవు కానన్
లోకేశ! బ్రహ్మహత్యం బోకార్పవె పాచితంబు పొనరిచి కరుణన్" ౩౬౧

వ॥ అని వేడికొనిన నంబుజాసనుం డిట్లనియె. ౩౬౨

ఉత్సాహము॥ "అష్టషష్టితీర్థములను నాడుకొంచు 'బ్రహ్మహన్
దుష్టుఁడను' నటంచుఁ బైఁడితోడఁ బాపపూరుషా
కృష్టవిగ్రహము రచించి యిమ్ము మంత్రవత్తుగన్
శిష్టుఁడైన బ్రాహ్మణునకు శీఘ్రముగ శతక్రతూ! ౩౬౩

ఉ॥ నీటమునుంగుమాత్రమున నీకరమందలి తత్కపాల మె
చ్చోటను గ్రిందికిం బడునొ పోయగ మేర్పడు నీకునచ్చ. టు
ప్పాటుఁ దొలంగిపోవుఁ జెడువాసన. ఆపరతీర్థమంచు వే
నాఁటు మిఁకం గపాలము పినాకధనుర్ధరు పేర నిశ్చమై. ౩౬౪

ఉత్సాహము॥ పంచవక్త్రమంత్రములను బాగుగం బఠించి స్థా
పించి యాకపాలమునకుఁ బ్రీతిఁ బూజ సేసి యా
కాంచనంపుఁ బాపపురుషుఁ గరముభక్తితో నతన్
మంచిబ్రాహ్మణున కొసంగు మఘవ! శుద్ధుఁడౌదికన్" ౩౬౫

వ॥ అనినవిని యమ్మహత్త్వంతుండు వృత్రు కపాలంబుఁ గైకొని యఱువదెనిమిది తీర్థంబులం గ్రుంకుచుఁ గ్రమంబుగా హాటకేశ్వరంబునకుఁ బోయి విశ్వామిత్రహ్రదంబున మునింగి యువలకువచ్చుటయు నా వృత్రకపాలంబు చేతినుండి తనం

దాన క్రిందఁబడియె. నంత సర్వపాపహారంబులును బుణ్యంబులును నగు "సన్నోజ్ఞా తంపరిపద్యామి" మొదలగు పంచవక్త్రమంత్రంబులచే నక్కపాలంబుం బూజించి నున్నంధవిముక్తుండును దేవోత్తముండును నయి వెలుంగు నింద్రునకదకు నద్వైతంబుగాఁ జతురాననుండు చనుదెంచి బ్రహ్మహత్యచేఁ బరిత్యక్తుఁడైనట్లు భావించి

ఉత్సాహము॥ "సంగనక్త్రిమంత్రములఁ గపాలమును భజించితీ
వంచితముగఁ గాన బ్రహ్మహత్యతొలఁగిపోయె. శే
షించియున్న పాపమును నశించుఁ గనక మునను జే
యించి యిమ్మ నీశరీర మింద్ర! విధియుతంబుగన్" ౩౧౭

వ॥ అనివాక్రుచ్చుటయు వర్ణియుని హేమమయంబగు నాత్మీయప్రతిబింబమును గర్తాత్తీర్థనాసియు నాహితాగ్నియు సహస్రాక్షుండును వాత్రాభిధానుండును నగు వసుధాపురమున నొసంగుటయు నాగరు లాబ్రాహ్మణు డాయంజని. ౩౧౮

కం॥ "ఛీఛీ! సాంగోపాంగము నీచేఁ బఠియింపఁబడిన నిఖిలశ్రుతులున్
నీచా! వ్యర్థములయ్యెను. మాచెంతకు రాకు మీవు. మము ముట్టకికన్" ౩౧౯

వ॥ అని నిందించుటయు నుపస్వ్యతులోద్భవుండగు నా బ్రాహ్మణుండు చిన్నవోయి యింద్రునితో నిట్లనియె. ౩౨౦

ఉ॥ "తావకపాపపిండము ప్రవర్త్తము నాకు సురాధినాథ! స
ద్భావమునన్ గ్రహించితిని దానిని. గాని ధనేహఁగాదు. భూ
దేవతలెల్ల నిన్ ననుఁ బఠింబడిగాఁగ శపించుచున్నవా.
రీవును జూచుచుంటె. వికనెట్లు ప్రతిగ్రహ మాచరించెదన్? ౩౨౧

కం॥ నీయది నీవే కైకొను. పోయెద. నటు తీసికొనక పోయితివేన్ శా
పాయుధమును నీమీఁదను వేయంగలవాఁడ నిపుడ వేలుపుఱేఁడా!" ౩౨౨

వ॥ నావుడు శునాశీరుండు

తే॥ "వేదవేదాంగవేదియౌ విప్రజనుఁడు కలుషుఁగాక ప్రతిగ్రహ మిల నొకర్తు.
పాతకంబంటు దాతనిం బద్మపత్రముల్ల నగస్నిగ్ధ జలబిందువుల విధమున. ౩౨౪

ఉ॥ కావున లేదు. నీకిప్పుడు కల్మషమ్మెక్కడు నిన్ను దూరరో
ఆ వసుధాపురు ల్సలుపు నన్నిసుకార్యములం బ్రధానతన్
నీ వెనహింతు. తత్సుతులు నీసుతవర్గము నాజ్ఞలోన నుం
దీవిధి వారి సంతతియు నేగుచునుండుఁ గ్రమ క్రమంబుగన్. ౩౨౫

కం॥ నీమాటలేక నాగరభూమీసురు లెంతమాత్రపుం బనిసేనిన్
తా మొనరించిన వ్యర్థంబౌ మతిమతి బూఁటఁబోయు నాజ్యముభంగిన్ ౩౨౬

# అభినవసరస్వతి

సంపుటము ౧౩ | ప్రజోత్పత్తి నామ సం॥ కార్తికమాసము. | సంచిక ౮


## — కృతివిమర్శనము —

అమావాస్యాసోమవారవ్రత కాలనిర్ణయము:—ఇది జటిప్రోలు సంస్థానవిద్వాంసులగు శ్రీధర కృష్ణశాస్త్రిగారిచే వాక్యార్థరూపముగా గీర్వాణవాణిని వ్రాయఁబడిన 30పుటల చిన్నపుస్తకము. సోమవత్యమావాస్యావ్రతమును బెక్కండ్రు శేషామావాస్యయందే యాచరించుచున్నారు. అట్టిచో నేకారణముననో ప్రకృతగ్రంథకర్తలగు కృష్ణశాస్త్రిగారు విద్ధామావాస్యయందే యీవ్రతమును జటిప్రోలుసంస్థానికుల రాజధానియగు కొల్లాపురమునఁ గొందఱిచే ననుష్ఠింపఁజేయ సమకట్టుటయుఁ దదాస్థానమందే యింకొక విద్వాంసులగు వనం సీతారామశాస్త్రిగారు సర్వసాధారణముగా నుండు నాచారమునుబట్టియు శాస్త్రమునుబట్టియుఁ దచ్చతుర్దశీప్రయుక్తామావాస్యా సోమవారవ్రతమును నిషేధింపఁజేసిరఁట. స్వవచనవ్యాఘాతమునకుఁ గృష్ణశాస్త్రిగా రొప్పుకొనకపోవుటయుఁ దత్సంస్థానాధీశులగు రాజా సురభి వెంకట లక్ష్మారావు నిజాంనవాజువంతు బహాదరుగా రుభయపండితులను బత్రికావాదమునకుఁ బురికొల్పిరఁట. తద్వాదాత్మకమే యీగ్రంథము. శిష్టాచారమునుబట్టియుఁ బ్రమాణబాహుళ్యమునుబట్టియు సీతారామశాస్త్రిగారి వాదమే సమంజసమైయున్నయది. అయినను గొన్నిప్రమాణములను గొందఱుపండితుల యభిప్రాయములను సేకరించి కృష్ణశాస్త్రిగారు స్వవాదమును సమర్థించుకొనిరి. శేషామావాస్యనాఁటి సోమవారముననే యీవ్రత మనుష్ఠేయమనునది సీతారామశాస్త్రిగారి వాదము. శేషామాసోమవారమునను జేయవచ్చును జతుర్దశీవిద్ధామాసోమవారమునను జేయవచ్చుననునది కృష్ణశాస్త్రిగారి వాదము. కనుక నుభయవాదములలో దేనికెంత బలమున్నదియుఁ జదువరులు సులభముగా గ్రహింపవచ్చును. మాటకు మాట

తెగులు సీళ్ళకు వాచు తెగులను సామెతగా సాధారణములగు లోకవ్యవహారములలోనే యొకదాని నొకటి పూర్వపక్షము చేయునవి దొరకుచుండి నానాఋషివచన ప్రమాణసిద్ధమగుట నతిగహనమై యుండు శాస్త్రవిషయమునఁ బూర్వపక్షసిద్ధాంతముల కంత ముంపనే యుండదు. సర్వసామాన్యముగా నుండు శిష్టాచార మేదియో యదియే మనము గ్రహింపవలసినది. అందుల కనేకదేశములయం దాచరింపఁబడు శేషామాసోమవతీవ్రతమే ప్రబలప్రమాణము. ఒక్క సోమవతినే కాక సకల వ్రతములను శేషతిథులయందే యనుష్ఠించుచుండుట విశేషించి కానవచ్చెడిని. కృష్ణశాస్త్రి గారి యీగ్రంథముపై సీతారామశాస్త్రి గారుగూడ విద్ధామాసోమవతీవ్రతఖండనమని యొకగ్రంథము వ్రాసి ప్రచురించిరి. గ్రంథద్వయమును శాస్త్రవిశిష్ట సంస్కృతసాహితీద్యోతకములై విద్వన్మనంబులు హరియింపఁగలిగియున్నయవి. ఇవిరెండును గర్నూలుజిలా మూర్వకొండపోష్టునకుఁ జేరిన కొల్లాపురమున గ్రంథకర్తలయొద్ద నుచితముగా లభింపఁగలవు.

<u>ఆగ్నేయపౌరుషేయ బ్రాహ్మణ సంవాదము</u> :— బ్రాహ్మణులాగ్నేయులనియుఁ దమను పౌరుషేయులనియు రథకారు (విశ్వబ్రాహ్మణు)ల తలంపు. బ్రాహ్మణులు ఋషులసంతతియగుట నాగ్నేయులనియుఁ దాము కేవల విరాట్పురుషుని (విశ్వకర్మ) సంతతియగుటఁ బౌరుషేయులనియు వీరు చెప్పుదురు. ఇది నిరాధారము- నిస్సారము- నిలుచునది కాదు. నిలిచినను నిలువకున్నను నట్లు చెప్పుకొనుచు నాత్మను సంతృప్తిపఱచుకొనుచున్నవారు. దీని యాథార్థ్యమును గూర్చి చిరకాలమునుంచి వివాదములు జరుగుచున్నవి. సిద్ధాంతితములగుచున్నవి. తమవాదము దుర్బలముఁ బ్రమాణబాహ్యము నైనప్పటికి వారీవాదము నుపసంహరించుకొనక విశ్వబ్రాహ్మణులమనియుఁ బౌరుషేయులమనియు నేమేమియో చెప్పుకొనుచు నాత్మోన్నత్యముం బ్రకటించుకొనుచునే యున్నవారు. ఈ విశ్వబ్రాహ్మణపౌరుషేయ శబ్దములపై ఖండనగ్రంథములు వ్రాయఁబడియున్నను వానికిఁ బ్రతిఖండనము వ్రాయలేకపోయినను దచ్ఛబ్దముల స్వజాతివాచకములఁగా వ్యవహరించుకొనుటమాత్రము మానరు. వీరి వివాదము లప్పు

డప్పుడు న్యాయస్థానముల కెక్కుచుండుటయును గలదు. ధర్మసూక్ష్మమును గ్రహింపఁగల న్యాయాధిపతులు కడుఁ దక్కువ. అందుఁ గేవలాంగ్లవిద్యావైశద్యముగలవారలే పెక్కండ్రు. ఆర్షేయత్వ పౌరుషేయత్వాదులు తాదృగాంగ్లభాషాపాండిత్యసాహాయ్యమువలనఁ దీర్మానించుటకు వశమగునవి కాకునికిని ధర్మసూక్ష్మమును గ్రహింపనేరక యీ న్యాయాధికారు లెట్లో తీర్మానించుచుందురు. కాని యవి వాస్తవమునకు దూరములై వర్తిలుచుండును. హూణభాషాపండితులైన యుద్యోగులకుఁ జాలవఱకు సనాతనమతమందలి శ్రద్ధ సన్నగిల్లినది. పైపెచ్చు బ్రాహ్మార్యదివ్యజ్ఞానసమాజక్రైస్తవమహమ్మదీయాది మతప్రవిష్టులుగూడ నగుచున్నవారు. అట్టివారిపాలఁబడినసనాతనమతవివాదములలోని న్యాయ మింక నెబ్బంగిఁ దేలఁగలిగెడిని ? ఇట్టివివాదమొకటి మాయూరనే తటస్థపడి జిల్లాకోర్టుపర్యంతము వ్యవహరింపఁబడినది. డిస్ట్రిక్టుమునసబుగారు బ్రహ్మసామాజికులగుట నుభయులకు ననుకూలింపని గుణకర్మవాదముం గావించి యెట్లో తీర్పుచెప్పుటయు జిల్లాకోర్టులో నపీలుచేసి చాలభాగము న్యాయమును దేల్చుకొనఁ గల్గితిమి. జెడ్జిగారు హూణవిద్యావిశారదు లగుటయే కాక సనాతనధర్మనిరతిగల సంస్కృత పండితులుగూడ నయియుండుటచే నస్మత్ప్రదర్శితములగు శ్రుతిస్మృతిపురాణేతిహాససూత్రభాష్యాదులను సావకాశముగాఁ బరిశీలించి యార్షేయత్వ పౌరుషేయత్వములను విశ్వబ్రాహ్మణత్వమును విశ్వసింపక వీరియందు రథకారత్వమునే స్థిరపఱచియున్నవారు. ఇట్టికారణములవలన వీరి పౌరుషేయత్వ మశాస్త్రీయము.

ఈ గ్రంథమునకుఁ బెట్టిన యార్షేయపౌరుషేయబ్రాహ్మణసంవాదమను నామ మపార్థము. ఈ యపార్థనామధేయమగు గ్రంథమునకుఁ 'గులాభిమాని దుర్మతభంజనుఁడనువారలకు జరగిన వివిధ ప్రసంగములు మొదలగునవిగల' యను విశేషణమొకటి తగిలింపఁబడియున్నది. గ్రంథనామ మెంతచక్కఁగ నున్నదో విశేషణము నంత సుష్ఠువుగ నుండుట పాఠకులు గ్రహింపకపోరని తద్విశేషణవిమర్శము విడిచిపెట్టితిని. ఆర్షేయపౌరుషేయబ్రాహ్మణసంవాదమను నీపుస్తకము సర్వజనులకుం దెలియుటకు బందరు గొడుగుపేట నివాసుఁడగు రాయవరపుఁ బూర్ణయ్యాచార్యులచేఁ బ్రచురింపఁబడియెనఁట. పైనుదాహ

రించిన గుంటూరుజిల్లాకోర్టుతీర్మానము తరువాతఁ దద్వృత్తాంత మంతయు స్వర్ణకారవ్యవహారనామక గ్రంథరూపమున నేను బ్రకటించియుంటిని. ఆందీవ్యవహారక్రమ మాద్యంతముం దెలుపుటయేగాక వీరి వాదము లన్నియు శ్రుతిస్మృతిపురాణేతిహాససూత్రభాష్యయుక్త్యనుభవహేతు ప్రదర్శనపురస్సరంబుగా విమర్శించియుంటిని. తద్గ్రంథమే వీరి యాచార్యత్వాదుల స్వరూపముం దెలుపఁగలదు. ఈ యాక్షేయ పౌరుషేయబ్రాహ్మణసంవాదనామక గ్రంథమునఁ గులాభిమానియను నొక గుప్తనామధేయుఁడు పురుషార్థప్రదాయినిలోఁ బ్రచురింపించిన వ్యాసములు తఱచు కానవచ్చెడు. యౌగికముగా విరాట్పురుషుని బోధించు విశ్వకర్మశబ్దముగల శ్రుతులును వాని కతఁడు వ్రాసిన స్వకపోలకల్పితార్థమును నందుఁ గలదు. స్వకపోలకల్పితార్థమే యగుఁ గాక. పాండిత్యము లేకపోఁగా నేమాత్రము శబ్దజ్ఞానముగూడఁ గలిగి వ్రాసినట్లు కనుపట్టదు. అంత యవాచ్యముగా నున్నయది. అందును ముద్రాపకప్రమాదములు పంక్తికిఁ బది పదియైదు. ఇట్టివ్యాసముల కా పురుషార్థప్రదాయిని యెట్లుతావిచ్చినదో విచార్యము. ఈకులాభిమానికి ధర్మవాది సత్యవాదిన్యాయవాదులు ప్రతివాదులు. విషయమెట్లున్నను వారివ్రాఁతలును బాండిత్యశూన్యతనే ప్రకటించుచున్నయవి. అట్టి యపశబ్దభూయిష్ఠములైన వ్రాఁతలనైనను నున్నదున్నట్లు ప్రచురింపక ముద్రాపకులు మఱింత పాడుచేసిరి. వారి నననేల? ప్రకాశకుల పాండిత్యాతిశయమే యన్నింటికిని గారణము. ప్రూఫులుచూచుకొను భారము ప్రకాశకులపైనే యుండునుగాని ముద్రాపకులపై నుండదు. ఈవివాదములో నియోగులు విశ్వబ్రాహ్మణుల పక్షమునఁ జేరి వారి దూషణవ్యాసములఁ గుదుర్చుచును దమ పత్రికయగు స్వధర్మప్రకాశినిలోఁ దద్వ్యాసములఁ బ్రచురించుచును గొంత సహాయముచేసిన ట్లీగ్రంథమునఁ దెలియనయ్యెడిని. స్వధర్మప్రకాశినిగూడ మొదట వైదికనియోగికక్షలవలననే బయలుదేరిన పత్రిక. అట్లు స్వధర్మప్రకాశిని పురుషార్థప్రదాయని వివేకవర్ధని వార్తాలహరి మున్నగుపత్రికలు కొన్ని యటు, కొన్నియిటు నుండి వివాదములు సాగించుచు వచ్చినవి. వివాదరూపమైన యీపత్రికలలోని వ్యాసములే యీగ్రంథము గాని విశేష మేమియు లేదు.

## —◆ శంకరుని జీవితము. ◆—

(వేనువరపు రామదాసుగారు. బియేబియల్. యమ్. ఐ. ఏ. యస్)

### జన్మస్థానము.

...మలయాళ దేశమునఁ గాలటి (కళాడి) అను నొక చిన్న గ్రామమున నీయన జన్మించెను. అది యొక బ్రాహ్మణాగ్రహారము. చూర్ణయను నొక చిన్న నది ప్రాంతమునఁ గలదు. అచ్చట నొక శివలింగము స్వయంభువై వెలసెననియు నాప్రాంతమున నుండిన రాజశేఖరుఁడను నొక భూపాలునికి శివుఁడు స్వప్నమందగపడి ప్రోత్సాహపఱప నాతఁ డచ్చట శివాలయ మొకటి కట్టించి బ్రాహ్మణుల కగ్రహారము నమర్చెననియుఁ గధ గలదు. ... ...

ఆగ్రామమున విద్యాధిరాజను బ్రాహ్మణుం డొకఁడుండెను. అది యాయన పౌరుష నామమువలెఁ గన్పట్టుచున్నది. ఆయన కొక్కఁడే పుత్రుఁడుండెను. ఆయన పేరు విశ్వజిత్తని కొందఱును శివగురుఁడని కొందఱును వ్రాయుచున్నారు. ఇక్కాలపు విద్యార్థులవలె విద్యారంభమునకుఁ బూర్వమే బ్రహ్మచర్యమును బోఁగొట్టుకొనక యాయన సద్గురువు నాశ్రయించి బ్రహ్మచర్యమును బూని సకలకలాపారంగతుఁడై తదుపరి విశిష్టయనియు నార్యాంబయనియుఁ బ్రసిద్ధిగాంచిన కన్యారత్నమును బరిణయమై గృహస్థాశ్రమమును స్వీకరించెను...ఆచార్యులవారు చిదంబరములో జననమొందిన ట్లానందగిరి వ్రాసియున్నాఁడు. కాని యీవ్రాఁత యవిశ్వసనీయమని త్రోసివేయనగు. మణిమంజరియను వికృతగ్రంథమును వ్రాసిన మహానుభావుఁడుగూడఁ గాలటినే శంకరుల జన్మస్థానముగ నంగీకరించియున్నాఁడు. మనకుఁ బ్రత్యర్థియగు నీయన సాక్ష్య మీవిషయమున నంగీకరింపనగును. త్రిచూరునకు సమీపమున "పజూర్పణైయిల్లం" అను మలయాళబ్రాహ్మణకుటుంబము శంకరునితల్లి పుట్టింటివారి కుటుంబమని మలయాళవాస్తవ్యు లందఱును వాడుకొనుచున్నారు. మఱియు నామెసమాధి యచ్చటనే యుండిన ట్లిప్పటికి నాగ్రామనివాసులు యాత్రికులకుఁ జూపుచున్నారు. హిమాలయప్రాంతములందు బదరికాశ్రమమున శంకరగురుండు నారాయణాలయమును జోషిమఠమును స్థాపించెనను విషయము నిర్వివాదాంశముగ నంగీకరింపఁబడుచున్నది. ఆయాలయమున నర్చకుఁ డనాదినుండియు నేఁటివఱకును మలయాళదేశపు నంబూద్రిబ్రాహ్మణుఁడుగా నున్నాఁడు. ఇందుకుఁగారణము మన గురుఁడు మలయాళవాస్తవ్యుఁడును నంబూద్రిబ్రాహ్మణుఁడును నగుటయే యని చెప్పఁదగియున్నది. శంకరుని జన్మస్థానమును...సూచించు నాలయాదిచిహ్నము లెవ్వియుఁ గాలటియందు లేనిలోపమును నివారించుటకు జగద్గురుబిరుదాంకితులయిన శృంగగిరి...శ్రీసచ్చిదానందశివాభినవనృసింహభారతీస్వాములవారు కాలటిలో రెండాలయములు నిర్మించి యం దొకదానిని శంకరులకును మఱియొకదానిని విద్యాధిదేవతయగు సరస్వతికిని నర్పించి సౌమ్యసం॥ మాఘ శు ౧౨ సోమవారమున మహావైభవముతోఁ బ్రతిష్ఠోత్సవమును జరపియుండుటచే శృంగేరిపీఠస్థులుగూడఁ గాలటినే యాచా

ర్యులవారి జన్మస్థానముగ నంగీకరించి యీవిషయమును నిర్వివాదాంశముగ నొనరించి రని చెప్పఁదగియున్నది.

## —♦ జననము. ♦—

...శివగురుండును విశిష్టయు సంతానభాగ్యంబును గాంచలేక దానికై పెక్కువ్రతంబులు సలిపిరి. అంతకుముందే తాను లోకోపకారార్థ మవతారమెత్త వలయునని కైలాసమందుఁ దీర్మానింపఁబడియుండుటచేఁ బార్వతీరమణుఁ డీదంపతులకుఁ బ్రత్యక్షమయి గుణహీనులగు పెక్కండ్రుసుతులఁ గోరక యల్పాయుష్మంతుఁడైనను గుణవంతుఁడగు సుతరత్నము నొక్కనినే యపేక్షించుటచే వారియం దనుగ్రహించి తాన వారి...కుద్భవించెను...దైవభక్తిగల యాదంపతులకు వార్ధకదశయం...దొక కొమరుండు గలిగెనని తాత్పర్యము...చిదంబరమున నివసించుచుండిన బ్రాహ్మణుఁ డొకఁడు సన్యసించి తపంబున కేగెననియు నాతని భార్య నటరాజమూర్తిని భక్తిశ్రద్ధలతోఁ గొలుచుచు...తన్మహిమచేఁ బురుషసంసర్గము లేకయే గర్భవతియై శంకరుని గనెననియు నానందగిరి వ్రాసియున్నాఁడు. కొందఱుస్త్రీలు శివాలయమునకుఁ బోయి సంతానమునకై...తద్దేవునకు మొక్కులిడుచుండ వారితో గుడికిఁబోయిన యొక వితంతువు బాల్యచాపల్యముచేతను నజ్ఞానముచేతనుం దానును సంతానమును గోరి మ్రొక్కి శివుని యాజ్ఞచే శంకరుని గనెనని మలయాళదేశమున నొక కథగలదు. ఈకథల యన్నిటియందును నేదియో యొకవిధమున శంకరుని యతిమానుష జన్మ నిరూపింపఁబడినది. ఇది యద్వైతమతద్వేషుల కెంతేనియు నసహ్యము...మధ్వపండితుండగు మణిమంజరీ గ్రంథకర్త కాలటిలో నొక పడుచువిధవ శాస్త్రవిహితమగు బ్రహ్మచర్యమును వదలి దుష్టప్రవర్తన నవలంబించుటచే గర్భమును దాల్చి శంకరుని గనెనని వ్రాసెను. శంకరుని తల్లి వెలివేయఁబడినట్లును మృతినొందినపు డుత్తరక్రియలు జరపువా రెవ్వరును లేకపోవుటయే కాక కళేబరమును స్పృశించువారును లేకపోయినట్లును నందుచే నతఁడు తల్లియందుండిన ప్రేమచేఁ దురీయాశ్రమధర్మ మతిక్రమించి తానే యామెకుపరకర్మము సల్పినట్లును బ్రతీతి కలిగియుండుటచే శంకరుని తల్లియం దించుక దోష ముండియుండవచ్చునని కొందఱు దురూహఁ జేయుచున్నారు. ఈప్రతీతికి...నిదర్శనము లెవ్వియు లేవు. ఇవియన్నియు నవిశ్వసనీయములగు మూఢకల్పనలని నిర్భయముగ నిరాకరింపవచ్చును. ఈకథలయందు మిక్కుటములగు నసందర్భములు గూడఁ గలవు. శంకరులు 2 సం॥ ఈడుగల బాలుఁడై యున్నపుడు తండ్రిపోయిన...జరగవలసిన సంస్కారమువిషయమై కష్ట మేమియుఁ దోఁపలేదు. తరువాతఁ గొన్ని సం॥ లకుఁబోయిన తల్లివిషయమున సంశయ మేలకలుగవలయును ? శంకరుఁడు తండ్రి మరణానంతరము తన సిద్ధాంతములను లోకమునకు వెల్లడిచేయుచుఁ బెక్కుమతములను ఖండించి పెక్కండ్రు మత గురువులతో వైరమును సంపాదించుకొని యుండెను. వారెందెనను గిటక యిట్టి దుష్ప్రతీతిని శంకరుని తల్లియం దారోపించిరా ?

అట్లును జరిగినట్లు తోఁపదు. శంకరునియందా రోపింపఁబడిన దోషములను లెక్కించి యవి నిర్హేతుకములని మాధవాచార్యులు చూపియున్నాఁడు. ఇట్టియపవాదము మాధవాచార్యుల కాలమున నుండియుండినచో దానినిగూడ నాయన ఖండించి యుండఁడా ? అందుచే మాధవాచార్యుల కాలమునం దిట్టికింవదంతులు పుట్టియుండ లేదనియు నిటీవల నద్వైతమతద్వేషులో మాధ్వభక్తిపరాయణులో కల్పించిరనియుఁ దోఁచెడిని. ... ...

## —♦ జననకాలము. ♦—

ఇఁకశంకరు లేకాలమునఁ బుట్టినవారని నిర్ణయింప వలసియున్నది. ఇది బహు వివాదాంశము. ఈవిషయమునఁ బూర్వగ్రంథములు పరస్పర విరుద్ధములై యవిశ్వసనీయములై యున్నవి.

(౧) ఆనందగిరివిరచితశంకరవిజయమునఁ గలియుగాబ్దము 3౫౨౦ శ్రీముఖ సం॥అని యున్నది. క్రీస్తుశకము ౫౧౯

(౨) కన్నడశంకరవిజయమునఁ గలియుగాబ్దములు ౯3౪ హేవళంబిసం॥ మిథునమాస శు ౧3 గురువారమని యున్నది. క్రీస్తుశకమునకుఁ బూర్వము ౨౧౬౭

(3) చోళదేశమునందలి గ్రంథములలోఁ గలియుగాబ్దములు 3౮౯౬ ఈశ్వర సం॥ వైశాఖశు౫ అని యున్నది. క్రీ॥ ౭౯౫

(౪ శుకగ్రనాడీగ్రంథమున శ్రీకృష్ణభగవానులకంటె 3౨సం॥లకుఁ బూర్వమని యున్నది. ఈగ్రంథములకుఁ దర్వాతి యాధారములు...శంకరమఠములలోని గురుపరంపర

(౧) శ్రీ శృంగగిరిపీఠాధిపతుల సన్నిధానమున నున్న పరంపర ప్రకారమాచార్యులవారి జననము కలియుగాబ్దములు 3౦౫౮ ఈశ్వర సం॥ వైశాఖ శు౫ ఆదివారమని తెలియుచున్నది. క్రీ॥పూర్వము ౪3సం॥ల క్రిందట

(౨) శ్రీ ద్వారకాపీఠాధిపతుల ... పరంపర ప్రకారము కలియుగాబ్దములు ౨౬3౧ అయినట్లు కన్పట్టుచున్నది. క్రీ॥ పూర్వము ౧౪౭౦ వ సం ...

(3) శ్రీ విరూపాక్షపీఠాధిపతుల ... పరంపర ప్రకారము కలియుగాబ్దములు 3౮౮౯ అని చూపబడెడిని క్రీ॥ ౭౮౮ ...

(౪) శ్రీ కుంభకోణపీఠాధిపతుల ... పరంపర ప్రకారము కలియుగాబ్దములు ౨౫౯3 నందన సం॥ అని చూపట్టుచున్నది. క్రీ॥ పూర్వము ౧౫౦౮ సం॥

... పరస్పరభేదముచే నీయాధారములం దేది విశ్వసనీయమో యేది యవిశ్వసనీయమో నిర్ధారణచేయుట దుష్కరము ... శృంగేరి ... పరంపరయందుఁ బెక్కులోపములు కన్పట్టుచున్నవి. శంకరుని తరువాత శృంగేరిపీఠము నధిష్ఠించిన సురేశ్వరాచార్యులు ౨౦౦ సం॥ పైకాలము ... ండినట్లు పరంపరయందు వ్రాయఁబడియున్నది. ఇది నమ్మఁదగినవిషయము గాదు. ౨౦౦ సం॥ పైకాలము పరంపరను దెలుపు దృష్టాంతములు లేకపోవుటచే నక్కాల మంతయు నొక్క సురేశ్వరాచార్యులకే యారోపింపఁబడినట్లూహింపనగును.

కదళీబ్రాహ్మణులు శంకరులు ౨౦౦౦ సం॥ క్రింద ... క్రీస్తుశకప్రారంభ మునఁ బుట్టెనని చెప్పుచున్నారు. కొందఱు క్రీ॥3,౪ శతాబ్దములలో నాచార్యులవా రవతరించినట్లు చెప్పుచున్నారు. కర్నలు మెకంజిగారి పుస్తకభాండాగారములో దొరకిన కొంగరాజ్యచరిత్ర వ్రాఁత ప్రతివలన నాచార్యులు క్రీ॥ ౧౭౪ సం॥లో నుండిన తిరువిక్రమదేవచక్రవర్తితో సమకాలీనులనియు శృంగేరిలోఁగల ప్రతీతి వలన ... ౧౨౦౦ సం॥ క్రింద నుండినట్లును దెలియుచున్నది. భోజప్రబంధము శంకరుని భోజరాజుతో సమకాలీనునిగఁ జెప్పుచున్నది. ఆగ్రంథమునుబట్టి ... క్రీ॥ ౪, శతాబ్దములలో నొకదానియం దుండిన ట్లగుపడును. వైష్ణవపండితులు ... శాలివాహనశకము ౯ వ శతాబ్దమునందుఁ గ్రీస్తుశకము ౧౦ వ శతాబ్దమం దుండెనని చెప్పుచున్నారు. మధ్వసిద్ధాంతమునుబట్టి శంకరులు 3 సారులు జనన మొందిరనియుఁ గడసారి ౬౦౦ సం॥ ల క్రింద నవతరించిరనియుఁ దెలియుచున్నది. ఇది శంకరులు తమమతాచార్యుల తరువాతివాఁడని స్థిరపఱచుటకు వారు కల్పించిన సిద్ధాంతముగాని దానియందు వారికే విశ్వాస ముండియుండునని తోఁచదు. డాక్టరు పైల రాచార్యులవారు ౯౦౦ సం॥ ల క్రిందటివారనియుఁ గోలుబ్రూకును రామమోహనరాయలును ౧౦౦౦ సం॥ క్రిందటివారనియుఁ జెప్పియుండిరి. డాక్టరు బుచనను గారు కోలుబ్రూకుగారి యభిప్రాయమును బలపఱచుచున్నారు. వారు తమయభిప్రాయమునకుఁ గేరళోత్పత్తియను నొక పూర్వచరిత్రనుండి డాక్టరు డంకన్‌గారు వ్రాసిన విషయముల నాధారపఱచుకొనియున్నారు. అయితేఁ గర్నలు మెకంజీగారి పుస్తకభాండాగారమునఁ గేరళోత్పత్తియను గ్రంథముయొక్క భాషాంతరీకరణమున కొక వ్రాఁతప్రతి గలదు. దానియందు శంకరులు ౧౪౦౦ సం॥ ల క్రిందటఁ గ్రీస్తు శకము ౫ వ శతాబ్దము మధ్యమున నుండినట్లు వ్రాయఁబడియున్నది. డంకనుగారు చూచిన ప్రతియైనను లేక మెకంజీగారి భాషాంతరప్రతియైనను దప్పుగా నుండవలెను. అయినను విల్సనుగారు డంకనుగారితోను గోలుబ్రూకుగారితోను నేకీభవించి శంకరులు ౧౦౦౦ సం॥ లక్రిందట ౯ వ శతాబ్దపు టారంభమున నుండినట్లు నిర్ధారణఁజేయుచున్నారు. ఇందుచే మెకంజీగారి భాషాంతరప్రతియే తప్పుగా నెన్నఁబడినట్లు తేలుచున్నది.

ప్రస్థానత్రయమునకు నందు ముఖ్యముగ బ్రహ్మసూత్రములకు శంకరులు రచించిన భాష్యములు మహాభాష్యమును బోలియుండుటచే...పాణిని శిష్యులనియుఁ బాణిన్యాచార్యులు తురీయాశ్రమస్వీకారానంతరము గోవిందపాదులను నామమును స్వీకరించి శంకరులకు గురువుగ నుండిరనియు నందుచే శంకరులును బాణినియు సమకాలీనులనియు మఱియొకసిద్ధాంతము.

...తల్లాప్రగడ సుబ్బారావుగారును ... వావిలాల శివావధానులుగారును... కొక్కొండ వెంకటరత్నముపంతులుగారును నాచార్యులవారికాలమునుగూర్చి...కొంత వఱకుఁ జర్చించియున్నారు. అందుఁ దల్లాప్రగడ సుబ్బారావుపంతులుగారు...ద్వార కాన నమూలోని ... మువలన సూచింపఁబడు కాలనియతి ...

ఈ...కాలనిర్ణయములు పెక్కుకారణములచేఁ దృష్టికరముగ లేవని చెప్పవల సియున్నది...కాశీనాథత్ర్యంబక తెలాంగు...శంకరులు...౭౮౮, ౮౨౦ సం॥ ప్రాంతముల నుండెనని యభిప్రాయపడుచున్నారు. దీనికి వారుచూపిన యాధారము...సూత్రభాష్యమును మగధదేశపురాజును బౌద్ధమతస్థుఁడునగు పూర్ణవర్మనుదమ సమకాలీనునిగ వ్రాసియున్నారనియు నీరాజు ౬ వ శతాబ్దపు టంతమున నుండెనవాఁడనియు. ఈవిషయములను గూర్చియింకను దృష్టికరమగు సాక్ష్యసాధనములు దొరకినఁగాని యంగీకరించుటకువీలు లేదు....మాక్సుముల్లరు...శంకరులు ౭౮౮ వ సం॥ జననమొందిరని సిద్ధాంతీకరించిరి ...౮ వ శతాబ్దమునన్నో చివరనో శంకరు లుండిరను సిద్ధాంతము యుక్తియుక్తమును నంగీకరింపఁదగినదియు నని నాయభిప్రాయము...శంకరవిజయములను శంకర విరచితగ్రంథములను జదివినవారికి శంకరుని యవతారమునకుఁ బూర్వమే బౌద్ధ మతము మనదేశమున నంతరించినట్లు తోఁచకమానదు. బౌద్ధులను శంకరులు గానుగలలో వేసి యాడించిరనియుఁ గ్రూరకర్మములచే నామతమును రూపుమాపిరనియు శంకరుని కాధిక్యముకల్పింపఁజూచిన కొందఱు మూఢభక్తిపరాయణులు నిరాధారములగు కథలను బుట్టించినను నవి కేవల మవిశ్వసనీయములని యెంచనగు. శంకరుని శాంతిస్వభావమునకును మతసహిష్ణుతకును... మతసిద్ధాంతములకును నట్టి క్రూర పద్ధతు లననుగుణములు. శైవవైష్ణవసంప్రదాయముల ననుసరించి బయలువెడలిన కాపాలికాది తుచ్ఛమతముల ఖండనమందుమాత్రమే కాక యాచార్యుల శక్తి పూర్వమీమాంసా న్యాయ సాంఖ్యమత ఖండనమందే ముఖ్యముగ వినియోగించిన ట్లగుపడుచున్నది. మాధవాచార్యులవారు శంకరులు ౨ సారులుమాత్రమే బౌద్ధులతో వాద మొనరించినట్లు వ్రాసియున్నారు. మొతటిసారి బాహ్లీకదేశమున నొకానొక యర్హమునితోఁ బ్రసంగించిరి. అర్హముఁడు మాధ్యమికబౌద్ధసిద్ధాంతములను దెల్పినట్లు చెప్పఁబడినది. బాహ్లీకము ప్రస్తుతము బాక్ దేశముగా శాస్త్రజ్ఞులచే నిర్ణయింపఁబడినది. శంకరులు కాశ్మీరములో సర్వజ్ఞపీఠము నధిష్ఠించుటకుఁ బూర్వమాయనతో వాదించినవారలలో బౌద్ధు లుండినట్లు వినుచున్నారము. ఇది రెండవసారి. ఇందుచే శంకరుని కాలమున నిండియాదేశమున బౌద్ధమతప్రచారము లేదనియు నప్పటికే కాశ్మీరమువఱకును నింకను దానికిఁ బశ్చిమమునకును బౌద్ధులు తఱుమఁబడిరనియు నిశ్చయింపనగు. బౌద్ధుల నిండియానుండి తఱిమివేయుభారము కార్తికేయావతారమగు కుమారిలభట్టుచేఁ బూనఁబడెనని మాధవాచార్యులు వ్రాయుచున్నారు. మాధవాచార్యోక్తిని గేరళోత్పత్తియను పూర్వచరిత్ర బలపఱచుచున్నది. ఈగ్రంథమందు శంకరునికి నూఱుసం॥ లకుఁ బూర్వము కుమారిలభట్టు కేరళదేశమునుండి బౌద్ధులను బాఱఁదోలినట్లు వ్రాయఁబడియున్నది. మఱియుఁ దులువదేశపు బ్రాహ్మణులలోఁ గుమారిలభట్టు శంకరుని రాక కొకశతాబ్దము పూర్వము మతస్థాపనఁజేసియున్నాఁడని ప్రతీతిగలదు. తులువబ్రాహ్మణులు మొదట [illegible]. వారిని శంకరుఁడు తనమతమునకుఁ ద్రిప్పుకొనెను.

... శంకరులు ౬ వ శతాబ్దమున నుండిన ట్లొప్పుకొనుటకు వీలులేదు. ఏడవ శతాబ్దము మధ్యమునఁగూడ మగధదేశమున బౌద్ధమతము రెండవ శిలాదిత్యుఁడను రాజుక్రింద నుచ్ఛదశయందుండెనని హెనిట్సాంగు వ్రాయుచున్నాఁడు. అందుచే శంకరుఁ డింకను దరువాతివాఁడై యుండవలెను. ౧౫౦ సం॥ లలో బౌద్ధమతము పశ్చిమోత్తరముల యెల్లలకవతలను బాఱఁదోలఁబడియుండుటయుం దసాధ్యము కను పట్టునందున మాక్సుముల్లరుతో మన మేకీభవించి ౭౮౮ వ సం॥ లో శంకరుఁడు జన్మించిన ట్లంగీకరింపవచ్చును. శంకరునికి శిష్యుఁడయిన సురేశ్వరాచార్యులు ౮ వ శతాబ్దమున నుండినట్లు శృంగేరి ... గురుపరంపరలో వ్రాయఁబడిన విషయము దీని బలపఱచుచున్నది. అయితేఁ గుమారిలభట్టు శంకరునియెదుట నగ్నిప్రవేశమైనట్లు మాధవాచార్యులు వ్రాయుచున్నారు. కావున వారిరువురును సమకాలీనులై యుండవలెనను శంక వొడమవచ్చును. కుమారిలభట్టు శంకరునిముందఱ మరణమొందెననుట యైనఁ గనఁబఱపఁబడిన ప్రబలసాక్ష్యములకు విరోధముగానుండుటచే నవిశ్వసనీయమని తలంచెదను ... బౌద్ధమతఖండనమును శంకరులు రాకపూర్వమే సంపూర్తికావించిన కార్తికేయు సందర్శనము శంకరవిజయమున కవసరమని వారి సమావేశమును వర్ణించియుందురు. మఱియు భట్టు జైమిని శిష్యుఁడనియుఁ బూర్వమీమాంసను వ్యాప్తిఁజెందించెననియుఁ బెక్కువచనములు గలవు. శంకరుని కాలమునకే దేశమందమితవ్యాప్తిఁజెందిన పూర్వమీమాంసకాచార్యుఁడైన భట్టు శంకరునికి సమకాలీనుఁడై యుండనేరఁడు. కాఁబట్టి భట్టు బౌద్ధమతమును బాఱఁదోలినవారిలోనివాఁడనియు శంకరులు రాకపూర్వమే బౌద్ధులు బాకు కాశ్మీరములవఱకు వెడలఁగొట్టఁబడిరనియు ౮ వ శతాబ్దము నంతమున శంకరుఁడుద్భవించెననియు నాయభిప్రాయము. అయినను నీవిషయ మిప్పటికి శంకాస్పదముగ నున్నదనియు శంకరునికాల మిదమిత్థమని చెప్పుటకు వీలులేదనియు నొప్పుకొనవలసియున్నది.

—♦ నీతి ♦—

శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోపిసన్
మణినా భూషితస్సర్పః కి మసౌ న భయంకరః॥

తే॥ చదువుసంధ్యలు గలిగిన జాణయైనఁ జెడ్డనడవడియున్నచోఁ జేర్పఁదగదు.
మణులచే సమలంకృతమ్మయిన పాము సరస కరుదెంచనిచ్చినఁ గఱవకున్నె ?

శ్లో॥ భాగ్యం ఫలతి సర్వత్ర న విద్యా నచ పౌరుషం
సముద్రమంథనే లేభే హరి ర్లక్ష్మీం హరో విషమ్.

తే॥ చదువుకొనుఁగాక పురుషార్థమొదవుఁగాక. ధన మదృష్టంబులేక ప్రాప్తంబుకాదు.
పాలసంద్రంబు తరచిన కాలమందు సిరి హరింజేరె. గరళంబు శివుని జేరె.

శ్లో॥ దుర్జనః ప్రథమః పూజ్య స్సజ్జన స్తదనంతరం
ముఖప్రక్షాళనా త్పూర్వం గుద ప్రక్షాళనం యథా.

తే॥ తొల్లి మర్యాదఁగావించి దుర్జనునకు సజ్జనున కటుతరువాత సలుపవలయు.
ఆననక్షాళనముఁ బూర్వ మందఱికిని విధి గుదక్షాళనమ్మయి వెలసినటులు.

## —♦ ఈశ్వరునిమూర్ఖత్వము ♦—

(త్రిలింగ)

దయానందులవారు... "ముఖం కిమస్య, బ్రాహ్మణోస్యముఖమాసీ" త్తను మంత్రమునకు వ్యాఖ్యానముఁ జేయుచు నీశ్వరునియందు మూర్ఖత్వనీచత్వ ... ములుండునని యొప్పుకొనియున్నారు. బళిరేబళి... వీరిదృష్టిలో నీశ్వరుఁడు మిక్కిలి మూర్ఖుఁడు. ఆర్యసామాజికులకు... తెలియదనియుఁ దనవ్రాఁతలనే యాధారముగాఁ గొని యీశ్వరుని మూర్ఖుఁడనియుఁ దన్నుఁబరివ్రాజకులనియు వేదజ్ఞులనియు మహర్షి యనియు నమ్మురనియు... వారికిఁ దెలిసియుండెను... ఆర్యసామాజికులును దమయనభిజ్ఞత్వమువలన నీశ్వరుఁడు మూర్ఖుఁడనియు దయానందులవారు విద్వాంసులనియు స్వీకరించిరి. అవిద్యవలనఁ బ్రపంచమందు గొప్పయనర్థములను జేయుచుందురు. ఆర్యసామాజికులలో నొకఁడైనను వేదజ్ఞుఁడుండియున్నచోఁ దక్షణమే దయానందులవారీశ్వరునియందు మూర్ఖత్వాదిగుణములు స్వీకరించుటయను నది సర్వవిధముల ననయోగ్యకార్యమనియు నది... నాస్తికభావమునకు నిదర్శనమనియు సర్వసాధారణులకు వెల్లడిఁజేసియుండును... విద్వాంసుఁ డొక్కఁడును లేనందున వారీశ్వరుఁడు మూర్ఖుఁడనియే నమ్మకొనిరి... సత్యార్థ ప్రకాశము ౬౭ వ పుటలోఁ బురాణాదికములు విషమిశ్రితాన్నమువలె ... త్యాజ్యములని వ్రాసియున్నది. దయానందులవారు ... పురాణములలో నసత్యము ... న్నదని వ్రాయుచున్నారు. కాని పురాణములలో నసత్యము లేమేమి కలవో యవి మాత్రము చూపించ లేదు. ఇవ్విషయముగురించి మహాభారతములో "పురాణం మానవో ధర్మ స్సాంగో వేద శ్చికిత్సితం, ఆజ్ఞాసిద్ధానిచత్వారి నహంతవ్యాని హేతుభిః" అను శ్లోక మున్నది. పురాణము మనువుచెప్పిన ధర్మము సాంగమైన వేదము వైద్యకము నాజ్ఞాసిద్ధములు. వీనిని దర్కములచే ఖండింపఁగూడదని దీనికర్థము.

మనుస్మృతి, శ్లో॥ వేదస్స్మృతిస్సదాచార స్స్వస్య చ ప్రియ మాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహు స్సాక్షా ద్ధర్మస్య లక్షణమ్.

వేదము ధర్మశాస్త్రము సదాచారము నాత్మప్రేమమునను నాల్గుప్రకారములచే ధర్మము తెలియఁబడుచున్నదని దీనితాత్పర్యము. సదాచారమును గురించి మనుస్మృతి యిట్లు వ్రాయుచున్నది.

శ్లో॥ యస్మిన్ దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః
వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే.

ఏదేశమం దేయాచారము సమస్తజాతులకుఁ బరంపరగా వచ్చుచున్నదో యాయాచారమే ధర్మమని చెప్పఁబడుచున్నదని దీనితాత్పర్యము. సదాచారము పురాణములవలనఁ దెలియుచున్నది ... పురాణములు సత్యములు మాననీయములు

స యథార్ద్రైధాగ్నే రభ్యాహితస్య పృథగ్ధూమా వినిశ్చరంత్యేవం వా రేస్య మహతో భూతస్య నిశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేద స్సామవేదో థర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషద శ్లోకాస్సూత్రాణ్యనువ్యాఖ్యానాని వ్యాఖ్యానాని...అస్యైవ వేతాని సర్వాణి నిశ్వసితాని. అ ౬ బ్రా ౪ మం ౧౧

పచ్చికంటిచెఱకుల సంయోగమువలన నగ్నిలో నానావిధములగు ధూమములు ప్రకటింపఁబడులాగున ఋగ్యజుస్సామాథర్వవేదములును నితిహాసపురాణ విద్యోపనిష చ్ఛ్లోకసూత్ర వ్యాఖ్యానానువ్యాఖ్యానములు నీపరమాత్మయొక్క శ్వాస భూతములు. మఱియు, ఛాందోగ్యమం దేమికలదో చూడుఁడు.

సహోవాచ ఋగ్వేదం భగవోధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్ప దేవజనవిద్యా మేత ద్భగవోధ్యేమి. ప్ర ౭ ఖండము ౧

ఋగ్యజుస్సామాథర్వణ వేదముల నెఱుంగుదును. ఇతిహాసపురాణ పంచమవేదములను గదివితిని. శ్రాద్ధకల్పము గణితము నుత్పాతములఁదెలుపు దైవశాస్త్రము నిధిశాస్త్రము తర్కము నీతి దేవవిద్య యుపనిషద్విద్య భూతతంత్రము ధనుర్వేదము జ్యోతిషము సర్పవిద్య నృత్యగీతాదులు నభ్యసించితినని నారదులవారు చెప్పిరి.

---

## —♦ గోలకొండ పట్టణము. ♦—

[ ముట్నూరి కృష్ణారావుగారు ]

నిజామురాష్ట్రములో ముఖ్యముగాఁ జూడఁదగినది గోలకొండకోట. ఈ దుర్గము ప్రఖ్యాతచరిత్రకలిగి మిక్కిలి రమణీయమై యిప్పటికిని దేశదేశముల నుండియు వచ్చు ననేకయాత్రికులచే దర్శింపఁబడుచున్నది. మూడువందల సం॥ ఈగోలకొండపట్టణము నిరుపమానసౌభాగ్యరాశియై వజ్రవైడూర్యాది మణుల గనియై విలసిల్లెనని పెరిలోటియను యాత్రికుఁడు వక్కాణించియున్నాఁడు.

ఈకోట హైదరాబాదునగరమున కేడుమైళ్లదూరమున నేకాంతముగ నున్న యొక పర్వతము శిఖరముపై నిర్మింపఁబడియున్నది. ఈపర్వతపుఁ బ్రాంతమున నలుప్రక్కలఁ జెదరిపడి నానాభీకరాకారములుదాల్చిన శిలారాసులను జూచునపుడు కొండొకకాలమున నీస్థలము ఘోరయుద్ధములకు రంగమై మహాప్రళయకాలాంబుధిచేఁ బరిమార్జితమై యుండియుండవలయునని తోఁచును. దీర్ఘప్రాకారములతోడను గాలవర్ణ వప్రములతోడను నున్నత ప్రాసాద శిఖరములతోడను సమాధుల... తోడను వెలయుచున్న యీ నిర్జనభీకరదుర్గము సంధ్యారాగోద్దీపితమగుచుండ నపుడు ప్రాచీనవైభవంబును విచిత్రాఖ్యానంబులును బ్రస్తుతనిర్జనత్వంబును నొకసారి మన మనఃపథంబున గోచరించి యైహికైశ్వర్యంబు లన్నియుఁ క్షణభంగురంబులని...తప్పక తోఁపించును.

## —◆ కుతుబ్‌షాహి నవాబులు ◆—

గోలకొండయొక్క ప్రాచీనచరిత్ర యగమ్యముగనున్నది. కాని మహమ్మదీయదండయాత్రాపరంపరల నాపుటకై విజయనగరరాజులు నిర్మించిన చిన్నచిన్న కోటలలో నిది యొకటనిమాత్రము తెలియుచున్నది. ఓరుగల్లు రాజ్యము భామినీరాజ్యములో నంతర్భాగమైనపిదప దాని తూర్పుభాగమునకు రాజధానినగరమై విలసిల్లుచుండెను. తరువాత ౧౬ వ శతాబ్దమునఁగాని దీనిచరిత్రము మనకు సరిగాఁ దెలియుటలేదు. ఈకాలముననే మహమ్మదుషాచక్రవర్తి త్రిలింగదేశములో శాంతినిస్థాపించినందునకై సుల్తానుకూలీయను నొక తురుష్కునికి గోలకొండను దాని సామీప్య ప్రదేశమును నిచ్చి యాతనిఁ దన సుబేదారుగ నియమించెను. ౧౫౧౨ వ సం॥ సుల్తాను కూలి కుతుబుల్ముల్కను బిరుదువహించి మహమ్మదుషా యాధిపత్యమును ద్రోసివేసి గోలకొండను దన ప్రధాననగరముగాఁ జేసికొని యప్పటివఱకు నున్న మట్టికోటను నిర్మూలముచేసి రాతికోటనుగట్టించెను. ఈయన తరువాతిరాజులు నుగ్రముగఁగోటను వృద్ధిపఱచిరి. ఇబ్రహీముకుతుబ్‌షాహాయనునతఁడు గోలకొండను౧౫౫౦,౧౫౮౦వఱకును రాజ్యముచేసెను. ఈయనప్రభుత్వమునందే మహారాష్ట్రులు ప్రబలిస్వాతంత్ర్యమునకై శివాజికిఁబూర్వమేకొన్ని ప్రయత్నము లొనర్చిరి. కుతుబుషాహాతన...సర్దారుఁడగుజగదేకరావు సహాయముతో ననేకహిందూరాజ్యములను జయించి రాజ్యము విస్తీర్ణముగావించి మొదట విజయనగరరాష్ట్రాధిపతియగు రామరాజుయొక్క మైత్రిని సంపాదించి దేశమున శాంతిని నెలకొల్పినను దుదకు మిత్రద్రోహియై ౧౫౬౫ వ సం॥ ఇతరతురుష్కరాజులతోఁ గలసి తాలికోటయుద్ధమున రామరాజును జంపి తనకు శరణమిచ్చిన విజయనగరపట్టణమును నాశనమొనరించెను. ఈయనకాలముననే గోలకొండ యుచ్చస్థితినంది ప్రకాశించినది. కొండవీడు రాజమహేంద్రవరము కసింకొండ మొదలగునవి ముఖ్యమగు ఠాణాలుగ నుదాహరింపఁబడుటచే నప్పటి రాజ్యవిస్తీర్ణతను దెలిసికొననగును. ఈయనయే గోలకొండ కోటగోడలను గట్టించెను. అనేక ప్రాసాదముల నిర్మించియుఁ దటాకములను ద్రవ్వించియుఁ బుష్పోద్యానవనములను వేయించియు గోలకొండపట్టణమును ననేకవిధముల శోభిల్లఁజేసెను. ఆంధ్రభాషను బోషించి యనేకకృతులఁ గైకొనెను.

ఇబ్రహీముకుతుబుషాహా తరువాత మహమ్మదుకుతుబుషాహా రాజ్యాధిపత్యము వహించెను. జనసంఖ్య హెచ్చుటచేతను జలసౌకర్యము లేకుండుటచేతను నీతఁడు గోలకొండనగరమునకుఁ బదిమైళ్ళదూరమున నున్న మూసీనదియొడ్డునఁ బ్రస్తుతము

హైదరాబాదని పిలువఁబడుచున్న పెద్దపట్టణమును గట్టించెను. ఇప్పటికిని హైదరాబాదున కలంకారములుగనున్న చారుమీనారు జుమ్మామసీదు మొదలగు సుందర మందిరము లీయనకీర్తినే పొగడుచున్నవి. రాజ్యవైశాల్యాకాంక్షను విడిచి ప్రజా సౌఖ్యముకొఱకును దేశశాంతికొఱకును బ్రయత్నించెను.

తరువాత నబ్దుల్లాహుస్సేన్ కుతుబుషాహ రాజ్యాధిపత్యము వహించెను. లోక విఖ్యాతిగాంచిన రాజకార్యధురంధరుఁడగు మీరుజుంలా యీయనయొక్క మంత్రియే. ఈ మంత్రి హిందూమతవిద్వేషియై దేవాలయములలోని ప్రతిమలను గరఁగించి ఫిరంగులను జేయించెను. ఈ ప్రజాపీడనమును నవాబు సహింపలేక మీరుజుంలాను శిక్షించెను. దీని కితఁడాగ్రహపూరితుఁడై యప్పుడు దౌల్తాబాదునందు ఢిల్లీశ్వరునకుఁ బ్రతినిధిగానున్న యౌరంగజేబునకు జాబువ్రాసి గోలకొండదుర్గమును ముట్టడింపఁజేసెను. ఈ వార్త యౌరంగజేబు తండ్రియగు షాజహానునకుఁ దెలిసి తత్క్షణమే గోలకొండముట్టడి నిలిపి తిరిగి రాఁగోరెను. కాని యౌరంగజేబు గోలకొండనవాబును ఢిల్లీశ్వరునకు సామంతప్రభువుఁగాఁ జేసికొని సం॥ కుఁ గోటిరూపాయల కప్పమును విధించెను.

గోలకొండలో నీయనగట్టించిన గొప్ప యాయుధాగార మిప్పటికిని జూడవచ్చును. ఇది మూడంతస్థులభవనము. దీని మిద్దెపై నెక్కి చూచినయెడల దేశసౌభాగ్యమును జెక్కు చెదరకుండ జూడవచ్చును.

గోలకొండనేలిన కడపటినవాబు అబూహాసన్ కుతుబుషాహ. సౌజన్యము వలనను బ్రజావాత్సల్యమువలనను దానీషా (తానీ + షహ) అను ప్రియనామమును బడసెను. జ్ఞానసంపన్నులగు బ్రాహ్మణులయెడలఁ బూజ్యభావముగలిగి మాదన్నయను పండితశ్రేష్ఠుని బ్రధానమంత్రిగఁ జేసెను...అక్కన్నకు సైన్యాధిపత్యము నొసంగెను.

## —♦ అక్కన్న మాదన్నలు. ♦—

ఈ యక్కన్న మాదన్న లాంధ్రులని కొందఱును మహారాష్ట్రబ్రాహ్మణులని మఱికొందఱును జెప్పుచున్నారు. వీ రెవ్వరైనను నాంధ్రవాఙ్మయము జీవించియుండునంతవఱకును నాంధ్రేతిహాసము స్మృతిపథంబున నుండునంతవఱకును గీర్తిని బడసియుందురు. దానధర్మములయందును బ్రజానురక్తియందును వీరికి మఱియొకరు సాటిరారు. అనేకవిద్వాంసులఁ బోషించి భాషాసేవ యొనర్చిరి.

వీరిసహాయమువలననే యీస్టిండియాకంపెనీవారు మదరాసునందును మచిలీపట్టణము నందును విశాఖపట్టణమునందును వర్తకము ప్రారంభించిరి. ఈ యమాత్యశ్రేష్ఠుల యనుగ్రహమువలననే యా కంపెనీవారీప్రాంతమున నిరాఘాటముగ వాణిజ్యమును వృద్ధిచేసికొని భవిష్యత్సామ్రాజ్యనిర్మాణమునకుఁ బునాది వేయఁజొచ్చిరి. ఇప్పటికి నాంధ్రదేశమున నెవఁడు పరమభాగవతోత్తముఁడుగ సంస్మరింపఁబడుచున్నాఁడో యెవని రామభక్త్యమృతలహరి దేశమునం దంతటను బ్రవహించెనో యెవని భక్తివిశేషములకు భద్రాచల దేవాలయము స్మారకచిహ్నముగ నున్నదో యట్టి రామదాసుఁ డక్కన్న మాదన్నల మేనల్లుఁడే.

ఈ యమాత్యశ్రేష్ఠుల యధికారమును దానీషాయొక్క తురుష్కోద్యోగస్థులోర్వఁజాలక ఢిల్లీశ్వరుఁడగు నౌరంగజేబుతోఁ గుట్రలుచేసి గోలకొండసామ్రాజ్య వినాశమునకుఁ గారకులైరి. ఔరంగజీ బెంతయో కాలమునుండి భారతసామ్రాజ్యాధిపత్యము వహించుటకుఁ గలవరించుచుండెను. బీజపురమును స్వాధీనపఱచుకొనిన తరువాత క్షుత్పీడితకేసరివలె గోలకొండదుర్గముపై దుముకఁజూచుచుండెను. ౧౬౮౭ వ సం॥ అతిఘోరమగు గోలకొండముట్టడి ప్రారంభమయ్యెను. ఈముట్టడి యెనిమిదినెలలవఱకు జరిగెను. ఉభయపక్షములవారి ధైర్యస్థైర్యములును నద్భుతముగ నుండెను. క్షామమును వ్యాధియు నా రణరంగమును మఱింత భీకరముగఁ జేసెను. సంధిప్రయత్నము లన్నియు విఫలమయ్యెను. ఔరంగజేబు...కుఁ దృప్తిలేదయ్యె. తానీషాయొక్క తురుష్కోద్యోగులు రాజద్రోహులైరి. తానీషా తన పూర్వమాంద్యమును విసర్జించి నిజశౌర్యసాహసములను బ్రకటించెను. కాని యొక దుర్గద్వారపాలకుఁడగు నబ్దుల్ఖానుఁడు రాజద్రోహియై స్వామిద్రోహియై శత్రువులకు ద్వారము తెఱచెను.

## —♦ అబ్దుల్రజాకు ♦—

ఈ శత్రుసేనాప్రవాహము నాపఁ బ్రయత్నించి నిరుపమానస్వామిభక్తిని వెల్లడించిన యబ్దుల్రజాకునుగూర్చి కొ. లక్ష్మణరావుగారిట్లు వ్రాయుచున్నారు.

“ఇట్టివారందఱికిని బూజ్యులు. మొగలులు కోటలోనికిఁ జొరఁబడుచున్నారని తెలిసినతోడనే యాతఁడు కొగిరిలేని గుఱ్ఱముమీఁద శీఘ్రముగా నెక్కి చేతఁ గత్తిపట్టుకొని శత్రుసముద్రములోనికిఁ బోయి ఘోరముగా యుద్ధము చేయఁ జొచ్చెను. వేలకొలఁది శత్రువులు క్రమ్ముకొని కత్తులతో నాతనిని నొప్పింపసాగిరి.

నఖశిఖాంతము...తగిలినందున నిశ్చేష్టితుఁడై గుఱ్ఱము తీసికొనిపోయినచోటికిఁ బోయెను. ఒకానొక తోఁటలో నాతని నా గుఱ్ఱము పడవైచెను. రెండవదిన మచ్చటివా రాతనిని గుర్తించి యౌరంగజేబు శిబిరమునకుఁ గొంపోయిరి. రాతిగుండెగల యా యవురంగజేబుగూడ నబ్దుల్రజాకు శౌర్యమున కచ్చెరువంది...మన్నించి యిట్టి సేనాధిపుఁడు మఱియొకఁడు తానీషాయొద్ద నున్నయెడల మేము గోలకొండ తీసికొనుట దుర్లభమ...ని సంభావించి యాతనికిఁ జికిత్సచేయుట కిద్దరు రణవైద్యుల నేర్పాటుచేసెను. అం దొకఁడు యూరోపుదేశస్థుఁడు. మఱియొకఁడు హిందువు. వీ రా స్వామిభక్తునికి...చికిత్సచేసి...'డెబ్బదిగాయముల లెక్కించితిమి, మఱి గాయము లనేకములు కలవు, కాని గాయముపై గాయము పడినందున లెక్కవేయుటకు వీలులేకపోయె' నని చెప్పిరి. పదునాలుదినము లాతని కుపచారము సేయఁగాఁ గనులు విప్పిచూచెను. అంతనవరంగజేబు నీ యపరాధము లన్నియుఁ క్షమించితిని, మనసబు మొదలైన యధికారములను నీ కొసంగెదను, నీకుమారులను నాయొద్దకుఁ బంపుమని యాతనికి వర్తమాన మంపెను. అందుపై నా శూరాగ్రేసరుఁడు తన కుపచారములు చేయించినందులకుఁ గృతజ్ఞతను గనఁబఱచుచుఁ దాను జీవింపననియు జీవించినను నుద్యోగముచేయుటకుఁ దనకు సామర్థ్య ముండదనియు నొకవేళ సామర్థ్యముండినను దానీషా యుప్పుతిన్నవాఁ డెవఁడును వాని శత్రుఁడగు నవరంగజేబు సేవ చేయఁజాలఁడనియుఁ బ్రత్యుత్తరమంపెను. ఆ ప్రత్యుత్తరము విని యవరంగజేబు చిన్నవోయెనఁట. "

ఇట్లు ౧౬౮౭సం॥ నిరుపమానౌదార్యసాహసోపేతులగు నవాబులకు రాజధానినగరమై భారతవర్షమునకు ధనభాండాగారమై ప్రసిద్ధిఁజెందిన గోలకొండనగరరాజము నేఁడు మృత్యుదేవాలయమై పడియున్నది. ఆ స్వచ్ఛందగోపురగర్భములయందు సుల్తానులును వారిసతీమణులును సుఖనిద్రఁ దేలుచున్నారు. ఆ నిర్జనభీకరదుర్గమును ... ఆ శిథిలప్రాసాదశిఖరములును నా యున్నతాయుధాగారములును వన్యమృగములకును క్షుద్రకీటకములకును విహారస్థానములయి కాలార్ణవతరంగముల ఘోషతో గోలకొండయొక్క ప్రాచీనవైభవక్షయంబును విషాదగానంబుచే సంకీర్తించుచున్నవి.

---

చిన్నవాఁడు॥ అన్నయ్యా! చూచెడిదేమి? పద్మవ్యూహంబునఁ జొరఁబడి కౌరవసేనల గగ్గోలుపఱచునాఁ డభిమన్యునే చూచితిమి. నేఁ డీబాలచంద్రునే చూచుచుంటిమి. బళిబళి! బాలుఁడు తొలకఱిమెఱపుచందంబునఁ దనువల్లిక చలింప గరుత్మంతుం డని దేవతలు పొగడ నాలంబున నెంతయుఁ జాకచక్యంబుగాఁ దిరుగుచు నరసింగు సైన్యంబులఁ దునుమాడుచున్నాఁడు. ఆ దెబ్బకుఁ దాళలేక కాఁబోలుఁ జూడు. తమవారందఱు నదివఱకు గతించుటం జేసి యచటనుండినఁ దమగతియు నట్టిదే యగు ననుభయంబునఁ బరుగిడఁబోయి కాళ్ళు తడఁబడ బాలచంద్రుఁడు వెన్నంటివచ్చుచున్నాఁడను భ్రమముచేఁ బోలేక ధరణిం దమంతటఁ దాము కూలి కొందఱు విగతప్రాణులగుచున్నారు. కొందఱు కాళ్ళు చేతులు విఱిగిపోవుటచేఁ గదల మెదలలేక యందే మృతులగుచున్నారు. అదుగో! కొందఱు వెన్నుఁజూపి పరుగిడుచుండ బాలచంద్రుఁడు ధర్మబద్ధుఁడగుటఁ దెగటార్పఁగూడదని వారి దుస్థితికి బిట్టు వగచుచున్నాఁడు.

పెద్దవా॥ తమ్ముఁడా! అదియేమిచూచెదవు. ఈదెసఁజూడుము. తమ సైన్యములగతి వేఱువిధి నగుట నరసింగక్ష్మాధీశుఁడు చూచి బిట్టలిగి మత్తదంతావళముపైనుండి సైన్యంబులకుఁ బ్రోత్సాహ మొనరించుచు వా రందఱితో వచ్చి యబ్బబ్బా! బాలచంద్రు నొక్కమాఱు చుట్టుకొనియెఁగదా! (సంతోషముతో) బళే బాలచంద్రా! సంతోషము సంతోషము. నీ వీరనామమును సార్థకపఱచితివి.

చిన్నవా॥ ఈదెబ్బకు నరసింగుని తల తెగిపడినట్లే. ఆహా! నరసింగుఁ డెంతసులువుగాఁ దప్పించుకొన్నాఁడు? అవును. అతఁడుమాత్రము సామాన్యుఁడా? ఆఱితేఱిన రణప్రతాపుఁడు గాఁడేమి?

పెద్దవా॥ తప్పించుకొనుటయే కాదు. తన యంకుశంబున బాలచంద్రుని వ్రేయఁ బ్రయత్నించుచున్నాఁడు. (ఇంకొకదెసఁజూచి)

అక్కటా! ఎంతఘోర మెంతఘోరము. ఆదెబ్బ సూటిగా బాలుని పేగులను గానిచనేగదా! దైవము నిజముగఁ బక్షపాతియే. మంచివారికే యాపదలు దెచ్చిపెట్టుచుండును.

చిన్నవా॥ బలే బాలకా! పేగులు వెళ్లివచ్చినను మరల నొక్కచేతఁ జక్క నొత్తుకొని రెండవచేతితో సామంతరాజుల సందుకొని వీపునకు వెళ్లిపో నరసింగుని వక్షంబునం బొడిచి యాపోటుచేఁ గుంభికుంభమం దొరగిన యతని కుత్తుక కసిదీరఁ గోయనే కోసితివికదా! నీకు శాశ్వతకైలాససుఖ బబ్బుఁగాత. అన్నా! చూచితివా? బాలచంద్రుని శక్తి తూలిపోయినది. తండ్రిని జూచు నాశతో నెట్లో వచ్చుచున్నాఁడుగాని నిజముగు శక్తిచేఁ గాదు. అబ్బా! అతని యాకార మిప్పట్టునఁ గడు ఘోరముగా నున్నది. చూడఁజాల పోదముపద.

పిన్నవా॥ మంచిదిరమ్ము. (అని యిరువురును నిష్క్రమింతురు)

బాలచంద్రుఁడు॥ (రక్తసిక్తాంగుఁడై రొఁజుచుఁ దూలుచు నొకచేత నరసింగుని శిరము పట్టుకొని రెండవచేతఁ బ్రేగులు కడుపులోపలి కొత్తిపట్టి బాధ నభినయించుచుఁ బ్రవేశించి యాయాసముతో) ఓరోరి పాఱుబోతులారా! మీకు-అభి-మానము-తోపాటు- వివేకముగూడ (ఇంచుక స్థైర్యమువహించి) పోయిన దేమి? చీచీ పందలారా! మీకుఁ గీర్త్యపకీర్తు లెక్కడివి? ఏమీ? నామాటలు మీచెవులఁ బడుటలేదా? కులమర్యాదలనే కూల్పనెంచి రణంబున వెన్నుఁజూపిన మీకు నాపలుకులెట్లు చెవుల కెక్కఁగలవు? పొండు. పొండు. ఎంతదూరము పోయెదరు? నాగసానీ! నీరాజునకు నీనమ్మిన మంత్రశేఖరున కెట్టిగతిపట్టినదో చూచితివా? ఇదుగో! దేహమునుండి తల వేరై నాచేతులలో నెగిరిపడుచున్నది. ఓహో వీరవనితా! (హేళనతో) ఎచ్చట నేమిచేయుచుంటివి? (పరికించి) వెనుకకు మరలిచూడనైనఁ జూడక పరుగిడుచుంటివా? ఆడుదానికి

నందును ముండమోపికి నీకు గుండె యెక్కడిది? అక్కటినిన్ను దగ్గఱకుఁజేర్చిన రండల ననవలె. పోమ్ము. ఇప్పుడుగాకున్న నింకొక్క క్షణమునకేని నాచేఁగాకున్న మఱియొక్కరిచేనేని నీగతియు నింతయే యగునులే. ఎందుదాఁగెదవో యెవరినాశ్ర యించెదవో చూచెద. (సంతోషముతో) నాప్రతిజ్ఞతీర్చినం దుల కీనరసింగుని శిరమును నాతండ్రి, శ్రీవిష్ణ్వంశసంభూతుఁడు శాంతిశమదమాద్యఖిలగుణాగరిష్ఠుఁడు వీరాధివీరుఁడు సత్యసం ధుఁడు బ్రహ్మనాయని పదంబులచెంతఁ బడవేసి నీకై వచ్చెద. వచ్చెద. వచ్చెద. తప్పకవచ్చెద. నీమచ్చ మాపెద. నాకచ్చె దీర్చుకొనెద. పల్నాటిసీమకు వాటిలినకష్టంబులఁ ద్రోసిపు చ్చెద. నమ్ముము. నమ్ముము. అక్కటా! నాతండ్రిగారిప్పు డెందున్నారో? ఎందున్ననేమి? పోయెద (అని లేచి బిఱబిఱఁ జనఁబోయి ముందఱకేఁబడి చేతిలోని శిరం బావలఁబడి దొర లుచుండఁ గాంచి నమస్కరించి) అనుగుభూపాలపుత్రా! అనంగమోహనగాత్రా! మానదుర్యోధనా! మైలమనందనా! నాయం జెట్టి యపరాధంబును లేదు. మీ కంతమునకు మీరే యురిపోసికొంటిరి. నారీరూపరాక్షసియగు నాగమ్మయే మీపాలిటికి మృత్యుదేవతయైనది. నరసింహరాజేంద్రా! అలరాజును జంపినపగ దీర్తునని ప్రతిజ్ఞపట్టుటచే వీరవరోచితం బగు నికార్యంబు సాధింపవలసివచ్చినది. విధివిధాన మిట్లుండ నెవ్వ రేమిచేయఁగలరు? (అని) ఈపాడుశవములు మాటిమాటికి మన్మార్గావరోధముం గలిగించుచున్నవి. (పశ్చాత్తాపముతో) ఆఁ! ఏమంటిని? ఇవి పాడుశవము లనియా? బుద్ధి బుద్ధి. ఎంతయపచారము గావించితిని. కీర్తి యెడలఁ గోర్కెయు నపకీర్తియెడల లజ్జయు నణుమాత్రము లేక యూ పాఱిపోవునవి పాడుపీనుఁగులుకాని పౌరుషముతోఁ బ్రాణములున్నంతవఱకుఁ బోరి వీరమరణంబునొందినవి పాడు పీనుంగు లెట్లగును? (మరల దెసలు పరికించి) ఆపంద

లింతలో నేమయియుండురో ? (యోజించి) ఏమికాఁగలదు ? రాజంతవాఁ డీల్గుటంజేసియు మంత్రిణి మాఁజమూలల డాఁగుటంజేసియుఁ గాలికి బుద్ధిసెప్పిరి. ఛీ ! పందలతో నేమిపని ? వారికిఁ జా వెట్లును దప్పదు. చచ్చినను సుఖ మనుభవింపఁ జాలరు. పోనిమ్ము. వారలతో నాకేల ? (పరికించిచూచి) అక్కటా ! నాతండ్రిగా రింకను రారైరి. రాకపోనీ. నేనే వారిచెంత కరిగెద. (లేవఁబోయి చతికిలఁబడి) ఏమిచెపుమా? భూమియంతయు గిరగిరఁదిరుగుచున్నది. చెవులు గడియలు పడుచున్నవి. నో రెగురుచున్నది. కరచరణములు గుడ్డపేలికల వలె వ్రేలాడుచున్నవి. లేవ శక్తి యుడుగుచున్నది. నా-గ-సా-నీ ! (అని కన్నులు మూసికొని కొంతసేపటికి మరలఁ దెఱచిచూచి) ఏమంటిని ? ఎవరు నన్నుఁబిలిచినది ? నరసింగుఁడా ? కాదుకాదు. నాగసాని. అయ్యో ! ఎక్కడి నరసింగుఁడు ? ఎక్కడి నాగసాని ? (మరలఁ గన్నులు మూసి తెఱచి) ఎవరును లేరే. అబ్బా ! నే నిప్పు డెందున్నాను ? (ఆలోచించి) అగు నగు. ఇది యుద్ధభూమి. అయిన నాచేతి కరవాలమేది ? లేదు లేదు. లేకున్న నేమయ్యె ? ఏమో ! ఏమైనను గానిమ్ము. నాకుఁ గత్తితోఁ బని లేదు. ఈపిడికిలియే సకలాయుధములు. రండు. పాఱిపోకుఁడు. (చేయియెత్తఁబోయి) అబ్బా ! చేయి లేవదుగదా ! ఈ చేయి లేవకున్న రెండవచేయి లేదా ? అక్కటా ! అదియు లేవదు. కానిమ్ము (చూచి) ఈ రక్తమంతయు నాదేనా ? లేక శత్రువులదా ? నాదియైనచో నదృష్టవంతుఁడనే.

చం॥ ఎవఁడు స్వదేశరక్షకయి యెంతయుఁ బోరి రణాంగణంబునం
దవని స్వరక్తబిందువుల నార్ద్రముచేయఁగలాఁడో వాఁడు తా
దివమున బిందుసంఖ్యగల దివ్యయుగంబులు దేవతుల్యుఁడై
భవుకములొందుచుండఁగలవాఁడని వాకొనుచుంద్రు కోవిదుల్.

అబ్బా! వేదన యధికమగుచున్నది. అది యిట్టిదని నుడువ రాకున్నది. అక్కటా! నాజనకుని గనులనేని చూతునో చూడనో? చూడనేమి? నాతండ్రి శంఖచక్రగదాఖడ్గ లాంఛనుండై సాక్షాత్కరించినాఁ డదిగో! తండ్రీ! వందనములు. నీ యభిమతము దీర్చితిని. నన్ను నీసన్నిధికిఁ జేర్చుకొనుము. అయ్యో! మాటాడవేమి? రమ్మందువా? వలదందువా? వలదన్నను వినను. వెంటఁబడెదను (అని యేమేమో గొణుఁగుకొనుచు భూమిపై వ్రాలును.)

బ్రహ్మనాయఁడు॥ (ప్రవేశించి) కన్నకుమారుని స్థితి మదిఁ గలంచు చున్నదియును గంటఁబడి వెడ్డప్రాణి తరుణము. వీరపురుషోచిత మరణంబునొందువానికై విలపించుట వెఱ్ఱితనము. క్షాత్రము గలవారి కిదియే కదా ముఖ్యము. (సమీపించి) కుమారా! బాలచంద్రా!

బాలచంద్రు॥ (ఇంచుక స్మృతి నభినయించి కోపముతో) ఎవ రాపిల్చినది? నాగసానియా? ఛీ రండా! నీముఖముఁ జూడరాదు. చూడను. నీవు పాఱుబోతువు. రణంబున వెన్నుఁజూపిన దానవు. నా కరవాలమున కాహుతియగు భాగ్యము నీకు లేదు. పొమ్ము. ఏమీ! పోవుగా! పాపినీ! (లేవఁబోయి చేతఁగాక బాధ నభినయించును.)

బ్రహ్మనాయ॥ కుమారా! ఆయాసపడకుము. నేను నీజనకుఁడను.

బాలచంద్రు॥ తండ్రీ! లేవఁజాల. శక్తి తగ్గినది. నమస్కరించుటకైనను గరములు లేవు. ఇదివఱకే యీలోకమును వీడి చాల దూర మరుగవలసినవాఁడనయ్యు మీ యనుజ్ఞలేక చనుట దూష్యంబగుట నింతవఱకుంటిని. ఇదిగో నరసింగుని శిరము. తిలకింపుఁడు. నాప్రతిన తీరినది. నాగసానిని మీవంతునకు విడిచితి. విశేషము మాటాడఁజాల. ముందేగిన నాతమ్ములు నాకై యెదురుచూచుచున్నారు. వారిని త్వరితగతిఁ గలసి కొనవలయు. అనుజ్ఞ యిండు.

బ్రహ్మనాయ॥ బాలచంద్రా! మాకీరణంబున సహాయము చేయుమని మలిదేవరాజు నిన్నాహ్వానించియుండలేదు. నీయంతట నీవే పిలువనిపేరంటమునకు వచ్చితివి. వచ్చినవాఁడ వూరకుండక వీరుఁడవై వలపనిప్రతిజ్ఞ గావించితివి. కటకటా! ఎంతపనిచేసితివి? ప్రభుకులంబునకు మృత్యుదేవతవైతివి కదా!

బాలచంద్రు॥ నాయనగారూ! మీయందఱివలె నేనును స్వామికార్యము నిర్వహింపవలెనను కుతూహలముతో వచ్చితిని. నాకుఁ బ్రత్యేకముగ నెట్టిశత్రుత్వమిత్రత్వములును లేవు. జయాపజయంబులతో నాకెంతమాత్రము నిమిత్తము లేదు. స్వధర్మనిర్వహణమే నాకవశ్యకర్తవ్యము. నాపని నేను జేసితిని. ప్రతిజ్ఞ చెల్లించుకొంటిని. ఇఁక నాకీలోకమునఁ గావలసినది యేదియు లేదు. ప్రభుకులవిధ్వంసమునకైనను వినాశనమునకైనను నాయకురాలును మీరునే కారకులు. ఎంత తప్పించుకొన్నను నెంతతలగొట్టుకొన్నను మీకీవాదు పోదు. ఇఁక నాకిచ్చటఁ బనిలేదు. (అని యొకనిట్టూర్పుదీసి ప్రాణములు విడుచును.)

సేవకుఁడు॥ (రోఁజుచుఁ బ్రవేశించి) దేవా! ఏమని విన్నవింతును? నరసింహరాజు పడిపోవుటచే నాపక్షమునకును బాలచంద్రుఁడు బాలవీరులతో మడియుటచే నీపక్షమునకును దీఱనికొఱఁత వాటిల్లినది. అయినను విజయమో మరణమో కాంచుటకంటె నొండుపాయంబు లేమి నుభయబలంబులును డీకొనినవి. రథికులు రథికులతోడను గజారూఢులు గజారూఢులతోడను నాశ్వికు లాశ్వికులతోడను భటులు భటులతోడను దలపడి మహారణంబు గావించుచున్నారు. నలగామభూపతి పట్టపుటేనుఁగు నధిరోహించి చుట్టు నంగరక్షకులు బలసియుండ యుద్ధవిశేషంబులు తిలకించుచున్నాఁడు. అతని సేనకుఁ దూర్పున సంకోజి గణపతియు దక్షిణమున నంచె

రాముఁడును ముమ్మడిరెడ్డియుఁ బసవురఁ బాజుల బ్రహ్మయు నుత్తరమునఁ బొందుగల కోవసుబ్బఁడును రక్షకులై నిలిచి యుండిరి. మాడుగుల వీరారెడ్డి సర్వసేనానాయకుఁడై యంతటం జరించుచు నెట్టిలోపమును గలుగకుండ వేయి గన్నులఁ జూచుచున్నాఁడు. సుంకర బామానాయని యోధపత్యమున మన బల మంతయు విజృంభించుచున్నది. గజసైన్యములు చెలరేఁగి నడగొండలవలె నలగామరాజు కాల్బలముపైఁ బడి కూర్మసర్పంబులంబోలిన తొండంబులతో విసరికొట్టి ఖండఖండంబులు చేయుచును బాదములతోఁ దన్ని పచ్చడిగావించుచును గొమ్ములతోఁ గ్రుమ్మి కూల్చుచును రణరంగ మంతయు బీభత్సంబు సేయుచుండుటయు నిలువఁజాలక సేనలన్నియుఁ జెల్లాచెదరైనవి. అది చూచి నాయకురా లదరిపడి మేటివిలుకాండ్రచే నమ్మదగజంబులపై నంపజల్లు గురియించుటయు నవి తాళఁజాలక ఘీంకారంబులు గావించుచు నానాముఖంబులఁ బరుగులెత్తి స్వపక్షపరపక్ష భేదంబు లేకుండ నడ్డపడిన యోధులనెల్లం ద్రొక్కివైచుచుండ వీరులు బరిసెలఁ బ్రయోగించి పడఁ గొట్టఁదొడంగిరి. ఉభయపక్షవీరులును గత్తులు కటారులు గండ్రగొడ్డండ్లు బరిసెలు మొదలగు నాయుధంబులతో హోరాహోరిం బోరుచున్నారు. రణరంగమంతయు మాంసపిండంబులతోడను నెమ్ములరాసులతోడను మృతకళేబరంబులతోడను నెత్తురువరదలతోడను నిండిపోయినది. నాయకురాలు పేరిరేప ఘట్టిరాజు కోటకేతుఁడు మొదలగు రాచయోధులు చెదఱిన బలంబులఁ గూర్చుకొని విక్రమింపఁ దొడంగిరి. పాజుల బ్రహ్మన సంకోజ గణపతి నంబె రాముఁడు ముమ్మడిరెడ్డి వీరమల్లుఁడు మున్నగు దండనాయకులు బలంబులతోఁ జుట్టుం బరివేష్టించియుండ నలగామరాజును శత్రుసైన్యంబులపైఁ బడి రణఖేలనంబు గావించుచున్నాఁడు.

నాయకురాలును నలగాముఁడును విక్రమించుచున్నను మన సేన చలింపక పోరాడుచున్నది. దిక్చక్రము బాణపరంపరాచ్ఛన్నంబై మేఘాచ్ఛాదితంబైన ట్లున్నయది. శరసంఘట్టనలం బుట్టు విస్ఫులింగంబులు తటిల్లతలవలె మెఱయుచున్నవి. ఉభయబలంబులును జాలవఱకు క్షీణించినవి. కాని యన్యోన్య విజయవాంఛమాత్ర మంతకంతకుం బ్రబలమగుచున్నది. కోటకేతునకును గొమ్మరాజునకును ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లినది. కేతరాజు భల్లముచేఁ గొమ్మరాజు నురంబు వ్రయ్యలుగావించి కూలనేయ నతనిపాటు గాంచి గండు కన్నమనాయఁడు కోపోద్రిక్తుండై కేతరాజు నెదిరించి తుద కతని కరవాలంబున కెర యయ్యె. అంతఁ బేర్నీఁడును సూర్నీఁడును నక్కేతరాజుపై శరవర్షంబు గురియింపఁ ఝుట్టిరా జస్త్రపడి యిరువురి శిరంబులను ఖండించె.

బ్రహ్మ॥ సరే. నీవేగుము. దైవలిఖితము తప్పింపరాదు.

(ఇరువురును నిష్క్రమింతురు.)

కన్నమ॥ (విచారముతోఁ బ్రవేశించి తనలో) నాయఁడు స్వయముగా సామంతరాగోలం ద్రిప్పుచు మదగజయూథంబులపై లంఘించు మృగేంద్రంబునుం బోలి శత్రుసైనికులపైఁ బడి చించి చెండాడుటయు నాయకురాలి హెచ్చరికచేఁ జింతపలి రెడ్డి యాయన నెదిరించి ఘోరంబుగం బోరాడె. కాని నాయఁడు ప్రతాపభాస్కరుండై తచ్ఛోషణంబు గావించె. ఆయనధాటి కాఁగఁజాలక తనవారందఱును బఱుగువారు చుండుటయు రెడ్డి సింగమువలె బొబ్బరించుచు నాయనితో ద్వంద్వయుద్ధముం గావించి యలసిపోయె. కొదమగుండ్ల నరసారెడ్డి యతనికి బాసటయై సామంతరాగోలచేఁ జదియ మోఁదఁబడి యొల్లఁబోయియు మరలఁ దేఱుకొని నాయని తల నఱకుటకు సాహసింపఁ దోడై చింతపలిరెడ్డియుఁ బైఁ బడఁబోవ మల్లిసీఁడాతని నాఁగి విక్రమించె. కాని చింత

## —♦ కపాలమోచన మాహాత్మ్యము ♦—

ఆ॥ ఈప్రదేశమింక నిలను గపాలమోచనమటన్న ఖ్యాతి నెనయఁగలదు.
ముక్తులగుగురిచట ముందు కపాలంబు నాత్మఁదలఁచి శ్రాద్ధమాచరింప. ౩౭౭

కం॥ పిత్రుపక్షంబున నట్లిటఁ బిత్రుదైవతములగుఱించి పెట్టెడిశ్రాద్ధం
బతిశయఫలప్రదంబగు క్షితిగీర్వాణా! ఇఁకేమి చెప్పఁగవలయున్. ౩౭౮

ఉత్సాహము॥ స్థానబాహ్యులైనద్విజుల సంతతిని జనించు వ
దాన్యనవలను బ్రీతిఁ బెండ్లియాడి త్వత్కులోద్భవుల్
నా నియోగమున సమస్తనాగరక్రియల సదా
పూని వ్యవహరింపఁదగిన పూజ్యులగుదు రగ్రజా!" ౩౭౯

వ॥ అనిచెప్పి వెళ్లిపోవుటయు వాతాభిధానబ్రాహ్మణుం డా యిందుప్రని కలనుండి ప్రతిగ్రహించిన విత్తంబు పెట్టి దేవదేవుండగు శివునకు దేవళంబు గట్టించె. అంతఁ బాకశాసనుండు నాగరబ్రాహ్మణుల నుద్దేశించి. ౩౮౦

పంచచామరము॥ "కపాలమోచనంబునన్ వగాహ మాచరించి యీ
కపాలిపూజసేయు బ్రహ్మఘాతకుండుగూడఁదా
విపాపుఁడౌను గాన దీన విప్రులార! స్నాతులై
అపాస్తదోషులై రహింపుఁడాజ్ఞయిచ్చినాఁడ నేన్" ౩౮౧

వ॥ అని వక్కాణించె. ఆ వాతాభిధానబ్రాహ్మణుం డంద యాశ్రమం బమర్చుకొని యభవు నర్చించుచు నధివసించె. అదిమొదలుకొని తమ యేకోలఁది కార్యంబును నతఁడుచెప్పినచొప్పున నాగరు లాచరింపంగడంగిరి. ఈ కారణంబున వాతుండు ద్వితీయమధ్యగుండయ్యె. మహాత్ముఁడగు మఘవున కీతీర్థంబున బ్రహ్మహత్యారూపపాతకంబు నష్టమైనవిధంబును జదువువారికిని వినువారికిని బాపనాశకం బగు నీ కపాలేశ్వరమాహాత్మ్యంబును సర్వంబు మీకుంగా వాక్రుచ్చితి. తొల్లి యానర్తుండు భర్తృయజ్ఞుం గనుంగొని. ౩౮౨

## —♦ పాపపిండప్రదాన విధానము ♦—

సీ॥ "ఎడఁదఁ దోఁపఁగనీక హితువాక్కు వినసీకమనెడిమూర్ఖత్వంపుమహిమముననొ
ఇది యిట్టులగునటం చెఱుఁగంగరానీక మనసుఁ గలంచు ప్రమాదముననొ
తారుణ్యవశమునఁ దాఁ దటస్థించి యగ్గలమైన కామాంధకారముననొ
మహిత తమోగుణమాహాత్మ్యమునఁజేసి మన మావరించిన మాంద్యముననొ
అఘముఁజేసి దాని కప్రాయశ్చిత్త మాచరించుకొననియట్టివార
లయ్యఘంబునుండి యపుడ విముక్తులౌ పుణ్యమును వచింపు భూసురేంద్ర! ౩౮౩

ఆ॥ లోభమోహానివశమై భూమి వర్తిల్లు జనము పాపపిండమును నొసంగ
విధిని జెప్పుమయ్య విద్వద్వరేణ్య! వే యేను నీయనుంటి దానిఁ గాన" ౩౮౮

వ॥ అని వక్కాణించుటయు భర్తృయజ్ఞుం డిట్లనియె. ౩౮౪

సీ॥ "ఇరువదై దుపలాల హేమంబు గరఁగించి యాత్మీయ ప్రతిబింబ మమరిపించి
అపరపక్షంబున నవగాహ మొనరించి లలితమా తెలిచేలములు ధరించి
మండపాదికమును మంచిగం గూర్పించి యా స్వీయ ప్రతికృతి యచట నుంచి
త త్స్వరూపమునకు ధాత్ర్యాదికమునకు వక్ష్యమాణములయి వఱలు పృథివి
మొదలుగాఁగల పేటి యిర్వదియునాల్గు తత్త్వముల పేళ్ళు చదువుచుండత్వరతను
పూజగావించునటువంటి పూరుషుండు పూర్వకృతపాతకమునుండి ముక్తుఁడగును.

మంత్రము॥ ఓం పృథివ్యైనమః ఓం అద్భ్యోనమః ఓం తేజసేనమః ఓం వాయవేనమః
ఓం ఆకాశాయనమః ఓం ఘ్రాణాయనమః ఓం జిహ్వాయైనమః ఓం చక్షుషేనమః
ఓం త్వచేనమః ఓం శ్రోత్రాయనమః ఓం గంధాయనమః ఓం రసాయనమః
ఓం రూపాయనమః ఓం స్పర్శాయనమః ఓం శబ్దాయనమః ఓం వాచేనమః
ఓం పాణిభ్యాంనమః ఓం పాదాభ్యాంనమః ఓంపాయవేనమః ఓంఉపస్థాయనమః
ఓం మనసేనమః ఓం బుద్ధ్యైనమః ఓం చిత్తాయనమః ఓం అహంకారాయనమః.

ఓం క్షేత్రాత్మనేనమః ఓం పరమాత్మనేనమః ౩౮౩

ఆ॥ ధూరటన్న దాన ధూప మగ్ని జ్యోతిర నెడిదాన దీప మమరఁజేసి
అట "యువాసువాస" అను మంత్రమున వస్త్రముల ధరింపఁజేయవలయు వరుస.

సీ॥ అర్ఘ్యంగి చెంబెత్తి యతిభక్తిఁబోసెడి విమలనీరములఁ బాదములు గడిగి
చెలువైన మేల్జరీచెఱఁగులుగలయట్టి రమణీయ పట్టాంబరములు గప్పి
అంసద్వయము కరం బావహించెడిభంగి దళమైన నూత్నాంగదములు వెట్టి
సింగంపుమూతులఁ జెలఁగు మేల్మి పసిండి కడియముల్ హ స్తయుగ్మమునఁదొడిగి
ఉంచి పదివేళ్లకుం బది యుంగరములు మఱియును గొన్ని కొన్నిగ ల్వరుసనిచ్చి
వేదవేదాంగవిదుఁడగు విప్రునకుఁ ద దాత్మపిండంబు నర్పింపనగు నృపాల!

శ్లో॥ ఏష ఆత్మా మయా దత్త స్తవ హేమమయో ద్విజ
యత్కించి ద్విహితం పాపం పూర్వం భూయా త్తవాఖిలమ్ ౩౯౦

శ్లో॥ యత్కించి ద్విహితం పాపం త్వయా పూర్వం మయాహి తత్
గృహీతం మూర్తిరూపం త త్తత స్త్వం పాపవర్జితః ౩౯౧

క॥ అను నేతన్మంత్రద్వయ మనఘా! దాతయుఁ బ్రతిగ్రహముఁజేసినయా
[illegible] పాపంబుల్లంబుగ నశింపవలయును. ఇది విధాన మాదానమునకున్. ౩౯౨

ఆ॥ తత్ప్రతిగ్రహీత తనియమవిధంబుగా దక్షిణయు నొసంగి యాత్మశంబ
సాగనంపవలయు క్ష్మాపాల! ఇబ్భంగి సలుపఁ గలుప మెల్ల విలయమందు ౩౯౩

సీ॥ బరు వంతయును దింపఁబడినవాఁడ్వన నంత నలకనైతోఁచు నం సొల్ల.
క్రొత్తనెత్తురు వెల్లి యట్టి సకలావయవములఁ జేయుఁ దేజోభివృద్ధి
కలలోన సితవస్త్రగంధమాల్యావృతి మఱియు స్త్రీ పురుషులం బొఱకు గాంచు
శుభ్రగోవృషభాశ్వ శుద్ధతీర్థంబులం బ్రత్యక్షముగుచుండుఁ బ్రీతిమిసర.
ఇటు పురాకృతకిల్బిషం బెడలినందు కొలయు నమ్మక మాత్మఁ బొసఁగుమాత్ర
వినినయంతన కల్మషమును హరించు పాపపిండప్రదానంబు ఫలితమయ్యె. ౩౯౪

కం॥ ఈ పాపపిండదానము భూపాలక! ఎచట నేని పొనరుపఁబడుఁగా
కీపుట్టువునం జేసిన పాపమె హరియింపఁగలుగుఁ బ్రకటది యాయకా ౩౯౫

ఆ॥ అకృపాలమోచనాహ్వయ క్షేత్రమం దాచరింపఁబడిన నది సహస్ర
భవములం బొనర్పఁబడినట్టి పాతకంబుల నశింపఁజేయఁగలది యగును ౩౯౬

ఆ॥ వేది మండపముల విధిని దొల్లింటివిధంబుగానె చేయఁదగును గాని
కల విశేష మింక గాయత్రిచే హోమమాచరింపవలయు భువనిపాల!" ౩౯౭

## —♦ ఇంద్రద్యుమ్నోపాఖ్యానము ♦—

వ॥ అని యిట్లు భర్తృయజ్ఞుం డశ్వసేనమహీపతినిగుఱించి చెప్పియుండె. ౩౯౮

సీ॥ అలఘు మార్కండేశ్వరాభిధానంబైన దివ్య మహేశ్వర దేవతయును
అఖిలపాపంబుల హరియింపఁజాలు నింద్రద్యుమ్నేశ్వర దైవతమును
నిఖిలరోగంబుల నిర్మూలమొనరింప నేర్పడినట్టి పాలేశ్వరుఁడును
ఘంటునిచే నిల్పఁగాఁబడుకతమున ఘంటశివఖ్యాతిఁగల భవుఁడును
ఇంకఁ గలశేశ్వరుఁడు వానరేశయుతుఁడు నొయ్య నీశానశివుఁడును నున్నవారు
కలియుగంబునఁగూడఁ బూజలనొనర్చు జనుల కోరికలం దీర్చుకొనుచు నచట.

వ॥ వారు పూజనంబునన కాక దర్శనంబునన సర్వరోగవివర్జితంబుగా జనుల దీర్ఘాయువులఁ జేయు బహుపుణ్యంబులగు లింగాకారంబుల నెసంగుచున్నవారు."

కం॥ అనియిట్లు కామహస్తగణి వినుచుటయును శౌనకాది విద్వద్విప్ర
ర్షి నికాయం బాచరితంబును సాంతము తెలియఁగోరి మొగి నిట్లనియెన్ ౪౦౧

సీ॥ "లింగప్రతిష్ఠ పొసంగఁ గావించిన మార్కండసంజ్ఞుండు మఱియెవండు?
ధార్మికుండైన యింద్రద్యుమ్ననాముఁ డేకాలమందున్న భూపాలకుండు?
పాలకాఖ్యుండు తాభక్తినియుక్తి నెప్పట్ల సంస్థాపించెఁ బార్వతీశు?
[illegible] కటికిఁ డేయన్వయంబును బావనముఁజేయ జననమందె?

వానరాన్వితముగ వర్తించు కలశుఁ డీశానుఁడును మఱెవ్వ ! రానతిచ్చి
దానమంత్రములును దత్త ఘదంతంబులును వచింపు "మనుడు విని యతండు ౪౦౨

వ॥ "దేని వినినమాత్రంబున జనము దీర్ఘాయువై యెవ్విధంబునను నపమృత్యువు గాంచదో యెయ్యది భక్తృయజ్ఞునిచే వానరాధిపతియగు నశ్వసేనునకు వచియింపఁబడియెనో యా పురాతనగాధ నేను మీకుఁ గీర్తించెద. మార్కండుఁడను ప్రథమసంకీర్తితుఁడగునతని పవిత్రచరిత్ర మీకుఁ జెప్పియుంటి. ఇఁక నఖిలనృపాల మానితుండగు నింద్రద్యుమ్నుఁ డెట్టిప్రభావముగలవాఁడయినదియుం జెప్పెద. ౪౦౩

సీ॥ ఆత్మవస్తు వెఱింగి యనవరతం బందె రమియించుచుండెడి రాజయోగి
ఆర్తిగూరినయట్టి యఖిలలోకమునకు నాశ్రయంబిచ్చెడి యధికదాత
కష్టమంచనక తా శిష్టరక్షణమందు జాగరూకతనుండు సత్ప్రభుండు
నానాధ్వరంబులం బూనికమైఁ జేసి కడుఖ్యాతినందిన కర్మఠుండు
అఖిలభూతహితుఁడు నగుచు దుర్భిక్షంబు వ్యాధి చోరబాధ యాత్మరాజ్య
మందు లేకయుండ నరసి యింద్రద్యుమ్నుఁ డేలె నేల మును మునీంద్రులార !

సీ॥ ఆది నగ్నిష్టోమ మాచరించె నతండు సల్పె షోడశికాఖ్య సప్తతంతు
వుక్థాఖ్యయాగంబు నొనరించిమించెఁదా. చేసె సౌత్రామణి భాసురముగ.
వాజపేయంబులు వరుసగాఁ గావించె. రాజసూయంబులు రమణఁజలిపె.
అశ్వమేధంబులు నాచరితంబులు. పౌండరీకములు నిర్వర్తితములు.
ప్రతిశరత్తుగూడఁ గృతము చాతుర్మాస్య. తారలకును వర్షధారలకును
నదులలోని యిసుకనలుసులకుం బోలె సంఖ్యయున్నె యతని సవనములకు !

వ॥ దానంబులం గావించె. అందు విశేషించి తీర్థంబులం జలిపియున్నవాఁడు. క్షామమరులకు సదక్షిణంబుగా మృష్టాన్నంబులు వెట్టించె. ధనార్థులగు బ్రాహ్మణుల ద్వారంబున బ్రాహ్మణుల కర్బుదసంఖ్యల కన్యాదానంబు లొనరించె. అతఁడు కట్టించిన దేవాలయములేని గ్రామంబుగాని పట్టణంబుగాని తీర్థంబుగాని కనుపట్టదు.

తే॥ "రేపు హరివాసరం బదిపాపహరము బాలవృద్ధులుదప్ప నప్పట్లనెవరు
భోజనముచేయఁగూడ దవ్యాజ నుపవసింపకుండిన వారికి శిక్ష నిజము॥" ౪౦౬

వ॥ అని దశమీతిథి నిశీధి నేనుంగుపై డంకా గట్టించి నగరమం దంతటను సాటింపఁ జేసెడివాఁడు. రాజర్షి యగు నయ్యింద్రద్యుమ్నుఁ డంతఁ గొంతవడికి హరిప్రసాదంబున సభౌతికశరీరంబుగా బ్రహ్మలోకంబునకుం జని వేయి కల్పంబులుం దుటయ నప్పు డంబుజాసనుండు స్వయంబుగా నతనిఁ జేరం బిలిచి "యిఁక నిందుండం జనదు భూలోకంబున కరగు"మన నతండు. ౪౦౭

# అభినవసరస్వతి

సంపుటము ౨౩ | ప్రజోత్పత్తి నామ సం॥ మార్గశీర్ష మాసము. | సంచిక ౯

—* కృతి విమర్శము *—

ఆత్మోపదేశము — ఇది మీర్జాపురము రాణిగారి యాస్థాన విదుషీయుఁ జేబ్రోలు రాజగోపాలరావుగారిధర్మపత్నియునైన సరస్వతీ దేవిగారిచే రచింపఁబడిన యొక చిన్న పద్యకావ్యము. స్త్రీ శూద్రవిభేదమునుబట్టియు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రాదిభేదమునుబట్టియు సకలజనులకును సకలమందును నధికారము లేకుండుట శాస్త్రసిద్ధమే కాక యనుభవసిద్ధముగూడ నైయున్నది. వాస్తవ మిట్లున్నను వర్తమానమున ననేకులు స్త్రీశూద్రవేదాధికారము స్త్రీస్వాతంత్ర్యము మున్నగునవి సాధింప సమకట్టి యనేకహేత్వాభాసలతో నల్లరిచేయుచుండుట ప్రత్యక్షసిద్ధము. ప్రపంచనాటకము స్త్రీపురుషులలో నేపాత్ర లేకున్నను సాగునది కాకున్నను రాజభృత్యులకుంబోలెఁ దారతమ్యముమాత్ర ముండకతప్పదు. స్త్రీని వినా పురుషుఁడు కాని పురుషుని వినా స్త్రీగాని సంసారచక్రమును ద్రిప్పనేరరు. కావునఁ బై తారతమ్యమును బురస్కరించుకొనియు 'నస్త్రీస్వాతంత్ర్యమర్హతీ'త్యాద్యభియుక్తోక్తులంబట్టియు స్త్రీయందు న్యూనత్వ మారోపించుటకు వలనుపడదు. క్షేత్రప్రాయ స్త్రీయును బీజప్రాయుఁడు పురుషుఁడును. సృష్టికార్య ముభయసమ్మేళనమునుండియే యగుచున్నది. కాని యెవరిపని వారిది. చదువుసంధ్యలు నేర్చుకొనుట సర్వవ్యవహారములును నిర్వర్తించుట ధన మార్జించితెచ్చుట మున్నుగాఁగల కార్యము లెన్నియో పురుషునివి. గృహసమ్మార్జనము పాకము బిడ్డలఁగనిపెంచుట గృహవ్యాపారమునకును బరమార్థసాధనమునకును వలసినంత విద్యావ్యాసంగము మొదలైనవి స్త్రీవి. ఇందు వ్యాప్యవ్యాపకత్వములు గల్పించి యొకరివొకరు మార్చుకొందమన్నను గొన్ని కేవల దుస్సాధ్యములు. కావున నెవరివి వారికే యుండఁదగినవి. ప్రభుమంత్రులుంబోలె గృహరాజ్యమును బాలించుట కుభయులును

గావలసినవారలే. క్రమ మిట్లుండ సంస్కరణపరాయణుల దుర్బోధచే నస్పృశ్యులైన చండాలు రగ్రవర్ణములకుండు నఖిలస్వాతంత్ర్యములును గావలెనని పోరాడుచున్నచో స్త్రీలును వేదశాస్త్రములు చదువవలెననియు రాజవిద్యాపారంగతలై యున్నతోద్యోగములు చేయవలెననియు సర్వస్వాతంత్ర్యమును వహింపవలెననియుఁ బోరాడుచున్నారు. దినక్రమమున నీతరగతియే యెక్కువగుచున్నను బూర్వాచారమునకుఁ గట్టువడి యథోక్తరీతిఁ జరించు నబలలును గొంతమంది కలరు. అందువలననే యధోలోకమునఁ బడిపోకుండ నవనీచక్ర మింకను దిరుగుచున్నది. స్త్రీల పాతివ్రత్యమహిమవలననే త్రిభువనములును నిలువఁగలుగుచున్నవి. విద్యాగుణ్వులును విశ్రుతోద్యోగినులును నగుట విధివిరుద్ధము కాని విద్యావతులై జ్ఞానము సంపాదించి పాతివ్రత్యమును నిల్పుకొనుచుఁ బతులకు సహాయులై పరమపురుషార్థమును బడయుట తరుణులకు ధర్మ్యమే యైయున్నయది.

ఏతద్గ్రంథకర్త్రి యీతరగతిలోనిదనుటకే యింత యుపోద్ఘాతము వ్రాయవలసివచ్చినది. చక్కని లోకజ్ఞానమలవడుటకై యాఫే వఱకు రాజవిద్యఁ బఠించియుఁ బరమార్థసాధనమునకుఁ జాలినంత సంస్కృతాంధ్రభాషాసాహిత్యముగలిగియు స్వతంత్రయై వర్తింప నొల్లక పతిశుశ్రూషాపరాయణయై పరఁగు నీయమ ప్రవర్తన మెంతయుం బ్రశంసనీయము. పతివ్రతాశతక మీమె ప్రథమగ్రంథము. అది స్త్రీలకుఁ బతివ్రతాధర్మబోధకమై యున్నను ప్రాచీనగ్రంథములలోని పద్యముల నేర్చి కూర్చఁబడియున్నది. ఈ యాత్మోపదేశ మాకొఱఁతఁ దీర్చినది. మృదుమధురధార గలిగి పద్యము లింపు గలిగించుచున్నయవి. ఇందలి విషయ మందఱికిని నత్యంతహితబోధకము. ఆస్త్రీపురుషము నాబ్రాహ్మణచాండాలము నత్యంత నీతిదాయకము. భక్తిజ్ఞానవైరాగ్యముల కునికిపట్టు. ఆత్మశబ్దార్థములలో మనము నొకటియగుట నాత్మోపదేశమను నేత దాహ్వాయ మన్వర్థము. ఇట్టి యీయమ ప్రయత్న మతిశ్లాఘ్యము. గ్రంథకరణమునకుఁగూడ ననుకూలించునంతటి సామర్థ్యముగలిగియు నొక సంస్థానమున విదుషిగా నుండియుఁ బతిభక్తి విడనాడక సంతత తత్సాన్నిధ్య నివాసయై యుక్త

రహిత్యస్తరాది సకలవ్యవహారములును నాయనవేరనే నడపుచు 'నిరాశ్రియా నశోభంతే పండితా వనితా లతా' యను నార్యోక్తి యన్వర్థముఁ జేయుచున్నందుల కెంతయు సంతసను. ఇట్టి సచ్చరిత్రను స్వస్థానమునఁ బోషించుచు విద్యకును ధర్మమునకును బ్రోత్సాహ మిచ్చు మీర్జాపురము రాణీగారు స్తోత్రార్హులు. మచ్చునకై యీ యాత్మోపదేశమందలి కొన్ని పద్యము లిక్రిందఁ బొందుపఱుపఁబడి యెడిని. పద్యములన్నియు నొక్క నకార ప్రాసముతోనే నడపఁబడి యున్నయవి. ఇది పెద్దవిషయము. కావున నిందుఁ జేయఁబడిన సంస్కారము పాటింపఁదగినదికాదు.

శా॥ చనియెన్ రాత్రులు సంధ్యలున్ దినములున్ సంవత్సరంబుల్ మఱిన్.
మనుజత్వమ్మునఁగాంచు సౌఖ్య మది యేమాత్రంబు (నున్ లేద. ఇం)
కను మోహంబున (సంసృతిం బడి యెదో కాపింపఁగఁ జూచె. వో)
మనమా! ఏ(ల వృథాశ్రమ)ంబు? కనుమా మాయాపహారిన్ హరిన్॥

మ॥ ధనధాన్యంబులు సౌధ (రాజములునున్) దాంపత్యభోగంబులున్
తనుజన్మల్ మఱి భృత్యవర్గమును మిత్రశ్రేణియున్ బందుగుల్
తనువుంబాసినవెన్క వత్తురొకొ (యేతద్విక్షఁగా వింప ? ఓ)
మనమా! ఏ(ల వృథాశ్రమ)ంబు? కనుమా మాయాపహారిన్ హరిన్॥

మ॥ కనులం జూచెడి శక్తి తగ్గ శ్రవణాజ్ఞానమ్ము శూన్యమ్ముకా
ఘనవార్ధక్య(పరీతమైనమెయి కాఁ గార్యాక్షమం బింక)లే
మిని సంసార(భరంబు మిక్కుటముగా మెండై రుజ ల్వేఁచఁగా)
మనమా! ఏ(ల వృథాశ్రమ)ంబు? కనుమా మాయాపహారిన్ హరిన్॥

మ॥ జననంబాది(భవాబ్ధి నీఁదుచును)విజ్ఞానంబు(నుం బొంద కా
ఘనవారాంనిధి దాఁటుపొంపు బుధసాంగత్యంబు నేన్ జేయ)వై
తి. నిజం బెన్నఁగ నంత్య కాలమునకున్ దీనత్వముం జెందె. ఓ
మనమా ! ఏ(లవృథాశ్రమం)బు? కనుమా మాయాపహారిన్ హరిన్॥

మ॥ దినమొక్కొడగు దుఃఖకాలమున. హా ! దీర్ఘంబులౌ రేలునున్.
క్షణమాత్రంబగు వత్సరంబు లరయన్ సౌఖ్యంబు)నం. గానఁ దీ
అని సౌఖ్య మ్మెదొ చూచుకొమ్ము. పెరకర్మం బిచ్చుమే ల్సున్న. ఓ)
మనమా ! ఏ(లవృథాశ్రమం)బు? కనుమా మాయాపహారిన్ హరిన్॥

మ॥ మనుజుండై భువి జన్మమెత్తుటన సామాన్యంబె? పూర్వంబు చే
సినపుణ్యంబునఁగాదె యట్లగుట! సచ్చిత్తుల్ వివేకించి రెం
డని వేర్వేఱ నెఱుఁగలేక మనుచో నార్థం గ్రహింపన్ వలెన్.
మనమా! ఏల వృథాశ్రమంబు? కనుమా మాయాపహారిన్ హరిన్
మ॥ ధనధాన్యంబులుఁ బుత్రమిత్రగృహసంతానంబులున్ శాశ్వతం
బని వానిన్ విడఁజాల కెంతయును సౌఖ్యంబెంతయుం గాంచవి
ట్లనయంబుం జరియించుచుండెదవు నీ కాముష్మికం బుండదో
మనమా! ఏల వృథాశ్రమంబు? కనుమా మాయాపహారిన్ హరిన్॥

ఆడపోకు — ఇది శ్రీనాథుని వీధివంటి చిన్నపుస్తకము. గ్రంథకర్త మల్లాది అచ్యుతరామశాస్త్రిగారు. వెల 0-1-0. బెజవాడ శ్రీ సీతారామాంజనేయ కంపెనిలో దొరకును. కవిత్వము మృదుమధురము కాని వర్తమానకాలానుసారముగా భాష నుపయోగించినాఁడు. అసంగతి యంతయు గ్రంథకర్తయే

మ॥ తనకాలంబున జాతిధర్మముల కంతా బద్ధులై యుంటచే
తను వారిఁగని వారివేషముల భేదంబెల్ల వర్ణించి వ్రా
యను శ్రీనాథుఁడు చాలినాఁడదియుఁగా కాతండు పాండిత్యమున్
గనినాఁ డెంతో సమర్థుఁడా తెలివి యీనాఁడున్న రాజాస్యలన్
గని యేరీతిగ వ్రాయఁగాఁ దలఁచునో. కానిమ్ము ఈనాఁటి స్త్రీ
లను వార లధరియించు భూషలను గాలస్థంబుగా నెట్లుతోఁ
చెనో నా తెల్వికి నట్లు వ్రాసితిని జూ. చిత్రంబులో వారి దూ
అటుగానీ యివి మంచిచెడ్డలని నిర్ధారింపఁగాఁ గాని వ్రా
యను. గానన్ దయయుంచి చూడవలె. అయ్యా! ఒక్క విజ్ఞాపనం
బొనరింతున్ వినుఁ. డిందు దేశ్యపదముల్ హూణోక్తులున్ మెండుగా
కనుపించంగల వెన్న. ఇప్పటి యలంకారంబు లా భాషలో
నను గాన్పింపఁగ వాని వ్రాసితిని గానన్ వాని యోజింపుఁడీ.

అని చెప్పుకొనియున్నవాఁడు. ఇప్పటి వేషభాషలు స్పష్టముగాఁ దెలియుటకు హూణాదిపదములుంబోలె నంతా మున్నగునవియుఁ గానిమ్ము ఈనాఁటి మొదలగు విసంధులును వాడియున్నాఁడు. ఇందలి మఱికొన్ని పద్యములును దిలకించుదురుగాక.

సీ॥ వెంకమ్మసీతమ్మపేరులు వెగటాయె సొగసగుపేరులు సవరణాయె
మెడనుండువస్తువుల్ కడఁద్రోచి విడఁజేసి బొట్టును త్రెంచి ముక్కున నిత్య
తొడుగుడుదైకలు త్రోసిరాజయిపోయె పచ్చబ్యాకెట్లు పసలాయె
కాలి కండెలు గొలుసు కడియాలు పోలాయె స్టాకింగ్సు బూటులు సమకూడె
పసుపు కాటుక మోములు విసుకునిచ్చెఁ బియ్యపుసర్ తైలంబు సోపులు ప్రియమువడెను
తెలుఁగుమాటలు కొన్నిఁటిఁ దెలియకుండె నిలిచెను వృథగా స్త్రీలకిప్పుడు

సీ॥ ముచ్చటముడిపోయె. మూర్చెటజడపోయె. దవనంపుటొంటిజడ పోయెపోయె
సంచియల్లుడుపోయె. జాలీనజడపోయె. యస్ జడకీల్జడ లయ్యెపోయె
బర్మాముడియుపోయె. పలకయల్లుడుపోయె. బుచ్చటుకొకప్పుడుఁ బోయెపోయె
ఈఁతాకుజడపోయె. ఇంగ్లీషుజడపోయె. బిళ్లచుట్టయుఁ గొండివేత పోయె.
బాదాముముడి పోయె. పన్నిరుజడపోయె. పంకీలజడ కొకప్పుడె పోయె.
కలకొండఱుమాత్రము క్రాపుపోయి కొసలు కత్తిరి వేసిన. కురులు విరియఁ
బోయె పోకగు. కొప్పులుపోయి సింతజడలపోకలు ప్రస్తుత సమయమందు.

సీ॥ గుఱ్ఱంపుబండిపైఁ గూర్చుండి బాజార్ల సంధ్యవేళ షికారునలుపు నొకటి
సభ నుపన్యాసంబు జరుగుచుండిన నందు స్వేచ్ఛగా నటుకేగి వినుట రెండు
సంఘసంస్కరణకై సభ్యత్వము వహించి దేశంబు లెల్లెడఁ దిరుగ మూఁడు
తమకుఁదోఁచినయంత ధైర్యంబుతోఁ గూర్చి వ్యాసంబు పేపర్ల వ్రాయ నాల్గు
చేతనైనంతవఱకిట్లు స్వేచ్ఛవచ్చునో మగవాని శాసనము నగ్రముమీఁద
అడుగువడఁజేయవచ్చునో యనుట యయిదు నాడపోడిమిలక్షణా లగుచునుండె.

సీ॥ తాయిలు లేకున్నఁ జాపారిచాయున్న హార్మోనీ పిల్లకు నమరవలయు.
చదువఁగా వ్రాయఁగా సాఫుగా రాకున్న స్కూలులోనికిఁ బోవుచుండవలయు.
చిత్రింపుటల్లిక చేతగాకున్నను నూలుసూదులు కొనియుండవలయు.
నీటుగా నొకపాట నోటికి రాకున్నఁ బాటలబొక్కు చేపట్టవలయు.
పైకమున్నటు తనచేత రాకయున్న ప్యాంటుసూయింగుమిషను గృహంబునందు.
నిలుపవలయును. వీనిలో వెలితియున్న నాడపోడిమి లోపంబు చూడఁ జాఁడ.

సీ॥ ఉద్యోగములఁజేయ నుత్సాహములఁ జెంది కష్టించి రాడ్విద్య గఱచువారు
సన్యాసులై కొంత సంసారసారంబు పరికించి సంతోషపడెడివారు
దేశరక్షణఁజేయఁ దెగువతో నగలను విరివిగా సభఁ బంచిపెట్టువారు
పెనిమిటి న్విడనాడి వేదాంతసుఖముల సాధింప గురుసేవ సలుపువారు
వ్యాసముల వ్రాసి పేపర్ల ఖ్యాతిఁగాంచ నాంధ్రసంస్కృతవిద్యల నభ్యసించి
ఉపనిషత్తుల భాష్యాల యుక్తులెల్లఁ దెలియునను వారు స్త్రీజాతిఁ గలిగినారు.

## — ♦ సుఖము ♦ —

( మ. శ్రీనివాసశాస్త్రిగారు )

ఆర్యులారా !

ప్రతిమనుష్యునికి సుఖము కావలయును ... సుఖదుఃఖములకు ... హేతువు నాలుగవస్థలుమాత్రమే... వానిని జాగ్రత్తు స్వప్నము సుషుప్తి తురీయము నను పేరులతోఁ బెద్దలు వాడుచున్నారు. ఈనాలుగవస్థలలో నాలుగవ యవస్థ యోగులకే కాని యితరు లెఱుఁగఁదగినది కాదు. మఱిమూఁడవస్థలు నందఱి యనుభవములోనివియే. వానిలో సుఖ మేయవస్థలో నధికమనియు నేయవస్థ దుఃఖసంబంధ మెంతయు లేనిదనియు విచారించినవాఁడు జ్ఞానియగునని మహాత్ముల తాత్పర్యము ... జాగ్రత్త సర్వేంద్రియవ్యాపారములుఁ బూర్ణముగానున్నయవస్థ. స్వప్నము సూక్ష్మేంద్రియ వ్యాపారములతో మనస్సు పనిఁజేయుసమయము. సుషుప్తి శరీరేంద్రియములం గాత్మబుద్ధి విడచియాత్మస్వరూపమాత్రమున నిలువఁబడు సమయము. ఈయవస్థలలోఁ బ్రథమావస్థయందు సర్వేంద్రియములుఁ బనిచేసిన వానికి సుఖమే కలుగుట నిశ్చయములేదు. కన్నుచేత సుఖముకలుగవలయుననిన సుందరమైన రూపములను జూచుటయే దానికి హేతువు. కనఁబడు ప్రతివస్తువును సుందరముగ నుండుట యసాధ్యమే. దానిచేత సుఖదుఃఖమిశ్రమమే యదియగుచున్నది. స్వప్నమో వ్యవస్థాశూన్య సుఖదుఃఖమయమని యందఱికిఁ దెలిసినదే. సుషుప్తిమాత్ర మెవరికైనను దుఃఖరూపముగఁ గనఁబడదు. ఎప్పటికి సుఖరూపమే. ఏమిసుఖముగ నిద్రచేసినాను, ఏమియు నెఱుఁగ ననియే యెవఁడును జెప్పుచున్నాఁడు ... శరీరాభిమాన త్యాగము . . . ప్రవృత్తిహీనత . . . ఆత్మమాత్రనిష్ఠత, ఇవియే సుఖహేతువులు. ద్వైతజ్ఞానహానియు- తత్త్వాధిగమమార్గ మిట్టిదని మనకుఁ జూపించుటకే భగవంతుఁడు సుషుప్తి నిచ్చినాఁడు. కనుక సుఖమను పదమున కర్థము. . . శరీరాభిమాన త్యాగాదులేయని నిశ్చయము.

---

## — ♦ మళయాళయాత్ర ♦ —

( దాసు గోవిందరావు గారు, బి. యే. )

### కుర్తాళము

మళయాళమునకుఁ గుర్తాళమనునది ముఖద్వారమువంటిది. తెంకాసియను రైలుస్టేషనులో దిగి మూఁడుమైళ్ళు బండిమీఁదఁ బోవలయును. కుర్తాళముగ్రామము మహారణ్యముతోఁ గప్పఁబడిన పర్వతపంక్తికిఁ బాదమునం దున్నది. ఆ యడవులలో గొప్పవైన పేఁకు మొదలగు మ్రాఁకు లుండుటయే కాక యేలకి లవంగము మిరియము జాజి దాచెన చందనము మొదలైన సుగంధద్రవ్యముల నిచ్చు వృక్షజాతులును మిక్కుటముగాఁ గలవు. కాఫీచెట్లను పైనవ్రాసిన యేలకి మొదలైనవానిని గొండవాలులయందుఁ దోఁటలుగా నేర్పఱచి పెంచెదరు. అచ్చటికనతిదూరమున నేనుఁగులు స్వైరవిహారము చేయుచుండును. అనేక వ్యాఘ్రదంపతులు నిర్భీతితో సంచ

రించుచుఁ బిల్లలను బెట్టి పోషించుచుండును. ఇది మహారణ్యమయినను దృశ్యము మనోహరమగుటచేతను నెండకాలమునం దచటి వాతావరణము సౌఖ్యకరమయి యుండుటచేతను నాప్రదేశము ప్రశాంతమయి యుండుటచేతను నన్నిటికంటె నెక్కుడచ్చటఁ బ్రపంచముమొత్తముమీఁద నెన్నికలోనికిఁ గొనఁదగిన జలపాత ముండుటచేతను ననేకు లాకర్షింపఁబడి యిప్పటికి సుమారు ౪౦ సం॥ లనుండి కొందఱు పెద్దమనుష్యులును జమిందారులును భవనములను నిర్మించుకొనుచు రాఁగా నిప్పటి కొక చిన్న పట్టణపు టాకార మేర్పడినది. . . .

## మౌనస్వామి

నేను గుర్తాళమున మౌనస్వామి మఠమున విడిసితిని. అచ్చట నాకు సమీపబంధులయిన రెండుకుటుంబములవారిని స్వామికి శిష్యులుగా నుండి యచ్చటనే కాఁపురమున్నవారిని గాంచ నాకు మిగుల సంతోషమాయెను. మౌనస్వామివారు పూర్వాశ్రమమున మధ్యాంధ్రదేశములోని యొక పవిత్రమైన నియోగికుటుంబమునకుఁ జేరినవారని యిటీవల నాకుఁ దెలియవచ్చినది. నేను వారి పేరు చాలదినములనుండి వినుచుండినప్పటికి శుద్ధ ద్రావిడులేయని . . . తలచుచుంటిని. ఆమఠము . . . కొండరాతితోఁ గట్టిన పెద్దభవనము. దాని కనుబంధించి సుమారు పదిచిన్నయిండ్లు గలవు. ఎండకాలమున శరీరారోగ్యమునకయి వచ్చువారికిఁ గాని దేవీనవరాత్రోత్సవములకై వచ్చువారికిఁ గాని యాచిన్నయిండ్ల నద్దెకిచ్చెదరు. మఠమునంటి సుమారు పదియెకరముల విస్తృతిగల యరటి పనస మామిడి మొదలగు ఫలవృక్షములతో నిండిన యొక వనము కలదు. ఇదిగాక కొంతదూరమున నింకొక యిరువదియెకరముల తోఁటప్రదేశము మఠమునకుఁ జేరినది యున్నది. దూరదేశములనుండి యాకస్మికముగ వచ్చు యాత్రికులకుఁ గొలఁదికాల ముచితభోజన మిచట నొసఁగఁబడును. శ్రీ స్వామివారు నన్నుఁ గడు నాదరముతోఁ జూచినందులకు నేను వారికిఁ గృతజ్ఞుఁడను. స్వామివారు దివారాత్రములు . . . మౌనమువహించియుందురు. తమయూహలను . . . సంజ్ఞలచేతఁగాని కాగితముపైన వ్రాసికాని తెలియఁబఱచెదరు. ఆయన మంత్రశాస్త్రమునఁ బ్రవీణుఁడనియు రోగములను మంత్రమాత్రముచేత నివారణచేయఁగల్గుననియు వాడుకగలదు. చాలధనికులును జమీందారులును నాయనకు శిష్యులుగానున్నవారు.

## తిరువాన్కూరు

ఇది తిరువాన్కూరు తిరువనంతపురము ననంతశయనము నని మూడు పేరులచేత వ్యవహరింపఁబడునది. మొదటిపేరుగల స్వతంత్రరాజ్యమునకు రాజధానియయి యున్నది. ఇది మళయాళ దేశములోఁ జేరినదే యయియున్నది. పూర్వమాంధ్రదేశచక్ర

క్షత్రియయిన పరశురాముఁడను నాతఁడు సముద్రమునుండి మళయాళదేశము లేవనెత్తి సకలసువృక్షయుతముగా నుండునటు లాశీర్వదించి తనతోఁదీసికొనివచ్చిన యాంధ్రుల (ఇప్పటినాయరుల)కు విహారయోగ్యముగను జీవనాధారముగను నొసఁగెనని ప్రతీతి గలదు. నాయరు లనువారు పూర్వకాలమున నాంధ్రులనియును యక్షగంధర్వ జాతులలోఁ జేరి నాట్యగానాభినయాది కళాప్రసంగంబులఁ బ్రవీణులయి యుండి రనియును వారి యనేకసహస్రకుటుంబములను ... పరశురామప్రభు విచ్చటఁ బ్రవేశపెట్టి కొన్ని విలక్షణమైన యాచారములను గల్పించి యుంచెననియుఁ జగ కాలానుగతమైన యొక వాడుకమాట యీదేశమునఁ గలదు. ఈదేశమంతయుఁ జేరి యరటి పోఁక కొబ్బరి పనస మిరియము తమలపాకుచెట్లతో నిండిన యొక పెద్ద వనమని చెప్పినఁ జెప్పవచ్చును. మనదేశములలోవలె ఖాళీభూములుగాని విశాలమైన పొలములుగాని తఱచుగాఁ గనుపింపవు. రోడ్లను రైలుమార్గములును గాలువలును జెఱువులును దోఁటల నడుమనే యుండునని చెప్పిన దప్పేమియు లేదు. అచ్చటి భూమి నిమ్నోన్నతముగా నుండును. రోడ్లెక్కుడుదిగుడుగా నుండును. ఒక రస్తావెంబడి పోవుచుండఁగా నొకప్రక్కను ౨౦ అడుగుల యెత్తునఁ గట్టఁబడిన యిండ్లచాలు మేడలపంక్తియనున ట్లగపడుచుండును. మఱియొక్క ప్రక్కను ౨౦ అడుగుల లోఁతునఁ గొబ్బరి పోఁక మొదలగు తోఁటలనడుమఁ గట్టఁబడిన యిండ్లు పాతాళ లోకమునఁ గట్టఁబడిన ట్లగపడుచుండును. ఇండ్లు చాలవఱకుఁ దోఁటలలోనే యుండును.

## మళయాళీలు

మళయాళదేశములోని యాచారములు తక్కిన భరతఖండములోని యాచారములకు భిన్నములని యందరు నెఱిఁగియే యుందురు. వారిలో సాధారణముగా నాస్తియందలి స్వత్వము స్త్రీదియే యయియుండును. పురుషుని యాస్తికి మేనల్లుఁడు వారసుఁడుగానుండును. పురుషుఁడు వివాహమైన వెంటనే భార్యయింటికిఁ గాఁపురమునకుఁ బోయి యచ్చట నివసింపవలసినవాఁడుగా నుండును. స్త్రీలకు నిజమైన శాశ్వతమైన వివాహ ముండెడిదికాదు. సుమారు ౧౨ సం॥ ఈడున నొక బ్రాహ్మణునకుఁ గన్యనిచ్చి యొక కృత్రిమవివాహ మొనరించి పెండ్లివేడుక లన్నియు నప్పుడే జరిపి యమితముగా ధనము వెచ్చపెట్టెదరు. ఆవల స్త్రీకి వయసువచ్చినవెనుక స్వవర్ణములో నొకపురుషునకు మనువు కలిపెదరు. కాని యీస్త్రీగాని పురుషుఁడుగాని కొన్ని తగినకారణము లుండినపుడు వివాహము రద్దుపఱచుకొని మఱి యితర స్త్రీనిగాని పురుషునిఁగాని వివాహమాడినఁ దప్పులేదు. కాని యిప్పుడు మళయాళీల యాచారములు పూర్వమువలెఁగాక నూతనన్యాయశాస్త్రముల కట్టడిచేత సంపూర్ణముగాఁ బరిణామముఁజెంది తక్కినహిందువులలోని యాచారముల పో●

కరమే కలిగియున్నవి. స్త్రీలకుఁ బూర్వ మున్నంత స్వాతంత్ర్యము లేదు. వివాహమును బూర్వమువలె సులభముగా రద్దుపఱచుటకు వీలులేదు. వివాహములయందు మంత్రము లేమియు నుండవు. సామాన్యమైన పండుగవలె జరిపివేయుదురు. అప్పుడు రెజిష్ట్రారువద్ద వివాహము రిజిష్టరుచేసికొనుచున్నారు.

## మళయాళస్త్రీలు

ఆసేతుహిమవంతము వ్యాపించియున్న భరతఖండమునందుండు నితరస్త్రీలకును మళయాళస్త్రీలకును మిగులఁ దారతమ్యమున్నది. ఏకాలమందుఁగాని మళయాళకాంతామణులు మనోహరాకోమలలని చెప్పకతప్పదు. గాంధిమహాత్ముఁ...డు కూడ లోఁగడఁ దిరువాన్కూరువచ్చినపుడు ప్రసంగవశమున మళయాళకాంతల సహజసౌందర్యమును నిర్మలత్వమును గౌరవమైనభావములోఁ బ్రశంసించియుండెనఁట. తమశరీరస్వాస్థ్యమును గాపాడుకొనుటకయి మళయాళస్త్రీలు మిగుల శ్రద్ధవహింతురు. ఇరుప్రొద్దులను జన్నీళ్లలో ముఖ్యముగాఁ బ్రవాహోదకములోఁ జాలసేపు నిలిచి స్నానమాడి యిప్ప పెసర మెంతి మొదలగు మెత్తనిపిండులతో నొడళ్లఁదోముకొని మెఱుఁగుచేసికొందురు. తలవెండ్రుకల కొకగంటసేపుముందుఁ నూనెరాచి యావల స్నానకాలమందుఁ దాలియాకుపొడిమున్నగు పదార్థములచేఁ దలగడుగుచేసికొనెదరు. అట్టిదోహదము వెండ్రుకలు నిడుపుగాఁబెరుగుటకును గుదుళ్లలోఁ బటుత్వముండుటకును దుమ్మెదరెక్కలవలె నల్లని కాంతి నిలిచియుండుటకును గారణమగును. వారు జడలు వేయనే వేయరు. బిగువైన 'జడచుట్లచేత శిరోజములను బిగువైన రవికలచేత నురోజములను శ్లేషపఱచి శరీరస్వాస్థ్యమును జెడఁగొట్టుకొనుట దురభ్యాసమని యెంచెదరు. బంగారువెండినగలజోలికిఁ బోవరు. ధనికులగువారిపుడు కొందఱు సన్నని బంగారుగొలుసుమాత్ర మొకటి మెడయందును సన్నని బంగారుమెలిగాజొకటిమాత్రము చేతియందును ధరించుచున్నారు. సన్నని జరీయంచు చుట్టును గలిగి సన్ననై మల్లెపూవువలెఁ దెల్లనై యుండు చలువఁజేసిన చీరెను ధరించి యట్టే తెల్లనైన వదులుజాకెట్టును దొడిగి కడు నల్లనై యతిదీర్ఘములైన శిరోజములను గండెవలె ముడివైచి యందు రెండుమూడు తెల్లని పుష్పములనుమాత్రము సవరించి చెంపకుఁ జేరఁదీసి కన్నులుగల్గి మందస్మితాననలయి యతిగంభీరమానస్కలయి కనఁబడుచుండు...నాయరుకాంతల సహజసౌందర్యము వర్ణనాతీతము. మహాపండితుండును మహాభోగియు మహారసికుండును నగు శ్రీనాథకవి తెల్లయుడుపులు పడఁతులకు సొంపనియెంచిచెప్పిన "ఉమ్మెత్తపూవునా నొఱపైనకుచ్చెళ్లు చేరి మీఁగాళ్లపైఁ జిందులాడ" అను సీసపద్యచరణము జ్ఞప్తికివచ్చుట యీసందర్భమున న్యాయమె యనుకొంటిని.

## పద్మనాభస్వామి దేవాలయము

తిరువనంతపురము రాజ్యము యావత్తును బద్మనాభస్వామియొక్క స్వత్వమనియు మహారాజనునాయన ధర్మకర్తమాత్రమె యనియు నొక సిద్ధాంతముగలదు

కాని వ్యవహారమునందు రాజ్యమున మహారాజునకు సంపూర్ణస్వత్వము గల్గియుండుటఁ జూచుచున్నాము. ఈదేవాలయమునం దహోరాత్రము బ్రాహ్మణు లెందఱు వచ్చినను నుచితాన్నము నిడెదరు. నేను జూచిననాఁడు రాణిగారి పుట్టినదినమయి యుండెను. ఆనాఁడు సుమా రాఱువేల బ్రాహ్మణులు భోజనార్థమై కూర్చుండిరి. సాధారణముగా మూఁడువేల బ్రాహ్మణులు ప్రతిదినము నిరుప్రొద్దులను భోజనము చేయుచుందురు. రాజధానియందే కాక రాజ్యమునందున్న యన్నిగ్రామములయందును బ్రాహ్మణులకు సర్కారువారివలన నుచితముగా భోజనమీయఁబడు పద్ధతి కొద్ది సం॥ లక్రిందటివఱకును నీరాజ్యమం దుండెడిది. కాని కొందఱు దివానులయొక్కయు యూరోపీయులయొక్కయుఁ బ్రోత్సాహముచేత నిపుడు గ్రామాదులలో నుచిత భోజనము నిచ్చుపద్ధతి యాపివేయఁబడినది. రాజధానియందుమాత్ర మిప్పటికిని నున్నది. దీనినిగూడఁ దగ్గింపవలసినదని యెందఱో సలహాయిచ్చి పుణ్యమును సంపాదింపవలెనని యత్నించిరి కాని రాజదంపతులు బ్రాహ్మణసత్కారము మాసంస్థానపు మర్యాదగనుక మేము మానుటలేదని . . . నిల్పిరి . . . పాకశాల . . . సామాన్యమైనది కాదు. గొప్ప ఫ్యాక్టరీయని చెప్పవచ్చును. వంటపాత్రలు విపరీతాకారము గల్గి భయంకరముగానుండును. స్థిరముగాఁగట్టఁబడిన గొప్ప పొయ్యిలును వాని పయిన స్థిరముగా నమర్చఁబడిన పాకపాత్రలును ననేకములున్నవి. పొయిలలోని నిప్పు చల్లార్చి మూఁడుదినముల కొకసారి యాపాత్రలలో మనుష్యులు దిగి పరిశుద్ధము చేసి గుడ్డతోఁ దుడిచెదరు. అప్పడములు కూరలు మొదలైనవి చిన్నచిన్న కొండలవలె రాసులుగాఁ బోయఁబడియుండును. తెల్లని పలుగురాళ్లతో నిర్మించిన యొక విశాలమైన కళ్లములో వండిన యన్నమును రాసిగాఁ బోసెదరు. తాళింపు పెరుగు పచ్చళ్లు జారుపప్పు మున్నగువానిని గాచినవెంటనే వలుఁదలైన పేఁకుతుండ్లను దొలఁచి మనము కాల్వలలోఁ జూచు చిన్న డింగీలు పిన్నేసులువలెఁ జేయఁబడిన పడవల యాకృతిగల కొయ్యపాత్రలలోఁ బోసి పోఁకమ్రాఁకుదొప్పలతోఁ జేయఁబడిన చిన్న చేఁదలతో నెత్తి తీసి వడ్డించెదరు. అచ్చట నరటితోఁటలు విశేషముగా నుండుటచేత నరటియాకులను గడ్డికంటెఁ జవుకగా వాడెదరు. కొబ్బరి పనసకాయలతోఁ జేసిన పదార్థములు మెండుగానుండును. కొబ్బరినూనెను వంటలయందు విశేషముగా వాడెదరు. అచ్చట బ్రాహ్మణులు పాత్రలను దెచ్చుకొనువాడుక తక్కువ. వడ్డించువారలే పరిషేచనము మొదలు భోజనాంతమువఱకును దక్కినపదార్థములతో పాటు మంచినీటినిగూడ వడ్డించెదరు . . . పద్మనాభస్వామి యాలయమునందు బ్రాహ్మణసంతర్పణకుఁగాను సం॥ ఒకటికిఁ బదిలక్షలరూపాయలు వ్యయమగుచున్నవఁట. మహాన్యగ్రోధమునాశ్రయించిన గబ్బిలంబులమాడ్కి నిచట బ్రాహ్మణకుటుంబములు వందలకొలఁది గలవు. అందుఁ గొంద ఱాంధ్రులుగూడఁ గలరఁట. . . .

---

పలిరెడ్డి బారుటీఁటెతోఁ బొడిచి యతని మడియించె. తమ్ముఁడట్లు విగతాసుండగుట కన్నులారఁ గాంచి యాగ్రహోదగ్రుఁడై నాయఁడు కృపాణంబుచే నరసారెడ్డి శిరంబు నొక్కవ్రేటున ఖండించి చింతపలిరెడ్డిపైఁ బడ నుంకింపఁ బిన్నమలిదేవరాజక్షమై యారెడ్డిం దాఁకి యొక్క బల్లెపుఁ బోటునం బడఁగొట్టి కరవాలంబునఁ దల నఱికివైచె. వీరారెడ్డి వీరావేశంబున విజృంభించి పినమలిదేవరాజు కుంభికుంభంబు వ్రక్కలుచేసి కూలుచున్న యాగజేంద్రంబుపై నుండి దుమికించి దుముకుచున్న యారాజకుమారుని యుత్తమాంగంబు నఱికివైచె. రాజకుమారుని పాటు కన్నులారఁ గాంచి నాయఁడు వీరారెడ్డిని సమరరంగంబునకు బలియిచ్చి యెచ్చటఁ జూచినం దానయై దొరకిన వీరులనెల్ల నురుమాడుచున్నవాఁడు. ఇదియే విజయంబున కనుకూలసమయము. నేనును సమరవిహారంబు గావించెద. (అని నిష్క్రమించును.)

బ్రహ్మనాయఁడు॥ (యుద్ధభూమి నొక్కెడ యొక్కెడఁ గూర్చుండి యుండును.)

కన్నమ॥ (మరలఁ బ్రవేశించి) దేవా! భ్రాతృమరణంబుచేఁ బెదమలిదేవరాజు శోకసంతప్తుఁడై తన చావునకు శంకింపక సాహసించి సమరవిహారంబు గావించెను. ఒక్కసారిగా వచ్చి యందఱును బైఁబడుటచే నాయనకు మహారణంబు భరమయ్యె. సేనయంతయుఁ జెదరిపోయెను. అప్పుడు మలిదేవభూపతి తన పక్షమునందలి యోధశేఖరులు వీరస్వర్గంబు గాంచుటయు బలంబు సన్నగిల్లుటయుఁ గాంచి హతశేషసైన్యంబును సమకూర్చుకొని నాయకురాలి నెదిరించి శరవర్షముం గురియించె. నాయకురా లప్పుడు మలిదేవుఁడు

తనపైఁ బ్రయోగించు మార్గణంబుల నన్నిటిని మధ్యేమార్గం బుననే ఖండంబులుచేసి ధ్వజంబును దుంచి సారథిని సమయించి కోదండంబు ఖండించి యొక వాఁడిబాణంబుచే వజ్రకుండలమండితంబగు నవ్వసుంధరావల్లభుని యుత్తమాంగంబును యుద్ధరంగంబున కలంకారంబుగాఁ జేసివైచి కేవ్వునఁ గేకవేసినది. ఇంకేమున్నది? మీవంటి ప్రతాపమార్తాండున కిఁకఁ జేయవలసిన దేమున్నది? ఎవ్వనికొఱకు కిందటి వీరుల రక్తమును రణభూమినిఁ బ్రవహింపఁజేయవలసివచ్చెనో యా మహారాజు మాయమైపోయినతరువాత మీకింకను భండనముతోఁ బని యేమున్నది? (అని దుఃఖించును)

బ్రహ్మనాయ॥ తే॥ క్షాత్రమున సంగరస్థలి సమసి వార
లుత్తమంబగు స్థిరసౌఖ్య మొసఁగునట్టి
లోకమున కేగినా. రిఁకలోప మేమి?
వగనఁ డవ్వారిఁగూర్చి నీవంటివాఁడు.

వారిభాగ్యము మనకుఁ గలుగనందులకు వగవనగునుగాని వారికై వగవఁదగదు. వారి ననుసరింప నీకు వాంఛయున్న

తే॥ పంపుచున్నది చూడు మాపాపురాలు
వీరబలముల మనపైకి. వేగ వారి
నణఁపనేగుము నీశౌర్య మగుపడంగ
వీరపురుషోత్తమోచితవిధిని గుఱ్ఱ!

కన్న॥ చిత్తము (అని నిష్క్రమించి కొంతసేపటికి నాయకురాలిని లాగుకొనివచ్చి) దేవా! ఎవ్వతెకారణంబునఁ బల్నాటిసీమ కింతపాటు సంభవించెనో యెవ్వతె బ్రహ్మవల్లభుం జేతిలోని కీలుబొమ్మగం జేసి యాడించుచున్నదో యెవ్వతె రూపంబున

మహామారి పల్నాట నవతరించి తన కృత్యములు నెఱవేర్చెనో యాపాతకురాలి నాసీచురాలి నాదుర్జాతి నాకఠినకిర్మిణి నాపెనురక్కసిం దా౯ళ్ళఁ గట్టి పట్టితెచ్చితి. ఏమియాజ్ఞ ?

బ్రహ్మనాయ॥ ఇదియంతయు దైవకృతము. ఈపె నిమిత్తమాత్రము. విడిచిపుచ్చుము.

నాయకురాలు॥ (పశ్చాత్తప్తహృదయయై కరములుమోడ్చి భక్తితో)

సీ॥ బమ్మదేవరగన్న పరిభువయ్యు శీలము
యొడిలోన బిడ్డఁడై యున్నవాఁడ !
సంగహీనుఁడవయ్యు జగమును భ్రమపెట్ట
ఐతాంబమగఁడవై యలరువాఁడ !
పరిపాల్యమాన యావల్లోకుఁడవు నయ్యు
భూభార మడపంగఁ బుట్టువాఁడ !
నిర్వికారుఁడవయ్యు నుర్వి మాబోంట్లతో
ఉద్దిగం జరయించుచున్నవాఁడ !
నిన్నుఁ దెలియలేక పిన్నలుం బెద్దలు
వేలుపులును ఋషులు విమతులగుదు
రన్న మూఢమతిని నన్నును నిటువంటి
నాకుఁ దెలియఁదరమె నళిననాభ !

మఱియు నో మహానుభావా !

ఉ॥ పాతకురాల. నీవు భగవంతుఁడవౌట యెఱుంగ. ద్రోహపుం జేఁతలఁ జేసియుంటి. నవి చిత్తమునన్ గణియింపఁబోక నా జాతిని నీతి నెన్నక ప్రసన్నుఁడవై యిఁక నెన్న డేనియున్ భూతలమందుఁ బుట్టి పలుపోకలు పోవనటు ల్వొధింపవే.

దేవా! మీమహిమ లనంతములు. నే నెఱుంగ సమకు రాలనే? నిన్ను హరిసమానునిగాఁ దలంపక ప్రమత్తచిత్తత నాజ నెదిరించితిని. నాతప్పు క్షమియింపుము. శిక్షింపఁదలఁచితివేని యిదిగో నాయాయుధములం ద్యజించి శిరంబు నీ చరణసన్నిధి నర్పించుచున్నాను. ఖండింపుము.

బ్రహ్మ॥ నే నట్టి నీచకృత్య మెన్నటికిం జేయఁజాల. మలిదేవరాజు మహావీరులతో సురపురమున కరిగినవాఁడు. ఇఁకఁ బలనాడు భాగింపవలసిన పనిలేదు. నిష్కంటకంబుగా నలగామరాజును బునరభిషిక్తుఁ గావింపుము.

నాయకు॥ అంతయుఁ గాలవశమున నైనయది. నీవే నలగామరాజును బట్టాభిషిక్తుఁ గావించి మంత్రివై ప్రజాపాలన మొనరించుచుఁ గీర్తిఁగాంచుము.

బ్రహ్మ॥ మంత్రిత్వమునకు నీవే యోగ్యురాలవు.

నాయకు॥ పల్నాటివీరకీర్తి ప్రతిష్ఠాపనమునకై యందఱమును నిమిత్త మాత్రులమై పనిచేసితిమి. ఇందు విజయ మొక్కరికిని లభింపలేదు. ఉభయులము విజితులమే. ఇఁక నలగామభూపాలునకు మాత్ర మేమున్నది? పేరమ్మ పేరంటాలై పెద్దలలోఁ గలసిననాఁడే యాతని సుఖసౌధము లన్నియును జూర్ణీభూతములై పోయినవి.

బ్రహ్మ॥ అన్నియనర్థములకును మనమే కారకులము.

నాయ॥ వెనుకఁ జింతించుట వెఱ్ఱితనము. అనుగురాజు నీపైఁ బెట్టి పోయిన యాత్మకుటుంబరక్షణభారమును వహించి పల్నాటి రాజ్య భవిష్యద్రక్షణమునకుఁ బట్టుఁగొమ్మవై బ్రతికియున్నంత నఱకును బరిపాలించుట నీకు ధర్మమై యున్నయది. నేనుగట్టి

వైరము లన్నియు విస్మరించి విజ్ఞప్తముం బరిపాలింపుము.
మాఱుమాటాడిన మాచర్ల చెన్ను నాన. మల్లేశ్వరు నాన.

నలగాముఁడు॥ (ప్రవేశించి దీనవదనముతో నాయనకు నమస్క-
రించును.)

బ్రహ్మ॥ శుభమస్తు (అని దీవించి) వీరు లందఱును సంగరరంగంబున
శరీరంబులు విడిచి స్వర్గ మలంకరించిరి. నరసింహుఁడును
నలిదేవుఁడును నట నైకమత్యముతో నున్నవారు. హత
శేషులఁ బాలించు భారము నీమీఁదఁబడినది. పలనాటి
కంతటికి నిఁక నీవే యధినాథుఁడవు. నీవును నాయకు
రాలును న న్నిప్పటివలె మంత్రిపదం బలంకరింపుమని బహు
ప్రకారంబుల బ్రతిమిలాడితిరి. పరివారంబును బ్రజలును
బ్రార్థించిరి. అనుగురాజువాక్యంబులం దలంచుకొని యెట్ట
కేలకు మరల మంత్రిత్వమును స్వీకరించితిని. రాజా! వీర
స్వర్గము చూఱకొన్న వీరాగ్రగణ్యులకు మనరాజ్యమం
దేఁటేఁటఁ బ్రజ లారాధనంబు గావించు నేర్పాటు నొనరింప
వలె. ప్రజల వీరారాధన తత్పరులం గావించుట రాజులకు
సర్వశ్రేయోదాయకమగు ప్రధానకృత్యము. ఈపూజలు
మహావీరుల కీర్తిప్రతిష్ఠలం బ్రదర్శించుటయ కాక ప్రజల
కుత్సాహమును వర్ధిలఁజేయుచు వీరవిహారస్థానంబున గౌర
వాభిమానంబులు గల్పింపఁగలవు. వీరార్చనంబులు వీరప్రసవ
కారణంబులు. పార్థివులకు బలగౌరవసంపాదకంబులు.

నాయ॥ తప్పకుండ నిట్టి యుత్సవంబులు కావింపవలసినదే.

నలగామ॥ మంచిది (అని ప్రజలదిక్కు మొగంబై) సుజనులారా! మన
మందఱమును గంగధారిమడుగున స్నాతులమై భక్తిపూర్వ

కంబుగాఁ బలనాటివీరుల నారాధింపవలె. ప్రతిసంవత్సరముఁ గార్తికమాసమం దీ కారెమపూడిరణక్షేత్రమందు వీరపూజలును వీరోత్సవములును గావింపవలెను.

ఉ॥ వీరులు దివ్యలింగములు విష్ణువు నాయఁడు కళ్ళిపోతురా
జారయ భైరవుండు తుహినాద్రిజ యంకమ నిర్మలాంగియై
కేరెడు గంగధారిమడుగే మణికర్ణికగాఁ జెలంగు నీ
కారెమపూడిపట్టణము కాశి యిఁకం బలనాటివారికిన్.

నాయ॥ ఇంకను నిట్లగుఁగాక.

కం॥ పలనాటివీరనామం
బిలమీఁదను శాశ్వతముగ నెసఁగునుగాతన్
జలజాక్షుల మాయలఁ బడి
సిలుగులు గనకుంద్రుగాత క్షిత్యధినాథుల్.

గద్య॥ ఇది శ్రీవేంకటేశ్వరప్రసాదలబ్ధకవితాధురీణాపస్తంబసూత్ర
భారద్వాజగోత్ర మేళ్ళచెఱువు వేంకటరామ తృతీయపుత్ర
పున్నమాంబా గర్భశుక్తి ముక్తాఫల కుటుంబరాయ
నామధేయ ప్రణీతంబైన పలనాటివీరచరిత్ర
నాటకమునఁ బంచమాంకము.



గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలయందు ముద్రితము.



శ్రీ

# సోమేశ్వర శతకము.

కం॥ శ్రీగిరిలసిత సునివేశా!
సమ్మత యోగాభ్యాసవిదేశా! [illegible] కేశా!
గా[illegible]
స్మితవదనా! జానపాటి శ్రీసోమేశా! ౧

కం॥ పరిపూరితభక్తాశా!
చిరసంస్థిత పాపనాశ! జితకీనాశా!
పరిలూనమోహపాశా!
సిరినొప్పెడి జానపాటి శ్రీసోమేశా! ౨

కం॥ మొట్టమొదట లొక్కఁడవయయి
పుట్టించితి వీవు లీల భువనత్రయముం
గిట్టించువాఁడ వీవక
చిట్టచివర జానపాటి శ్రీసోమేశా! ౩

కం॥ అంతయు నీవే యయ్యును
[illegible]యిని భిన్నభిన్నవిగ్రహములుగా వ
ర్తింతు. ఇది యేలయనుచుం
జింతించెద జానపాటి శ్రీసోమేశా! ౪

కం॥ వర్తింతుగాక. కతిపయ
మూర్తులలో మాయచేత మోహితమతివై
వర్తింతు. వొకట నేవిధి
చేర్తువనుటె జానపాటి శ్రీసోమేశా! ౫

క॥ మాయామోహితమతినై
ఆయా దేహములందు నలరుచు నత్యా
నాయాసంబును బొందెద
నీయనఁగ జానపాటి శ్రీసోమేశా ! ౬

క॥ నిన్నే నీవెఱుఁగక యీ
యున్నవిధంబునను బట్టి యూహింపఁగ స
ర్వోన్నతుఁడ నీవు కావని
చెన్నలరెడి జానపాటి శ్రీసోమేశా ! ౭

క॥ మాయామోహితులగు ధృత
కాయులలో నొకఁడనగుచుఁ గానక నను నే
ఆయా దుష్కర్మంబులు
చేయ నయితి జానపాటి శ్రీసోమేశా ! ౮

క॥ అత్యంతాయాసంబును
నిత్యంబును బొందుచుండి నేనీవిధి నా
న్నత్యంబు విడిచిని సం
సృత్యనుసృతి జానపాటి శ్రీసోమేశా ! ౯

క॥ చిన్నదిగా దీసంసృతి.
ఎన్నిగను సౌఖ్యములు కర. మి కేమిఁకను ? సం
పన్నగృహస్థునకైనను
చెన్నటియే జానపాటి శ్రీసోమేశా ! ౧౦

క॥ ధనమూ శూన్యము బొత్తిగ
మనమూ చంచలము కరము. మానంబా చా
లిన యంత కానరా దెం
చిన నాకో జానపాటి శ్రీసోమేశా ! ౧౧

క॥ రాజాధిరాజులకె యే
యోజను సుఖకరముగాని యురుసంసార

బాజన్మనిస్వుఁ జెవ్విధి
చేఁ జేయును జానపాటి శ్రీసోమేశా ! ౧౨

కం॥ దినదిన మేదో ప్రియత్నము
పోనరిచి దినంగాని ప్రాప్తిపూర్ణనిధంగుఁ
గను స్వప్నయింది. సేఁ జే
సినదేమిర జానపాటి శ్రీసోమేశా ! ౧౩

కం॥ నిరతం బేదో మనోవ్యధ
దరికొనఁగంజేసి నీదు ధ్యానంబునకే
తెలి యీయకుంటివిక ద !
సెరిసొప్పెడి జానపాటి శ్రీసోమేశా ! ౧౪

కం॥ కోరిక లసంతములు. త
త్పూరణమాత్రింబు సున్న. దుఃఖం బమితం.
బీరీతివాఁడ నిన్నెటు
చేరంగల జానపాటి శ్రీసోమేశా ! ౧౫

కం॥ సకలశరీరంబులలో
ఒకఁడవ వర్తించుచుండియును భిన్నుఁడటుల్
ప్రకటంబుగ దిగుచుందువు
సికపట్లకు జానపాటి శ్రీసోమేశా ! ౧౬

కం॥ ఆకారభేదమాత్రిమ
గా కన్యముగలదె చూడంగా సకలా ! వి
మోా కలదని పగిపొందులు
చేకొనియెద జానపాటి శ్రీసోమేశా ! ౧౭

కం॥ ఒక్కట దుర్మార్గుఁడుగను
ఒక్కట సన్మార్గుఁడుగను నుండుచు నీవే
ఎక్కుడు. డిగ. దేటికి నీ
చిక్కు లహో జానపాటి శ్రీసోమేశా !

కం॥ ఒకచో నత్యనురాగ
మ్మొకచో నీర్ష్యాతిశయము నుంచుకొనెద. వే
ఱికి నీ ఫేసంబు వృథా
నెకకస్సల జానపాటి శ్రీసోమేశా! ౧౯

కం॥ అరయఁగ నిజ మిదియైనను
ఎఱుఁగమి ఘటియిల్లఁ జేసి యీ దేహులకున్
దురితంబుల పాల్సేసెదు
సిరినొప్పెడి జానపాటి శ్రీసోమేశా! ౨౦

కం॥ కొన్ని శరీరములందుం
డిన్నగి నేలోపమునకుఁ జెరుపోయక స
పన్నుఁడవై వర్తింతువు.
చిన్నవాకో జానపాటి శ్రీసోమేశా! ౨౧

కం॥ లీలకుఁ దాల్చిన మేను నె
కా లలి సన్నియును! ఏమికర్మంబిది యా
ప్రేలగ నంతట నుండవు
శీలముచెడి జానపాటి శ్రీసోమేశా! ౨౨

కం॥ కోరుదు సుఖము నె య్యెప్పుడు
పొరాడుదు దుఃఖంబు. ఎంతవలదన్నను గా
సారెకు దుఃఖము వచ్చెడి
చేయువరున్ జానపాటి శ్రీసోమేశా! ౨౩

కం॥ కోరనిదుఃఖం బేగతి
సారెకు సంప్రాప్తమగునో సౌఖ్యంబును న
న్నాకీతిఁ గోరకుండనె
చేరదాకో జానపాటి శ్రీసోమేశా! ౨౪

కం॥ ఎఱుఁగమినిగాదుచుమి యీ
పరుగులు నాచిత్తమునకుఁ బరికించినచో
పొరితంపు మాయమహిమము
సరినొప్పెడి జానపాటి శ్రీసోమేశా! ౨౫

కం॥ ఎఱుఁగని ప్రజ యేవిధమున
తిరిగిననుం దప్పుగాదు. తెలిసి సమస్తం
బురుకులు వెట్టుచునుంటని
సరినొప్పెడి జానపాటి శ్రీసోమేశా! ౨౬

కం॥ నాకెపుడు నెంబగు సం
సారంబని బాల్యమందె స [illegible]
న్నారాధించుచునుంటినె
చీరాలను జానపాటి శ్రీసోమేశా! ౨౭

కం॥ పలదంటినిగద పెండిలి!
పలుకకయుంటిఁగద సరిగ భామలతోడన్!
తలఁపఁగ నిదియంతయు నీ
సెలవేకద! జానపాటి శ్రీసోమేశా! ౨౮

కం॥ పిలిచినఁ బలుకకయుండెడి
అలఘుమతిం బ్రస్తుతమున నతి[illegible]నిగా
సలిపితి వేమందుర నీ
చెలువు కదా! జానపాటి శ్రీసోమేశా! ౨౯

కం॥ కన్నెత్తి స్త్రీలఁ జూడని
నన్నుం జేసితివి యంగనాలోలునిగా.
అన్నన్న! కాదె యియ్యది
చిన్నతనము జానపాటి శ్రీసోమేశా! ౩౦

కం॥ యోగాభ్యాసముఁ జేయు వి
రాగికి సంసారమొకటి రహిఁ దల నిడి తా!

సుట్టేతి. తుద కిల్బిషిత్తి
చెట్టగ నీజానపాటి శ్రీసోమేశా! ౪౪

కం॥ ఇక్కడఁ దిరుఁడై యుండఁగ
మక్కువపడి వచ్చినావు మంచిదె. కానీ
చక్కంజేయక గ్రామము
చిక్కుల ముంచెద విదేల శ్రీసోమేశా! ౪౫

కం॥ తమ సౌకర్యముకొఱకై
అమాయిక నికేతనముల కడ్డంగ గోడల్
తమిఁబెట్టి ఖలులతోడ వి
స్మరం బీజానపాను శ్రీసోమేశా! ౪౬

కం॥ స్వరచితభిత్తులచేనను
తిరోహితంబయినయిల్లు దేవాలయమం.
టరసే! కను మీమహితము
సిరినొప్పెడి జానపాటి శ్రీసోమేశా! ౪౭

కం॥ దేవాలయమే యగుఁగా
కీనేకద దేవుఁడవు! వసింపు మిఁకిటనే
పావన తావకలింగము
సేవించెద జానపాటి శ్రీసోమేశా! ౪౮

కం॥ నాయిలు మా తాతతాతలగుల
కేమొక మప్పెప్పు. ముందు గూడ విచ్చుటనే
ఆయంత్యజోపభర్తల
చీయనుమిఁక జానపాటి శ్రీసోమేశా! ౪౯

కం॥ నున్నగ నున్నదియఁట య
స్మన్నిలయ. మ్మనిమొ నెవఁడో మతిహీనుం. డీ
వున్నయిలు నున్న నగుటది
చిన్నతనముగాదె నీకు శ్రీసోమేశా! ౫౦

—♦ కపాలమోచన మాహాత్మ్యము ♦—

ఆ॥ ఈప్రదేశమింక నిలను గపాలమోచనమటన్న ఖ్యాతి నెనయఁగలదు.
ముక్తులగుదురిచట ముందు కపాలంబు నాత్మఁదలఁచి శ్రాద్ధమాచరింప. ౩౨౭

కం॥ పితృపక్షంబున నట్టిటఁ బితృదైవతములగుఱించి పెట్టెడిశ్రాద్ధం
బతిశయఫలప్రదంబగు క్షితిగీర్వాణా! ఇఁకేమి చెప్పఁగవలయున్. ౩౨౮

ఉత్సాహము॥ స్థానబాహ్యులైనద్విజుల సంతతిని జనించు ప
ద్రాహ్మణలను బ్రీతిఁ బెండ్లియాడి త్వత్కులోద్భవుల్
నా నియోగమున సమస్తనాగరక్రియల సదా
పూని వ్యవహరింపఁదగిన పూజ్యులగుదు రగ్రజా!" ౩౨౯

వ॥ అనిచెప్పి వెళ్లిపోవుటయు వాతాభిధానబ్రాహ్మణుం డా యిందుప్రని వలననుండి ప్రతిగ్రహించిన విత్తంబు పెట్టి దేవదేవుండగు శివునకు దేవళంబు గట్టించె. అంతఁ బాకశాసనుండు నాగరబ్రాహ్మణుల నుద్దేశించి. ౩౩౦

పంచచామరము॥ "కపాలమోచనంబునన్ వగాహ మాచరించి యీ
కపాలిపూజసేయు బ్రహ్మఘాతకుండుగూడఁదా
విపాపుఁడౌను గాన దీన విప్రులార! స్నాతులై
అపాస్తదోషులై రహింపుఁడాజ్ఞయిచ్చినాఁడ నేన్" ౩౩౧

వ॥ అని వక్కాణించె. ఆ వాతాభిధానబ్రాహ్మణుం డందు యాశ్రమంబమర్చుకొని యభవు నర్చించుచు నధివసించె. అదిమొదలుకొని తమ యేకోలఁది కార్యంబును నతఁడుచెప్పినచొప్పున నాగరు లాచరింపంగడంగిరి. ఈకారణంబున వాతుండు ద్వితీయమధ్యగుండయ్యె. మహాత్ముఁడగు మఘువున కీర్తింబున బ్రహ్మహత్యారూపపాతకంబు నష్టమైనవిధంబును జదువువారికిని వినువారికిని బాపనాశకంబగు నీ కపాలేశ్వరమాహాత్మ్యంబును సర్వంబు మీకుంగా వాక్రుచ్చితి. తొల్లి యానర్తుండు భర్తృయజ్ఞుం గనుంగొని. ౩౩౨

—♦ పాపపిండప్రదాన విధానము ♦—

సీ॥ "ఎడఁదఁ దోఁపఁగనీక హితువాక్కు విననీకమనెడిమూర్ఖత్వంపుమహిమమునవో
ఇది యిట్టులగునటం చెఱుఁగంగరానీక మనసుఁ గలంచు ప్రమాదమునవో
తారుణ్యవశమునఁ దాఁ దటస్థించి యగ్గలమైన కామాంధకారమునవో
మహిత తమోగుణమాహాత్మ్యమునఁజేసి మన మాచరించిన మాంద్యమునవో
అఘముఁజేసి దాని కర్హప్రాయశ్చిత్త మాచరించుకొననియట్టివార
లయ్యఘంబునుండి యపుడ విముక్తులౌ పుణ్యమును వచింపు భూసురేంద్ర! ౩౩౩

ఆ॥ లోభమోహవివశులై భూమి వర్తిల్లు జనము పాపపిండమును నొసంగ
విధిని జెప్పుమయ్య విద్వద్వరేణ్య! వే యేను నీయనుంటి దానిఁ గాన" ౩౭౪
వ॥ అని వక్కాణించుటయు భర్తృయజ్ఞుం డిట్లనియె. ౩౭౫
సీ॥ "ఇరువదై దుపలాల హేమంబు గరఁగించి యాత్మీయ ప్రతిబింబ మమరిపించి
అపరపక్షంబున నవగాహ మొనరించి లలితమౌ తెలిచేలములు ధరించి
మండపాదికమును మంచిగం గూర్పించి యా స్వీయ ప్రతికృతి యచట నుంచి
తత్స్వరూపమునకు ధాత్ర్యాదికమునకు వక్ష్యమాణములయి వఱలు పృథివి
మొదలుగాఁగల మేటి యిర్వదియునాల్గు తత్త్వముల పేళ్ళు చదువుచుం దత్పరతను
పూజగావించునటువంటి పూరుషుండు పూర్వకృతపాతకమునుండి ముక్తుఁడగును.

మంత్రము॥ ఓంపృథివ్యైనమః ఓం అద్భ్యోనమః ఓం తేజసేనమః ఓం వాయవేనమః
ఓం ఆకాశాయనమః ఓం ఘ్రాణాయనమః ఓం జిహ్వాయైనమః ఓం చక్షుషేనమః
ఓం త్వచేనమః ఓం శ్రోత్రాయనమః ఓం గంధాయనమః ఓం రసాయనమః
ఓం రూపాయనమః ఓం స్పర్శాయనమః ఓం శబ్దాయనమః ఓం వాచేనమః
ఓం పాణిభ్యాంనమః ఓం పాదాభ్యాంనమః ఓంపాయవేనమః ఓంఉపస్థాయనమః
ఓం మనసేనమః ఓం బుద్ధ్యైనమః ఓం చిత్తాయనమః ఓం అహంకారాయనమః.
ఓం క్షేత్రాత్మనేనమః ఓం పరమాత్మనేనమః ౩౭౬

ఆ॥ ధూరటున్న దాన ధూప మగ్నిజ్యోతిర నెడిదాన దీప మమరఁజేసి
అటు "యువాసువాస" అను మంత్రమున వస్త్రముల ధరింపఁజేయవలయు వరుస

సీ॥ అర్ఘ్యాంగి చెంబెత్తి యతిభక్తిఁబోసెడి విమలనీరములఁ బాదములు గడిగి
చెలువైన మేల్జరీచెఱఁగులుగలయట్టి రమణీయ పట్టాంబరములు గప్పి
అంసద్వయము కరం బావహించెడిభంగి దళమైన నూత్నాంగదములు వెట్టి
సింగంపుమూతులఁ జెలఁగు మేల్మి పసిండి కడియముల్ హస్తయుగ్మమునఁదొడిగి
ఉంచి పదివేళ్లకుం బది యుంగరములు మఱియునుం గొన్ని క్రొన్నగల్వరుసనిచ్చి
వేదవేదాంగవిదుఁడగు విప్రునకుఁ ద దాత్మపిండంబు నర్పింపనగు నృపాల!

శ్లో॥ ఏష ఆత్మా మయా దత్త స్తవ హేమమయో ద్విజ
యత్కించి ద్విహితం పాపం పూర్వం భూయా త్తవాఖిలమ్ ౩౮౦
శ్లో॥ యత్కించి ద్విహితం పాపం త్వయా పూర్వం మయాహి తత్
గృహీతం మూర్తరూపం త త్తత స్త్వం పాపవర్జితః ౩౮౧
క॥ అను నేతన్మంత్రద్వయ మనఘా! దాతయుఁ బ్రతిగ్రహముఁజేసినయా
యాగ్రహీ గ్రహదానసంజ్ఞంబుగ ననవలయును. ఇది విధాన మాదానమునకు. ౩౮౨

ఆ॥ తత్ప్రతిగ్రహీత తనియమవిధంబుగా దక్షిణయు నొసంగి యాక్షణంబ
సాగనంపవలయు క్ష్మాపాల! ఇబ్భంగి సలుపఁ గలుష మెల్ల విలయమందు ౩౯౩
సీ॥ బరు వంతయును దింపఁబడినచాడ్పున నంత నలకనగ్నైతోఁచు నంగ మెల్ల.
క్రొత్తనెత్తురువెట్టి యత్తఱి సకలావయవములఁ జేయుఁ దేజోభివృద్ధి
కలలోన సితవస్త్రగంధమాల్యావృతి మఱియు స్త్రీ పురుషులం దఱిఁ గాంచు
శుభ్రగోవృషభాశ్వ శుద్ధతీర్థంబులఁ బ్రత్యక్షమగుచుండుఁ బ్రతితమిస్ర.
ఇటు పురాకృతకిల్బిషం బెడలినందు కొలయు నమ్మక మాత్మఁ బ్రయొసఁగుమాత్ర
వినినయంతన కల్మషమును హరించు పాపపిండప్రదానంబు ఫణితమయ్యె. ౩౯౪
కం॥ ఈ పాపపిండదానము భూపాలక! ఎచటనేని పొనరుపఁబడుఁగా
కీపుట్టువునం జేసిన పాపమె హరియింపఁగలుగుఁ బ్రజకది యరయన్ ౩౯౫
ఆ॥ అక్కపాలమోచనాహ్వయ క్షేత్రమం దాచరింపఁబడిన నది సహస్ర
భవములం బొనర్పఁబడినట్టి పాతకంబుల నశింపఁజేయఁగలది యగును ౩౯౬
ఆ॥ వేది మండపముల విధిని దొల్లింటివిధంబుగానె చేయఁదగును గాని
కల విశేష మింక గాయత్రిచే హోమమాచరింపవలయు నవనిపాల!" ౩౯౭

## —♦ ఇంద్రద్యుమ్నోపాఖ్యానము ♦—

వ॥ అని యిట్లు భర్తృయజ్ఞుం డశ్వసేనమహీపతినిగుఱించి చెప్పియుండె. ౩౯౮
సీ॥ అలఘు మార్కండేశ్వరాభిధానంబైన దివ్య మహేశ్వరదేవతయును
అఖిలపాపంబుల హరియింపఁజాలు నింద్రద్యుమ్నేశ్వరదైవతమును
నిఖిలరోగంబుల నిర్మూలమొనరింప నేర్పడినట్టి పాలేశ్వరుఁడును
ఘంటునిచే నిల్పఁగాఁబడుకతమున ఘంటశివఖ్యాతిఁగల భవుఁడును
ఇంకఁ గలశేశ్వరుఁడు వానరేశయుతుఁడు నొయ్య నీశానశివుఁడును నున్నవారు
కలియుగంబునఁగూడఁ బూజలనొనర్చు జనుల కోరికలం దీర్చుకొనుచు నచట.
వ॥ వారు పూజనంబుననకాక దర్శనంబునన సర్వరోగవివర్జితంబుగా జనుల దీర్ఘా
యువులఁజేయు బహుపుణ్యంబులగు లింగాకారంబుల నెసంగుచున్నవారు."
కం॥ అనియిట్లు కామహర్షణి వినుచుటయును శౌనకాది విద్వద్విప్ర
ర్షి నికాయం బాచరితంబును సాంతము తెలియఁగోరి మొగి నిట్లనియెన్ ౪౦౧
సీ॥ "లింగప్రతిష్ఠ పొసంగఁ గావించిన మార్కండసంజ్ఞుండు మఱియెవండు?
ధార్మికుండైన యింద్రద్యుమ్ననాముఁ డేకాలమందున్న భూపాలకుండు?
పాలకాఖ్యుండు తాభక్తినియుక్తి నెప్పట్లు సంస్థాపించెఁ బార్వతీశు?
ఘంటాహ్వయుండైన సురేశుఁ డేయన్వయంబును బావనముఁజేయ జననమందె?

వానరాన్వితముగ వర్తించు కలశుఁ డీశానుఁడును మఱెవ్వ ? రానతిచ్చి
దానమంత్రములును దత్త దుదంతంబులును వచింపు"మనుడు విని యతండు ౪౦౨

వ॥ "దేని వినినమాత్రంబున జనము దీర్ఘాయువై యెవ్విధంబునను నపమృత్యువు గాంచదో యెయ్యది భర్తృయజ్ఞునిచే వానరాధిపతియగు నశ్వసేనునకు వచియింపఁబడియెనో యా పురాతనగాథ నేను మీకుఁ గీర్తించెద. మార్కండుఁడను ప్రథమసంకీర్తితుఁడగునతని పవిత్రచరిత్ర మీకుఁ జెప్పియుంటి. ఇఁక నఖిలనృపాలమానితుండగు నింద్రద్యుమ్నుఁ డెట్టిప్రభావముగలవాఁడ యునదియుం జెప్పెద. ౪౦౩

సీ॥ ఆత్మవస్తు వెఱింగి యనవరతం బంద రమియించుచుండెడి రాజయోగి
ఆర్తిగూరినయట్టి యఖిలలోకమునకు నాశ్రయంబిచ్చెడి యధికదాత
కష్టమంచనక తా శిష్టరక్షణమందు జాగరూకతనుండు సత్ప్రభుండు
నానాధ్వరంబులం బూనికమైఁ జేసి కడుఖ్యాతినందిన కర్మఠుండు
అఖిలభూతహితుఁడు నగుచు దుర్భిక్షంబు వ్యాధి చోరబాధ యాత్మరాజ్య
మందు లేకయుండ నరసి యింద్రద్యుమ్నుఁ డేలె నేల మును మునీంద్రులార !

సీ॥ ఆది నగ్నిష్టోమ మాచరించె నతండు సల్పె షోడశికాఖ్య సప్తతంతు
వుక్థాఖ్యయాగంబు నొనరించిమించెఁదా. చేసె సౌత్రామణి భాసురముగ.
వాజపేయంబులు వరుసగాఁ గావించె. రాజసూయంబులు రమణఁజలిపె.
అశ్వమేధంబులు నాచరితంబులు. పౌండరీకములు నిర్వర్తితములు.
ప్రతిశరత్తుగూడఁ గృతము చాతుర్మాస్య. తారలకును వర్షధారలకును
నదులలోని యిసుకనలుసులకుం బోలె సంఖ్యయున్నె యతని సవనములకు ?

వ॥ దానంబులం గావించె. అంద విశేషించి తీర్థంబులం జలిపియున్నవాఁడు. షణ్మమరులకు సదక్షిణంబుగా మృష్టాన్నంబులు వెట్టించె. ధనార్థులగు బ్రాహ్మణుల ద్వారంబున బ్రాహ్మణుల కర్బుదసంఖ్యల కన్యాదానంబు లొనరించె. అతఁడు కట్టించిన దేవాలయములేని గ్రామంబుగాని పట్టణంబుగాని తీర్థంబుగాని కనుపట్టదు. ౪౦౬

తే॥ "రేపు హరివాసరం బదిపాపహరము బాలవృద్ధులుదప్ప నప్పట్లనెవరు
భోజనముచేయఁగూడ దవ్యాజ నుపవసింపకుండిన వారికి శిక్ష నిజము॥" ౪౦౭

వ॥ అని దశమీతిథి నిశీథి నేనుంగుపై డంకా గట్టించి నగరమం దంతటను సాటింపఁ జేసెడివాఁడు. రాజర్షి యగు నయ్యింద్రద్యుమ్నుఁ డంతఁ గొంతవడికి హరిప్రసాదంబున సభౌతికశరీరంబుగా బ్రహ్మలోకంబునకుం జని వేయి కల్పంబులుండుటయు నప్పు డంబుజాసనుండు స్వయంబుగా నతనిఁ జేరం బిలిచి "యిఁక నిందుండం జనదు భూలోకంబున కరుగు"మన నతండు. ౪౦౮

కం॥ దొమ్మరగుడిసెలఁ దూఱుచు
క్రిమ్మఱి నీపూజసేయు కపటాత్ముల నీ
సమ్ముఖమునకుం జేరిచి
చిమ్మవె కోల జానపాటి శ్రీసోమేశా ! ౬౪

కం॥ పండితకవులం బట్టుచు
కొండీవివాదంబులాడు మూర్ఖులకును ప
ట్టంబిసయి యుంచువారలనె
చెంపక తాఁకి జానపాటి శ్రీసోమేశా ! ౬౫

కం॥ నీపాలబడా పడ యాలయ
గోపురము లక్కట్టఁ జేసి కొన కిటు సీను సం
స్థాపింపఁ గలిగితివి గా
కేపరివృత ! జానపాటి శ్రీసోమేశా ! ౬౬

కం॥ పనులన్నియు స్వయముగనే
ఒనరిచి మావార లెంతయో యుత్సాహం
బును గనఁబఱచిరికద నే
ర్చినకొలఁదిని జానపాటి శ్రీసోమేశా ! ౬౭

కం॥ నీ మీఁది భక్తికంటెను
గ్రామస్థులమీఁది మత్సరమె యధికముగా
స్తోమమయి వెలుఁగఁబడి రి
స్సీ మావా జ్ఞానపాటి శ్రీసోమేశా ! ౬౮

కం॥ ఇమ్మన్నది యిచ్చితిఁ మఱి
పొమ్మన్నను వలయుకడకుఁ బోయితిఁ గానీ
కిమ్మని యెఱుఁగం గార్చను
చెమ్మట నే జానపాటి శ్రీసోమేశా ! ౬౯

కం॥ ఇక్కార్యంబున కంతటికి
కొక్కండె యస్మదీయుఁ డురుతరబీజం.

దిగులునుతే దవ్వానికి
త్రిగుణాత్మక! జానపాటి శ్రీసోమేశా! ౮౩

కం॥ ఈకున్నవాఁడు తానటు
లేకపనో మనక మరల నితసరిభంగిన్
నీకుం బూజించిసఁ బ్రజ
చీకొట్టెదె జానపాటి శ్రీసోమేశా! ౮౪

కం॥ ఈకుండుఁగాక వాఁడు. త్వ
దాకృతి కేలోటుగలిగె. అస్మద్దృష్టుం
డే కూర్చె నన్నియును. అవి
చేకొనవుగా జానపాటి శ్రీసోమేశా! ౮౫

కం॥ పూజారిం బోషించెను.
పూజలు చేయించె. ఉన్నభూమి సమస్తం
బోజ ఫలవతిగఁ జేసెను.
జేజేయనె జానపాటి శ్రీసోమేశా! ౮౬

కం॥ పదియేనబ్దంబుల కె
య్యదో మాన్య మొసంగుమాత్రి నాలోభికిఁ ద్వ
త్పదమందు నిష్ఠకుదిరెనె
చెదరక కహో! జానపాటి శ్రీసోమేశా! ౮౭

కం॥ కుదురునో కుమరదో వానిని
తుదముట్టించితివి. దానితోఁ బనిలే ప
య్యధముని సుతు ప్రాగల్భ్యము
చెదరఁగవలె జానపాటి శ్రీసోమేశా! ౮౮

కం॥ తా ధర్మకర్తయఁట నీ.
కా ధార్ష్ట్యము చెప్పఁజాల. అణఁచవలయు నా
క్రోధను ప్రాగల్భ్యము గా
రి ధవ! ఓ జానపాటి శ్రీసోమేశా! ౮౯

కం॥ మునుముగ పాపమ్ము కొనసాగెనొ
దినదినము చే ల్పెక్కి నీవు దినసాక్షివి కా
న్పిన దలంచినయొ యహేతుకొ యిదా
చినదా లంకాధి ! జానపాటి శ్రీసోమేశా ! ౯౦

కం॥ మునుమున్న పాపములనిసు
అనఘుల పెరపాపములను హరియించి నినుఁగా
ఘనుఁజేయుం గలఁడెకో యా
చెనటి యిఁకగా జానపాటి శ్రీసోమేశా ! ౯౧

కం॥ గాలికిఁజను పేలాల్ వన
మాలికి నర్పించుభంగి మఱిమొక్కునిగా
నేలను నీ కిప్పింప సు
శీలుఁడగునె జానపాటి శ్రీసోమేశా ! ౯౨

కం॥ ఇప్పించుఁగాక. ఎవరో
అప్పుని కొప్పుకొని బలిమి నది యిచ్చునుగా.
కప్పుడమి నీదియయ్యె నె ?
చెప్పుము వాస్తవము నీవ శ్రీసోమేశా ! ౯౩

కం॥ అనుభూయమాన మది నీ
కని కల్లలు పలుకుఁగాక యా దుష్టాత్ముం
డనుకూలింతువె నీవా
చినపనికిఁగా జానపాటి శ్రీసోమేశా ! ౯౪

కం॥ గావా చేసెడినఁట యూ
శావహుఁ డ్డానికొఱకు. కల్ల నిజంబుగా
కావింపఁగలుగునఁట. నీ
సేవకుఁడఁట జానపాటి శ్రీసోమేశా ! ౯౫

కం॥ దురహంకృతిపూరితుఁడై
ఉఱుకు లిటు ల్వెట్టుఁగాక. ఉఱికి యుఱికిమం
దఱఁబడఁడుకద తదంధుఁడు
సిరినొప్పెడి జానపాటి శ్రీసోమేశా ! ౯౬

కం॥ సత్యమె జయింపఁగలుగు స
సత్యంబు జయింపగనెడి శాస్త్రవచనముల్
సత్యేతరమగునొకొ సం
సృత్యంతక జానపాటి శ్రీసోమేశా! ౯౭

కం॥ సత్యంబు నీవ. ఇయ్యది
శ్రుత్యుక్తము. నమ్మినాఁడఁజూ యది. అధిక
స్తోత్యంబేమిటి కిఁక స
త్స్మృత్యాశ్రయ! జానపాటి శ్రీసోమేశా! ౯౮

కం॥ నీవెవఁడవు ? నేనెవఁడను
తావకమే యెల్లజగము. తథ్యంబిది. మా
యావృతి నెఱుఁగంజాలఁ డి
సీ వీఁడో జానపాటి శ్రీసోమేశా! ౯౯

కం॥ సాంతమెయిఁ బుట్టువుంచును
సాంతంబుంజేయుభంగి నఖిలము నీవం
చింత యెఱింగియె యిట్లు వ
చింతుంజూ జానపాటి శ్రీసోమేశా! ౧౦౦

కం॥ నేఁజేయు మానసికమగు
జేజే లత్యాదరమునఁ జేకొని మగుడన్
జేజేయని దీవింపుము
జేజేదణీ! జానపాటి శ్రీసోమేశా! ౧౦౧

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తోభయభాషా
పాండిత్యరసవత్కవిత్వనిధాన హారితసగోత్రోద్భవ లక్ష్మీ
నారాయణ పేరమాంబికా గర్భశుక్తి ముక్తాయమాన
సత్సభావిష్కృతావధానవిధాన రచితస్వర్ణకార
వ్యవహారనాగరఖండాద్యనేకగ్రంథవితాన జాన
పాటి పట్టాభిరామాభిధాన ప్రణీతంబగు
సోమేశ్వరశతకము.

కం॥ "ఇంద్రద్యుమ్నుండను నృపచంద్రుని గనుగొంటె? లేక శ్రవణపథము నేఁ
సాంద్రముగఁ జొచ్చినాఁడె? మునీంద్ర! చిరాయువని నినుట్లఁ బృచ్ఛించితి నిన్"

వ॥ అనియడుగుటయు మార్కండేయుండు. ౪౨౭

ఆ॥ "కల్పసప్తకమునఁ గనఁ బడఁ డింద్రద్యుమ్నుఁ, డినసుగూడ వినను వీని పేరు.
ఇంక నేమియనుచు నేను వక్కాణింతునయ్య పాప మేలయడుగుచుంటొ"

వ॥ అనినవిని యతండు నిరాశుండై వైరాగ్యమవలంబించి మరణింప నిశ్చయించుకొని కట్టియలం బోగుచేసి నిప్పువెట్టి యందుఁ బడఁబోవుటయు మార్కండేయుండు. ౪౨౮

కం॥ "చావకుమీ. నీతోడం గావించెదఁ జెలిమి. ఇంక గతరోగుఁడవై
జీవించెద. విటు లేటికిఁ జావం బ్రియమింతొ చెప్పుము. చని ప్రీతిసేతున్" ౪౨౯

వ॥ అని యూఱడించుటయు నింద్రద్యుమ్నుండు. ౪౩౦

కం॥ "అల కాంపిల్యాహ్వయపూర్ణోలయుఁడ చిరజీవియనుచు నిన్ జెప్పఁగ నీ
లలి నింద్రద్యుమ్నస్థితి తెలిసెదవని యిటకు వచ్చితిని మునినాథా!" ౪౩౧

కం॥ నాకీర్తి లేశమేనియు లోకంబున లేకయుండ లోఁ గుందుచు నే
నీకను జీవింపఁగవలె? ఈకారణమునను జేసి యే మరణింతున్. ౪౩౨

వ॥ అని తన నిశ్చయంబు దెలుపుటయు నమ్మునీంద్రుండు కరుణావిష్టచేతస్కుండై యియ్యది వృథాశ్రమంబని తలంచి ౪౩౩

## —→ నాళీజంఘచరిత్ర ←—

కం॥ "అటులగుచో దహియింపకు మిటు దేహము. తెలిసికొనెద నే నాన్నృపు. నా
క్కటు నాళీజంఘుండను పటుబక మున్నయది పెద్దప్రాయముగలదై." ౪౩౪

కం॥ నాకుం బ్రాణస్నేహితుఁ డాకొంగలరెడయఁ. డాతఁ డాతని నెఱుఁగుం
గా. కిపుడ యేగుదముపద యాకొండలరాయునొద్ద నతఁడు వసించున్. ౪౩౫

తే॥ "సాధుసందర్శనంబును సల్పనెడల నుండునే దేని లాభంబు ఖండితముగ.
నిష్ఫలం బెన్నటికిఁ గాదు. నిక్కమిద్ది. ఆత్మహననంబు మానుకొ మ్మరుగుదెమ్ము"

వ॥ అనిచెప్పి యమ్మహర్షి యింద్రద్యుమ్నుం దోడ్కొని యాకాశమార్గంబున హిమవంతంబున కరుగుటయు బకంబు ప్రహృష్టాంతరంగంబుతో వచ్చెడి మార్కండేయుం గనుంగొని యెదురేగి స్వాగతంబిచ్చి పూజించి. ౪౩౬

ఆ॥ "బ్రహ్మవిద్వరిష్ఠ! బహుపుణ్యుఁడను నేను గరుణ నీవువచ్చు కారణమున.
హితుఁడవైన నీకు నేమియాతిథ్యంబు చేయవలెనొ చెప్పుము. సిద్ధముంటి" ౪౩౭

వ॥ అనిపలుకుటయు మార్కండేయుం డిట్లనియె. ౪౩౮

శైత్యము వెట్టినట్లు పిత ప్రాణిని బెట్టితి. వచ్చి ప్రీతిరీతిన్
పద్మ్యభిధాన మొప్ప నొకపార్థివునింట భవాంతరంబునన్. ౨౫౧

కం॥ ఘృతకంబళదానమహాత్మ్యం బతిశయమై యట్టి రాజసానత్వమహీ
ప్సితుం జేసె నన్ను. పార్థివ స్మృతియుం గలుగంగఁ జేసె. నీయందునికన్.

కం॥ అనర్తదేశమంతకు ఘనవాజ్ఞుండనై బకాఖ్యం బొలుపారు పటుల్
చేసి చమత్కారపురస్థానమున శివప్రతిష్ఠ సలిపినవాఁడన్. ౨౫౩

ఆ॥ అంత రాజ్యమెల్ల నాత్మజాపగము గావించి ప్రతినిధులను బెట్టి యాపటు
ప్రతిని బూర్వమున్న శివలింగములనెల్ల మించినాఁడ రాజ్యమున సంగంబ. ౨౫౪

కం॥ నని మకరరాశిలోపలఁ బ్రవేశమున జేయుచున్నాఁడు సదిశలింపన్
దవిలి ఘృతంబున నింపని శివలింగమె కానఁబడదు క్షితి నెచ్చోటన్. ౨౫౫

తే॥ తచ్చమత్కారపురమున స్థాపితమయి యున్న శివలింగమును వేయియేండ్లు వలనా
కరము పూజించుచుం బెద్దకాలముండ నీశ్వరుఁడు దర్శనంబిచ్చి యిట్టులనియె.

చం॥ "గణపతికిరానియన్ని ఘృతకంబళదానము లాచరించి రా
జన్మణి! పరితృప్తుఁ జేసితివి నన్ను. శుభంబగుఁగాక నీకు. ఇం
కనువును సంశయింపకెద నర్థము నభీష్టవరంబు. తప్పకీ
క్షణమ యొసంగువాఁడ. ఘన కార్యము నేనియుఁ దీర్చువాఁడ" నాన్ ౨౫౭

ఉ॥ "నాయెడలం బ్రసన్నుఁడయినాఁడవయేని భవద్గణంబుగా
చేయుము. తదన్య మించుకయుఁ జిత్తమునన్ రుచియింప" దంచు నే
నాయన విన్నవించితిని. శంకరుఁ డంతట రమ్మటంచుఁ ద
త్కాయముతోనె నన్నుఁ గృపఁ గొనిపోయెను వెండికొండకున్." ౨౫౮

ఉ॥ పోవుచు "పూర్వ సత్క్రియను బొందిననాఁటి నిశాముఖంబునన్
కావలెనంచు నాకు ఘృతకంబళదానము చేయు నన్యుఁడున్
తావడి నా గణం" బని ముదంబున నాకొసఁగెన్ గణాధిపత్యం
గా నిధియించె నన్ను. బహుకాలము తప్పదమంద యుండితిన్. ౨౫౯

కం॥ ఒకనాఁ డటనటఁ దిరుగుచుఁ బ్రకటంబగు మంచుకొండ సైకత గోమ్న
చ్ఛికముగఁ జని గాలవుఁడను నొకముని తపమున్నవాని యుపిదను గంటిన్. ౨౬౦

సీ॥ చంపకోత్కృంటికిం జేరెడు చేరెడే కనులుగల్గినది యా కలికిమిన్న.
శ్రీపండఁ దగినన్ని తీపతీసైన సులక్షణాల్గలది యా బుక్షనఖర.
ఘనాస్తకమునం దగుపద్రి కాంబుగా రక్తిమ గలది యా రాజవదన.
త్రిస్థానములయందుఁ బిసిపోఁటైన గాంభీర్యంబుగలది యా ప్రసూనితంబ.
గూఢగుల్ఫ. కృశోదరి. కోమలాంగి. అట్టిసౌందర్యవతిఁ జూచి యప్డు లఁబ్ర
మోహమునఁబడి యెట్టి లీమోహనాంగి యగ్గమగునంచుఁ జింతించి యాత్మలోన.

కం॥ "శిష్యుఁడనుగఁ బ్రవేశించి యనూహ్యుఁడని నమ్మకంబు [illegible]
వేశ్యాకృత్యంబును జేయుచు బుష్యంగనను [illegible] " ౪౧౧
కం॥ అని నిశ్చయించుకొని యమ్మునిఁ దగ్గఱి నేను "దపము [illegible]
దనఘా! దీక్షనొసంగవె జనియించెను నాకు [illegible] సంసారమునన్. ౪౧౩
సీ॥ తెచ్చి పెట్టెదనీకుఁ బచ్చని దర్భలం [illegible]
తెంపి పెట్టెదనీకుఁ దెల్లని పుష్పము [illegible]
కొట్టి పెట్టెదనీకుఁ గుసుమైన సమిధల [illegible]
రాల్చి పెట్టెదనీకు రసవత్ఫలంబుల దేవతాళికి నివేదించుటకును
నింపి పెట్టెదఁ బాత్రిలనిండ నీర"మని ధరామరవటుఁడనై యతివినయము
తోఁపఁబల్కుటయును నమ్మి యాపమతిఁడు నాకు దీక్షయిడెన్ యథాశాస్త్రవిధము. వ॥
కం॥ అనయము శంభార్చనమును బొనరుచు కుటిలచిత్తమున నుండియు న
మ్మునినిం దత్సహధర్మిణిఁ దనిపితి దినదినముఁ జేసి తగ శుశ్రూషన్. ౪౧౫
కం॥ ఒకనాఁ డా సుతపస్విని ప్రకటార్తవయగుచుఁ బోయి పర్ణకుటీరా
నకు దూరమందుఁ బడుకొని యకలంకమనంబుతోడ నటు నిద్రించెన్. ౪౧౬
తే॥ నమ్మి సుఖనిద్రఁజెందు నా యెమ్మెలాడి నెత్తికొనిపోవుచుండుదు సత్తిగోలె
నున్న నావేని సంస్పృష్టి నొందలు తెలిసి దొంగశిష్యుఁడనని యెడఁదం గ్రహించి
ఉ॥ ఏడుచుచున్ "దురాత్ముఁడయి యీ మనశిష్యుఁడు నన్ను బల్మిమై
యీడిచి పైనివేసికొని యేగుచునుండినవాఁడు నాథ! నీ
వేడ వసించితో? దవుల కేగకమున్నె యిటేగుదెంచి యీ
గాడిదబారినుండి ననుఁ గాచుకొనం బ్రియతింపుమీ వెసన్" ౪౧౮
ఆ॥ అని వచించుటయును నానవలామగం "డుండు ముండుమోరి ముండకొడుక!
అనుచుఁ బెద్దమాఱు లదలించి మద్గతిస్తంభనంబుఁ జేయఁజాలె నపుడు. ౪౧౯
కం॥ చిత్తరువున వ్రాయంబడు నెత్తరినా నిల్వఁబడితి. ఇంచుకయును గా
త్రత్తం జాలని తాదృక్స్వత్వావిరహితుని డాసి సంయమి యంతన్ ౪౨౦
ఆ॥ "కొంగజపముఁజేసి కొనకు మదంగన దొంగిలించితీవు దుష్ట! కాన
అంగలార్చుకొనుచుఁ గొంగపై పడియుండు"మని శపించె. ఏమియడుగ నింక?
కం॥ పదపడి నాపై నేఁ జూచెదఁగద కొంగనయియుంటి సీయన. అయినన్
కుదురుకొనియుండెఁ బ్రాక్స్మృతి. అది యెప్పటిదైనయీశ్వరానుగ్రహమో.
కం॥ ననుఁదాఁకినందులకుఁగా ముని తతి యెంతయును జిత్తమునఁ గొంతవడిన్
పనవి సచేలస్నానము పొనరిచి ననుఁ జూర్చి కోపమున నిట్లనియెన్. ౪౨౩

కం॥ "నుద్రికి నిజాంచితుఁడై నను బ్రోచి కాంచఁ గూడుననుట పాపీ! శిష్యుం
డిట్లు మామునీశ్వరునకుఁ జెప్పెను జేసి. తివి కొంగ చేష్టలు గాఁగన్ ౪౭౪

శా॥ నా నాథుండ వనిన్ బలి కొంగనయి యుండన్ నేను వేఁకొంటి" నం
చానాఁడు సఖిరంబుగ శపించుటయు నత్యంతంబు దుఃఖించుచున్
నే నాగాలపు రెండు పాదములకైనన్ వ్రాలి యిట్లంటి. "నో
మౌనీ! పాలకనాయకప్రియుఁడన్. మన్నింపవే నన్నఁకన్. ౪౭౫

కం॥ గణకోటికి నాథుఁడ. నొక దణిసనికై యిటకు వచ్చి తావక నొరాపి
నమ్రణించి కాముపశితను గణియింపక యిట్టికృతికిఁ గడఁగితిని విభూ! ౪౭౬

కం॥ అవినీతునకుం బ్రాప్తం బవుఁగాక యద్బుషకళత నైశ్వర్యము. ల
య్యవి నిల్వకొనఁదు నావలె నవలేపభరంబునాని యంత్యముదనుకన్. ౪౭౭

సీ॥ మధురస్వరంబకా మంచిదౌ రూపంబు కాకతుల్యములైన కోకిలలకు.
పతిహిత పాతివ్రత్యనుక చారురూపంబు భరతఖండస్థలో భామినులకు.
ఆఁకమువిద్య శ్రేయే యగుఁగా సురూపంబు పుడమిఁ గురూపులౌ పూరుషులకు
హెచ్చిన క్షమయకా యచ్చటా రూపంబు ధన్యులై వర్తిల్లు తాపసులకు.
కాన వేనఁడగుచుఁ గాళ్లపైఁ బడినాఁడ. ఇంక నన్ననుగ్రహింపు" మనుచు
మౌని తానుగూడ మాహాత్మ్యయండౌటఁ జుట్టముగఁ దలంచి యిట్టులనియె. ౪౭౮

ఆ॥ "సత్యవంతుఁడగు మహిమన్నైఁ జమత్కారపురిని గలఁడొకండు భూసురుండు.
భర్తృయజ్ఞుఁడనుచుఁ బ్రజపల్కు నాతనిం. ద్వద్భకత్వ మతఁడు తలఁగఁజేయు"

చం॥ అనియిటు శాపమోచనము నమ్మని నాకు వచించెఁ గాని యిం
కను బకదేహముఁ విడుచు కాలము దగ్గఱి రాకయుండుటన్
కనుకని యుట్లుయుంటి. ఘృతకంబళదానము లేనసంఖ్యగన్
బొనరచియుంటు నిప్విధము పూర్ణతరాయువునై చెలంగితిన్" ౪౮౦

వ॥ అని యిట్లాత్మీయ చరిత్రంబు నాళీజంఘుండు వక్కాణించుటయు నింద్ర
ద్యుమ్నుండు వెండియు నిట్లనియె.

కం॥ "ఇంద్రద్యుమ్న కథామృతముం దావ్రుట కొఱకె నేను మునిచే నిటుప
క్షింద్రా! కొనితేఁబడితి. నీకం బ్రియమ్మటు పేల పుడమిఁ గడతేఱ కెటో. ౪౮౧

తే॥ ప్రతినవట్టియుంటి విత్తగ నింద్రద్యుమ్ను చరిత మెఱుఁగకున్నఁ జత్తుననుచు
కాన నాజ్ఞయిమ్ము కలసి మార్కండేయు. భ్రష్టయశుఁడ. నగ్నిఁబడఁగలాఁడ.

కం॥ ఇంద్రద్యుమ్ను నెఱుంగక యుందేని యొకరేని యనుచు నొట్టిడుకొని ధా
త్రిం బ్రియమ్మటు చీఁకబ్రతికిన నందుప్రసదా యనృతవాదియని నను లోకుల్"

వ॥ అని పలుకుచున్న మార్కండేయునకు నాళీజంఘుఁ డిట్లనియె.

శా॥ "నీకంటెం జిరజీవి నింకొకని నేనిం జెప్పఁ. మీతండు సు
శ్లోకుం డౌటం దదరకైన యరిగి తెచ్చెద్గాతుమ్మఁ బ్రశ్నింతుము. నే
నే కా యీతనిఁ దోడఁ దెచ్చితిని! ఎట్టింక నీ సహాయుండ నీ
వీఁక నీ సన్నిధినుండ నొక్కరుఁడ యప్పుత్త్రంబునం జొచ్చెదన్ ౪౮౮

ఆ॥ ఇంక నొకవిశేష. మే నిన్నుఁ బ్రశ్నింతు. మందునన్ని మాఁకి మస్తకమునందు
అతిని నుద్ధరింప కాశక్తి నుంటిన నేను జనుటయెట్లొ చెప్పుము సఖుఁడ! నీవె" ౪౮౯

వ॥ అని వాక్రుచ్చుటయు నయ్యింద్రద్యుమ్నుండు నిశ్చయంబుం దెలిసికొని వీఁడ కెట్లొ మేలుకొలుపఁ జేయుదునా యని తడవు విచారించి దారువులం జేయుచుకొని పావకంబునఁ బ్రవేశకాములగు మునిజనపతులం దిలకించి మార్కండేయు నుద్దేశించి నాళీజంఘుం డిట్లనియె. ౪౯౦

## —♦ గృధ్రగూబ వృత్తాంతము ♦—

ఆ॥ "బ్రదుకఁగలఁచితేని ప్రాజ్ఞ! నేఁజెప్పినపగిది నడవు. మేల తెగువఁజేతు?
సన్నిధానమునకువచ్చె నరిగ నింద్రద్యుమ్ను నెఱిఁగియున్నవాఁడు హృదయమునకు.

కం॥ నావలె జ్యేష్ఠుఁడు. మిత్రు. ములూకము. చిరజీవి. మఱియు లోకారాధ్యుం
డా కైలాసమున న్మనె. సాకల్యముగం బఠించె శాస్త్రములెల్లన్ ౪౯౧

తే॥ చావ సంసిద్ధమైయుండి సర్వమట్లు కరము బుసకొట్టుకొనుచును గనులువాయ
నేర్పు నీతని గైకొని యేఁగుదెమ్ము. చనుద మచ్చటికిపుడ యో మునివరేణ్య!"

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు మార్కండేయుండు సబకంబుగా నింద్రద్యుమ్నుం దోడ్కొని కైలాసాచలంబునకుం జనియె. ప్రాకారవర్త్మాస్వాయంబగు నా గృధ్రగూబ సంగాతియగు కొంగ కెదురేగి స్వాగతంబిచ్చి విశ్రాంతుండైన యతని బలుమఱుం గౌఁగిలించుకొని యింద్రద్యుమ్ననకును మార్కండేయునకును స్వాగతంబు చెప్పి నాళీజంఘు నుద్దేశించి ౪౯౨

తే॥ "మిత్త్రమా! నీవువచ్చిన మేటికార్యమెద్ది? నీతోడ నాయొద్ద కేఁగుదెంచి
యున్న వీరెవ్వ? రత్యంత ముత్తములుగఁ గానఁబడుచున్నవార లాకారములను"

వ॥ అని ప్రశ్నించుటయు నాళీజంఘుండిట్లనియె. ౪౯౩

తే॥ "ఇతఁడు మార్కండుఁడను పేర నెసఁగువాఁడు. భువనములమూటఁ బ్రఖ్యాతిఁ
[బొందినాఁడు.
అమ్మహాదేవు కరుణచే నష్టసిద్ధులితని కరగతములు. చెప్ప నేమికలదు? ౪౯౪

ఆ॥ ఈ వ్రతీయుఁ డతని కెంతయు సఖుఁడంట. ఎఱుఁగ నానుపూర్వ మేనుగూడ.
వచ్చినాఁడు నామవసతి కింద్రద్యుమ్నుఁ బ్రస్తుకాముఁడగుచు నిష్ఠతోడ. ౪౯౫

కం॥ నేనును వాని నెఱుంగను. దానన్ వైరాగ్యమూని ధృతనుండై
చానున్నవాఁ డితం. డటు కానం దోడ్తెచ్చి నీకుఁ గనఁబఱచితిఁజూ. ౯౭

ఆ॥ ఈ వెఱంగియున్న యెడల నిందద్యుమ్నుఁ జెప్పఁ మితఁడు స్మృతిని బొందకుండ.
ఎంతయును జిరాయు వీవు. నే నెఱుఁగుదు. ఇటకు నేను రాను హేతు వదియ."

వ॥ అనియిట్లు నొడువుటయుఁ బ్రాకారవర్ణుండు ౯౯

కం॥ "ఇరువదియొనిమిదికల్పాల్ జరిగెను నే లోకమందు జనియించుపయిన్
మఱి యిందద్యుమ్నుండను నరపతిఁ గని విని యెఱుంగ నాశీఁ డఘా!" ౨౦౦

వ॥ అనవుడు నిందద్యుమ్నుండు ౨౦౧

ఆ॥ "నీకు నింద్యమగు నులూకత్వమేటికి దాపరించె నింత దారుణముగ?
ఎట్లు కలిగె మఱియు నింత దీర్ఘాయువు? నే వచింపు వినఁగ వేడుకయ్యె" ౨౦౨

వ॥ అని యడిగిన బ్రాకారవర్ణుం డిట్లనియె. ౨౦౩

కం॥ "వినుము వచించెద. బిల్వార్చనమున సంతృప్తుఁడగుచు శంకరుఁడే నా
కొనఁగూర్చెఁ జిరాయువు. భృగుమునిశాపముచే నులూకముగ నటించెదన్.

తే॥ మును చమత్కారపట్టణమునను నేను గోచిబాపఁడ. నఱి మహాకోపదఁడను.
ఇంద్రియంబుల నెల్ల జయించి యభవుఁ గొలుచుచును ఘంటుఁడను పేరు ' లిగియుంటి

ఆ॥ వేఱుగాకయుండు బిల్వంపుఁ దిరిదళముల్ పూటకొక్కలక్ష పోగుచేసి
తప్పకుండ నేను ముప్పొద్దులును భక్తి శివుని యర్చనంబుఁ జేయఁ జేయ ౨౦౬

కం॥ వేయబ్దంబుల కాతఁడు నాయెడలఁ బ్రసన్నుఁడగుచు నవ్యశ్రీకుం
డై యిచ్చి దర్శనంబును స్వాయజ్జలధరగభీరభావలతోడన్ ౨౦౭

తే॥ 'ఏను ద్వత్కృతమైనట్టి యీ యఖండబిల్వదళపూజనమునకుఁ బ్రీతుఁడైతి.
వత్స! సువ్రత! కోరుము వరము నీవు. తడయ నిప్పుడ యిచ్చెదఁ దప్పకుండ.

కం॥ మూఁడుదళంబులుగల మారేడుచిగురునాకుఁ జేయు ప్రీతి సుగంధా
లోడితసుమనఃకోటియు బాడబసుత! చేయఁగలదె పరికింపంగన్' ౨౦౯

మ॥ అని వాక్రుచ్చుచుఁ జేరెలుంగున జోహారర్పించి నేనంత 'నో
యనఘా! తుష్టిని జెంది నాకు వరమీయన్ వచ్చితేనిన్ నన్
గని వార్ధక్యము మృత్యువుం దొలఁగి వేగం బోఁ గటాక్షింపవే'
అని ప్రార్థించితి సంయమీంద్ర! 'అగుఁ బో మ్మట్లం' చతం డాపటన్ ౨౧౦

కం॥ కైలాసమునకుఁ బయనంబై లఱిఁ దక్షిణను చనియె. అంతట నేనున్
నాలోఁ గృతకృత్యతకుం జాలఁ బ్రమోదంబునొంది చరియింపంగన్ ౨౧౧

కం॥ ఆ సమయంబున నే సద్భూసురవర్యుండు వేదములు సంగములున్
గాసిక నోరిచి చదివియు వ్యాఖ్యంగను చేయుచుండు భార్గవముని తాన్॥ ౨౧౨

# అభినవసరస్వతి.

సంపుటము ౩౧ | శ్రీప్రమాధి సంవత్సరము వైశాఖమాసము. | సంచిక ౨

## ఆదిశంకరప్రశంస

(గాదేపల్లి వీరరాఘవశాస్త్రిగారు - గద్వాల సంస్థానపండితులు)

శా. కుంఠీభూతసనాతనం బగుచు దిక్కూలంకషోద్యన్మహా
శంఠేకాలగళప్రయుక్తవిషవేగప్రోక్షకోలాహలో
త్కంఠం బెల్లెడ నాక్రమించె నని సాంకర్యంబు వారించి యా
శుంఠారాద్భట మడంచుపూజ్యులు ముముక్షుధ్యేయు లీశంకరుల్.

ఉ. కొండలు కోట్లుగాఁ బెరిఁగి కుత్సితవారము మేరమీఱి వై
తండికు లాఢ్యులై ప్రభువతంసులు తద్వశవర్తులైన నే
ముండియొ శంకరార్యులయి మూఢపదంబు సడల్చి నవ్విదుర్
దండకమండలంబులె కదా విలయించె వితండకోటులన్ ! 2

తే. ఆత్మదృఢశక్తి యనెడుకరాసిఁ దాల్చి
నిగమభాష్యార్థచింత వన్నియ ఘటించి
అఖిలనాస్తికమతముల నంటఁ గోసె
తాను శంకరుఁ డింతకౌపీనధారి. 3

సీ. ప్రబలమదద్విపప్రత్యగ్రశ్రుతిపుట
చాలనానిలములే చామరములు
రోదసీకుహరనిరోధోర్ధ్వగమనవి
స్తీర్ణవిఖ్యాతియే తెల్లగొడుగు
వివిధకళాంగనావిష్కృతసత్కృత
ధీరవిహారమే దివ్యగోష్ఠి
రాజాధిరాజమూర్ధన్యవిన్యస్తవి
స్తారోపదలె నవ్యాసనికములు

గీ. జైనబౌద్ధాదిదుర్మతాజ్ఞానవాద
భేదనామోదబుధవచోనాదసరణి
జయజయధ్వనిగా జగజ్జైత్రయాత్ర
గడలుకొల్పితి వార శంకరయతీంద్ర ! 4

కం. జయజయ విద్యామండల !
జయజయ మండనమహీశశాసనధిషణా !
జయజయ శిష్యోద్ధారణ !
జయజయ సకలార్థభాష్యజగదాధారా ! 5

సీ. జయజయ వేదార్థసారసంప్రతిపన్న !
తత్త్వవిత్సర్వస్వతంత్రతంత్ర !
జయజయ దుర్మతాశ్రయచండపండిత
వాదనిర్మూలనాపారధిషణ !
జయజయ నిజభాష్యశాసనాద్వైతమ
తస్థిరీకరణవిద్యాప్రవీణ !
జయజయ ఘనకీర్తిచంద్రికాధవళిత
ద్యోవియన్మండలచక్రవాళ !
జయజయ జనుర్జరారోగజననమరణ
భయహరణచణచరణాబ్జపాంసుపటల !
జయజయ పరంపరాసమాశ్రయనిజాంశ
కల్పనానల్పశిల్ప ! శంకరయతీంద్ర ! 6

సీ. కేరళ మే దేవుఁ గోరి భజించెనో
భవదీయజననసౌభాగ్య మెనయ ?
శివగురువర్యు లేమి వరంబు లొందిరో
కడుపార మిమ్ములఁ గాంచి మురియ ?
గోవిందయోగు లేగురుపూజ చేసిరో
మిము శిష్యు లనుచుఁ బ్రేమించి పెనుచ ?
అద్వైత మెంత పుణ్యమ్ము గడించెనో
త్వత్పరమార్థమై ధన్యత గన ?

గీ. పరమతంబుల పేతపఃఫలము కలిమి
కేవలము మీవిరోధాప్తిఁ గీర్తి గనెనా ?
కనకగిరిధైర్య ! కింకరకమలసూర్య !
షణ్మతస్థాపనాచార్య ! శంకరార్య ! 7

మ. తెలియంగ జాలనిమూర్ఖచిత్తు లెపుడున్ ధీశూన్యులై యాతపో
బలముం గానక యేమిలాభ మని. రాపాదాబ్జరేణ్వగ్రకో
ణలవాస్వాదనభాగ్య మే వికృతనానారూపసృష్టిస్థితి
ప్రళయాదర్శక మిట్లొసంగుట తపఃప్రాగల్భ్యమే కా గురూ !

సీ. కనకధారావర్షమును ముంచి తేల్పఁగా
మాధవాచార్యులమహిమ లేదు.
స్థిరపరిచర్యకై దేహ మర్పింపఁగా
స్థాణు వేమి యెఱుంగ లేనిజడము
మాన కెప్పుడుఁ గొల్వ మనము నర్పింతునా ?
కపిశతోపాధ్యాయి కట్టువడదు.
శిష్యప్రశిష్యసుస్నేహ మాసింతునా ?
గౌరవపాత్రులకరుణ యరిది

గీ. అన్నివిధముల నాయాత్మ మనుట లేదు.
నన్నుఁ దఱిఁజేర్ప నీ వేమి తెన్నుఁ గనెదో (కనకగిరిధైర్య. 9

సీ. వలయమై యుండినవాసుకివాక్కులో
దేవరపల్కులో తెలియఁబడదు
జడలలో నిమిడినజాహ్నవీప్లవనమో
మీవచోమృత మది యేమియు నెఱుఁగను
ఫాలచంద్రికళాప్రపాతస్రవంతులో
త్వద్భాష్యపంక్తులో పలుకరాదు
షణ్ముఖస్థాపనాచార్యవృత్తంబులో
షణ్మతస్థాపనాచరణవిధియొ

గీ. అనుచుఁ గింకరు లనఁగ వాదానువాద
దీక్ష నద్వైతమతము స్థాపించి తౌర ! (కనకగిరిధైర్య ! 10

కం. శిష్యానుగ్రహమతి వా
ల్లిష్యత్వము దాల్చి మీరు దివిజోపనిష
ద్వ్యాఖ్యామృతరస మొసఁగఁగ
బుష్యగ్రేసరున కైన రీతి యొదవునే ? 11

సీ. మండనమిశ్రవాగ్ఖండనంబునఁ జెండి
ముండిగాఁ గావించుచుండునాఁడు
ఉభయభారతి నట్లు లోడించి రావించి
చేరి ముంగిటఁ బ్రతిష్ఠించునాఁడు
దుర్దమప్రతివాదితూలకీలిక వయి
ప్రియతమాద్వైతంబు పెంచునాఁడు
విద్వన్నృపసభావేది ముమ్మరశత
గోష్ఠులలోఁ జేరుకొనిననాఁడు

గీ. తమ్ము వీక్షింపలేని యీదాసతతికిఁ
బేమఁ దమపీఠములను గల్పించినావు (కనకగిరిధైర్య ! 12

సీ. బౌద్ధవాదంబు లేపగిది మాయంబాయె, భట్టపాదుండేమిబాటఁబట్టె
మండనమిశ్రుఁడేమార్గంబులో దూరె, శైవుల కేక్షేత్రమవశరణమయ్యె
వంచనగాని శక్తి వారు లెంజేగిరి, యల్లగాణాపత్యు లరిగి రెట్లు
చార్వాకకోటులసంగతు లేమాయె, సౌరులవాక్కు లేచక్కి దూరె

గీ. సాంఖ్యకాపాలికాదులజాడ లేమి
స్థిరతరాద్వైత మీవు సాధించువేళ (కనకగిరిధైర్య ! 13

సీ. లే వరదంబులు. లేవు గుఱ్ఱంబులు, లేవు ఖడ్గంబులు లేవు కరులు.
లేవు ధనుస్సులు. లే వస్త్రశస్త్రాడులు, లేవు శరంబులు లేరు భటులు
లేవు విత్తంబులు లేరు మంత్రిజ్ఞులు, లేవు సంగ్రామముల్ లేదు భీతి
లే వస్త్రధారలు లే వస్త్రపాతముల్, లేవు గాయంబులు. లేవు కట్లు.

గీ. ఇంతకౌపీనమునఁ గాంచి తెట్లు జయము ?
క్లిష్టదుష్టత కెట్టి చికిత్సకుఁడవో ? (కనకగిరిధైర్య. 14

సీ. పరవాతసునిశితబాణవర్షములకు
కనుగంద వేవజ్రకవచరక్ష.

దుర్మతసామ్రాజ్యగర్వభేదమునకు
మడిమ ద్రిప్ప వదెంతమంత్రబలమొ
చండాలపతితనైసర్గికంబుల మార్ప
జంక వదెంతటిసాహసంబొ
నిర్వికల్పసమాధినిఖిలజగద్వ్యాప్తి
నొకటిఁ జేసితి వేమియోగశక్తిమొ
జ్ఞానచక్షుర్నిరీక్షణాజ్ఞానకార్య
విలసనస్థితి నిజశిష్యనికరములకు
ఆత్మఁ జూపుదు వెట్టిసిద్ధాంజనంబొ
గోచరింపదు శ్రీజగద్గురువరేణ్య! 15

మ. జగదాచార్యులటంచు మద్గురులకున్ జంకేమి? ఈనేఁటికిన్
నిగమవ్యాఖ్య లెవం డొనర్చెనని ప్రశ్నింపన్ జవా బేమి? శ్రీ
భగవత్పాదులు మీరు మీచరణసేవాధన్యుఁడౌ మాధవుం
డగుఁగా కన్యుఁ డెవండు నే ననెదు లోకాచార్య! విద్వద్గురూ!

కం. భజగోవింద మటంచును
భజియించి పరేశునామబహుచింతనతో
నిజగురు గోవిందార్యుని
భజనము వెలయించి తెంతభక్తి గురువిభూ! 17

---

## స్త్రీధర్మవిచారము

(వర్ణాశ్రమధర్మసంస్థాపనము)

క్రిములుఁ గీటకములు ... పక్షులుఁ బశువులు మృగములు వాని యాహారముల కవియే స్వయముగ విహరించుచుఁ గామతృప్తికి మాత్రము ... సంయోగసుఖము ననుభవించు. సంతానోదయానంతరము తల్లికిఁ బుత్రప్రేమ పొడముచున్నది. వీని యందుఁ బితృప్రేమ యేమాత్రము లేదు. భర్తృప్రేమమాత్రము కామతృప్తిపర్యంతమే యుండును. పుత్రప్రేమ సంతానమునకు స్తన్యమొసంగుపర్యంతమే యగుచున్నది. వైరిజంతువులవలని భయమునకై జాతియెల్లను సంఘీభావము వహించుచున్నది. ... వీనియందలి స్వేచ్ఛాచారముచే లోకోపద్రవ మెట్టిదియు లేదు. దుర్బలము లగునవి మనుష్యసంచార భూములందును వాని ప్రాంతములందును నివసించుచుండును. బలముగలవి ఘోరకాంతారములందు సంచరించుచుండును. ... మనుష్యసంచారదేశములను మృగా

దులు పేర్మింపుట లేదు. మనుష్యులచే మచ్చిక చేయఁబడని మాత్రమే మనుష్య సంచారభూములందు వర్తింపుచుండును. ఈలాటి మానవేతర జీవజాలములో నొక జాతి స్త్రీ మఱియొకజాతి పురుషులను గోరుట లేదు. ఆహారనిమిత్తమై హింసింపుకొను నవియైనను గామతృప్తియందు జాతిసంకరము వీనియందుఁ గనఁబడలేదు. మానవులందు మన కగపడు తక్కువజాతివారగు యానాదులు నెఱుకలు మాలలు మాదిగలు మొదలగు వారు సహితము వారివారి జీవనమును వారువారు స్వయముగ సంపాదించుకొనియును గామతృప్తికై భార్యాభర్తృన్యాయమును వహించియున్నారు. ఈజాతులందు స్త్రీకి స్వాతంత్ర్యము కలదు. తనయిష్టము వచ్చినవారితో సంబంధపడుచుండును. ఒక యానాది పలువురితోఁ గలసి సంతానమును గనుట కలదు. అట్టి సంతానమునకుఁ బితృభక్తిగాని మాతృభక్తిగాని లేదు కాని సంఘప్రేమమాత్రము పశువులకు వలెనే కలదు. పుత్రప్రేమ గాని భార్యాభర్తృప్రేమగాని నిత్యమైనదికాదు. వీరిచే సాధింపఁబడు దైవపితృ కార్యము లెవ్వియు లేవుకాని పరోపకారబుద్ధి కొంచెమియుండును. తమకు లభించిన వస్తుపరిదానముచేఁ గాని దేహపరిశ్రమచేఁ గాని పరోపకారము చేసెదరు. పరోపకారమును జేయువారే యగుదురు. ... పెనిమిటి యుండఁగాఁ గాని పోయిన పిదపఁగాని పరపురుషుని బొందుటచే వారు దోషముగా భావింపుటలేదు. వీరియందు వ్యభిచారదోషము కానరాదు. ఈ ధర్మము సర్వజనాంగీకారమగునా కాదా? యని విచారించెదమేని సర్వజనాంగీకారము కాదని తలంపవలయును. వ్యభిచారదోషము తోఁచని వారికిని బశ్వాదులకును భేదము లేదనవలయును. కొంతఱకు వ్యభిచారము దోషమన వలయు? కొందఱికిది దోషమేల తోఁచకుండవలయు? పశుత్వబుద్ధియే దోషమును గ్రహింపక పోవుటకుఁ గారణమనక తీఱులేదు. ... కామతృప్తియే ప్రధానమై యెప్పు వీరికి సౌందర్యవతియగు యువతి సతిగ లభించినచోఁ బొందవలెనని నేరరు. సౌందర్యవతుల సమాగమము మొద్దునైనను జరింపఁజేయఁబోవు. వారాంగనలు పశుప్రాయులైన బుద్ధిశూన్యులకుఁ గామోద్రేకము కలిగింపఁ జాలిరి. అప్పుడు వీరికిఁ బరాంగనాసక్త దోషమని తోఁచక పోయినను దోషమని దలంచువారిచే వీరికి బాధయేర్పడును. ... ఈ దుర్మార్గుల సంఘము బలిష్ఠమైనచోఁ దమను శిక్షించిన వారిని మరల హింసింతురు. ...మాలమాదిగలు యానాది స్త్రీలను గోరుట వారికి హీనమైనను యానాదులు సహించరు. స్త్రీపురుషసమాగమమున వీరికిఁ గామోద్రేకము తుంపకపోదు. దమయంతి యడవిలో నొంటరిగా నుండునపు డెఱుకవాఁడు కామించక పోయెనా? ఆమెకుఁ బాతివ్రత్యమహిమమే లేనిచో వాని ధర్షణమునకుఁ బాత్రమై చెడిపోవలసినదేకదా? ఆపత్కాలమే రావణునికి బ్రహ్మశాపమే లేకపోయినచో సీతను ధర్షణముచేయక పోఁడుగదా? స్త్రీపురుషుల స్వేచ్ఛా సమాగమము వచింపరాని దోషమని కాకేమని చెప్పవలెను.

సమానజాతియందైనను నిరంతర పురుషాంతరసంబంధముచే స్త్రీత్వము చెడి భోగాకరమగును. ... పురుషుల కంగీకరింపఁబడిన వివాహప్రాముఖ్యము స్త్రీల కెన్నడును గనఁబడలేదు. పురుషులకు వివాహవిధానమున స్త్రీప్రాముఖ్య మంగీకరింపఁబడుటకుఁ గారణము సంతానోత్పత్తిద్వారమున ధర్మార్థ సృష్టికై కాని కేవలము కామతృప్తికిఁ గాదు.

శ్లో॥ న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.

(కామములను భోగించుటచేతనే తృప్తి యేర్పడదు. హవిస్సుచే నగ్ని ప్రజ్వరించినట్లుగా కామము భోగముచే మరియొక్కంత వర్ధిల్లును) అనెడి ప్రకారము కామమును వైరాగ్యముచే నియమించవలయునుగాని వేఱుగాదు. సంతానార్థమై గృహస్థ ధర్మము విధింపఁబడియున్నది. ... సంతానోదయమునకుఁ బూర్వమే భర్తృవియోగ మేర్పడినపుడు దేవరసుతోత్పత్తి పూర్వు లంగీకరించిరి. స్త్రీపురుషులు కామభోగ ములగుటచే నవి నిషిద్ధమాయె. రంభాద్యప్సరసలకు జరామరణములు లేవు. వారు కేవలము భోగాంగనలేకాని ధర్మాంగనలు కారు. ... ధర్మసాహాయ్యమునకు ననుకూల్యముతో కొప్పువారికి ధర్మముతో నగునదేమి? అందువలన వారికి గృహస్థధర్మము లగు ధర్మార్థ కామములు విధింపఁబడి యుండవాయె. జరామరణ భయగ్రస్తులగు మానవులకు ధర్మార్థ కామములు విధింపఁబడియున్నవి. ఇది పరిభావింపఁదగును. ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః (ప్రజాసూత్రమును విచ్ఛిన్నము చేయకుము) అని శ్రుతి చెప్పుచున్నది. భగవంతుఁడొనరించు సృష్టి కార్యము మానవులవలని ప్రజాతంత్వవిచ్ఛిన్నత్వమే. కాన దీనిని మానవు లతిక్రమింపవలసినగాని భగవచ్ఛాసనము మనవలయు ఉల్లంఘించుటకు స్త్రీత్వమే ముఖ్యకారణమై యున్నది. స్త్రీ లేకపోయినచో సంతానోత్పాదనమే లేదు. పురుషులు కేవలము బ్రహ్మచర్యముతోనే యూర్ధ్వరేతస్కులై ముక్తిగాంచిన నాపురుషులతోనే సృష్ట్యుపరమ మేర్పడెడిని. కేవల కామభోగములతోనే స్త్రీపురుషులు దేహయాత్ర చాలించి ముక్తిగాంచెదరు. అదియే శ్రుతిహిత మైనచో స్వయముగా దేవలోకమునకు సహితము పోఁజాలిన దశరథుఁడుగాని తపోనిష్ఠాగరిష్ఠుఁడైన పాండుమహారాజుగాని సంతానమునకై రామాయణ భారతములలో వినినట్లు విశేషశ్రమ నేకొనుటకుఁ గారణము తెలియదు. బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడైన జరత్కారుఁడు జరత్కారిని వివాహమాడవలసి లేదు. మోక్షేచ్ఛతో నొప్పిన ఋష్యశృంగుఁడు భగవద్దర్శనానంతరము సహితము మరలఁ గమలవిమల మొదలైన శాంతిని వివాహమాడఁ బనిలేదు. కపిలాచార్యుల తండ్రి కర్దమప్రజాపతి దేవహూతిని వివాహమాడఁ బనిలేదు. సృష్టిసూత్రమునకు లోఁబడియె వైరాగ్యసంపన్నులు సహితము వివాహమాడియుండిరి. ఇందునిమిత్తమై స్త్రీజన్మమునకు వివాహము విధియై యున్నది. స్త్రీలకు వివాహమే విధిగానిచో వైరాగ్య సంపన్నులై వివాహము లేకయే యుండవచ్చు పురుషులు. ఈ విషయములో సులభ, గార్గి మొదలగువారిని జెప్పవీలులేదు. వీరి చరిత్ర లెచ్చట విశేషించి వినఁబడలేదు. వీరు వివాహము కాకయే యోగినులైరో లేక వివాహమైన తరువాత యోగినులైరో ప్రమాణము చిక్కలేదు. ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః అనెడి శ్రుతిబలముచే వీరు వివాహమునకుఁ బదముందే యోగినులై యుండవలయునని తలంచవలయును. "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" అనెడి ప్రమాణము స్త్రీల సంరక్షణార్థమై పురుషులకు విధింపఁబడియుండవలయునుగాని వేఱుగాదు. స్త్రీపురుషుల కిరువురికి వివాహమునిష్ఠానుసారమైనచోఁ ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః, అని శాసించవీలులేదు. స్త్రీపురుషులకు ధర్మార్థకామ నియమము మీ ప్రజా

తంతు సూత్రముమీఁదనే యాధారపడియున్నది. స్త్రీలకు సంతానోత్పత్తి విధమై నప్పుడే స్వాతంత్ర్యము సహితము నిషేధింపఁబడియున్నది. సంతానోత్పత్తికై పురుషాపేక్ష యును స్త్రీలకు విధమైయున్నది. పురుషులకు వివాహము లేకుండిన నుండవచ్చునుగాని స్త్రీకి వివాహ మవశ్యంభావియై యున్నది.

స్త్రీలకు వివాహ మవశ్యంభావి యని వైదిక మతావలంబుల నిశ్చయమైనను క్రైస్తవమతము నీవిధిని నంగీకరించుటలేదు. పాశ్చాత్యదేశమందు వివాహము చేసి కొనునిచ్ఛలేనివారు, నిచ్ఛయున్నను గానివారు లెక్కకు మించియే యున్నారు కాని బ్రాహ్మణులందువలె నిట్టి విపర్యాసములేదు. అయితే సంతానములేని విధవలు మాత్రము గలరు. పాశ్చాత్యదేశమందు వివాహాపేక్షయుండియు వివాహముకాదు పురుషులు లేక కామపీడితులై పరితపించువారికన్నను వివాహనియమముచే నొసంగఁబడిన నిగ్రహ శక్తికిఁ బాత్రులైనవారే యుత్తము లనవలయు. కామపీడన ముభయులకు సమానమేయైనను శాస్త్రనిబంధముచే గామశమనోపాయ వైధవ్యవిధులచే భగవద్ధ్యానమునకుఁ బాత్రమైన బ్రహ్మచర్యనిష్ఠతో నొప్పి పోయిన పురుషునికి సహితము తమతపోబలముచే నుత్తమ లోకప్రాప్తిని సాధించువా రగుటకు వీలున్నది. వివాహముకాక కామపీడితలగువారు శాస్త్రనిర్బంధములేని కారణమున భోగాంగనావృత్తి గైకొనువా రగుదురు. వారికి వివాహము కాకపోవుటకుఁ గారణములు పెక్కులుండి యుండెడిని. అంగవైకల్యమే ప్రధానమై యొప్పు. దీర్ఘ జాడ్యముతే యొప్పు. మన బ్రాహ్మణ్యమున నట్టివాంకిని వివాహమై సంతానము పొందినవారును గలరు. మనలో నిట్టి వివాహ నిర్బంధమే లేనిచో వికలాంగులు వివాహపాత్రులుగాక మృగములవలెఁ గృశించెడివా రగుదురు. సమస్త స్త్రీలకు వివాహము విధ్యుక్తము కాకముందే విధింపఁబడినందునఁ బూర్వకర్మఫలకర్మ విపాకవిశేషముచే బాల్యవైధవ్యము లుండినను సర్వులకు వివాహమేర్పడి సుఖించుచున్నారు. అట్లు వివాహ నియమము లేనిచో రజోదర్శనానంతరము వికలాంగులైన వారిని గోరెడివా రుండరు. వారును గామపీడితలై కృశించెడివారే. ... ఈలాటి కష్టములు వివాహనిర్బంధముగల బ్రాహ్మణులకు లేదు. బుద్ధిపూర్వకముగఁ గులభ్రష్టులైన వారు తప్పఁ గడమవారి కందఱికిఁ గులగౌరవము లేకపోలేదు. అజ్ఞానవశముచేఁ గాము లంపటలైన విధవలు సహితము సంఘభయము చేతను సజ్జన సహవాసముచేతను దమ దోషమును శమింపఁజేసికొని కడతేరుచున్నారు.

స్త్రీలకు పాశ్చాత్యులవలె స్వాతంత్ర్యముండినను సౌభాగ్యము గలవారు వివాహశుభములకుఁ బాత్రమై కడమవారు వర్ణభ్రష్టులుగాక మానరని తెలియవలయు. వర్ణభ్రష్టులైనవారిచేఁ బ్రపంచ సంకటములు వృద్ధియగుచున్నవి. పరదేశపురుషులను బొంది వారిచేఁ బడసిన సంతానముచే దేశభంగకరమైన విరోధములు ప్రబలుచుండును. వివాహనిర్బంధము లేని భారతీయులు మహమ్మదీయసంబంధముతో సర్వ సంకటములను బెంచి శమింపఁజేయ వీలుగాని వైషమ్యములకుఁ గారణమునై యొప్పిన దేశచరిత్రము తెలుపుచున్నది.

పండితుల గుణములబ్బత ? తమ జాతిబ్రాహ్మణుఁడగు రామకృష్ణుఁడు చెప్పిన పద్యము నందుకంటె శూద్రుఁడగు రామరాజభూషణుఁడు చెప్పిన పద్యమునందు గుణాతిశయము కన్పట్టఁగనే దానిని వారెల్లరును ... అంగీకరించిరి. ... పెద్దనార్యుఁడు ముక్కుతిమ్మనార్యుఁడు ధూర్జటి మున్నగు బ్రాహ్మణకవులు మనోహరములగు కావ్యముల నొనరించిరి. కవిత్వమహత్త్వాదులఁ జల్లని మాలికోత్పలమాలికలలో వ్యక్తము చేసిరి. సహృదయహృదయాహ్లాదము గలిగించిరి. విద్వత్ప్రభుండగు కృష్ణరాయని మెప్పించిరి. సర్వగుణప్రధానులై విరాజిల్లిరి. ఇదియేకదా బ్రాహ్మణధర్మము ! పిరికిపందలై చేతఁగాక సాత్వికత్వము చూపిరందురా ? అట్లుకాదు.

సమయము వచ్చిన నెంతటివారినైన వారును దిట్టిరి. దేశక్షేమార్థమై యట్లు చేయుచు వచ్చిరి. కనుఁడు. ... కృష్ణదేవరాయలు సూర్యప్రభాభాసమానుండై వెలుఁగుచున్న కాలమున నొదిగియుండి యాతని నిర్యాణానంతరమున గజపతి కర్ణాటరాజ్యము పైకి దండెత్తిరాఁగా నారాజున కీక్రిందిపద్యమును బెద్దనార్యుఁడు పంపెను.

సీ. రాయరావుతుగండ రాచయేనుఁగు వచ్చి
ఆరట్లకోట గోరాడునాఁడొ
పంపెటనరపాల సార్వభౌముఁడు వచ్చి
సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడొ
నెలగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచు
తల్పుల గడులు డీకొల్పునాఁడు
ఘనతరనిర్ఝర గండపెండెర మిచ్చి
కూఁతు రాయల కొసఁగూర్చునాఁడు
ఒడ లెఱుంగవా? చచ్చితో? ఉర్వి లేవా?
చేరఁజాలక తలచెడి జీర్ణమైతొ?
కన్నడం బెట్లుసొచ్చెదు గజపతీంద్ర!
తెఱచినిలు కుక్కసొచ్చిన తెఱఁగు దోఁప?

కన్నడమును రక్షించు సమర్థుఁడు లేనికాలమున ఘోరశత్రువు యుద్ధమునకై దండెత్తివచ్చియున్నసమయమున నాశత్రురాజు నీకవి వైరీతిగాఁ దిట్టినాఁడు. ఈతఁడెంత ధైర్యస్థైర్యములు గలవాఁడో యెంతవీరుఁడో యెంత దేశాభిమానియో చదువరులే తెలిసికొందురుగాక. ఈపద్యమును జూచుకొని గజపతి సిగ్గుపడి దండయాత్ర వదలుకొని స్వపురికిఁ బోయెనట ... వృథాగాఁ దమ్ము రాజాస్థానమునుండి వెడలఁగొట్టింపఁ ... పనెంచి వాకిటికావలితిమ్మని వాకిటి కవికోటి మాధవా! కిటికిఁ గోపే యనిపలికి నప్పుడు పెద్దనార్యుఁడు ఛట్టున కీక్రిందిసమాధాన మిచ్చె.

కం. ప్రాకృతసంస్కృతఘుర్ఘురమూకీకృతకుకవితుంగముస్తా తతికిన్
వాకిటికావలితిమ్మని వాకిటికవికోటి మాధవా! కిటికోటే.

ఇదియంతయు నిటీవలివా రెవరో కల్పించిరి. బూడిదలో శ్రీభూయనా నక్షరములను వ్రాసి గట్టిగఁ జదివిన బూడిదలోని శ్రీ యెగిరిపోయినంతన సభ్యులగు పెద్దనాదు లది యొకదోషముగా నంగీకరించు టెట్లు? పెద్దనార్యుని కావ్యమునందలి మొదటి పద్యములో నాడినున్న శ్రీవక్షోయను నక్షరములను బూదిలో వ్రాసి చదివిన క్షకారోచ్చారణముచే శ్రీవ లెగిరిపోవా? ఆ యాక్షేప మిప్పుడు రాదా? కాన నీ యాక్షేపణము రాయల సభలో జరిగినదికాదు. రాయలు దానికి సమ్మతించి కృతినందుట మాననులేదు.. కవుల కాలాదులు సరిగఁ దెలిసికొనఁజాలనివారు రామరాజభూషణుని కృష్ణరాయల సభలోని కవియని తలంచిరి. అతని యాస్థానకవికావునఁ దా రచించు వసుచరిత్రము నాతనికే కృతియిచ్చియుండవలెనని భావించిరి. కాని నిజముచే నాతని కాకృతి యీయఁబడియుండలేదు. ... ఇది లోకసామాన్యము కల్పించినదే కాని పండితులు కల్పించినది కాదు. వాస్తవముచే రామరాజభూషణుఁడు రాయల యాస్థాన కవియే కాఁడు... రాయలు క్రీ. శ. పదునాఱవ శతాబ్దాదియం దున్నవాఁడు రామరాజభూషణుఁడు పదునాఱవశతాబ్దమధ్యమున నున్నవాఁడు. రామకృష్ణకవి పదునాఱవ శతాబ్దాంతమునను బదునేడవ శతాబ్దాదియందును నున్నవాఁడు. కావున నీకథ యెంతమాత్రమును నమ్మఁదగినది కాదు. పట్టి కట్టుకథ. దీనిని బ్రాహ్మణులెవ్వరును నిదివఱకు నమ్మియుండలేదు... వసుచరిత్రమునందుఁగల నానానూనవితానవాసన లను పద్యము ముక్కుతిమ్మనార్యుఁడు రచించెనను ప్రతీతి యొకటి కలదు. ఆ పద్యము ముక్కునుగూర్చిన పద్యము లన్నిటిలోఁ జాల మనోహరముగా నుండుటను నందితిమ్మన్నకు ముక్కుతిమ్మన్నయను నామాంతర ముండుటను నీముక్కుపద్యముం బట్టియే యాతనికి ముక్కుతిమ్మన్నయని పేరువచ్చినదని ...కల్పించిరి. ఇది బ్రాహ్మణకల్పితమే యనుటకు నేయాధారమును లేదు...సాహిత్య రసపోషణుండగు రామరాజభూషణునెడల బ్రాహ్మణుల కగౌరవము కలదుగాన శూద్రుల కన్యాయము చేసిరని...ఫలితార్థములు తీయఁ బ్రయత్నించుట "అబద్ధంవా సుబద్ధంవా కుంతీపుత్రో వినాయక" అనిన ట్లసంగతమైయుండునని సవినయముగ విన్నవించుకొనుచున్నాఁడను. లోకములో నెప్పుడేగాని వసుచరిత్రాదుల పాకము రుచింపక వానిని గొంచెముగానో గొప్పగానో క్రిందుపఱుచువా రుండవచ్చును. అది కవిత్వరుచిభేదముచేఁ గలిగినదికాని బ్రాహ్మణత్వములఁబట్టి వచ్చినదికాదు. ...మనుచరిత్రాదుల కవిత్వము మేలైనదని యెవ్వఁడైన నుడువుట గాని వసుచరిత్రమునందలి కవిత్వము శబ్దాడంబరమును శ్లేషలును గలిగి యంత మనోహరముగా లేదనుటగాని కలిగిన దాని కంతకును లోకోభిన్నరుచియని...తలంపనగును...కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచార...మున నిట్లువ్రాసిరి "రామరాజభూషణు...చందమున... వర్ణనములుచేయువా రెవరును లేరు. ఈ వర్ణనములందు దోషములు లేకపోలేదు...అవి కథావేగమునకు నడ్డులు. కథయే లేదు, కథావేగ మెక్కడిదని యాక్షేపించితిరేని నావు సమ్మతమే... లోపము లుండినప్పటికిని వసుచరిత్రము మిగుల గొప్పగ్రంథమనియు భాషకు మండనాయమానమనియుఁ జెప్ప నెవఁడును సంకోచింపఁ బనిలేదు..."

దీనింబట్టిచూడ వసుచరిత్రమున నపహసించువారిలో రెడ్డిగా రగ్రగణ్యులుగా నెన్నఁదగినవారై యున్నారు. వీరి యూహలతో నస్మదాదుల మేకీభవింపఁజాలము.

బ్రాహ్మణేతర పండితు లెట్లు వ్రాయుచున్నారో తెలుపుటకై దీని నుదాహరించితిని ఇంక నబ్రాహ్మణసూరిపుంగవులగు తేవప్పెరుమాళ్లయ్యగారు మనుచరిత్రపీఠికలో రామరాజభూషణుని కవిత్వముం గూర్చి వ్రాసినది కనుఁడు.

"పెద్దన్నగారి కోన- ఇది కవికల్పితము...కవి యీ కోనయందొక లోయను గల్పించి యందు గంగానిర్ఝరముం బ్రవహింపఁజేసినాఁడు. ఆ లోయ చూడ్కికి వేడ్కగా నుండుటకై రెండుప్రక్కలను పైనుండి యడుగువఱకు నెఱుపుగావించినాఁడు.... ఇట్టిది యెట్టివారికిని రామణీయకంపు సొంపులు నింపదే? దీనిం జూచియే వసుచరిత్రయందు...ఒక కోన...రచించినాఁడు. ఇందు శిల్పాడంబర మెక్కుడు కాని పెద్దనకోనవలె నంత స్వభావరమణీయము కాదు"

ఈరీతిగా సుప్రసిద్ధులగు బ్రాహ్మణేతరపండితులు రామరాజభూషణుని కవిత్వమును నిరసించియున్నారు. బ్రాహ్మణపండితు లెన్నఁడును ... నిరసించియుండలేదు. హృదయాహ్లాద ముప్పొంగఁ బరిపరివిధములఁ గొనియాడియున్నారు. కాన నాంధ్రలోకము రామరాజభూషణునకు బ్రాహ్మణులవలన నుపకారమే జరిగినది కాని యపకారము జరుగలేదని గ్రహింపుకొనవలెను ... తెనాలిరామకృష్ణుఁ డీయననుగూర్చి

క. చీపరపాపరతీగల
చేఁపలబుట్టల్లినట్లు చెప్పెడు నీయీ
కాఁపుకవిత్వపు మాటలు
బాపనకవివరుని చెవికిఁ బ్రమదం బిడునే?

అని యుల్లసమాడినట్లు పరంపరాగతముగాఁ జెప్పఁబడుచున్నది ... రామకృష్ణకవియు రామరాజభూషణుఁడును నొక్కకాలమువారు కారనియుఁ గృష్ణరాయల సభలో నున్నవారు కారనియు నిదివఱకే వ్రాసితిని. కాన రామకృష్ణకవి పైపద్యము చెప్పి రామరాజభూషణు నప్పుడు నిందించెననుట యసత్యము నసంగతమునై యున్నది. ఈపద్యము రామరాజభూషణునిగూర్చి రామకృష్ణుఁడు చెప్పినట్లు పరంపరాగతములగు లోకప్రతీతుల నాధారముగాఁ జేకొని వ్రాయఁబడియున్న కవిజీవితంబుల నుదాహరింపఁబడియుండలేదు. వీరేశలింగముగారి కవులచరిత్ర మందుఁ గలదుకాని యందైనను నీసందర్భమునఁ జెప్పఁబడిన దైనట్లు వ్రాయఁబడియుండలేదు ... ఈపద్యమాతని దనుటకు వీరేశలింగముగారును సందేహించిరి ... వెఱ్ఱిమొఱ్ఱిపద్యముల కన్నిటికిఁ గర్త రామకృష్ణుఁ డైనట్లు లోకసామాన్య మెంచుచుండును. వానిని సత్యమన్నను రామకృష్ణుఁ డొక్క శూద్రకవియగు రామరాజభూషణుని మాత్రమే పరిహాసించినట్లు వాడుక లేదు. బ్రాహ్మణాబ్రాహ్మణభేదము లేక కవుల నందఱిని పరుసపెట్టి యధిక్షేపించినట్లుగాఁ గట్టుకథలు తెలుపుచున్నవి.

ఇట్టివి వర్ణద్వేషము ననుసరించి వచ్చిన వనరాదు. చీపరపాపరయను పద్యమును బ్రాహ్మణుఁడే వ్రాసియుండెనన నవసరములేదు.... బ్రాహ్మణులు రామరాజభూషణునకును నాతని కావ్యములకును మంచి వ్యాప్తిని గలిగింప... పాటుపడిరనియు

బ్రాహ్మణుల మూలముననే భూషణుఁడు గొప్పవాఁడయ్యెననియు...స్పష్టమగుచున్నది. పూర్వమునందు బ్రాహ్మణాబ్రాహ్మణద్వేషములు లేవు. పెద్దనార్యాదులును దోషులు కారు.రామరాజభూషణాదులునుదోషులుకారు. పుక్కిటిపురాణములు నమ్మఁదగినవికావు. పూర్వమందు బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు నెంతయో మైత్రి కలిగియుండెడివారు. కులమిత్రతకూడ వారియందు వెలసియుండెడిది.తాతముత్తాతలనాఁటినుండియు వంశపరంపరగా వచ్చు మైత్రికిఁ గులమైత్రియని పేరు. బ్రాహ్మణులు ... దోషరహితులని చెప్పఁజాలను. సర్వవర్ణములవారియందును యోగ్యులు నుండవచ్చును; అయోగ్యులు నుండవచ్చును. బ్రాహ్మణులందును గొంద అసూయాగ్రస్తు ... లుండవచ్చును. ... వారి దోషముల బ్రాహ్మణేతరు లెత్తిచూపిన ... కృతజ్ఞులుగా నుండఁదగినదే. తప్పులు దిద్దుకొనవలసినదే. అందుకు సందియములేదు ... ద్వేషమును బెంపుసేయక మైత్రి నెలకొల్పుటయే సంఘమునకు శ్రేయస్కరమనియు లేకున్న సంఘమంతయుఁ జెడునుగాని యొక్క బ్రాహ్మణులే చెడరనియు బ్రాహ్మణేతరసోదరుల కిందుమూలముగాఁ దెలుపుచున్నాఁడను. నా వాక్యములు కొందఱుబ్రాహ్మణేతరులకుఁ బ్రియముగ నుండకపోవచ్చును. అయినను ... హితము చెప్పుట యస్మదాదులపని కావున నట్టుచేసితిని.

బ్రాహ్మణులు భట్టుమూర్తిని స్తుతించుచునే యున్నారు. అతని నరసభూపాలీయము ప్రమాణముగాఁ దీసికొనుచున్నారు. టీకలు వ్రాసినవారుకూడ వెల్లాల సదాశివశాస్త్రిగారు మున్నగు బ్రాహ్మణులే ... గుణమున్నచోట బ్రాహ్మణుల స్తుతి యుండకతప్పదు. ... చేమకూర వెంకటరాజకవి

చం. క్షితిపయి వప్రిసూత్రికులు చిగిర్చు వసంతుఁడు తా రసోపగుం
భిత పదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు వెన్నునం బ్రస
న్నతమును సౌకుమార్యముఁ గనంబడ రాల్గరగంగఁ జేసె. ఏ
గతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా!

అని తనకుఁగల ప్రతిఘటనము శ్లేషించి తెలిపియున్నాఁడు ... బ్రాహ్మణ పండితులు పన్నిన తంత్రముల ముచ్చటించునది కాదు ... కవులను గూర్చినధ్వని ... కలదు. అది యొకకవికి బ్రాహ్మణపండితులవలనఁ గలిగిన చిక్కును దెల్పునది కాదు. ఒకకవి ... బొత్తిగా రసగ్రహణశక్తిలేనివాఁడుసహిత మానందించునట్లు ... కవనము చేయఁగా స్పర్ధచేత మఱియొకకవి ... గుణవంతమయిన కవనము చెప్పి పూర్వోక్త శ్రోతలకన్న మూర్ఖులగువారినిగూడ మెప్పించెనను ధ్వని దీనివలనఁ దేలుచున్నది. ఈ స్పర్ధ యుచితమైనదికాని యనుచితమైనది కాదు ... వేంకటకవి ... సామాన్యులు గూడ మెచ్చుకొనునటులఁ గావ్యము చెప్పియుండ ... మఱియొకఁడు దానికంటెను రసవంతమైనకావ్యమును జెప్పి లోపల నందఱను మెప్పింపఁజేసెనని తెల్పవలసియుండును. ఇం దితరులవలన నితనికిఁ గలిగిన చిక్కేది?

ఎట్లువ్రాసినను సమకాలమువారు మెచ్చుకొనకుండుట యనునది యొక్క వేంకటకవి విషయముననే...కాదు. లోకమం దంతటను నిట్లే ... ఇది బ్రాహ్మణ బ్రాహ్మణేతర కవుల మధ్యమాత్రమే...కాదు. ఒక బ్రాహ్మణకవి వ్రాసిన గ్రంథమును

దత్కాలమున నున్న మఱియొక బ్రాహ్మణకవి మెచ్చుకొనఁడ...సాధారణముగా సమస్తదేశములందు నిట్లే జరుగు. ఆంగ్లదేశమున వర్డ్సు కీట్సు మున్నగువారి కావ్యములు వారి యనంతరమున మెప్పులోనికి వచ్చినవి. భవభూతి తన కావ్యములోఁ దన గ్రంథమును దనకాలమువారు చూడకున్నను ముందెన్నడైనఁ జూచువారు పుట్టకపోరనియు వారికొఱకై వ్రాయుచున్నాననియు లిఖించియున్నాఁడు. ఈ సామాన్యోక్తిని దీసికొని వచ్చి వేంకటకవిని...బ్రాహ్మణులు బాధించిరని...ఉదాహరించుట మహాసాహసము...లేనిపోనిమాటలు వ్రాసి బ్రాహ్మణులపయి బ్రాహ్మణేతరులకు ద్వేషము పుట్టింప...ప్రయత్నించుట యుచితముగాదు. లోకము సత్యమును గ్రహింపఁజాలనిది గాదు. బ్రాహ్మణేతరకవి వ్రాసిన విజయవిలాసమునకు సారంగధరచరిత్రమునకు బ్రాహ్మణులే వ్యాఖ్యానములు వ్రాసి ప్రచురించి...లక్ష్యములఁ గైకొనిరి. ప్రాచీనకాలమునందే యీతని విజయవిలాసము విద్యార్థులు పఠింపఁదగిన గ్రంథముగా నియమింపఁబడినదికాన బ్రాహ్మణులు దీని వ్యాప్తికిఁ దగుప్రోత్సాహము నిచ్చిరని చెప్పఁదగినదిగాని నిరుత్సాహము కలిగించిరని చెప్పఁదగినది గాదు...

---

## మదరాసు ప్రధానమంత్రి కుతర్కము.

(త్రిలింగ)

అనేక సందర్భములలోఁ బ్రధానమంత్రి గౌ॥ సీ. రాజగోపాలాచారిగారు ప్రజాభిప్రాయమును లక్ష్యపెట్టక నిరంకుశముగ వర్తించుట లోకవిదితము. మదరాసునందలి స్త్రీల సంఘము ప్రారంభవిద్య బిచ్చగాండ్రకు సహాయము గావించుట మున్నగు పనులకు సహాయపడుచున్నది. ఈస్త్రీలసంఘమువారు ప్రధానమంత్రి గౌ॥ సీ. రాజగోపాలాచారిగారిని సభ కాహ్వానించి వీరు సాగించుచున్న కృషి జయప్రదమగుటకు శాసనము గావింపవలెనని కోరినందుకు మంత్రుల నమ్మి లాభములేదని స్త్రీల నిరుత్సాహపఱచిరి. స్త్రీలు సాగించుప్రజాసేవకు ద్రవ్యసహాయముగూడ లభింపదని ప్రధానమంత్రి సూచించిరి. నగరములలో బిచ్చగాండ్రవల్ల నెంతో బాధ జనించియున్నది. వీరిని బోషించుభారము ప్రభుత్వమువారిపైనున్నను బ్రధానమంత్రిగారు స్త్రీల సంఘము సాగించుకృషికి సహాయపడుటకుమాఱుగఁ బనికిమాలిన మాటలఁ జెప్పి వీరిని నిరుత్సాహపఱచిరి. తాను గొప్ప తత్త్వవేత్త యనుసహంభావము వీరి నావహించియున్నది కావున నీసందర్భమునందేకాక యితరవిషయములలోఁగూడ నలుగు రవలంబించుమార్గము నిరసించుచుఁ దాను జెప్పినటులఁ బ్రపంచము సాగవలెనని పనికిమాలిన యుపన్యాసములఁ గావించుచున్నారు. ప్రభుత్వము తన విధ్యుక్తధర్మమును నిర్వహింపనందుచే స్త్రీల సంఘమువారు బిచ్చగాండ్రకు సహాయపడ యత్నించుచున్నారు. ప్రజాప్రభుత్వమును జక్కఁగ సాగించుచున్నానని భావించు శ్రీ రాజగోపాలాచారిగా రిట్టి ధోరణి యవలంబించుటవల్ల నెవరుకాని యేసేవ సాగింప వీలుగానిస్థితి జనించుచున్నది.

---

కం. అనియిట్లు వినుప విని య
జ్జననాయకుఁ డంత హర్ష సహితుం డగుచున్
ఘనమగు నొకకత్తితు వేసును
మునుకొని కావింతు నిపు డమోఘుతరముగన్. 69

వ. అని. 70

కం. చిత్తంబునఁ దలఁచి తపాయత్తుండై రాజవర్యుఁ డల్లుని సుత ని
ప్పత్తనమునకున్ వేదోద్వృత్త(మటంచనుచుఁదలఁచి సచివులతోడన్)

తే. సచివవరులార ! మీరల లీసమయముననె
అధికజవమున నొప్పారు నశ్వములను
పూన్చినట్టి శతాంగంబు మోద మెసఁగ
తేరఁబనుపుఁడు నాఁగ నాధీరు లపుడు. 72

వ. కొందఱు భటులం గని మీర లతిత్వరితగతి నరిగి ధరణీవరు నరదం
బాయత్తంబుఁజేసికొనిరండని నియోగించిన. 73

కం వా రిసుహయములనఁగ నొ
ప్పారెడు వాజులను బూన్చి యధికద్యుతులన్
మీఱు శతాంగముఁ గొని చని
ఆరాజవరేణ్యునెదుట హర్షం బలరన్. 74

వ నిలిపి. 75

కం. నరవర ! మీ కరదము మే
మురవడిఁ దెచ్చితిమటంచు నొయ్యనఁ దెలుపన్
ధరణీధవుండు ముదమున
ఖరకరుఁ డుదయాద్రి నెక్కుకైవడి నెక్కెన్. 76

కం. ఒక్కమొగి మ్రోయ భేరులు
మక్కువ రాజేంద్రుఁ డపు డమాత్యులతో రా
అక్కజముగఁ జ్యవనునియిలు
చక్కటికిం జనియె సంతసం బలరారన్. 77

వ. ఇట్లాచ్యవనమునీంద్రు నాశ్రమాంతంబు దఱియంజొచ్చి మందార
పనస పాటలీ కత్తిముక కపిత్థ ఖర్జూర వకుళాశోక కాంచన కదళి
జంబూ కదంబ కురువక కేతకీ సిందువారాశ్వత్థ బదరీ చూత తాల
తమాల హింతాల నారికేళామ్ర తక్కోల తాపించ జంబీర రసాల

సాల ప్రముఖ తరువారంబుల నతిక్రమించి చని ముందట నానా
లతాకీర్ణంబగు నొక్క విశాలపర్ణశాలం గాంచి యందు. 78

సీ. మురిపెంబునను సెజ్జ వరుఁడు పరుండిన
ఒప్పుగాఁ జరణంబు లొత్తుదాని
ఒత్తి నాథుని సరసోక్తులఁ దేలిచి
అనువొంద రతికిఁ బైకొనెడుదాని
పైకొని హావభావములఁ దత్పతి మీఱి
చక్కెరకెమ్మోవి నొక్కుదాని
నొక్కి తా విభు సురం బెక్కి మక్కువను బా
లిండ్లు సోఁకఁగఁ గౌఁగిలించుదాని
నిరత మధిపతిసేవచే వఱలుదాని
అగణితగుణాళి కాటపట్టయినదాని
భూరిలావణ్యఖనినాఁగఁ బొల్చుదాని
ఒక్కతరుణిని గాంచె రా జక్కజముగ. 79

ఆ. ఇటుల రాజమౌళి యిందీవరాక్షిని
పోలఁ జూచి తనదుపుత్త్రి యనుచు
సలలితముగ మదిని దలపోసి యంత జా
మాత గాఁడు రాకుమారుఁ డెవఁడొ ! 80

వ. అని మఱియును 81

తే. ఎవ్వఁడో వీఁడు నలకూబరేందుగోత్ర
భిత్సుతాంగజమాధవోద్యత్సురూప
విపులలావణ్యగణ్యుఁ ? డివ్వేలఁది నెట్లు
కూడెనో మానికుంజరుఁ గోలుపుచ్చి ? 82

వ. అనియి ట్లత్యంతచింతాభరాక్రాంతమానసుండై యుండుటం జూచి
యమాత్యోత్తము లిట్లనిరి ఓమహాత్మా ! మీర లీపగిదిఁ జేవ
మానవునిం బోలి విచారపడనేల? ఎట్టికార్యంబులైన నరయక పరి
తపించుట కర్జంబుగా దిఁక నిదానించి చూచెదముగాకని యిట్లు
పల్కు మంత్రివరుల వాక్యంబు లాలించి యజ్జననాయకుం డూర
కుండె. అంత. 83

చం. అపుడు పతివ్రతాతిలక మంచితకీర్తిని నాథుఁ జేరి తా
కపురపు వీడ్యమిచ్చి తమి గాఢతరాంగజకేళిఁ దేలుచుఁ

నృపుఁ డట కేగు దేమటను నిండిన వేడుకఁ జూచి యా స్థితిన్
స్వపతి కెఱుంగఁ జెప్పె మఱి సత్వర మామహనీయు నానతిన్ 84

చం. చెదరిన కొప్పుతో సడలి చిందిన మౌక్తికహారరాజితో
కదలెడు కౌనుతోఁ జిటులు గంధముతో విడఁబడ్డ రైకతో
వదలెడు నీవితోఁ గలఁకవాఱి తొలంగెడు పైఁటకొంగుతో
అదరెడు మేనితో నిటుల నాసుదతీమణి వచ్చి మ్రొక్కుచున్. 85

ఆ. లేచి తండ్రిఁ జూచి లీలమై నిట్లను
జనక ! నీకు నాదుజనని కఖిల
బంధుమిత్రులకును భద్రింబె ? కుశలమా
పురమువారి కెల్లఁ బూజ్యచరిత ! 86

కం అని యిటు లాడెడు తన పు
త్రిని జూడఁగ రోసి కిన్క దీపింపఁగ నా
జనపతి కొండొకతడ వే
మనకయ యటు లూరకుండి యనియెను మరలన్. 87

మ. అకటా ! సత్కులమందుఁబుట్టి యిపు డన్యాయంబుగా నీక్రియన్
ప్రకటోదగ్రతపఃప్రభావు ననఘుం (బ్రాచీనబ్రహ్మర్షి) నీ
వకలంకోజ్జ్వలమాననున్ విభుని నాహా ! మాయ వంచించి కా
ముకవై యిందు భుజంగుఁ గూడఁదగునే మోదంబునం గూఁతురా!

కం. కుల మపయశముం బొందఁగ
తలిదండ్రులు తలలు వంప దాయాదులుఁ జు
ట్టలుఁ గని నవ్వఁగ నీ విటు
లళు కింతయు లేక జార వైతివె పుత్రీ ! 89

కం. పుట్టినయింటికి మఱిఁ దా
మెట్టినయింటికిని యశము మేదిని దేకు
న్నట్టి దురాత్మక దా యమ
పట్టణమున ఘోరనరకపంకమునఁ బడున్. 90

సీ. తరళాక్షి ! హృదయేశు దైవంబుమాఱుగా
తలఁపులో నెమ్మి ని నిలుపవలయు.
భీతమృగేక్షణ ! విభుఁడు సెప్పెడుమాట
వేదంపుముక్కంచు వినఁగవలయు.

సతి ! పతి నియమించుగతి నిజవ్రతముగా
శిరసావహించి వే చేయవలయు.
శీతమయూఖాస్య ! చెలువుఁ డిచ్చిన యది
వేవే లటంచు భావింపవలయు.
భామినీమణి ! ప్రాణేశువంకవారి
మోదమున బంధులుగఁ దలపోయవలయు.
కాని పెరవారి నాప్తులుగా గణించ
రాదు సువతికి ధర్మంబుగాదు కాన. 91

వ. మఱియును 92

సీ. కలికికిఁ గొంగుబంగారంబు పతిభక్తి
కాంతకు విభుసేవ కల్పకంబు.
నళినాక్షి కమృతంపు నడబావి పతిభక్తి.
భామకు విభుసేవ నోముఫలము.
వనితకు నొడ్డిఁబెట్టినగిడ్డి పతిభక్తి
ఇంతికి విభుసేవ యిష్టసిద్ధి.
కీరవాణికిని దంగేటిజున్ను పతిభక్తి.
సువతికి విభుసేవ శోభనంబు.
కన్నె కెప్పుడు పతిభక్తి పెన్నిధాన
మట్లుగావునఁ బతిభక్తి నమరయత్న
గరుడగంధర్వకిన్నరకంబుకంతు
(లకును భావ్య మడుగనేల యిఁకను నీకు ?) 93

తే. నాథుఁడే దైవ మనుచు నేనాతి మదిని
దురితపథములు వర్జించి తిరుగుచుండు.
అదియె యిహలోకసౌఖ్యము లంది పిదప
అధిపుతోఁగూడి త్రిదశాలయమునఁ జెలఁగు. 94

వ. కావున 95

తే. అరయ సద్వంశజాత వీ వదియుఁగాక
ప్రకటసద్ధర్మపాలనప్రౌఢి మీఱు
నాదుపుత్రివి. ఇట్లయ్యు నళిననేత్ర !
భూరిదుష్కీర్తి యిలలోనఁ బొంద నగునె ? 96

## —• చేబియ్యముసోదరులగుఱించి చెప్పుమాటలు •—

కనుకఁ జేబియ్యము సోదరులతోడి చెలిమిని నమ్ముకొని కలసి మెలసి వర్తించు కవి శార్దూలమును గళాఘాతముచే నొప్పించుట తప్పిదమని యెప్పటికైనను నీ జ్ఞాతిసోదరు లెఱుంగఁగలరు. ఎప్పుడు సమానధర్ములము కాకపోతిమో యప్పుడే యట్టి సమాన ధర్ముల తోడంబోలె నన్యోన్యగృహక్రియమాణ హవ్యకవ్యాదుల యానాయానము లంతగా నాచరింపఁబడకుండఁ గాఁదా-చిత్కా తదభావమునకుఁగాఁ గవితల్లజము కళవళపడదని జ్ఞాతిసోదరులు గ్రహింతురుగాక. జ్ఞాతులై యుండియుఁ గారణములేకుండ వైరము గల్పించుకొనిన వీరినిగూర్చియే విచారముగాని చిరకాలముక్రిందనే చెదరిపోయిన చేబియ్యము సోదరులతోడి స్నేహముంగూర్చి చింతింపను. తోఁచెడిభావము లేవో తోఁచుచున్నవి. వ్రాసెడి విషయము లేవో వ్రాయుచున్నాఁడను. అట్టినే నన్యుల యాక్షేపములకుఁగాని యార్భాటములకుఁగాని యళుకుఁజెందను గాన నాసంగతి వ్రాయుటకు వీఁడెవఁడన్న శివరామయ్య నాకల మాఁపుటకుఁ దానెవఁడో తథ్యము నరయుఁగాక. ఎప్పటికి నెవరినో యనుసరించి యేగెడి యితని జేమిగాని సోదరనాకకుఁజుక్కానియైన సత్యనారాయణకే స్వసాహసమును సత్యాసత్యములఁ జాటు సత్కవులపైఁ జూపకుండుటకు సలహా చెప్పుచున్నాను. అంగబలముతోను నర్థబలముతోను నరిగియడిగినమాత్ర నవ్వారు లళుకుఁజెందరు. ఆ బలములకుఁ బైనారక్షకశాఖవారి బలము లున్నయవి. ప్రస్తావవశమునఁ బ్రచలించిన పండితలేఖిని బద్ధము వ్రాసినదిగాని యబద్ధము వ్రాయలేదు.

శ్లో॥ ప్రస్తావసదృశం వాక్యం స్వభావసదృశీం క్రియాం।
ఆత్మశక్తిసమం కోపం యో జానాతి స పండితః

సత్యమైనను స్వనిందయనియు సహింపలేననియు ననినచో నధికారు లున్నారు. అభియోగము నడపవచ్చును. అంతియేకాని యమ్మను నాలిని దిట్టుట యవిచారులు నతిభీరువులు నగు నన్యవైదికబ్రాహ్మణుల నగ్గముచేసికొని యాంక్షయనుట మున్నగునవి యనుచితములు నకృత్యములు. రవిపైకి రజస్సు చల్లుటవంటివి. వ్యర్థమగు వీరి పనులు విమర్శించుటయెల్లఁ బిచ్చిపని కాని బిచ్చమెత్తికొందునను ప్రేలుడుకు మాత్రము గోలకొండ కిచ్చిన జవాబులోని వీలైన పంక్తులు వీరి కగపఱచి విడుచువాఁడను. ఆంధ్రరాష్ట్రమునకెల్ల నాంధ్రవలె నిజామురాష్ట్రమునకెల్ల గొప్పపత్రిక 'గోలకొండ'. సురవరము ప్రతాపరెడ్డి బి. యే., బి. యల్., గారివంటి సూరులచే సురక్ష్యమాణము.

### గోలకొండ.

అభినవసరస్వతి బిచ్చగత్తెయనియుఁ దత్సంపాదకుఁ డేకేట నిజామురాజ్యములో గ్రామములు తిరిగి చందా వసూలుచేసికొనుననియు నీబిచ్చగత్తెకా యింత నీల్గుడనియు మన గ్రామ్యపండితుఁడు వ్రాసియున్నాఁడు. ఇందులకై యేను రోసపడవలసిన యవసర మెంతమాత్రము లేదు. నావర్ణమువారికిఁ బ్రతిగ్రహమే ముఖ్యజీవిక. భవతి భిక్షాం దేహీయని వడుగునాఁడే బయలు వెడలితిని. అట్టి నా పత్రిక బిచ్చగత్తెగాక యింక నేమగును? బిచ్చగత్తెకా యింత నీల్గుడని పిచ్చి దీర్ఘము తీసినాఁడు గాని గ్రామ్యపండితుఁడు బ్రహ్మర్షు లందఱు నెవరు?

భిక్షుకులుగారా ? అట్టిశాపాయుధుల యన్యాయమందే యావిర్భవించినది యభినవసరస్వతి. అది యనవసరమైన నీల్గుడు నీల్గఁబోదు. అవసరము వచ్చినప్పుడు వెనుకకుఁ దీయదు. దానికిఁగావలసినది ధర్మము. అది కాపాడుటకే యాకె ప్రయత్నము. ముమ్మాటికిని నేను భిక్షాధికారినే. కాని గ్రామ్యపండితుఁడు లక్షాధికారికాఁబోలు! అంత లక్షాధికారి యందఱివలనను జందాలు తీసికొనియే పత్రిక నేలపంపుచున్నాఁడు ? నిజాము రాష్ట్రము నుద్ధరించుటకుఁగదా నిలఁబెట్టినది తనపత్రిక ! చందాలు తాను వసూలు చేయుచున్నాఁడు. నేనును వసూలు చేయుచున్నాను. అట్టిచో నా పత్రికయే బిచ్చగత్తె యేలకావలె ? నేను స్వయముగాఁ బోయి వసూలుచేసికొనుచున్నాను. తాను బ్రతినిధుల ద్వారమున వసూలుచేయుచున్నాఁడు. చందాదారులే మణియార్డరు చేయుచున్నారనియు వీ పీ ద్వారమునఁ గైకొనుచున్నాననియు బదులు చెప్పవచ్చునేమో ? అట్లు వచ్చుచందాలు మాకును నెన్నియో యున్నవి. వీ పీ లు చెల్లని విదేశపుఁ జందాలకే నేనువచ్చుచుండుట. ఇదియునుం గాక - ఎందఱో నారాక నభిలషించుచుందురు. ఏడాదికొకమాఱైనను దర్శన మిమ్మనుచుందురు. ఏగుపట్ల నెంతయుం బూజించి పనుపుచుందురు. దీని కంతటికిని మన గ్రామ్యపండితుఁడన్నట్లు నే నిలామరుఁడను ఛాందసుఁడను నగుటయే కారణము.

గోలకొండ నాయట్టి ఛాందసుల ఘుర్ఘురముల మట్టుపెట్టుటకై తన ప్రచండ శతఘ్నికాజ్వాలలను గ్రక్కఁగలదఁట. అక్కటా ! ఇఁక నేమిగతి? తాను గోలకొండయే కావున శతఘ్నికలు చాలినన్ని యుండఁబోలును. అట్లని పిచ్చుకపైనా బ్రహ్మాస్త్రమును బ్రయోగించుట ? గ్రామ్యపండితునకు నా మీఁదనే యింతకక్షవహింపవలసి వచ్చెఁగాఁబోలు ! వచ్చుఁగాక. శంకరుఁడు భిక్షుకుఁడు. జామదగ్న్యుఁడు భిక్షుకుఁడు. చాణక్యుఁడు భిక్షుకుఁడు. అట్లే యీ భిక్షుకుఁడు నాతరగతిలోనివాఁడే యనుకొనుఁగాక. ఇట్లు బిచ్చమెత్తుకొనుచునే యింతదైనది. ఇట్లే యెన్నోపత్రికలచేఁ గ్రక్కించినది. బాలారిష్టములైనను బరిహరించుకొనని గోలకొండ యిఁకఁ గ్రక్కవలసియున్నది కాఁబోలు !

ఉ. మెక్కిన పోపునుం బొలయు మిక్కుటమై తనడొక్క నుండుటన్
క్రక్కునొ యేమొ? లేక యిఁకఁ గ్రక్కెడి దెయ్యది గోలకొండ దా?
ప్రక్కలవ్యాధితోనె యది పూగిత మిగొయ్యెడ. అట్టిదానికిన్
గ్రక్కులుగూడ నేమిటికి? కాలముతీఱ నపొందు చాలదే ?

ఇట్లు పత్రికాప్రదానపూర్వకముగం బరిగ్రహించుచుంటినిగాని పెండ్లాము బిడ్డల బ్రదికింపలేను మహారాజాయని దైన్యము కనఁబఱచికాని యక్షతలువెట్టి యాశీర్వచించికాని యెవనిని నేను యాచించుటలేదు. ఇఁక నిది బిచ్చమో సచ్చమో పెద్దమనుష్యులే నిర్ధారింపఁగలరు. బిచ్చమే యగుఁగాక. ఏబిచ్చమో యెత్తుకొనక యెల్లరును హోటళ్ళే పెట్టుట కీశ్వరుఁ డనుగ్రహింపవలదా? వెనుక స్వర్ణకారవ్యవహారములో నేను గ్రామపురోహితుఁడనై గ్రామదేవతాప్రతిష్ఠ చేయించిన కమసాలి కిచ్చుకట్నములో భాగముగోరి యది యీయమి వ్యాజ్యము తెచ్చితినని యున్నము వీరస్వ

చెప్పినయుక్తులనే నమ్మి తన యభిప్రాయముగూడఁ దథావిధముగాఁ బ్రకటించిన గుంటూరడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కనకపల్లి రంగనాయకులునాయుఁడుగారిని గూర్చి వ్రాసినపద్యములును బ్రస్తుతాంశమునకుఁ బనికివచ్చునవిగా నుండుటచేఁ గ్రిందఁ బొందుపఱుచుచున్నవాఁడను.

సీ. విద్వత్కవియటన్న విశ్వాసమున నాఢ్యు
లర్పించు భూరివర్షాశనములు
మతిమంతు లడ్డప్లు కృతులు వధానముల్
జరిపించియొనరించు సత్కృతులును
ఆత్మీయపత్రికయందునఁ బ్రకటింపఁ
గాఁబడుచుండు సద్గ్రంథములును
స్వసమార్జితంబౌచుఁ బరిమితంబై యున్న
మాన్యంబులం బండు ధాన్యములును
అస్మదీయ దేహయాత్ర కాధారముల్
గాఁగ, నీచు లెవరొ గ్రామయాజ
కత్వ మూని పాలు కాంక్షించితి నటన్న
ధర్మ నేత నమ్మఁదగునె యకట ! చ. భా. 158

క. న్యాయస్థానమునందున న్యాయాధిపుఁడగుచునుండి న్యాయవిమర్శల్
చేయఁగఁబూనినయప్పుడు న్యాయంబెవొ యెఱుఁగకున్న నవ్వరె ప్రాజ్ఞుల్?

సీ. ఎవఁడు మద్భ్రాతకు నెంతో కాలమునుండి
పరమశత్రుండయి పరఁగుచుండె.
ఎవఁ డీప్రతిష్ఠకు నెక్కువసాయమై
ముద్దయిగాఁజేరె మొట్టమొదట
ఎవ్వఁడు కమసాలియిండ్ల సాపడ నేమి
తప్పంచుఁ గోర్టులోఁ దగవులాడె
ఎవ్వఁ డెన్నఁడుఁగూడ నే వైదికులయిండ్ల
తినలేదటనె ద్విజద్వేష మూని
అట్టివానిసాక్ష్య మాపెట్టితలగుడ్డ యాప్రిగల్భవాక్కులాకడంక
కాంచినమ్మి నన్ను గ్రామయాజకుఁగాఁగ వ్రాయుటెంతగ ర్హ్యవర్త్మ
మకట ! 160

సీ. అల జగన్మ్రయోద్రైన యాదిపూరుషునకు
నేనువ క్త్రిము లుంట యెంతనిజమొ
బ్రహ్మకుఁ దర్వాతిబ్రహ్మయైన వసిష్ఠ
ఋషి దోషకలితుఁడౌ టెంతనిజమొ
బ్రాహ్మణశాఖలం బ్రథములౌ వైదికు
లే సంకరులు గావు టెంతనిజమొ
వెడచూపుచేఁ జూడఁబడెడి యీకమసాలు
లిలను బ్రాహ్మణు లౌట యెంతనిజమొ
స్వర్ణకారశాస్త్రి పల్కిన పల్కెల్ల వింతగాకయుంట యెంతనిజమొ
కష్టమనక నేను గ్రామపౌరోహిత్య మాచరించుచుంట యంతనిజము.
తృ. భా. 142

క. విద్వత్కవియని కవిభూభృద్విసుతిం గాంచినట్టి విమలయశఃక
నోద్యద్వాహితునకుఁ దగ దీయధ్వంబని యొల్ల గ్రామయాజనవృత్తిన్

డిస్ట్రిక్టుమునసభుగారినిగుఱించియే కాక స్వర్ణకారవ్యవహారమున స్పెషల్ మేజిస్ట్రేటుగారిని గుఱించియు నిట్లు వ్రాసియుంటిని.

సీ. ఏదియో యొకనెపం బిడి త్రోసివేయక
తిన్నగాఁ జార్జిని దీసికొనఁడు
ప్రైవేటుప్లీడర్లు పట్టు వకాల్తులన్
స్థిరబుద్ధి దాఖలుచేసికొనఁడు
దండిప్లీడరు నేని దా లక్ష్యపెట్టక
క్రాసుచేసినసుడుల్ వ్రాసికొనఁడు
కోర్టున కరుదెంచు పార్టీల నెల్లర
ములుగఁ దిట్టక నోరు మూసికొనఁడు
ఇన్ని కళలు గలిగియున్న మేజస్ట్రేటు
పల్లెనాటిజనుల భాగ్యగరిమ
రాఁ దటస్థమయి బిఱానఁ డ్రాన్స్ఫరుగాక
ఒక్క నాలుగేడు లుండనయ్యె.
ప్ర. భా. 122

జగ:- సొమ్ములు పెట్టుకొన్నవారి నందఱిని నంత తీసిపాఱవేసిన ట్లుంటివే. నీప్రసం-గముతోపాటు కొంచెమో గొప్పో రగిలించుకొనియే యున్నావేమి ? (అచ్చట నున్నవారు కొందఱు గుసగుసలాడుచుండిరి.)

కృ:- ఆభరణధారణమువలనఁ గలుగుచుండు నష్టములు కష్టములు లోటుపాటులు మా యుపన్యాసమునందుఁ గలవానిని మీరడిగినందున నుడివితినిగాని మన మట్లు చేయఁగలమా ? దేశమందు దేశాచారముగాని కాలక్రమమున సంచరించి చెట్టెదెట్లుపట్టు వ్యాపింపవలెనుగాని యొకనాఁటితోఁ గాఁగలదికాదు. మనసొమ్ములయందు మీఱిపదియేండ్లలో నెన్నిమార్పులు కలిగినవో వినుఁడు. మన యవ్వలనాఁడు త్రెండాలు సొమ్ములనాఁడు గోధుమపూసలు మననాఁటి పిల్లకాసులు నిప్పు డఁకాసులవంటి విగ మాఱినవి. ఆనాఁటి రాగిడిచంద్రవంకలు తమలపాకు మొగలిరేకలై యిప్పుడు నాగరములైనవి. కత్తెరబావిలీలు నీలపుబావిలీలు బొగడలు ఝూకాలు మొదలి దుద్దులైనవి. అడ్డిగలు పట్టెడ పలకసరిపట్టెడలు పుదుచ్చేరినానులైనవి. తాయెతులు భుజంబందులు మాఱి దండకడియాలు నాగవత్తు లగుచున్నవి. ఇప్పటి వఱకుఁ బురుషులు ధరించుచుండిన మురుగులు మనకు ముఖ్యాభరణములై వెలసినవి. "అందెలులేనివారి కందము" లేదనుసామెత యడుగంటఁ గొలుసులుఁ గడియాలు వెలసినవి. ఈమార్పులన్నిటికిని గారకు లెవరు ? ఎవరుబోధించి దేశమందఱిచే నీసంకల్పముల నెలకొల్పించఁగలరు? ఈమహాద్భుతశక్తి యాకాలదేవత నావేశించియుండును. ఒకరినిజూచి మఱియొకరు కట్టనాచరించుచుందురు. కావున నే కాలమహిమ యిట్టిదని మనవారు తఱచుగ ననుచుందురు. ఈ స్థితిగతుల నుబట్టి చూచిన నింక నిరువదిముప్పదిసంవత్సరములనాఁటికి మన దేశస్త్రీ లింత సొమ్ములు ధరించుటకు సహించునంతటి విద్యాబుద్ధులు కలవా రగుదురనియే నానిశ్చయము. వస్త్రధారణమున నిప్పటి కేమియు మార్పు లంతగ వ్యాపించుచుండలేదు. పూర్వపుఁ జనుకట్టులు కొంతకాలముక్రిందట రవికలై యిప్పుడు జాకెట్లుక్రిందఁ దిగినవి మఱికొంతకాలమున కింకొకవిధముగ మాఱునేమో కాని యిది సొమ్ములవలెఁ దీవ్రవ్యాప్తి నందుచుండలేదు.

జగ:- నీవు చెప్పినమాటలు కొన్ని నిజముగానే తోఁచుచున్నవి. కొన్నిసొమ్ములు మానుట జాకెట్లు నాకు బుద్ధితెలిసిన లగాయతునే చూచితిమి ! నీవుచెప్పిన ట్లన్నిటి కంటెఁ బరిశుభ్రముగా నుండుటయే బాగుగానుండున ట్లున్నదే ?

కృ:- ఎన్నియాభరణములును బరిశుభ్రతకు సాటిరావు. అందువలన నారోగ్య మతిశయించును. చూడ ముచ్చటగ నుండును. ఇంటిపరిశుభ్రత యీఁగల దోమల నితరకీటకాదులం జేరనీకుండును. అందువలన వాని బాధ నివారణమగుటే కాక మన కవి తెచ్చిపెట్టు వ్యాధులు తొలఁగుచుండును. దోమకాటువలనఁ గొన్ని విషజ్వరము లంకురించును. పాదములందు బొబ్బలుగల యీఁగ లంటువ్యాధు లుండు చోటునుంచి విషపదార్థములఁ గొనితెచ్చి మన మాహారించు పదార్థములందు మను

శరీరములపైనను వ్రాలి మనకా యంటుసంకటముల నాపాదించుచుండును. ఇందువలననే మనవా "రిల్లుచూచి యిల్లాలిని జూడు"మని వాడుచుందురు. ఇంటియందు మనముంచు పటములుగాని యితర చిత్రపదార్థములుగాని గృహాలంకరణములు గాఁజాలవు. యోగ్యయగు నిల్లాలే యింటి కలంకారమని మన యుపన్యాసమంజరి వేనోళ్ళ నుడువుచున్నది. ఇంటిసామగ్రి యెంత నిర్మలముగఁ బ్రకాశించుచుండునో యిల్లాలి బుద్ధికుశలతయుఁ బనినేర్పు నట్లొప్పుచుండునని దీని యభిప్రాయము. ఇది యథార్థమగుటచేతనే యీమాట లోకమున వ్యాపించి యింతకాలము నిలిచియున్నది.

జన:- ఇన్నాళ్ళనుండి నీవు చదువునది చెప్పునది యంతయు విన్నాను. నేను మూడు మాటలు పట్టుకొన్నాను. ఆడవాండ్రు చదువుకోవలెనని యొకటి. సొమ్ములు పెట్టుకోరాదు, రెండు. మూడవది యేమిటమ్మా! మఱచిపోయినానులే చెప్పెద నుండు. చీరనాటే- ఆఁ జ్ఞాపకము వచ్చినది. అబద్ధా లాడరాదు మూడు_సరియేనా?

కృ:- రామాయణమంతయుఁ గట్టి, కొట్టి తెచ్చి, నన్నట్టు మన మిన్నిదినాలనుండి చదివినదియు మీరు చెప్పిన మూడుమాటలకంటె నధికము లేనిమాటే నిజము. ఈ మూడును మన యువతుల కమరినప్పుడు మనము మనదేశము నుద్ధరించినవార మగుటకు సంశయ మెంతమాత్రమును గలుగఁజాలదు. ఇది ముమ్మాటికి నిజము. మనదేశమున వారమున కిరువదిలక్షల నవరసులు సొమ్ములపైఁ గరఁగించఁ బడుచున్నవని బుద్ధిమంతులు లెక్క తేల్చియున్నారు. ఈ సొమ్ములపిచ్చి ప్రపంచమంతటికన్న మన భరతఖండమునం గల వనితలయం దపరిమితమనియు నందు దక్షిణహిందూస్థానమున నత్యధికవ్యాప్తి కలిగియుండుననియు వారిలో నాంధ్రదేశీయ పురంధ్రుల కీయారాటము విపరీతమనియు నిచ్చటఁ జెప్పుటకు సిగ్గగుచున్నది. ఉద్యోగస్థుల భార్యలగు నరవతెఱవలు వేనవేలుగ మనదేశమున నొప్పుచున్నారు. యాత్రార్థులగు నుదగ్దేశీయాంగన లనేకు లీప్రాంతముల నరుగుచుండఁ గాంచుచున్నాము. మనవా రనేకులు కాశీరామేశ్వరపర్యంత భూభాగముల మెట్టుచున్నారు. వీరలు మన కెఱిఁగించు నీ యలంకార వివరములవలనను మనము గాంచుచున్న భాషాభేదముచే నలరు యోషలం గాంచినను మన తెలుఁగు నెలఁతల కీపిచ్చి యధికమనుమాట ధ్రువపడుచున్నది. ఈ భరతవర్షమునఁగల జనసంఖ్య ముప్పదికోట్లు. అందు సగమునకు మన వెలందు లుందురు. సంవత్సరమున కొకయువతికి సరాసరి నాలుగురూపాయల వెలగల యాభరణముల మార్చినను మొత్తమున నీ దేశమునుండి ప్రభుత్వమువారికిఁ బ్రతి సంవత్సరము రాఁగల భూమిపన్ను మొత్తమును మించియుండఁగలదని తేలుచున్నది. ఈ యాభరణదేవత మన హిందూసుందరుల నావేశించి ప్రతిసంవత్సరము నీ దేశమునకు రాఁగల విశేషాదాయమును మట్టుపఱచి దారిద్ర్యమును పెంపుసేయుచున్నది. ఇక్కాలంబునం బ్రపంచమునం గల యెల్లదేశములందును

# అభినవసరస్వతి

సంపుటము ౨౩ } పరిధావి నామ సం॥ పుష్యమాసము. { సంచిక ౧౦

## —* కృతివిమర్శనము. *—

ఆర్యవైశ్య ధర్మవిప్లవనివేదనము :— దీని వెల 0-1-0 ఇది యొక వ్యాసము. స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతము కాదని స్పష్టీకరించును. వ్యాసకర్తలు సోము వెంకటరత్నగుప్త ప్రభృతులు. గుంటూరు పురవాసులు. ఈ వ్యాసము సనాతనధర్మమును బోధించు చున్నందున నిందలి కొన్ని పంక్తు లీక్రిందఁగనంబఱచుచున్నవారము.

బందరు వైశ్య సంఘమువారు... వెడలించిన వితంతూద్వాహ పత్రికను వైశ్యసంఘమువారు చూచినారు. పై పత్రికాధిపతియగు చింతగుంట సుబ్బయ్యశాస్త్రి... విధవలపాలి దయారసము... వెడఁ జల్లిరి... శాస్త్రిగారి సద్భావ మించుక విమర్శిం... ప సాహసించితిమి ...శనిత్రింశాంశమందు జనించిన స్త్రీ పునర్భవగుననియు గురుత్రిం శాంశమందు జనించిన స్త్రీ పతివ్రతయగుననియుఁ బ్రమాణము గనం బరచి పునర్భువను పదమున... స్త్రీకి మఱియొక భర్తను జేయుట శిష్టాచారసిద్ధమని... భ్రమించిరి... పతివ్రత పితృవంశ భర్తృవంశ ముల ను తీర్ణముఁజేయు సామర్థ్యముగల...ది యగును. పునర్భువు పతివ్రత కాదని శాస్త్రిగారు కనఁబఱచిన బృహజ్జాతకమువలననే తెలి యుఁబడుచున్నది. పతివ్రత నియమము శాస్త్రిగారి కనవసరమని పత్రి కవలననే తెలియవచ్చుచున్నది. చాతుర్వర్ణ్యము వారలలో స్త్రీల పతివ్రతాధర్మమును గాపాడుటయే పారిశుద్ధ్యమునకు మూలకార ణము- వివాహము లెనిమిది విధములు- అం దెనిమిదవదియగు పైశా చము పంచమజాతివారికిని నిషేధమని-శాస్త్రములు ఘోషించు చున్నవి. పునర్భు వెనిమిది...లోను జేరనిదియై దూష్యురాలగునని శాస్త్రిగారికి దెలియకపోవచ్చును... వివాహశబ్దార్థమైనను దెలిసి

యున్న శ్లాఘించఁదగదు. వివాహమనఁగా స్త్రీని బరిగ్రహించు సమయమున దంపతుల కిష్టతికిని సమానముగ లభ్యమగు నేకవస్తులాభముగల... కర్మ...మని... పాణిగ్రహణ మంత్రార్థమువలనఁ దెలియఁబడుచున్నది. పునర్భువునకట్టిలాభము గలుగనేరదు-అది వివాహమనఁ జెల్లదు. శాస్త్రిగారు భారతవాక్యములను గొన్ని... ప్రమాణముగఁ బ్రచురించిరి- శంబరుని భార్యను గృష్ణభగవానులు ప్రద్యుమ్నునికి వివాహముచేసినట్లు వ్రాయుటలో శాస్త్రిగారు చాల దీర్ఘదర్శియని యెంచఁదగును...నిషేకాది శ్మశానాంతకర్మముల ననుష్ఠించు చాతుర్వర్ణ్యమువారికిఁబౌరాణికగాథల నుపమానములుగ నంగీకరించి సూత్రకారుల యభిప్రాయమునకు వ్యతిరేకముగఁ బ్రవర్తించుట జాతిధర్మములకనర్థదాయకమని గుర్తెఱుంగక పోవచ్చును. కాముకులందు ... ప్రేమకలిగెనేని చంద్రుని యుపమానముగఁ జూపెట్టి గురుపత్నీగమనమునకు ననుజ్ఞ యిత్తురు కాఁబోలు. వివాహము చేసికొనుటకు సామర్థ్యములేని సోదరులయందు విశ్వాస మేర్పడెనేని ధర్మరాజాదుల యుపమానమువలన భ్రాతృభార్యను బొందవచ్చుననియుఁ జెప్పుటకు ...సాహసింతురు. పునర్భువను పదమునకు మఱియొకపురుషుని బొందిన స్త్రీ యని...అర్థముఁ జేసికొనిరి కాని యట్టి కృత్యము గ్రాహ్యమా యగ్రాహ్యమా యను విచారము చేసియుండలేదు. శాస్త్రిగారు ప్రమాణమని యొప్పుకొన్న గ్రంథములలో నొకటియగు పరాశర స్మృతియందు మాతృగమనమునకును బ్రాయశ్చిత్తమున్నది. అట్టి కృత్య మనుష్ఠానములో నుండుటవలనఁ బ్రాయశ్చిత్తము విధించిరి కనుక నట్టివార లందఱును నొక శాఖగ నుండవచ్చునని బోధిం... తు ... రు ... కాఁబోలు ... శాఖాసూత్రము లనతిక్రమణీయములు. అభివాదన వేళలయందు సూత్రకారుల స్తుతిచేయుట చతుర్వర్ణముల వారికి ధర్మము. సూత్రమనఁగఁ దంతువు. తంతువనఁగాఁ దారము... సూత్రకారులనఁగఁ జాతుర్వర్ణ్యమువారికి దమ వాక్యములు త్రాటిచే ... కట్టివేసినవారని తెలియఁదగును. స్త్రీలకు మాంగల్య మెట్టిదో పురుషులకు శాఖాసూత్రము లట్టివే... భర్తృవియోగము

కాఁగానే తంతుచ్ఛేదనమై...న చందమున...శాఖాసూత్రముల నతిక్రమించిన ... అగు...శాఖాసూత్రములఁ బరిత్యజించి జాతి ధర్మముల విడిచిన వితంతువులకు శాస్త్రిగారు వ్రాసిన గ్రంథ మంగీకారమగు-అట్టివారి విచారణ యనవసరము. శాస్త్రిగారు... వేశ్యలవలెఁ గాక వివాహరూపముగ జరిగిన దంతయు ధర్మమేయని వ్రాసిరి. మైథునకాముకురాలగు విధవ బహుపురుష లేకకాలమునఁ దన్ననుసరించి శ్వసూకరములవలె నన్యోన్యము కలహించి మృతినొందకుండ నొకపురుషుని...పిదప మఱియొకపురుషుని బ్రయత్నించుట చాల నుపయోగకరమని చెప్పఁదగును. తురుష్కులలోఁ గొంతమంది... స్నేహముగలుగఁజేసికొన్న స్త్రీ...ని...రెండవ తరగతిగఁ బరిగ్రహించుచున్న...ట్టు...వినఁబడుచున్నది. అట్టి యాచారము హిందువులను ...నారికి దూష్యమే. పైసందర్భములను యోజించి చూడఁగ నాపస్తంబాది సూత్రకారుల నిబంధనల నతిక్రమించి...స్త్రీ పునర్వివాహ ...భ్రమకు లోఁబడుట చాతుర్వర్ణ్యమువారికిని ధర్మముగాదనియు సద్యఃపతనహేతువనియు స్పష్టమగుచున్నది... గుంటూరు...వైశ్య... సంఘనాయకులు నానారూపములగు ననాచారముల నభివృద్ధికిఁ దెచ్చుచు...న్న...వా...రు...

...వారిలో...కలుగుచున్న...వర్ణధర్మవిప్లవమును నివారించుటకై ద్విజసంఘ సభాసమావేశమునకుఁ బ్రయత్నించుచున్నారము-వైశ్యసంఘమువా రందఱును ద్విజసంఘ సమావేశమునకు విచ్చేసి స్వజాతివైదికాచారముల సన్నిధిని సభ్యులచే...నిర్ణయించుటకుఁ బ్రయత్నింపవలయును. శిక్షకులు లేని ప్రతిధర్మమును గ్రమక్రమముగ క్షీణించుచుండును. చాతుర్వర్ణ్య వైదికాచారములును త్రిమత పీఠాధీశ్వరులవలన సంరక్షింపఁబడుచుండెను. ప్రస్తుతపరిస్థితులనుబట్టి చాతుర్వర్ణ్యమువారిలో నెవరికి వారు స్వధర్మముల రక్షించుకొనఁగల మనుస్వాతిశయ...ముగలవారై జాతిధర్మములకుఁగళంకములను దెచ్చుచున్నారని చెప్పవలసివచ్చుచున్నది. ఇంతకుముందెపుడో వైశ్యసంఘము వారిని...శ్రీజగద్గురు శృంగగిరిపీఠాధీశ్వరులు దూషించిరని తద్గ్రంథస్థ

వాక్యముల కభిప్రాయాంతరములను గలుగఁజేసికొని త్రిమత పీఠాధీశ్వరులను బూజచేయరాదని గుంటూరు పురవాస్తవ్యులు... కలుగఁబోవు ననర్థముల నైనను గమనింపక బ్రహ్మద్వేషమును సంపాదించిరి. పీఠాధీశ్వరులు... దూషింపక పోయినను... వైశ్యసంఘమున వ్యాపించుచున్న యాశౌచసమ్మేళన సముద్రయాన ఖండాంతర సంచార వితంతూద్వాహ రజస్వలా... వివాహ రథకారోపాధ్యాయత్వాది విపరీతానుష్ఠానముల వలనఁ గెడజాతివారు సహితము మనసంఘము వారిని ...దూషింపఁదగిన యాపత్కాలము రానున్నట్లు కానవచ్చుచున్నది.

ఆంధ్రభాషానిలయ కార్యనివేదనము:— ఈనిలయమునకు గౌతమీవ్యాసాశ్రమమని మఱియొకపేరును దేశోద్ధారకమను విశేషణమును గలిగియున్నది. నిజాము రాష్ట్రములోని పాల్వంచసంస్థానమునకుఁ జేరిన కుక్కునూరు గ్రామమున నిది స్థాపితము. ప్రథమద్వితీయములగు క్రోధన క్షయ సం॥ల కార్యక్రమ మంతయు నీపుస్తకమందిమిడి యున్నది. ఈ కార్యనివేదనమును బట్టి తద్గ్రామవాస్తవ్యులే కాక చుట్టుపట్లు వారుగూడ నీనిలయమం దెక్కుడభిమానముతో నుండి నట్లును గ్రంథకర్తలు పత్రికాసంపాదకులు మున్నగు ననేకు లనేక గ్రంథపత్రికాప్రదానపురస్సరముగాఁ దోడ్పడుచున్నట్లును నేతత్కార్యస్థానమం దప్పుడప్పు డుత్సవములు జరిపి యుపన్యాసములు పురాణములు చెప్పించుచున్నట్లును బెక్కండ్రు విరాళము లొసంగుచున్నట్లును గానవచ్చెడిని. పలువురు పండితశ్రేష్ఠు లభిప్రాయము లిచ్చియున్నారు. భాషాజ్ఞానాభివృద్ధికై పాటుపడు నీనిలయమున కేమును బోట్లేజి భరించుకొను వరుసకు గ్రంథపత్రికా దానపూర్వకముగం దోడ్పడ సంసిద్ధులము.

# —* పల్నాటియాత్ర *—

(అయ్యంకి వెంకటరమణయ్యగారు)

ఆ॥ చిన్న చిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు నాగులేటినీళ్లు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్లు సర్పంబులును దేళ్లు పల్లెనాటిసీమ పల్లెటూళ్లు.

యప్రమేయ శౌర్యధైర్యసాహసాది సద్గుణంబులచే నాంధ్రదేశమునకే కాక భారతవర్షమున కంతకును నాదర్శప్రాయమై యొప్పిన వీరుల కదనరంగములచే పావనంబగు పల్నాటిసీమను దర్శించి తరింపవలెనని చాలకాలమునుండియుఁ గోరిక కలదు. శ్రీమన్నారాయణుని ఆజ్ఞలేక మనకోరికలు చెల్లవు. నేఁటి కట్టి యాజ్ఞయైనది. అందుచే బయలుదేరి... ధూమశకటము దిగి పల్నాటి బాటను బట్టితిమి. ఎక్కడఁ జూచినను రాళ్లు. పిండిరాళ్లు కాదు; నల్లరాళ్లు, నాపరాళ్లు. పొలములన్నియు నెఱ్ఱమట్టితో నిండి పల్నాటివీరుల రుధిర మింకను నీభూములపైఁ బ్రవహించుచున్నదా యనునట్లు తోఁపఁజేయుచుండెను. ఇట్లు కొంతదూరము పోవుసరికి నెదుటఁ బెద్ద బాట యొకటి కొండమీఁదఁ గానుపించినది. దానినిజూచి యా చక్కనిబాట యెందులకు వేసిరని ప్రక్కనున్న వారి నడిగితిమి. క్రమముగా నెక్కి కొండమీఁద నున్న బాటనుండి పోవుచో నావలివైపునకు సులభముగఁ బోయెదమని చెప్పిరి. అట్లే... కొన్ని ప్రదేశముల నెక్కుచు దిగుచు ౨౫ మైళ్లదూరము పోయితిమి. దూరమున మిద్దెలతో నిండిన గ్రామ మొకటి కాన్పించుచుండెను. పల్నాటిసీమ కంతకును నాయకమణియై ప్రశస్తిగాంచిన కారెంపూడిగ్రామ మదియె యని తెలిసినపుడు తొలిజన్మము నోములఫలము లభించెనని సంతుష్టాంతరంగుల మైతిమి... ౧౨ శతాబ్దమునందు బ్రహ్మనాయునకును నాయకురాలునకును గారెంపూడి క్షేత్రమునం దొక గొప్పయుద్ధము జరిగియుండెను. ఆరణరంగమునఁ బాల్గొన్న వీరుల కిచట నాలయము నిర్మింపఁబడియున్నది- ఆవీరులను దైవములుగ నెంచి పూజసలుపుచున్నారు. వారు మానవమాత్రులను తలంపు వైపున... లేనే లేదు. వీరులందఱును విష్ణ్వంశసంభూతులనియే వారు నమ్మి పూజించుచున్నారు. వీరులందఱును యుద్ధమునకుఁ బోవుటకు ముందే కారెంపూడియందున్న గంగధారిమడుగున స్నానముచేసి తమ ప్రాణలింగములు తీసి యొద్దునఁ బడవేసిరి.

ఆ ప్రాణలింగములే వీరుల యాలయమునఁ బ్రతిష్ఠించి పూజింపఁబడుచున్నవి. ప్రతిసంవత్సరమును కార్తీకమాసాంత్య దినము (అమావాస్య) మొదలు మార్గశిరశుద్ధ చతుర్థి వఱకు ఐదుదినములు వీరుల తిరునాళ్ళు జరుగును. అప్పటి కాంధ్రదేశము పలుభాగముల నుండియు... విద్యావంతులుఁ గన్నమనాయళ్ళుఁ బోతురాజులుఁ గొమ్మరాజులు నాచారవంతులుఁ జిన్నపెద్దలు... వీరుల యుత్సవమునఁ దమకు నిర్ణీతమైన భాగమును జేకొనువారు కారెంపూడికి విచ్చేసెదరు. విద్యావంతులనఁగాఁ బలనాటివీరుల కథలు చెప్పువారు. కన్నమనాయళ్లనఁగా నరిగ భైరవలు పట్టువారు. పోతురాజులు గావులు మొదలగువానిని బట్టువారు. కొమ్మరాజులనఁగా గణాచారులు. ఆచారవంతులనఁగా

వీరుల యుద్ధసమయమునం దాకట్టి తెగఁగొట్టి చెఱువును వమాపుచూపెది. దీనికి ౫ మైళ్ళదూరమున నల్లగొండకనమ కలదు. ఈకనమ దగ్గఱనే నాయకురాలు గొప్ప రాతిబండల నడ్డముగఁ బోయించి బాలుని గమనమును నిరోధించెనఁట. ఈ రెండు కనములయందును సృష్టివైచిత్ర్యము లత్యద్భుతముగ నున్నవి. అచటి ప్రకృతి సౌందర్యము నెంతకాలము చూచినను దనివితీరదు. నల్లగొండకనమకుఁ బ్రాగంశ మున వీరపీఠమను స్థలముకలదు. అచటి కెక్కి చూచినయెడలఁ జుట్టుప్రక్కల పర్వతముల నడుమనున్న దేశమంతయు నాయకురాలు వేయించిన చెఱువుకట్టవఱకును జక్కఁగఁ గనుపించును. నాయకురా లేర్పఱచిన చెఱువునందలి యుదక మీ వీరపీఠమువఱకును (౫ మైళ్ళదూరము) వచ్చెనఁట. నాయకురా లీవీరపీఠము నెక్కి చుట్టుప్రక్కల దేశమంతయుఁ బరికించి శత్రువుల సేనయొక్క గమనమును నిరోధించు మార్గముల నూహింపఁగలైనని యక్కడఁ గొందఱు చెప్పెదరు. కారెంపూడి నుండి దుర్గికి వెళ్ళితిమి. ఇది కారెంపూడికి ౧౩ మైళ్ళదూరమునం దున్నది. ఈ గ్రామమునందు శాస్త్రప్రకారము విగ్రహములను జేయునట్టి విశ్వబ్రాహ్మణు లనేకులు గలరు. పూర్వ మీగ్రామమం దిట్టివిగ్రహములను జేయునట్టి కుటుంబములు నూఱుండెను. ఇప్పుడు నాలుగుకుటుంబములవారు మాత్రము కలరు. వీరు దినమున కొకరూపాయకుఁ దక్కువలేకుండ సంపాదించెదరు. పమిడాకుల మల్లయ్యగారి యింటికిఁ బోతిమి. వారి యింటియందు మూఁడడుగుల యెత్తుగల భద్రకాళీవిగ్రహము రాతిది కలదు. దానిఖరీదు ౧౨ రూపాయలు.

నాలు గడుగుల యెత్తుగల వేణుగోపాలవిగ్రహము కలదు. దాని వెల ౭౦ రూపాయలు. దార్ల మల్లయ్యగారి యింటియందుఁగూడ సంపూర్ణమయినట్టియు నగుచున్నట్టియు ననేకవిగ్రహములను జూచితిమి. వారు పెద్దవిగ్రహములనే కాక ౫ అంగుళముల యెత్తును ౪ అంగుళముల వెడల్పును గల చిన్నచిన్న విగ్రహములను గూడ రాతితో నందముగఁ జేయుదురు. అట్టివాని కిమ్మత్తొక్క రూపాయ మాత్రమే. ఇట్టి చిన్నవిగ్రహములను ౧౭ టిని జేసియావలసినదని వారిని గోరితిమి. దార్ల శంకరయ్యగారు గ్రామమునం దిప్పుడు పనిచేయుచున్నవారిలోఁ బెద్దలు వారి యింటియందు రాతివిగ్రహములే కాక రాగివిగ్రహములనుగూడఁ జూచితిమి. రాతివిగ్రహములను జేయుటకు గజమునకు రు.౧౦లు మొదలు రు.౧౬ల వఱకును మజూరి తీసికొనెదరు రాగివిగ్రహములకు నణఁగు బరువునకు రు.౪౦ల వంతునఁ దీసికొనెదరు. ... ఈగ్రామమందు ౩ శిలాశాసనము లున్నవి. ఈ గ్రామమునకు రెండుమైళ్ళదూరమునందు నీటిబుగ్గయొకటి కలదు. ఇది వేసవికాలమునందుఁ గూడ నెండిపోదు. ఈయూరియందుఁ దమలపాకులతోఁటలు విశేషముగాఁ గలవు. వీనిని బ్రతిదినమును నర్సారావుపేట కెగుమతిచేయుచుండెదరు. ... ఇక్కడనుండి యెనిమిదిమైళ్లదూరమునఁగల మాచర్లకుఁ బోయితిమి. ఈగ్రామము పలనాటివీర చరిత్రయందుఁ బ్రాముఖ్యమునువహించియున్నది. ఈగ్రామమునకుఁ జుట్టును జంద్రవంక పాఱుచున్నది. ఇక్కడ సుప్రసిద్ధములగు వీరభద్రాలయమును జెన్నకేశ్వాల-

# అభినవసరస్వతి.

సంపుటము 31 | ప్రమాది నామసంవత్సరము జ్యేష్ఠమాసము. | సంచిక 3


## కులస్త్రీలు

(సమస్య)

...విద్య...కియత్త లేదు...పాకశాస్త్రము చదివినచో వంట సరిగాఁ జేయుట యాలవడును. ఆవిద్య యాభాగముననే యుపయోగించును గాని యితరమునకుఁ బనికి రాదు. ఇట్లే యద్వైపయకవిద్య నభ్యసించినఁ దద్జ్ఞానము కలుగుచుండును...స్త్రీవిద్య లోపించుటవలనఁ గలిగిన కీడేమియను ప్రశ్నకు సమాధానము దుస్సాధ్యమనికదా చెప్ప వలసియున్నది?...నడియును జప్పుడును లేక తమచదువును వృద్ధిచేసికొని కొంపురము మానవతు లెప్పుడును జేయుచునే యున్నారు. వారిని రెండవవా రెఱుఁగరు...గరల్సు స్కూళ్ళు మున్నగు బహిరంగకృషులవలన...స్త్రీవిద్యకుఁ బ్రోత్సాహము కలిగింపఁ బడుచున్నదనవచ్చును. చాలస్త్రీలు వ్రాయను జదువను నేర్చుటయే కాక విశేషించి సభలఁ జేసియు నుపన్యాసములు చెప్పియుఁ బత్రికలు ప్రకటించియు గ్రంథములు రచించియుఁ బురుషులతో సమానముగా వ్యవహరించుచున్నారు. కావున...నిందువలన నేమాత్రము మేలు చేకూరినదో కీడు తొలఁగింపఁబడినదో చర్చించుకొనుటకుఁ దగిన స్థితిలోనికి వచ్చినాము. నూటికి 5 గురైనను నట్టి విద్యావతులు లేరనియు నందుచే దానివలనఁ గలిగిన ఫలము లిట్టివని యేమి చెప్పఁగలమనియు జనసామాన్య మంతయు నట్టివారైనచో దానిఫలము స్పష్టపడఁగలదనియుఁ గొందఱు చెప్పవత్తురు. మంచిదే కాని...కొంతమందిద్దరైనను విద్వాంసురాండ్రయినపుడు కొంతరైన దానిఫలము కనఁబడకుండునా ? ఇప్పటికిఁ గనఁబడనిది యింకమాలి మేమికనఁబడును ? కావున నేకొంచెమో కనఁబడుట విధాయకము. కాఁబట్టి యాఫలము లెట్టివో చర్చించుకొని యంతమాత్రము రుచితగిలినను భగీరథప్రయత్నముఁ జేసి కాలేజీలను జెట్టించి సంపూర్ణాంగ్లేయయువతులను జేయుదము. ఏవి ? ఇంతవఱకుఁ గలిగిన మేలిట్టివని వ్రాయుటను గూర్చి యెంతపక్షపాతముగా వ్రాయుదమన్నను నెంతతడవాలోచించినను బంక్తి నడచుటలేదు.

ముందుగ గమనించఁదగినది పాతివ్రత్యము. హిందూయువతి కంటికన్నఁగాఁ జూడవలసిన పరమధర్మ మింకొకటి లేదు. కావున నింతవఱకభివృద్ధియైన స్త్రీవిద్య పాతివ్రత్యమున కెంత యుపకరించినదియు యోజింపవలసియున్నది. సద్లోకానుభవముగను నిపుణముగ నుబరికించి నచోఁ బాతివ్రత్యమున కిది యించుకంతయు నుపయోగించుటలేదు సరేకదా! కొన్నికొన్ని చోటుల భంగకరముగానే కనఁబడుచున్నదని చెప్పుటకు సాహసించక తప్పకున్నది.

ఇట్లు చెప్పవలసివచ్చినందుకు మాకే లజ్జగానున్నది. విద్య యెన్నఁడైనను సదుపయోగ మగుట లేకపోవుఁగాక. పయిఁగాఁ జాతివర్ణ్యభంగముఁగూడఁ గోడగుచున్నదాయని శంక తోఁచవచ్చును. కాని విద్యయనుదానికిఁ బ్రత్యేకించి యొకరూపము లేదుకనుక దానిఫల మెటుమారిన నటుమారవచ్చును. కార్తికేయాచార్యుఁ...డు చోరశాస్త్ర మును రచించియున్నట్లు మృచ్ఛకటిక...మునఁ జెప్పఁబడియున్నది. ఆవిద్య చదువుకొన్న వాఁడు కడు నిపుణముగాఁ జౌర్యము చేయఁగలఁడు. ఇట్లే విద్యలన్నియు నాయా ప్రసంచకవిషయములలోని మెలఁకువలను జెప్పును. అంతే కాని చిత్తము సరికట్టె యోగ్యత నీయఁజాలవు.

---

## భావకవిత్వము

(చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు)

భావప్రధానమగు కవిత్వమే భావకవిత్వమగు. ఈకవిత్వమందుఁ బ్రయోగించు పదము లన్నియు...సంస్కృతపదములే కాని మన కవి సంపూర్ణముగఁ దెలియుట దుర్లభము. కృష్ణ మున్నగు పత్రికలలో వాడెడి యాదర్శములు నాశయములు నెట్లో యట్లే వీని యర్థమును మాకుఁ దెలియదు. భావకవిత్వమనినంతమాత్రమునఁ జదుగురకుఁ దెలియని వాఁ బ్రయోజనమేమి ? అంగటిలో నన్నియు నున్నవి. అల్లునినోట శనియున్నది యన్నట్లగును. "భావమే ప్రధానము, ఆభావము గూఢముగా నుండవలెననుట శ్రేష్ఠము. అట్టిభావమే వ్యంగ్యము. కవిత్వము వచనరూపముగఁ గాని పద్యరూప ముగఁ గాని యుండవచ్చును. ఎవరినుద్దేశించి వ్రాయఁబడినదో వారికే యన్వయింప వలయునుగాని నన్నురమ్మన్నది నన్నురమ్మన్నదని పదుగురును దగులరాదు. భావ ప్రధానవాక్యములు కొంతవఱకు కూడి తదితరము కొంత చేరియుండవలెనుగాని తుట్ట తుదివఱకు నొకట్లే యుండరాదు. వసుచరిత్రయందలి కమనీయద్యుతిధామమా విమల ముక్తాదామమా యను పద్యమునందు భావము గర్భితమైయున్నది. ఏదైనను రసము తన్మయత్వము గలుగఁజేయున ట్లుండవలెను. ఔచితి యుంట మఱింతమంచిది. మెట్టప కవిత్వమందుకంటె నెక్కుడు యౌచితి గలదా ? మనుచరిత్రయందుఁ బ్రవరాఖ్యునితో సంభాషించునెడ వరూధిని "ఆనందో బ్రహ్మ యటన్నప్రాఁజదువు సంతర్పుది నూహింపుము" అని యనెను. "ఆనందో బ్రహ్మ" యనునది వేదవాక్యము, భోగపు స్త్రీ వేదము నెట్లుపఠింపఁజాలినది ? ఔచితికి భంగములేదా" అని తలంపవచ్చును. కాని యట్లు కాదు. వరూధిని నివసించెడిది స్వర్గలోకము. అచట నధికముగ బ్రాహ్మణులతోడనే దానికి సాంగత్యము. కావున నౌచితి భంగము గాదని నాతలంపు. నేఁటి భావకవిత్వము 'గోటచిలకేదిరా చిన్నవాన్ని' లాగున నెక్కుచున్నది. అర్థముఁ జెప్పలేము. ఇది యొక పరిభాష. సైన్సులోను వైద్యములోను నెటులో యటులే నేఁటి భావకవిత్వమందును నీపరిభాషముక్కలు పదుమందును. యెమ్మే చదివినంతమాత్రమున వైద్యగ్రంథములలోని పదములు తెలియఁజాలవు.

భావకవిత్వ మెచ్చటఁ జూచిననచ్చటనే కలదు. మన దొడ్డియందలి మొక్కల ప్రభావము మనకుఁ దెలియదు. వైద్యుఁడు మనదొడ్డిలోనే సర్వౌషధముల వెదకఁగలఁడు.

ప్రతిపుస్తకమందును నీభావకవిత గాన్పింపఁగలదు. కాని పూర్వులీకవితకు శీర్షిక పెట్టలేదు. 'కుందనమువంటి మేను మధ్యందినాతపోష్మహతిఁ గందె, వడదాఁకె నోష్ఠ లొలుకవ ఎదన'మని వరూధిని బ్రాహ్మణునితోఁ బలికెను. ఆపద్యములో భావకవిత్వ మిమిడియున్నది. సామాన్యముగ మగవారింటలేనపుడు నూతను లెవరైన మనయింటికి వచ్చినచో నాడువా రర్ఘ్యపాద్యాదులచే సత్కరించి కుశలప్రశ్నలడిగెదరు కాని మీ తళతళలాడు దేహము కందెను, మీ ముగ్ధులుగులుకు మోము వడదాకె నని యందురా? అట్లనుటలోఁ బెద్దనగా రెంత భావ మిముడ్చవలెనో యంతయు నింపి నిను నేఁ గామించుచున్నానను నభిప్రాయమును వెల్లడిసేసెను. అని వ్యంగ్యముగఁ దెలిపెను. ఇదియు భావకవిత్వమే. ఇట్టికవిత యెల్లెడఁ గలదు. భావకవిత్వము నారంభించినవారి యుద్దేశము మంచిదే కాని దాని నితరు లెంతవఱకు నిర్వర్తించుచున్నారో యనునది విచారణీయము. పూర్వకవు లిప్పటి భావకవిత్వ మంగీకరింతురని చెప్పఁజాలను. గిడుగు రామమూర్తిపంతులుగారి భాషనుగూడ నే నెదుర్కొనలేదు. వారివారి యిష్టము. భాష శుద్ధరింతమని బయలుదేఱినఁ బరమేష్టమే. ఎవరువద్దన్నారు? అస్పృశ్యతనుగూర్చి నాయభిప్రాయ మడిగినారు. దానిలో లాభమున్నదని యన్న వద్దన్నామా? వారి పంక్తిని భోజనము చేసెదము. బాంధవ్యాలు చేసెదము. కాని మేముమాత్ర మితరుల కస్పృశ్యత మానవలసినదని ప్రచారము చేయలేము. కాలమునుబట్టియు నవసరమునుబట్టియు నస్పృశ్యతానివారణము కావలసినదని యందురు. అవశ్యము చేయవలసినదే. కాని ప్రస్తుతమువచ్చెడి భావకవిత్వము ప్రజల నెంతవఱకు రంజింపఁజేయునను విషయము వేఱు. భావకవిత్వమందు భాష యెట్లుండవలెనను విషయము చాలపెద్ద. ఆయాపాత్రలకు స్వాభావికమగు భాషలో వ్రాయవలయుననుటయు వివాదాంశమే. శ్రీరాముఁ డేభాషలో ముచ్చటించెనో నిర్ణయించు టెటులు? ఇఁక నెంకిపాటలవిషయమై సుబ్బారావుగారు యోగ్యతాపత్ర మీవలసినదిగ నన్నుఁ గోరిరి. కడుపులో సెయ్యేట్టి కలనేసినాదీ మున్నగు పదములు వ్యంగ్యపూరితముగ మంచియభిప్రాయమును దెల్పు పట్టులు చాలఁగలవు. ఒక్కొకచో వ్యాకరణదోషములనుగూడ సరకుచేయకపోవచ్చును. జగమేలే పరమాత్మా యెవరితో మొరలిడుదును త్యాగయ్యగారు జగమేలెడి యని యనఁ జాలకుండెనా?

గాయకులకు వైద్యులకు నట్టిదోషములు గట్టరాదు. చాకలిమంగలివారు మాటలాడుకొను మాటలలోనే సుబ్బారావుగారు వ్రాసిరి. కవిత్వమునకుఁ బ్రధానవిషయమేమి? కవి రసమునకు భంజకమైన విషయమును వదలివేయవలెను. రసముకొఱకుఁ గవి జనించెను గాని యితిహాసముకొఱకుఁ గాదు. కవిత్వములో సామాన్యనాయికానాయకుల ప్రవర్తనము వదలుకొనవలెను. వారివల్లనుండి గ్రహింపఁదగిన నీతి లేదు. కావ్యము నీతిని బోధించుచున్నది. ఆర్యులు సత్కులజులు మహారాజులు మున్నగు వారినే యాదర్శప్రాయులుగఁ దీసికొనవలెను. చాకలిమంగలి నాయికానాయకులవలన నేర్చుకొనఁదగిన దేమిగలదు? తిర్యక్కులయందు మ్లేచ్ఛులయందు నుండు రసము రసముకాదు. రసమువలె నున్నను రసాభాసము. ఉప్పులేకుండ విస్తరిలో వడ్డించరాదు కాని యటులని విస్తరినిండ నుప్పుఁ జల్లినఁ దినఁగలమా? ఎంకిపాటలలో మొదటినుంచి

చిపరవఱకు నీ రసాభాసము గలదు. పదుప్రాయుల శృంగార మెంతచక్కఁగ వర్ణించినను బాగుగ నుండదు. దేశభాషయందలి దోషములను బోఁగొట్టుటకు వ్యాకరణమాదిగాఁగల కట్టుదిట్టములను గావించిరి. కొన్ని వేళలమాత్రము స్వదేశభాషను వాడిన దోషము లేదనిరి. కాని తుట్టతుదవఱకు గ్రంథమంతయు నిట్టిభాషలో వ్రాయుట రసాభాస. కవిత్వమువలన ఫలమేమి ? వేదములు రాజాజ్ఞవలె విధించును. పురాణములు మిత్రబోధ గావించును. కావ్యములు భార్యవలె లాలించును. కానఁ గావ్యము లుండితీరవలెను. కాని కవిత్వమందుఁ గొన్ని శాస్త్రనియమముల ననుసరింపఁదగును. ఎచ్చటనైన నుండ నగును గాని సర్వత్ర రసాభాసగా నుండరాదు.

---

## —♦ పత్రికానిర్వహణము ♦—

(శ్రీనివాసదీక్షితులు)

...పత్రికాసంపాదకుల స్థితిగతులు చిత్రముగా నున్నవి...పత్రికానిర్వాహకులు తాముపడుచున్న కష్టములకుఁ దగిన భృతి నార్జించుకొనలేక నే పోవుచున్నారు...వీరు తమ జీవితసర్వస్వమును శక్తియుక్తులను సాహసౌదార్యములను నితరుల క్షేమావాప్తికై వినియోగింతురు. కాని సంఘము వీరిని గన్నెత్తి చూడనైనఁ జూడదు. అప్పటికిని నేసంఘము నేకులమును నేమహోద్యమమును నేలోకోపకారక కార్యమును బత్రికాధిపతుల సాయము పొందనిది లేదు. ప్రజాహితమునందలి ప్రత్యంశమును బత్రికానిర్వాహకులపై నెక్కువగా నాధారపడియున్నదనుట యతిశయోక్తి కానేరదు. కేవలము లోకవార్తలను బ్రచురించుటయే కాదు పత్రికలుచేయుచున్న పని. సంఘములోఁ గాని జాతియందుఁగాని నిస్సహాయులై పతితులగుటకు సిద్ధముగానున్నవారి గోడును బ్రజలకుఁ దెలియఁజేసి వారి యాపదలఁ బాపుటకుఁ బత్రికలే దిక్కు ... స్వాతంత్ర్యమును హక్కులను నిలువఁబెట్టుటకు వారే ప్రాణము కొనవలయును ... మతిమంతులు ... పత్రికాధిపతుల యుపకారము నెఱింగి ... గౌరవింపఁదగియున్నది ... గుమాస్తా మున్నగా హైకోర్టులయందుఁ బ్రభుత్వకార్యనిర్వాహకశాఖలందు మహోన్నతోద్యోగములందున్నవారివఱకును జెమట యోడ్చి కాయకష్టమున 4 డబ్బులు సేకరించుకొను కూలివాని మొదలు సముద్రతీరమహాసౌధములఁ బండియుండు కోటీశ్వరులవఱకును [illegible] గొప్పయో ... పత్రికాధిపతులకు ఋణపడియున్నారు. ఒక్కసారి యాలోచించి మననము చేసికొన్నచో నందలి సత్యము గోచరింపఁగలదు. మనము ... పత్రికను జదివి దూరముగాఁ బాఱవేయుదుము. ... వ్యాసము లీమాఱు బాగుగా నుండ లేదని తిట్టిపోయుదుము ... ఇట్టి నెఱసు లెంచుటయే పనిగాఁ బెట్టుకొందుము కాని ... ఆపత్రికాకారుని ప్రత్యక్షరమును దన జీవితమునెల్లఁ బరులకై వినియోగించి పరుల క్షేమమే తన క్షేమము, పరుల సౌఖ్యమే తనసౌఖ్యముగా ... గడపుచు గడ్డిపరకంత లాభమేని ... పడయని సంఘసేవకుని తేజము ప్రకాశింపఁజేయుచున్నదని యెఱుంగము. మనదేశములో వార్తానిర్వహణము ... ఆశించుకొనియున్న వారిలో దేశనాయకులై ... ఉన్నవారొకరిద్దరు దక్కఁ దక్కినవా రందఱు నిది యొక తాత్కాలి

కావశ్యకతగాఁ జూచుకొనుచుండిరే కాని యిందే నిలిచి తమ నైపుణ్యము నభివృద్ధిఁజేసికొనుటకుఁ దగిన యుత్సాహము నొందఁజాలకున్నారు ... పత్రికానిర్వాహకుఁ...డు ...వాదోపవాదములకు మధ్యవర్తి ... ప్రవృత్తులను బరిశీలించి ... మార్గదర్శకమగు నట్లు వ్యాఖ్యానముచేయుచుఁ గర్తవ్యనిర్ణయము చేయకయే చేయఁగలుగు ప్రతిభావంతుఁడు. ఇట్టిపదవిలో నొక సంకుచితవాదతత్పరుఁడు నిలుచుటకుఁ దావులేదు. ... మతిమంతులు శీలవంతులు వాఙ్నియంతలుఁ బ్రజాభావగ్రహణదక్షులు సాహసోపేతులు నుదారభావశోభితులు ... పత్రికానిర్వహణమునకుఁ బూనుకొనవలయును ...

---

## అందఱు, కవులేనా?

(కమ్మ)

ప్రతిదేశమును ప్రజ్ఞాధురీణుఁడును బ్రభావసంపన్నుఁడును నగు కవికొఱ కెదురు చూచుచుండును. అట్టిమహాకవి యుద్భవింపని దేశపుఁ జారిత్రము గాఢాంధకార మగ్నమై క్రాలుచుండును. అట్టిదేశచారిత్రము పవిత్రచారిత్రముగాఁ బరిగణింపఁబడదు. కవులే యుద్భవింపకుండినచోఁ గావ్యరచన మసంభవము. అందువలన దేశముయొక్కయు ... ప్రభువుయొక్కయుఁ దత్ప్రభువుచే నొనరింపఁబడిన వృత్తముయొక్కయు విశేషములఁ దెలిసికొనఁజాలక భూతలమంతయు గాఢాంధకారత్వ మందును. ...తత్త్వవేత్తయు ... మహాకవియు నగు వ్యాసుఁ డుద్భవింపకుండినచోఁ బంచమపవిత్రామ్నాయమగు ... భారతవీరుల చారిత్ర మెట్లు సంభవమగును? ... వాల్మీకిమహర్షి యే జననమొందనిచో ... శ్రీరామమూర్తి దివ్యచారిత్ర మెట్లు తెలిసికొనఁగలము? ప్రతిదేశవాసులను బూర్వుల ... ఆరాధించునట్లు పురికొల్పునవి మహాకవికృత సత్కావ్యరాజములే. ప్రతిదేశముయొక్కయు ... సాంఘికాధ్యాత్మికపరిజ్ఞానమును బెంపొందఁ జేయు సామర్థ్యము మహాకవి లేఖినియందు గుప్తమైయున్నది ... వేదవ్యాసవాల్మీక్యాది మహర్షు లెప్పుడుద్భవించిరో యెప్పుడు మరణమొందిరో కాని వారలచే రచియింపఁబడిన పవిత్రగ్రంథములను ... ఏవోవిధముగఁ బఠింపకుండునట్టి ... హిందూరక్తోద్భవుఁ డెవ్వఁడైన నుండునా? ఈపవిత్రకావ్యము లీభూమండలమునందలి యొక ... పల్లెయందునో పర్ణశాలయందునో రచియింపఁబడినను బూర్వపశ్చిమార్ధగోళముల యందలి మహాపండితులును దత్త్వవేత్తలును జరిత్రకారులును దమ దేశభాషలలోనికిఁ బరివర్తనమొనర్చి తత్కావ్యరాజములయందలి హిందూసనాతనధర్మములను బాగుగా గ్రహించి మెచ్చుచుండుటలేదా? నిజమైన కవియే మహర్షి. కవిహృదయకుహరము నుండి నిశ్చలముగను నిష్కళంకముగను నిర్మలముగను సుధాప్రవాహమువలెఁ బొంగి పొరలు నభిప్రాయసముదయమే కవిత్వము. అట్టి సదభిప్రాయసముదాయమును సరస కావ్యరచనమున వెలుపరింపఁగల సామర్థ్యవంతుఁడే కవి. అతని వికసితహృదయారవిందమెప్పుడును జ్ఞానప్రభాభాసురమరందపూరితమై యధ్యాపకమధుకరముల నానందాబ్ధి నోలలాడించుచుండును. ప్రతిదేశముయొక్క యభ్యుదయమును గవిహస్తములయందే కలదు ... కావ్యరచనమునం దొకవిధమగు జాతిమతసాంఘికరాజకీయపరిణామములు

సూచింపఁబడుచుండును. వాని యభిప్రాయము లెప్పుడును మహత్తరములై నవి... భగవంతు...ని తేజఃపుంజమును దివ్యప్రభావమును దన మృదుమధురపదగుంభనావిశేషమునం గడుగంభీరభావము లుట్టిపడునట్లు మానవకోటికి విశదీకరింపఁగలసామర్థ్యవంతుఁడే కవి ...చరాచరములయొక్కయు నాకసము ... నక్షత్రములు వాయువు సముద్రములు ... మున్నగువానియొక్కయు మహత్తత్త్వమును దన యోజనాసామర్థ్యమున బాగుగా గ్రహించి పవిత్రాక్షరముల విశదీకరింపఁగల మహాశయుఁడే కవి .. పదార్థములను భావములను నిపుణుఁడగు చిత్రకారుఁడు చిత్రపటలేఖనాకౌశలమునఁ బ్రదర్శింపఁగలఁడు. ప్రకృతిశాస్త్రజ్ఞుఁడు నిరంతరపరిశోధనావిశేషమున వస్తుసమ్మేళన మొనర్చి చూపఁగలఁడు. ఈమహత్తరవస్తుగుణాదికములను భావములను నత్యాశ్చర్యముగ నతిమనోహరముగ నతిస్వాభావికముగఁ దనపవిత్రాక్షరసముదాయమునఁ బొందుపఱచి ... పాఠకమహాశయులను యోజనానిమగ్నమానసులుగ నొనర్చి మోదవిషాదసముద్రముల ముంచి తేల్చుచు నాయా యవస్థల ననుభవింపఁజేయఁగల మహాసామర్థ్యవంతుఁ డొక్కకవియే. ... వాని లేఖినిచేఁ జిత్రింపఁబడనట్టి వస్తుజాల మావంతయును లేదు. ... సమస్త భావములను స్వలేఖినీసామర్థ్యమునఁ బ్రకటించు ప్రజ్ఞాధారేయుఁడే కవి. నిమీలితనేత్రుఁడును బ్రకంపితశరీరుఁడు నయి మహావేశమునను న్న తఱి నసంకల్పముగ నయాచితముగ వెలువడు భావప్రవాహమే కవిత్వము. అదియే ... నీతిబోధకము ... అట్టి మహనీయుని నీతిబోధక కావ్యరచనాకౌశలము పాఠకమహాశయుల నామంత్రణ మొనరించుచుండును ... ప్రకృతివైచిత్ర్యములను ... తా ననుభవించుటయే కాక మృదుమధురపదామ్నాయమున నధ్యాపకులనుగూడ ననుభవింపఁజేయఁగల మహత్తర ప్రభావము కవియందే లీనమైయున్నది ... కవి తన నిర్మలయశశ్చంద్రికలఁ బ్రకాశింపఁజేయుచు సకలజగమును మనోనేత్రముచే వీక్షించుచు ... రాజులను రారాజులను సకలమానవకోటిని దనశాసనమున నెల్లప్పుడును వశ్యులనుగాఁ జేయు ప్రభావవంతుఁడు ...

---

## —♦ మూర్ఖుఁడు ♦—

(రాయచూరు బండారావుగారు)

మ. కినులంగానక కానిపోనిపనులం గావించుచీ వెంతయుం
 నను"నే నిచ్చట నుండియున్న నినుఁ బండంబెట్టి పైఁ ద్రొక్కుచుం
 టిని"నం చంటివి దేహముం మఱచి. ఈనిందోక్తికి కష్టంబుగం
 కనె దుండుండుము వే ఫలంబు నెగురంగాఁబోక యోమూర్ఖుఁడా!
క. మధ్వమతస్థుఁడవయ్యును "మాధ్వుఁడపటరోరినీవు? మాంఛిగ" వనుచుం
 మాధ్వుఁడనగు ననుఁదిట్టితి. మాధ్వుఁడ వీవేలకావు మాదిగ మూర్ఖా!
తే. "మధ్వముద్రలు పెట్టిన మాధ్వుఁడగునె"?
 అనుచుఁ బల్కితి. వద్వైతిజనుల నీవు

పిత మృతాహస్సునంబలె వితగ నేను
త్రి నిజ. మేను మాఘ్వేఁడొ జెట్టు మూర్ఖ ! 3

ఉ. "స్త్రైరవిఁజేసె పౌర ! ఇఁకఁ బైనను జూపెద నీదువైరవి
న్వైరవి నైర"వంచు వడిఁ బంట్లు పటుక్కునఁ గొర్కి పల్కి. తీ
వైరవి కాదు. నీకుఁదగువైరవి యెయ్యదొ యయ్యదే యొసఁగ
వేరిసిమై నొనర్పఁబడు. పేరెములెత్తకు రోరి మూర్ఖుఁడా ! 4

తే. "ఇంతవఱకును జూచితి నేను నిన్ను
గౌరవమ్ముగ, ఇఁక నటుల్ కలుగఁబోవ"
దనెడినుడువులు నీయవి వినినయపుడె
యూడిపడె నీవిడిన తుర యోరిమూర్ఖ ! 5

క. అన్నయుఁ దమ్ముఁడును దార్ మిన్నకయుండంగ నీవె మిడిసిపడియొ? ది
క్కెన్నంగాఁబడుటకుఁగా సన్నయొనర్చెను నీదుస్వాంతము మూర్ఖా!

---

## మహబూబు నగరమండలము

(శేషాద్రి రమణకవులు)

నిజాము రాష్ట్రమునందలి యాంధ్రమండలములలో నీమండల మొకటి. పూర్వ మీమండలమును బాలమూరను పేరుతో వ్యవహరించెడివారు. దాదాపుగా నీమండలము నంతయు నాంధ్రమండల మని చెప్పవచ్చును. ఆంధ్రసంస్థానము లీమండలమున విశేషించి కలవు. పూర్వ మీప్రాంతములను రాష్ట్రకూటులుఁ బశ్చిమచాళుక్యులుఁ గాకతీయులుఁ బద్మనాయకులుఁ బరిపాలించిరి. అనపోతనాయని సోదరుఁడగు మాదనాయకుని శాసన మీమండలము చివరనున్న యమరవాదిలో నుంట వెలమల విజృంభణ మిట నతిశయించెననుటకుఁ దార్కాణము కాఁగలదు. తక్కినచోటులకంటె నీమండలమున ద్రవిడదేశాగతులగు వైష్ణవుల గృహములు చాలఁ గలవు. వీరివద్ద నపూర్వములగు సంస్కృతాంధ్రద్రవిడగ్రంథములు వందలకొలఁదిఁ గలవు. దాదాపుగా నీద్రవిడ వైష్ణవు లాంధ్రులుగా మాఱిరి. గృహకృత్యములకుఁగూడ ద్రావిడము వ్యవహారభాషగా లేదు. పానుగల్లుప్రాంతమునందలి ద్రవిడవైష్ణవులు సర్వజ్ఞసింగభూపతికాలమున ద్రవిడదేశము నుండి వచ్చినటులఁ దెలుపు చరిత్రగ్రంథములు గలవు. వీరలవద్దఁగల కాగితములు పత్రములు విచారించినఁ జారిత్రకరహస్యములు కొన్ని లభింపవచ్చును. ఈమండలమునందుఁ బూర్వము కొణాదమువారు బుక్కపట్టణమువారుఁ బ్రిగడరాజువారు జింతగుంటవారు వ్రత్తెమువారు మరింగంటివారుఁగవులుగా నుండిరి. వారిగ్రంథములు కొలఁదిగా వంశకుల యింట నేఁటికి నిలిచియున్నవి. శాసనములలో నీశ్వరభట్టోపాధ్యాయుండను మహాకవి కానఁబడుచున్నాఁడు. ఆంధ్రములో నీయనకుఁగల పరిజ్ఞానము గ్రహింప వీలుకలుగ

లేదు. కాన గీర్వాణభాషలో నీతఁ శోభింపుఁడు. బూదపూరులో నితఁడు రచించిన శాసనములు గద్యశ్లోకమయములు రెండు గలవు. అందలి కవితాకల్పన మనోహరముగా నుండి చిత్రాలంకారసమన్వితమయి యున్నది. ఈశ్వరభట్టోపాధ్యాయుఁడు మల్యాల చండదండాధీశ్వరుని కాలమునను నతని యనంతరము భార్యయగు కుప్పమాంబ కాలమునను విద్యాధికారిగా నుండెను. రంగనాథరామాయణ మీకాలమునందే రచింపఁబడెనని యూహింపవచ్చును.

కోనవంశములో బుద్ధారెడ్డి గన్నారెడ్డి ప్రముఖులు. వీ రుపయోగించిన ఫిరంగు లిపుడు గద్వాలలో నున్నవి. రామాలయమునకు సమర్పించిన శిలాపాత్రము ప్రమీస్తాపురములో మఠమునం దున్నది. ఈమండలములోనున్న దుర్గములలోఁ గొయ్యలకొండ గణపురము దుర్గములు చూడఁదగినవి. ఆంధ్రవీరుల బలపరాక్రమములకుఁ దార్కాణముగా నున్నవి. వనపర్తి కోనదుర్గము. మొగిలిగిద్ద యాత్మకూరు శ్రీరంగాపురము లోనగు గ్రామములలోఁగల ద్రవిడవైష్ణవుల గృహములలోఁ దాళపత్రగ్రంథములు శోధించువారు లేక యుపయోగింపఁబడక నాశనస్థితిలోనికి వచ్చుచున్నవి. కొంతకాల ముపేక్షించినచో నామరూపములు లేకపోవుననుట సత్యము. భాషాసేవకులు గ్రంథోద్ధరణమునకుఁ బూనుకొనుట యవసరము. ఈమండలములో మాతృభాష యాంధ్రమైనను రాజకీయభాషయగు నురుదు కాక మహారాష్ట్రము కన్నడముగూడ బాగుగా వ్యవహారములో నున్నవి. నారాయణపేట ప్రాంతములం దున్న యాంధ్రులకుఁ గొందఱు కాంధ్రము వ్రాయుట రాదు. వారు వ్యాపారములు వ్యవహారములు గ్రంథపఠనము మహారాష్ట్రములో జరుపుచున్నారు. అచటఁగల గ్రంథాలయముగూడ మహారాష్ట్రగ్రంథములు మూడుపాళ్ళు కన్నడగ్రంథము లొకపాలుగ నుండి వేళ్ళతో లెక్కింపఁదగినన్ని తెలుఁగుపుస్తకములతో నాంధ్రభాషాస్థితికిఁ దార్కాణముగా నున్నది...ఆంధ్రము వ్రాయుటయే కాక మాటలాడుటగూడ నెఱుఁగని యాంధ్రవైదికబ్రాహ్మణుఁడు నారాయణపేటప్రాంతముల...మధురమగు మాతృభాష నేర్చుకొనక కర్నాటము నేర్చుకొన్నందుల కెంతయు విచారపడి యీప్రాంతములలోఁ దెలుఁగునకుఁ దావే లేదనెను... బూదపూరు కదంబపురి కందూరు వర్ధమానపురము కోడూరు గంగాపుర మ్రమానది కలవకుర్తి మామిళ్ళపల్లి లోనగు గ్రామము లీమండలమునఁ జరిత్రప్రసిద్ధములైనవి. ఆయాగ్రామములలో నపూర్వములగు శిల్పములు నిర్మాణములు దుర్గములు దర్శనీయములుగా నున్నవి. ముఖ్యముగా గంగాపురమునుగుఱించి విపులముగాఁ దెలుపవలసియున్నది. గంగాపురము జటచర్ల రైలుస్టేషనునకు 4 మైళ్ళదూరములో రోడ్డుప్రక్క నున్నది. ఈగ్రామమునన్న వీరవిగ్రహములు శిలావిగ్రహములు శాసనములు సాధారణముగా నితరస్థలములలోఁ గానరావు.

ఇచట నపూర్వములగు 4 బౌద్ధస్తూపములు గలవు. ... ఈమండలములోని కొయ్యలకొండలోఁ గాకితముల పరిశ్రమ జరుగుచున్నది. ఇచట దేశీయపరికరములతో ముతక కాగితములు చేయఁబడుచున్నవి. ఇతరస్థలములలో నీవృత్తి దాదాపు నశించినది. ఈమండలములోని మహబూబునగరు దేవరఖదరు నారాయణపేట లోనగు తావులలో గొప్ప సంతలు జరుగుచున్నవి. ఈసంతలలోఁ జక్కని గొంగడులు వివిధవర్ణములతో

చేసినవి యమ్మకమునకు వచ్చును. చక్కని నేఁతతో మంచి సన్నదనముతోఁ గాన్పూరు కాలువలను మించియుండును. నాగరకచిహ్నాలు ముక్తల యనుగాబాదు ప్రాంతములలో గొంగడులు పెక్కు తెఱఁగుల నేయుచున్నారు కబురు ...

---

## —♦ ఇంటిశత్రువులు ♦—

(నాగరాజు పట్టాభిసీతారామయ్యగారు)

తే. ఇంటిలోని పోరు, ఇంతింతగాదయా విశ్వదాభిరామ! వినరవేమ!

...ఏదొంగనైనఁ బట్టవచ్చును గాని యింటిదొంగను బట్టఁజాలమన్న సామెత నిజము. ఆరీతిగానే యేశత్రువునైనఁ బట్టి సంహరింపఁగలము గాని యింటిశత్రువును జయించుట కష్టము. సూర్యోదయము మొదలు రాత్రివఱకు సాయంకాలము మొదలు సూర్యోదయమువఱకు మనలను బాధించు శత్రువుల సంఖ్య రోజురోజుకుఁ బెరుఁగుచున్నది...

సూర్యోదయమున లేచినప్పటి కల్లంతయుఁ బందికొక్కులు త్రవ్వియుంచును. దొడ్డిలోఁ బెట్టినపాదులు పెట్టుకొనినఁ గొఱికివేయును. ఒకయింటిలోనుండి మఱియొక యింటిలోనికి రాయబారాలు జరుపును. ధాన్యపు బస్తాలపై నాశలేదు. రేపు దంచించుకొను ధాన్యము మీఁదరోజున నెండఁబోసినఁ గుంచెఁడు పందికొక్కుల కర్పించవలసినదే. ఇవి మనయింట్ల నేలక్రింద సొరంగాలు త్రవ్వి కోటలుకట్టుకొని వాని కెప్పుడు రెండు ద్వారములయినఁ బెట్టుకొని కాఁపురముచేయును. ఒకద్వారము మనకుఁ గనుపించునది రాళ్ళుపెట్టి పూడ్చిన మఱియొకద్వారమునుండి తప్పించుకొనిపోవును. మన మడ్డము వేసిన రాళ్ళు తేలికవైనఁ ద్రోసివేయును. బరువుగలవైన వానియడుగునుంచి త్రవ్వి క్రొత్తమార్గమును దొలుచును. ధాన్యపుగోట్ల కేకద్వారబంధాలుఁ దలుపులు నీని కొఱుకబడుతులే. కిటికీ తలుపు కింక నాఁగనేయాఁగవు. బందరులోఁ బూర్వపు టిండ్లకుఁ గొట్లకుఁ బెంకుటూర్పు నేలను గజములోఁతునఁ గూర్చెడివారు. వీనివలన నిండ్లుఁ గొట్లుఁ బందికొక్కులకు వశముకాఁజాలవు. క్రొత్తగా గోడపెట్టునప్పు డీమధ్య... పందికొక్కుమార్గా లట్లే యుంచినారము. దానివల్ల గోడ యంతయుఁ దొలచకుండ నుండునేమోయని. అయితే, వాని, ప్రయాణమునకుమాత్రము మార్గము వదలిన లాభములేదు. వాని కిరవుగూడ నేర్పఱుపవలె. ఈసారి గోడలుపెట్టునప్పు డీయేర్పాటుకూడఁ జేయవలసియుండునట్లున్నది...

పిల్లులబాధ లోకులకుఁ దెలియనిదికాదు. ఈప్రక్కనుండి కొట్టిన నాప్రక్క నుండి వచ్చును. దొడ్డిలోకిఁ దఱిమిన సందు ద్వారమున వాకిటిలోనుండి ప్రవేశించును. ఇటు నటుఁ జూచుచుండ వడ్డించినవిస్తరిని ముట్టుకొనును. వెనుక ముందుఁ జూచిన నేతిగిన్నెలోని నెయ్యి పెరుగుగిన్నెలోని పెరుగుఁ ద్రాఁగివేయును. సాధారణముగాఁ బిల్లులబాధకంటెఁ బిల్లిపిల్లల బాధ యెక్కువ. ఇవి జంటగాను మూడుగాను మనలను బాధించును. అదృష్టముచేతఁ బిల్లులలో ... తగాదా లున్నవి. మగపిల్లి మగపిల్లి పిల్లలను బ్రతుకనీయదు. తల కొఱికివేయును. ఆడపోనల నేమియు ననదు ... వెనుక నొకకథ చెప్పువారు. పిల్లి యరణ్యములోఁ దిరుగు జంతువనియు

నింటిలో నెలుకలయుఁ బందికొక్కులయు బాధ పడలేక యొక బ్రాహ్మణుఁడు పిల్లిని దేశములోకి రమ్మనఁగా నాపిల్లి "నే నరణ్యములో స్వేచ్ఛగానుండుదానను, మాంసభక్షకురాలను, నీవు శాకభక్షకుఁడవు, మీయిండ్లలో నెలుకలను బందికొక్కులను వేఁటాడి భుజించి నీశత్రువుల నివారింపుమనికదా నీకోరిక; సరే నేను గాని నాబిడ్డలుగాని యొకవేళ నీభోజనమును పాలువెన్నమీగడలను ముట్టుకొనిన నీవల్లనే నా కపాయమువచ్చునేమో" యని యన్నమీఁద బ్రాహ్మణుఁ డభయహస్తమిచ్చి పిల్లినిజంపుట బ్రహ్మహత్యతో సమానమనియు నాపాపము కాశికిఁబోయి పరిహారము పొందినను బోదనియుఁ జెప్పినాఁడఁట. అందుచేతనే పిల్లిని గొట్టుటకు మన యిండ్లలో నంతగా వెఱతురు ...

కుక్కలబాధ యింతంతయని చెప్ప వీలులేదు. వీధిలోఁ దిరిగెడి చీడకుక్కలన్నియు నెండకాలములోఁ జల్లని చావళ్ళలోఁ జీకటిమూలల దాఁగి పరుండును. ఎన్ని సారులు కొట్టినను దిరిగి హాజరగును. ఎప్పుడు వీనికిఁ బిచ్చియెత్తునో తెలియదు. కొందఱిని గఱచినపిమ్మటనే గుర్తు తెలియును. అదృష్టముచేత నిప్పుడు ప్రతిజిల్లా యాస్పత్రిలోను బిచ్చికుక్కకాటు కింజెక్షనులు సిద్ధముగానుంచుచున్నవి. పూర్వము పంజాబులోఁ గసౌలికి బంపువాండ్రము. పిమ్మటఁ గూనూరుకుఁ బంపవలసివచ్చినది ...

ఇంటిలోని కత్యంతస్వాతంత్రముగా వచ్చునవి పిచ్చుకలు. అలవాటుకొలఁది దగ్గఱకు వచ్చి బియ్యముసైతరా గింజలు భుజించును. కాని యెక్కడఁబట్టిన నక్కడ గూళ్ళుపెట్టుట వాని గ్రుడ్లకొఱకుఁ బాములు వచ్చుట సర్వసామాన్యము. డాబా యిండ్లలోఁ గడ్డీలకుఁ బైచప్టాపు మూలములకు మధ్యఁ జెక్కలుపెట్టకుండఁ గొంపలు లోభింతురు. ఈలోపమునుండి పిచ్చుకలవల్ల యావజ్జన్మశిక్షయే. అద్దాలు కనుపించినఁ బిచ్చుకలు వానిమీఁద వాలి తమ పాపను జూచుకొనుచుఁ డక్కుటిక్కుమని గోడెల్లఁ బొడుచుచునే యుండును. ఈయద్దాలన్నిటికి గుడ్డలుకట్టుట తప్ప వేఱుమార్గములేదు....

ఇఁక నెలుకలబాధ చెప్పఁదరమా ? ధాన్య మంతయుఁ గొఱికిపోయును. బస్తాలు కొట్టివేయును. పిండితో నతికించిన యట్టగల పుస్తకములున్నఁ దెల్లవాఱువఱకుఁ గొఱికిపోయును. బల్లసొరుగులలోఁ దూఱి కాగితాలను ముక్కలుముక్కలుగాఁ జేయును. పైనుంచి క్రింది కుడుకుడుకు నన్నములోనో చల్లపులుసుగంగాళములోనో పడును. ఒకసారి వేలూరుజైలులో గజమెత్తు గంగాళములోని యుడుకుచల్లపులుసు పాఱఁబోయవలసివచ్చినది. ధాన్యపుఁ గొట్లలో నెలుకలుచేయు నాగమును వర్ణింపఁజాలము. బట్టలకొట్టులలో వీనివలన జరుగు నపకారము జాస్తి. అన్నిటికన్న సూక్ష్మజీవుల కాకరములై ప్లేగువ్యాధిని మనుష్యులకు సంక్రమింపఁజేయుట కెలుకలే కారణములు. ప్లేగువచ్చెడి సమయమునకు ముందుగా నెలుకలు చచ్చిపడును. వెంటనే యాయిండ్లను ఖాళీచేసి యూరిబయటకు వెళ్ళిపోవలసియుండును.

ఎఱ్ఱచీమలవలనఁ బక్షివర్గములవలనను గ్రిమికీటకములవలనను గనుపించని బాధ మనకుఁ గలుగును. ఇవి తినుబండారపుఁ బదార్థములను బట్టి మన ప్రాణములను దీసి వేయును. నీళ్ళచిప్ప లడుగునఁ బెట్టి యందులో బీరువా కాళ్ళు నిలఁబెట్టిన నివి యందులోఁ దేలికగా నీఁదుకొని వెళ్ళిపోవును ...

చెదలు మన కత్యాశ్చర్యమయిన విరోధి. వానికి వెలుతురు గిట్టదు. కేవలతప్పఁ వానిముందఱ నేకట్టడయు నాఁగదు. గూడుకట్టుకొని దానిక్రింద నెంతెంతదూరాలనైన మనకుఁ దెలియకుండ దినివేయును. ఇంకఁ గాకితాలు బట్టలు దేవదారువుచెక్కలు మున్నగు నున్నితపువస్తువులు వానికి లెక్కా? చెదలును జంపుటకుఁ జెదలుగూడు కనిపెట్టవలెను. ఆగూడు గోడలో నడుగునఁ బునాదిలో నుండును. పైకెఁబెట్టిన పుట్టల నెన్నిసారులు తీసివేసినను నెన్నిసారులు రంధ్రములలోఁ గిరసనాయిలుగాని తారుగాని పోసినను బ్రయోజనములేదు. సొరంగముదారినే గోడ త్రవ్వవలె. పునాదిలోకిఁ బోవలె. ఒకగోడ త్రవ్వినఁ బ్రక్కగోడ పునాదిలో కీగూడు పోయియుండవచ్చును. అప్పుడు ... ప్రక్కగోడగూడఁ పైనుండి క్రిందివఱకుఁ ద్రవ్వవలసియుండును. ఒకసారి యొక కలెక్టరు నాఫీసులో నొకచోట నీగూడును బట్టుటకు 180 రూపాయలు వెచ్చించి చివరకు నిరాశచెంది వదలివేయవలసివచ్చినది. గూడుదొరకినపు డందులో రాణిచీమ యుండును. దాని సంతతియే యీచెదలంతయు. అది పోయిన నిది పోవును.

అన్నిటికంటె నెక్కువబాధగలుగఁజేయునవి నల్లులు దోమలు. ఇవి రెండును సహచరులే. నల్లినిబట్టి సీసాలో వేసి ఆరుమాసము లుంచిన నది యెండి వరుగై యుండును. ఆనల్లి నొడలిమీఁద నెక్కించినఁ బావుగంటలో మనరక్తమును బీల్చి కడుపు నింపుకొని మరల సంసారముచేయును. నల్లిదాఁగిన ట్లేదొంగయు దాఁగలేఁడు. నవారు పట్టు మెలికలమధ్య దానికి మంచి యిరవు. పట్టెమంచపుఁ గూసములలోను లేక కమ్మికి నవారుపట్టును మధ్యను నవి కాఁపురముచేయును. నల్లులను మనము నీళ్ళలో వేసియో నిప్పులో వేసియో చంపినను వాని యీపి గుడ్లు సామాన్యముగాఁ జావవు...చంపినామని యనుకొనుటయే కాని వాని గుడ్లు 10 రోజులలోఁ బెరిఁగి పెద్దవయి తిరిగి సంచారము మొదలుపెట్టి మనలను బాధించును. కనుపించని నల్లిని గనిపెట్టుట కష్టమన్న నందఱు నొప్పుకొనవలసినదే. కనుపించిన నల్లినే పట్టలేము. ఒకవేళ మన చేతితోఁ బట్టుకొంటిమనుకొనుఁడు. దీనిని నేలమీఁదను విదిలిచి చంపుదమనినఁ జేతిలోనుండి వదలినఁగదా! ఒక నవారే యక్కఱలేదు నల్లు లుండుటకు. జైళ్ళలో నిస్సుపమంచా లిత్తురు. వానినిండ నల్లులే. పరుపులకు వేసెడి టాకాలక్రింద నవి భద్రముగా దాఁగును. వేలూరుజైలులో నదివఱ కాడవాండ్రుండు హాలును మాకిచ్చెదమని చెప్పి చూచుకొనుఁడన్నారు. అక్కడకుఁ బోయిన గోడలవరుసను బొరియలు కట్టి పరుగెత్తుచున్నవి. జైళ్ళలో ఖైదీల కరుగులు కట్టెదరు పడుకొనుటకు. ఆయరుగులనిండ నల్లులే. ఆడఖైదీలను క్రొత్తజైలుకు మార్చుటవల్ల వీని కాహారము లేక బయటకు వెడలి వచ్చినవి.

ఇంకొకశత్రువు దోమ. సంగీతపుదోమ మలేరియాజ్వరమును గలుగఁజేయ దనియు మెల్లగా నిశ్శబ్దముగా వచ్చి కఱచు దోమయే చలిజ్వరపు సూక్ష్మజీవిని దన కొండి ద్వారమున మన రక్తములోని కెక్కించుననియు శాస్త్రజ్ఞుల సువిచారితమగు నభిప్రాయము. బోదకాలుకూడ దోమకాటువల్ల వచ్చెడి రోగమే. ఇటీవల బస్తీలలో దోమల బాధ యమితమైనది. కొళాయినీళ్ళు బాగుగా సరఫరాచేయుటవల్లను నందలి మురుగు నీరు పోవుటకు మార్గము లేకుండుటచేతను దోమలు వృద్ధియగుచున్నవని చెప్పుదురు. మురుగునీ

రెక్కడనున్న నక్కడ నివి పెరుగును. దోమతెర వేసికొన్న దోమలు కుట్టవుకాని కర్మముసాలక దానిలోఁ బెద్దరంధ్రము లుండిన వానినుండి ప్రవేశించిన దోమలు మాత్రము తెల్లవారులు మనలను బాధించును. కిరసనాయలు పూసికొనిన దోమలు వాల వని చెప్పుదురు. ఇటీవలఁ జైనావత్తి కాల్చినఁగూడ రావని చెప్పుచున్నారు. దోమ తెరలోఁ బడుకొనిన సామాన్యముగాఁ దలనొప్పివచ్చును. దోమతెరయైనను శీత కాలమో యుపయోగించఁగలము. కాని యితరకాలములో ముఖ్యముగా వేసవికాల ములో నాలుబైటఁగూడ నుపయోగింపఁజాలము.

ఇంక నీఁగలు పగటిశత్రువులు. ఈఁగ 15 రోజులలోఁ గొన్నిలక్షల గుడ్లు పెట్టు నని చెప్పుదురు. ఇవి సాధారణముగాఁ బెంటకుప్పయున్నచోటులఁ బెరుఁగును. కలరా టైఫాయిడ్ బంకవిరేచనాలు వ్యాపింపఁజేయుట కీఁగలు కారణములు. ఇవి మలమూత్ర ములమీఁద వాలి తిరిగి యాహారపదార్థములమీఁద వాలునరి కాదోషము వీని కంటి వ్యాధిని గలిగించును. ఫ్లిట్ పిచికారి చేసిన నీఁగ లప్పటికిమాత్రము పోవును గాని యాఘూటు తగ్గఁగానే తిరిగి హాజరగును.

బొద్దెక లింటిశత్రువులలో కెల్ల నసహ్యమైన జాతివి. ఇవి యెక్కడ సందున్న నక్కడఁ బ్రవేశించి వస్తువులను పెంటతో నింపివేయును. ఒకసారి వేపుడుకూరలో బొద్దెక కాలుకూడ వేఁగి యొకరికి గొంతుకలో గుచ్చుకోఁగాఁ గష్టముమీఁదఁ దీసి చూచునరికి దాని నిజస్వభావము తెలిసినది. ఒక చిన్నపెట్టెలో బొద్దెకలు ప్రవేశించిన వాని నేరెండుమూఁడైనను సరే బయటకుఁద్రోలుట యెంతకష్టమో యనుభవించిన వారికే తెలియవలెను. ఇవి గోడయలమరలలోను బల్లల సొరుగులలోను పుస్తకాల మధ్యను నిరవుచేసికొని బాధించును.

ఇంటిలోఁ గప్పలబాధ సామాన్యముగ నన్నిచోట్ల నుండకపోయినను నున్న చోటమాత్రమవి యెప్పు డన్నమువిస్తరిలోకి దూఁకునోయని భయముగానే యుండు ను. కప్పలు చిన్నచిన్న పురుగులను దినుచుండును. వానికొఱ కవి మనభోజనపుఁ బీఁటల మధ్య వేఁటాడుచుండుట మన మెఱిఁగియున్న విషయమే.

ఇంటికంటి దొడ్డి సామాన్యముగాఁ బట్టణములలోఁగూడ నుండును. ఆదొడ్లలో నేవో మొక్క మొలక వేసికొనుట మన కందఱకు నలవాటు. జామచెట్టెన్నిసేల కాయలు కాయునో చెప్పలేము. ఒక్కపండు కనులార జూతమనిన దుస్తరము. రామ చిలుక లేపాటిదోరకాయ యయినను సరే, కొఱికిపోయును. ఉడుతలబాధకూడఁ జెట్ల కాయలవిషయములో నమితమే. సీతాఫలములను గాఁపుదలచేయుట చాల కష్టము. పండుపురుషవచ్చునరికిఁ గొట్టివేయును. ఆలాగే సపోటాకాయలుకూడ నూనకు నక్కడనుక నున్నట్లుకనుగొను. పక్షిబాధముఖ్యముగా కాయలకుఁగూడ నున్న పండ్లగుత్తు కట్టి లోపలి పప్పును నమాన్యముగాఁ దీయు పిట్ట లున్నవి.

గొంగళిపురుగుబాధ యెఱుఁగనివా రుండరు. పీపుగా నెదిగిన దోసపాదు 4 రోజులలో ధ్వంసమయియుండును. ఎక్కడఁజూచిన గొంగళిపురుగును దాని గ్రుడ్లును. ఇంక మునగచెట్టు దొడ్డిలో నుండినఁ జెట్టుమొదలు కొమ్మలునంతయు నవి కప్పివేయును. గంగరావి చెట్టునిన గొంగళిపురుగునకు మహోత్సవము. పాదిజాతపు మొక్కలకును గొంగళిపురుగులకు నతిస్నేహమునుదమూ విరోధమనుదమూ తెలియకున్నది.

శ్రీమత్ప్రమాథిసంవత్సరాదిదివసమున శ్రీశ్రీశ్రీ దేవిడీ రాజాస్థానమునఁ
గావింపఁబడినపంచాంగశ్రవణసమయమందుఁ బదాన్యాసమండితుఁడు
నేమాని సూర్యప్రకాశకవి రాజుచే సమర్పింపఁబడిన

## నవరత్నమాలిక.

శా. శ్రీసందారపుఁ జెంపెదాదిసుమనశ్శ్రేష్ఠమందారమా
లావిర్భూతమరందతుందిలమిళిందాక్రాంతపాదాబ్జుఁడై
దేవింగూడి చెలంగు శంకరుఁడు ప్రీతిం బ్రోవుతన్ నిన్ను నా
నాభవ్యద్విరవర్ణనీయగుణసాంద్రా! శ్రీప్రసాదాధిపా! 1

సు. ఇదె యేతెంచెఁ బ్రమాథివత్సరము ధాత్రీశప్రజాసమ్మతా
భ్యుదయాపాదకమై లసత్కిసలపుష్పోద్యచ్ఛలాటువ్రజా
స్పద నానాలతికారసాలమయి భాస్వద్రీతి నీ వెల్లసం
పదలం జెందెద వీశుభాబ్దమున దేవా! శ్రీప్రసాదాధిపా! 2

మ. శతమానాయుష్య మనామయంబు సుఖముం బ్రజ్ఞావిశేషంబు భా
స్వత్తేజంబును నవ్యకావ్యరచనాచాతుర్యముం గూర్చుచున్
కరుణం బ్రోవుత శంకరుండు నిను రంగత్కుండకూర్యన్వయా
గ్రై రమాసోదర! శ్రీప్రసాదవసుధాధీశా! సముద్యద్యశా! 3

చం. సదనమునందు లక్ష్మియును స్వాంతమునందు నగేంద్రపుత్రియున్
వదనమునందు వాణియు నివాసమొనర్చుచు నీకు నిత్య మ
భ్యుదయపరంపరల్ గొలుపు చేయుచు నుండెడుఁగాతఁ బ్రీతి నో
మదనసమానరూప! ద్విజమండలదీప! ప్రసాదభూమిపా! 4

శా. దేవా! దేవిడిరాజ్యలక్ష్మి యనురక్తిన్ నిత్యసత్యస్థితిన్
శ్రీవిభ్రాజితరీతిఁ దావక భుజాసింహాసనాసీనయై
ఠీవిం దా విలసిల్లుఁగాతఁ గవికోటిస్తుత్య నానార్థ వి
ద్యావిజ్ఞానదయాచు ధీమణీ! ప్రసాదక్షోణిపాలాగ్రణీ! 5

సీ. బృందారకాగమందారకుందార
విందాబ్జములతోడ వియ్యమంది
శతపత్రశరగోత్రతతి శాత్రవసుపుత్ర
భవమిత్రజులతోడఁ బంతగించి
హరినందన గిరీశ హరిచందన నదీశ
చింతామణులతోడఁ జెలిమిసలిపి

ధరజాతనుజ శీతకరజాత పురుహూత
గురుఫణీంద్రులతోడఁ గూర్మి నెఱపి
నెలయుకీర్తియు రూపంబు వితరణంబు
బుద్ధియుం గల్గి వెల్గు నిన్బ్రోచు శివుఁడు
శ్రీకరచరిత్ర! వేంకయాంబాకళత్ర!
సద్గుణకలాప! సూర్యప్రసాదభూప! 6

కం. సూర్యాదినవగ్రహము ల।వార్యోచ్చస్థలములందు వసియించి కృపా
ధుర్యులయి నీకు సకలై।శ్వర్యముల నొసంగుదురు ప్రసాదమహీశా!

కం. కృతికర్తవై వినూతన
కృతిభర్తవునై సమస్తకృతివినుతకళా
కృతివయి కృతపండితస
త్కృతివయి యొసఁగుము ప్రసాదపృథ్వీనాథా! 8

ఉత్సాహ. మంగళంబు సకలసుకవిమండలప్రపోషణా!
మంగళం బశేషదుష్టమత్తశత్రుభీషణా!
మంగళము సుధాసమానమధురమంజుభాషణా!
మంగళంబు శ్రీప్రసాదనామవేంద్రభూషణా! 9

ఉ. ఈనవరత్నమాలిక నహీనసువర్ణపదార్థసద్గుణ
శ్రీనిధిగా రచించి నృపశేఖర! నీకు నుగాదికానుకగా
జానుగ నే సమర్పణము సల్పితి దీనిఁ బరిగ్రహించి పెం
పూని సమస్తసంపదల నొందుము నీవు ప్రసాదభూవిభూ!. 10

---

## వార్తాపత్రికాపఠనమువలని లాభాలాభములు

(పయిఁడిపాటి వెంకటాచలపతీశ్వరరావుగారు)

తే. వార్తయందు జగము వర్తిల్లుచున్నది.
ఆదియు లేనినాఁడ యఖిలజనులు
అంధకారమగ్నులౌదురు. కావున
వార్త నిర్వహింపవలయుఁ బతికి. (భారతము)

...వార్తాపత్రిక ప్రపంచపుష్పవనమునకు...వసంతమై నూతనశోభ నింపెస బారుచున్నది. ... నిరాఘాటముగ నిశ్శంకముగ జాతి మత విద్యా సాంఘిక వాఙ్మయ లోపముల విమర్శించియు నుత్తమనూతనమార్గములఁ జూపియు దేశమునకు మహోపకార మొనర్చుచు భాగ్యాభ్యుదయములకై బంగరుబాటవేయు జ్ఞానమూర్తి

పత్రిక. నానావిధ విద్యావిమర్శములను వివిధశాస్త్రరహస్యములను కళావైచిత్ర్యమును దెలియంబఱచుచు సులభగ్రాహ్యముగ విస్తారభూమండలమున జరుగు నద్భుతకార్యముల నొప్పుతో నేర్పు వాగ్దేవత పత్రిక. రాజనీతిబోధించు నొజ్జయై సమర సమయములం బ్రభుత్వనౌక నద్వితీయసామర్థ్యాతిశయమున నడపు కర్ణధారి...యై కవి గాయక కృషిక వ్యాపారుల పాలి యదృష్టదేవతయై...జనించిన భూలోక కల్పవృక్షము పత్రిక...పత్రిక వివిధవిషయములం దెలియంజేయుననుటం దెలిసినదే. అది పాలకులశాసనములం బాలితులకును బాలితుల విన్నపములం బాలకులకును నెఱుకపఱుచును. ప్రకటనలచే వ్యాపారము నభివృద్ధినేయును. వివిధవ్యాపారమున్నలగు ప్రజలకు వారి యభిరుచి కనువగు విషయము లెన్నియో తెల్పును. న్యాయవాది పత్రికలందు న్యాయస్థానముల తీర్పులం జూచును. వర్తకుఁడు బజారునెలలం బొఱంజూచి సంతుష్టి నొందును. గ్రంథకర్త నూతనగ్రంథప్రకటనలను వాఙ్మయవిషయములను నామూలాగ్రముగ గ్రహించి యానందించును. నిరుద్యోగి యుద్యోగమునకై ప్రకటన లన్నింటిని... చదువును...పూర్వ మధికారులు దమ కుద్యోగులు కావలెననియు నింతవేతన మిత్తుమనియుం బ్రకటించుచుండిరి. నేఁటి నిరుద్యోగులు దమ యోగ్యతలం దెలిపికొనుచు నెవరేని మ మ్ముద్యోగమునకు నియమింతురా యని ప్రకటించుకొనుచున్నారు. మఱియు నయోమార్గాధికారులు యాతాయాతములగు ధూమశకటముల మార్పుల నప్పటప్పుడు ప్రకటించుచుందురు. ...పత్రికాపఠనమువలన సాధారణమగు నిట్టిలాభము లెన్నియో కలవు. ...క్షామచిహ్నములు గానంబడునెడల ధాన్యసంగ్రహమున నప్రమత్తులై యుండం బ్రజల నియోగింపంగలదు. మతవిషయములు మతకలహములు న్యాయస్థానముల తీర్పులు మున్నగునవి ... తెలుపంగలదు. ప్రభుత్వమువారు ప్రకటించు శాసనములవలనను వానిపైఁగల ప్రజాభిప్రాయములవలనను బ్రభుత్వపరిస్థితిం గనుగొనవచ్చును. ఇందులకు వేఱుగ నుదాహరణ మొసంగనక్కఱలేదు. ఇటీవల మన ప్రభుత్వమువారిచే నేర్పఱుపంబడిన దేవాలయపు బిల్లునుగూర్చి జరిగిన చర్చోపచర్చలే సాక్ష్యమీయంగలవు ... ఇట్లు దేశవ్యవహార సర్వస్వమును ... తెలిసికొననగుటచేతను దేశవ్యవహారము లన్నియుం బ్రజాభిప్రాయవిశేషములగుటచేతను బత్రికలు ప్రజాభిప్రాయ ప్రతిబింబము లనంబడుచున్నవి ... రాజు ప్రజలకుఁ దన శాసనములం దెలియంజేయుట కడుంగడు నావశ్యకము. ఆంగ్లేయులకు ముందు మనదేశము నేలుచుండిన మొగలాయులును వారికంటె ముం దీదేశముం బాలించుచుండిన మౌర్యవంశస్థులును దమ శాసనాదుల సభల మూలమునం బ్రజలకుఁ దెలియంజేయుచుండిరి. వారిక్రింద వార్తాహరు లుండెడివారు. వారే విదేశముల సంచరించి వివిధవిషయములం దెలిసికొని రాజుల కెఱుకపఱచుచుండిరి. అంతియ కాని మనదేశమున 18 వ శతాబ్దమునకుఁ బూర్వము పత్రిక లుండెడివని నుడువుటకుఁ బ్రబలనిదర్శనము గానరాదు. పత్రికాజన్మస్థాన మిటలీయనియు నాదేశపు ... జ్యూలియస్ సీజరునాఁటినుండి ... జరుగుచుండిన చర్చ లన్నియు ... పత్రిక మూలమున ... ప్రకటింపఁబడుచుండెననియుం దెలియుచున్నది. ... అమెరికాదేశమున నన్నిదేశములకంటె నధికసంఖ్యాకములగు పత్రికలు ప్రకటింపఁబడుచున్నవి ... ఎప్పుడే ... క్షణమున నేమి ఘటించునో యను నాతురత ప్రజలలో నధికమైనది.

వార్తదెలియని ప్రజ లంధకారమగ్నులు. దేశమంతయు సంక్షోభముగా నున్నప్పుడు శాంతముగ నన్ని విషయములను జెప్పు మిత్రు లెవ్వరు? పత్రికయే ... పత్రిక వివిధ విషయములను దెల్పునది ... తెలుపుచున్నది. తెలుపఁగలదు. మతము ప్రభుత్వమున కంటె బలవత్తరము. మానవు నజ్ఞానముఁ బటాపంచలొనర్చి యాముష్మికఫలవృష్టమునకుఁ దోడ్పడఁజాలు విద్యుత్కాంతి మతము. మతపీఠము మతమునకుఁగల సర్వశక్తులకును గేంద్రస్థానము. ప్రజల నాకర్షించుటయందు మతపీఠమున కద్వితీయశక్తి గలదు. ప్రజలకు మతమునందాసక్తి మెండు. అట్టిండ నొకమతపీఠము వివిధప్రాంతములనున్న యామతస్థులను జ్ఞానాన్వితులనుగా నొనర్చు టెట్లు? పత్రికయే శరణ్యము. పత్రికాముఖమున మతగురువు లామతస్థులకుఁ దగు హితోపదేశ మిత్తురు. సంస్కారాదు లొనర్పవలసినచో నాపత్రికలందు సూచన లొసఁగఁబడుచున్నవి. వాని ననుసరించిన వివిధప్రాంతములనుండువా రామతసంస్కారముల నొనర్తురు. ఇట్లు పత్రికల నాధారముగఁ గొని స్వమతోద్ధరణమునకు సర్వప్రయత్నములను సల్పుచున్నారు... ఇట్లు పత్రికలు మతప్రచారమునందును మతచిహ్నరక్షణమందును బ్రజల కెంతయో సాయపడుచున్నవి... మతపీఠము ననంతరము జాతిని సముద్ధరింపఁగలుగునది పత్రికయే. కవిగాయకచిత్రకారోపన్యాసకాది దేశబాంధవహృదయమే పత్రిక... ప్రస్తుతకాలమున... ప్రజలును బ్రజాప్రతినిధులును నొక్కెడఁ జేరి దేశమున కత్యవసరములగు విషయములను జర్చించుచున్నారు... భారతదేశ మంతయు స్వాతంత్ర్యవాయుపూరితము... ఇదంతయుఁ బత్రికాప్రభావమే. పత్రిక స్వాతంత్ర్యమూర్తి. అది స్వాతంత్ర్యోపదేశ మొసఁగి దాస్యమునుండి ప్రజల విముక్తులఁగాఁ జేయును. స్వజాత్యుద్ధరణమునఁ బత్రికవలెఁ దోడ్పడున దెద్దియును లేదు... దేశము నభివృద్ధికిఁ దెచ్చుట పత్రిక యొక్క యుత్తమసాధనము. మహాత్మ, మోహనగాంధుని చోరులు దేశద్రోహులు మొదలగువారిని నిరసించి సాధ్యమగు నంత వఱకు నట్టివారు బయలు వెడలకుండున ట్లొనర్చి మహోపకారము సేయుచున్నది ... పత్రిక యొక సంఘసంస్కర్త. కవులు హరికథకులు పూర్వము సంఘమును సంస్కరించుచుండిరి. వేణుగోపాలశతకముఁ జదివినచో సంఘసంస్కరణోద్దేశమున నే రచింపఁబడె ననుట తెలియఁగలదు, కాని పత్రికలు వెలువడిన వెనుక నాకార్యము చాలభాగము... నిర్వహించుచున్నవి. పత్రికకు జాతిపై నెక్కుడధికారము గలదు. విపరీతాభిప్రాయములను బత్రికవలె నెవ్వరు నడఁచఁజాలరు. పత్రిక సంఘదురాచారములను విమర్శించును. సంఘము నుద్ధరించును... కొన్ని పత్రికలు భాషనుగూడ సంస్కరించుచున్నవి ... విద్య జాతియొక్క ప్రాణము. ఏదేశమున విద్యావాయువు వీవకుండునో యాదేశము మృతప్రాయము. దేశ మంతయు విద్యాప్రచారము సేయుటకును విద్య నేర్చుకొనఁ బ్రజలఁ బ్రోత్సహించుటకును నూతన విద్యావిధానము... ప్రవేశపెట్టుటకును బత్రికయే... కంకణముకట్టుకొనినది ... ఈపత్రికలు పూర్వాధునిక ... విద్యావిధానముఁగూర్చి చర్చించుచున్నవి ... పండితులు ... తమ యభిప్రాయములను ... ప్రకటించుచున్నారు. ...విద్యార్థులు నీపత్రికల మూలమున వివిధవిషయముల నా రెట్లు పఠించిన లాభదాయకమో తమయందుఁగల లోపము లెవ్వియో తెలిసికొని బాగుపడఁగలరు...,

స్త్రీ:— దీనింగూర్చి మన యుపన్యాసమంజరియం దించుకంత వ్రాయఁబడియున్నది. చెప్పెద నాకర్ణింపుఁడు. మొదటిది విదేశపదార్థస్వీకరణము. ఇతరదేశముల వారు మన కవసరములగు వస్తుసమూహము నెల్ల సిద్ధపఱచి వానిని మనదేశము వారికి విక్రయించి మనడబ్బును నొవ్వకుండ లాగి ధనవంతులగు మనలను దరిద్రులఁ గావించుచున్నారు. ఆపదార్థములే మనదేశజను లొనరించిన దేశాంతరముల కడ్డులేక పోవుచున్న కోట్లధనము మనదేశముననే యుండి మనల ధనవంతులఁ గావింపఁగలదు. కనుక విదేశములవారెల్లరును దాము దేశాంతరమందు సిద్ధపఱచిన పదార్థ మెట్టిదిగాని స్వీకరింపమని నిశ్చయవ్రతము బూని యున్నారు. ఈకారణముచేతనే విదేశీయపదార్థములవారెవరును దమ దివాణమునకు రాఁగూడదని మన చక్రవర్తిగారి పట్టమహిషిగారు నిర్దేశించినారని విన్నాను. మనకుఁ బ్రత్తి కోట్లపుట్లు పండుచున్నది దీని విత్తనములు తీసి దూదిగ నొనర్చి మనము సీమవర్తకుల కమ్ముచున్నాము. దానిని వారు నూలుగ నొనర్చియు వస్త్రములు గావించియు మరల మనకే విక్రయించి మొదటి దూదికైన వ్రియమంతయు మనవలననే లాగుచున్నారు. ఒక వస్త్రములకుఁగాను మనదేశీయులు సంవత్సరమున కఱువదికోట్లరూపాయ లితరదేశముల కంపుచున్నారు. అవి మనము నూలువడికి నేయించుకొనిన మనదేశము సంవత్సరమున కఱువది కోట్లరూపాయల నిలువ కలిగి యుండఁగలదు. ఇంతవివర మెందుకు? ప్రతిదినము సూర్యోదయాది యస్తమయమువఱకును మనము వాడుచుండు ప్రతిపదార్థముయొక్క పుట్టుకంగూర్చి విచారింపఁగడంగితిమేని మన కీవిషయమైన పూర్ణపాండిత్యము కలుగఁగలదు. ప్రతివిషయమును వివరించిచెప్పుట దుస్తరము. విచారించనిచ్ఛగలవారి కిక్కాలంబున నీవిషయము లెల్లఁ గరతలామలకములగును.

రెండవది యాభరణాధిక్యధారణము. దీనింగూర్చి మన మిదివఱకే చదివి యున్నాము. ఇది మనము సమగ్రముగ నెఱిఁగిన యంశము. దీనిని మట్టుపఱచు యంత్రము మన మగువలవశమే కాని మగవారివశము కాదు. ఇది యెఱిఁగిన సుదతి యెవరేని యలంకారముల ధరింపక మన కగపడినచో మన మామె నెగాదిగఁ జూచి చనవొనరించి గ్రుచ్చిగ్రుచ్చి కారణము లడుగుచుందుము. చాటున నావిషయమునే గుసగుసలాడుచుందుము. ఎఱుఁగనివారైనచో గౌరవింపకుందుము. అట్టితఱుణముల నెంతధైర్యశాలినియైనఁ జిన్నఁబుచ్చుకొనకుండఁ జాలదు. వెలగలసొమ్ములును సరిగచీరెలును ధరించినవార లరుదెంచినంతనే త్వరపడి మనము వారల కాసనప్రదానాద్యుపచారము లొనరించెదము. నిర్మల దుకూలధారిణియు నిరస్తాలంకారయు నగు వరవర్ణినిం గాంచినపు డటుల వేగిరపడి గౌరవించునంతటి ధీశాలినులు మన యక్కలలో మిక్కిలి తక్కువ సంఖ్యగలవా రుందురని నానమ్మకము. తొడవులపని కమసాలివానిదియు వలువలపని సాలెవానిదియు నని మన మెఱుఁగుదుము. వీనిని మన కమర్చు మహాంజనము ద్రవ్యము. అట్టిద్రవ్యము నింకఁజేయుట కివి యర్కప్రకాశములని మన మెఱిఁగియుండవలెను. ఇది యెఱుఁగక దంభాడంబరసహితలగు వనితలం

గాంచి మనసు భ్రమించి గౌరవించుచుందురు గాన మనవారలు పెక్కండ్రు గౌరవార్థమే సొమ్ముల సంగ్రహించి ధరించుటయుఁ గలుగుచున్నది. అధికాభరణముల ధరించువారిని స్వర్ణోపలవాహులని నిరసించు బుద్ధి మన చెలియల కలవడినప్పుడు మన దేశదారిద్ర్యము తొలఁగఁగలదని చెప్పనగును.

జగ:— మనము సొమ్ములు పెట్టుకొనిన మర్యాద కలుగుననియు నవి చేసినవారి కది తొలఁగుననియు ననుచున్నావు కాని యట్లు జరుగఁగలదా?

కృష్ణ:— మీ కాసంశయ మేల? ఇందునుగురించి కథ యొకటేను వినియున్నాను చెప్పెద నాకర్ణింపుఁడు. ఒక కుటుంబమువారికి నలువురు కొడుకులు నిద్దఱు కూఁతులు నుండిరి. మొదట నీకుటుంబమువారు సామాన్యస్థితిమంతులై కొడుకు లెక్కువచ్చిన వెనుక భాగ్యవంతులైరి. కూఁతు లిరువురిలో నొకరితె తొలికాన్పుబిడ్డయు రెండవయామె కడకాన్పుపట్టియు నైయుండిరి. పెద్దపిల్ల పెండ్లి నాఁటికి వీరు సామాన్యదశయం దుండినందునఁ దమ కష్టమగు మనుము విచారించి యొసఁగిరి. కడగొట్టుపిల్ల పెండ్లినాఁటికి స్థితిగతులు మాఱినందునఁ గట్నముతో భాగ్యవంతుల కిచ్చిరి. ఇట్లుండ నాలుగవకుమారుని వివాహము తటస్థించెను. బీదకుటుంబినియగు పెద్దబిడ్డను రమ్మని కమ్మనంపి చిన్నకూఁతు నాహ్వానించి తీసికొనిరా నన్నగారి నంపిరి. తమకుఁ జేతనగు కట్నములును గానుకలును గొని యాబిడ్డ లిరువురును పెండ్లి కరుదెంచిరి. పేదరాలగు పెద్దబిడ్డ సామాన్యవసనంబుల ధరించి యలంకారవిశేషములు లేకయుండెను. ధనవంతురాలగు చిన్నబిడ్డ సరిగచీరెలు మెఱుఁగుసొమ్ములు ధరించియుండెను. ఉభయులు నొకసారిగనే పెండ్లియింటికిఁ జేరిరి. ఇంటివారి కెవరికిని బేదరాలగు పెద్దబిడ్డను బలుకరించుటకైనఁ దీరనంత సత్వరముగఁ జన్నకొమరితె నాదరించి పరామరికలఁ గని పెట్టుచుండిరి. ధనలోపము తనకిట్టి మన్ననలోపము కలిగించెనని తలంచి యొకటిరెండుదినము లుండి యామె వెళ్ళిపోయెను. అనంతరము 10 సం॥ లకు వీరియింట మరల నొక శుభకార్యము తటస్థించెను. స్థితిగతులు మాఱినవి. మిగుల యోగ్యతగల పెద్దబిడ్డసంసారము వృద్ధినొంది సిరిసంపదలచేఁ దులకింపుచుండెను. డంభాడంబరకలితులగు చిన్నబిడ్డయొక్కయుఁ దమ యొక్కయు స్థితిగతులు తఱిగిపోయెను. తొల్లింటియ ట్లిప్పుడును గూఁతుండ్రి నిరువుర నాహ్వానమొనర్చిరి. మునుపు చిన్నకూఁతున కమర్చిన మన్ననలన్నియు నిపుడు జ్యేష్ఠపుత్రి కొదవింపసాగిరి. ఆమెయు నీమార్పునకు వింతపడి సంతసింపక యెప్పటియటుల నుండెను. అందఱును విందుభోజనపంక్తుల నలంకరించిరి. వెనుకటి పెండ్లినాఁడు మొదటిపంక్తిని స్థలమైన దొరకని పెద్దకూఁతు రిప్పు డగ్రస్థానమునఁ గూర్చుండఁబెట్టఁబడెను. ఆమె బిడ్డలును వేఱువేఱు పీఁటలపై నాపె సరస నలంకరించిరి. చూచువారల కెల్లరకును ముదావహముగ నుండెను. వడ్డన లైనవి. పరిషేచనానంతర మెల్లరును సాపడ మొదలిడిరి. ఈమెయు నీమెపిల్లలును దమ యలంకారములఁ దీసి పీఁటలపై నుంచి

తాము తొలుత క్రిందఁగూర్చుండి యాయలంకారములకు నైవేద్యము పెట్ట మొదలిడిరి. అటనున్నవారెల్లరును నిబిడకౌతూహలమున వెఱఁగుపడి చూచుచుండిరి. ఇంతలో గృహయజమానుఁడు వచ్చి యమ్మా ! ఇదియేమిపిచ్చి ? అనియడిగెను. పెద్దబిడ్డ నాయనా ! నేను 10 యేండ్లనాఁడు నమ్మని వివాహమునకు వచ్చి నపుడే సమయమున నే నోలిపంక్తిని భోజనముచేయుటకు స్థలముకాని మీ మన్నన కాని దొరకకపోయెను. ఇప్పుడంతటికంటెను నేనధికాదరణపాత్రురాల నైతిని. దీనికిఁ గారణభూతము లీ నగలని కనుగొని నాకిట్టి గౌరవ మాపాదింపఁగలిగిన వానిఁ బూజించుచున్నానని చెప్పెను. ఆమాటలను విని యచటిజను లెల్లరును వింతసంతసము నొందిరి. తలిదండ్రులును సోదరులును సిగ్గుపడి మాఱుచెప్పలేక యూరకుండిరి. చూచితిరా సొమ్ములు సామాన్యజనుల నెంతయాకర్షింపఁ గలవో ? ఇతరుల నిక నడుగ నేల ? తలిదండ్రులును సోదరులు నే యెటులాద రించిరో చూడుఁడు. మతిమంతురాలుగనుక నోర్చి యామె వారికి జ్ఞానోదయ మొనరింపఁగలిగెను. సామాన్యు లిట్టితరుణములఁ జింతిలి దానిం గూడఁ దీయుట కుపాయాంతరము తెలియఁగనేరక సొమ్ము లధికముగ నుండవలెననియు సరిగచీరెల ధరింపవలెననియు విశ్వప్రయత్న మొనరించుచుఁ దపస్వినులం బోలె రేయిం బవళ్ళు తదేకనిష్ఠాగరిష్ఠలై యవకాశము కలిగినప్పుడెల్లఁ బురుషుల బాధించుచుఁ గోరికల సాధించుకొనఁ దలంచుచుందురు. ఇట్టి కారణములచేతనే పలువురు గట్టివాయలై దిట్టతనమూని పలు నగలను వెలగల వలువలను ధరించి తమ గౌరవము నభివృద్ధి గావింపనెంచెదరు కాని యిది నిజమగు గౌరవమునకు భంగకారణమని యెఱుఁగఁజాలరు. మన వనితాజనంబున మఱియొకలోప మగపడుచున్నది. ఒకరిత యేదియో యొకవిధమగు వలువ ధరించినను సొమ్ము పెట్టుకొనినను దమయాకారమున కట్టిచీరెగాని యలంకారముగాని సరిపడునా లేదా యను శంక మాని యలఁతికాలమున నెల్లరు నట్టిచీరెలను సొమ్ములను ధరించుచుందురు. కొందఱి కిట్టిమార్పు లతుకువెట్టినట్లుండుటయు మఱికొందఱియందు సౌందర్యహీనత సమకూర్చినట్లుండుటయు మనము చూచుచున్నాము. మన యాడువారి కీపాటి వివేచనాశక్తి లేకుండుటకు విద్యావిహీనతయే కారణము సుండీ. ఈయాభరణపిశాచాదరణముచే మన యిల్లు నొళ్ళు గుల్లగుటయే కాక సంసారస్థితియెల్లఁ గల్లయగుచు మానప్రాణము లాహరించు నెఱ యగుచున్నది. మనదేశమున నిపు డభివృద్ధినొందుచున్న కన్నపునేరములకును బందిపోటులకును స్త్రీశిశుహత్యలకును దఱుచుగ నీయాభరణమూల్యాపహరణాపేక్షయే కారణమని మన మందఱము నెఱుఁగుదుము.

సీతమ్మ:- నిజమేసుండీ. ఇల్లును గుల్ల యొళ్ళును గుల్ల యనిన జ్ఞాపకమువచ్చినది. మా పుట్టింటియూర శ్రీధరవారనియు నన్నమువారనియు నున్నారు. ఆరెండిండ్లలో నిద్దఱాడపిల్లలకు నా పెండ్లప్పుడే పెండ్లిండ్లయినవి. వాండ్రును నేనును సావాసముగా నాడుకొనుచునుండెడివాండ్రములే. శ్రీధరవారు కొంచెము తినఁ గుడువఁ

పంతులుగారి కిచ్చినప్పుడు మావాండ్రు మీచేతనైనంతమాత్ర మలంకారము పెట్టుఁడు, అప్పులుచేసి సంసారము చెడఁగొట్టుకోవద్దని విస్పష్టముగాఁ జెప్పినారు. అందువల్లనే యింత కొంప గోడి చెడకుండఁ బట్టుకొని కూటికి గుడ్డకు నొకరికిఁ జేయిచాపకుండ నెట్టుకొని వచ్చుచున్నాము.

శ్రీధరవారు కొంచెము మంచిమనసు లాలోచించి ప్రతివారుఁ గట్నాలిమ్మని పెట్టుచేయుచు వచ్చినను నందుకు సమ్మతింపక మేమొకరివద్దఁ బుచ్చుకొనము, ఈయము, అని పట్టుపట్టి యేాలి పుచ్చుకొన్నను నిచ్చినను దోషమేయని వాదించి చివర కెట్లులనైననేమి మంచి స్థితిమంతులకే యిచ్చినారు. వీరల్లునికి 116 దక్షిణగా నిచ్చిన వారు సొమ్ములకుఁగాను వేయిరూపాయలు చదివించి పిల్లకు మీయిష్టమువచ్చిన సొమ్ములు చేయింపుమన్నారు. ఆపిల్ల కప్పటికే చాలనగలు పుట్టింటివారే చేయించి పెట్టినందున నత్తవారి నడిగి యావెయ్యి రూపాయలకుఁ బొలముకొన్నారు. ఇది పదిపదియేనేండ్లనాఁటి మాట. ఇప్పు డాపొలము నాలుగైదువేలు చేయునఁట. మొన్న యాయనకొడు కీయూరికి వచ్చినప్పుడు నాతోఁ బ్రస్తావవశమున నన్నాఁడు. సంవత్సరానకు 300 రూపాయలు వచ్చుచున్నవఁట. ఆపిల్ల కాఁపురముచేయుచు నీడబ్బుపెట్టి యింకను బొలాలు కొనుచు వృద్ధిచేయుచున్నదఁట. మంచి తెలివికలదిలే. తనపిల్లలకు మంచిమంచి చొక్కాలు టోపీలు నగవారితోఁ జెప్పియుఁ జెప్పక తెప్పించుచున్నదఁట. వాండ్రపని యిప్పుడు వేసివేయకుండ నున్నవి. ఈసంగతి యిట్లున్నదా; - రెండవపిల్ల యన్నమువారి యమ్మాయియని చెప్పితినే - దానిపెండ్లి యప్పుడే యైనదా ? దాని పుట్టింటివారు కొసరికొసరి సొమ్ములు పెట్టించుకొన్నారు. ఆపెండ్లివారు స్థితిమంతులనిపించుకొనవలెనని డంబముగా నచ్చి విరివిగా సంభావనయిచ్చి యా 4 రోజులు వెలిఁగిపడ్డారు. సొమ్ములు 2 వేల రూపాయలవి పెట్టినారనియుఁ బిల్ల యదృష్టవంతురాలనియు నమ్మలక్క లందఱును జెప్పుకొన్నారు. అప్పటికి నాకుఁ బదేండ్లున్నవి. బాగుగాఁ జ్ఞాపకమున్నది. తరువాత నేమైనదో విన్నారా ? శ్రావణమాసములోఁ బెండ్లియైనది. మార్గశిరములో ముక్కోటినాఁడు గుడిలోకిఁ బోయి యాపిల్ల మందిలో నోరు తెఱచుకొని దేవుని జూచుచు నిలుచున్నది. ఎవరో పచ్చెసకాండ్రుఁట. 5 వందల రూపాయల కంటె యంతలో మాయముచేసినారు. కత్తిరించి హరించినారనుకొన్నారు. అంతే. నాఁటికి నేఁటికి కైపులేదు. ఏడ్చినారు. మొత్తుకొన్నారు. ఏమిచేసిన నేమి ? అయినదేమో యైనది. పోయినది దానిదారిని పోయినది. తేసిన పగల లేకయే పోయినవి. తరువాతఁ గొన్నాళ్ళకే పట్టెడకుఁ జెల నడలట; కొంచెము దూదియైనను బెట్టి తిప్పలేదుకాఁబోలును. ఆకొంచెము నాపిల్ల యెచ్చటనో కులికింపించినది. ఊరు నుహామఁ బెంటలు దిబ్బలు 10 రోజులదాఁక వెదకి విసిగి వదలిపెట్టి యూరకొన్నారు. ఏడాదిలోపలనే యీ 2 అనుభవాలును! అన్నమువారిపిల్ల యదృష్టవంతురాలన్న యమ్మలక్క లందఱు నప్పటికే యది పుట్టి దౌర్భాగ్యపుఁ బెద్దమ్మయని యనుచు వచ్చినారు.

తే. గీ. నీవు తెచ్చిన యపకీర్తి నిన్నుఁ గట్టి
కుడుపుచే కాక మమ్మును గూడముట్టు
తాఁ జెడినకోఁతి యుపవనరాజ మెల్ల
చెఱుచు ననియెడిసామ్యముఁ జెప్ప వినమె ? 97

సీ. లేక సంతతి మేము లేమరో ! కన్నట్టి
చెట్టుచెట్టుకు గుట్టగుట్ట కరసి
తిరిగి తిరిగి మ్రొక్క హరికృపచేఁ గొంత
వడికి నీతల్లిగర్భమునఁ బడితి
పడినను మొద (లుగాఁ గుడుపుపై రుచి) దప్పి
నడలు తొట్రిల మేను బడ(లుపడఁగ)
నొమ్మిదిమాసముల్ నెమ్మి నిట్టుల మోసి
కనిపెంచె నమ్మ. ఇట్లు మనిచినట్టి
తల్లిదండ్రుల మే. మెడ్డు నుల్లములను
కలుగు దేహితుఁ, డిహపరాల్ చెలఁగుననుచు
ఓజ నానందజలనిధి నోలలాడ
మాడు సంతస మిప్పుడు మంటఁగలసె. 98

వ. కావున నోదుర్మతీ ! నీమూలంబున నేఁడు పరిభాకరాన్వయం బపయశః కలితం బయ్యె. నీ కింతటినుండి సుకన్యకయను పేరు మాఱి కుకన్యకాభిధానంబు గల్పితం బగుం గావున నిఁక మత్కుమారి యనరా. దెవ్వరేనియు మీఁదెఱుంగక యిట్టి యకృత్యంబు లాచరించిరేని వార లధోగతిం గూలుదురు. కావున నీ విట్టిబ్రదుకు బ్రదుకుటకంటె శరీరత్యాగంబుసేయుటే మేలని మఱియు నానాప్రకారంబులఁ బరుషాలాపంబు లాడు నరవరేణ్యుం గని యప్పరమపతివ్రత సభక్తివినయస్నేహ సంభాషణంబుల నిట్లనియె. 99

కం. తండ్రీ ! నీవిటు నాపయి వేండ్రంబగు కినుకఁబూని వివిధంబులుగా
గండ్రిల్ పలుకుట చనునే? ఖండింపుము శిరము (నాదుకడఁ దప్పున్నఁ గా)

తే. గీ. జనక ! నీవిట్లు లాడుట చనునె నాదు
గుణములెల్లను నరయక క్రూరమతిని ?
పల్లవుఁడు గాఁ డితం; డగు భార్గవుండు.
వలదు సంశయ మిఁక నీకు వసుమతీశ ! 101

వ. అని.

తే. గీ. అచటి కశ్వాలు తోఁతెంచు టాడుమీఁద
దివ్యమగు నొక్క కాసారతీరమునకు
చనుటయును నాజలంబుల స్నాతుఁడై సు
రూపుఁ డగుటయుఁ జెప్ప నభ్యూహ్యుఁ డపుడు. 102

వ. సంశయవ్యాకులితమానసుండై యాసుకన్యకం గని యిట్లనియె. 103

తే. గీ. ఇంతి! అశ్వులు తోతెంచు టేడ? దివ్య
సరసి యది యేడ? ముదుసలిసంయమీంద్రుఁ
డేడ? అవగాహనము సల్పు టేడ? పూర్ణ
యౌవనుం డౌట యేడ? ఇట్లనఁ గలదె? 104

తే. గీ. ఇట్టివిపరీతవాక్యము లేర్పడంగ
చెప్పి యొప్పించఁజూచెదే చెలియ! నన్ను
అంకు నేర్పినవారలు బొంకనేర్త
రనుచు విశ్వంభరాస్థలి నందు రెందు. 105

తే. గీ. బుధులు చెప్పెడువాక్యముల్ పొల్లు లగునె?
వీఁడు విటరాయఁడేచుమ్మ వేయునేల?
కాన విశ్వసనీయవు కావు నీవు
పాపమతి. వంచుఁ బల్క నాపరమసాధ్వి. 106

వ. బద్ధాంజలియై పలువిధంబుల విన్నవించినను వినక యంతకంతకగ్గలంబగు కో (పం బునఁ గ) ర్ణకఠోరవాక్యంబులు పల్క నందుల కుల్కి యత్తరుణీలలామంబు భయభ్రాంతయై యేమియు ననఁ గూరకుండె. అంతఁ గొంతతడవునకు మ్మునివరుండు వారల కెదురుగాఁ జని యమ్మూర్ధాభిషిక్తునకుఁ దన వృత్తాంతం బాద్యంతంబును దెలిపిన నెట్టకేలకా తండు ప్రసన్నుండై యమ్మునిశిఖామణికి నమస్కరించి తన పుత్రీమణి నెత్తి నిజాంకంబునఁ గూర్చుండఁబెట్టికొని మూర్ధాఘ్రాణంబుగావించి యోయమ్మా! నీసుగుణంబు లేఁ గానక విరసంబులు పల్కితి. అందుచే నీమనం బెంత కంది యుండెనో కదే యని యనేకవిధ సుధామధురోక్తులఁ గూఁతుం దేర్చి పెండియు జామాతం గాంచి యోమహాత్మా! నే నొక్క యాగం బొనరింప సంకల్పించుకొని భవత్సన్నిధానంబున కేతెంచితిఁ గావునఁ దత్క్రతువునకు యాజకత్వంబు వహించి సుప్రయోగంబు గావింపుమని పలువిధంబుల వేడె. 107

తే. గీ. కూఁతు జామాతలను గూడి కువలయేశుఁ
డరదమునఁ గూర్చుండి చయ్యనఁ బురంబు

చేరె నావేళ నిజపరివారసహితుఁ
డై ప్రమోదాంబునిధి నోలలాడుచుఁ గడు. 108

ఆ. వె. ఇట్లు పురవరమున కేతెంచి వారల
అర్హమందిరముల కనిపి రాజ
చంద్రుఁ డపు డమాత్యసంఘుంబునకుఁ జెప్పె
శిల్పివరుల కాజ్ఞ సేయుఁ డనుచు. 109

సీ. వైదూర్యపర్వతప్రాంతంబునను మించు
నర్మదాతీర వినిర్మలోర్వి
కడను విశాలంబుగా శాస్త్రరీతిని
అనువొప్ప మఖశాల ఘనత మెఱయ
కట్టించి దానికిఁ జుట్టు బ్రహ్మక్షత్రి
యోరవ్యపాదజవారములకు
మణిమయాగారముల్ మంచిగ నిర్మింపఁ
జేయుఁడు నిఖిలార్థసిద్ధిగాఁగ.
పాకశాలలు మఱియు లనేకవస్తు
పూరితాగారములు మఱి భోజనార్హ
సదనములు నాగహయరథసైన్యవాస
వేశ్మములుఁ గట్టఁబనుపుఁడు వేడుకలర. 110

ఆ. వె. చలువచప్పరములుఁ జలిపందిరులు నచ్చు
టుచటఁ బెట్టఁబంపుఁ డఖిలవస్తు
వర్గములను విపణిమార్గంబులను నమ్మఁ
డనుచు వైశ్యజనుల కాజ్ఞయిడుఁడు. 111

వ. అని మఱియొక్కయమాత్యోత్తముం గని యిట్లనియె. 112

సీ. మినుములు గోదుమల్ (సెనగలు న)లచంద
(లన్యంబులగు) కాయధాన్యములును
రమ్యతండులములు రాశిగాఁ బోయింపు.
దధిమధుఘృతములు తఱుచు కూర్పు.
(కాయగూరలును) శర్కర ఫలమ్ములుగూడ
చాల నిప్పటినుండి సంగ్రహింపు

(చమసముల్ మొదలైన సకలపాత్రలతోడ
యజ్ఞసాధనముల నమరిపింపు.)
వితరణార్థంబు (లును మఱి) శ్వేతఘురవి
రాజితములగు విమలహిరణ్యశృంగ
ములను జనరారునట్టి గోవులనుగూడ
వేగ (సిద్ధంబుసేయుము) వేలకొలంది. 113

ఉ పౌరులఁ జుట్టలం జెలులఁ బ్రాజ్ఞుల భృత్యుల నిష్టకాంతలన్
వారక యాశ్రితావళుల బాడబులన్ మఱి మానివర్యులన్
కూరిమి (నస్మదీయుకు) లగోత్రవరేణ్యుల వారిపత్నులన్
వారల పుత్రులన్ సఖులఁ బాయక యందఱ నిందుఁ దేఁదగున్. 114

కం. క్రతువునకై యే తెంచెడు
యతులకు నతిథులకు మఱి బుధాళికిఁ బూజల్
సతతము గావింపుము నీ
వతులశ్రద్ధాసహితుఁడవై (ధీసచివా !) 115

ఆ. వె. మఱియు స్రుక్స్రువాదిమఖ సాధనంబులు
సంగ్రహింపు మిపుడు సరవి బుత్త్వి
గాళి నిటకుఁ బిలుచి నంపుమా వేవేగ
వలయుపనుల కెల్ల వారి నిలుపు. 116

కం. అని పనుచుడు వారలు దన
అనుమతి గైకొనుచు మిగుల హర్షముతో న
ప్పను లెల్ల సంఘటించిన
కనుగొని రాజన్యుఁ డంతఁ గౌతుకమొప్పన్. 117

వ. ఉండుసమయంబునఁ గళింగ కాంభోజ కాశ్మీరాది దేశాధీశులును బులహ పులస్త్య వసిష్ఠ వాలఖిల్య విశ్వామిత్రాత్రేయాంగిరస వామదేవాది తాపసజనంబులును మఱి యనేకభూసురసంచయంబులు నొక్కుమ్మొగి నరుదేరె. అంత నారాజన్యుండు 118

శా. నానాభూములనుండి వచ్చు ధరణీనాథావళిన్ బంధులన్
మానివ్రాతములన్ ధరామరుల నేమంబొప్పఁగా నుజ్జ్వల
స్థానాభ్యంతరసీమలందు విడియించం బంచి భూకాంతుఁ డ
ప్డానందంబున మించె యాజకులు నెయ్యంబొప్పఁ గీర్తింపఁగన్. 119

వ. అప్పుడు. 120

ఇంకను నీక్షింపుఁడు.

సీ. వర్ణాశ్రమాచారవార్తయే యెఱుఁగని
ద్వీపాంతరస్థులు భూపులైరి.
ధర్మసూక్ష్మంబును దగ గ్రహింపఁగలేని
ధీరులు ధర్మాధికారులైరి.
పాశ్చాత్యనృపవేషభాషావలంబులై
వర్తించువా ర్దేశవాసులైరి.
స్వకులాభిమానంబు చాలినంతగ లేక
వెనుకంజవేయువా ర్విప్రులైరి.
కాన నేమన్న సాగెడి కాలమయ్యె
స్వర్ణకృ చ్చర్మకృ న్ముఖ్య జనుల కెల్ల.
ఏల సంకరు లనకుందు రింక వారు
బ్రాహ్మణులమని మిడికెడి వైదికులను. స్వ. తృ. భా. 48

తే. బ్రాహ్మ్యమన్నను దలనొప్పి బ్రాహ్మణులకు.
ఒందఁజూచుచునున్నవా రొరులు దాని.
బ్రాహ్మణుండయి పుట్టుటే ప్రథమకష్ట.
మందు వైదికుఁడై పుట్టు టధమ మిపుడు. 49

ఇట్లు ప్రభువుల దగ్గఱనుంచి పరామర్శించు పండితపత్రికాసంపాదకప్రభృతులు ప్రస్తావము వచ్చినప్పుడు పరులసంగతి పరిశీలించుటకు భయపడరు. కావునఁ గాపీహోటలు పెట్టుచున్నారనుటకే కట్టుదుము కొట్టుదుమని కడు గడబిడపెట్టు పిడుగురాళ్ళపుడమివేల్పు లీపై భూపాలకాదు లేఁక నన్నేమి చేయవలెనో యించుక యెఱిఁగింతురుగాక. లేదేని యేదో యైన దైనదని యాత్మీయార్ధత్య మఱచుకొననైన నఱచుకొందురుగాక. అఱచుకొనక యస్మదుపరి యగపఱచునది యంతయు వ్యర్థమనియుఁ బిడుగురాళ్ళరిగ్యులేషనులు పెద్దమనుష్యులమీఁదఁ బ్రయోగించుట సుద్దిగాదనియు సూచించుచున్నవాఁడను.

సూచించుటయే కాదు. ఇట్టియర్థమే స్ఫురించున ట్లెన్నడో యాదికాలము నాఁడే స్వస్త్రీయప్రేరితుఁడై తదుద్ధర్తకామతం దంటాలుపడుచు నస్మత్పక్ష మఱఁగఁ ద్రొక్కఁజూచు పిడుగురాళ్ళ సభాపతి సత్యనారాయణపేర జాబుగూడ వ్రాసినాఁడను. క్షమాపణయని దాని సర్వులకుఁ జదివి వినిపించుచుఁ జంకలుగొట్టుకొనుచున్నాఁడే కాని మహాపరాధము మత్కృతము, మన్నింపు మహారాజా యనియే యున్నదో కట్టుదుము కొట్టుదుమను ఘనులకుఁ గడుఁబ్రీడ గలిగింపఁదగినదిగా నున్నదో గర్భితార్థమును గ్రహింపఁజాలఁడు. క్షమింపుమను నక్కరము లున్నవనియే యనుకొందము. ఎక్కడ నాక్షమాపణ ? సాధుసన్నిధిని. శ్లో. ఋబ మర్గేన గృహీయాత్,

సాధు మంజలికర్మణా. అంజలి జోడించుటతోడనే యతఁ డభిమతమును బూరించును. ఇచట నేమైనది ? సపంక్తిభోజనాదివ్యవహారము నాతో జరుపవలదని సమీపగ్రామములకు సభాపతి పత్రికలు పంపెనఁట. నిన్న పంపిన పత్రికలకు నేఁడే ప్రతి పంపఁ గూడదఁట. ప్రత్యక్షముగనే పోయి నేను పాదములమీఁదఁ బడునాఁటికిఁ బర్యాలోచించునఁట. నాజాబుకుఁ జెప్పిపంపిన జవా బిది. ఈపాకను వేఱు. కానిండు. పడవలసి వచ్చుచోఁ బడుదును. పత్రికగనుకఁ బ్రవృత్తి ప్రకటీకృతము.

## —• స్యాలకుని పెండ్లికిఁగాఁ జినప్పయ్య నాతోఁ జెలిమిచేయుట •—

కథ కంచికిఁ బోయినది. రామాయణములోఁ బిడకలవేట్లాటవలెఁ జినప్పయ్య చరిత్రలోఁ జేబియ్యపుసోదరులు చేరవచ్చుటయు వారి చరిత్రమును వ్రాయవలసి వచ్చెను. ఇంతమాత్రమేకా దివ్వారి చరిత్ర. ఇంకను నెంతయో యున్నయది. కాని 'కథాపిఖిలు పాపానాం' ప్రకరణములోఁజేరిన కానిపోని ప్రసంగమగుట గ్రంథ విస్తరభీతిని గట్టిపెట్టి ప్రస్తుతాంశమును బరిగ్రహించుచున్నవాఁడను. ప్రస్తుతాంశము చినప్పయ్య బావమఱఁది పెండ్లి నిమిత్తము పరిపంథియైన నాతో సంధిఁజేసికొనుట. ఆ బావమఱఁదియే సోదరుల యందఱిలోను జ్యేష్ఠుఁడు. అతఁడు తలిదండ్రు లిరువురును దనువులు విడుచుటయుఁ దన పెండ్లి తానే చేసికొనవలసినవాఁడై యయ్యది సులభ సాధ్యము గాక యత్నములు కొన్ని గడపెను. అంతలో నదృష్టవశమునఁ బినతండ్రి తనువు విడుచుటయు నాయన యర్ధాంగి యాత్మానుకూల యగుటయు నావిడవద్ద నాడపిల్ల లిరువు రుండుటయుఁ దటస్థించెను. అగ్రమైన యాపినతండ్రిభార్య యాత్మజను బదులిచ్చి యతనివివాహము చేయుట కనుమతించుటయు బదులుపిల్లకొఱకు బావయుఁ దానును బర్యాలోచించుచు నాసమయమం దస్మత్పరిపాల్యమానయై యలరు నాడుపిల్లపై నత్తులు వఱపిరి.

ఆపిల్ల యస్మదాద్యపత్ని మేనమామకూఁతురు. మేనమామయు నాయన జాయయే యైన మేనయత్తయుఁ బదిపండ్రెండుదినములు వెనుకముందుగాఁ బరలోకగతులగుటయు వయసుచెల్లిన వారి తల్లి తత్సంతానచతుష్టయమును సాఁకలేక బిడ్డబిడ్డయైన నా పెండ్లమును బిలిచి పెంచిపెద్దఁజేయుమని యాఁడుబిడ్డ నొకరిత నంటగట్టెను. అంతకుమున్న త్యల్పకాలముననే యాపెండ్లము నాత్మజుఁడు మమ్ము వ్యథాసాగరమున ముంచిపోవుటచే వానికి మాఱుగా దీనిని బెంచఁగడఁగితిమి. వాని చొక్కా లిది తొడిగెను. వాని లాగు లిది కట్టెను. వాని చెప్పు లిది మెట్టెను. పెక్కేల ? వాఁడే యిదియై మూఁడునాలుగేండ్లు ముద్దులు చూపుటయు నింతలోఁ బెండ్లియీడు నేతెంచెను. యుక్తవరు నన్వేషించి యుద్వాహ మొనరింతమని యువ్విళ్ళూరితిమి. కాని దాని బదులిచ్చినఁ గాని తదగ్రజు వివాహము కానేరదని తదీయులు తమ యభిప్రాయము నివేదించిరి. చివరకు బావమఱఁదికి భవితవ్యయైన బదులుపిల్లఁగాఁ జినప్పయ్య కనుగొనియెను. ప్రప్రథమము బావమఱఁది ద్వారమునఁ నన్నుఁ బ్రశ్నించెను. అంతమాత్రమున నవ్వాంఛిత మీడేఱమి నాలోచించెను. ఆద్యపత్నియు నేనును నద్దాని పుట్టింటి కరుగుసమయము నన్వేషించెను. దానితండ్రి దీనికి మేనమామ. తల్లి మేనయత్త. మేనయత్త పెత్తల్లి. అంతయుఁ బీరకాయపీఁచు. అప్పటి కేనును

నాపేఁచులోనే దైక్యమైయుంటఁ బీఁచుఁ దయుఁ జెనవేసికొని నా యత్తగారియార్జైన వేమఁరములో విఁసియుండుట విని వీఁడు (చినప్పయ్య) విచ్చేయుటయు వేళకు వివాహము కావలసినపిల్ల యక్కమగఁడు కొత్త సుబ్బయ్యయుఁ జొత్తెంచెను. అవ్వా రందఱు నదివఱకే చినప్పయ్యచే నర్థింపఁబడి బదులిచ్చుట కంగీకరించియుఁ దత్కాల సంరక్షకుఁడనగు నాతలపైననే తత్కన్యావరనిశ్చయభారము నుంచియుండిరి. ఇష్టుఁడైన వరున కెవనికో యిచ్చి యేనుదినములు వివాహముచేయుట కే నిశ్చయించియుంటిని. అస్మత్క్రియమాణ తత్కార్య మన్న యప్పయ్య యగ్రాసనాధిపత్యముతో నలరార వలసియుండెను. అట్టి నన్నాపిల్ల మేనమామయాదిగాఁ గలుగు నందఱి యాలోచన తోను జినప్పయ్య చేరవచ్చి చిన్నగాఁ బ్రస్తావించెను.

అట్లాచినప్పయ్య యందఱిముందఱ నస్మ దంగీకృతి నర్థించుటయు నిందఱి కిష్టమైన యీకార్య మే నొక్కఁడ నాపిన నాఁగదని యంగీకరించుచు నస్మద్భ్రాత యప్పయ్యయుఁ జినప్పయ్యయు నన్యోన్యము శత్రువులు కావున శత్రువు బావమఱఁది కిచ్చి చేయు పెండ్లికి జ్యేష్ఠభ్రాత రాఁడనియు నాయన రాకుండ నణుమాత్రకార్యము నే నాచరింపననియు నంటిని. అందుపై నందఱును వివాహవ్యయ మీవు భరించి భవద్గృహమునఁ బచరింపకున్నను నీమనువున కిష్టపడినఁ జాలునని యెట్లో నాచేఁ దథాస్తనిపించిరి. ఇంతబలవంత పెట్టుటకు వీరిలో వేరును వేఱుమనువువిచారించు ధీరులు గాకునికిని గాని యీయనయే మన్మథవిగ్రహమని యెద నెంచి కాదు. అంత నాసన్న వివాహయగు నబ్బాలిక మనతో నేలయని యక్కడనే వదలిపెట్టి యవిముక్తక్షేత్ర యాత్ర నాచరింపనున్న దంపతుల మిరువురము దద్గ్రామమునుండి మాగ్రామమునకు మరలివచ్చితిమి. కాశికిం బ్రయాణము గావించితిమి. కాని యకస్మాదాగతాస్మదామయ నివృత్తికిఁగా నౌషధసేవఁజేయుచుఁ గొంతకాలము గుంటూరున నుండవలసివచ్చెను. పెరబందుగులచేఁ బెండ్లిప్రయత్నము చేయఁబడియెను. పిల్లకున్నను బిల్లను బెంచిన మమకారముచే నేమే యేగితిమి. అరిగిన తరువాతమాత్రము నందఱు నాదరముఁ జూపిరి. చినప్పయ్య స్నేహితుఁడే యైపోయెను. వేయేల? అది మొదలుకొని యన్నింటికి నాలోచనకర్తయే యతఁడయ్యెను. కన్యాదానము నాచేతనే కావింపించెను. తావన్మాత్రవ్యయమైనను దలఁదాల్పక దానముచేయుట తగవుకాదని కాసో వీసమో ఖర్చు భరించి కన్యాదానము గావించితిని. అయ్యది యస్మదగ్రజున కనభిమతము. అందువలననే యది మొదలు మనసిచ్చి మాటాడఁడు. అప్పుడే యవిముక్తక్షేత్రయాత్రయు నస్మదాచరితము. నాతియు నేనును నాలుగునెలలు యాత్ర లాచరించుచు పరికుప్పలు నుతిపించుట మొదలగువానిఁగూర్చి మనసిచ్చిమాటాడని మద్భ్రాతకుఁ గాక పెంపుడుబిడ్డ పెనిమిటికిని బ్రియుఁడైన చినప్పయ్యకును గమ్మ వ్రాసితిని. తత్పూర్వము తానే చేయించువాఁడగుట నన్నయే యాపనులు చేయింప యత్నించుచుండుటయు నప్పుడప్పుడే తలవెళ్ళఁబెట్టుచున్న చినప్పయ్య జ్యేష్ఠుఁడును జినప్పయ్యయు నగ్రజునకును నాకును గలిగియున్న యణుమాత్రభేదభావమునే యభివృద్ధిచేయుటకుఁగా నస్మల్లిఖిత లేఖఁ గనఁబఱచి యపలఁడజేసిరి. అట్లు క్రమక్రమముగా నాయనకును నాకును గల యన్యోన్యప్రేమ నంతరింపఁజేయుచుఁ దండ్రికొడుకు లిరువురు బద్ధస్నేహులవలెఁ బ్రవర్తిల్లిరి.

తన్నెఱిఁగినంతవఱకు తత్తాత్పర్యములలో భ్రాత కపకారముగూడఁ బచరించితిని. ఆయాసము చేయించుటయే కాక స్నేహితులుగానుండి నాకును నపకారము గావించిరి. ఆంతరంగికస్నేహితులను భావముతో ననేకులు ప్రబోధించినను నపకారములని యెను కొనక నాపనులు నేనే చెఱచుకొంటిని. వీండ్ర పడమటిమిద్దె గూనలు రెండు మా వాకిటిలోనికిఁ బెట్టుటకు మాతండ్రి యెన్నఁడో సమ్మతించెను. పదపడి కొన్నాళ్ళకుఁ బడమటిమిద్దెమీఁదివే కాక వంటయిద్దెలువేసి వానిమీఁదినీళ్ళును వచ్చి మావాకిటిలోనే పడునట్లు కావించిరి. అటుతరువాత నామిద్దె లన్న సుబ్బయ్యభాగమునఁ బోవుటయుఁ గొంతకాలము కూలిపోయియే యుండెను. క్రమ్మఱఁగ్రయించికొని వానినే వీరు కట్టించిరి. ఆకట్టించుటలో మునుపటివలె వంటయిద్దెదగ్గఱనుంచియే కాక దాని కావలనున్న తమ స్థల మంతటను మిద్దెవేసి యక్కడినుండి వచ్చు నీళ్ళతోఁగూడ నస్మద్గృహము ముందఱ వచ్చి పడున ట్లాచరించిరి. అప్పు డాటంకపెట్టుమని యనేకులు చెప్పిరికాని చినప్పయ్యతోడి చెలిమి చేయనిచ్చినది కాదు. అన్నకన్న నతఁడే యత్యాప్తుఁడని యనుకొంటిని. పెంటమన్నుఁ బోసికొనుటకుఁగూడ బెత్తెఁడు స్థలము లేక యింటిముందఱనే పోసికొనుచు నెక్కడనేని యింత స్థల మిప్పింపుఁడని యవ్వారినే యాశ్రయించితిని. వారును నక్కడక్కడ నారయుచుండిరి. ఆసంగతి విని యాతుకూరి వెంకన్నయను నర్యుఁ డస్మదంతికమున కరుదెంచి యాత్మీయమైన దొడ్డి 60 రూపాయల కిత్తుఁ గొనుమనియెను. అది నా యింటికంటెను జినప్పయ్యయింటికే చేరువ నున్నయది. కనుకనే క్రయించుకొనుటకు వారు కాచియుండిరి. కాని యంతయో యింతయో యతనికిఁ బెట్టిన యప్పు ప్రతిఫలముగా హరింపనుండుటయు విదిత తదభిప్రాయుఁడై వెంకన్న వేఱుత్రోవను వెళ్ళఁదలఁచెను. నేను మైత్రి చెడునని మావాండ్రకే యిమ్మంటిని. పరకయో పాతికయో యైన ప్రాంతబాకిక్రింద బహుమూల్యమయిన దొడ్డిని బ్రాహ్మణుఁడు బలిమిమై హరింపనున్నవాఁడుగాన నాయన కీయననియు నీవు తీసికొనకున్న నేరికేని యీ నంటిననియు వెంకన్న వివరించుటయు మంచిదని యేనే సంచకరు విచ్చితిని. విక్రయపత్రమును రిజిస్టరు చేయించుకొనుటకు వెళ్ళుచుంటిని. ఇంతలో నెచ్చటినుండియో వచ్చి చినప్పయ్య జ్యేష్ఠుఁడు దొడ్డి మాకే యీకున్న నీ కేవిపత్తో తెచ్చిపెట్టెదనని యెంతయు భయపెట్టుటయు వెంకన్న వంకరత్రోవ పట్టెను. పెంటదిబ్బకు స్థలములేక పెక్కుతంటాలు పడుచుంటినిగాన నిప్పింపుము రా యీస్థలము నాకని యెంతచెప్పుకొన్నను జినప్పయ్యజ్యేష్ఠుఁడు కనికరింపక పెంటకు నీకు లేకుంటే నింటికి మాకు లేదు కావున నెవరియక్కఱ వారిదే యేగుమని యెను. ఇక్కడి కీతని హితవర్తన మెఱుఁగనయ్యెను. విశ్వప్రయత్నము చేసినను వెంకన్నకూడ వశుఁడు కాకపోయెను. తరువాత దావావేసి వేరికెని విక్రయింపకుండ నీదొడ్డి కింజంక్షను చేయించితిని. చినప్పయ్య జ్యేష్ఠునిచరిత మెఱుఁగనివాఁడుంబోలె నీస్వల్పవిషయమున కింతపనిచేయవలెనా యనియుఁ బెదనాయనకటరా మన పైపోటి యని పిల్లవానిఁ గోపగించితి ననియుఁ బెక్కులు చెప్పియుఁ జెప్పినట్లు చేయక చెడుగునే చేయఁగడఁగుటయుఁ జీయనిపించి జిహ్మగస్నేహసదృశమగు చినప్పయ్యతోడి సఖ్యమును జిన్నగా జాఱవిడిచితిని.

# అభినవసరస్వతి.

సంపుటము ౩౧ | ప్రమాది నామసంవత్సరము ఆషాఢమాసము. | సంచిక ౪

## కృతివిమర్శము

కిన్నెర — ఇది బూర్గుంపాటి యాంధ్రవాఙ్మయసేవాసమితి యుగాది కానుక. ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక మొదలైనవానివలె నిదియు ననేకవిషయములతో నలరారుచు ననేకుల హృదయముల నాకర్షింపఁగలిగియున్నది. వకీలు గొట్టుపర్తి సుబ్బారావు మున్నగు వారిచే నిల్లిందలపాటిలో నేఁటేట జరుపఁబడు త్యాగరాయోత్సవములలోఁ గేవల గాయకసమ్మేళనమే కాక కవిసమ్మేళనముఁగూడఁ గావించుచు బూర్గుంపాటి యాంధ్రవాఙ్మయసేవాసమితి కవితాభివృద్ధికిఁ గారకమగుచున్నది. మఱియు నీ సమితి సారస్వతాభివృద్ధికి వలయు గ్రంథములను జాల సంపాదించుచున్నది. పత్రికలను దెప్పించుచున్నది. అస్మదాదులము ప్రతిఫలము కోరకయే పత్రికలను గ్రంథములను బంపుచున్నవారము. ఆంధ్రత్వమునుగూర్చిన యభిమానముతో నీయుగాదికానుకలో ననేకవ్యాసములుఁ బద్యములుఁ బ్రకటితములు. ఒక్క యాంధ్రత్వమును గూర్చియే కాక ప్రాచీనశాసనములఁగూర్చియుఁ బెక్కు వ్యాసములు గలవు. సంఘమునను నీతిని గఱపువిషయములు చాల నున్నయవి. పూర్వకవుల చరిత్రలును గరము ప్రచురింపఁబడినవి. సంగీతవిషయములుగూడ నిందుఁ జక్కగాఁ జర్చింపఁబడినవి. శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారు శేషాద్రి వెంకటరమణకవులు శ్రీపతి త్ర్యంబకరావుగారు మొదలగు కవు లీయాంధ్రవాఙ్మయసేవాసమితిపై సదభిప్రాయము లిచ్చియున్నారు. ఇట్టి యుగాదికానుకనుండి యాంధ్రత్వమునుగూర్చిన యపరిత్యాజ్యవిషయ మొక కొంత యథాప్రకటీక్రియమాణము.

“ వైయాకరణులలో, కవులలో, ఆంధ్రుల నామములే విశేషించి కానఁబడు. పండితరాజబిరుదాంకితుఁడు డిల్లీసామ్రాజ్యాస్థానకవి జగన్నాథపండితుఁ డాంధ్రుఁడు. ఉత్తరరామచరిత్ర గ్రంథకర్త భవభూతి|కృష్ణకర్ణామృతకర్త లీలాశుకుడు లీలాతరంగిణిని బాడినట్టి నారాయణతీర్థులు నాంధ్రులే. రాజులు మంత్రులు సేనానాయకులు రాజప్రతినిధులు విద్వాంసులై కవీంద్రులై యాంధ్రవాఙ్మయమును బలువిధముల వర్ధిల్లఁ జేసిరి. శ్రీకృష్ణదేవరాయ విద్వత్కవిచక్రవర్తి తన యష్టదిగ్గజముల కవితాప్రతిభతో నాంధ్రసరస్వతికి సర్వసంపదల సమకూర్చి దేశభాషలందుఁ దెలుఁగు లెస్సగఁ దాండవింపఁజేసెను. కీర్తనలు పాడి వాసికెక్కినవారిలోఁ ద్యాగరాజు కీర్తనీయుఁడు. మహాభక్తుఁడు. ఈయన కృతు లాంధ్రులకే కాక దక్షిణదేశస్థుల కెల్లరకు నాదరణీయములైనవి. గానమున కాంధ్రమువలె మృదుమధురమయినది మఱియొకటి లేదు. అందు

చేత నే యభీష్టమున్నను లేకున్నను సద్గ్రహణ మైనను గాకున్నను దాక్షిణాత్యులు మన యాంధ్రకృతులను బూజించుట తప్పనిసరియయ్యెను.

సీ. తమ ప్రతాపాగ్ని కెంతయు వైరినికరమ్ము
లోలిఁ జాలిన యింధనాళిగాఁగ
తమ ఖడ్గకేళి కాతతగర్వధూర్వహ
ధాటు లెన్నఁగ సర్పకోటిగాఁగ
తమ భవ్యకీర్తిచంద్రమునకు సత్కవి
శ్రేణి చకోరసుస్థితులుగాఁగ
తన యానమేర శుద్ధతరాజలోకమ్ము
పరఁగ నీరాకరసరణిగాఁగ
కరము నిష్కంటకము నిరాఘాటధాటి
నవనిఁ బాలించి దివి కేగినట్టి ధైర్య
శౌర్యమంధాద్రులగుచు నవార్యభూతి
వెలయు మాయాంధ్రనృపుల నిర్వేలతుష్టి
మదిని స్మరియింతు నెంతు నమస్కరింతు.

సీ. వెలయించినారు దిగ్విజయంబు నేసి యా
శాంగణమ్ముల జయస్తంభములను
భరియించినారు దుర్భర ముష్కరుల నొంచి
అఖిలాంధ్రభూభార మక్కజముగ.
విలిఖించినారు సద్విమలశయ్యాకళల్
వెలయంగ సత్కావ్యవిశ్రుతులను.
అలరించినారు విద్యామానసద్బుధ
ప్రకరంబులకుఁ జాల వసతు లిచ్చి.
కరము నిష్కంటకము నిరాఘాటధాటి
నవనిఁ బాలించి దివి కేగినట్టి ధైర్య
శౌర్యమంధాద్రులౌచు నవార్యభూతి
వెలయు మాయాంధ్రనృపుల నిర్వేలతుష్టి
మదిని స్మరియింతు నెంతు నమస్కరింతు.

## —♦ సనాతనధార్మికుల విజ్ఞప్తి ♦—

(అఖిలభారతవర్షీయ వర్ణాశ్రమస్వరాజ్యసంఘపండిత పరిషదుపాధ్యక్షులును నాంధ్రరాష్ట్రీయ పండితపరిష దధ్యక్షులును నగు పండితప్రవర మల్లాది రామకృష్ణచయనులుగారు)

పరభణి హిందువులు నిజామ్‌ప్రభుత్వమతశాఖామంత్రిగారికి హిందూమతసంరక్షణార్థము 14 సూచనలతో నొక జ్ఞాపనము పంపినట్లు దివ్యవాణియందుఁ బ్రకటింపఁబడినది. అందుఁ జాలభాగములు వైదికమహాజనమున కనుకూలము గలవు. కాని డాక్టరు కుర్తుకోటిగారిని హిందూమతశాఖకుఁ గంట్రోల్ జనరల్‌గా నుంచుటకును సర్వాధికారము లొసంగుటకును నొకవిజ్ఞప్తి కలదు. ఇది శ్రుతిస్మృతిప్రమాణములుగా నమ్మెడి హిందూమహాజనమునకుఁ గేవల మసమ్మతము. విరుద్ధము. ఆకుర్తుకోటి హిందువులలోను మహమ్మదీయులలోను మఱి యేమతములోను జేరని యార్యసమాజమును దయానందభ్రాంతికల్పితమైన మత మవలంబించినవారికి మాన్యుఁడు కావచ్చును. ఈయన విదేశీయకన్య నిందూరుమహారాజునకు వివాహము చేయించెను. ఇట్టి యకార్యములంబట్టి సుప్రసిద్ధపీఠాధ్యక్షులచేతను నఖిలభారతవర్షీయవర్ణాశ్రమస్వరాజ్యసంఘము చేతను వీరు బహిష్కృతులు. ఆర్యసమాజము సనాతనధార్మికపండితగ్రాహ్యము కాదు. కనుక వారి కీయధికారము కూడదు. ఇదివఱ కనాదికాలమునుంచి విరాజమానములైన శృంగగిరి విరూపాక్ష పుష్పగిర్యాది పీఠములకును శ్రీవైష్ణవ మాధ్వ వల్లభపీఠములకును దత్తన్మతస్థప్రజలపై ధర్మనిర్ణయాధికార ముంచవలెనని యాప్రార్థనలో సవరణ యుండితీరవలెనని విన్నవించుచున్నవాఁడను.

---

## —♦ హైదరాబాదులోని పూర్వోత్తరకాలవిశేషములు ♦—

(మల్లాది రామకృష్ణవిద్వచ్ఛయనులవారు)

నాకు 75 సం॥ ల వయస్సు. బాల్యమున 7 నుంచి 14 సం॥ వఱకు నే నానగరమున మల్లాది లక్ష్మీనారాయణ(లక్ష్మీరావు) గారను ప్రసిద్ధిఁజెందిన యొక యుద్యోగస్థునకుఁ దత్తపుత్రుఁడనైనందున శాలిబండపై ఠూప్‌లాలుబజారులో మాగృహమున నుండుట ఘటించెను. అప్పుడు నేనెఱిఁగిన యీ నగరి స్థితి జ్ఞప్తికి వచ్చినప్పు డిప్పటిదాని కాశ్చర్యముగాఁగలదు. నాచరిత్రముగూడ విస్తీర్ణము. దాని నిరూపించుటగాదు నాయుద్దేశము. నాకుఁ జిన్నవయస్సునఁగూడ నప్పటి లోకజ్ఞానము కొంత కలదు. అప్పు డిప్పటి పాదుషాగారి తండ్రిగారికి బాల్యావస్థ. సర్‌సాలార్‌జంగుగారు సర్వాధికారియగు మహామంత్రి. ఆయన హిందువులయందును దురకలయందును సమదృష్టిగల మహాపురుషుఁడు. సైనికోద్యోగములందును బోలీసుశాఖయందును గొప్పయుద్యోగములను మహమ్మదీయుల కిచ్చి వారి యాదరణకుఁ బాత్రుఁడైయుండెను. రెవిన్యూ సివిల్ మాలదాలతుద్యోగముల హిందువులకే యిప్పించెడివాఁడు. వారిలోను బుద్ధిజాతికి సంబంధించిన పనులకు బ్రాహ్మణుఁడుదక్క నితరు లర్హులు కారనుసంగతియం దాయనకు దృఢ

ముగా నమ్మకము. కనుకఁ బ్రస్తావమువచ్చినపుడు కత్తికిఁ దురక, కలమునకుఁ బ్రాహ్మణుఁడు నర్హుఁడని చెప్పెడివాఁడు. ఆకాలమునఁ ద్రిమతస్థులలోను. పెద్ద యుద్యోగస్థులుండెడివారు. దివాన్ శంకరరావుగారు కార్ద్వాసా కృష్ణాజీనాయక్ గారు మొదలగువారు ప్రతిమాసము రెండువేలకుఁ బైఁగా వేతనము గ్రహించెడివారు. వీరు స్మార్తబ్రాహ్మణులు. ఆస్తికోత్తములు. మహాదాతలు. కొంపల్లి రామచంద్రరావు వల్వల నరసింగరావు మొదలగువారలు శ్రీవైష్ణవ మతస్థులు. వీరును గొప్పయుద్యోగములలో నుండెడివారు. ధార్మికులు. బెల్లపురవ్వల హనుమంతరావుగారు స్వామిరావుగారు గురుభీమరావు మొదలగువారలకాండెంటుజనరల్ సదర్ మహాసబీ సుబేదా రవ్వల్ తాలూకాదారు పదవులలో నుండెడివారు. వీరును ఖ్యాతిఁజెందిన ధార్మికులు. వీరి నాశ్రయించి త్రిమతస్థులలోను విశ్వవిఖ్యాతులగుపండితులు 300 కుఁ బైఁగా హైదరాబాదులో నెల్లపుడునుండెడివారు.

ఇతరప్రాంతములనుండి పండితు లొకరు సత్కరింపఁబడి వెళ్ళిన యనంతరము మఱియొకరు వచ్చుచుండెడివారలు. దివాకరుని పద్మనాభ శాస్త్రిగారు, ఉమ్మెడ రామచంద్రశాస్త్రులుగారు సంగనభట్ల నరహరి శ్రౌతులుగారు మొదలగువా రాయా శాస్త్రములందును వేదములందు నాఱితేఱినవారు. వీరు స్వదేశస్థులు. ఇటులనే కాంచీ విద్వచ్ఛ్రీనివాసాచార్య ప్రభృతులు శ్రీవైష్ణవులలోను మాధ్వులలో నానందతీర్థాచార్య స్వామిరాయాచార్యప్రభృతులు మహాపండితు లుండెడివారు. సామాన్యముగ జీవనార్థము దేశాంతరములనుండి వచ్చిన బ్రాహ్మణులు 2 వేలకు మించియుండెడివారలు. మహారాష్ట్రబ్రాహ్మణులలోను ఖాయతీ ఖత్రీలలోను గొప్పయుద్యోగస్థు లుండెడివారలు. వీరందఱు దేవబ్రాహ్మణభక్తిగలవారలు. దాతలు. సర్వసాధారణముగా మానిసికి 1కి రు1 సంభావన యిచ్చెడివారలు. మాసమునకు 3, 4 భూరిసమారాధనలు జరుగుచుండెడివి. తురుష్కులకు హిందువులకుఁ గలహముల ప్రసక్తియే లేదు. ఎవరి పనులను వారు నూచుకొనుచు నన్యోన్యసఖ్యముతో శాంతముగాఁ గాలము గడుపుచుండెడివారు. చారుమినారావద్ద 10 నిమిషములు నిలువఁబడి చూచినచో 4 వీధులనుంచి యేనుఁగులు గుఱ్ఱములు గుంపులుగా వానిపనులమీఁద వచ్చిపోవుచుండుటయు నేత్రానందకరముగా నుండెడిది. భాగ్యనగరమను పేరు సార్థకముగా నుండెడిది. పీర్ల పండుగ 5 వ తారీఖున లంగరను సేనాసందర్శనోత్సవము జరిగెడిది. పగలు 9 గంటలు మొదలు రాత్రి 9 గంటల వఱకు నవిచ్ఛిన్నముగాఁ జతురంగబలము దివాన్ దేవిడి మొదలుకొని పేష్కారు దేవిడి హుజూరు దేవిడీలలో హాజరిచ్చి వెళ్ళుచుండెడిది. 10 సం॥ ల క్రింద నొకపర్యాయము తిరిగి లంగరుఁ జూచితిని. దీనికంటెఁ బదిరెట్లు హెచ్చుసైన్యము వెనుకటికాలములో నున్నట్లు తోఁచినది. ఉద్యోగస్థులు మ్యానాలమీఁదను 2 గుఱ్ఱముల సార్టులమీఁదను వారివారి యుపపత్తినిబట్టి వెళ్ళుచుండెడివారు. ఏవీధిని జూచినను నానావిధాయుధధారి భటులు వందలకొలఁది నడచుచుండెడివారు.

సుమారు పదివేల బోయీలకు జీవనము కలిగియుండెడిది. పాదుషాగారు సం॥ కు 1, 2 పర్యాయములు ఖప్ప రురుసు మొదలగువానిమూలమున శోభాయాత్ర చేయుచుండెడివారు. అపుడు వారి సవారి వెనుకను ముందును జతురంగబలము లసంఖ్యాములుగా నుండెడివి. ప్రభువుగా రంబారిమీఁదఁ గూర్చుండెడివారు. అట్టిప్రభువుకు

రాజభక్తిచేఁ బ్రజ లందఱు సలాములు చేసెడివారు. బ్రాహ్మణు లాశీర్వదించెడివారు. వేయేల? ఆదినములలో నిజామురాజ్యము ధర్మరాజ్యముగా నుండి యితరదేశస్థులైన యాస్తికుల జీవనాధారమై యుండెను. ఇతరఖండముల వస్తువుల వాడుక చాల తఱుఁగు. పెన్సల్, అగ్గిపెట్టె లద్భుతముగా నెంచఁబడెడివి. ఇయ్యవి యాకాలమందలి గుణములు. కాని మఱుఁగుదొడ్లను బ్రతిదినముఁ దుడిపించుపనిమాత్రము చాల నసహ్యముగా నుండెడిది. పురజనులు మలకూపములను గట్టించి ప్రతిదినము దానిలోనికి బోవువారు. సం॥ కొక్కసారియో 2 సారులో యెత్తివేయించెడివారు. రోడ్లు శుభ్రముగా నుండెడివి కావు. పల్లెటూళ్ళనుండి వచ్చినవారికి నగరనివాసము నరకప్రాయముగా నుండెడిది. కొళాయిలు లేవు. మీరాలము చెఱువునుంచి కాలువలు పురమధ్యమునుంచి పోవుచుండెడివి. వానికి మధ్యమధ్య హౌజులుఁ జిన్నబావులు నేర్పాటుచేసి దాని యుదకము నుపయోగించెడివారు. వాడుకనీటికిఁ బురమంతటఁ జేఁదుడుబావులు. ఆర్యసమాజము బ్రహ్మసమాజము దివ్యజ్ఞానసమాజము మొదలగు ధర్మవిధ్వంసకములగు నాధునికమతముల నామముల నేజను లెఱుంగరు. మహమ్మదీయులకు హిందువులకు దుర్బోధలు చేసియు నుద్యోగప్రదానాద్యాశలను గల్పించియుఁ దమ మతములోనికిఁ జేర్చుకొనవలెననియెడి దురభ్యాస మప్పటి కంకురించలేదు. ఆకాలమునఁ బూటకూళ్ళ యిండ్లు లేవు. పనిగలవా రక్కడక్కడ బసలుచేసి వండుకొని తినెడివారు. ఇది పూర్వకాలపు స్థితి.

4 సం॥ ల క్రిందఁ దిరిగి యొకసారి హైదరాబాదు పోవుట ఘటించినది. పూర్వపు స్థితికిని నిప్పటి స్థితికిని హస్తిమశకాంతరము గలదు. పూర్వము కృతయుగముగా నుండెడిది. ఇప్పుడు కలిపురుషుని విజృంభణమైనది.

హైదరాబాదులోఁ బరిచితుఁ డుండినఁ దప్ప బ్రాహ్మణునకు నిరభ్యంతరముగా నొకపూటయైన భోజనముఁ బెట్టు సద్గృహస్థుఁడు లేఁడనిన నత్యుక్తిగాదు. సమదృష్టి సన్నగిలి జాత్యభిమానము హెచ్చినందునఁ బెద్దయుద్యోగములను మహమ్మదీయులకే తప్ప హిందువుల కిచ్చుటయే లేదు. ఏకొందఱో హిందువులు గొప్పపదవులలోనున్నను వారు తఱుచుగా నార్యసామాజికులు. తురకలు హిందువులను దమ మతములోఁ జేర్చుకొనుచున్నారను నసూయతోఁ దురకలను హిందువులఁ జేయనెంచుట పంచములను గ్రమక్రమముగా బ్రాహ్మణులఁ జేయనెంచుట జన్మలనుబట్టి జాతి వచ్చునను వైదికసిద్ధాంతము నంగీకరించకపోవుట మంత్రభాగమే వేదమనుట బ్రాహ్మణము స్మృతిపురాణములు నప్రమాణములని వాదించుట శ్రుతివిహితములైన యజ్ఞములను నిందించుట శ్రుతిస్మృతిపురాణవిహితమగు విగ్రహారాధనను నిరసించుట మొదలగు సనాతనధర్మధ్వంసకములగు సిద్ధాంతములనుబట్టి యీమతము నిస్సారమగుటయే కాక లోకమునకు దినదినము నవినీతినిగఱపుచు ననర్థదాయకమగుటవలన నేసనాతనధర్మపరుఁడును వాండ్ర యింటికి భోజనమునకుఁ బోఁడు. సామాన్యముగా నీదేశములోనివా రందఱు సనాతనధర్మావలంబకులే. ఆర్యసామాజికుఁడు శ్రాద్ధముఁ బెట్టఁడు. యజ్ఞములను జేయఁడు. పరలోకమందు నమ్మకములేనందున సాత్త్వికదానము శూన్యము. రామకృష్ణశివాది నామోచ్చారణ తత్పూజాదులవలనఁ గృతార్థులగుటకు వానియందు వీరికి విశ్వాసము

లేదు. కనుక హైదరాబాదు యొక్క చిరార్జితమగు ధార్మికఖ్యాతిని ధ్వంసముఁజేయుట కీయార్యసమాజ మగ్రస్థాన మలంకరించినది. సర్వతంత్రస్వతంత్రులగు నచ్యుతస్వామి వారు దండిస్వామివారు సిద్ధిఁబొందిన యనంతర మీయార్యసమాజమును ఖండించు పండితుల నాదరించువారు లేనందున నట్టి మహాపండితుల ప్రచార మీప్రాంతములఁ దగ్గినది. సామాన్య ప్రజలు వివేకశూన్యులై నందునను దురోభ్యగలవలనఁ దమకు బ్రాహ్మణ్యము కొన్ని నెలలలోనే వచ్చునను నాశచేతను దినదినమున కాసంఖ్య హెచ్చుచున్నది. పూర్వము శ్రీ శంకర రామానుజ మధ్వపీఠాధ్యక్షులకు స్వశిష్యులకుఁ బ్రాయశ్చిత్తాదుల నొసంగుటకును దుర్మతములలోఁ జేరకుండఁ గాపాడుటకును నిజాము రాజ్యమున సర్వాధికార ముండెడిది. అదియు వీరిమూలముననే శిథిలమగుచున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయము తురుష్కుల విద్యాభివృద్ధితోపాటు హిందూమతద్వేషమును బురికొల్పుచున్నదని కొందఱి తలంపు. మోటర్ల మూలమున దినదినముఁ గోట్లకొలఁది ధనము విదేశగతమైనది. అగుచున్నది. ఇప్పుడు నగరములోని కేనుఁగులు వచ్చుటకే వీలులేదు. రెండు గుఱ్ఱముల సార్టులు నామావశిష్టములు. మ్యానాల వార్తయే లేదు. బోయీలయొక్కయు జాతీయములగు గుఱ్ఱములయొక్కయు జీవనము మంటఁగలసినది. పాదుషాగారు ప్రతి దినము సవారి చేయుదురుకాని మోటరువేగమువలన వారి రూపరేఖావిలాసములను ఫోటోగ్రాఫులోనే చూడవలెనుగాని మఱియొకత్రోవ కాన్పించదు. ప్రజల నానందింపఁజేయుటకై తన వైభవముతోఁ బ్రభువు సం॥ కొకసారియైనను బయలువెడలుట లేనందున వారినిజూచి యానందించు భాగ్యము ప్రజలకుఁగాని వీరి నానందింపఁజేసి ప్రజానురాగమును వెల్లడించు సంకల్పము ప్రభువుకుఁగాని యేమాత్రము లేదు. మసీదులు కట్టించుటకుఁ దత్క్షణమే యుత్తరువు వచ్చును. హిందూదేవస్థానములు కట్టుకొనుటకుఁగాని యుత్సవములు చేసికొనుటకుఁగాని విశ్వప్రయత్నములు చేసినను సంభవించుట కష్టము. తానేమతమువాఁడైనను దన ప్రజలు తన పిల్లలవంటివారు. వారికి నమ్మకము గల ప్రాచీనమతములో ననాదిసిద్ధములగు సదాచారముల కేయభ్యంతరము లేకుండఁ బరిపాలించుట ధార్మికులగు రాజుల కవశ్యకర్తవ్యము. పూర్వమం దట్లే జరిగినందున మతకలహములు లేక దేశము శాంతముగా నుండెడిది. ఇప్పటి ప్రభువుగారు రాజనీతి కుశలులనియు మహమ్మదీయసిద్ధాంతమందు గొప్పవిశ్వాసము కలవారలనియు ఖ్యాతి. పట్టణము పరిశుభ్రముగానుంచుటయు గొప్పనిర్మాణములు చేయించుటయు రాష్ట్రములోని జలము వ్యర్థముగాఁ బోకుండఁ జెఱువులు బాగుచేయించుటయు వీరి ఘనతకుఁ దార్కాణములు. స్వదేశస్థులైన హిందువుల సనాతనధర్మమునకుఁగూడ నిప్పటికంటె హెచ్చుసౌకర్యము కల్పించి లోకస్తుతిపాత్రులగుటకై ప్రజ లాశించుచున్నవారలు.

పూర్వముకంటెఁ బ్రస్తుతము నాగరికతాసౌకర్యములు హెచ్చినవి. ఇది నిజమే. దీని ఫలితము. ప్రజలు నిర్వీర్యు లగుటయు నారోగ్యహీను లగుటయు నిర్ధనులగుటయు దుర్వ్యసనాసక్తు లగుటయుఁ బేపర్ల పఠనమూలమున దురాచారులు స్వేచ్ఛాచారులు నగుటయు లక్షల జనులకు జీవనసాధనములైన చేతిపనులు వందలజనులతోనే నెరవేర్పఁ దగిన గిర్నీలమూలమున జనుల సుఖజీవనమునకు భంగము గలుగుటయు, మతద్రోహు లగుటయు. ఇట్టిఫలములు ప్రత్యక్షసిద్ధములు. యంత్రములు కొనుటమూలమున దేశీయ

సువర్ణరజతములు ప్రతిదినముఁ బ్రవాహరూపముగా ద్వీపాంతరగతము లగుచున్నవి. ఇనుపముక్కలు సీసాపెంకులు మనదేశమునకుఁ బ్రతిఫలముగా వచ్చుచున్నవి. నాగరికత యనఁగా జ్యేష్ఠాదేవి జెండాయని విజ్ఞుల తలంపు. నిజాము రాష్ట్రమున సనాతన ధార్మికుల కాదరము హెచ్చుటకును దుర్మతములు నిర్మూలనగుటకును బురాతనమతములలో నెవరిశాస్త్ర మెవరి కెట్లు చెప్పెనో యట్లు వర్తించి పరస్పరసఖ్యముతో లోకకల్యాణ మొనఁగూర్చుటకును మానవశక్తి చాలదు. సర్వశక్తులుగల పరమేశ్వరుని ధర్మసంరక్షణము సేయుటకుఁ బ్రార్థించుచున్నవాఁడను. ఏమతము లెట్టివైనను ప్రజాస్వాతంత్ర్యము రాజకీయనిర్బంధమూలమున నష్టపడకుండుటకై యత్నించుటలోఁ బ్రజలలో నెవరికిని భిన్నాభిప్రాయము లేదు. పరైస్తు కలహే ప్రాప్తే వయం పంచోత్తరం శతమను న్యాయ మిట శరణ్యము.

---

## పీఠాధిపతులకు విజ్ఞాపన

ధర్మాచార్యులారా !

ధార్మికుల కేమిగతి? అధోగతియేనా? కాక మఱేమి? ఒక వంక శారదాయాక్టు. ఒకమూల దేవాలయప్రవేశపు బిల్లు. ఒకవైపు వివాహవిచ్ఛేదపు బిల్లు. ఒకచాయ స్త్రీస్వాతంత్ర్యపు బిల్లు. పలుతెఱఁగులఁ బలు దుశ్శాసనము లిట్లు ధార్మికులను బాధపెట్టుచుండెనుగదా! వీనింగూర్చి మీరు చాలినంత పని చేసితిరా? మీ ప్రతినిధుల ముఖమునఁ జేయించితిరా? వారి బాధలను దొలఁగించితిరా? లేదుకదా! లేనప్పుడు వారి కధోగతి గాక మఱేమిగాఁగలదు? ... ధర్మరక్షణము గావించుటకే కదా మిమ్ముల జగద్గురుపీఠములం దధిష్ఠింపఁజేసినది? ... ఈపీఠముల నిర్మింపఁజేసిన శ్రీ శంకరాచార్యులవారు వేదమత పునరుద్ధరణకే యెట్టియిక్కట్టుల పాలయ్యెను? ఈదేశమనియు నాదేశమనియు నీయూరనియు నాయూరనియు దూరమనియు దగ్గఱనియు నెంచక యెండ యనక వాన యనక ... తిరిగి తిరిగి పండితులను పామరులను బ్రార్థివులను వాదమునందు ... జయించి స్వాధీనులఁ జేసికొనలేదా? మీ రట్లు చేయుట కేల ప్రయత్నింపరు? ఆనాటికంటె నీనాఁడు దిట్టలగు పండితు లుండిరా? ... అప్పటి కంటె నిప్పటి మతము బలిష్ఠమైనదా? ... ఇఁక మీరేల యాలసించెదరు? విపక్షపక్షము నేల స్వాధీనముఁ జేయఁ బ్రయత్నింపరు? ... ధర్మరక్షణము గావించి ధార్మికుల బాధ యేల తొలఁగింపరు? మీ యాస్థానపండితుల ద్వారమున ధర్మప్రచారము నేల చేయింపరు? ... ధర్మనిందకులకుఁ దగినసమాధానములను జెప్పుటకుఁ దగిన సామర్థ్యము శిష్యులకుఁ గలిగింప శిక్షణశాలల నేల యేర్పఱుపరు? ... ప్రభువులకు మా ... ధర్మాచారము లితరుల కెంతమాత్రము తెలియవు కనుక వారికిఁ బ్రవేశ ముండరాదని యేల చెప్పరు? ... ధర్మప్రచారము ... చేయుటకు ... పత్రికల నేల స్థాపింపరు? ఇతరులఁ బ్రోత్సహించియైనను నేల స్థాపింపఁజేయరు? ... ప్రస్తుతమున నొకపని సాధించుటకు ... పత్రిక లవసరములని తెలిసినవిషయమే కదా! త్యాగ మొనర్చియే కదా కాంగ్రెసువా రింతప్రతిష్ఠకు వచ్చినది?

"త్యాగే నైకే నామృతత్వ మానశుః" అనెడి సూక్తి మీా కెఱుఁగినది కాదే? ఎందుకీయౌదాసీన్యము? ధర్మాచార్యులును సంసారబాధారహితులును జగద్గురువులు నగు మీారే ధర్మరక్షణమందు మాంద్యముగా నున్నచో దరిద్రులును సంసారబాధితులును నగు పండితులా ధర్మప్రచారము చేయునది?... వారిని వీరిని జేర్చికొని మీారు... ఊరూరుఁ దిరిగి ధర్మప్రచారము మొదలిడినచో ధర్మరక్షణ మెట్లుకాకుండును? అనధికారులగు డాక్టరు కుర్తుకోటివంటి సన్యాసులు శంకరాచార్యులనెడి నామముతో బయలుదేఱఁగలరా? ... మీారిట్లు ధర్మరక్షణమం దౌదాసీన్యమువహించి త్యాగము గావింపక పోవుటచే ... శ్రుతిస్మృతివిహిత ... మత మింత హీనస్థితికి వచ్చినదని మనవిచేసికొనుచున్నాము ...కాంగ్రెసునకును బ్రభువులకును దగినట్లు చెప్పి వారి జోక్యము మత...విషయములం దెంతమాత్రము లేకుండునట్లు చేసి ధర్మాచార్యబిరుదమును సార్థక మొనరింతురుగాక యని...నమస్కారము లొనర్చుచున్నవారము.

## ఉన్న దున్నట్లు

కాంగ్రెసువారు పరిపాలనకు వచ్చుటతోనే రైతులు...సిస్తుతగ్గుననుకొన్నారు. వర్తకులు వ్యాపారము వృద్ధియవుననుకొన్నారు. విద్యాధికులు నిరుద్యోగబాధ పడనక్కఱలే దనుకొన్నారు. ఎక్కడఁజూచిన నానందమే. ఎక్కడఁజూచినఁ గాంగ్రెసు జయజయధ్వానములే. రోజులు గడచినవి...సం॥ లు గతించుచున్నవి. పరిపాలకులొక్కొక్క బాంబు వదల మొదలుపెట్టినారు...సిస్తు తగ్గుటకు వీలులేదని యార్థిక మంత్రిగారు మెల్లగా శాసనసభలోఁ జెప్పినారు...వ్యాపారము వృద్ధియగుటలేదుకదా పొగాకుపన్ను, అమ్మకాలపన్ను మొదలగునవి వచ్చి తలమీాఁదఁబడ్డవి. ఉన్నపన్నులు కట్టలేకున్న యీరోజులలో నీ యదనపుఁబన్నులు చెల్లించుటెట్లు?...ఉన్నయుద్యోగములనే మాపుచేయుచున్నఁ గ్రొత్తవారి కెట్లుద్యోగాలు దొరకును? ...మేలనుకొన్న రోజులు పోయి నిస్పృహతోఁ గూర్చుండ నైన రోజు లాసన్నమైనవి. చీకటి పోయి వెలుతురు వచ్చుననుకొన్న నెన్నిరోజులకైనఁ జీఁకటే యెక్కువగుచున్నది. కాని వెలుతురు వచ్చుటలేదు. ఇఁక నేమిచేయవలె? ఫలములన్నియు నిప్పుడుకాదు. బ్రతికియున్న ముందుకు. ముసలివాఁడు నేను బాఁతెడు మామిడిచెట్లకాయలు నాకుఁగాదు, నా మునిమనుమల కన్నాఁడు. అట్లే యున్నది యీావిధాన మంతయు...

## రాజాజీ నిరంకుశ రాజసము

... మదరాసురాష్ట్ర మహామంత్రులగు రాజాజీగారు ... హరిజనులకుఁ బ్రవేశమిచ్చుటకై తగు నేర్పాట్లు చేయుఁడు, మీా ప్రయత్నాల కేమైన భంగము గలుగునట్లుండిన నేను 8 దినములలోపలఁ దగుశాసనములు చేయఁగలను, ... రాజకీయసమస్యలకంటె దేవాలయప్రవేశసమస్య చాల ముఖ్యమైనది– అని యుద్బోధించిరని తెలియుచున్నది. ఈయుద్బోధ యశాస్త్రీయము ... కలహకారకంబు నైయున్నది ... తమ కధికారము హస్తగతమై యున్నదికదాయని జనులను శాసనములతో

హింసింపఁగూడదు. అందును గాంగ్రెసుప్రభుత్వమువారికి బొత్తిగాఁ దగదు ... అహింసాప్రచారకాగ్రగణ్యులును ... గాంధిగారికి వియ్యంకులును ... అగురాజాజీ గారు ... రాజకీయసమస్యలకంటె నిదియే ముఖ్యమని హెచ్చరించి రెచ్చఁగొట్టుట యెంతమాత్రము యుక్తముగాదు ... ఏ మహానాయకుఁడైనను నే మహామంత్రియైనను సాముదాయిక రాజకీయసమస్యలం జేకొని ధర్మాచారసంప్రదాయముల జోలికిఁ బోక యుక్తమార్గంబులను బోధించి దేశోన్నతిని గల్గింపవలెఁగాని మన కధికార మున్నది కదాయని విచ్చలవిడి మతాచారవిషయికశాసనంబులం గల్పించి హింసించుట తగదని తెలియఁజేయుచున్నాము ... హరిజనులకుఁ దగినయార్థికసంపద విద్య మున్నగునవి చేకూర్చినచో వారు స్వధర్మబద్ధులై హిందూదేశోన్నతికిఁ బాటుపడఁగలరు. దేశ నాయకుల కిది చేయఁదగినపనియే కాని దేవాలయప్రవేశప్రేరణము గాదు. పరమేశ్వరుఁడు సనాతనుఁడు. వాని ధర్మమే సనాతనధర్మము. ఆ పరమేశ్వరుఁడు నశించిననాఁడే యీ సనాతనధర్మము నశించును. అంతవఱకు నెట్టిచింత యెవరును జెందఁ బనిలేదు. అట్టి సనాతనుని ధర్మమువలన హరిజనులకు హాని యెన్నడును గలుగలేదు. అట్లు హాని గలిగినదని ... రాజాజీ ... గారి నిరంకుశరాజసమే యనవలెను గాని మఱియొకటి యనఁజాలదు ... రాజాజీగారి కింత నిరంకుశరాజసము దేశశ్రేయోదాయకము గాదు ... యుక్తమార్గమునఁ బ్రవర్తించుట యైహికాముష్మికసుఖప్రదంబని మనవిఁ జేయుచున్నారము.

(దివ్యవాణి)

---

## చచ్చినవాండ్రతో సంభాషణ

మానవదేహమును ధరించిన జీవుఁ డాదేహము పోయినతర్వాత నేదో యొక రూపముతో నుండునని మన మందఱము ననేకగ్రంథములలోఁ జదివియుందుము. లేక చెప్పఁగా వినియుందుము. కాని మన కందు నమ్మకము...లేదు. దయ్యాలనెడి పేరుతోఁ గొందఱు మనలను బట్టుకొని బాధించుచున్నారు. అదియు నూటి కొకచోటనే ఋజువైనట్లు వినుచున్నాము. హిందువుల...ముసల్మానుల ... క్రైస్తవుల ...అందఱిలోను జచ్చుటయుఁ జచ్చినతర్వాత జీవుఁడు వేఱుగానుండుటయు నొప్పుకొనుచున్నారు. ఆజీవులతో మనము మాటలాడుటయుఁ జూచుటయుఁ దటస్థించుటలేదు. అదేదో యొక మానిసియీఁదికి వచ్చిన, విచిత్రాలు జరిగిన దయ్యమని మన మనుకొందుము. అంతమాత్రమే ప్రస్తుతము ప్రపంచములో వాడుకగానున్నది. మనుష్యునకుఁ దెలివితేటలు జాస్తియయ్యెడి కాలము కాఁబట్టి దేహముతోనుండు జీవులు దేహము లేనిజీవులతో మాటలాడుట వాండ్రను రమ్మని పిలుచుట యొకరికిఁ జూపించుట యను నపూర్వమైన యాశ్చర్యాలు జరుగుచున్నవి. ఈమాట యనిన నెవ్వరును నమ్మరుకాని నమ్మితీరవలె. శ్రీ. వి. డి. ఋషిగారును నాయన సతియు నీజీవనాటకానకు నటీసూత్రధారులుగా నున్నారు. అందఱికిని దెలియఁజేయుచున్నారు. అక్కడక్కడ నీవిషయానకు సంబంధించిన సంఘాల నేర్పాటుచేయుచున్నారు. కొందఱికిఁ డ్రైనింగునిచ్చినారు. కొందఱికి జీవులను జూపినారు. మాటలాడించినారు. ఈవిషయాలు తెలిసికొన్నతర్వాతఁగూడ నమ్మకపోవుటయెట్లు? 1938 సం॥ అగష్టునెలలో శ్రీ. వి. డి. ఋషిగారు దక్షిణదేశము

చుట్టి కోయంబత్తూరులో 3 వారాలు నిలిచినారు. అక్కడ నొకసంఘము నేర్పాటు చేసినారు. దానికి శ్రీ. కె. జి. సుబ్రహ్మణ్యము, యమ్ యే బి యల్ గారు కార్యదర్శి. ఆ3 వారాలు ఋషిగారు తన్నాశ్రయించిన వాండ్రిలోఁ గొందఱికిమాత్ర మీవిద్య నేర్పినారట. ఒకఁడు చచ్చినతనబంధువును జూడవలెనన్న ఋషిగారు చూపినారు. ఆవచ్చిన జీవుఁ డడిగిన ప్రశ్నల కన్నిటికిని సరిగా జవాబు లిచ్చినాఁడు. తనజీవితము లోని గుర్తులు చెప్పి నమ్మకము పుట్టించినాఁడు.

... పిలువఁబడిన జీవులు పిలిచినవాండ్రను గుర్తు పట్టినారట. పేరుతోఁ బిలిచి మాటలాడినారు. కొన్ని కుటుంబసందేహాలను దీర్చినారు. వాండ్రందఱు సుఖముగా నున్నామని చెప్పినారు. ఆ కోయంబత్తూరులోనే కొంతమంది కొద్ది దినాలక్రిందఁ జచ్చిన తమ బంధువులను బిలిచి మాటలాడుచు నేమాదిరిఁ జచ్చినారని యడిగినారు. అందులకు జవాబులు.

(1) నేను జచ్చుటకుముందు బాగుగానే యుంటిని. ఒకపనిని గుఱించి యాలోచించుచుండఁగా నాపని చాలఁ గష్టమని తోఁచినది. కొంచెముసేపటిలో నాకు మైకము కమ్మినది. వెంటనే యిద్దఱు మనుష్యులు నాప్రక్కను నిలుచున్నారు నాకోసము.

(2) నేను జచ్చువఱకుఁ జత్తుననియు భూలోకమును వదిలిపెట్టుదుననియు నేమాత్రము ననుకోలేదు. ఏదో యాలోచించుచుండఁగా నిద్రవచ్చినట్లు వచ్చినది. కొంచెముసేపటిలో ... వేఱుప్రపంచములో నున్నాను. నా దేహమును జూచిన నాకే భయము కలిగి కేకలు వేసినాను. ఇంతలో నిద్దఱుమనుష్యులు నాప్రక్కకు వచ్చి నిలిచినారు. ఇఁకఁ గొంచెము భయము కలిగినది. వాండ్రు నావీఁపు తట్టి భయపడ వద్దని చెప్పి యంతయు విపులముగాఁ దెలిపినారు. నేను నూరకుండలేక స్వభావము చొప్పున నింకను నేమగునని యడిగినాను. వాండ్రు నీచోటికిఁ దీసికొనిపోయెదము కనులు మూసికొమ్మనిరి. నేను గనులు తెఱచుసరికి 6 వ మండలములో నున్నట్లయినది.

(3) నేను జచ్చినతర్వాత నాయమ్మగతి యేమగునో యని బెంగపెట్టుకొని నాసంగతి నే నేమియు నాలోచించుకోలేదు. కాఁబట్టి నావిషయము నాకుఁ జెప్పుటకుఁ దెలియలేదు. ఆ 4 నిమిషాలలోమాత్రము నాప్రాణము చేఁపపిల్లలాగున నా పీనుఁగుమీఁదను నా యమ్మమీఁదను బడి కొట్టుకలాడినది. అపుడు నావిషయము నా కేమి జ్ఞాపక ముండునని నేను నీకుఁ జెప్పుదును ? ...

ఒక యువకుఁడు 25 సం॥ లోఁ జచ్చినపుడు వాని తండ్రి దగ్గఱలేఁడు. ఆతండ్రి యీమీటింగులోఁ జచ్చిన యితరబంధువులను బిలిచి మాటలాడినాఁడుకాని చిన్నవయస్సులోఁ బోయినాఁడనెడి విచారముతోఁ గొడుకును బిలువలేదు. ఆకొడుకు వచ్చి తన చావుసంగతి సవిస్తరముగాఁ దండ్రికిఁ జెప్పి యాయనమనస్సులోఁగల కొఱఁత దీర్చెను. ఈవిధముగాఁ జచ్చినవాండ్రితో మాటలాడఁగలిగినపు డాలోకాలలోని రాజకీయాలు మొదలైన విషయా లన్నియుఁ దెలిసికోవచ్చును. ఇంకఁగొన్నాళ్ళకు రాకపోకలును గలుగును. ఒకదేశమునుంచి యొకదేశమునకుఁ బోవులా గొకలోకమునుండి మఱొక లోకానకుఁగూడఁ బ్రయాణము చేయవచ్చు. చావన్న భయమే యుండదు. ఇంకను దీనిలోఁ జాలఁ బరిశ్రమ చేయవలసియున్నది. అదంతయూనైనతర్వాత నింకను ప్లానులు వేయవచ్చును.

(కాంతి)

# 11

## — 'మాలపిల్ల' యభూతకల్పనలు —

(ఆయుర్వేదభిషక్ పంచాగ్నుల వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు)

మాలపిల్ల ఫిలిము ప్రతిఘట్టమునందును బ్రాహ్మణావమానకర దృశ్యములే విశేషముగాఁ గనుపట్టుచున్నవి. కాఠిన్యము దుర్మార్గము నిర్దయ నిరంకుశత్వము నధర్మము నాదిగాఁగల దుర్గుణము లన్నియు నేకీకరించి బ్రాహ్మణజాతి సృష్టింపఁబడినదా యేమి యను భావ మీమాలపిల్ల ప్రేక్షకులలో సామాన్యముగా జనించుననుటలో నెంత మాత్రము నతిశయోక్తి యుండనేరదు. నూతననామధారులగు హరిజనులయందుఁ జాతుర్వర్ణ్యములో బ్రాహ్మణులకు మాత్రమే ద్వేష మున్నట్లుగా బోధించుచున్న దీ మాలపిల్ల. నిష్పాక్షికమైనట్టియు నిష్కళంకమైనట్టియు మనస్సుతో నీమాలపిల్ల నామూలాగ్రము దర్శించినవారి కీఫిల్ము నిర్మాతలకు బ్రాహ్మణజాతియం దెంత ద్వేష మున్నదియు బ్రాహ్మణావమానమం దెంతప్రీతి యున్నదియు బోధపడఁగలదు. ఇందలి దృశ్యము లన్నియుఁ గేవల మభూతకల్పనలో స్వాభావికములో కొంచెము విమర్శించిన వారికిఁ దెలియఁగలదు. సత్వగుణప్రధానులగు బ్రాహ్మణులను సత్వగుణ లేశమైనను లేని తమోగుణాత్మకులుగను దమోగుణభూయిష్ఠులగు చండాలురను గేవలము శుద్ధ సాత్వికమూర్తులుగను దదితరజాతుల నేమాత్రము యుక్తాయుక్తపరిజ్ఞానములేని శుద్ధ మూఢచేతస్కులుగను బ్రాహ్మణుల చేతి కీలుబొమ్మలుగను విభజించిన దీమాలపిల్ల. మఱియు నీఫిల్ము శుద్ధసనాతనుఁడగు సుందరరామశాస్త్రిగారి కుమారునకును మాలపిల్లకును వివాహ మొనరించి తన్మూలమున హరిజనుల యస్పృశ్యతను బోఁగొట్టనెంచి 'యో హైందవులారా! అగ్రవర్ణమని యింతవఱకు మీరు భావించుచున్న బ్రాహ్మణుఁడే చండాలకన్యకను బరిణయమాడినాఁడుకదా! ఇఁక మీ రేల హరిజనుల దూరముగా నుంచఁదలఁచెదరు? ఇది మొదలు వారితో సంబంధబాంధవ్యముల నొనర్పుఁడ'ని బోధించుచున్నదాయని తోఁచుచున్నది. వేసవికాలమునం దొకనాఁటి మట్టమధ్యాహ్నమున బ్రాహ్మణులు కొంద అరుగుచోటఁ గూర్చుండియుండు సమయమున మాలఁ డొకఁడు చెప్పులు గొడుగు ధరించి యా దారి వచ్చుచుండ బ్రాహ్మణులు వానిఁ జూచి యేమిరా బ్రాహ్మణవీధి నీ విట్లు పాదరక్షలు గొడుగు ధరించి రాఁదగునా ? నీ కీయధికారము నెవ రొసంగిరి? నీ తాత ముత్తాత లెవ్వరైనఁగాని యిట్లు వచ్చిరా యని యడుగ నామాలఁడు వారికి నమస్కరించి యీయెండకుఁ గ్రిందఁ గాళ్ళుఁ బైనఁ దల మాడిపోవుచున్నందున నిట్లువచ్చితిని, ఇందేమితప్పుగలదు ? చండాలుఁడుమాత్రము మానవజాతిలోనివాఁడు గాఁడా ? మానవకష్టసుఖములు వానికిమాత్రము లేవా యని వేడుకొనుచుండఁ గొందఱు లేచి శుంఠా! ఏమివాఁగుచుంటివి ? ధర్మోపదేశముచేయ నేర్చితివాయని గర్జించుచుఁ బైఁబడి చావమోది వాని పాదరక్షలు గొడుగు లాగుకొని పాఱవైచిరఁట! ఇందలి సత్యాసత్యముల నూహింపఁజాలని సామాన్యప్రజకు బ్రాహ్మణులపై నెంతక్రోధ ముద్భవిల్లునో వేఱె వ్రాయు టనవసరము. ప్రస్తుతము మాలలు గొడుగుఁ బాదరక్షలు,- ఇవిమాత్రమే యననేల ? వారివారి యార్థికసంపత్తి ననుసరించి యితరవస్తువాహనములు

నైతము ధరించి బ్రాహ్మణవీధులయందుఁ బోవుట యందఱు నెఱింగిన విషయమే. ఇట్లుపోవు మాలలు బ్రాహ్మణులచేఁ బరాభవింపఁబడఁగాఁ జూచినవా రెవరైనను గలరా? లేరు. సత్యదూరమగు నిట్టిదృశ్యము నిర్మించుటలో డైరక్టరుగారి యుద్దేశము బ్రాహ్మణజాతిని నిందాపాత్ర మొనరించుటయేకద! దేవాలయప్రవేశ మొసంగుమని సుందరరామశాస్త్రిగారి యింటియెదుట హరిజనసేవాసంఘాధ్యక్షుఁడగు చౌదరిబాబుగారి నాయకత్వమునఁ గావింపఁబడిన సత్యాగ్రహమునకుఁ గారణ మేమైయుండునో? భగవంతుఁడు మాకుమాత్రము సేవనీయుఁడుకాఁడాయని హరిజనులు బతిమాలినను బ్రాహ్మణుల మనస్సు కొంచెమైనను గరఁగి వారికోర్కె నంగీకరించలేదే, వీరెంతటి పాషండహృదయులోయని ప్రేక్షకులను భ్రమింపఁజేయుటకే కాక వేఱేమున్నది? సుందరరామశాస్త్రి చెఱువును గట్టివేయించఁగాఁ ద్రాఁగుటకు నీళ్ళు దొరకక హరిజనులు వారి పశువులుఁ బ్రాణములు విడువవలసిన స్థితి యేర్పడినదఁట! కట్టివేయించిన చెఱువనాదినుండి సవర్ణు లుపయోగించుకొనునదో హరిజనులదేనో స్పష్టపఱుపఁబడలేదు. సవర్ణులదే యైనచో దానిఁ గ్రొత్తగా నేఁడు హరిజనులు స్వాధీనపఱచుకొన యత్నించుచో నిరోధించుట ధర్మమే కాని యధర్మముగాదు.

ఇట్టిచెఱువును గట్టివేసిన హరిజనులు వారిపశువులు నీళ్ళు లేక చావవలసిన దుస్థితి యేమి సంభవించినది? అనాదినుంచి వా రుపయోగించుకొనెడి జలాశయము వారి కుండనే యున్నది. హరిజనుల చెఱువునే కట్టివేసెనన్నచో నది సహేతుకముగఁ గనుపించుటలేదు. అనాదినుంచి హరిజనులకు హక్కుగల చెఱువును వా రుపయోగించుకొనుటకు వీలులేకుండఁ గట్టివేయుటకు శాస్త్రి కేమియధికారము కలదు? అధికారము లేనిపని నెవరు నెట్లు చేయఁగలరు? అజ్ఞానులును నమాయికులును నగు హరిజను లేమి చేయనేరరుకదాయను ధైర్యముతో నిట్టిపనిని జేసియుండవచ్చునని యూహించినను దేవాలయమువద్ద సవర్ణులకును హరిజనులకును సంఘర్షణ మేర్పడునేమోయను నూహతో ముందుగనే జాగ్రత్తపడి పోలీసుల సాయముఁ బడసిన చౌదరిగా రున్నాఁడుకదా! శాస్త్రిగారిచేఁ గష్టముల ననుభవించిన హరిజనులే శాస్త్రిగారి గృహ మగ్నిదగ్ధమగునపుడు రక్షించిరికాని బ్రాహ్మణులుగాని బ్రాహ్మణేతరులుగాని సాయ మొనరింపలేదని చూపించుట ద్వారమున హరిజనులమాత్రమే సాత్వికులఁగను బరోపకారపరాయణులఁగను శాంతిశమదమాదిసుగుణవిరాజితులఁగను నిరూపించుటయే కాక బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు స్వార్థపరులే కాని పరోపకారచింత వారి కెంతమాత్రము లేదనియు నిట్టిహరిజనుల దూర ముంచుట హిందూమతమునకుఁ దీఱని కళంకమనియు నిట్టి యన్యాయము తొలఁగించుకొనుట ప్రధానధర్మమైయున్నదనియు బోధించుచున్నది. శాస్త్రిగారి గృహదహనకాలములో సవర్ణులు రాకుండుటకుఁ గారణ మేమో నిరూపించలేదు. శత్రుత్వమే కారణమని మన మూహించినను వాని క్షేమముకొఱకుఁ గాకున్నను గ్రామక్షేమమునకైనను జల్లార్ప గ్రామస్థులు యత్నింపకుందురా? అట్లుపేక్షించి యూరకుండిన నగ్నిహోత్రుఁ డాయింటితోనే తృప్తిచెంది యన్యగృహముల నాశింపకయుండునా? కాఁబట్టి గృహదహనకాలములో గ్రామస్థు లెవ్వరు రానందున హరిజనులు వచ్చిరనుట సహేతుకము కాదనియు నమాయికప్రజల భ్రమింపఁ

జేయుటకై పన్నిన పన్నాగమేయనియు నొక్కి వక్కాణింపవలయును. రైతులు హరిజనుల మొత్తాలకింపక తమపనులలోనికి రామని సమ్మెకట్టిన ఖీతిల్లి చౌదరిగారితో హరిజనుల కోర్కెలఁ దీర్చుటకు మే మంగీకరించెదము; సమ్మెను విరమింపఁజేయుఁడని బతిమాలిరఁట.

పల్లెటూళ్ళయందుఁ గూలిపనిచేయువారు హరిజనులలోకంటె శూద్రులయందే యధికముగాఁ గలరు. అట్టిచో హరిజనులు సమ్మెకట్టిన ఖీతిల్లి ప్రార్థింపవలసిన యవస్థ వారికేమి? శాస్త్రిగారి భార్య మాలపిల్లస్నేహ మెఱింగి కుమారునితో నాయనా! నీకాపిల్లయం దంత ప్రేమ యున్న రహస్యముగాఁ జరింపరాదాయని బోధించెనఁట. ఇట్టి యవినీతికార్యమును ప్రేరేచెడి తల్లి యేహీనజాతియందైన నుండునా? అట్టిచో శాస్త్రిగారి భార్య యిట్టిసంభాషణ మొనరించునా? శాస్త్రి కుమారుఁడు మాలపిల్లను మోహచేతస్కుఁడుఁ గామాంధుఁడు నై వివాహమాడెనే కాని ధర్మశాస్త్రములు చండాలకన్యావివాహము నంగీకరించెనను దృష్టితోఁ గాదని విమర్శనదృష్టితోఁ జూచిన ప్రతివారికి బోధపడఁగలదు. ఇట్టికామాంధుల ప్రవర్తనమా మనకుఁ బ్రామాణ్యము? ఆచరణీయము? చీచీ! అంతటిదుస్థితి మన కింకను బ్రాప్తించలేదులే. సినీమాడైరక్టరుగారు శాస్త్రివేషధారిచేఁ దొలుతఁ జండాలదేవాలయప్రవేశము శాస్త్రనిషిద్ధమనియుఁ జివర శాస్త్రాంగీకృతమే కాని నిషేధ మెచ్చటను గానరాదనియుఁ బలికించి లోకమును వంచనఁజేయ సాహసించిరే కాని ప్రమాణవాక్యము నొక్కదానినైనను బలికించియుండలేదు. ప్రమాణరహితమైనమాటల నెవ్వరామోదించెదరనియో వీరియూహ? ఈమాలపిల్లదృశ్యము లోకమును వంచించుటకై సృష్టింపఁబడిన కథ. బ్రాహ్మణులారా! మీరు నిజముగా బ్రాహ్మణులా? అభిమానశూన్యులయిన బ్రాహ్మణనామమాత్రధారులా? మిమ్మీవిధముగ నవమానపఱచు ఫిల్ము ప్రతిచోటను బ్రదర్శించుచుండఁ జూచుచు నూరకుందురేల? ప్రదర్శన నిషేధమునకై యెందుకు యత్నింపరు? బ్రాహ్మణేతరులెవ్వరైనఁ దమ జాతి నీవిధముగ నవమానించుచున్న నూరకుందురా? లెందు. ఈమాలపిల్లను బ్రదర్శింపకుండ నిషేధించుటకై ప్రభుత్వమును గోరుఁడు. ప్రభుత్వమువారు తృప్తి కరమగుపని గావింపనిచోఁ బ్రదర్శింపఁబడకుండుటకై ప్రతి సినీమాహాలునందును సత్యాగ్రహమైన నొనర్చి మాలపిల్లను నిషేధింపుఁడు.

---

## —♦ కలియుగము 1943 తో సమాప్తముకాదు ♦—

(పుచ్చా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. నారాయణతీర్థాశ్రమము)

కలియుగము **1943** తో సమాప్తముకానున్నది, **1924** లోనే కలిపురుషుఁ డవతరించెను, కలియుగప్రమాణము **432000** సం॥ లు కాదు, అవి రోజులు, మున్నగునంశములతో గుంటూరుజిల్లా యున్నవగ్రామములోని హనుమన్నిలయకార్యదర్శిగా రాంధ్రపత్రికలో వెల్లడించియున్నారు. ఇక్ష్వాకువంశమందుఁ బుట్టఁబోయెడి దశరథుని కుమారునివలన మరణముకలదని సనకసనందనాదులు రావణునకుఁ జెప్పిరి. కొంతకాల

మున కయోధ్యను దశరథుఁడను రాజు పరిపాలించుట తటస్థించెను. ఈదశరథుని రావణుఁడు కారాగారమం దుంచఁగాఁ గొన్నాళ్ళ కతఁ డచ్చటనే మరణించెను. ఈదశరథుఁడు నిస్సంతతిగా మరణించినందువలన నిఁకఁ దనకు మరణము లేవని రావణుఁడు నిశ్చింతుఁ డయ్యెను. కొన్నితరములు గడచిన యనంతరము మఱియొక దశరథుఁడు పుట్టుటయు నాయన కుమారుడైనఁ శ్రీరామచంద్రమూర్తివలన రావణుఁడు మరణించుటయు సర్వులకుఁ దెలిసియే యున్నది. అట్లే శంబళగ్రామములో విష్ణుశర్మ యింటఁ గలిభగవానుఁ డవతరించఁగలఁడని నంతమాత్రమున నాపేరుగల ప్రతివారి నవతారపురుషులనుగా భావించుటకు వీలుండదు. ఎందఱు విష్ణుశర్మలో పుట్టవచ్చును. ఎన్నిశంబళగ్రామములో యుండవచ్చును. కాని యస లవతార మిదియని నిర్ణయించుట సులభసాధ్యమయిన పనిగాదని మానమ్మకము. చైనాలోఁ గలిపురుషుఁ డుద్భవించినట్లు వెల్లడించియున్నారు. కర్మభూమి భారతవర్షము. అందలి ధర్మములు వ్యత్యస్తమైనప్పుడు తిరిగి వాని నుద్ధరించుటే యవతారముయొక్క యావశ్యకత. భారతదేశమునకు మహోపకారమొనర్పఁబోవు నవతారమూర్తి భారతదేశములోనే యవతరించఁగలఁడు కాని యన్యదేశములలో జన్మించుట కవసరము కనుపించదు. ఏదేశమం దెట్టి సందర్భములోఁ దనసాయ మవసరమో భగవానుఁ డాయాకాలములలో నాయాదేశములం దనుకూలమైన విధమున ధర్మసంస్థాపనముకొఱ కవతరించును.

కల్క్యవతారము కలియుగములో రాఁగలదని భారతవర్షమునందలి యార్షగ్రంథములలోనే కలదుకాని యితరదేశములలో నెచ్చట నేగ్రంథములలోను నింతకుముం దీయవతారమునుగుఱించి వివరించియున్నట్లు వినము. బౌద్ధమతము ప్రధానముగాఁగల చైనాదేశములోఁ గలిపురుషుఁ డవతరించుట కేమికారణమో బోధపడకున్నది. ఎవరైనను బౌద్ధమతము వ్యాపింపఁజేయ నెంచి యీపన్నుగడను బన్నియుందురాయని సందేహించవలసివచ్చుచున్నది. పురాణాదులలోను శాస్త్రములలోను లేని నూతనాంశములను వినుటయే మా సందేహమునకుఁ గలకారణము. శంబళగ్రామమున విష్ణుశర్మ గృహమునఁ గలికిభగవానుఁ డవతరించఁగలఁడని యేగ్రంథమందుఁ గలదో యాగ్రంథమందే కలి ప్రమాణము 432000 సం॥ లు, కలి యంతమం దుత్పాతములు కలుగనున్నవి, కలిపురుషుఁడు దుష్టసంహారము శిష్టసంరక్షణముఁ జేయఁగలఁడు, అనంతరము కలాపగ్రామమందు శంతనుని భ్రాతయైన దేవాపియు నిక్ష్వాకువంశీకుఁడైన మరువును సూర్యచంద్రవంశములను దిరిగి యుద్ధరించెదరు- మున్నగు నంశము లనేకములుగా వివరింపఁబడియున్నవి. హనుమన్నిలయమువారు కలిప్రమాణము 432000 సం॥ లు కాదనియు నావిధముగాఁ బంచాంగములం దుండెడు పండితుల వ్రాఁతలు కేవలము తప్పులనియు నవి రోజులుకాని సం॥ లు కావనియు నుదాహరించిరి. రోజులే యయినపక్షమున 1200 సం॥ లు కాఁగలవు. క్రీ. శ. 743 వ సం॥ న గలి ప్రారంభమైనదనియుఁ దదాది 432000 రోజులు సమాప్తముకాఁబోవు క్రీ. శ. 1943 వ సం॥ నఁ గలియుగాంతమనియు వీరి యభిప్రాయముకాఁబోలు. గ్రహములనఁగా నేమో గ్రహగతు లెప్పుడు ప్రారంభమైనవో యెప్పు డంతమగునో యీగతుల యాద్యంతకాలవిభాగములైన

యుగ యుగసంధి మహాయుగ మన్వంతర కల్పాది ప్రమాణకాలములన నేమో బొత్తిగాఁ దెలియనివారు వ్రాసిన వ్రాఁతగా నున్నదికాని జ్యోతిషమన నేమో తెలిసినవా రీవిధముగా వ్రాయరని మా నమ్మకము. కలిపురుషుఁ డవతరించఁడని కాదు. అవతరించిన నవతరించుఁగాక. అవతరించునని మన కెట్లు తెలియును? గ్రంథములవలన. అట్లు మనకుఁ దెలిపిన గ్రంథములు ప్రమాణములే యైనచో నందలి యంశముల నన్నిటిని బ్రమాణములుగానే స్వీకరించవలసియుండును.

అవతారము లనంతములు. శాపమువలన నవతరించవలసిన పది యవతారము లలో నాఖరుది కలికి యవతారము. ప్రతియుగములోను నీయవతారము లుండవు. పదియవతారములుఁ గల్పాంతములోఁగాఁ బూర్తియగును. అంతేకాని ప్రతియుగము లోను బ్రతిమన్వంతరములోను దశావతారము లుండవు. ఈపదియవతారములు నొక మహాయుగములోఁ బూర్తియగునవి కావు. వరుసగాఁ బ్రతియుగములోను రావు. ఒక యవతారమునకు మఱొకయవతారమునకు మధ్యకాలములో ననేకావతారములు రావచ్చును. అట్లే రానున్న కల్క్యవతారములోఁగా నితరావతారములు చాల రావచ్చును. శంకరాచార్యులు మున్నగువారి యవతారములే మనకుఁ బ్రత్యక్షనిదర్శన ములు. ఈలోఁగా వచ్చెడి యవతారా లన్నియుఁ గల్క్యవతారములుగా భావించు టకు వీలుండదు. కాఁబట్టి జ్యోతిషరీతిని రానున్న **1943** సం॥ లోఁ గొన్ని యుత్పాత ములు కలుగుననియుఁ గొందఱు మహాపురుషులు పుట్టెదరనియుఁ గనుగొనినంతమాత్ర మున నాసందర్భముల నెప్పుడో రానున్న కల్క్యవతారమునకు ముడిపెట్టుట యస మంజసము. ఒకవేళ నట్టియవతార మతిసమీపములోఁ గలుగనున్నదని యూహించి నను గాలమును మార్పు నెంచుటమాత్రము హాస్యాస్పదముగ నుండును. ఇట్టివానిని వెల్లి డించిన లోకము మోసపోఁగలదు. నేఁడు విశేషముగా నిట్టి రచనలకే పత్రికలలోఁ దావు లభించుచున్నందులకు విచారించుచున్నాము.

---

## —♦ స్త్రీలు రాజకీయాలలోఁ బ్రవేశించుట చాల నరిష్టదాయకము ♦—

(గోవిందదాసు చతుర్భుజదాసుగారు)

...స్త్రీపురుషులు సమానులన్న భావము ప్రాగ్దేశీయులదే కాని ప్రతీచీవాసులది కాదు. మనదేశములో స్త్రీపురుషులు శక్తిపురుషులుగాఁ బరిగణింపఁబడి వారిరువురును వేఱాకారములను గలిగియుండినను నేకరూపులే యన్న భావ మున్నది. సమానులనుటలో సమానత్వపుఁ బోటి గలుగవచ్చును గాని యేకమూర్తియందు ఈపోటీ కలుగనేరదు. అట్లే సీత తా నొక ప్రత్యేకవ్యక్తినని భావింపక రామునిలోని యొకభాగమునని గాఢ

నితో నైక్యమయ్యెడిది. భారతనారి...తాను దనభర్త యేకమని భావించి యాస్థితిని బొందనప్పుడు చాల దుఃఖించును. ఆమె తనకుంగూడ నోటధికార మిమ్మనలేదు. అట్లు చేయుట పొరపాటు...ఆమె...తండ్రిగాని భర్తగాని యెట్లువర్తింతురో యట్లే వర్తించును. భార్య యొకకక్షను భర్త యింకొకకక్షను జెందుట భారతభూమి సహింపనేరదు. నే నఖిలభారతమహిళాసభను మఱచిపోలేదు. అందు సభ్యులు చేయుచున్న తీర్మానములు విడాకులచట్టము...నకు సంబంధించినవి. ఆస్త్రీలు భారతనారీమణులు కాకుండం బాశ్చాత్యదేశీయనాగరకతచేం గల్తీచేయంబడ్డవారు...వీరే భారత...నారీమణులని తలంచుట పొరపాటు...స్త్రీ...కర్తవ్యములనే పూనవలెను గాని...రాజకీయాలలోం బ్రవేశించుట శోచనీయము. తగినవి శిశుపోషణ...మొదలగునవి...స్త్రీవాలంటీర్లు...సంకోచములేకుండం బురుషులతో భుజాలు కలిపి పికెటింగు మొదలగునవి చేయుచుం జీ ఛీ యనిపించుకొనుటను బురుషులు సహింపలేరు. విచ్చలవిడినడతగల స్త్రీ తనమానమును జాలకాలము కాపాడుకొనలేదు...విచ్చలవిడినడతవలనం జెడిపోకమానదు· అందుచేత రాజకీయయుద్ధప్రపంచములోం బ్రవేశించుట యరిష్టదాయకము. తన సకలసద్గుణములు నందచందాలుం బవిత్రత యామె వదలుకొనవలసివచ్చును...స్వరాజ్యమునకై పాటుపడుచుంటిమనిన...నవ్విపోదురు...రాజకీయాలలోం బ్రవేశించుటకుం బ్రోత్సహించినవారు స్త్రీలలో...విచ్చలవిడినడతయను భావబీజమును నాంటిరి. అది ప్రమానై... భార్యా భర్తల మధ్య నవిశ్వాస...ఫలము...నాటినది.

అవినీతుండైన పురుషుండు సత్ప్రవర్తనకు రాంగలండు కాని యవినీతలైన స్త్రీలు తిరిగి బాగుపడంజాలరు. ఇందుచేతనే ప్రాచీనులు స్త్రీలపై నెన్నో నిషేధముల నుంచిరి· వారు...చాల ననుభవజ్ఞులు. ప్రకృతిని గ్రహించి పురుషుం డధికుండని యనవలెనని గ్రహించిరి. స్త్రీలకు...స్వాతంత్ర్యమిచ్చుట మనకు సమానులన్న భావముచేతం గాదు· వారియెడలంగల యాదరణవల్ల. స్త్రీలను రాజకీయాలలోం బ్రవేశింపం బ్రోత్సహించుట కాంగ్రెసు చేసిన పెద్దపొరపాటు. ఇప్పుడు విపరీతాలు పట్టంబగ్గాలులేక పరుగెత్తుచుండుటచేత 1950 నాంటికి స్త్రీవివాహము పురాతనసంప్రదాయమనియుం బెండ్లిచేసికొన్న పురుషునితో జీవితాంతమువఱకుంగట్టువడియుండుట యుక్తబుద్ధిపొరపాటనియు ధరించు బట్టలను మార్చునట్లు పురుషులనుగూడ మార్చుట న్యాయమేయనియుం బ్రేమయనునది చాలదక్కువరకమైనభావమనియు నది స్త్రీపురుషుల కొకరిపైనొకరి కిష్ట మున్నంతకాలమే నిలువవలెననియుం దలంచుటలో నాశ్చర్య మేమియులేదు.

---

బ్రాహ్మణక్షత్రియవారంబులకుఁ బూజ
సల్పు క్షేమఱకుఁడు సచివులార!
కెలఁకుల నుండి కావలయు యాగోచిత
వస్తువు లిండు ధీవరులార!
అడుగువారలకు లేదన కఖిలార్థముల్
తడయక యిండు పరిధానులార!
క్రతువిఘ్నకరుల శిక్ష యొనర్చి మఖరక్ష
మానక చేయుఁ డమాత్యులార!
భక్ష్య భోజ్య చోష్య పానీయములతోడ
అంచితంబుగాఁగ నవనిజనుల
కెలమిఁ బెట్టఁబంపుఁ డేర్పడ నన్నంబు
మహితసుగుణులార! మంత్రులార! 121

తే. అనుచు నీరీతి నందఱ కన్ని పనుల
కాజ్ఞయిడి విశ్వవిశ్వంభరాధినాథుఁ
డంత యాజకవితతితో యజ్ఞదీక్ష
పూని విలసిల్లె నయ్యెడ మోదమెసఁగ. 122

చం. ఘనమగు వేడ్కతో నృపశిఖామణి దీక్షవహించి మించి స
ద్వినుత స్రువాదికావృత పవిత్రధరాతల మాగమోక్తరీ
తిని ఖదిరాది యూపచయదీప్తము పండితయాజకాళి రం
జనమగు యజ్ఞశాలకడఁ జయ్యనఁ జేరె సతీసమేతుఁడై. 123

తే. వ్యాస వాల్మీకి శుక శౌనకాత్రి కణ్వ
కుంభసంభవ శాండిల్య కుత్స కౌత్స
వాది సభ్యుల యాజ్ఞచే నవనివిభుఁడు
వేగ మఖశాలఁ జొచ్చెఁ దా వేడుకలర. 124

కం. పంచమహావాద్యంబు లుదంచద్గతి మ్రోయుచుండ నపుడాఋత్వి
క్సంచయ మధ్వరమును జేయించె నమోఘమ్ముగాఁగఁ బృథ్వీవరుచేఁ 125

వ. ఆసమయంబున. 126

కం. చ్యవనాది సర్వయాజక
నివహము లయోఁడను నిఖిలనిగమోకుల వా

సవముఖ సకలామరపుం
గవులను బిలువంగ మిగులఁ గౌతుకమతులై. 127

కం. వేగిరపడు చచట హవి
ర్భాగంబులు గొనఁగ దివిజవారం బపు డా
యాగంబున కేతెంచెను
బాగుగ నాకంబునుండి బహుహర్షమునన్. 128

వ. ఇట్లు గరుడ గంధర్వ కిన్నర సిద్ధ విద్యాధ రోరగ పిశాచ యక్ష గుహ్య కాదులును విష్వక్సేనాదులును నింద్రానలాంతకా ద్యష్టదిక్పాలురును వరుణ పృథు నహుషా ద్యష్టవసువులును మరీచి భరద్వాజాంగీరస వామదేవాది నవబ్రహ్మలును నుగ్ర సోమ శర్వ మృగవ్యాధ రంతిజభీమా ద్యేకాదశ రుద్రులును నర్యమ మిత్ర వరుణార్క వివస్వత్పూషపర్జన్యత్వష్ట్రాది ద్వాదశాదిత్యులును స్వాయంభువ స్వారోచి షోత్తమ తామస రైవత చాక్షుష వైవస్వత రౌచ్య భౌచ్యాది చతుర్దశమనువులును నాదిగాఁగల త్రయస్త్రింశత్కోటి బృందారకసందోహంబు పత్నీపుత్రమిత్రభృత్య సైన్యంబులతోడ నా శర్యాతిమూర్ధాభిషిక్తు మఖంబునకుఁ గ్రతుభాగంబుల కేతేర వారల రాజన్యశిఖామణి యాజ్ఞాపరికార మా సచివాగ్రేసరు లత్యంతభయ భక్తిసంభ్ర మంబులు మనంబునం బెనంగొన వేశ్మంబుల నివసింపఁ జేసి నవరత్నఖచిత హైమ సింహాసనంబులు గల్పించి వైన వారందఱు సుఖాసీనులైన పిదపం నర్ఘ్యపాద్యాది సత్క్రియాకలాపంబులు నిర్వర్తించి రట్టియెడ. 129

కం. ఈరీతి మఖమునకు బృం
దారకసందోహ మపు డుదారత రా నిం
పారఁగ నందలి యాజక
వారంబులలోనఁ గుమారబాంధవుకరన్. 130

వ. అప్పార్థివేంద్రుండు వెలుంగుచుండె. అయ్యెడ. 131

తే. అంతకున్ మున్నె భార్గవుఁ డశ్వినీసు
తులను నాహ్వానమొనరించి యలఘురత్న
ఖచితశృంగారవిష్టరాగ్రమున నిలిపి
అతిథిసత్కారములు సేసి యాదరమున. 132

చం. మునికులనాథుఁ డప్డు ఘనమోదముతో నఖిలామరాళి క
న్గొని వికటాట్టహాసము లకుంఠగతిం బొనరించుచుండఁగన్
మనమునఁ గొంకులేక నృపమండలి భీతిల మౌనిబృందముల్
తనుఁ బొడఁగాంచి సంతసిల (దద్ధవిరంశ)ము నిచ్చె వారికిన్. 133

కం. ఇటు భాండ పుష్పములకు న
జ్జటి పుంగవుఁ డీయఁ జూచి శక్రుఁడు వేగన్
కటతటము లదరఁ బవిఁ గొని
పటుఘననిర్ఘోషనినదభాషల ననియెన్. 134

శా. ఓరీ మౌనికులాధమా! నృపులు లేరో? యజ్ఞముల్ సేయరో?
సారోదారత మించి యాజకసమాజం బెయ్యెడం గ్రాలదో?
వారి న్నెన్నడునైన వీరికి హవిర్భాగంబు లర్పించిరో?
ఏరా నీ విటు లేలయిచ్చితివి నీయిష్టానుసారంబుగన్. 135

కం. వీరలు సవనంబులఁ జెన్నారు హవిర్భాగముల కనర్హులుఁ దలఁపన్.
కారణ మేమియటంచును నారయఁదలఁతేని దివిష దగదంకారుల్.

సీ. వడ్డికాసులు దినువాఁడు ననగ్నియు
ప్రాణివిక్రియమున బ్రదుకువాఁడు
కుష్ఠి క్లీబుఁడుఁ గృతఘ్నుండు దేవలకుఁడు
మత్తుండు నటుఁ డపస్మారి ఖలుఁడు
పతితుఁ డున్మత్తుఁడుఁ బరదారనిరతుండు
జడుఁడు గాయకుఁడు వైద్యుఁడు నధర్మ
రతుఁడు వేదాన్నవిక్రయుఁ డంగవికలుండు
స్నానసంధ్యాద్యనుష్ఠానహీనుఁ
డరయఁ బరివేత్త భవనదాహకుఁడు మఱియు
క్రోధనుఁ డశుచి లుబ్ధుఁడు రోగి విబుధ
దళితుఁడును వీరు దైవపిత్ర్యములలో, న
పాత్రు లనఁగను వినవె యో పాటహృదయ! 137

కం. కావున నీ వవినీతుఁడ వై వీరికి మంత్రపూతమగు తత్సోమం
బేవిధి నొసంగితివి నీభావంబునఁ గొంకులేక పాపవిచారా! 138

వ. అని యిట్లు శక్రుం డాగ్రహోదగ్రవిగ్రహుండై పటపటఁ బండ్లు గీఁటుచు సటలు వెఱికినకంఠీరవంబుచాడ్పునను గశాఘాతంబునం గెరలు శూకలాశ్వంబు చందంబునను దండతాడిత మహోరగంబు విధంబునను దుర్నిరీక్ష్యప్రభాభాసమానుండై యజాండకరండంబు పగుల నార్చుచు గరుడ గంధర్వ సిద్ధ విద్యాధర గుహ్యక పిశాచ కిన్నర కింపురుషాది త్రయస్త్రింశత్కోటిదేవతానీకంబులు పట్టిస ప్రాస భిండివాల పరశు కరవాల తోమర ఖడ్గ ఖట్వాంగ ముసల ముద్గర ప్రముఖాయుధంబులు ధరియించి సింహనాదంబులు సెలంగ హుంకరించుచు నిరుగెలంకులఁ గది

సిరా భేరీభాంకారనినదంబు లొలయ మణికంకణస్ఫురితసుందరంబగు నిజభుజాస్తంభంబున దంభోళి ధరియించి దాని మిడుంగురు లాకసంబునఁ బఱవ జిఱజిఱం ద్రిప్పి యప్పారికాంక్షిశిరంబు వగులవ్రేయ గమకించుడు నాక్రతువున కేతెంచిన నిఖిల భూపాలకదంబంబును ననేక తాపస సంచయంబును సంచలించె. ఆశర్యాతిధరావరావతంసుండు నిర్విణ్ణహృదయుండయ్యె. సప్తకులాచలంబులు వడవడ వడంకె. ఐరావత పుండరీక వామనా ద్యష్టదిగ్గజంబులు మొగ్గె. ఆదిశేషుండు శిరంబు వంచె. సప్తార్ణవంబులుఁ గలగుండువడియె. ఇట్లు లోకంబులు ప్రళయవేళాసముజ్జృంభమాన సంవర్తకాదివలాహకనిబిడనీరంధ్రనిర్ఘోషపూరితంబులైన చందంబున ఘూర్ణిల్లుచుండె

ఉ. అప్పుడు మౌనిపుంగవుఁ డహంకృతిచేఁ దగ నింద్రుఁ గాంచి బల్
రొప్పుచు బాడబజ్వలనరోచులు నేత్రములందుఁ బెక్కులై
ఉప్పతిలంగ రౌద్రరస ముట్టిపడన్ భయదోగ్రమూర్తియై
తప్పక యిట్లువల్కెఁ జలదస్తనితార్భటి నిర్భయంబుగన్. 140

ఉ. ఓరిమహేంద్ర! నీవిటు మహోద్ధతి నోరికి వచ్చినట్లు ప
ల్మాఱుఁ గడంక నాడెద వుమాప రమాప సరస్వతీపు లే
పేరును విన్నమాత్రమున భీతిఁ గలంగుచునుందు. రోలి మ
త్స్వారతపోఽగ్నికీలలకుఁ దాళెడువాఁడవురా దురాత్మకా! 141

క మున్నుగనీసైన్యంబునుగ్రన్నహరిహరహిరణ్యగర్భులు మునులున్
మున్నగువా రందఱు జగమెన్నఁగ మద్ఘోరశాపహేతులకు వడిన్

కం. ఆహుతిగావించెదనిపు డోహో! అటనిలువుమనుచు నొయ్యన దేవ
వ్యూహములుసూడఁబవియుతబాహుస్తంభనము సేసె బ్రాహ్మణుఁడంతన్

సీ. ఇట్లు సంస్తంభనం బెలమిఁ గావించిన
వైవస్వతాది దిక్పతులు సిద్ధ
గరుడ గంధర్వ కిన్నర యక్ష గుహ్యక
విద్యాధరాదులు విబుధవరులు
నిఖిలాయుధంబులు నేర్పుమైఁ గరముల
అమరిచి యట్టహాసములు సెలఁగ
పటహాఢక్కా భేరిపణవాది బహువాద్య
ములు సర్వదిశలందుఁ గలయఁబర్వ
భయదహుంకృతినినదముల్ పరిఢవిల్ల
కినుకఁ గన్గవలను వహ్నికణము లురల
బొడుగఱచుచు నిట్టు లయ్యనఘచరితు
చుట్టుముట్టిరి జాల్మలై చోద్యముగను. 144

# అభినవసరస్వతి

| సంపుటము | ప్రమాది నామసంవత్సరము | సంచిక |
| --- | --- | --- |
| ౩౧ | ఆశ్వయుజమాసము. | ౭ |


## —♦ కృతిసమర్పణము ♦—

తంజాపురాంధ్రనాయకచరిత్రము —— గ్రంథకర్త కురుగంటి సీతారామయ్యగారు యమ్ యే గారు, ప్రొఫెసరు నిజామ్ కాలేజి, హైదరాబాదు. వీరు తంజావూరు సరస్వతీమహాలు పుస్తకాలయమునందుఁ గొంతకాల ముపదృష్టలుగా నుండిరి. ఆ పదవి యందు వీరుచేసిన పరిశ్రమ మీతంజాపురాంధ్రనాయకచరిత్రరూపమున నాంధ్రగ్రంథ మాలకు 17 వ కుసుమం బైనయది. సీతారామయ్యగా రాంధ్రవిశ్వవిద్యాలయమునకు నిచ్చిన యుపన్యాసములే యీగ్రంథము. వీరు ధర్మలక్ష్యముతో వ్రాసి యీచరిత్రను సార్థకము గావించిరి. భారతీయ సంస్కారసంరక్షణమున కుపకరించిన యాంధ్ర నాయకచరిత్రమునే వ్రాయుటచే వీరి యాంధ్రత్వము ధర్మబద్ధత యగ్గలమై నభినం దింపఁదగినవి. ఈతంజాపురాంధ్రనాయకచరిత్రమునకు రఘునాథుఁడు నాయకమణి. ఈయన నన్నివిధములలోను గృష్ణరాయలతోఁ బోల్పవచ్చును. తంజావూరున లక్ష్మీ సరస్వతు లిరువురును లలితనృత్యమును గావించియుండిరి. విజయనగరమునఁ గృష్ణ దేవరాయలుం బోలెఁ దంజావూరున రఘునాథుఁ డాంధ్రకవితావధూటిని బల్లకిలో నెక్కించి యూరేగించెను. ఈతంజావూరు గ్రంథాలయములోని ప్రాఁతపుస్తకములు కోటలు గుళ్లు గోపురములు మిద్దెలు మేడలు మసీదులు చర్చిలు మొదలైన యిందలి పూర్వవైభవమును స్ఫురింపఁజేయుచున్నవి. పైనఁ బేర్కొనఁబడిన రఘునాథనాయ కుని మునిమనుమఁడు చెంగమలదాసుతో నీతంజావూరుసామ్రాజ్య మంతరించి యన్యుల యధీనమైనది. కృష్ణభూపతి మొదలుకొని యీ చెంగమలదాసువఱకు వారివారి ప్రభావము నీగ్రంథకర్త చక్కగా వ్రాసియున్నవాఁడు. ఇది కష్టసాధ్యమైన పని యైనను నీయనకుఁ గల భాషాభిమాన మిట్లు చేయించినయది. తంజావూరు ప్రభువులగు రఘునాథనాయక మన్నారుదేవప్రభృతులు భాషాపోషకులై పండితులఁ బరిపోషిం చుచుఁ బ్రబంధముల వ్రాయించుటయే కాక వాల్మీకిచరిత్ర మహాభారతతాత్పర్యసంగ్రహ హేమాబ్జనాయికాస్వయంవరాదు లెన్నియో గ్రంథములు స్వయముగా రచించినవా రగుట నట్టి భాషాసేవకులచరిత్ర వ్రాయుటకు భాషాసేవకులగు సీతారామయ్యగారు బద్ధశ్రద్ధగలవారలై యుండనోపు. వీరు విజయరాఘవవంశావళినుండి తీసి వ్రాసిన

సీ. శ్రీశైలమందునఁ జిరతరంబుగఁ
ప్రాకారసోపానపాళి వెలయ
వృద్ధాచలంబున విశ్రుతస్థితి నిల్చె
ప్రాసాదమంటపగ్రామసమితి

అరుణాచలంబున నలవరించెను మించ
గోపురసంపూర్తి గోపురములు
గోపర్వతమున నెక్కుడుగాఁగ సవరించె
పూజావిశేష మపూర్వమౌఁగను
అతులసౌమృష్టాన్నదాన కన్యాప్రదాన
బహుళతటాక సహారామసంతతి వెలయ
ధరణి వెలయించెఁ దన మహాదాక్షిణ్యనిధి
తిమ్మభూపాలు చెవ్వధాత్రీవిభుండు- (181 పుట)

అను పద్యమువలన రఘునాథుని తాత యైతిహ్యము ఖ్యాతమగుచున్నది. ఈయన తండ్రి యచ్యుతనాయకుఁడుకూడ నట్టివాఁడే యయినట్టు

శ్లో॥ ఆరామసీమామపి రంగభర్తుర్గ్రామా ననేకానపి సంవ్యతారీత్
దానం తులాపూరుష మచ్యుతేంద్రో హిరణ్యగర్భం ప్రతివర్షమేవ.
సంవత్సరం కించ స రామసేతౌ రసా వర్షాణి దశవర్షమేవ.
దినేదినే భోజయ దేవ లక్షాణి గోసాయికా నచ్యుతభూమిపాలః.
మాయూర మధ్యార్జున కుంభకోణ శ్రీచంపకారణ్యముఖస్థలేషు
మహాత్తరం మంటప మాతతాన భక్త్యా మహాత్యాకర సచ్యుతేంద్రః
(182 పుట)

అని సంగీతసుధనుండి యుదాహరించిరి. కాని కొడుకు విజయరాఘవుఁడు మాత్రము తనరాజ్యప్రారంభమునుండి యొక్కకార్యమైనను సెహబాసని యనిపించుకొను నది చేసియుండలేదనియు నీయన యవలంబించిన వీరవైష్ణవ మిట్లొనర్చెననియుఁ దెలుపుచున్నారు.

'విద్యార్థి' యను నిజాముకళాశాల 2, 3 తెనుఁగుసారస్వతసాంవత్సరికసంచికలు- వీనికి ముఖ్యసంపాదకులు విద్వాన్ సరిపల్లి విశ్వనాథశాస్త్రి, యమ్. ఏ. గారు. సంచిక వెల 1-0-0. కురుగంటి సీతారామయ్య యమ్. ఏ. గారు మున్నగువారుగూడ నేతత్సంపాదకవర్గములోనివారు. పద్యమాల యాంధ్రవాఙ్మయము భామతి మొదలైన పెక్కువిషయము లిందు బి హెచ్ సి హెచ్ పియస్, ఆర్, అవధాని యానందప్రముఖులచే వ్రాయఁబడినవి కలవు. ఆంధ్రవాఙ్మయము భామతి ప్రౌఢశైలితోఁ బత్రికా సంపాదకులు తమ పత్రికలలోఁ బ్రకటించుకొనఁదగిన స్థితిలో నున్నవి. తక్కటి విషయములును నీతిబోధకములును జమత్కారజనకములునునై పిల్లవాండ్రదగ్గఱనుంచి పెద్దవాండ్రదాఁకఁ బఠితవ్యములుగాఁ గావించుచున్నవి. కొద్దికొద్ది నాటకములు నవలలు గూడ నిందుఁ గలవు. చిత్రలేఖనము నాట్యము మున్నగు నానాకళలను గుఱించియుఁ గొన్ని వ్యాసములు ప్రకటితములు. కే. వి. లక్ష్మణరావుగారివంటి యుత్తమపురుషుల

చరిత్రలదగ్గఱనుంచి కలిగి యీసంచికలు చాల బాగుగానున్నవి. పాటలు మొదలైనవి కొన్ని గ్రామ్యభాషలో వ్రాయఁబడియున్నను వీనులకు విందుగావించుచున్నవి. ఇవి యన్నియుఁ గాలేజివిద్యార్థులచే వ్రాయించి సంపాదకులు సంచికలుగాఁ బ్రకటించుట చాల సంతోషదాయకము. విద్యార్థులకు విద్యాభివృద్ధికరము.

ఆంధ్రపదనిధానము— ఇది వరంగలులోని కాకతీయగ్రంథమాల యనుబంధగ్రంథము. తూము రామదాసకవికృతము. శేషాద్రిరమణకవికృతమును శ్రీ శివాజి చక్రవర్తికొఱ కాయన గురువగు సమర్థరామదాసస్వామి రచించిన మహారాష్ట్రగ్రంథమునకు సరియగు తెలుఁగువచనమును నైన దాసబోధ యాంధ్రమంత్రులు విక్రమోర్వశీయము మున్నగు ననేకగ్రంథములు కార్యదర్శియగు తూము వరదరాజులుగారి ప్రయత్నమున నీకాకతీయగ్రంథమాలకుఁ గుసుమములుగాఁ బ్రకటింపఁబడియున్నవి. ఏతద్గ్రంథమాలాసంపాదకులుగూడ శేషాద్రిరమణకవులే.

జీర్ణతరమగు నీ యాంధ్రపదనిధానమును బరిశోధించినవారును నీకవులే. ఈగ్రంథము బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరము ననుసరించి వ్రాయఁబడినది కావున బహుపదావృతమనియు శబ్దరత్నాకరమువలెనే ప్రమాణభూతమనియుఁ జెప్పనొప్పును. ఇది 1565 పద్యములుగల యుద్గ్రంథము. ఇందు నామలింగానుశాసనమునంబోలెఁ గాండములు వర్గములు విభజింపఁబడియున్నవి. శబ్దరత్నాకరస్థములగు పదములే కాక నిజామురాష్ట్రమున వ్యవహరింపఁబడు దేశ్యములును నిందుఁ జేర్పఁబడినవి. కనుక నియ్యది విద్యార్థులకు విధిగాఁ బఠనీయము. ఇంకను నీగ్రంథమునుగూర్చిన విశేషములు శేషాద్రిరమణకవులు వ్రాసిన తొలిపలుకుఁ జదివి పాఠకులు గ్రహింతురుగాక. ఆంధ్రనామసంగ్రహము శేషము సాంబనిఘంటువు లోనగు పద్యాంధ్రనిఘంటువులలోవలెఁ గేవల సీసములు నాటవెలఁదులుఁ దేటగీతులుఁ గాక యిందు

చం. కఱి నల కందు చామనము కావిరి నల్లన చామ నీలియున్
కఱు కసినంబు నల్ల కసుఁగందనఁ గఱ్ఱయనంగ నింకనున్
కఱియు యనంగఁ గప్పనఁగఁ గారనఁగన్ భువి నీలవర్ణమై
వఱలెను వాసవాదిసురవందితపాదసరోరుహద్వయా. (ధీవర్గు 163)

చం. అరఁటి యనంటి యంటియున నైై కదళీతరునామధేయముల్
తొరలె. అనంటియూఁచయున దూఁటయనంగ ననంటిచువ్వనా
అరటిగడన్న పేళ్ళ నలరారె భువిం గదళీకహారమున్.
మఱియును మావి మామిడియు మావిడినాఁగ రసాలమౌ హరీ!
(వనౌషధివర్గు 99)

ఉ. అందుగు నాఁగ నండుచన నాఖ్యలు సల్లకికొప్పి మీఱె. ఇ
ల్లెందయు నింద్రవల్లకిని లెక్కఁగొనెన్. మఱి చిల్లచెట్టునా

ఖండమ్ము నిండుగన్నను మహిం గతకాంక్ష్యలు. మేడ యత్తియ
న్నందున నౌ నుదుంబరమునామము. లశునసంజ్ఞ మద్దినాక్. 101

మొదలగు చంపకమాలాది వృత్తములుగూడ వాడఁబడియున్నయవి.

కం. ఒప్పిదమున సుందరమౌ. (నానార్థవర్గ 300)

తే. గీ. వాఁక నెరి యీఁ అతాఁఅలు వక్కఁగంబు
వంకర కు నెఱి మలకనా వక్రిమునకు, (సంకీర్ణవర్గ 148)

మొదలగు పద్యములలో

కం. జవరన నయాగారంబును
నవకంబును మెత్తపాటు నౌరను మెదుపున్
మవమును మవ్వము మెత్తన
నవురని యనఁగా మృదుత్వనామములు హరీ! (సంకీర్ణ. 146)

కం. చెమ్మయుఁ దడి పంకెనయన
తెమ్మయు నీమిరియుఁ జోదాను తేమ యనంగన్
నెమ్మనఁ బదనన నార్ద్రి
త్వమ్మునకు నభిఖ్యలౌను దనుసుతవైరి! (147)

మొదలగు పద్యములలోవలె సౌందర్యము వక్రత్వము నని ధర్మములఁగా వాడక ధర్ములఁగా వాడుట ధారాపాతమై యుండఁబోలును.

కం. కాల మరణ్యము వర్షాకాల మసిలి హారహృత్తికయు వృద్ధాప్యం,
[నానార్థ, 342]

తే. గీ. ......చిక్కన యనంగఁ, దనరె బాహుళ్యమునకు బలంబునకును
సూక్ష్మమునకు దారుఢ్యమునకును వనజనాభ! (నానా, 400)

మున్నగుపద్యములలోని వృద్ధాప్య దారుఢ్యాదిపదములును ధారాపాతములనియే మాతలంపు. అట్లుకానిచో

తే. గీ ధరఁ దుటారము దార్ఢ్యము పరుషవచన, (నానా, 474)

అని పద్యాంతరమున బాగుగాఁ బ్రయోగించియుండఁడు. వృద్ధాప్య మనుచోట వార్ధక్యమన్నను గుదురుటచే లేఖకప్రమాదముక్రిందనే లెక్కపెట్టవచ్చును.

మ....పరికించన్నఁ బరీక్షసేయుటయు నోపంగన్ విచారించుటౌ.
పరిమార్చన్ వధించు పేరోలయుచున్ భంజించు ఖండించగున్.
[నానా, 536]

మున్నగుపద్యములలో మాత్రము సంధ్యాదిగతదోషములు చాలఁ దేలును. పరిశోధకులచేతను నపరిశోధితము. మఱియు

కం. ముదిమియనఁగఁ గారనఁగను
ముదుసలినా ముదుకనాఁగ ముసలియనంగన్
ముదినాఁగను వృద్ధాప్యము...

అను పద్యములోవలె ముదుసలి ముదుక ముసలి శబ్దములు శబ్దరత్నాకరాది సద్గ్రంథములలో నెక్కడను వార్ధక్యమునకు వాడఁబడియుండవు. నిజామురాష్ట్రమునఁగూడ నీశబ్దముల నిట్లు వ్యవహరించుట లేదు. పరిశోధకులుగూడ వీనిని బాటింపకుండుటచే నెక్కడేని యున్నవేమోయని సందియముగలిగెడిని. వారిష్యాది వారింతురుగాక. ఇట్టివి మఱికొన్నియుఁ గలవు. విస్తృతగ్రంథలేఖనవేగవివశతంబడిన వీనికేమిగాని మొత్తముమీఁదఁ బొత్తముత్తమమై యొప్పారుచున్నదనుట కొక్కింతయు సంశయములేదు. సీ॥ 'కోమట్లు మూడవకొలమువారనఁ బేరులన' నని యాంధ్రనామసంగ్రహమున ముచ్చటగా మూడింటితో ముగించిన వైశ్యుల కీకవి వైశ్యవర్గారంభమున

కం. బేరియుఁ దొడపుట్టనఁగ బెహారియుఁ గోమటియనంగ బేహారినా బే
హారియు బచ్చన సంపాసారియు సెట్టియన వైశ్యసంజ్ఞ ముదారీ!

అని పదిపేళ్ళ మృదువైనశయ్యతోఁ గుదిరించు టీక్షించిన నెంతయు సంతసంబయ్యెడిని. ఎల్లగ్రంథము నిట్లే యొసంగెడిని. వ్రీహిభేదముల వివరించు వేఱొకపద్యమును విడువలేక క్రిందఁ బొందుపఱచుచు నిప్పటికే యెక్కువ విస్తృతమైన యీతద్గ్రంథప్రాశస్త్యమునుగూర్చిన వ్రాఁత యిఁగ ముగింతును.

సీ॥ ఇప్పపూరాజనా లేనుఁగుకొమ్ములు
ఆకుసన్నంబులు నాఱెగడలు
కప్పురబోగులు కస్తురిపట్టియాల్
కుత్తిమల్లెలు చిటిముత్తెములును
రాచసాగసనులు రాజనములు తీవె
సరులు ముస్తైలు ముత్తెసరులు తెక్క
పాయలు సక్కుళ్ళు బంగారుతీగెలు
మదనగందులు తీగమల్లియలును
తొకితెక్కలు చిఱిపూలు గండసరులు
చందమామపువ్వులు నాగసాగరాలు
పాలమీఁగడలును సుకవాసులనఁగ
ధాన్యభేదంబులై యొప్పె దానవారి!

ఇట్టినిఘంటువు నీకవికుమారులును సనాతనధర్మపరులును భాషాసేవకుల వకీళ్ళును నైన తూము రంగయ్యగారు బహువ్యయమును భరించి ప్రకటించిరి. వీరితమ్ములును వీరివంటి యుత్తమపురుషులే. అందుఁ జిన్నతమ్ములు వరదరాజులుగారును వకీ

సహోదరులగు సర్వేశము వరదరాజులుగార్ల సాయముతో జనమేడోనర్చిన సద్గ్రంథము ననేకాంధ్రుల కర్పించు రంగయ్యగారిని దత్సహోదరులను రమారమణుండు రక్షించుఁ గాక. ఆంధ్రలోకమున కత్యంతోపకారకమగుఁ గాక నియే యీగ్రంథమును రామదాస కవి రచించెను. అయ్యభిప్రాయముతోనే యాత్మజులు ప్రచురించిరి. అకారాదిగాఁ గూర్పఁబడిన యఖిలశబ్దములును గల యచ్చుపుస్తకముల ననయము నంతికమునఁ బెట్టు కొని యక్కఱదీర్చుకొనుట కలవాటుపడి యల్పిష్టమగు నాంధ్రనామసంగ్రహము నే యవలకుఁ ద్రోయక నాంధ్రగ్రంథకర్తలును బాఠకులును బ్రమరముగాఁ గల ప్రకృత ప్రపంచమున బహుళప్రచారములోనికి రాకున్నగికాని యాంధ్రపదనిధాన మాంధ్రభా షాభిమాను లందఱును గంఠస్థముఁజేసి యుంచఁదగిన ఘనగ్రంథమని యస్మదభిప్రాయము.

## —→ నిజామురాష్ట్రము... దేశము ←—

(వల్లూరు సీతారామారావుగారు)

...నిజామ్‌రాష్ట్రము భాగ్యనగరమను పేరు వహించి... వరంగల్లు కరీమ్‌నగ రము, ఆదిలాబాదు, అతరాఫ్‌బల్దా నిజామాబాదు మెదకు మహబూబునగరము నల్లగొండ యను 8 జిల్లాల యాంధ్రులకు నివాసంబై విరాజిల్లుచున్నది...ఇచ్చటి ప్రసిద్ధసంస్థాన ములగు గద్వాల వనపర్తి దోమకొండ జటప్రోలు పాల్వంచ మొదలగువాని యధిపతు లందఱు నాంధ్రులే. ఈరాష్ట్రమే పోతన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు...రంగనాథుఁడు వెలకూచి బాలసరస్వతి...మున్నగు కవిపుంగవు లాంధ్రభాషామతల్లికిఁ దమ విద్యా ప్రౌఢి...రసికత్వము మున్నగువాని ధారవోసి యామె మెప్పువడసి ప్రఖ్యాతి గాంచిన స్థలము. మఱియు నీరాష్ట్రమే భక్తులచేతను గార్యాలోచనకుఁ దీసిపోని... అక్కన్న మాదన్న మొదలగు మంత్రులచేతను మెప్పొందిన స్థలము...

ఒరంగల్లు దక్షిణహిందుస్థానమునం గల పురంబులలో నెల్ల మేటియై శత్రుజన భయంకరమై యేకశిలానగరమన వన్నెకెక్కియుండెను. ఎక్కడఁ జూచినను దేవాల యములను నెక్కడ వీక్షించినను రాజభవనంబులును రమణీయంబై ప్రకాశించుచుండె ను. ఏకశిలానగరములోని సౌధాగ్రములు మణిహేమకుంభములచే నలంకరింపఁబడినట్లు కవి వర్ణించియున్నాఁడు. ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు మహమ్మదీయులకుఁ గప్పమి యుట మానెను. అందుచేఁ బాదుషా పెద్దకుమారుఁడైన యలూఫ్‌ఖాను క్రీ॥శ॥ 1320లో నోరుగంటికిఁ బోయి కోట ముట్టడించెను. ఉభయసైన్యములకును ఘోరముగాఁ బోరుజరిగెను. ఆంధ్రుల యద్భుతప్రతాపమునకుఁ దాళలేక మ్లేచ్ఛు లొకరాత్రి యెవ్వ రికిఁ జెప్పక పలాయితులైరి. అప్పు డాంధ్రులు వారి యుద్ధసామగ్రిని స్వాధీనముఁజేసి కొనిరి. కాని మ్లేచ్ఛులు పట్టినపట్టు వదలనివారగుటచే మఱుసటి సం॥ న నోరుగంటిని గెల్చి ప్రతాపరుద్రుని ఢిల్లీనగరమునకుఁ గొనిపోయిరి. కొన్నిరోజులకుఁ బాదుషా ప్ర తాపరుద్రునకుఁ దిరిగి రాజ్యమిచ్చెనుగాని యాతఁడు రాజ్యము చేయక గోదావరి యొడ్డునఁ దపస్సుఁజేసికొనిన ట్లోరుగల్లుశాసనములు తెలుపుచున్నవి. శ్రీమ దాంధ్రభాగ వతమును రచించిన బమ్మెరపోతనామాత్యుఁడే దీని నేకశిలానగరమని యెన్నుకొనినట్లు భాగవతమే సాక్ష్యమిచ్చుచున్నది.

"నేలకొండపల్లి...కంబము మెట్టుకు సుమారు పది మైళ్ళదూరమున నున్నది. పూర్వ మీపట్టణము మిక్కిలి వైభవమనుభవించినదని యీయూరు చెప్పుకరయే చెప్పుచున్నది. చుట్టుప్రక్కల తోటలతోడను నలసిస చ్చేడి పొంగుల నేపదీప్పు పటిష్ఠ కసయూహముల తోడను జంబూవృక్షములతోడను పదితరవృక్షాదులతోడను బురం కొంతయూ వన్నెగా నున్నది. ఇందొక పెద్దదుర్గము గలదు. ఈనగరముపయిఁ బూర్వము శ్రీకృష్ణదేవరాయలు భుజబలమును గనఁబఱచి కడకు దుర్గమును స్వాధీనముఁజేసికొనెను...ఈనగరమున కుత్తరముగ సుమారు 2 మైళ్ళదూరములో నొక పెద్ద దిబ్బ గలదు. ఇదియంతయు నిటుకలచేఁ గట్టఁబడి పెద్దశిలవలె లోచనగోచరమగుచున్నది. దీని నానోపించి వృష్టిసారించినచోఁ జొట్టుపట్ల సుమారు 5 మైళ్ళవఱకును...కనఁబడును...పూర్వ మీదిబ్బను విరాటరాజు గద్దెయని తెలుపుచున్నారు. ఇందుకు నిదర్శనముగా నీగ్రామమున కైదు మైళ్ళదూరములో బాణాపురమను నొక చిన్నగ్రామము కలదు. పాండవు లజ్ఞాతవాసదీక్ష దీర్చుకొనుటకు... వచ్చినపుడు బాణముల నాగ్రామమునం దొక శమీవృక్షాగ్రమునం దుంచినటులును దీనిచే నీగ్రామము బాణాపురమని సార్థకనామముందినటులును దెలియుచున్నది. మఱియు నీగ్రామము భక్తాగ్రేసరుఁడగు రామదాసుగారి జన్మభూమియయినటు లనేకాధారము లెసంగుచున్నవి.

కంబముమెట్టు — ఇది వరంగల్లుజిల్లాకు సంబంధించిన తాలూకా గ్రామములలో కెల్ల మేటియై సుమారు ½ మైలుపొడవును మైలువెడల్పును గలిగియున్నది. ఇచ్చట నొక గొప్ప దుర్గము గొప్ప క్షేత్రమును గలవు. ఈగ్రామమున నరసింహమూర్తి యొక పర్వతాగ్రము మీఁద నొకస్తంభమునుండి యుద్భవించినట్లు కొన్ని సూచనలు గనుపించుటచేఁ గంబముమెట్టు (స్తంభపురి) అని నామం బొసంగిరి. ఈగ్రామములోనున్న దుర్గము మున్ను 10 లేక 11 వ శతాబ్దమున సీతాపతి నామధేయుఁడగు నొక భూపాలుని పరిపాలనలో నుండినటు లచ్చటనున్న శాసనములవల్లఁ దేటపడఁగలదు. ఈగ్రామముననే హరిభట్టారక కవి జన్మించి మత్స్యపురాణము రచించినది....

పాలకుర్తి — ఇది బమ్మెరకు 3 మైళ్ళదూరములో నున్నది. ఇచ్చటనే సోమనాథకవి జన్మించినది. ఇచ్చట నొక యాలయమును దత్రత్యులు కట్టి యొకలింగమును స్థాపించి సోమనాథుని ధైర్యము నాఁటినుండి నేఁటివఱకుఁ జూపించుచున్నారు. బమ్మెర పోతరాజుగూడ సోమనాథుని భక్తుఁడు.

బమ్మెర — ఒరంగల్లుచెంత నీగ్రామ మున్నది. ఈబమ్మెరలోఁ బోతరాజు గద్దెయని 4 రాళ్ళు పాఁతిన స్థలము కలదు. దీనిముందఱఁ ద్రోవ కడ్డముగ నొకశిల యున్నది. దానినే యిచటివారు పోతరాజని వ్యవహరించుచున్నారు. ఈపోతనామాత్యుఁడు భోగినీదండకము వీరభద్రవిజయము నాంధ్రభాగవతము రచించి యాంధ్రకవులలో నొకఁడై ప్రఖ్యాతిఁగాంచినాఁడు.

వెలిగందల — ఇది బమ్మెరకు సుమారు 6 ఆమడలదూరమున నున్నది. ఇది యొకానొక కాలమున నాంధ్రరాజ్యమునకు ముఖ్యపట్టణముగూడ నై యున్నది. ఇచ్చటనే భాగవత షష్ఠస్కంధము పూర్తిచేసిన నారాయణకవి జన్మించినది....

కొలనుపాక. నల్లగొండజిల్లా — ఇది చాళుక్యవంశమున కొంతకాలమున రాజధానిగా నుండెను. ఇందు వీరనారాయణాలయము సోమనాథాలయమును జాలఁ బ్రసిద్ధములైనవి. ఇచ్చటఁ బ్రసిద్ధమగు నొక జైనాలయము కలదు. పూర్వ మీగ్రామము బింబావతీపురమని చెప్పుదురు. ప్రతాపరుద్రచక్రవర్తి కొలనను గ్రామ మన్నమంత్రి కిచ్చినటుల భీమేశ్వరపురాణములో శ్రీనాథకవి చెప్పియున్నాఁడు.

పాఖాలచెఱువు— ఇది ప్రస్తుతము వరంగల్లుజిల్లా పాఖాలతాలూకాలో నున్నది. దీనిని బ్రతాపరుద్రుఁడు నిర్మించె ... దీని కట్ట గొప్ప పర్వతపంక్తి సమూహముతో నిర్మించఁబడి దండకారణ్యమునకు నిదర్శనముగ వివిధవృక్షాదులచేఁ గ్రిక్కిరిసియున్నది. మీనమకరాదులకు శరణ్యమగు నీతటాకముయొక్క గండియే జీవనదియని పేరువహించి నానాముఖముల వ్యాపించి పొలముల నిర్మలోదకముచే ఫలవంతముగఁ జేయుచుఁ దుదకుఁ గృష్ణవేణితో సంగమమొందుచున్న మున్నేరు జన్మస్థానము.

హనుమకొండ—ఘనత చెందిన నిజామ్‌రాజ్యములో...ఓరుగంటికి సమీపమున నున్న హనుమకొండయే యనుమకొండయని పేర్కొనఁబడి...ఉన్నది. ఓరుగల్లురాష్ట్రమునకుఁ బూర్వము హనుమకొండయే రాజధానిగా నుండెను. శాతవాహనవంశజులైన యాంధ్రచక్రవర్తులే సుమారు 13 వ శతాబ్దమువఱకుఁ బరిపాలించిరి. తదనంతర మాంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమై 3వ పులమావికాలములోఁ గలహములు ప్రబలి పల్లవరాజులకు లోఁబడి వేర్వేఱురాజ్యములుగఁ బరిపాలింపఁబడినది...దుర్గము నిర్మాణముచేసి గ్రామము విస్తరింపఁజేసి యెఱుకదేవరాజు ప్రజాపాలనముఁజేయుచుండ నాతని కనుమఁడు కొండఁడు నను నిరువురు కొమాళ్ళు జనించిరి. భూపాలుఁ డాయిరువురి పేరట నారాజధాని కనుమకొండయను నామకరణం బొనర్చెను. ఓరుగంటియందుండు శాసనములనుబట్టియు మఱికొన్ని శాసనములనుబట్టియు నీదేశము 5 వ శతాబ్దమునుండి 8 వ శతాబ్దమువఱకుఁ బశ్చిమచాళుక్యులును 10 వ శతాబ్దమువఱకు రాష్ట్రకూటులును దరువాత 11 వ శతాబ్దమువఱకు మరలఁ బశ్చిమచాళుక్యులును నటుపిమ్మటఁ గాకతీయులును బరిపాలించినటులఁ దెలియుచున్నది. హనుమకొండపట్టణ మాంధ్రరాజ్యలక్ష్మీవైభవమునకు మూలస్థానము. ఈశిథిలములందు సహస్రస్తంభమండపము ముఖ్యమైనది...రుద్రదేవరాజు విజయయాత్రసలిపి తనరాజ్యమునకు మరలివచ్చుసమయమున ననేకదేవాలయముల స్థాపించెను. ఆకాలముననే యీదేవాలయమును నిర్మించెను. ఎదుట వాసుదేవుఁడును గుడివైపు సూర్యదేవుఁడును బడమరవైపున రుద్రేశ్వరుఁడును గలరు. వాసుదేవుగర్భాలయద్వారముపయి శంఖచక్రగదాధారియగు నరసింహవిగ్రహమును శివాలయద్వారముపయిఁ ద్రిశూలధారియగు రుద్రునివిగ్రహమును సూర్యాలయద్వారముపయిఁ ద్రిశూలధారిణియైన లక్ష్మీవిగ్రహమును జెక్కియున్నవి. ఈ 3 ద్వారములయందుఁగల విగ్రహములకును రెండు పార్శ్వముల సర్పాలంకారభూషితములై తలలు పయికెత్తి నోరులు తెఱచుకొని నిలువఁబడియుండు వరాహవిగ్రహములు వెలయుచున్నవి. వాని నోటినుండి చిత్రవిచిత్ర ఫలపుష్పపత్రసమన్వితలతాపుంజము బయలువెడలి యతిమనోహరముగా నానాముఖముల నల్లిబిల్లికలతోఁ బయికెగఁబ్రాఁకి తమమధ్యనుండు విగ్రహము చుట్టు వ్యాపించియుండును. ఈసుందరశోభాయమానలతాకుంజములు దర్శనీయములు...ఈదేవాలయము

నిర్మింపఁబడి 750 సం॥ లు గడచినను సానఁబట్టిన శిలాప్రతిమలు స్తంభములు మున్న గునవి నేఁటికిని...ప్రకాశించుచున్నవి. ఈయాలయము పై రాకాలమున రుద్రేశ్వరమని వ్యవహరింపఁబడిన ట్లీయాలయములోనున్న శాసనమే సాక్ష్యమిచ్చుచున్నది. మఱియు నీగ్రామమునకు దక్షిణభాగమునందున్న యొక చిన్నపర్వతాగ్రముపయిఁ బద్మాక్షీ దేవాలయము నిర్మింపఁబడియున్నది....చుట్టుప్రక్కల జైనవిగ్రహములు గలవు కాఁబట్టి యీ దేవళము మొదట జైనులచే స్థాపింపఁబడినట్లు తోఁచుచున్నది...మాధవవర్మ (ప్రతాపరుద్రుని) కాలములో నీజైనాలయము హనుమకొండవిప్రులు స్వాధీనము చేసి కొని దుర్గముయొక్క నామాంతరమని నమ్మి పద్మాక్షి పేర నర్చనాదుల సలుపుచున్నారు.

దోమకొండ—ఇది రెడ్డిప్రభుత్వముచే నేలఁబడియున్న సంస్థానము. దీనికి ముఖ్యపట్టణమైన బిక్కవో లిప్పుడు బిక్కనూరని వాడఁబడుచున్న గ్రామము. దోమ కొండపృథ్వీపతులలో మల్లారెడ్డి...పద్మపురాణము మొదలగుకావ్యముల రచియించి నాఁడు.

వేములవాడ—ఇది కరీమ్‌నగరమునకు 3 ఆమడలదూరమున నున్నది. ఇచ్చటి నాంధ్రకవులలో నొకఁడై ప్రఖ్యాతిగాంచి భీమేశ్వరపురాణమురచించిన భీమకవి జనన మొందినాఁడు. ఈగ్రామమునందు భీమేశ్వరాలయము కలదు...

మహబూబునగరముజిల్లా వనపర్తి—ఓరుగల్లు పడిపోయినతరువాత దానిసామం తులే దీనిని సుమారు 600 సం॥ లనుండి సంస్థానముగాఁ జేసికొని స్వతంత్రాధికారముతో నేలుచున్నారు. ఇచ్చట గొప్ప కోటలు గలవు.

రాయచూరు — శ్రీకృష్ణదేవరాయలకాలమున హిందూదేశములో ముఖ్య ముగా దక్షిణహిందూదేశములో రాచూరు (రాయచూరు) దుర్గమువంటి బలాఢ్యమైన దుర్గము మఱియొకటి లేదు. అయ్యది ఘనపరాక్రమవంతుఁడగు నాది ల్షాహ వశమున నుండెను. ఈదుర్గమును గుఱించి హిందువులకును మహమ్మదీయులకును ననేకఘోరయుద్ధములు జరుగుచుండెనుగాని యాదుర్గముమాత్రము విజయనగరప్ర రాజుల కధీనము కాలేదు. సాళువ నరసింహరాజు తన మరణశాసనములోఁగూడ రాయ చూరుదుర్గము స్వాధీనముకాలేదని విచారముతో వ్రాసెను. శ్రీకృష్ణదేవరాయలు పూర్వము దిగ్విజయయాత్ర ముగించినతోడనే రాయచూరుదుర్గముమీఁదికిఁ బోవఁ జూచెనుగాని కారణములేక పోవుట యన్యాయమని కాలము నిరీక్షించుకొనియుండె ను. చివరకు సైదరుకారను రాజద్రోహిమూలమున వారి స్నేహమునకు భంగముకలిగెను. పగదీర్చుకొను సమయము దాపునకు వచ్చినదికావున నాలస్యముచేయక శ్రీకృష్ణదేవ రాయలు 10 లక్షలసైన్యముతోఁ బోయెనని చెప్పినప్పుడు హిందూదేశమున మహా భారతయుద్ధానంతర మొక్క తాళికోటయుద్ధమునం దక్క నేమహారాజును నేమహా చక్రవర్తియు నింతసైన్యమును దీసికొనిపోయి యుద్ధముఁజేసినట్లు కనఁబడమి రాయల సమర్థతకెవరైనను నద్భుతమందకపోరు...రాయలు రాయచూరుదుర్గమును ముట్టడించె నని తెలిసి యాదిల్షా గొప్పసైన్యముతో వచ్చెనుగాని పరాభవమును జెంది పోయెను. ఈరాయచూరు కృష్ణా తుంగభద్రానదుల నడుమ నున్నది.

గద్వాల__విజయనగరము పడిపోయినతర్వాత దాని సామంతులే దీనిని సుమారు 800 సం॥ ల నుండి స్వతంత్రాధికారముతో సంస్థానముగఁ జేసికొని యేలు చున్నారు. ఇచ్చట గొప్ప కోటలు గలవు.

గోలకొండ__ ఈగోలకొండదుర్గము ప్రస్తుతము హైదరాబాదుపట్టణమునకు 6 మైళ్ళదూరమున నున్నది ... 16 శతాబ్దమున నీగోలకొండరాజ్యమును జంషిదు కుతుబుషాహ పరిపాలించునప్పుడు జగదేకరావును బ్రధానమంత్రిగఁ జేసికొనెను. అద్దంకి గంగాధరకవియుఁ బొన్నగంటి తెలగనార్యుఁడును నిబ్రాహిం కుతుబుషా కాల ములో వారి యాస్థానమునసుండి తపతిసంవరణము యయాతిచరిత్రము వ్రాసి నవాబున కంకితముగ నొసంగిరి. దీనింబట్టి యాంధ్రగీర్వాణభాషలను మహమ్మదీయచక్రవర్తులు సహిత మభివృద్ధికిఁదెచ్చి...నటులఁ దెలియుచున్నది. 17 వ శతాబ్దమునఁ దానీషా కాలమున నక్కన్న మాదన్న మంత్రులుగ నుండిరి. వీరిసమయమునవే ... రామదాసు గారి పుణ్యచరిత్ర మీభూమియందుఁ బ్రఖ్యాతిగాంచినది. ఈనవాబుకాలములో హిం దూమహమ్మదీయులకు నిగ్రహము ఘటిల్లక సంధిపొసఁగియుండుటచే రాజ్యము ప్రజా రంజకముగ రామరాజ్యము వలె నుండెను. కాని మహమ్మదీయుల కీర్ష్యాగ్నిజ్వాల ప్రబలుటచేతను గయ్యమునకుఁ గాలుద్రవ్వుచున్న ఢిల్లీపాదుషాయగు నౌరంగజేబు రవు లుచున్న యగ్నికుండమున ఘృతఘటసంచయముల నింపినటులఁ దమ సోదరబృందము నకుఁ గేలూఁతయొసఁగినఁ గడ కక్కన మాదనల మరణమునకును గోలకొండరాజ్యవినా శనమునకును గారకులై ప్రజాహితముగ 175 సం॥ లు రాజ్యముఁజేసినకుతుబుషాహి రాజవంశము నశించునటులఁ జేసిరి.

---

శ్రీవావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిలుగారి సన్మానసభ, కడప.

కడపలో మిత్రమండలివారు 19-8-1939 తేదీన జరిపిన భాషోద్ధారక శ్రీవావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిలుగారి సన్మాన...సభలోఁ జదివిన పద్యరత్నములు.

సీ. ప్రాక్కవిచంద్రుల భావనాబలమును
దెలియంగననువు సంధించినారు
ఏగ్రంథమునకేని యిల్లిల్లు దిరుగక
సులభలబ్ధవిధమ్ముఁ జూపినారు
సంకుచితంబైన జాను తెనుంగున
సరళపథిసన్నతల్ నెఱపినారు
విస్మృతకవిజన విరచితకావ్యాళి
దృశ్యలోకాని కందిచ్చినారు
ఆంధ్రరాష్ట్రానఁ దొలుదొల్త నన్నిదిశల
మాతృసేవాస్వరూపసమ్మాననీయ

విస్తృతగ్రంథముల నింపి వెలసినావు
వేడబము గాదు వావిళ్ళ వేంకటేశ!

సీ. బీదసాదల నెల్లవిధముల దరిఁజేర్చి
భూరిసాహాయ్యంబునఁ బ్రోచినావు
ఆంధ్రభాషాసేవకై భాగ్యజీవిక
సర్వస్వ మర్పింపఁ జాలినావు
తెలుఁగుతల్లికి ముద్దులొలికించు బిడ్డలఁ
దలమానికంబవై మెలఁగినావు
తండ్రి పట్టినదీక్ష తప్పక నెఱవేర్చి
గ్రంథాళిఁ బ్రకటింపఁ గలిగినావు
మాతృదేవ్యర్చనాసక్తమతిఁ ద్రిలింగ
పత్రికారాజమున్ స్థిరపఱచినావు
చెన్నపుర మాంధ్రులదె యని చెప్పినావు
బళిర వావిళ్ళ వేంకటేశ్వరసుధీంద్ర!

సీ. జీర్ణపర్ణంబుల శిథిలావశిష్టమౌ
తెలుఁగుపొత్తముల ముద్రించినారు
ముద్రణావ్యయభరంబుల కోర్వఁజాలని
కవులను దయఁజూడఁ గలిగినారు
మారుమూలల దాగి పేరైన వినరాని
సత్కావ్యముల దిశల్ జాటినారు
అట్టుకలన్ బూజుపట్టిన తాళద
ళగ్రంథముల బయల్వఱచినారు
పల్లెపల్లెల నింటింటఁ బ్రతిమనుజుని
చెంత మీ పుస్తకములనే చేర్చినారు
యోపినకొలంది భాషామహోపకార
మన్యు లెవ రిట్లు సేసి రీయాంధ్రికొఱకు.

సీ. మాబాల్యమందె రామస్వామివ్యాఖ్యాన
మనుచరిత్ర పఠించుకొనుటకతన
మఖఁబుట్టి పుబ్బలో మడఁతపెట్టక యేక
థాటి నేఁటికిఁ గృషి దనరుకతన

గ్రంథము లేవేని గావలె నన్న న
నన్యశరణము మీరగుటకతన
స్ఖాలిత్యములు లేనిచక్కని పొత్తముల్
తుదికెట్లో మీయొద్ద దొఱకుకతన
ఆంధ్రభాషామహోదయ వ్యాప్తికొఱకు
పెట్టఁబడినట్టి "వావిళ్ళ ప్రెస్సు" ఆంధ్ర
కేంద్రకార్యాలయంబునై కెరలి స్వీయ
జాతిపునరభ్యుదయకారి యౌాత ప్రజకు.

కావ్యపురాణతీర్థ విద్వాన్ శ్రీజనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు

మ. నియమంబొప్ప శ్రుతు ల్పురాణతతులున్ స్మృత్యుక్త సద్గ్రంథసం
చయము ల్కావ్యసమూహము ల్కడుఁబ్రయాసం బొందినన్ లభ్య మెం
దయినంగాక తపించుచుండ్రు మును పోయార్యోత్తమా! యిప్డు మీ
దయ సౌలభ్యముగల్గె నెల్లరకు సద్గ్రంథాళి సంధింపఁగన్.

కవిసింహ డి. రాజశేఖరశతావధానిగారు,
ప్రొద్దుటూరు.

సీ. ఘనము లముద్రితగ్రంథముల్ పెక్కు శో
ధించి తెప్పించి ముద్రించినావు!
ధనహీనులైన విద్వత్కవీంద్రులనాద
రించి గ్రంథము లుద్ధరించినావు!
గ్రంథాలయములపైఁ గడుఁబ్రీతి వందలు
వేలు కావ్యముల నర్పించినావు!
మెండుగా ఖండంబు నిండు కాంగ్రెసు చేరి
దేశసేవల నాటి తేటినావు!

సరసుఁడవు వచశ్శాలివి! సంస్కృతాంధ్ర
కావ్యపోషకుఁడవు త్యాగఘనుఁడ వగుదు
వయ్య! మాకడ్పపురికి సుస్వాగతంబు!
సరసవావిళ్ళ వేంకటేశ్వరబుధేంద్ర!

## —◆ రాఁబోవు ధర్మవిధ్వంసక శాసనత్రయము ◆—

(శ్రీ. కామేశ్వరశర్మగారు)

ధర్మదేవత కింకను బ్రాణములు ఉన్నవని కాఁబోలు ఇంకను శాసనరూప తరంగిణులు వచ్చుచున్నవి. ఇంతవఱకుఁ వెలిసియున్నవి మూడు. 1 వర్ణాంతరవివాహపు బిల్లు. 2 ఆంధ్రేతరుల దేశములలో దేవాలయప్రవేశపు బిల్లు. 3 అస్పృశ్యులకుఁ బ్రవేశములేని కాఫీహోటళ్ళ లైసెన్సు రద్దుచేయు బిల్లు. వర్ణాంతరవివాహపు బిల్లు శారదా చట్టపు సవరణలో మిక్కిలి తోడ్పడినవారిలో నొకరగు ప్రకాశ్ గారు ప్రవేశపెట్టిరఁట. ఎవరైనను సరి వలసినచో యంతర్జాతివివాహములనుగాని వర్ణాంతరవివాహములనుగాని చేసికొన్నఁ దప్పుగాదనియును సమానకులశీలాచారములు గలవారిలో జరుగు వివాహముల కుండుగౌరవమే యీవివాహములకుఁగూడ నుండవలెననియు లౌకికములకుఁ జిక్కులు లేకుండఁ జేయవలెననియు నీబిల్లు నుద్దేశము. ఈశాసనమువల్ల బహుపత్నీత్వము ననేకభర్తృత్వము నశింపఁజేయవచ్చునని వీరి తలంపు. వంశాభివృద్ధికిఁగూడ నీశాసన ముపయోగపడునని వీరి యూహ. హిందూవివాహమునుగూర్చి ప్రకాశ్ గారు బాగుగాఁ దెలిసికొన్న బాగుగా నుండెడిది. హిందూవివాహములు కేవల లైహికసుఖమునకు సంబంధించినవే కాక పారమార్థికసుఖమునకుఁగూడ సంబంధించినవి. సమానకులశీలాదులుగల వివాహములే వంశాభివృద్ధికరములై రెండుసుఖముల నొసగూర్చుటకుఁ దగినవై శాంతిప్రదములై దేశోన్నతికిఁ గారకంబులగునుగాని యన్యములు కానేరవని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. శ్లో॥ వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే యను సూక్తి జ్ఞప్తికిఁ దెచ్చుకోవలసియున్నది. వర్ణాంతరవివాహములవల్ల వివాహవిచ్ఛేదాదులు దక్క వేఱొండుఫలము గన్పింపదనుటలోఁ బాశ్చాత్యవివాహములే సాక్ష్యము. పాశ్చాత్యులలో నున్నతకుటుంబికు లీవర్ణాంతరవివాహముల కంగీకరింపరనుటకు 8 వ ఎడ్వర్డుగారి చరిత్రమే నిదర్శనము. మన్వాదిస్మృతికర్త లిట్టివివాహములు కూడవని శాసించియున్నారు. పారమార్థికసుఖమును గోరువా రొప్పుకొనరు.

శ్లో. హీనజాతిస్త్రియం మోహా దుద్వహంతో ద్విజాతయః
కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతాం.
శూద్రాం శయన మారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిం
జనయిత్వా సుతం తస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే.
దైవపిత్ర్యాతిథేయాని తత్ప్రధానాని యస్యతు
నాశ్నంతి పితృదేవా స్తన్నచ స్వర్గం స గచ్ఛతి
వృషలీఫేనపీతస్య నిశ్వాసోపహతస్యచ
తస్యాం చైవ ప్రసూతస్య నిష్కృతి ర్న విధీయతే.
కపిలాక్షీరపానేన బ్రాహ్మణీగమనేనచ
వేదాక్షరవిచారేణ శూద్రః పతతి తత్క్షణాత్.

ఇట్లనేకప్రమాణములు వర్ణాంతరవివాహమును నిషేధించునవి కలవు. అఖిల

మన్నించుటవలనఁ బరిజనులలో నెక్కువ దైనికమర్యాదా కలుగుచుండుట. పరిజనుల నెవరు? సవర్ణులా? హరిజనులా? దేవాలయప్రవేశము లేకపోవుటవలన సవర్ణులలో నైతిక మర్యాదను లేదా? సంబంధములేనిమాట. అర్థములేనిమాట. నైతికమర్యాదకును బయలు దేవాలయప్రవేశములకు కలుగునేమో విచారించవలెను. హరిజనులు దేవాలయప్రవేశ మన్నించు చున్న మేము బాగుపడమనిరా? నిక్కముగ దేవాలయప్రవేశము వారు కోరిరా? సనాతనధర్మమువల్ల హరిజనులకు హాని కలిగెనడుట. హాని యెట్టిదో పైనచెప్పిన వార్త లనుబట్టి కూడఁ దెలిసికొనెదరు. 467

దేవాలయప్రవేశము లేకపోవుటచేతనే నిదారిద్ర్యమో నున్నారటకాఁబోలు! హరి దారిద్ర్యమునకుఁ గారణము న్యాయమేమని సిద్ధాంతముచేసినారు. అగ్రహారములో నర్తకులున్నదా? ఏమి దారిద్ర్యము? ధర్మమువల్ల హానికలిగినదనుటలో సత్యములేదు. ధర్మమువల్ల హానికి దారిద్ర్యమేల? ధర్మశాస్త్రము మచ్చరించినవారికి దారిద్ర్యమును వర్జించవలెను. ధర్మమువలన హానికలిగినది కాఁబట్టి మేము సమర్థించుచున్నఁ దా మన లంటించునది యధర్మమని తమకుఁ దామే చాటుకొనుచున్నారు. ధర్మమువలన దారిద్ర్యముకలిగిన దన దురాగ్రహ మనఁబడును. అట్టి దురాగ్రహము న్యాయమనఁ దా మధర్మమార్గమున నుంటిమని గ్రహించవలెను. దేవాలయము లన్నిటిలోను హరిజనులకుఁ బ్రవేశము కలుగునని చెప్పుట కేలాటిసందేహము లేదన్న మహాశయులు దేవాలయము లన్నియుఁ బాడువడుటగూడఁ దమ జీవితకాలములోపలనే చూడఁగలరని తెలిసికొన వలెను. దేవాలయధ్వంసమే పర్యవసానఫలము. వేఱొండు గలుగఁబోదు. దీనిగురించి యాంధ్రపత్రిక హరిజనులు హిందువులని యంగీకరించినప్పుడు హిందూదేవాలయము లలో వారు ప్రవేశించుట కెట్టినిషేధము నుండరాదనియు నైనను చిరకాలాగతా చారమును బట్టి యట్టినిషేధము గలదనియు హిందూసనాతనవాదు లంగీకరించకపోయిన యెడల హిందూసంఘమునకు ముప్పుగల్గుననియు హరిజనులు పరమతమందుఁ జేరెదరనియు హిందూమతము క్షీణించుననియు నట్టి యుపద్రవము కలుగకుండఁ జూడ బాధ్యత ప్రతిహిందువుమీఁదను గలదనియు ఘోషించుచున్నది. హరిజనులు హిందువులుకారని సనా తను లనుటలేదు. సవర్ణులలోఁగూడ దేవాలయప్రవేశమువిషయమై భేదములున్నవి. అందఱకు సమానమైన హక్కులు శాస్త్రములందుఁ గనఁబడవు. లోపలికిఁబోవు బ్రాహ్మ ణునకుఁ గలుగు ఫలమును శిఖరదర్శనమువలనఁ జండాలురకుఁ గలుగు ఫలమును సమా నము. బ్రాహ్మణులలోఁగూడ నర్చకునకుఁ దక్క మిగిలినవారికి గర్భాలయప్రవేశమున కర్హతలేకున్న విషయములో హిందూమతస్థులైనంతమాత్రమున వారికిఁ బ్రవేశప్రాప్తి కావలెననుట శాస్త్రపరిచయము లేనిమాట. శాస్త్రము ననుసరించి యీయాచారము వచ్చినదే కాని శాస్త్రనిషిద్ధము కాదని తెలిసికోవలెను. హిందూసంఘమును బాగుగ గు ర్తెఱింగినచో నిషిద్ధులయాలయప్రవేశమే హిందూసంఘమును ధ్వంసముచేయునని చెప్పవలసియుండును. హిందూమతమును సమగ్రముగ నెఱుఁగవలెనన్నచో శ్రుతిస్మృ తులఁ బరిశీలించవలెనుగాని హిందూశబ్దమును నెఱిఁగినఁ బ్రయోజనములేదు.

ఎగ్గిన నూడిపోవు ముక్కు తుమ్మిన నెన్నినాళ్ళుండును? పరమతములోఁ జేరుదురను భయముతో నెన్నినాళ్ళు జీవించుట? ఎందులకుఁ బరమతములోఁ జేరు దురు? హరిజనులు తాముకూడ హిందువులమని యొప్పుకొందురుకదా! వారికి దేవా

లయప్రవేశప్రహక్కుఁ జూపలేనను సంస్కరణశిరోమణులుకూడ వారు హిందూమతస్థులనియే యనుచున్నారుకదా! అయినచో హిందూమతప్రమాణగ్రంథములు వారివిషయమై యేమి చెప్పుచున్నవో చూడరాదా? మతధర్మమును విడనాడుట వారికి శ్రేయమా? మతధర్మము నతిక్రమించినపుడింక నామతస్థుఁ డెట్లగును? ఎంతవఱకు వారి కోర్కులఁ దీర్చుచుండెదరు? రేపు తమకు సవర్ణుల కన్యల నిచ్చి వివాహాదులు జరుపుచుండినఁగాని హిందూమతములో సమానమునిన ట్లు చేయనటులైన సంసిద్ధులయ్యెదరా? హిందూమతమునకంటెఁ దక్కువజనసంఖ్యగల మతములు నాశనమగుచున్నవా? ఎంతకాలము పరుల యాధారమూఁద జీవించుట? ఇది పౌరుషమా? అసమర్థతయా? లేచి పారిపోవచ్చి బెదరించెడి భార్యతోడి సంసారపరిస్థితి యెట్లుండును? మతధర్మములను బోధించి వారికి మతమునందు విశ్వాసము గలిగించి రక్షింపరాదా? ఎంతవఱకు కీర్తికాముకు? ఆలయప్రవేశముచే సనాతనులు భిన్నాభిప్రాయముగలవా రగుదురని తెలియవలదా? హరిజనులకన్న సనాతనులు తక్కువసంఖ్య గలవారా? కాంగ్రెసుసంస్థ యొక్క హిందూమతశ్రేయస్సును గోరునదా? లేక సర్వమతశ్రేయమును గోరునదా? మసీదుల దగ్గఱ మేళమువాయించెడి స్వాతంత్ర్యత యీకాంగ్రెస్సు కలుగఁజేయఁగలదా? హిందూమతమును ధ్వంసముచేయుటయే యాశయమా? సనాతనుల మౌనమే ధర్మనాశనమునకు హేతువు. సనాతనధర్మాభిమానులారా! లెండు. మౌనవ్రతమును బలి త్యజింపుఁడు. అవసరమైనచో ధర్మాగ్రహ మునరించి స్వధర్మే నిధనం శ్రేయః యను సూక్తిని సార్థకము చేయుఁడు. మతాభిమానము లేదా? ధర్మబాహ్యు లయ్యెదరా? ధర్మదేవతానుగ్రహమునకుఁ బాత్రులు గండు. కార్యశూరులు గండు. వృథా తీర్మానములతోఁ దృప్తిఁ జెందకుఁడు. లెండు.

---

## —— దేవాలయ ప్రవేశము ——

దక్షిణదేశములో దేవాలయప్రవేశము గగ్గోలు పుట్టించుచున్నది కాని యాంధ్రమండలము మాత్రము నిశ్చలముగా నున్నందుకు సనాతనవాదులు సంతోషించవలసిన సందర్భము ... మనకు మధుర తంజావూరు శ్రీరంగము కంచి మొదలగు పెద్ద క్షేత్రా లేనిమాట నిజము ... వెంకటేశ్వరు లేడుకొండలవాఁ డాంధ్రుల యిలవేల్పయి యుండుటచేతఁ దెలుఁగు సరిహద్దులలో హరిజనోద్యమము వ్యాపించకుండఁ గాపాడఁ గలుగుచున్నాఁడు. తిరుపతి యాంధ్రికమిషనరు గవర్నమెంటు సాకరైనను హరిజనప్రవేశాను 'సమ్మతించనని ప్రకటించిన తర్వాత నాంధ్రదేశములోని దేవాలయాలకు వచ్చిన భయ మేమియు లేదు ... దేవాలయాలలో హరిజనులను బ్రవేశపెట్టుటకు సాహసించిన ... ... ... మంత్రిత్వము పోయినదన నేసనాతనవాది కసితీఱ సంతసింపఁడు? ... దేవాలయపు బిల్లూరకవచ్చినదా? ఎవరినెత్తి నణచుటకో వచ్చినది. సందేహములేదు. ఆంధ్రమహాశయుల కీరహస్యము తెలియును. అందుననే తెలుఁగు జిల్లాలలోని గుళ్ళు గోపురాలు నేమియుఁ గదలకుండ నిశ్చలముగానున్నవి...డిసిప్లిన్ (కట్టుపాటు)...పూర్వము కాంగ్రెసులోఁ జేరుటయనఁగా భయము. బ్రతిమాలినను జేరని వారిప్పుడు తాము చేరుటయే కాకుండఁ జేర్పించుటయు సంభవించుచున్నది. నేఁటి కాంగ్రెసులో 49 లక్షలమంది మెంబరులు చేరినారన సామాన్యమా? ఇంతమందిని జేర్చుట కెన్నికారులు తిరిగియుండునందురు? ఎన్నిగాలనుల పెట్రోలు తగులఁబడియుండవలె?

పల్లెలలో నాసమయాన కందఱు నిండ్లలోనుండెదరా? ఉండినమాత్రము వెంటనే పావులాలు గొండినుండి తీసియిచ్చెదరా? సంతకాలు చేసినఁ జాలునందురు కాన్వాసరులు. నిశానుదారయిన వేలిముద్ర వేయుమందురు. ఊరూరుఁ దిరుగుట కష్టమైన నింటిదగ్గఱనే కూర్చుండి దొంగసంతకాలు నబద్ధపుముద్రలు వేయించిన యుత్సాహపరులుకూడ నున్నారు. ఈమెంబర్లనూ జేర్పించుట కాంగ్రెసును వ్యాపింపఁజేయించుటకైన ననవచ్చును. అందుకుఁ గాదు. కాంగ్రెసు నెన్నికలలోఁ దమ ప్రాంతాన నెక్కువసీట్లను దెప్పించుకొనుటకు. తా మెక్కువవోట్లతోఁ బ్రాతినిధ్యము పొందుటకు. ఒక్కప్రాంత మేమిటి? అన్నిప్రాంతాలలోను దొంగలెక్కలు బయలుదేఱినవి. అంతయు బహిరంగమే. ఏమిటిదియని యెవరైనను ముక్కుమీఁద వేలువేసికొనిన మీజిల్లాలోమాత్రము దొంగలెక్కలు తయారుకాలేదాయని తిరిగి సవాలువేయుదురు. ఎట్లీదొంగతనాలు బయటఁబడుట? 18

కాంగ్రెసులోఁ జేరుట నేరమగునని దొరతనమువా రొకప్రకటన చేసియుండినఁ దమపేరులు తమ కెఱుకలేకుండనే కాంగ్రెసు రిజస్టర్లలో నమోదుచేసినారని యెన్ని వేలమంది కైఫీయ తిచ్చెడివారో! పోనీ, ప్రతి మెంబరును బావులా యిచ్చినను లెక్కలు చూపవలెఁగా! నిజముగా వసూలుచేసినఁగదా వసూలుచేసిన డబ్బును జమయు ఖర్చును జూపుటకు? కాంగ్రెసుకుఁ గొన్ని నిబంధన లున్నవి. పైన రాష్ట్రపుఁ గాంగ్రెసు కమిటీకి జవాబు వహించవలెననెడి జ్ఞాపక మెక్కడ? కాంగ్రెసుమెంబ రొకరికి జవాబీయవలెనా యను ధీమాకు కూడ బయలుదేఱినది. సరియైన తేదుల నాఁటి పేళ్ళపట్టికలను బంపరు. వారివంతు డబ్బును జమకట్టరు. రసీదుపుస్తకాలను జూపరు. ఎన్ని రిమైండర్లను బంపిననేమి? అన్నియు బుట్టదాఖలే. ఇఁక నినస్పెక్టర్ల తనిఖీకా వీరు లోఁబడుట? ఈతిరుగుబాటులు సర్వత్ర జరిగినవి కాని యీయచ్చాఁబోతులకు ముక్కుతాళ్ళు పోసెడివా రున్నారు పైన. వారు కొరడా పుచ్చుకొన్నారు. తనిఖీలు మొదలుపెట్టినారు.

దొంగతనా లెన్నో బయల్పడ్డవి ... తెలుఁగునాడులో నెన్నిచోట్ల నెన్ని పేరులు కల్పింపఁబడ్డదియు నాంధ్రరాష్ట్రపుఁ గాంగ్రెసుకమిటీవారి నడిగినఁ దెలియఁ గలదు. పశ్చిమకృష్ణలో 30 వేల పేళ్ళను గొట్టివేసినారనియేకా పెద్ద రాద్ధాంతము జరిగినది! ఎవ రెట్టి దొంగతనాలు చేసినను దనిఖీలు చేయరాదు. శిక్షలు (మొదటికే) కూడదు. ఈవిద్రోహము నానాఁటికిఁ బెరిగిపోయినది. సంఖ్య పెరుఁగుట కాంగ్రెసుకు వాఁపుకాని బలుపుకాదన్నాఁడు గాంధిమహాత్ముఁడు. ముందింటిని జక్కఁబెట్టుకొనుఁడు, శుద్ధిచేయని యిల్లు దయ్యాలకొంప యగునని మహాత్ముఁ డఱవఁగా నఱవఁగా నాయన పోరు పడలేక, ఆలిండియా కాంగ్రెసుకమిటీవారు కొన్ని కఠిన నిబంధనలను జేయక తప్పకవచ్చినది. కేవలము మెంబరులను జేర్పించుటలోనేనా యీయవినీతి? ఎన్నికలలో నెన్ని మోసాలు? ... వేలమంది నెవరు గుర్తించఁగలరు? దొంగపేళ్ళు చెప్పించుట. వోట్లు వేయించుట. వోట్ల పెట్టెలను మాయముచేసిన సందర్భాలుకూడ నేర్పడ్డవి. ప్రజ లమాయికులు. వారి కేమి తెలియఁగలదు? జైలుకు వెళ్ళినవాఁ డెల్ల ... దేశభక్తుఁడు. కాంగ్రెసుప్రముఖుఁడు. వీరి కదపాజ్ఞల యక్కఱ లేదు. మంత్రులుకూడ వారి చెప్పుచేతలలో నుండవలసినదే ... లేక

పోయినఁ బత్రికలలో శాపాలు. జైలుకుఁబోయిన ప్రతి కాంగ్రెసు గోత్రికుఁడుఁ ప్రభువై పోయినాఁడు. పైన మంత్రులు, మధ్యఁ గలెక్టరులు, క్రిందఁ దహశ్శీలుదారులు, అందఱు నీ గాంధీటోపీదాసులకు సలాములు పెట్టవలసినదే. దేవుని పెండ్లి కందఱుఁ బెద్దలైనట్లు కాంగ్రెసుగవర్నమెంటుపైఁ గాంగ్రెసు బంధువు లందఱుఁ బెత్తనదారు లైనారు. అసెంబ్లీకిఁ బ్రతినిధులను బంపినాము. వారి ద్వారమునఁ బ్రభుత్వము సాఁగవలసినదే కాని బయటివా రడుగడుగునను జోక్యము కల్పించుకోఁగూడద నెడి వివేకమేదీ? మంత్రులకుఁ బ్రతివారు హుకుములు పంపెడినారే. ఉద్యోగా లిచ్చుట దగ్గఱనుంచికూడ వీరి కోరికలను మన్నింపవలసినదే. వీ రెట్టి యాందోళన చేసినను మంత్రు లెట్టి చర్యను దీసికోఁగూడదు. జమీందారులకుఁ బన్నులను జెల్లించఁగూడదని బోధించుచున్నను వారి భూములలో రైతులను బలాత్కారముగాఁ బ్రవేశపెట్టించినను వాక్స్వాతంత్ర్యము పేరట నూరకుండ వలసినదే. ఏ కాంగ్రెసు మెంబరైనను శాసనోల్లంఘనము మొదలుపెట్టించినఁ బోలీసువారు చేతులుకట్టుకొని దూరముగా నిలువఁబడి చూచుచు నుండవలసినదే కాని వానినరెస్టుచేయరాదు. దొమ్మి జరిగినను...లాఠీలను బ్రయోగింపఁగూడదు. పోలీసు లారీలకెవ రైన నడ్డముగాఁ బడుకొన్న వారిని బ్రక్కకుఁ ద్రోసివేయుట దౌర్జన్యము. ఇఁకఁ బ్రభుత్వ మెట్లయ్యా సాఁగునది? నేఁటి రైతుసంఘా లెంత బాధ్యతావిహీనముగాఁ బ్రవర్తించుచున్నదియు మహాత్ముఁడు నిర్భయముగా బయటఁబెట్టినాఁడు. సత్యాగ్రహమన్న సరి. దాని నెవరు సాఁగించినను పైవారి యనుమతి యున్నను లేకున్నను... కాంగ్రెసుకమిటీలుఁ గాంగ్రెసుప్రభుత్వము నాదరించవలసినద నెడి సిద్ధాంతములోకి దిగినది. ఇదంతయు నరాజకముగాక మఱేమిటి? కాఁబట్టియే యాలిండియాకాంగ్రెసు కమిటీవారు కాంగ్రెసులో మెంబరులను జేర్పించుట దగ్గఱనుంచి యెన్నికలకు నిలఁబడెడి కమిటీమెంబరుల నిర్ణయమువఱకు నిబంధనల నేర్పాటుచేసినారు. 3 సం॥ లు వరుసగాఁ బాపులా మెంబరులై యుండిననే కాని కమిటీలకు మెంబరులుగ నిలువఁగూడదన్నారు. ఏడాదిక్రిందఁ జేరినవారై యుండినఁగాని మొదలు వోటుచేసెడియధికార ముండదన్నారు. దొంగ మెంబరులను గనిపెట్టుట కిన్స్పెక్టరులను నియమించెడి యధికారమును రాష్ట్రీయగమిటీ కిచ్చినారు... రాష్ట్రీయగాంగ్రెసుకమిటీవారుకూడఁ గాంగ్రెసుమంత్రులపైఁ బెత్తనము చేయరాదన్నారు... వారియనుమతి లేక యే కాంగ్రెసుగోత్రికుఁడు సత్యాగ్రహాలను సాగించఁగూడదన్నారు. ఈ నిబంధనల నుల్లంఘించిన వారిపై రాష్ట్రపుఁ గాంగ్రెసుకమిటీవారు మొగమోటములేక డిసిప్లినరీచర్యలను దీసికోవలెనని విధించినారు. ఇంతకాలము విచ్చలవిడిగఁ బ్రవర్తించుచున్నవారి కీనిబంధనలు కంటకముగానుండుటలో నాశ్చర్యమేమున్నది! ఎవరియిష్టమువచ్చినట్లు వారు ప్రవర్తించిన నది యొక సంస్థయనెడిపేరున కెట్లర్హమౌను? సంస్థ యన్నతర్వాతఁ గొన్ని కట్టుపాట్లుండకతప్పదు. ఆకట్టుపాట్ల నుల్లంఘించినవారి నాసంస్థనుండి వెలివేయుట తప్పా? ఆకట్టుపాట్లను జేయునదిమాత్ర మాసంస్థలోని హెచ్చుమెంబరు లయియుండవలె... ప్రతిరాష్ట్రీయపుఁగమిటీ ప్రతిజిల్లాకమిటీ ప్రతిగ్రామపుఁ గమిటీ యిష్టప్రకార మాందోళన చేయుట సాగించిన నది కుక్కలదొడ్డి. (5-8-39, 12-8-39. కృష్ణ)

# భూమిక

పాఠక మహాశయులారా!

ఈగ్రంథకర్త కీర్తిశేషుఁడగు నాగయకవి. మద్వితీయసోదరుఁడు. పూర్వపుణ్యవశముననో వంశపారంపర్యముననో కవిత్వ మలవడుటచే నీతనిదియు నాదివలె సహజపాండిత్యమే యనవలసియున్నది. ఈకవి కొన్నిదినములుమాత్రము తాలూకాగుమాస్తాయుద్యోగము నాచరించుచుఁ జంద్రహాసనాటకా ద్యనేకగ్రంథముల రచించిన నర్సారావుపేటవాస్తవ్యులగు బ్ర: మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ గారికి శుశ్రూషఁ జేసి కవిత్వము నభివృద్ధియొనర్చుకొని యప్పుడప్పుడనేకచాటుపద్యములను గీర్తనలను మంగళహారతులను వ్రాయుచు, దేశాటనముచేసి, సంపాదించిన ద్రవ్యముతో జీవన మొనర్చుచు నీప్రబంధమును రచించియున్నవాఁడు. ఇదియునుంగాక తాను సంస్కృతభాషయందు విశేష కృషి చేయకపోయినప్పటికి నప్పటికిఁ దెనిఁగింపఁబడని మాఘస్నాన మాహాత్మ్యమును మాఘపురాణమను పేరుతో స్వబుద్ధిచేతనో స్నేహిత ప్రబోధముననో చక్కనిశైలితో నాంధ్రీకరించెను. తదుపరి యీగ్రంథములు రెండును సోదరుండనగు నావశము కాఁగా బీదవాఁడనైనందున నేను రచించినగ్రంథములే యెట్లుముద్రింపఁబడునాయని యాందోళన మొందుచుండ గోరుచుట్టుపై రోకలిపోటుపడెనన్నట్టు లీరెండుకావ్యములును దోడైనవే, ఇవి యెట్లు ముద్రింపఁబడవలయునా, ముద్రణభృతికి సాయముఁజేయువా రెవరా యని యోజించి యప్పుడు మాగ్రామములోఁ దహశీల్దారుపదవిని బ్రకాశించుచున్న పిల్లలమఱ్ఱి సోమయాజులు గారిని మఱియొకచోటునకు మార్పుటచే, వీడుకోలు దివసమున జరుపఁబడిన సన్మానసభలో నాశీర్వచనపద్యరత్నమాలను సమర్పించి యాశ్రయింప నామూలాగ్రముగా నేతద్గ్రంథద్వయమును జదివించి మాఘపురాణమును ముద్రింపించెదనని తీసికొనిపోవుటయుఁ బోయిన కొద్దిరోజులలోనే దైవికముగా వారు పరలోకమున కేగుటయుఁ దటస్థించెను.

అంతటఁ గొన్నాళ్లకు వారు కీర్తిశేషులైనసంగతిని విని వారి గ్రామమగు తెనాలికి వెళ్ళి వారి భ్రాతలును న్యాయవాదులును నగు నాంజనేయులు గారిని దర్శించి గ్రంథవిషయమును జెప్పి మనసుగలిగిన ముద్రింపుఁడు, లేనియెడలఁ బుస్తకము నిండని ప్రార్థింప వల్లెయని తన గృహమున నున్న సర్వపుస్తకముల వెదకించి కనఁబడ లేదని చెప్ప నిరాశ

నొంది మత్కృతకావ్యముల నేదాతలనో యాశ్రయించి ముద్రింపించు కొనుచు జానపాటిగ్రామవాసుఁడు నభినవసరస్వతీపత్రికాధిపతియు, అష్టావధాని బిరుదాంకితుఁడు నేతద్గ్రంథపరిష్కరణకర్తయు నగు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారిని దర్శించి గ్రంథకర్త సజీవుఁడైనకాలములో వీరు పరిష్కరించిన యీప్రబంధమును భవత్పత్రికాద్వారమున ముద్రింపించి ముద్రణదానఫలమును బొందుఁడని ప్రార్థింప సమ్మతించి ముద్రింపించియున్నవారు. అట్టిమహోపకారుల కనేకనమస్కారములు.

మ. అలఘుప్రేమవశంబునన్ ధరణియం దాచంద్రతారార్కమై
విలసిల్లంగ సుకన్యకాపరిణయాభిఖ్యప్రబంధంబు బల్
తెలివిం గూర్చు స్వమాసపత్రికను ముద్రింపించెఁదా నేవదా
న్యలలాముండు మహాపురాణమగు స్కాందంబం దొకండౌచు ను
జ్జ్వలమౌ నాగరఖండ మాంధ్రమున మార్పంజాలె నేఁ డీతుం
డెలమిన్ వేనిని సత్కవుల్ మఱియు భూమీశుల్ కడున్ స్తోత్రముల్
సలుపంజాతురు సంస్కృతాంధ్రములలో సాహిత్య మెవ్వాని ద
గ్గల మే సత్కవి జానపాటికులమున్ ఖ్యాతంబు గావించె భూ
వలయంబందున సత్యధర్మరతు నా పట్టాభిరామాఖ్యుఁ ద
త్కులకాంతామణిఁ బుత్రపుత్రికలఁ దత్తుల్యంబయౌ పత్రికన్
కలకాలంబును గూర్మిఁ బేర్మి వెలయం గాపాడుచున్ నిత్యని
ర్మలసత్కీర్తి జగంబులన్ నిలుపుచుం బ్రజ్యేష్ఠసంపత్సుఖం
బుల వర్ధిల్లఁగఁజేయ శ్రీధవు జగత్పూజ్యుం గృపాంభోధి ని
శ్చలభక్తిన్ హృదిఁ బాదుకొల్పుచును నిచ్చల్ నేను బ్రార్థించెదన్

ఇట్లు, విద్వజ్జన విధేయుఁడు,

భిషఙ్మణి, పిన్నెలి నరసింహాకవి.

—♦ శుద్ధపత్రిక ♦—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 20 | నుతించు | నుతింతు | 66 | 13 | నూన | సూన |
| 20 | 8 | వరవి | సరవి | 77 | 14 | దేహిత్రు | దౌహిత్రు |
| 21 | 9 | మసింగి | మసంగి | 82 | 28, 29 | కన్నొని | కన్గొని |
| 34 | 17 | ముర్ధ్నా | మూర్ధ్నా | 86 | 18, 19 | క్రోధోద్రిక | క్రోధోద్రిక్త |
| 53 | 18 | నాది | నాతి | 90 | 4 | దైవిత్యమత, | దైత్యవిమత |
| 64 | 28 | నానతి | నాసతి | | | | |

జగ:— మీనాయనగా రిన్నిసంగతులు నీకుఁ దెలియునట్లు చెప్పెడివాఁడటే? నీ మాయనరయోపిక?

కృ:— మానాయనగారు కాలనిర్ణయముల ననుసరించి పను లొనరించు నభ్యాసముకలిగి యున్నవారు. వర్తమాన పత్రికలం గాని గ్రంథములం గాని యవలోకనచేయు చుండుటకుఁ గొంతసేపు దినమును నిర్ణయించికొనియున్నారు. మాతల్లిగారికి విరామ ముండునట్లుగను మేము బడికరుగనితరుణముగను జూచి చదువుడు నవంతరము చదువుమని గుర్తులుపెట్టి చూపియు మా కావిషయములు బోధపడెనా లేదాయని మరల ననిపించియు నేర్పుచుండెదరు. అందువలన నాకీ 4 మాటలు పట్టుపడినవి. వినినయంశములను జ్ఞాపకముంచుకొనుటకును జ్ఞాపక ముంచుకొనిన సంగతుల నానుపూర్వ్యముగఁ జెప్పుచుండుటకును నా కలవాటు కలిగినది. ఇంతే కాని యిది యొక విద్యయుఁ గాదు. నా కేవిషయమును జక్కగాఁ దెలియను దెలియదు.

జగ:— సరే. నీవు చెప్పినకొలఁది విన నింపగుచున్నది. వితంతువివాహాలు చేసిన నింకేమిటో కావలసివచ్చునను చున్నావే? అస్పత్రులు, ఆ, కాదు, ఇంతసేపు గుణించుకొన్నాను. ఊఁ. జ్ఞాపకమువచ్చినది. వివాహసంబంధాలోచనలసభలనాఁగ అన్నావు. అదికూడఁ గొంచెము చెవినివేయుమమ్మా. వినెదను.

కృ:— ఆమాటా? వివాహబంధవిమోచనకార్యస్థానములు. వానిసంగతులు చెప్పెదను వినుఁడు. మనలోఁ బెండ్లి కనంతర మాదంపతులు బ్రతికియుండినంతకాలము ననుకూలముగ నుండినను బ్రతికూలముగనుండినను భార్యాభర్తలుగనే గడపక తప్పదుకదా! వివాహములప్పుడు రిజెష్టరీపత్రము లవసరములేదు. ఇంగ్లీషుదేశమున నట్లుకాదు. ఇచ్చట మనము చేను జెట్టు గొడ్డు గోద కొనునప్పుడును విక్రయించునపుడును బత్రములువ్రాసి కార్యస్థానముల కరిగి కొనినవారు నమ్మినవారుఁ దమ యంగీకారముం దెల్పి రిజిష్టరీ చేయించుకొనులాగున నాదేశమున దంపతు లిరువురుఁ బ్రార్థనామందిరముల కరిగి యచటి యధికారియెదుటఁ దమ వివాహవిధుల నొప్పుకొని సంతకము లొనరించి రిజిష్టరీ చేయింపవలెను. వీరు పెద్దవాండ్రైన వెనుకనే వివాహము లగుచుండును. కాన మైనరను శంక లేదు. సూత్రధారణకానిది మనలో వివాహసంపూర్తి కానట్టు లీరిజిష్టరీ కానిది వారిలో వివాహము పూర్తికాఁజాలదు. ఇట్లు వివాహము లొనరించుకొను వధూవరు లిరువురును దఱుచుగ యౌవజనులే యని యెల్లరు నెఱుఁగుదురు. వీరు వివాహమాడుటకుఁ బ్రబలకారణము మోహము. వీరి మోహ మచిరపరిచితముగ నుండుట సామాన్యము. ఇతరజంతువు లేకాంతవిహారము లొనరించునట్లు వీరును మైత్రి యొనరించుకొనుటకును గుణగణముల నెఱుఁగుటకును వివాహమునకుఁ బూర్వము కొలఁదికాలము కలసి విహరించుచుందురు. వంశాచారములు సంప్రదాయములు వృత్తిస్వాస్థ్యములు నుచితానుచితములు విచారింపక తాత్కాలికవేషభాషలం గాంచి బ్రమసి భార్యాభర్త లగుటకు సమ్మతింతురు. ఉభయులకును దలిదండ్రుల యనుమతి యనవసరము. యౌవజనులు పెక్కండ్రు ముందు

చూపు కొఱఁతవడియుండు టెల్లరు నెఱిఁగిన యంశమే. ఇటఁ బ్రాయమున లోకు లనేకులు తమకు స్వాతంత్ర్య మలవడినంతన దుష్ప్రవర్తన లలవఱచుకొని దుస్థితుల పాలగుచుండుట మనము తఱచుగఁ జూచుచున్నాముకదా! అటులనే వారును దమ వివాహకాలములు వెనుకముందు లరయక మోహాంధతమసంబున మునిఁగి పెనఁగులాడెదరు. వంశాచారములను సంప్రదాయములను గమనించి మన శ్రేయోభివృద్ధియే తమ జన్మసాఫల్యముగఁ దలంచు మన తలిదండ్రు లొనరించు వివాహములలోనే పెక్కుతావుల విరసము లుత్పన్నములగుచుండ ననుభవశూన్యులగు పడుచువారు తమ కక్కాలంబున జనించు విభ్రమాతురతచే నొనరించుకొను సంబంధములు వైరస్యజనకంబులు గాకుండు టరుదనిన వింత యేమి కలదు ? మన చిన్నతనముననే వివాహము లగుటచే నాఁటినుండియు వధూవరుల చిత్తము లన్యాయత్తములుగాక యాన్యోన్య ప్రేమాంకురదోహదం బొనరించి పెంపొందించుచుండును. ఇట్టి యేర్పాటుం బట్టి భార్యాభర్తల శరీరావయవములతోపాటు మోహలత పెరుఁగుచు యుక్తవయసున నగు నిషేకమునాఁటికిఁ బుష్పఫలప్రదానోచితస్థితిం గాంచి తదనుబంధము లనేకము చేయుచుండును. ఏవేని లోపము లుండినఁ జిరపరిచితములగుటచే నంత గర్హ్యములు గాక క్రమముగా మాఱుచుండును. అకస్మాత్తుగా నైనట్టియు నెదిగిన వెనుక నేర్పడినట్టియు సంబంధముగలవారు శీఘ్రకాలముననే తిరిగి వివాదములకు లోనై తుదకు న్యాయస్థానముల కెక్కి వివాహవిచ్ఛేద మొనరించుకొనుట సంభవింపఁగలదు. తద్దేశీయు లిందుకొఱకు న్యాయస్థానము లుంచునంత విరివిగా నీవివాదములు ప్రబలుచుండును. మన కిట్టి నాగరికత యుత్పత్తు లింతవఱకు లేనందుకు సంతసించవలెను.

జగ:— మనమతమువారిలో నెవరికి నాడవాండ్రకు రెండవపెండ్లి లేనేలేదా యేమిటి ?

కృ:— లేకేమి ? మన హిందువులలోఁ గొన్నికులములలోఁ దప్పఁ దక్కిన యందఱును మాఱుమనువులు కట్టుకొనెడివాండ్రే. మనకు దినదినముఁ బాలు పెరుఁగు లమ్మెడి గొల్లలును వలువల నుదికెడు రజకులును గుండల నమ్మెడు కుమ్మరులును మాఱుమనువులు కలిగియున్నారు. ఇది దురాచారముగ నెన్నక శూద్రజాతివా రందఱు గొల్లకుమ్మరియిండ్ల భోజనము లొనరించెదరు. దేవతాపూజనములందును శుభకార్యములందును బునర్వివాహ మొనరించుకొన్న స్త్రీలం గొన్ని నిర్దిష్టకార్యములం జొరనీయరుకాని తక్కిన సర్వవిషయములందు నెంతమాత్రము భేద మెన్నక కలసియుందురు. అగ్రజాతులవా రిట్టి మాఱుమనువులచే సాంకర్యము కలుగునని నిరాకరించియున్నారు. మంచిధాన్యములం బండింప నిచ్చగల కాఁపుత్తమజాతివిత్తనముల విత్తి సజాతీయధాన్యపురాసులఁ బడయఁగలిగినట్లు మనపూర్వులు దుస్సంప్రదాయములఁ దొలఁగించి కులపావనత బలపఱచుచుండిరి. సువర్ణము వన్నె తఱఁగినఁ గొన్నిపుటములచే నపరంజి గావించు వానివలె మనవా రుచితమగువఱకు దుస్సాంగత్యము కలవారలకుఁ బ్రాయశ్చిత్తాదికార్యములచే శుద్ధినొనగూర్చి కులమునఁ జేర్చికొను

చున్నారు. మఱియొకమాట వినుఁడు. ఇంద్రియనిగ్రహము కలవారికేఁగాని వ్రతనియమతపోవిద్యామహిమ లబ్బనేరవు. ఒకవేళ వచ్చినను నిలువవు. ఆహారవిహారనియమములు లేనివార లీవ్రతనియమములఁ గొనసాఁగింపఁజాలరు. మనపూర్వు లీరహస్యమెఱిఁగి లక్షకొకరి నిట్టివారి నగ్రజన్ములం జూర్చి వారెల్లకాలమును దేశోపకారకములగు క్రియాకలాపముల నెఱవేర్చుచుండుటకును రాజులును బ్రజలును వారిం బూజించుచుఁ బోషించుటకును నేర్పాటు గావించియుండిరి. ఇందువలననే బ్రాహ్మణులకాధిక్యము కలిగినది. వారేపనిచేసినను స్వార్థపరత యేమాత్రమును లేక స్వస్తిప్రజాభ్యయను వాక్యమున నియమించిన ఫలప్రాప్తి తప్పఁ దదితర మెంతమాత్రమును గోరుటలేదు. వారి ప్రయత్న మెప్పుడును రాజులు న్యాయపాలన మొనరించునట్లును సకాలమున వాన కురియునట్లును భూమి చక్కఁగ ఫలించునట్లును దేశమున క్షోభ లేకుండునట్లును జనులెల్లరు సుఖసంతోషభాజనులగునట్లును వినియోగించుచుండిరి. కనుకనే వారి నితరులు భూదేవులని చెప్పుచు దైవసమానులుగఁ దలఁచుచుండిరి. స్వార్థపరత్వము వర్జించి దేశక్షేమార్థము కృషిచేయువారి నెవరు పూజింపకుండఁగలరు? వారును దయాసత్యకలితులై యసాధారణ వ్రతనియమముల సహించి పాటించుచు నింద్రియనిగ్రహము కలవారలై యొప్పారుచు స్వకుటుంబికులును సంతానమును నట్టి వ్రతనియమాదులం గట్టువడియుండునట్లు లేర్పాటుచేయుచుండిరి; కాని కాఠిన్యమూనికాని క్రూరస్వభావము కలిగికాని నిర్ణయించలేదు. ఇంతియ కాక మన పూర్వులు రోగపీడితులకు మందులిచ్చియుఁ దీర్థములిచ్చియు నంటురోగములు వ్యాపించకుండ యంత్రస్థాపనలు జపములుఁజేసియు క్షామముల నివారించియు జ్యోతిషబలమున నష్టద్రవ్యప్రాప్తిని దేశాంతర్గతులైన వారి యారోగ్యము నెఱిఁగించియు మంత్రబలముచే శత్రురాజపరాజయము నొడగూర్చియు దేశోద్ధారకులగుచుండిరి. ఇట్టి యోగబలము గల సత్సంతానమును బడయుటకే మనవారలు మతాంతరు లూహింపఁజాలని వ్రతనియమముల శాస్త్రముల నిమిడ్చి వాని నాచరణమున నుంచియున్నారు. కొందఱు మనదేశమున వితంతూద్వాహములు లేకుండుట కడుఘోరమగు దుస్థితియని ఘోషించుచున్నారు. మహమ్మదీయులును దమతమకులముల నీయాచారము కలిగియుండిన యెల్లవారును దీని నవిచారముగ నాచరింపరఁట. స్థితిగతులు చక్కఁగనున్నవా రెల్లరును సత్సంప్రదాయములఁ గడుఁబట్టుదలతో విచారించి సంబంధబాంధవ్యముల నొనరించుకొనుచు వంశసాంకర్యము గలుగకుండ నతిజాగ్రత్తతోఁ జూచుచుందురఁట. మన యగ్రజాతులవా రొనరించునది యింతకు భిన్న మెంతమాత్రమును గాదు. ప్రభుత్వము వారి కాలంబున రాజ్యాంగవిభజన మొనరించినటులఁ బూర్వకాలమునఁ బ్రభువులును బ్రజలును సంప్రతించి రాజులు దేశోపద్రవనివారణ మొనర్చునటులను వైశ్యులు కృషివాణిజ్యాదుల నొనర్చి దేశపోషణ మొనర్చునటులను శూద్రు లాయిరువురికి దాసులై వర్తిలునట్లును నిర్ణయించి బ్రాహ్మణులకే యితరవృత్తియును నిర్ణయించక దేశజనులందఱు సుఖించుమార్గములను విధులను

యున్నారు. ఇప్పు డీపదవి తొలఁగినందున బ్రాహ్మణు లితరవృత్తుల నవలంబించు చున్నారు. ఎల్లవారికిని దమ వంశములును గులములును మతములును బవిత్ర మైనవిగ నుండవలెనను కోరిక ప్రబలియుండుట నైజమే యయినను దేశకాల పాత్రౌచిత్యముల వీలువెంట నాపవిత్రత గాపాడుకొనుచుఁ దదితరులను నమ్మత ననుకరింపఁగోరుట సంప్రదాయముగఁ బరిణమించుచున్నది. అవిచార్య మగు నిట్టి స్వాతిశయమే క్రైస్తవులను మహమ్మదీయులను మతాంతరదూషణ మొనరించి స్వమతవ్యాప్తికి నుత్సాహపఱచుచున్నది. వితంతు వివాహములు ప్రబలి యున్న వారియందును బతివ్రతలు కలరు. అట్టివారు జన్మాంతరములందును దమపతినే పడయఁగోరుచుందురు. భర్తను మరణము కలిగినప్పుడట్టి కోరికచేతనే కొందఱు బలవన్మరణము గావించుకొనెదరు. ఇట్టివారికి లోకాంతరమందేఁ గాని జన్మాంతరమునఁగాని జంటఁబాయకుండఁగలమనియే నమ్మకము. ఉత్తమ స్త్రీ లెవరుగాని పతిబాహుళ్యము నంగీకరింపఁజాలరు. ఇది మనకు విరుద్ధవిషయముగఁ దోఁచును. మన యంతరంగముల నెఱుంగఁజాలని పురుషు లీవిషయమునఁ జర్చలఁగావించెదరు గాని లోకానుభవముగల నారీమణులు చెప్పఁగలిగినపుడు మనపూర్వాచారముల బలపఱచెదరని నానమ్మకము. పతిబాహుళ్యముగల స్త్రీ లెన్నటికిని బతివ్రతలు కాఁజాలరు. అట్లు కాఁగలిగినచోఁ బరమందు వారేపతిని వరించి తమపాతివ్రత్యము నిలుపుకొనఁగలరు ?

ఇది యసాధ్యవిషయము. ఈకారణముచేతనే మనవారు వితంతూద్వాహ మగ్రజాతులందు నిషేధించియున్నారు. వైధవ్య మతిదుఃఖకరమగు కష్టమనుట సత్యము. సంతానహీనులకది దుస్సహమనియే చెప్పనగును. కానియీదుస్థితియందును నుచితపారిశుద్ధ్యగౌరవములచే నలరువారెపుడును బాతివ్రత్యతుల్యమహిమాస్పదులయి యుండఁగలరు. వారి నిర్మలవృత్తియు మతానురక్తియు వ్రతనియమాసక్తియు వారిని దైవసమానుల నొనరించును. ఇతరచింతలు దూరమగుటచేత వారికి దైవసాన్నిధ్యము వెన్నంటియుండును. నిర్మలములగు వారి పవిత్రచరిత్రలు కులపావనత గూర్చుచుండును. మనంబుల దుశ్చింతలఁ దొలఁగించుకొను సామర్థ్యము గలవారి కందఱికి నిట్టిపవిత్రచరిత్రలఁ బడయుట సులభసాధ్యమే. మతాభిమానము దీనికిఁ దోడ్పడి వారిచిత్తముల నాకర్షించి సత్క్రియాకలాపలగ నొనరించుచుండును. ముక్తిసౌధారోహణమున కిది వారికి దైవికముగ లభించిన సోపానమని చెప్పనగును. మతాభిమానమే వారికిఁ గుటుంబవృత్తి. మఱియొకసంగతి వినుఁడు.

కర్నాటదేశమందు గౌడను జాతి కలదు. ఆయింటి కోడలిని మామగారుగాని బావగారుగాని కోరిన ననువర్తించునాచారము కలదు. ఇది నేఁటికిని జరుగుచునే యున్నది. ఒకకుటుంబమున మఱఁదలిని బావగారు బలవంతపఱచెను. ఆచిన్నది నిరాకరించినందున మగఁ డందుల కంగీకరింప వలసినదిగఁ బలు బాధలు పెట్టెను. కాని యాచిన్నది తుదకు మరణమే శరణముగాఁ గైకొనెను గాని తమకులమందుఁ బ్రబలియున్న యాచారమైనను బురుషాంతరసంపర్కమున కంగీకరించలేదు. చూచితిరా యుత్తమస్త్రీల నియమ మెటులుండునో ?

## —♦ విశ్వనాథముతరస్కారభావము విశేషించుట ♦—

విశ్వనాథ మిట్లు సాంబశాస్త్రిగారివలన సాలగ్రామతీర్థము దీసికొంటినను సాకుతోడనే జాతాశౌచముతోడి శ్రాద్ధభోక్తృత్వము పనికిరాదని ప్రప్రథమము ప్రతిపాదించిన నాపైఁ బశ్చాత్తాపమును బ్రకటింపక నిశ్చింతమై నేనుండుటయు వీని సపంక్తిభోజనము నేను విడిచిపెట్టితిని. ఏ నొక్కఁడనే విడిచితినిగాని యెల్లరును జేయుచునే యున్నవారు. చండాలుర దేవాలయములలోఁ బ్రవేశపెట్టు కాంగ్రెసు ప్రభుత్వములో నెవ రెట్లు తేగుటకును నేను జింతింపను గాని నన్నుఁ బిల్చువారు పిల్చుచుండుటను నాయింటికి వచ్చువారు వచ్చుచుండుటను నాచేసిన జాతాశౌచముతోడి శ్రాద్ధభోక్తృత్వమునకు నాకేమియు నాంతక్యలేదనియు, ఆయనకే యాంక్ష యనియు విశ్వనాథము పలుకువికత్థనములకు మాత్రము విచారమయ్యెడిని. తానేగు స్థలములకు నే భోజనమునకు రాకుండుట కించుకంతయు విచారము లేకపోఁగా గ్రామాంతరమునకో గృహాంతరమునకో కార్యాంతరమున వెళ్ళునాఁడును వీఁడు నన్ను వెళ్ళకుండఁ జేయుటకుఁ బన్నుగడలు పన్నుచుండును. వారివారి యిండ్లకు వచ్చునట్లు నటించును. వత్తునని చెప్పును. వీఁడు నేఁడు లేఁడుకదాయని యెవరిచేతనేని నిర్బంధింపఁబడి యేను వెళ్ళఁదలఁచుచో వేళ కెక్కడినుండియో యుట్టిపడును. ఇదియంతయు వీనికిఁ బరిహాసమైపోయినది. కాకేమి?

సీ. ధర్మ మధర్మంబు దాడికిం బడలేక
అటవీస్థలంబులం దడఁగియుండు.
సత్య మసత్యంబుచాడ్పునఁ బుడమిలో
జనరంజకముగాక తనుతగాంచు.
పండితుల్ పామరపరిహాసపాత్రిత
కొఱగానియట్టిరై కూరుచుంద్రు.
గురులు శిష్యులతోడ గ్రుద్దులాడఁగలేక
మౌనముద్రవహించి మనఁగఁజూతు.
రంగనావశులై పోదు రఖిలపురుషు.
లధిపు లాత్మీయభృత్యుల కగ్గమగుదు.
రవనిపాలురు చోరుల నాశ్రయింతు.
రింద్ర! కలియుగవైభవం బేమనందు ?

అని గురుఁడు సురపతితోఁ జెప్పినట్లు కలియుగవైభవము కనులఁగట్టినది. ఇదియే కాదు. సభాపతిపూజావిషయమునఁగూడఁ జాలశ్రమపడుచున్నాఁడు. జానపాటిసభాపత్యము మా జానపాటివారిది. అత్యుడి వయోజ్యేష్ఠున కొనర్పఁబడెడిని. వర్తమానమున వయోజ్యేష్ఠుఁడను నేను. అయిననేమి? పెక్కుచోట్లఁ బెత్తనదారు విశ్వనాథము. సభాపతిపూజనుండి సంవత్సరగ్రాసములు సంప్రాప్తించునదియు లేదు. అందులకాశించుకొని యుండుటయు లేదు. కాని యద్యోకార్యముల యజమానులచే నవ్విధి యాచరింపఁ

బడుచుండును. అట్టిచో విశ్వనాథము పెత్తనముగట్టుకొని జానపాటిశేషయ్య కూఁతువివాహములో సభాపతిపూజ కన్యాదాతయైన శేషయ్యకే చేయించెను. వాని మనుమరాలి వివాహములోఁగూడ మాఱుత్రోవ విధింపఁజూచెనుగాని శేషయ్య వియ్యంకుని వలెఁ జీకు గాక ప్రతిగ్రహీత తండ్రి మతిమంతుఁడగు కేతమక్క రాఘవయ్యయగుటచే సభాపతియైన నాకే సక్రమముగా సత్కారము జరిపిపోయెను. విశ్వనాథము వెడఁగుచేఁతలు వీనితోనే ముగియలేదు. జానపాటి బ్రాహ్మణేతరులు చాలమంది స్వశుభాశుభకార్యములలోఁ జనుదెంచిన బ్రాహ్మణులనే సంభావించి పనుపుచుందురు. ఆబ్రాహ్మణు లాహూతు లైనను గాకున్నను నరుగుచుందురు. నేను సర్వసాధారణమైన యాహ్వానము జరిగినను ప్రత్యేకాహ్వానము లేక పదము కదలింపను. అటఁగూడిన పెద్దలలో నెపుడేని యెవరేని శాస్త్రిలయింటికిఁగూడ సంభావనాద్రవ్యము పంపిన బాగుండునని పలికినచో నట్లుపంపెదరేని యస్మత్సంభావనాద్రవ్య మవలఁబాఱవైచి యరుగుదునని బెదరించును. ఈబెదరింపులకుఁ బడలేక యాబుద్ధిమంతు లంతతో నుపరమింతురు. అస్మద్విషయ కైతదపకారములు గాక యితరులకుఁజేయు నపకారము లింతకుమించినవి యున్నవి. పౌరోహిత్యపురస్సరముగనో ప్రైవేటుపురస్సరముగనో పైనవేసికొన్న పెత్తనముతోఁ, గ్రొత్తగా ముండమోయు కులస్త్రీల కుత్తుకలలోని పుత్తడి కాసులకు బదులుగా నిత్తడికాసులు బత్తులచేఁ జేయించి కట్టి యిటు లింటివారికిఁ గాకుండ నటు చాకిరివాండ్రకుఁ జెందకుండ మధ్య మనవాఁడు హరియించును. రజకులు రచ్చకీడ్చి రవ్వఁజేసినను విశ్వనాథము వివదించును గాని వ్రీడపడఁడు. శ్లో॥ ఏకాం లజ్జాం పరిత్యజ్య త్రైలోక్యవిజయీ భవేత్. వీనివలన స్వార్థమైనను సమకూరెడిని గాని యస్మద్విషయమున నాచరించు నపకారములవలన నదియును లేదు. ఇట్టివారినిగూర్చి భర్తృహరి సుభాషితము

మ. తమకార్యంబు పరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్.
తమకార్యంబు ఘటింపుచుం బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్.
తమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్. వృథాన్యార్థభం
గము గావించెడువార లెవ్వరో యెఱుంగన్ శక్యమే యేరికిన్ ?

అని యున్నది. ఇట్టి నన్నుఁ గూర్చిన చేఁత లెన్నియని వ్రాయుదును గాని వేఱువిషయములలో విశ్వనాథము విఖ్యాతుఁడే. ప్రాచీనపద్ధతులఁ బరిత్యజింపలేక ప్రాకృతులకుఁ బనికిరాకయున్నవాఁడను నేనే కాని కాలానుకూలగమనముచే గణనీయుఁడుగ నున్నవాఁడు వాఁడే. ఎక్కడనో యేపండితులలోనో యేపెద్దమనుష్యులలోనో యే నెన్నఁబడినను జానపాటను జుట్టుపట్లను జనసామాన్యమునఁ జాగురే యనిపించుకొను సమర్థత వానిదే. ఆత్మసదృశు లవ్వాని కనేకులు సహాయులు. కరణము వానిచేతిలోనివాఁడు. మునసపు వానిచేతిలోనివాఁడు. మునసపు మాన్నాళ్ళ ముచ్చట తీఱినదికాని కరణ మింకను శరణమై కాలుద్రవ్వుచున్నాఁడు నామీఁదికి. లేఖలు లిఖించుచున్నాఁడు. ఆలేఖలలో నాత్మీయపాండిత్య మంతయు నగపఱచుచున్నాఁడు. ఇంతకుఁ బూర్వపుఁ గరణా లెవ్వరును బోని హెచ్చుపోకడఁ బోవుచున్నాఁడు. కరణికపుభిక్షయని వ్రాసితినఁట. నానాగ్రామ భిక్షార్థిని నేనుగాని

తాను గాఁడఁట. నేను నానాగ్రామభిక్షార్థిని గాదు. నానాదేశభిక్షార్థిని. నానా
రాజసందర్శకుఁడను. బ్రాహ్మణుఁడఁగనుక భవాన్ భిక్షాం దదాతని బయలు వెడలితిని.
"పాగంపర్యంతవుద్యోగప్రాప్తికి ధనసహాయము కోరె"నఁట కాని తాను విశ్వనాథ
మును భిక్షగాదఁట. భిక్షయన్న బిచ్చమే యనుకొనియెఁగాని కరణికమున భిక్షాత్వ
మారోపితమనికాని యది రూపకాలంకారమని కాని యెఱుఁగఁడు. వృద్ధమతియని
వెక్కిరించుటయే తెలియును గాని యీబాలమతి కిట్టిగొడవ యేమియెఱుక? కానిండు,
భిక్షయే యందము. జానపాటిలో సీతయ్యగాఁ బుట్టిన తాను గొత్తపాలెఁపులోఁ
బోయి శ్రీరాములుగాఁ బునర్జన్మమెత్తుటకు జానపాటి జను లందఱు నుపేక్షించుట
భిక్షపెట్టుటగాదా? ఈభిక్షనుండియే వచ్చినది కాని తనకుఁ గరణికము పారంపర్యప్ర
హక్కునుండి కాదు. అల్లట్టియైన మైనరుపిల్లలుండు నీడున మైనరు వెళ్ళలేదని యెన్ని
యొపాట్లలపడవలసివచ్చినది? నర్సారావుపేటలో నాంగ్లేయము సదువఁబోవుచు
నాబోంట్లవద్ద నెత్తినది భిక్ష కాదా? కావలసిన మాఖర్చులిష్టులోఁ గనఁబడుతుము. తన
పెండ్లికి జానపాటిరైతులదగ్గఱ నెత్తినది భిక్షకాదుకాఁబోలు! పురుషోత్తమప్రభృతు
లిచ్చిన పదులు నైదులు భిక్షకాదో! వైదికులైనప్పుడేనా భిక్ష? నీళ్ళకావళ్ళు మో
యుచును నేటు గోటు విడువనిభంగి నిట్లు భిక్షమెత్తుచునే యెందులకో యీ యెగసి
పాటు? భిక్షకాదు, ధనసాహాయ్యమే విశ్వనాథము చేసెనందము. ధనసాహాయ్యము
చేసెనని తద్దినమునఁ బురిటివానిని భోక్తనుజేయుటా? అట్టివాని నర్చించి వృధాశ్రాద్ధ
ము చేసికొన్నందులకు వెతపడవలసినదానికి మాఱుగాఁ బైన వానికి బాసటై నాపైకెఁ
గాలు ద్రవ్వుటా? తన ప్రయోజకత్వము దెలిసినదో లేదో యని యుత్తరము నక
లందఱికి వినిపించుటా? గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లు సత్కవివాయని సవాలు
వేయుచున్నాఁడు. సవాలిది యొక్కటియే కాదు. సత్రకూపనిర్మాణకారివా? వన
స్థాపకుఁడవా? బీదల నాదరించువాఁడవా? శాంతిమతివా? తాపసివా? సత్కవివా?
అని యన్నియు 6 ప్రశ్నలు. సత్కవినో, దుష్కవినో, వార్ధక్యము వచ్చినది నాకు.
కాదు కాదు. కరణముగారి గ్రామ్యభాషప్రకారము 'వృద్ధాప్యము' వచ్చినది. తత్స
త్కవితాపట్టభద్రత తానే ధరించుఁగాక. తథ్యము గాకున్నను దాను గరణికము
సంపాదించుకొన్న దారిని బట్టి నిరుడేకదా తనకు మైనరు వెళ్ళినది! ఈ 18 ఏండ్ల
లోనే సత్రకూపనిర్మాణకారియు వనస్థాపకుఁడును బీదల నాదరించువాఁడును నైన
కరణమయ్య ఘనతయే ఘనత. కరణముగారు వ్రాసినట్లు పరనిందాబుద్ధిగాని పరముగాని
యేదియును నాకే కాక యేరికిని గ్యావుమని చేటలోఁ బడిననాఁటినుండియే సృష్టిలోఁ
గనఁబడదు. కాని కరణముగారు మట్టుకు క్యావుమని చేటలోఁ బడిననాఁటినుండియే వివిధ
ములగు వనములను సత్రములను వెలుఁగఁబెట్టియుండఁబోలును. తా నట్టివాఁడు గాకుం
డిన నన్నిప్రశ్నలు వేయఁడు. విశ్వనాథముపట్లఁబోలె విహితునిపట్లఁగూడ 'నేకాం
లజ్జాం పరిత్యజ్య' నిట నుదాహరించితిమేని యెక్కుడిచిక్కు నుండదు. నాయెడలఁ
గాకున్నను నా నెచ్చెలి విశ్వనాథముపట్ల సత్రనిర్మాణకారిత యొకడైనను సమన్వయిం
చునను సమాధానము సరసము. పెద్దవిశ్వనాథము సున్నపుబట్టి పేరునకు వచ్చినతర్వా
తఁ జిన్నవిశ్వనాథము సున్నపుబట్టి సత్రముగా మార్పఁబడనుండుటచే సత్యమే యయ్యా
డి. కాని యియ్యది యైనను నింకెన్నియేండ్లకుఁ గ్రియగట్టునో యెవరును జెప్పఁజాలరు.

సత్కవియైన కరణముగారు స్వకపోలాదినిర్మాణము సల్పుచున్నను తాపసియు శాంతి మతియుఁ గావచ్చును. ఎంత తాపసియూ నెంతశాంతిమతియుఁ గాకుండనే యెట్లు నా పైకిఁ గాలుదువ్వి యెన్నియో తిట్లు తిట్టుచు నింతపొడుగుత్తరము వ్రాయును! ఇట్టి తిత్తిరియుత్తరమునకు నెన్నియని ప్రత్యుత్తరము లిత్తును? అపార్థాలు వ్యర్థాపార్థాలు మున్నగు నపభ్రంశము లందలిగ్రామ్యవాదులును బొందుపఱచుచున్నారు, దానికేమి గాని సత్కవివా యని నన్నుఁ బ్రశ్నించిన యీసత్కవిభాషాపాండిత్య మంతయుఁ “పారంపర్యంతవుద్యోగ” ప్రయోగమునుబట్టియే ప్రకటమగుచున్నది. పిల్లకాకి కేమి తెలియును ఉండేలుదెబ్బ” యన్నట్లు లిట్టిభాషతోఁ దావుకాగితము నింపినాఁడు. అవాచ్యము లనేకము వ్రాసినాఁడు. వ్రాయునిండు. ఇట్టి యనాఘ్రాతభాషాగంధునితోడి వివాదము హేయము. ఎప్పటికిని విద్యానునకును గద్యానునకును సమత యుండవలె. “పండితంమన్యుఁడనని ఛాతీ విరుచుకుంటారేఁ?... నాల్గుపంక్తులు పూరిస్తే సరి, పడితంమన్యత్వ మలవడుతుం దనుకున్నారా” అను నీయన యుత్తరములోని వాక్యము మతియుఁ బాండిత్యద్యోతకము. పండితంమన్యశబ్దమునకుఁ బండితశ్రేష్ఠుఁడని యర్థము చేసికొన్నాఁడు. ఛాతీ విఱుచుకొనునది నేనో తానో యీచుక్కవల్లనే యెల్లరకుఁ దెల్లమయ్యెడు. ఇట్టి పండితంమన్యత్వమే యీయనచే నింత వ్రాత వ్రాయించినది. ఆ. క. తా. యి. వాలాయని యాఖరుచేయించినది. ఇట నేదో సాంకేతికము పెట్టుకొనియెఁ గాని యాకతాయయను నర్థ మందఱకును సులభగ్రాహ్య మగుచుండ నయ్యది యెవరికిఁ గావలె?

కం. మునుమును సీతయ. అటు వెను
కను శ్రీరాములుగ మాఱెఁ గరణికమునకై.
ననుఁగూర్చి వ్రాయు లేఖను
పనుపడెఁబో యాకతాయవాల మితనికిన్.

ఈ యాకతాయివాలాగారు నాయొక్కయు నాపత్రికయొక్కయుఁ జిరాయువునకుఁ బాపిత్వమే కారణముగాఁ బ్రతిపాదించిరి. అయ్యది యథార్థమే యందము. తాను సుకృతియైనఁగాని మఱుమ్రఁ బాపులనఁడు. పాపీ చిరాయుః వెంటనే సుకృతీ గతాయుః. సుకృతియగుటకు సుంత సంతస మైనను గతాయువు కాఁబోవుటకు మాత్రము కడు విచారమయ్యెడిని. సీతయ్యగా నున్నఁ గోతెంచక శ్రీరాములుగా మాఱినఁ జేరవచ్చిన కరణిక మాకతాయివాలా యైనయనంతర మభిప్రాయము మార్చుకొనునేమోయను ననుమానముగూడ వంకురించెడిని. అయ్యాకతాయివాలాగా రనినట్లు లెట్టులును నేను బండితంమన్యుఁడను గానుగాన నానాలుగుపంక్తుల పూరణకార్యము కానైనది. ఆయనవలె నేను సత్కవినా చాల వ్రాయుటకు?

ఉ. తా నొకపద్యమేని కవితండము మెచ్చ రచింపఁజాల. డే
మేమొ ప్రసిద్ధులైన సుకవీశులమీఁదికిఁ గాలుద్రవ్వుచున్
వేమఱు కుంటిప్రశ్నలను వేయుచునుండెడ. రట్టివారితో
ఏమగు? త్రోవ నేగునెడ నెన్నిమొఱుంగవు సారమేయముల్?

# అభినవసరస్వతి

| సంపుటము 3౧ | ప్రమాది నామసంవత్సరము కార్తికమాసము. | సంచిక ౮ |
|---|---|---|


## కృతివిమర్శము

### తులసీరామాయణము.

వేఁగుచుక్క గ్రంథమాలకు 22, 27, 31, 34 పుష్పములుగాఁ బ్రకటింపఁబడిన తులసీరామాయణము నయోధ్యాకాండ ప్రథమద్వితీయభాగములును నరణ్యాకాండ కిష్కింధాకాండలును జిరకాలముక్రిందనే మాయభిప్రాయమును గోరి కార్యస్థానమున కనుపఁబడియున్నయవి. ఇతరకార్యవ్యగ్రతచే నింతవఱకుఁ జదువఁదీరక స్వాభిప్రాయ మొసంగమికి గ్రంథకర్త క్షమింప సంప్రార్థ్యమానుఁడు. ఆయన భాగవతుల నృసింహశర్మగారు. ఈగ్రంథము నిర్వచనము. ఏ కరణికపు లెక్కలో గీకికొను మాయూరి యొక యాకతాయివాలా ముప్పదియొక్క వత్సరములనుండి గొప్పగొప్ప విద్వత్కవులచేఁ గొనియాడఁబడు మత్పత్రికం దెగడుచు "ఉచితంగా పంపడంవల్ల ఎవరో తెలియనివాండ్లు, ఆగ్రంథచిరునామాలు, గ్రంథకర్తల మరణానంతరము, విడిగా ముద్రింపించుకొని, లాభించవచ్చునని, ఎవరియో ప్రబంధశకలాలు...యివే కదూ తమపత్రిక చాటేది" అని నన్నుఁగూర్చి వ్రాసిన ట్లీగ్రంథకర్తకవనమును గూర్చియు నేతులువ లేమియనుటచేతనో

మ. పలువల్ శంఠలు దుఃఖభాజనులు దేవానాంప్రియుల్ కొంద ఱి
య్యలు దూషించినఁ గోవిదుల్ బలిబలీయంచుం బ్రశంసించినన్
కలతం జెందక గర్వమొందక నిరాఘాటంబుగన్ రాముపై
తలఁపుంబెట్టి సుధాకరండము నయోధ్యాకాండముం బల్కెదన్. 5

అని యయోధ్యాకాండారంభమం దవ్వారి కంఠీరవప్రయోగ మాచరించి యనంతరాత్మీయకార్య మారంభించెను. పర్యవసానమునఁ బరిభూతులే యైనను సురల నసురులుంబోలె సుకవుల శంఠ లెక్కడను వెక్కిరించుచునే యుందురు. ఈతులసీరామాయణము హిందీభాషలో నిదివఱ కెవరో వివరించియుండ నీనృసింహశర్మగా రాంధ్రీకరించిరి. కవిత్వము మృదుమధురమై కావలసినన్ని లోకోక్తులతో నేవారికిని నింపుగలిగించుచున్న దనుటకంటె నేతద్గ్రంథప్రాశస్త్యమునుగూర్చి యెక్కువ వ్రాయఁజాలను. మచ్చునకు మఱికొన్ని పద్యములు ప్రదర్శ్యమానములు.

సీ. అనిశంబు ననుఁ గూర్మి నాదరించిన యత్త
మామలఁ గలనైన మఱవనునుము.
ధర్మధురీణులు తనయులై జన్మించి
రని సంతసించుట యర్హమనుము.

వనవాసమున మేము పరితపించెదమంచు
పరితాపముం బొందవలవదనుము.
లోకైకవీరులు నా కంగరక్షగా
ఉండ నుంతయు హాని యుండదనుము.
పతిని దైవంబుగా నెంచుసతికి నెందు
కష్టమనునది కలనైనఁ గలుగదనుము.
భయము దుఃఖంబు శ్రమము సందియము లేక
సీత లోకైకయశము నార్జించుననుము. అయో-కాం. 613

తే. అనృతము వచించి యన్యుల నటమటించి
ముగ్ధులం గాంచి వలపింప ముచ్చటించి
మెలఁగు పాపాత్మగతి నాకుఁ గలుగుఁగాక
కపటభావంబు గలిగిన ఖలుఁడ నేని. 913

తే. వైదికపథంబు విడిచిన బ్రాహ్మణువలె
విను మనిర్వాచ్యగతి కేను వెడలువాఁడ
రామునిం ద్రోసిరాజని రాజ్యకాంక్ష
కపటభావంబు గలిగిన ఖలుఁడ నేని. 915

మ. దనుజుల్ గొంద ఱధర్మకర్మపరులై ధాత్రిన్ విజృంభింప యా
తన సైరింపఁగలేక లోక మడలన్ ధర్మావనార్థంబు భూ
జనులం గారణజన్ముఁడై వెలసె సాక్షాద్విష్ణు వీరాముఁడై
మనమా! ధర్మపథంబుఁబట్టి చనుమా. మారాము సేవింపుమా. 971

ఈమకుటముతో నింక నెన్నో పద్యము లున్నయవి.

తే. శస్త్రధారునితోడ భిషక్కుతోడ
ప్రభువుతో మర్మ మెఱిఁగినవానితోడ
పండితునితోడఁ గవితోడ బలియుతోడ
ధనికుతో మూర్ఖుతో విరోధంబు తగదు. ఆరణ్యకాం. 447

సీ. తన జీవితముదాఁకఁ దల నమ్మకొనినట్టి
దాసుండు సుఖియింపఁదలఁపఁగలఁడె?
అభిమానవశమున నన్యుల నడుగక
వెడలు యాచకుఁడు జీవింపఁగలఁడె?

అనిశంబు భోగదుర్వ్యసనంబులకుఁ జిక్కు-
ధనికుండు ధనవృద్ధిఁ దనియఁగలఁడె?
అన్యుల కీక తా ననుభవింపకయుండు
పిసినికిఁ గీర్తి లభింపఁగలదె?
చదలు గోవని పాలను బిదుకఁగలమె?
వసుధ వ్యభిచారి సద్గతి పడయఁగలదె?
ఉచిత మెఱుఁగక వగకూరి యోమిటారి!
వెడఁగుచందాన ననుఁగోరి జేలవైతి. ఆరణ్యకాం. 280

ఉ. సుందరకన్యవౌదువు. వసుంధరకెల్ల నపూర్వమైన నీ
చందము నందముం బొగడ శక్యమె? నీసొబ గిట్టిదంచు నె
న్నందరమూ లతాంగి! భువి నా తల దన్నిన వన్నెకాండ్ర నీ
వెంచఁటఁజూచినావా? విను మేనన నెంతటివాఁడఁ గామినీ! 276

తే. రామచంద్రుండు త్రిభువనప్రభువరుండు.
అతఁడు సర్వస్వతంత్రుఁ డత్యధికబలుఁడు,
నే నతని పాదదాసుండ నీకు నేను
తగుదునే రాజపుత్రి! సౌందర్యవతివి. 273

---

## ధర్మశాస్త్రముల మార్పు

(శృంగేరి... స్వాములవారు)

...జను లేయేపదార్థములం దేయేభావన సేయుదురో యావస్తువునం దాభావనకుఁ దగినగుణ ముండవలయునను నిర్బంధ మేమియు లేదుకాని భావనానుగుణముగా ఫలము నొందుదురనుటలో సందేహ మేమియు లేదు ... రాజకీయ నిబంధనములం గల్పింపఁజాలు సభాసదులు విద్యావంతులుగాను పూర్వాచారవిచారదక్షులుగాను దూరదృష్టిగలవారుగాను నున్నారను విషయంబున నెవ్వరికిని సంశయములేదు. వారు తమ వెనుకటికాలపురీతిని బూర్వచరిత్రములవలనఁ దెలిసికొని పూర్వపురీతులను మార్పఁదగిన కాలమును గనిపెట్టి వర్తమానకాలమందుఁ జేయఁదగు నిబంధనలు భవిష్యత్కాలమం దెంతవఱకు మార్పులేకయుండఁదగుననుట నూహించి నిబంధనలను గావింతురు. ఇంతకంటె నధికమగు సామర్థ్యము వారి కుండవచ్చునను నంశము నంగీకరించుట కవకాశము లేనందున నట్లు చేయఁబడిన రాజకీయనిబంధనములందుఁ గాలానుగుణముగాను దత్కాలపు జనుల శక్తిననుసరించియు దిద్దుబాటులను జేయుట యుక్తముగానే యున్నది. అయినను హిందూధర్మశాస్త్రములను గల్పించియున్న మహర్షులు సామాన్యులుకారు. వారు యోగశక్తిచేఁ గాలత్రయజ్ఞానులని యెన్నఁబడుచుండిరి. దానిచే భువి

ష్యత్కాలస్వభావమును జనుల శక్తియును నూహచే నెఱుంగవలసిన యావశ్యకము వారి కుండదయ్యె. ఆమహర్షులు ధర్మశాస్త్రములను రచియించినప్పుడే యాయాకాలపు జనుల శక్తికిఁదగినట్లు ధర్మముల నేర్పాటుచేసియున్నారే కాని సర్వకాలములందును నొక్కవిధమగు ధర్మమునే యాచరింపవలయుననియు దానికి భిన్నముగా నాచరించుటచే జనులు దోషు లగుదురనియుఁ జెప్పియుండలేదు. కృషికర్మము బ్రాహ్మణునికిఁ గృతత్రేతాద్వాపరయుగములందు సహజధర్మమని చెప్పలేదు. కలియుగమునందు బ్రాహ్మణునికి స్వయంకృషి చేయుట ధర్మమని చెప్పియున్నారు. ఇతరయుగములలో స్వర్ణస్తేయ సురాపాన బ్రహ్మహత్యాది పాతకములకు మరణాంతప్రాయశ్చిత్త మాచరింపఁదగుననియు నట్టి మహాపాతకములు కలియుగమం దల్పప్రాయశ్చిత్తాచరణముచే నివారణమగుననియుఁ జెప్పియున్నారు. దీనివలననే యాయాకాలమందలి జనుల శక్తికిఁ దగినటులే మహర్షు లనుగ్రహపూర్వకముగా నిబంధనలను గల్పించియున్నారని స్పష్టమగును. మఱియొకవిధ్యానమును యోజించుటచేతను మహర్షులు భూతభవిష్యత్కాలసంగతుల నెఱింగియుండిరనువిషయము తెలియనగును. భారతాదీతిహాసములను జెప్పియున్న వ్యాసమహర్షులు కృతాదియుగములందుఁ బ్రపంచస్థితి యెట్లుండెననియుఁ గలియుగంబునఁ గొంతకాలము చన్నపిదప నేరీతిగా రావచ్చుననునంశమును సూచించియున్నారు. భారతమునందుఁ జెప్పియున్నరీతిని బ్రకృతము ప్రపంచమున్నరీతిని నొండొంటితో సరిపోల్చి చూడఁగా బహుకాలమునకు ముందుచెప్పియుండు నంశములలోఁ గొన్ని యిప్పుడే యనుభవమునకు వచ్చియున్నవిగాను నింకను బెక్కువిషయములు కొలఁదికాలములోనే యనుభవమునకుఁ రాఁదగినవిగాను నున్నవి. భారతమువ్రాసినవారు వ్యాసులు గారనియు భారత మేకకర్తృకము గాదనియు భిన్నభిన్నకాలములం దనేక గ్రంథకర్తలచే వ్రాయఁబడినదనియుఁ గలియుగమహనీయుల సిద్ధాంతంబని తెలియవచ్చెడు. అది యెట్టులైన నుండుఁగాక. భారత మేకాలంబున నెవరిచే వ్రాయుటకారంభింపఁబడినది? ప్రారంభించినవా రెంతవఱకు వ్రాసియుండిరి? ద్వితీయభారతకర్త యెవరు? వా రెప్పు డారంభించి యెంతవఱకు వ్రాసిరి? ఈప్రకారముగా నెన్నిమాఱు లెందరుజనులచే వ్రాయఁబడినది? అనువిషయ మింకను నీకలియుగమహానుభావులచే నిష్కర్షింపఁబడినట్లు తోఁపదుకావున నట్లు నిష్కర్ష యగునంతవఱకును మన పూర్వులు పారంపర్యముగా మనకిచ్చియున్న తెలివియందే విశ్వాసముంచి భారతము వ్యాసమహర్షులచే రచింపఁబడినదని యొప్పుకొనుటలో నపాయ మేమియుఁ గలుగఁబోదు. పైఁజెప్పినట్లు భారతము పుట్టినకాలమైనను దత్కర్తలైనను నింతవఱకును నిర్ధారింపఁబడియుండనందున నిప్పటివా రూహించునట్లు భారతము పుట్టియుండలేదని ధారాళముగాఁ జెప్పవచ్చును. ఈసందర్భమువలనను మనపూర్వులకు ముందటియంశములను నెఱుంగఁదగు సామర్థ్యముండెనని మన యిప్పటి యనుభవమువలన నొప్పుకొనవలయు. అట్టివారు గొప్పవారనియు జ్ఞానులనియు మన మేలయొప్పుకొనఁగూడదు? ఇందుచేఁ గాలత్రయజ్ఞానులగు మహర్షులచే ముందుగానే కాలమును జనుల స్థితియును నెఱింగి చేయంబడియున్న ధర్మశాస్త్రములందు మార్పులను నల్పజ్ఞులైన మనము గావించుట కవకాశ మెక్కడిది?... మన బుద్ధికౌశలముచేతను నొదవియుండు సంపద్భములచేతను బూర్వమహర్షులను వారి జ్ఞానమును సామర్థ్యమును నొప్పుకొనుట కవకా

శము లేదనిన...ఇక్కాలపు స్థితిచే నవివేకజనులకుఁ బరద్రవ్యాపహరణ పరదారాభిమర్శనములందుఁ గోర్కి వొడమ...వారందఱుం జేరి పరద్రవ్యాపహార పరదారాభిమర్శనాదులు దండార్హములు గావని రాజకీయనిబంధనములలో సవరణలు చేసి యీవలయునని ప్రార్థించినచో రాజులు బహుజనుల ప్రార్థనంబని యంగీకరించి యారీతిగాఁ జట్టములను మార్చియిత్తురా? మార్చెనేని యటువంటిరాజు రాష్ట్రము క్షేమముగా నుండునా? ఆరాజువర్తనము న్యాయ్యంబని శాస్త్రార్హంబగునా? దీర్ఘముగా విచారము చేసి గుణదోషముల నెఱింగి యుక్తియుక్తములగు నాలోచనాంశంబుల నిచ్చినచో నావిషయమునందుఁ బ్రవర్తింపవచ్చునే కాని యవిచారమూలములగు నంశంబుల కవకాశ మొసంగి యమ్మెయి నడుచుకొను రాజు లోకనింద్యుఁడే యగును. అదియట్లుండనిండు...శాస్త్రమనఁగా నేమి స్వేచ్ఛచే నిరంకుశముగాఁ బ్రవర్తించు మనుష్యుని నంకుశప్రాయమగు నియమముచేఁ బట్టి నిలుపఁదగినది శాస్త్రశబ్దముచేఁ దోఁచెడునర్థము. ఇట్టిశాస్త్ర మిప్పుడు సిద్ధముగా నే యున్నది. కావున...తత్కాలమందు మనకుఁ గష్టమైతోఁచినను బరిణామంబున మహాఫలమునే యీఁదగినదై నందునఁ దాత్కాలికవృత్తిని నిరోధించి సాధ్యమైనవఱకు శాస్త్రోక్తధర్మముల నాచరించుటయు నధర్మములను బూర్ణముగా విడుచుచు వచ్చుటయు శ్రేయస్కరము.

---

## — మహాభారతచరిత్ర నిరాకరణావతారిక —

(వైయాకరణకేసరి పుల్య, ఉమామహేశ్వరశాస్త్రిగారు)

... దేశమిపుడు... విబుధశబ్దవాచ్యుల కాలవాలమైనఁదుల కెంతయుఁ జింతించుచున్నారము...బ్రాహ్మణులై పుట్టిన పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు... కొంత సంస్కృతభాష నేర్చి ... మహాభారతమును విమర్శించుట స్వార్థసాధకము కావున నెంతయు నభినందనీయమే. కాని విమర్శించునపుడు ... విపరీతవాసనల వెదచల్లినట్లు గ్రంథమువలన విశదీకరింపఁబడినది ... వేదములను ... విభజించి యజ్ఞజనతారణమునకై వాని యర్థ...ముపాఖ్యానాదులతో ఛందోబద్ధముగఁ జేసి ధర్మాధర్మస్వరూపమును స్పష్టముగ వెల్లడించిన శ్రీ వేదవ్యాసులవారిని నిషాదునిగాను జండాలునిగాను నసత్యపువ్రాఁతలు వ్రాసినవానిఁగాను...పాండవ...ధర్మము లధర్మములుగాను కౌరవుల యధర్మము ధర్మముగాను జగన్నాటకసూత్రధారుఁడైన ... శ్రీకృష్ణుని మాయావియగు వంచకునిగాను మనుష్యమాత్రునిగాను గ్రహించుచు లోకమున వెల్లడించుటయే వీరి విపరీతవాసనకు సాక్ష్యమొసఁగుచున్నది. అన్నివిధముల జాతిమతభ్రష్టత సంభవించుచున్న యీసమయమున సర్వధా హేయము...గు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గ్రంథమందలి విషయములను ఖండించుట ప్రత్యార్యమతస్థునకును విధియైనను శ్రీ మహాభారతతత్త్వామృతమును లోకమునకు శ్రీకృష్ణభారత గ్రంథరూపమునఁ బంచి పెట్టిన...కవిరాజ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులవారికే తద్విధి లభించినందుల కెంతయుం సంతసించుచుంటిమి. ఈ...గ్రంథము...నఁ బెండ్యాలవారి వ్రాఁత లనార్యములని స్పష్టీకరించి చెప్పుచున్నవి. పాశ్చాత్యవిమర్శనాపద్ధతి ననుసరించి వారు కాలనిర్ణయ

ము చేయుటలోఁ గవిరాజుగారు వ్యక్తీకరించిన విషయము...శాస్త్రిసమన్వయపద్ధతిలో ...విద్వద్రంజక మగుచున్నది. రచనావిధానాదికమును విమర్శించుటలో ... కేవల పాశ్చాత్యపద్ధతిననుసరించుట వారిపాశ్చాత్య రుచిని విశదీకరించుచున్నది. వ్యాసవాల్మీకుల కవితాశైలి ... వారు నిరూపించిన యర్థతత్త్వము విమర్శనీయములా యని నిరూపించుటకుఁగూడ నశక్తులమగు మనము వారు బోధించిన యర్థము లెవ్వియని జిజ్ఞాసువులమై విమర్శించుకొ...నుట ... సంప్రదాయము. కాని యాధునిక...కావ్యముల రీతిఁ శబ్దార్థసాధుత్వాసాధుత్వవిమర్శనము సర్వజ్ఞులగు ఋషుల గ్రంథముల విషయమై కాదు.

వ్యాకరణముకూడ నిట్టి సాధుత్వాసాధుత్వముల నిరూపించుటలో వెఱచినట్లు "ఛందసి దృష్టానువిధిః, ఛందోవత్ సూత్రాణి భవంతి" అను పరిభాషలచే వ్యక్తీకరించినది. ఇట్టిస్థితిలో రచనావిధానాదికము విమర్శించుటలోఁ బెండ్యాలవారు నవీనసంస్కరణపద్ధతి ననుసరించుట కడుంగడు శోచనీయము. ఈవిషయమే నిరాకర్తలగు కవిరాజుగారు ద్వితీయపరిహారమున బాగుగా నిరూపించిరి. ఇట్లే... శాస్త్రిగారు గాథావిశేషముల విమర్శించుటలోను పాండవపక్షపాతుల విమర్శించుటలోను విరాటాదుల విమర్శించుటలోను జూపిన మేధావిశేషము కేవలము గర్వాస్పదమై మతాంతరప్రవిష్టుల దురభినివేశ నిందావాక్యములవలె హేయతను వ్యక్తీకరించుచున్నది. లోకమున నెవ్వరు నిట్టి దుర్విమర్శనము లెన్నటికిం జేయకుండునట్లు సర్వవిషయములును బూర్తిగ ఖండించిన కవిరాజుగారి కార్యలోక మంతయుఁ గృతజ్ఞతను వెల్లడింపఁగాక...

---

## మహాభారతచరిత్ర నిరాకరణము

(కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు)

మహాభారతచరిత్రమను పేరితో...పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచింపఁబడి...నది. ఈరచనమువలన గ్రంథకర్త బ్రాహ్మణజాతియందుఁ బుట్టినను హిందూమతమందు...నమ్మకములేని రిఫార్మరని తెలియవచ్చుచున్నది వీరి పదియవయేట వీరిచే భారతముం జదివించి తండ్రిగారు భారతకథాలోలుంగాఁ జేసిరఁట. లోలము చలనము...కనుక వీరు భారతకథలందుఁ జంచలత్వము కలవారైరని సత్యము ప్రకటింపఁబడినది...తండ్రి నాఁటిన బీజమే...భారతచరిత్ర వ్రాయించినదఁట . తండ్రిగారే కృష్ణుఁడు రామునివంటి శుద్ధచారిత్రుఁడు కాఁ (డనియుఁ గుం) తీద్రౌపదులే కురువంశనాశకురాం (డ్రనియుఁ జె) ప్పుచుండువారఁట. లోకములోఁ దండ్రిగుణములు కొడుకున కబ్బుననుట సహజమేకదా! ...ఈ భారతచరిత్రము...వ్రాసి యిందువలననే ... రాజావారి యనుగ్రహము సంపాదించుకొని పిఠాపురముఁ జేరినారఁట... పిమ్మట రెండుకన్నులును బోయినవఁట. చెన్నపురిలో వైద్యము చేయించుకొఁగాఁ జావుదప్పి కన్ను లొట్టవోయెనన్న ట్లొకకన్ను...వచ్చినదఁట. పిదపఁ గృష్ణద్వైపాయనుఁడు శ్రీకృష్ణుఁడు నను భాగములు వ్రాసి మరల రోగగ్రస్తులైరఁట. ఎట్టయినను దమ పట్టుదల మానక గ్రంథము ముగించి...రని వ్రాసిరి ... వీరిగ్రంథములోఁ జాల భాగ మూహాప్రపంచముమీఁదనే నడచినారు. కొన్నిచోట్ల నపార్థములు కల్పించి

నారు. కొన్నిచోట్లఁ బ్రమాదమునకు లోనైనారు... భారత ధర్మములు తగినవి కావనియు జాతిమతాచారములతో నవసరము లేదని సం సర్వము బ్రహ్మమనియు...కృష్ణుఁడు వ్యాసుఁడు పాండవులు ద్రౌపది లోనగువారి...మత మప్రశస్తమనియుఁ జెప్పినారు. వీరిమార్గమున గ్రంథపరిశోధనమునకు దిగినచో నేగ్రంథమైన నిల్లు పనికిరాకుండఁ జేయవచ్చును. రామాయణము గొంచె మంగీకరించి...నారు. వీరివలెఁ బాశ్చాత్యధర్మములం బురస్కరించుకొని విమర్శించినచో దానికి నింకెన్నిదోషములు చెప్పవచ్చును... "భారతః పంచమో వేదః" అనిచెప్పినగ్రంథమే వీరికి సరిపడినదికాదు ... భారతములో వీరి మతమునకు సరిపడినచోటఁ బ్రమాణముగా గ్రహించి సరిపడనిచోటఁ బ్రక్షిప్తమనికాని పౌరాణికమని కాని గీతిదనికాని తిరస్కరించినారు.

వ్యాసుఁడు కిరాతుఁడని నిందించినారు. కిరాతకృతగ్రంథమం దొకానొకచోనైన గ్రహించి ప్రమాణీకరించుకొనుట వీరి యజ్ఞానమని చెప్పకతప్పదు. ఇందు వీరు సంఘసంస్కారపక్షమునకు ననుకూలముగా ననేకములు తప్పుత్రోవలం ద్రొక్కినారు...గ్రంథేతివృత్త మసత్య(మనియుఁ గ)థానాయకులు నీచులనియు వ్రాసినారు...పనికిమాలినగ్రంథమును వ్రాసి దోషినైతినని వ్యాసుఁడు విచారించెనని యభిప్రాయమును బ్రకటించినారు...వ్యాసుఁడు...

శ్లో. భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థః ప్రదర్శితః
దృశ్యతే యత్ర ధర్మాది స్త్రీశూద్రాదిభి రప్యుత
తథాపి బత మే దైహ్యో హ్యాత్మా చైవాత్మనా విభుః

(వేదతుల్యభారతము వ్రాసితినిగాని నాయాత్మ తరితపించుచున్నది.) అనియాలోచించు సమయమున నారదుఁడు దర్శనమిచ్చి.

శ్లో. కృతవాన్ భారతం యస్త్వం సర్వార్థపరిబృంహితం
జిజ్ఞాసిత మధీతంచ బ్రహ్మ యత్త త్సనాతనం
తథాపి శోచ స్యాత్మాన మకృతార్థఇవ ప్రభో
యథా ధర్మాదయశ్చార్థా మునివర్యానువర్ణితాః
నతథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః

భారతమున సర్వధర్మములు విస్తరించి వర్ణించినట్లు వాసుదేవుని వర్ణింపవైతివి కావున వర్ణింపుము, నీమనః క్లేశంబు దీఱునని యానతిచ్చెననియు నయ్యుపదేశంబున వ్యాసుఁడు భాగవతముఁ జేసెననియు నున్నదికాని వీరు వ్రాసినట్లు లేదు. వీరును వీరి తండ్రిగారును వాసుదేవుని...శుద్ధచారిత్రుండుగాఁడని చెప్పినవారు ...వాసుదేవుని విస్తరించి వర్ణింపమి...వ్యాసునకుఁ జింతకలిగినది. ఈచింతాకారణము వీరియు వీరి తండ్రిగారియు నభిప్రాయమున కుపకరిం...పదు. భారతము వ్రాసి వ్యాసుఁడు దోషినైతినని విచారించెనని భారతముపైఁగల యనిష్టతం జేసి ప్రకృతమునకు సరిపడ వ్రాసినారే కాని తద్విచార కారణకార్యములు స్వమతవిధ్వంసము చేయుచున్నవని తెలిసికొనఁజాలరైరక్కటా! శిష్యులు రామాయణము నంతయుఁ బారాయణముఁజేయుదురనియు

భారతమంతయుఁ బారాయణముచేయక భగవద్గీతలను మాత్రము ... చేయుచుందురనియునే వ్యాసుని విచారకారణమఁట. రామాయణమునందైనను బ్రాయికముగా సుందరకాండముమాత్రమే పారాయణము చేయుచుందురు. దానంజేసి తక్కినదంతయు వ్యర్థమగునా? ఆకారణమును బురస్కరించుకొని వ్రాసిన భాగవతమునుమాత్రము రామాయణమువలెఁ బారాయణముచేయుదురా? చేయనప్పుడు నారదోపదేశమును వ్యాసరచనమును వ్యర్థములే కావా? భగవద్గీతలుగాక భారత మంతయుఁ బారాయణము చేయరనుట తెలియకయే. వర్షాదులకై విరాటపర్వము పారాయణముచేయుదురు ... భారతమంతయుం బారాయణముచేయువారు పెక్కురు గలరనియుం జెప్పఁగలము... భారతములోని యొక్కొక్కయక్షరమే రామాయణాదులన్నిటికి సరిసమ్మనని చెప్పఁబడియున్నది కావున ... మహామనువుంబలె నించుక పఠించినను వేదశాస్త్రపురాణాదులం బఠించిన ఫల మందినవార మగుదుమని యట్లు చేయుచున్నారనియుం దెలివికిం దెచ్చుకొందురు గాక... పాశ్చాత్యదృష్టి పెట్టి చూడక శాస్త్రజ్ఞానదృష్టిం జూచిన సర్వము సంగతమే యగు...పాండురాజు శతశృంగపర్వతమందు మృతినొందఁగా మాద్రి రాజుతోఁ జితాగ్నియందు మృతినొందెనని యున్నదనియు వారి శరీరములు ఋషులు హస్తినాపురమునకుం దేఁగా నచట దహింపఁబడినట్లున్నదనియు నిది యసందర్భమనియు వీరు పలుకుచున్నారు. ఇది పెద్ద శంకయని పంతులుగారి యభిప్రాయము. శంకయే కాదని పండితుల యభిప్రాయము. శతశృంగమందు మాద్రియుఁ బాండురాజును దహింపఁబడిరి. తరువాత 17 దినములకు వారి దేహములు...హస్తిపురికిఁ దెచ్చినట్లు భారతమున నున్నదియే. ఇట..."దేహయో రస్థీని, అగ్నిహోత్రాదిభిస్సంస్కారలంభనార్థం" అని నీలకంఠాచార్యులుగారు వ్యాఖ్యానము చేసియున్నారు...అస్థిసంస్కారమం దిట్టే...శల్యములకు దేహములనియే వాడఁబడుచున్నది. కావున నిది లఘుశంకగాని గురుశంక గాదు. మఱియు నాదిపర్వమునఁ గర్ణుఁడు సద్యోగర్భజనితుఁడుగా వర్ణింపఁబడినాఁడనియు నారణ్యపర్వాంతమునఁ గుంతి 10 మాసములు... మోసి కనినదియని చెప్పినాఁడనియు నన్నయభట్టు యెఱ్ఱాప్రగడకవులు యథామాతృకముగానే యాంధ్రీకరించినారనియుఁ బరస్పర భేదము వీరు సూచించినారు...ఆదిపర్వమునకు భిన్నముగా నారణ్యపర్వమున ... 10 మాసములు మోసినట్లు సంస్కృతభారతమున... లేదు.

శ్లో. తతో గర్భ స్సమభవ త్పృథాయాః పృథివీపతే
శుక్లే దశోత్తరే పక్షే తారాపతిరివాంబరే
సా బాంధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతి.

ఇందు దశోత్తరశబ్దము ప్రమాదమును గలిగించు...నీలకంఠాచార్యులవారు ... దశోత్తరే, "ఏకాదశే శుక్లే పక్షే ప్రతిపది చంద్రఇవ బాల ఉదృశ్యతే, మాఘ శుక్లప్రతిపది కర్ణజన్మేత్యర్థః" అని వ్యాఖ్యానము చేసియున్నారు. దీనింబట్టి ... సూర్యుఁడు మాఘశుక్లప్రతిపద్దినంబునఁ గుంతిం గూడెననియు నానాఁడే గర్భమయ్యెననియు నాఁడే కర్ణుఁడు పుట్టెననియు స్పష్టపడుచున్నది...పండితంమన్యులు తమకుఁ దెలియదనుకొనక తమదోషము పరులపైఁ బెట్టఁబూనుదురు. ...

సంగ్రహాధ్యాయపర్వమున విపులముగాఁ జెప్పఁదగినవి సంక్షేపించినాఁడని యాక్షేపణము...సంగ్రహాధ్యాయములో సంగ్రహముగాక విపులత యెట్లుండును? విపులత్వమున్న నది సంగ్రహాధ్యాయ మెట్లగును? ఇంతమాత్రమైన విచారింపకోక పోయినందులకు విచారింపనై యున్నది. ద్రోణపర్వములో ఘోరయుద్ధములు జరిగిన వనియు భీష్మపర్వములో వ్యూహములు పన్నుటతో సరిపోయినదనియు భీష్ముఁ డంతగాఁ బోరలే(దనియు న)ట్లు చేరఁగాని వాఁడుగనుక నే దుర్యోధనుఁడు "పదేపదే" వానిరక్షణమునకై యుద్బోధించుచు వచ్చినాఁడనియు...భీష్ము నధమునిగాఁ జెప్పినారు. భీష్ముఁ డాపదిదినములలో దినమునకు 10 వేలను జంపినట్లు భారతము చెప్పుచున్నది. యుద్ధారంభమున వ్యూహములు పన్నుటలోనగు పనులపట్ల నెంతకష్టమో... పంతులుగారి కేమి తెలియును?...వ్యాసుఁడు బ్రాహ్మణుఁడు కాఁడని వ్రాయఁగలిగిన యీతఁ డెట్టి బ్రాహ్మణుఁడో తెలియకున్నది...వ్యాసాదు లధర్మము చేసినారని... వ్రాసినారు...నన్నయభట్టింతకంటె దుర్మార్గుఁడై పాండవుల న్యాయమును జెం[illegible]నియెననిరి. అతని కాపక్షపాతము రాజమహేంద్రుఁడు పాండవవంశస్థుఁడగుట చేతనని సమర్థించినారు. నన్నయ దుర్మార్గమునకు మఱికొన్ని హేతువులు చూపినారు. మూలమునఁ బాండవులను గుంతియు వనమునుండి మునులచే హస్తిపురికిఁ దేఁబడి నప్పుడు పౌరులలోఁ గొంప అనుమానించిరఁట. అది నన్నయ తెనిగింపలేదఁట...పౌరు లనుమానించిరని...లేదు. "విస్మయం సమపద్యత" అని యున్నది. దీనికి వీ రనుమాన మర్థము చేసికొనిరేమో! "పాండవులు ఖేత్యు[illegible]...లని మూలమున నున్నదని వీ రనుచున్నారు...తండ్రి సంపాదించియుంచిన ప్రతిలో నున్నదేమో కాని యేప్రతి యందు నట్లులేదు. పురోచనునితో లక్కయింట నున్నప్పు డేసమయమున వాఁడు కాల్చునోయని

శ్లో. అస్మానపిచ పాపాత్మా నిత్యం కాలం ప్రతిబాధతే
పురోచనభయాదేవ వ్యదధా త్సంవృతంముఖః.

అని యున్నది. దీని కిట్లువ్రాసినారు...తిక్కనకుఁ బాండవులయెడ నిట్టి సంబంధము లేకపోయినను నన్నయ పోకడల నతిక్రమింపలేకయో లోకప్రఖ్యాతినొందిన గాథలను మార్ప నిష్టములేకయో సంస్కృతమునసుండిన దుర్యోధనపక్ష మంతగా నాంధ్రమున సూచింపలేదఁట. 'సంస్కృతమునసున్న దుర్యోధనపక్ష మిది, ఇది మానినాఁడు,' అని వీరు వ్రాయలేదు. ఆవివర మిట నావశ్యకత లేక విరమించినారఁట. పై తప్పువ్రాఁతల కేమి యావశ్యకత వచ్చినదో? ... తిక్కన ... ప్రఖ్యాతినొందిన గాథల మార్ప నిష్టము లేకయో యనిరి. అది యసత్యమైనగాథయైన లోకప్రఖ్యాతి నొందునా? సత్యగాథ గనుక లోకప్రఖ్యాతినొందినది. ద్రౌపది యగ్నిహోత్రమునఁ బుట్టిన మహాసాధ్వియని లోకప్రఖ్యాతి. దానిని నీయయ్య యేటఁగలుపలేదా? అట్లే తెగించిన వానికిఁ దెడ్డే లింగము. సరే. తెలుఁగుకవుల నిద్దఱి నిట్లు చెప్పినారు. ఎఱ్ఱాప్రెగ్గడ విషయ మెత్తుకో లేదేమో? అతఁ డనేకస్థలములఁ బాండవపక్షముగా వ్రాసియున్నాఁడు. అట సాకులు కల్పించుట కేమియుఁ దోఁపలేదు కాఁబోలు ...

చ. కులమును గోత్రముఁ విడిచి కూళతనంబున నెంతవారినిఁ
తలఁపక ధర్మశాస్త్రములు తప్పని చెప్పుచుఁ దప్పుత్రోవలఁ
మెలఁకువ బ్రాహ్మణులందు లేకుండ నీనాఁడు దారులంచుఁ జేరిల్
తులువలు నాపకవ్యథలఁ ద్రుంగకపోవరు దైవ మున్నచోఁ.

---

## —♦ పరిస్థితి దుస్థితి ♦—

(నాగపూడి కుప్పుస్వామయ్యగారు)

మన దేశంబున నిటీవలఁ బ్రాచీనార్యసంప్రదాయాగతములగు ధర్మములును సదాచారములును శ్రుతిస్మృతిచోదిత నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానములును గురుదేవతాభక్తియు నార్యసాధుజనుల దెస ప్రేమయు భావంబులును బ్రాహ్మణులయెడ వినయాదరగౌరవంబులును మనము చూచుచుండఁగనే చాలభాగము నశించెను. ఎచ్చోటనో యెవ్వరియందో కానంబడుచున్న కడమవియు వేవేగ నశించుచుండుటను మనము కాంచుచునే యున్నాము – కేవలోదరంభరిత్వలోలుపత్వమే మెండుగాఁ గానంబడుచున్నది. ఈదుస్థితి యితర దేశంబులకంటెను నాంధ్రమండలమున మఱింత యెక్కువగాఁ గానఁబడుచున్నది. ఇది కరంబు శోచనీయంబనియు లోకులకు సర్వానర్థప్రదంబనియుఁ బెద్దలు తలంచుచు మనంబుల ఖిన్నులగుచున్నారు. ఈదురవస్థ మహానదీపూర్ణప్రవాహమువడువున మహాబలవేగములతో ననివార్యమై పైపై నలుముచు దేశమంతటను వ్యాపించుటచే దీనిం దొలఁగింపఁబూనుట కెట్టివారికి నలవికాదని యోజించి చింతిల్లుచు మిన్నకుందురు.

---

## —♦ తృప్తిసంపాదనము ♦—

(నంజనగూడు శ్రీకంఠశాస్త్రిలుగారు – శృంగేరిసంస్థానము దివాను)

కాలస్వభావముచే జనులం దధర్మప్రవృత్తి హెచ్చుచు వచ్చుటచేతను నీకాలమునుచేతనే సంఘమువారియందు దీర్ఘకాలమునుండి రూఢముగానుండిన నిర్బంధనములు సడలుచు వచ్చుటచేతను ... దొరతనమువారును గావలసిన సాహాయ్యము నొసంగి ప్రోత్సాహము సేయుచు వచ్చుటచేతను నింతవఱకు ననేకులు సముద్రయానముచే ద్వీపాంతరవాసము చేసి వచ్చియున్నారు. ... వారు సంఘముచే వెలిపఱుపఁబడక తఱుచుగాఁ దమకులముతో వ్యవహారము జరిగించుచున్నారనియుఁ గానంబడుచున్నది. ... ఇప్పుడు మనము పూర్ణకాముల మైతిమి ... యోజించిచూచినచో ధర్మలోపము గావించుచు ... ద్రవ్యసంపాదనము చేయవలెనను విషయమునం దపారముగాఁ బ్రబలియున్న యాశ ... మాత్ర మెల్లయెడలను వ్యాపించియున్నదే కాని ఫలమేమియు నస్మద్దేశీయులు పొందలేదని ధైర్యముగాఁ జెప్పవచ్చును ... దేశాంతరవాస తత్రత్యజన సహవాసమువలన మన దేశీయులం దింతవఱకు నామమాత్రముచేనైనను నంటుకొని

యుండిన ... శాంతిదాంత్యాది గుణము లన్నియు ... నాశముచేయఁబడినవి ... రాజస తామస ప్రధానములగు నహంకార మమకారాదు లపరిమితముగా బ్రాహ్మణులందు నాటుకొనినవి. ఈగుణముల ప్రభావముచే ... రాజులవిషయంబున మన ... కుండిన భావన వ్యత్యాసముఁజెందె ... మనవిషయమున రాజులకును ప్రీతి ... తగ్గుట సహజమే ... బ్రాహ్మణులయందుండిన ... రాజప్రీతి ... దగ్గుచున్న దను నమ్మకమువలన బ్రాహ్మణేతరు లెల్లరు ... బ్రాహ్మణుల నిందించునట్లును ద్వేషించునట్లును నైయున్న మహాప్రయోజనమును సంపాదించిన ట్లయినది ... దేశకాల సహాయము యోజింపకయే యేదేశమందైనను నేకాలమందైనను నేపనినైనను జేసి ప్రయోజనముఁ ... బొందవచ్చుననెడు నాశ ... హెచ్చుచుండుటచే ఖనిజముల వలననే ... జీవనము జరుపుకొను ... దేశాంతరీయులం జూచి వారి ననుకరించుటచే మన సంపద నభివృద్ధిగావించుచు సుఖము ననుభవింపఁదగునను నమ్మకము ప్రతి మానవుని మనంబునను రూఢమూలమగుచు వచ్చెను. దాని కనుగుణముగా దేశీయ ప్రభుత్వము వారి సాహాయ్యమును బ్రోత్సాహమును నొనఁగూడినవి.

దీనివలనఁ జిరకాలమునుండి హిందూదేశమునందు ... జను లేవ్యాపారము చేయుచుండిరో యేమార్గమున ... జీవిక నెట్లు వేర్చుకొనుచుండిరో యావిషయమునం దనాదరము గలిగినది ... ద్రవ్యము నితరదేశస్థులకు మాటిమాటికి నిచ్చి ... యంత్ర సామగ్రులఁ దెప్పించుచున ట్లయినది ... మనద్రవ్యము ... మరలిరాదను నమ్మకము గలుగ వలసినదైనను నాయంశమును నించుకేనియుఁ దలంపక నూతనమార్గావలంబనముచే ... ద్రవ్యము నార్జింపఁగలమను నభిమానము మనదేశీయులందు ... నిండియున్న ... ది ... వేఱొకదేశమునుండి ... ద్రవ్యము వచ్చి మనద్రవ్యమునందుఁ జేరినంగదా మన ... భాగ్యము హెచ్చినదని తెలియందగు ... ఇంతవఱకును గలిగిన యనుభవముచే నీఫలము నెవ్వరైనఁ జూచియున్నారా ? పోయినద్రవ్యము బయటనుండి రప్పించుకొను నుద్దేశముతోఁ జేసెడు ప్రయత్నము ఫలకారి కానేరదని తెలియుటయే లేదు. కావున నిఁకనైనను మనదేశము విభవము బయటికిఁ బోకుండునట్లు నిరోధించుటయందు మాప్రయత్నమని కొందఱు చెప్పునట్లు కానంబడుచున్నది ... ఇంతవఱకును గల యనుభవమువలన దేశాంతరీయుల సాహాయ్యమును వారిచే సిద్ధపఱుపఁబడిన సాహాయ్యమును లేక మనదేశమువా రెవరైనను ... విదేశస్థులు జరుపువ్యాపారములను వారి మార్గమును విడిచి వేఱురీతిని జరిపియున్నట్లును దానివలనఁ బ్రయోజనమును బొందియున్నట్లును దెలియవచ్చియున్నదా ? ... వారిపగిది మనము నాచరింపవలయునను నాశతో మాత్రము చేయు ప్రయత్నమువలన ననర్థప్రాప్తియగునే కాని యర్థప్రాప్తి సంభవింపదు ... "గతానుగతికో లోకః" అనునటు లొకరిని జూచి మఱియొకరు పైఁబడి యల్పవ్యయముచే సాధింపఁదగిన యల్పకార్యమునందును ... హెచ్చుగా వ్యయము చేసి తాత్కాలికసుఖమును బొందుట కిచ్చగించుచున్నారు. దీనిచే ననేకజనులందు ... విస్తరించియుండు ... సంపద క్రమముగాఁ గొందఱుజనులమాత్రము చేరె ... దరిద్రులు మెండై దేశీయుల కష్టము హెచ్చెను. దరిద్రులందుఁ బెక్కండ్రు ... ప్రయాసతో ననేకకార్యములు చేసి ... స్వల్పప్రయోజనముచేతనే తృప్తినొంది జీవనము ...

నడుపుకొనుచున్నారు. అట్టికార్యములను యంత్రసాహాయ్యముతోఁ జేసి యధికలాభమును బొందవలయుననెడు నాసచేఁ గొందఱు వర్తించుటచే ననేకజనుల జీవికకు భంగమొదవి ... కష్టపడునటులై యున్నది ... మనుష్యుని శరీర మన్నమయమైనది. ఈశరీరమును రక్షించుటకును బోషించుటకును నాహారయోగ్యములగు పదార్థములే ముఖ్యసాధనములై యున్నవి. ... ద్రవ్యమును సంపాదించినవాఁడును ... బంగారు మున్నగువాని నెంతయైన నిచ్చి యాహారయోగ్యవస్తువులను సంపాదింపవలయు ... మనదేశీయులయుపయోగమునకుఁ గావలసిన పదార్థములను మనదేశమునందే యుత్పత్తి యగునట్లు చేయుచు ... శిల్పాదికళల వృద్ధిపఱచి ... మనదేశపు సంపద బయటికిఁ బోకుండునట్లును ... వృద్ధినొందునట్లును జేయుటచే నీదేశపు జనులు సుఖమును బడయనగును గాని యిప్పుడవిచారమూలముగా మనదేశీయులు చేయు వ్యాపారముల వలన నీప్రయోజనము నెంతమాత్రము నెక్కాలంబునను బడయలేరను నంశమును కీర్ఘదర్శు లంగీకరింపక పోరు. మఱియు నీదేశమందుఁ బూర్వకాలమువారు వర్ణాశ్రమాచారము లను పేరుతోఁ గొన్ని నిర్బంధముల నేర్పఱచియున్నారు. ప్రకృత మానిర్బంధములకుఁ బ్రచారము లేకున్నను మిణుఁగురుఁబురువులవలె వానియాభాసములుగానైనను నవి మిణుకుచున్నవి ... కొందఱు ... సర్వానర్థములకు నివియే కారణమైయున్నవి కావున వర్ణాశ్రమధర్మము లను శబ్దప్రచారమునకును నవకాశము లేకుండునట్లు చేసినం గాని హిందూదేశ మభివృద్ధిగాంచ నేరదని చెప్పెదరు ... లోకమం దొకతల్లికడుపునఁ బుట్టి పుట్టిన నాఁటనుండియు నొకవిధమగు నాహారవ్యవహారములచే ... పెరిగిన ... సహోదరులందు స్వాభావమగు ప్రీతియు నేకీభావమును స్థిరముగా నమరియుండుటనైనను జూచియున్న ... భిన్నాచారములచేతను జాతిభేదములచేతను జనుల కైకమత్యము ... తప్పియున్నదని ... నమ్మఁదగును. ... పరస్పరానురాగము లేకుండుటకును నైకమత్యము లేకునికికిని రాగద్వేషాది గుణములు కారణమే కాని ... శబ్దమాత్రములో నెచ్చటనో ... జీవించుచున్న వర్ణాశ్రమధర్మము లేమి చేయఁగలవు? దీని ప్రచారమును నిర్మూలము చేయుటకు బద్ధకంకణులైన మహనీయులు తమ యనుష్ఠానముచే ... చాలవఱకుఁ దమ సంకల్పమును సాధించియున్నారు. దానిఫలమే బ్రాహ్మణబ్రాహ్మణేతరులందుఁ గలిగియుండు సౌహార్దంబని చెప్పందగును.

కావున — తృప్తిసంపాదనమను సూత్రముమీఁద మన యిప్పటి యనుభవము ... విచారము చేయఁగాఁ బై విషయము లసమంజసవాదములనియు యుక్తిరహిత వాదములనియు నభిప్రాయపడుట కవకాశము లేనందున ... మనయందు ... వృద్ధిఁ బొందుచున్న యాశను గ్రమంబుగాఁ దగ్గించుచుఁ దృప్తిని వృద్ధిపఱచుకొనుచు ... పూర్వాచారములందు ... నమ్మకముంచి యత్నము సేయునెడల మనదేశము సంపత్పూరితమై దేశీయులు సుఖము ననుభవింతురే కాని యేయితరప్రయత్నముచేతను సుఖము సాధ్యము కానేరదని తోఁచుచున్నయది.

---

పడుచున్నారు ... కొందఱు ... విద్యాధికమైన హైస్కూల్సు కాలేజీలు మొదలైన వానియందు ప్రవేశించుచున్నారు. వారికొందఱు కొంతవఱకు సావధానముగాఁ బరిశీలించి ప్రయత్నము చేయుచున్నారని మాకే బోధపడును. ఎక్కడెక్కడి వేషభాషలనో పొరుగుదేశాల యలంకారాలనో యవలంబించుచుఁ దన్మూలముగాఁగూడ ననవసరపు నాగరికతలోను నాగరికమనుకొను నటువంటి స్థితి తెచ్చుకొనుచున్నారు వారు. విద్యాభ్యాసమున్నప్పుడు గ్రామక్రమముగా విజ్ఞానము విజృంభించవలెనే కాని యీ తెచ్చికొలుపు వేషభాషలు లెందుకో నాకవగాహన మగుటలేదు. ఈ వేషములవల్ల బాలిక లొకవిధమైన యహంకారాన కలవారిగా వరిగుచున్నారు. అనవసరమైన యభిమానముల కగ్గమగుచున్నారు. ఈపరిస్థితులుకూడఁ బలుమంది వ్యాఖ్యాసక్తివంతుల కెదురొడ్డవలసివచ్చుచున్నవి. వీటిమూలముగాఁ జాలమంది తమ బాలికలకు విద్య చెప్పించుటకు జంకుచున్నారు. విద్య నేర్చిన స్త్రీ సంసారము సరిగా నడుపునాయనెడి సంశయానకుఁగూడ నీపరిస్థితులే యవకాశ మిచ్చుచున్నవి. ఈగొడవ యంతయు నెందుకుఁ దెచ్చిపెట్టుకొనుచున్నట్లు? విద్యావతులైన మన సోదరీమణులుకూడ నితరసోదరీమణులవలెనే యుండకుండరాదు? విపరీతమైన వేషభాషల నెందుకలవఱచుకోవలెను? స్త్రీజనమునకు సహజమైన నమ్రత వినయము మొదలైన సుగుణాలకు వారేల దూరముకావలెను? ... ఈ వేషము తమతోనే వదలివేయుచున్నారా యనిన నదియుఁ గనఁబడదు ... బస్తీలలోఁ దాము నేర్చుకొనివచ్చిన వేషమును గ్రామముగాఁ బల్లెలకుఁగూడఁ బ్రాకించుచున్నారు. ఈ విద్యావతుల వేషమును జూచి వారి తల్లిదండ్రులకు మురిసిపోయి తామగూడ వారివలెనే కనఁబడవలెనన్న మోజుతో విద్యాగంధ మెఱుఁగని పల్లెటూళ్ళ స్త్రీలుకూడఁ జాలమంది యీ వేషములకు దాసురాండ్రగుచున్నారు. విద్యాగంధ మెఱుఁగని వనితలు విద్యావతులైన సోదరీమణుల ననుకరించుట తప్పని నే ననుటలేదు. కాని యీవిషయములో విద్యావతులు తమ బాధ్యతలనుమట్టుకు మఱచిపోరాదని హెచ్చరింతును. తమ కన్ని యనుకూలములు నున్నవిగదాయని యీ వల్లమాలిన వేషము నవలంబించిన నవలంబింతురుగాక. కాని తమ యొరవడితో నితరు లెంతమంది భ్రంగిపోవుదురో వారేమైన నాలోచించినారా యని నా ప్రశ్న ... విద్యావతులను జూచి యటువంటి యాడంబరముల కనుకూలమైన శక్తిసంపదలు లేని యవిద్యావతులుగూడ దూరదృష్టి లేక వారివలెనే మొదలుపెట్టి యెంతటికష్టనష్టములకు గుఱియగుచున్నారో మనలో నెవరైన నాలోచించినారా? స్త్రీల కలంకారప్రీతి యుండుట సహజమే. అందులో తప్పుకూడ లేదు. కాని యదే తమజీవితపరమావధిగాఁ బెట్టుకొనుటమాత్రమనేకానర్థములకుఁ గారణమగునని నేను జెప్పుచున్నాను. విద్య నేర్చుకొన్నందుకు ఫలితముగా మనలో నంటుకొనియుండు లోటుపాట్లు పోవలెనే కాని యనవసరమైన యాడంబరముల మన దగ్గఱకుఁ జేరనీయరాదు ... బాలికలను ... ఏదోయొక సంబంధము నిశ్చయించుకొని వచ్చువఱకు మగవాండ్ర నొకచోటఁ గాలు నిలువనీయకుండఁ ద్రిప్పుచుండెడి సోదరీమణులు మనలోఁ జాలమంది యుందురు. ... పోరుపడలేక మగవాండ్రు తిప్పలు పడి యడ్డమైనవాండ్రను యాచించుచును దేబిరించుచును నుండిన నొక్కొక్కప్పుడు జాలి కలుగుచుండును ... వరదక్షిణపద్ధతికిఁగూడ స్త్రీలే ముఖ్యు

## —• మంగళాచరణము •—

ఆ. ఎవనివలన జగము లెల్లను బొడమొందు
నెవనియందు సునికి నెనయుచుండు
నెవనియందె మరల నిన్నియు లయమందు
నట్టిసత్స్వరూపు నాత్మ నెంతు. 1

తే. జ్ఞాత జ్ఞేయంబు వెండియు జ్ఞాన మనఁగ
ద్రష్ట దృశ్యమ్ము మఱియును దర్శన మనంగఁ
గర్త క్రియయును నటువయిఁ గారణ మన
నెవనిచే నగు జ్ఞప్త్యాత్ము నెంతు నతని. 2

తే నాకమున భూమి నానందశీకరమ్ము
లెవనివలన స్ఫురించు నీయెల్లభూత
ములకు జీవన మెవ్వనివలనఁ గలుగు
నట్టియానందరూపు నే నాశ్రయింతు. 3

## —• సూత్రపాతనికావర్ణనము •—

చ. పుడమి సుతీక్ష్ణుఁ డన్పరమభూసురుఁ డొక్కఁడు సంశయం బొకం
డెడఁదఁ గలంపఁగా బుధజనేడ్యు నగస్త్యమునీంద్రుఁ జేరి వెం
పడరెడుభక్తితో నతనియంఘ్రులకున్ బ్రణమిల్లి ప్రీతుఁడై
యడఁకువమీఱ నిట్లనియె నాదరమేదురభాషణంబులన్. 4

తే. ధర్మతత్త్వజ్ఞ! శాస్త్రవిద్వర! మహాత్మ!
సత్కృపాకర! మది నొక్కసందియంబు
కలఁచుచున్నది. యద్దానిఁ దొలఁగఁజేసి
శిష్యుఁ డగునన్నుఁ జరితార్థుఁ జేయవలయు. 5

ఉ. కొందఱు మోక్షమున్ గనుటకున్ ధరఁ గర్మమె సాధనం బటం
చందురు, కాదు జ్ఞానమని యందురు కొందఱు, కాదు రెండునం
చందురు కొంద, ఱిందలి యథార్థమతం బెఱుఁగంగనేరమిన్
గొందలమందె డెంద మిఁకఁ గోవిద! నిశ్చిత మెద్ది తెల్పవే. 6

వ. అనిన నమ్మునీంద్రుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె 7

శా. పక్షద్వంద్వము పక్షి కేగతి నభోభాగప్రచారంబునన్
దక్షత్వం బిడు, నట్లె కర్మమును జ్ఞానంబున్ దగం గూడియే
సాక్షాత్ప్రాప్తి ఘటింపఁగాని యొంటియంబున్ గూడ కేదొండు త
న్మోక్షం బీయఁగఁజాల దందురు మహాత్ముల్ భూసురగ్రామణీ! 8

వ. ఇయ్యర్థంబునఁ బూర్వవృత్తం బగు నితిహాసం బొక్కండు కలదు. వక్కాణించెద. సావధానుండవై యాలింపుము. తొల్లి యగ్నివేశ్యుం డను బ్రాహ్మణునికుమారుండు కారుణ్యుం డనువాఁడు గురుసన్నిధానంబున నధీతవిద్యుండై వేదవేదాంగపారంగతుండై గృహంబున కేతెంచి సంశయగ్రస్తమానసుండై నిత్యకర్మంబుల విడనాడుటయు నగ్నివేశ్యుండు కుమారుని నిందృవర్తనంబునకుఁ జింతిల్లి హితాభిలాషియై యిట్లనియె. 9

మ. తనయా! వేదములున్ బురాణములు శాస్త్రంబుల్ సమగ్రింబ నే
ర్చిన విజ్ఞుండవు, నిత్యకర్మముల నీరీతిన్ విసర్జింపఁగాఁ
జను నే? దీన జనించుపాప మెటులన్ శాంతించు? నేకారణం
బున నీ వింతకు సాహసింతు? కలరూపున్ దెల్పుమా నావుడున్. 10

వ. కారుణ్యుం డిట్లనియె. 11

శా. యావజ్జీవము నగ్నిహోత్రమును సంధ్యాదేవతన్ నిత్యమున్
సేవింపన్ వలెనంచు వేద మొకచోఁ జెప్పున్, మఱొం డొక్కచో
నావేదంబె సుకర్మచేఁ బ్రజలచే నర్థంబుచే నైన మో
క్షావాప్తింగనఁ డొక్క త్యాగమునఁదక్కన్ బూరుషుం డంచనున్. 12

కం. ఈశ్రుతియుగమం దెయ్యది యాశ్రయణీయంబొ తెలియ కాకులమతినై
యాశ్రమ లేలా యని నే నశ్రద్ధన్ గర్మచయము నంత విడిచితిన్. 13

వ. అనిచెప్పి మిన్నకున్న కారుణ్యుం గాంచి గురుండు మరల నిట్లనియె. 14

తే. ఒక్కకథ నీకు నుడివెద నోయి పుత్త్ర!
సావధానంబుగన్ దాని నీవు వినుము;
అవగతము చేసికొమ్ము తదర్థ మెల్ల
నవల నీయిచ్ఛవచ్చినయటు నడువుము. 15

ఉ. శ్రీకరకిన్నరప్రజనిషేవితమై శిఖిజాలరమ్యమై
నాకధునీప్రవాహజలనందితసర్వసుపర్వబృందమై
లోకవిలోక్యమౌ హిమశిలోచ్చ్రయశృంగమునందు నాపుశ్శీ
లాకృతిరేఖలన్ సురుచియౌ నొక యచ్చర తా నిషణ్ణయై. 16

వ. అంతరిక్షంబున నరుగునింద్రదూతం గాంచి యతనిం బిల్చి యెట
నుండి యెట కేగెద వని యడుగుటయు నతం డిట్లనియె. 17

మ. విను మోతన్వి! యరిష్టనేమి యను పృథ్వీజాని రాజ్యంబుఁ బు
త్త్రున కర్పించి విరక్తచిత్తుఁడయి యెంతో నిష్ఠతో గంధమా
దనమందున్ దపమాచరించుటయుఁ దత్కార్యంబు సాధించి వ
జ్రిని జేరం జనుచుంటి నే నిపుడు తద్వృత్తాంతముల్ చెప్పఁగన్. 18

తే. అనిన నచ్చరలేమ యిట్లనియె, దేవ!
అతనివృత్తాంత మేమి నా కానతిమ్ము
వినవలతుఁ గానఁ గరుణించి వేగిరపడ
కెల్లవృత్తంబు వివరింపవే మహాత్మ! 19

చ. అన విని దేవదూత యను, నమ్మ! సవిస్తరరీతిఁ దెల్పెదన్
వినుము సమస్తవృత్తమును వీనులవిందుగ నట్టు లానృపుం
డనుపమనిష్ఠమైఁ దపమునందు నిమగ్నత నుండ నొక్కనాఁ
డనిమిషవల్లభుం డిటుల నానతి నా కొసఁగెన్ దివంబునన్. 20

శా. ఓవార్తాహర! అప్సరోగణసముద్ద్యోతంబు దివ్యంబు నా
నావాదిత్రసమన్వితం బగువిమానం బిద్ది గొంపోయి ది
వ్యావాసం బగుగంధమాదననగంబం దుండునీవ్యత్తప
శ్శ్రీవిభ్రాజ దరిష్టనేమినృపునిన్ శీఘ్రమ్ము దర్శింపుమా. 21

తే. అటుల దర్శించి వేణుమృదంగతాళ
వాదనాదుల నతని వినోదపఱచి
స్వర్గభోగంబు లనుభవింపంగఁ దోడి
తెమ్ము నాయాన నమరావతికి బిరాన. 22

ఉ. అంత మహేంద్రు నాజ్ఞ వెస నొందలఁదాలిచి తద్విమానమున్
గాంతసువస్తుశోభితముఁ గైకొని వేగ నరిష్టనేమిభూ

కాంతునిఁ జేరి యాతనికి గ్రక్కున శక్రుని యానఁ జెప్పఁ దా
నెంతయు సంతసించి ధరణీశుఁడు నన్ గని పల్కె నీగతిన్. 23

క. అనఘాత్మ ! స్వర్గమందలి గుణదోషంబుల నెఱుంగఁగోరెద వానిన్
వినిపింపుము విని నాకున్ మనసైనవిధాన నే నొనర్చెద ననుడున్.

వ. నే నిట్లంటి రాజర్షిచంద్రమా ! అవధరింపుము. స్వర్గంబున నల్ప పుణ్యసంగ్రహవలన నధికసౌఖ్యం బనుభవింపంబడదు ఉత్తమపుణ్యంబున నుత్తమస్వర్గంబును మధ్యమపుణ్యంబున మధ్యమస్వర్గంబును గనిష్ఠపుణ్యంబునఁ గనిష్ఠస్వర్గంబును సిద్ధించునుగాని తదితరంబులు లభింపవు. వెండియు, 25

తే. పరులయుత్కర్షఁ గాంచ నోర్వమి జనించు
సముల సామ్యంబుఁ గనుగొన స్పర్ధ కలుగుఁ
దక్కు వగువారిఁ జూడ సంతసము తోఁచు
క్షీణపుణ్యుల కెప్పు డక్షీణపుణ్య ! 26

తే. నాకగతుఁ డైనవాఁ డు తల్లోకమందుఁ
బుణ్య మెప్పుడు క్షీణమై పోవు నపుడె
మర్త్యలోకంబునకు వచ్చు మనుజుఁ డగుచు
స్వర్గమందలి గుణదోషవర్గ మిదియ. 27

చ. అనిన నరిష్టనేమి యను నట్లయినన్ త్రిదివంబు నొల్ల నో
ఘనుఁడ ! భవద్విమానమును గైకొని వచ్చినరీతి నీవు శ
క్రునికడ కేగుదెమ్ము, కయికొమ్ము నమస్కృతకమ్ము, వేఱుకీ
తినిఁ దలపోయకుండ నల దేవశిఖామణికిన్ వచింపుమా. 28

కం. ఏనింక నీయశుద్ధం బైనతనువు నుజ్జగింతు నత్యుగ్రతప
శ్శ్రీనియమధారణంబునఁ బూనిక సర్పంబు కుబుసమున్ విడుచుగతిన్.

వ. అనిన నేనును సత్వరంబుగ సంక్రందను సన్నిధికిం జనుదెంచి వృత్తాంతంబు యథావృత్తంబుగ నివేదించి యచ్చటి సభాసదుల కచ్చెరువు గావించితి. మహేంద్రుండును మరల నన్నుం గని మృదుమధుర భాషణంబుల నిట్లనియె. 30

సువాసినులుగ నున్న నాఁటి సౌకర్యములు కొన్ని వితంతువులు కనుఁగొనఁజాలవనుట నిక్కము. సౌశీల్యముగలవార లట్టి తుచ్ఛసుఖముల మఱచి తమ వ్రతనియమములచేఁ దృప్తినొందుచుండఁగలరు. దుశ్శీలలు తమ కోర్కెల నణఁచుకొనుచుఁ జింతాసముద్రమున మునిఁగి తుద కధోగతిపాలగుదురు. ఇట్టివారిం గాంచి దయారసపూరితులమని తలంచువారలు కొంద ఱీ ప్రసూతివ్యాపారనిషేధన మతి క్రూరమనియు మానవజాతికి హైన్య మాపాదింపఁగలదనియు ననుచుందురు. సుఖదుఃఖములు మనోజనితములని యెల్లరు నెఱుఁగుదురు. వ్రతనియమము లవ వడినవారి కేదేని వ్రతభంగము కలిగినప్పుడు సంభవమగు విచారమును గష్టమును మరణ మాసన్నమైనను గలుగనేరదు. మన ఋషిపుంగవులును బాలవితంతువులఁ జూచి నేఁటి దయారసపూరితుల మనుకొనువారికంటె నధికదయారస భరితులని తద్భావములఁ దెలియఁగోరువారి కెల్లరకు విదితముకాఁగలదు. అధునికులు మితకాలస్థాయిగు వైవాహికసుఖమును మాత్ర మెఱుఁగుదురు. మన పూర్వఋషులు శాశ్వతానందసంధాయకములగు మార్గముల నెఱిఁగి తాత్కాలిక మన సైక్షణికముగ నిరసించి శాశ్వతసుఖసాధకముల బోధించియున్నారు. జన్మాంతరపుణ్యవిశేషముచే నందిన యీపదవి తొలఁగించికొని యధోగతిం బూనుట కొల్లని స్త్రీజాతికి మాఱుమనువు నింద్యముగఁ దోఁచకమానదు. తక్కువ జాతులవార లనేకు లీయాచారమును బరిపాటిగ నవలంబించుచున్నారు. ముక్త్యపేక్ష వదలి కామనివృత్తి చేసికొన నిచ్ఛయించువార లట్టి తక్కువజాతులం గలసి కృతకృత్యులగుట కేయాటంకమును లేదు. పుత్రులే సర్వస్వమని తలంచు తల్లిదండ్రులే భావిసుఖాపేక్షచేఁ జనించుకాలమున నిద్రాహారవిహారములనుండి వారి మనంబుల మరలించుచు నెన్నియో పరితాపములపాలు గావించుచుందురు. తల్లిదండ్రులు తమ ప్రేమైకస్థానములగు పుత్రుల నిర్బంధించుటయు వా రందులకంగీకరించి లోబడుటయుఁ గలుగుచున్నది. ఈవిషయముల నెఱుంగఁజాలనివారిది క్రౌర్యమని తలంపవచ్చుం గాని పుత్రులు విద్యావంతులై సుఖమును బడయుటకే తలిదండ్రులు వారి నట్లు నిర్బంధించుచుందురు. అటులనే కించిత్కాల కష్టమున కోర్చిన శాశ్వతసుఖము నందవచ్చునని తలంచి మన ఋషిపుంగవులు తలిదండ్రులకంటె వితంతువులయెడ దయాకలితహృదయములతోనే యట్లు నిర్ణయించియున్నారు. ఇటుల నింకను జెప్పఁబూనిన నెన్నియో దృష్టాంతము లుండును. ఎట్టివిషయములందు మనబుద్ధిని బ్రసరింపఁజేసినను వేగముగఁ బాఱుచుండును. భాగవతమున సీ. రథము దేహంబు, సారథి బుద్ధి, ఇంద్రియ గణము హయంబులు, పగ్గములు మనసు ...అని చెప్పఁబడియున్నది. సారథితోలు మార్గమున నశ్వములు పరుగెత్తునట్లు బుద్ధి ప్రేరేచు మార్గమున నింద్రియములు నడచుచుండును. మనోబలముచే వానిని స్వాధీనమం దుంచుకొనఁగలవారి కేదియు సులభమే. జన్మాంతరసంస్కారాదు లెఱుఁగని మతాంతరు లీవిషయమును సమగ్రముగ దెలిసికొనుట కవకాశము శూన్యము. మతరహస్యములును ధర్మసూక్ష్మము నెఱిఁగిన వార లీవితంతూద్వాహప్రేరణ మొక కర్మప్రోత్సాహమని

తలంపకమానరు. మన మతాచారలోపముల నెన్నువారు తమదేశమతాచార లోపముల నిచట నెన్నకుండుట స్వాభావికమే. తదీయవివాహములను వరాన్వేషణంబున నవివాహితలగు జవరాండ్ర చర్యలను దంపతుల వివాదములను వివాహభంగాభియోగంబులను గానీన శిశు గోళక కరుణాలయంబులను విపులముగ మనసభలయందు వెల్లడించునెడల మనయువతులలో నతిమూర్ఖతగలవారైన వారియాచారము లతిగర్హ్యము లని నిరసింపక మానరు. మనవారును గొందఱు మతాంతరాభిప్రాయముల నేకీభవించి యుపన్యాసములిచ్చుటయు వెనుకముందు విచారింపక వారి వేషభాష లవలంబించి తదనుకరణము శ్రేయస్కరమని తలంచుటయు నధికతరగుణగ్రహణపారీణత కాఁజాలదు. ఈశ్వరనిర్ణయముయొక్కయు సృష్టివైచిత్ర్యముయొక్కయు రహస్యము నెఱుఁగఁజాలని మనము వానియందు లోపములుండునని తలంచుచుందుము. ఇది ప్రపంచవాహినీ నైజము. మన ఋషు లనుభవముచే సర్వమార్గముల నుత్తమోత్తమములగు వానినే మనకు నిర్ణయించియున్నారు. సమబుద్ధిచే యోచింపఁగలవా రందఱికి నిది నిశ్చయమని తోఁపకమానదు. అనుకూలదాంపత్య మెట్టివివాహములందుఁ బ్రబలుచున్నదియు స్వయంవరవివాహములందు పశ్చాత్తాపములు పడుకష్టములును జేయుచుండు పనులును వ్యభిచార మెట్టివారియం దాధిక్యము నందియున్నదియు వితంతువులలో వివాహేచ్ఛగలవారి సంఖ్య యాధిక్యమైనదియుఁ గాని వారిసంఖ్య యాధిక్యమైనదియు వివాహము కానందున నలవడు స్వభావముచేఁ బీడింపఁబడువారి సంఖ్య యెంతయైనదియుఁ గనిపెట్టి లెక్కలు తేల్చి యంటిని తారతమ్యము చూపఁగలిగిన పూర్వాగ్రేసరులు వెలువడునాఁటికి మనయాచారము లుత్తమోత్తమములని ధ్రువము కాఁగలదు.

ఇప్పుడు నాగరకాగ్రగణ్యులమని మనకు బోధయొనరించువా రప్పటికిఁ దమ తప్పు కనుగొని మనంబుల మరలించుకొనఁగలరు. తమ మతమే మంచిదనియు నన్యమతములెల్లఁ గల్లయనియుఁ దలంచువారినే మనవారు మతపాషండులని చెప్పుచుందురు. ఏతాదృశ్యమతావలంబులే పరమతసహిష్ణుత లేనివారై స్వమతవ్యాప్తికొఱ కెన్నియేని పాట్లు పడుచుందురు. శ్లో. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం। మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః — అను గీతావాక్యముచే మనమతము సర్వసమ్మతము. మతాంతరుల కిట్టి యవకాశము లేదు. వెయ్యి సం॥ ముల నుండి మనదేశము పాలించుచున్న మహమ్మదీయులును క్రైస్తవులును నిట్టి మతావేశపీడితులు. వారి విద్యావివాహాది విధులు మనకు భిన్నములు. వారియం దస్మద్దేశీయవిద్యాపారంగతు లరుదు. మానవస్వభావము ననుసరించి స్వమతాచారవిధు లుత్తమమని వారు తలంచుచున్నారు. మనవారియం దనేకు లాత్మీయాచారవిధు లెఱుంగక రాజకీయ విద్యాచారవిధులం దాతిథేయులైయున్నారు. బుద్ధిమదగ్రేసరులగు వీర లన్యమత రహస్యము లెఱుఁగుచు దేశాంతరు లొనరించు వివాహవిశేషముల గుఱించియు దంపతీవివాద ఫలితములను గుఱించియు ననాథశిశుశరణాలయస్థాపనలం గూర్చి

యును విచారించఁగలిగినప్పు డిప్పటి స్వమతవిద్యాబోధకుల మార్గమును వదలి వర్తమానపత్రికలందును సభావేదికలందును దమ ప్రాగల్భ్యముకొలఁది మనపూర్వాచారపరిచారమునకుఁ దోడ్పడువారగుదురు. పరమతదూషణ మెంతమాత్రము సహింపని మన వైదికసిద్ధాంతవేత్త లుత్తమోత్తమజ్ఞానారూఢులై సర్వోత్కృష్టపదంబు నధిష్ఠించియుండియు నిక్కాలంబునఁ దన్మహత్త్వ మెఱుంగఁజాలని మతాంతరాధికారబలంబుచే నీచదశ ననుభవించుచున్నారు. కాలాంతరములచే ద్రవ్యలోపమునందిన సత్కులీనుఁడు నీచక్రియాచరణ మొల్లనిలాగున మనపండితు లట్టి దేశాంతరాచారము లవలంబింప నొల్లకున్నారు. తద్దూషణ మొనరించుటకును సాహసింపరు. స్వమతాచారోత్కృష్టత మతాంతరులకు బోధించి నైజతన్మతవిముఖత్వమాపాదింపను సమకట్టరు. భారతవర్ష మతశాస్త్రములకిప్పుడు నీచదశ వర్తిలుచున్నది. వందల సంవత్సరములకుఁ గాని మార్పునొందదు. మరల మన దేశీయగ్రహము లుచ్చస్థానముల నలంకరించునాఁటికి యథాపూర్వగౌరవాధిక్యము పునరుద్ధారము కాఁగలదు. నిదాఘంబున తుచ్ఛప్రవాహకలుషితంబగు మహానది ప్రావృట్కాలంబున మదగజావగాహంబగుట సిద్ధమేకదా ! ఎంతయెండ కంత వాన. ఇప్పుడు మన మెంతనీచదశాపతితుల మగుచున్నామో దానికిఁ బదిరెట్లధికగౌరవము నందఁగల మంచికాల మాసన్నమగును. నాఁటికి మన యువజను లెల్లరును నీతిమార్గ మవలంబించి యుక్తప్రవర్తనశీలు రగుదురు. ఆక్షేపణ లన్నియుఁ నడుగంటును. మన పూర్వాచారము లన్నియు స్తోత్రపాత్రములగును. వేదశాస్త్రప్రామాణ్యము సర్వజనసమ్మతమై యుండును. స్త్రీజను లెల్లరు నుత్తమమార్గ మెఱిఁగి పురుషోత్తములుకాఁదగు పుత్రులఁ బడయుదురు. వారలే దేశమతాచారోద్ధారక లగుదురు.

# ఆరోగ్యము

క. భాగ్యము భాగ్యమ్మన నా
రోగ్యము భాగ్య మగుఁగాక రొక్క మగునె? ఆ
రోగ్యము తప్పినయప్పుడు
భోగ్యమ్ములు కాని భాగ్యములు వ్యర్థ మగున్.

లోకమున నెల్లవారికిని భాగ్యభోగ్యములపైఁ గోరికలుండుట సహజము. కాని సమస్తభాగ్యములకంటె నారోగ్యభాగ్య మధికమైనదని పలువురు గుర్తెఱుఁగుదురు. ఎంతవివేకము కలవారైనను దమ కారోగ్యభంగము కలిగినప్పుడు కాని యీనిజము సరిగ నెఱుఁగఁజాలరు. అట్టితరుణముల మానవులకుఁగల సమస్తభోగభాగ్యములును వ్యర్థములని ధ్రువముగఁ దోఁచును. కావున నితరభోగభాగ్యములకంటె నారోగ్యభాగ్యము మొదటిదనియుఁ దక్కినసంపదలన్నియు దానికి లోఁబడినవనియు నెల్లరుఁ దెలిసికొని తమ కారోగ్యము చెడకుండునట్లు సంచ

రించుట మొదటిపని. అన్నిటికంటె నారోగ్యవిధుల నెఱిఁగియుండుట తత్త్వావశ్యకమైనను దీనిం జదివి మననము చేసికొనుటయుఁ దద్విధుల నాచరింపఁ బూనుటయుఁ జదువరులకు విసుగుగ నుండవచ్చును. అధ్యాయాంతములందువలె నిందు రసోచితకథాసందర్భము లొప్పుచుండవుగావున నొక్కసారియైన పావకాశముగఁ జదువుఁడని ప్రార్థించుచున్నాను. ధనవంతులు తమ ధనమెల్ల వెచ్చించియు నారోగ్యసంపాదనము చేసికొనఁజాలరు. ఆరోగ్యసంపాదన సామర్థ్యము ధనమునకు లేదు. కావునఁ బ్రతివారు నారోగ్యనియమముల నెఱిఁగియుండి సాధ్యమైనవఱకుఁ దద్విధుల నతిక్రమించకుండ జరుపుకొనుచు నారోగ్యవంతులయి సుఖముగఁ గాలముగడపుట పరమావశ్యకము. మన యవయవముల నెచ్చటనేని యొక కురుపులేచినను గించిత్తుగ దెబ్బతగిలినను సర్వావయవములును నుపయోగించుకొనఁజాలకుండుటయు ముఖ్యముగ బాధగలిగినభాగ మెంతయుపయోగముగ నున్నదియుఁ దెలిసికొనఁగలుగుదుము. అటులనే మన యారోగ్యము చక్కగ నున్నంతకాలము దానిమహిమను గనుఁగొనఁజాలము. అది చెడినప్పుడు కడుపునిండఁ దిండితినఁజాలకయుఁ గంటినిండ నిద్రపోఁజాలకయు విచారపడువారు మఱియు నేయితరమహాభోగము లమరియున్నను దమవిచారమును నివృత్తి చేసికొనఁజాలరు. కావున సర్వప్రయత్నములచే నారోగ్యము చెడకుండఁ గాపాడుకొనుచుండుట విధి. ఆరోగ్యనియమము లెంతగ నాచరించిన నంత మేలు. ఎంతగ నెఱిఁగియున్న నంతమంచిదని యొకనాఁడు కృష్ణాబాయి చదువుచుండఁగ లోపలినుంచి యరుదెంచి,

జగదంబ:— ఈపుస్తకము దేనినిగూర్చి చదువుచున్నావు ? నన్నుఁగూడ రానిమ్ము.

కృష్ణ:— అత్తగారూ! ఇప్పుడే మొదలుపెట్టినాను. రండు విందురుగాని (అని చదువఁ దొడఁగెను.)

లోకమున దినదినముఁ జచ్చెడివారలలోఁ బెక్కండ్రనారోగ్యముచే నాత్మహత్య గావించుకొనువారలే కాని కాలముతీఱి మృతినొందుచుండువా రరుదు. ఈవాక్యమును వినినవారి కెల్లరకును వింతగఁ దోఁపకమానదు. కాని యిది సత్యదూర మేమాత్రము కాదు. ఆరోగ్యశాస్త్రము ననుసరించి శరీరమును గాపాడుకొను సట్టుపలగల యొకవృద్ధునికడ కేగి నీకు మరణ మెప్పుడని యడుగఁగ నతఁడు తనకు వైద్యునితో నవసరము కలిగినప్పుడు సంభవించునని ప్రత్యుత్తరమిచ్చెను. ఎన్నటికి వైద్యునితో నవసరముకలుగనే లేదాయని మరలఁ బ్రశ్నింప నిప్పటికి 16 సం॥ లకుఁ బూర్వ మొకతూరి సంభవించెనని మాఱుపల్కెను. ప్రపంచమున దీర్ఘాయుష్యముకలవారి చరిత్రవిచారించఁగా నిన్నాళ్లేండ్లు సుఖముగా జీవించినవారుం గలరనియు నావయసునను వారు పనిపాటలు చేయు సామర్థ్యము కలిగియుండిరనియుఁ దెలియఁగలదు. వారి దీర్ఘాయురారోగ్యకారణ మరయ నరయ సాధారణభోజన కాయకష్టములని ధ్రువపడినది. మంచి గాలియెండల యనుభవముచే బీదల కాయుర్భాగ్య మధిక మగుచుండును.

## — విశ్వనాథము తుది యుదంతము —

మా గాని పాడుబడి యెక్కువగుటనో యేమో మాగ్రామమున మశకబాధ మఱింత. అందును మాయిల్లు విశ్వనాథము ధర్మాన దేవాలయమగుటచే వీని వేశ్మమునం బోలె నంబారుపిడుజుల నామమునకే లేమిగాని దోమలుమాత్రము వాములు వాములు. హార్మోనియములులేని కొఱఁత యాత్మీయసంగీతముచేతనే యవి తీర్చెడిని గాని పైనిండ సాలువులు గప్పుకొనినను జొచ్చి లోపలికిఁ జుఱుకుచుఱుక్కునఁ గఱచుచుండును. వాని వధించుటకు నేనికిని వశముగాదు. ఇంకను మాయింటిలో నెలుక లింతకన్న నెక్కువ యేఁచెడిని. బండలు పఱచి సిమ్మెంటుచేసిన భవనమైనను బ్రిద్దలుగావించెడిని. ధాన్యపు బస్తాలను దక్కనీయవు. వస్త్రస్థానములని బుద్ధ్యనుమితము లగుటఁగాఁబోలు బోనులుపెట్టినను వానిలోనికి వచ్చిపడవు. వశముగాకయో యేమో వానిమాత్రము వధింపవుగాని పిల్లులుగూడ నిల్లు కొల్లపెట్టెడిని. పాలుఁ బెరుఁగు నెయ్యి బాలకులకుఁ బాలకులు పెట్టవలెఁగాని వీనికి వేరుగ బెట్ట నవసరము లేకుండనే వీలైనప్పుడెల్లఁ జాలినంత వారకుచుండును. కొట్టుదమన్నఁ జిక్కవు. పైపెచ్చు పిల్లిబ్రహ్మహత్య. కుక్కలుగూడ మిక్కుటము. పెంపుడుకుక్కలవలె వచ్చి కొంపలోఁ జొరఁబడుటయే. అదనైనప్పుడెల్ల నన్నాదికము హరించుటయే. అర్థాంగియు నర్భకులు నగుపడినప్పు డదలఁ దోలుచుందురుకాని యేగ్రంథము చదువుకొనుచునో యేదైనను వ్రాసికొనుచునో నేను బంచలోఁ గుర్చీపైఁ గూర్చుండియుండియుఁ దన్మయతచేఁ దదాగమనము కనిపెట్టనే పెట్టను. అటువంటి యప్పుడెల్ల నవ్వాని పంట పండినదనవలసినదే. ఇంతియే కాక యీ వేఁపులు మిద్దెమీఁదఁగూడ గుద్దలించుచుండును. అస్మదీయమగు మిద్దెమీఁదినుండి యన్యుల మిద్దెమీఁది కరుగుచుఁ బందిరియంతయు భంగముచేయుచుండును. కొట్టుటకుఁ జిక్కవు. మశక శునక మూషక మార్జాల చతుష్టయము మమ్మిట్టి బాధపెట్టెడిని. వీనికిఁదోడు విశ్వనాథము విప్రలాపములు పంచమ మగుటకుఁ బరితపించుచున్నవాఁడను. పంచవిధైతత్ప్రతిపక్షుల పనులును ముంచుకొనిపోయెడి దేమియు లేకున్నను నహరహః క్రియమాణములగుట నప్పటికప్పు డొక్కింత యనుతాపమునకు హేతువులగుచున్నవి. అగుఁగాక. నిత్యముఁ జచ్చువాని కెవ్వఁ డేడుచు నన్నట్టు లను దినక్రియమాణములగుట నవియుఁ బరిపాటివియైనవి.

నేను వ్రాసెడి తన చరిత్రలోని యొక్కొక్క విషయమున కొక్కొక్క నెండుప్రిక విశ్వనాథము వెతికివేయుచున్నాఁడు. ప్రకటింప దొరకొనిన స్వకచరిత్రలోఁ బరంపరాగతుఁడగుటఁ బరిహరింపరాక కాని నేను వీని చరితము విలిఖించుట వేఁపి మున్నగువానిచేతం బోలె వేఁచఁబడుటచేఁ గాదు. ఆరంభించినదాన యథార్థము వ్రాయవలసివచ్చెను. విశ్వనాథమున కది వెగటై నెండుప్రికలు వెఱుక మొదలుపెట్టెను. వచోఽపరాధములే వానివి మెండు. అవియే వెల్లడింపఁబడియెడు. వెల్లడింపఁబడినదానికెల్ల నెండుప్రిక యొకటి వెఱుకుటచేతనే కాఁబోలు విశ్వనాథము నీరోమాఁడై బోరెమను బోలఁగొడఁగెను. ఊర్ధ్వమంతయు నుత్తదగుట నధోరోమముల కాశింపవలసెను. అస్మత్ప్రకటీక్రియమాణాంశముల నంత చులుకనచేసి యధోరోమములదాఁక నరుగుటతోడనే విశ్వనాథము నన్ను విడువలేదు. పూర్వపక్షములు ప్రకటించునఁట. ఇదిగో వ్రాసితిమి, అదిగో వచ్చెఁ గల్పవల్లిలో నని యిదిగో బూచి యదిగో బూచి యని పెద్దలు పిల్లలం బోలె బెదరించుచున్నాఁడు. కేవలము వీఁడే యైన నేవంవిధభాషణ

ములు రావుకాని వాలాలుపట్టుకొని వేళ్ళాడుచున్నాఁడు. పంక్తిముఖునంతటివానిఁ బహోధిచతుష్టయమున ముంచిన మర్కటవాలమైన మనవాని మనసు తీఱుచుండేఁగాని చిక్కినది కుక్కురవాలము. కుక్కతోఁక పట్టుకొనియే గోదావరి నీఁదఁదలఁచెను. వేలు లక్షలుగా నున్న విద్వద్విశ్వబ్రాహ్మణసంఘముతో వివదించియు వ్యవహరించియు బ్రాహ్మణ్యవిషయమై ప్రభుత్వమువారిచేఁ బ్రతికూలమైన తీర్మానము చేయించి జగత్ప్రసిద్ధముగా నది స్వర్ణకారవ్యవహారమను పేరి చరిత్ర వ్రాసి ప్రకటించిన సంఖ్యావంతుఁడు వీఁడు. ఉన్నతన్యాయాధికారుల వ్రాఁతలఁగూడ నున్న లోపము లెన్నియున్న యుద్దాముఁడు. ప్రతిపక్షపత్రికలగు ప్రబోధిని శ్రుతిధర్మసంజీవిని గోలకొండ మున్నగువానిని బ్రతిఘటించినపత్రికాధిపతి. భాషావిషయమునను మతవిషయమునను బలువుర నెదుర్కొని బదులువ్రాయు పండితుఁడు. అట్టివాఁడు వ్రాసిన యంశములపై నాకతాయివాలాలచే నపభ్రంశము లేవో వ్రాయించుటకు విశ్వనాథము వేక్కపడుచున్నాఁడు. స్వర్ణకారవ్యవహారాదుల సవిమర్శముగా ఖండింతుమని పంచాననాదులలోఁ బ్రకటించియు జీ. యస్. బీ. సరస్వతీ స్వామి లోనగు జగత్ప్రసిద్ధులే చివరకుఁ జేతఁగాక విడిచిరి కాని శ్లో. మహాగజాః పలాయంతే మశకానాంతు కా కథా యన్నట్లు వాలా లీక వ్రాయును గాఁబోలు? ఎగ్గాడుచు నన్నేవో వ్రాయుదురుగాక. ఎన్ని నెలలు వ్రాయుదురో యిదియుఁ జూతము. క్రొత్తబిచ్చగాఁడు ప్రొద్దెఱుఁగఁడన్నట్లు కోపముకొలఁది నేపాపపు వ్రాఁతలో వ్రాసిన ఖండించుటకు నేనును దండించుటకు ధరణీశులును సంసిద్ధముగ నున్నారని స్పష్టముగఁ దెలిసికొందురుగాక. ఇవ్వారి ప్రగల్భము లింతతో నిలిచినవా? తంగెడ నరసింహారావుగారివంటి తత్త్వవిదుల నభినవసరస్వతీ ప్రధానపోషకత కనభిముఖులఁ జేయుదురఁట. ఏమి వీరి యజ్ఞానము! కావలసినంత గ్రంథము కంఠస్థముఁజేసి కవియై ప్రస్తావోచితముగాఁ బలుకుపలుకునను బద్యవర్షము గురియు భాషావిదుఁడు, విద్వత్కవిబహూకరణ విపులీకృత యశస్కుఁడు, ఆదినుండియు నభినవసరస్వతి నాదరించుచుఁ బ్రత్యబ్దము ప్రధానపోషకుఁడే యై పది సం॥ల నుండి పంచవింశతిరూప్యములు పంపుచుఁ బరమమిత్త్రుఁడై యున్న భాషాభిమాని కవిమానసభిజ్ఞులగు తమ సలహాలతోనే మదీయపత్రికాప్రధానపోషకత మానుకొనునని మదిని బొంగుట యజ్ఞానము గాక మఱేమగును? వాలసహాయముతో విశ్వనాథ మింకను విఱ్ఱవీఁగుచున్నాఁడు. ప్రాకుపట్టిన కాగితంబులు బయటికిఁ దీయుచున్నాఁడు. నావశమందున్న పాలమును దేవుని యినాముగా మార్చుటకుఁ దీనరపడుచున్నాఁడు. వెనుకఁగూడఁ గొన్నాళ్ళు వీఁడీవిశ్వనాథోక్తులు పలికిపలికి విరమించుకొనియెను. తగినసాహాయ్యమపుడు తటస్థింపక [illegible] గాని వాలా లిపుడు కేలూఁతయొసఁగుటం గాఁబోలుఁ బ్రాతరికార్డు మరల బైటఁ బెట్టెను. శ్లో. ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథా యన్నట్లు విశ్వనాథుని పృథాప్రగల్భము లిట్లు వెడలుచుండును; సడలుచుండును.

సీ. తెగి తేలింగగు రాయుంచను జనోక్తి నమ్మి యోం యేమొ యీ
అగుణుం డిట్టిప్రసంగముల్ సలుపుచున్ హా! ఏమొ నన్ దల్లక్రిం
దుగఁ జేయంగనె చూచుఁగాని వెనుకం జూడండు. నాతోడిదా
వగనుం జంపుకొనండు. పెట్టఁడు సవధ్యంబందుఁ గా. లేమనన్ ?

చం. తినియెను జెప్పుదెబ్బలను. దేహము వాచె. [illegible]
చనని యొట్టుఁబెట్టుకొనె. శత్రులు కాళులుపట్టె. ఎట్టులో
మనియెను. ఏలనేమి? [illegible] మార్గము పట్టఁడు నేఁడికేని. ఏ
మనవలె వీని? వేని మృదు[illegible] కుదుర్చఁగలేరా !

ఆ. వె. ఎగిరి వెక్కిరించి యుగిలించుకొన్నట్లు
కాదు కవులతోడి కతలు. [illegible]
వారిఁ జెనకఁబోవ నూరకేనా. [illegible]
కుమ్మరపసను గాదు. కమ్మరపసను.

ఆ. వె. తప్పుపనికి ఫలము తక్షణమే కల్గు.
దద్ది యనుభవమున కనఁబచ్చు
కుడుము తిన్నవాఁడె గుర్తిక్ష నెల్లప్రొద్దు
విశ్వనాథ! ఏల వెంత గాథ?

చం. కడచినదానికై వగవఁగం బనిలేదిఁకి? నేటికేని నీ
దుడుకుతనంబు మానుకొని తొంటిపగల్ విడఁబాసి [illegible]
తుఁడవయి పెద్దమానుసులతో వినయమ్మున నుండ నేర్చికో.
మ్మెడలఁగఁజి మ్మఘుమ్మ్మ నిలనిమ్ము కులమ్ము యశమ్మున న్మహీ.

పెద్దపిన్న తారతమ్యము విడిచిపుచ్చుకొని యవ్వను బట్టుకొని వసంతములాడిన ప్లాచరించు నస్మద్విషయికాపరాధములు వెల్లడించుటతోనే విశ్వనాథుని చరిత మంతయు విశదమైనది. వీని గణనీయతగూడ వేఱుగా విలిఖించితిని. భాగ్యభోగ్యములతో నీకఁ బరిసమాప్తి. ఇంతల నంతలఁజేసి యిట్లు వీఁడేమేమియో వ్యవహరించుచున్నను దండ్రియార్జించిన ధనద్రవ్యముల కన్న ఘనమైనది మఱేమియుఁ గనఁబడదు. ఇంకను వాఁడు ఋణప్రదాతయు వీఁడు ఋణప్రతిగ్రహీతయు. పిత్రార్జితమైన 50 ఎకరముల ఖుష్కిభూమిలో 25 ఎకరముల సుమారితని భాగమున వచ్చెను. చవిటిమాగాణి యొకటిమాత్ర మతఁడు గొంత యార్జించెను. రాజపౌరోహిత్యము రాశిగా నుంచి జానపాటి గ్రామపౌరోహిత్యము స్వయముగాఁ జేసికొనుచున్నాఁడు.

ఏనిట్టివిషయములు విచారించువాఁడను గావునకిని నంత వివరముగా నంతయు నవగతము కాదుకాని విశ్వనాథుని చర్యలవల్ల సంపన్నుఁడుగనే సర్వులకుం గనఁబడి యెడిని. ఇంత సంపన్నుఁడయియు నింత హైన్యవేటు చేయుచును నక్కడికిఁ దప్పిన నిక్కడికి నిక్కడికిఁ దప్పిన నక్కడికి నిరంతరముఁ బయలయిండ్లకుఁ బరుగులెత్తును గాని పనిగలవారలఁ దనయింటికే గప్పించుకొనుచు ఘనతమై వర్తించుటకుఁ గాంక్షింపఁడు. అట్టి కచ్చేరి యమర్చుకొనకున్నను గుర్చీలుమాత్రము రెండు కొనివేసెను. ఇనుపపెట్టె దెచ్చెను. జూలకంటికోడ్డుపక్క సున్నపుబట్టి పెట్టెను. దానిమీఁది రాబడి తగ్గినదని సత్రముగా మార్చుటకు సంకల్పించెను. సంకల్పించి చతుస్సంవత్సరములైనది; కాని యదియు నుత్పద్యంతే ప్రలీయంతే లీప్సునకే యొరగినటులున్నది. పెదవిశ్వనాథుఁడు పిడుగురాళ్ళదగ్గఱ సున్నపుబట్టి పెట్టి తన సున్నపుబట్టికి వినాశ మొనఁగూర్చుటయు

వాయనకుఁ బ లగా నియానము రోడ్డుపనికిఁ గంట్రాక్టు చేసెను. కాని పని బొత్తిగా నొనరింపఁ దెలియమిని పై వారు డిపాజిటుసొమ్ము నృపాలకోశమున జమకట్టి కంట్రాక్టు క్యాన్సిలుచేసిరి. ఇంకను నిచ్చినట్లు లేదుకాని తమ్ముఁడును దానును గలసి 116 లు గురుకులాశ్రమమునకుఁ జందావేసి కొండాడఁబడిరి. విశ్వనాథ మిట్టి పారమార్థిక కార్యములఁగూడఁ బాటుపడుచుండును. పండుగ పర్వములయందగు శివునియూరేగింపులోఁ జెంతఁ దిరుగుచుఁ బ్రతిమందిరము ముందఱను నందివాహను వేంచేయించుచు మంగళహారతు లిప్పించును. కార్తికదీపములు పెట్టించును. అభిషేకములు చేయించును. అన్నదమ్ము లిరువురు నవిభక్తులుగానున్నపు డాత్మీయవ్యవహారములలో నపజయముఁ బొందకుంట కభిలషించి లలితానాథునకు లక్షపత్రిపూజగూడ రెండుమూడువత్సరములు జరిపించెను. కల్యాణోత్సవముగూడ నొకపరి కావించెను. పల్నాటి భక్తసమాజము నాహ్వానించి సమావేశము సలిపించెను. భక్తసమావేశమును భవుని కల్యాణమును దనుజు నుపనయనమునఁ దలపెట్టి పై వానికై ప్రత్యేకవ్యయ మంతగా లేకుండనే ప్రతిష్ఠ సంపాదించెను. కాననే దేనను వీనిది పరమార్థముకన్నను బ్రతారణమే బహుళమని సంధ్యావందనముగూడ సరిగాఁ జేయమిని జాలసారులు సమీక్షించిన పండితుల భావన. పరోక్షసంభాషణ. ఎట్లైననేమి వీఁడును 37యేండ్లు ముగించెను. మొగమున ముసలికళ పడకున్నను దస్యుకృతిపై వేఁతములుమాత్రము కొంత వితిగినవి. భాగములు పంచుకొనుటలో భ్రాత భావము పరివర్తనముఁ జెందినను దిరిగి యెట్లో లెన్నుకుఁ దీసికొనివచ్చి తనతోడి మైత్రితోనే యునుచుకొనుచుండెను. భగినియెడలఁ బరమప్రేమ చూపుచు బావమఱఁదికిఁ బక్షవాతమువచ్చినపుడు తదీయమైన యాస్తి యంతయు వానికే చెందునట్లు వుయిలువ్రాయించి రిజిష్టరు చేయించెను. సతి కృష్ణవేణివలనఁ జతుస్సంతానమును గనియెను. ప్రథముఁ డందు రుధిరోద్గారి సం॥ శ్రావణమాసమున (1923 ఆగష్టు) కాఁబోలుఁ బ్రభవించెను. పితామహియగు సీతారామమ్మ వీఁడు పుట్టునాఁటికే వీతభాతికదేహయైనందునఁ బిత వీనికి మాత పేరే పెట్టుకొనియెను. తచ్ఛిశువును దలిదండ్రులును బినతండ్రియుఁ బ్రేమమైఁ బెంచుకొనిరి. అక్షరాభ్యాస మైనదాది కోటనెమలిపురిలో స్కూలుమేష్టరుగా నుండు పినతండ్రి తనదగ్గఱనే యుంచుకొని ప్రారంభవిద్య పఠింపించెను. అష్టమవర్షముననే యవ్వాని యుపనయనము నొనరింపఁబడియెను. ఉపనయనమునాఁటి కొక్కింత పేరును బెరుగనయ్యెను. అదియు నొక జన్మమే కనుకఁ బ్రథమజన్మమునఁ బెట్టిన పేరునకుఁ బిత శాస్త్రిపదమును జతఁజేసెను. శాస్త్రము చదువక పోయినను శాస్త్రిత్వము మాత్రము జనతానుగ్రహమునఁ దనుజున కొనఁగూడెను. 11 వ యేట బడిచదువు చాలించి పంచదశస్మార్తకర్మమంత్రములం బఠించుటకుఁ బ్రారబ్ధము. ఇది రెంట నారబ్ధమో యేమో కాని గణపతిపూజా పుణ్యాహవాచనమంత్రములుగూడఁ గడవెళ్ళఁ జదువకమునుపే తండ్రి మేనమామయగు చేబియ్యము నరసింహము చాలినంత సంపాదించుకొని యాలప్రోలు హనుమదర్చకత్వమును దాడేపల్లి గ్రామపౌరోహిత్యమును ద్యజియించి స్వగ్రామమైన పిడుగురాళ్ళకుఁ జనుదెంచుటయు వానివద్దఁ జదువుటకు వచ్చి ప్రవేశించెను. వాని కప్పటి కిరువు రాడపిల్లలే వర్తిలుచుండిరి కాని మగపిల్లఁ డగపడఁడు. తనకును మేనమామకును దత్పూర్వ మన్యోన్యసంభాషణమే యభావమైనను మగబిడ్డలులేనివాని యాడుబిడ్డ యాత్మజున కర్ధాంగియగుచో నవ్వాని యాస్తి యివ్వానికి సంక్రమించునని యింత విచారముచేసి విశ్వనాథము కొడుకు నక్కడఁ జదివించుట ప్రథమసాధనమని ప్రవేశపెట్టెను.

# అభినవసరస్వతి

సంపుటము ౩౧ } ప్రమాది నామసంవత్సరము మార్గశిరమాసము. { సంచిక ౯

## సనాతనులు, గోవధము

బ్రిటీషువారు శాంతిపరిస్థితులు సాధనమాపినంతనే జర్మనువారున్నగు పరరాష్ట్రీ ములవారితో జన ధన పట్టణ పర్కాణ నష్టి లేకుండ సంధికై పలుమాఱులు ప్రయత్నించిరి. కొన్నిష్టములను [illegible] యేని శాంతికై చేసి రొంర్చిరి. యుద్ధము తప్పకపోయె. పోలెండు బుగ్గయయ్యె. నౌకలు ముంపఁబడె. సామగ్రులు [illegible] పట్టణంబులు వట్టి బీడులయ్యె. పల్లెలు పాడయ్యె. అన్యాయములు దురాక్రమణములు హెచ్చయ్యె. వీనికిఁ గారకులు [illegible] యుద్ధరంగమునకు దిగిరి. ఆడినమాట చెల్లించుకొని [illegible] యిడుటకును బ్రిబంచశాంతిని గూర్చుటకును శత్రువులతోఁ బోరాడుచున్నారు. ఈ ప్రభుత్వమువారు 150 ఏండ్లనుండి భరతఖండమును మతాచారధర్మసాంప్రదాయ స్వాతంత్ర్యము లొసంగి సుఖముగాఁ బరిపాలించియున్నారు. ఇటీవల వీరు మతాచార విషయిక స్వాతంత్ర్యధ్వంసక దుశ్శాసనంబులను సమ్మతించుటకుఁ గారకులు సంస్కర్తలును గాంగ్రెసువారు నేయని యందఱు నెఱింగినదే. కాఁబట్టి యిట్టిపట్టున నావిష్ణుః పృథివీపతేయని నమ్మెడివారును ధర్మసహిత స్వారాజ్యమును గోరువారును ప్రపంచ శాంతి నభిలషించువారును సాధువులును సమర్థులును నగు సనాతనులైతే ముమంత భక్తి ననుసరించి యథాశక్తిగా సర్వాంగబలంబులతోఁ దోడ్పడి శ్రీ బ్రిటీషుప్రభుత్వము వారికి జయము చేకూర్చుదురుగాక యని కోరుచున్నారము.

సనాతనులు పార్థివ పారమార్థిక సుఖముల రెంటిని బొందుటకు వేదవిహితమార్గమున సంచరించుచుందురు. కేవ లైహికసుఖమునే కోరువారికిని వీరికిని జాల వ్యత్యాసము. ఇట్టిసాధుల మతాచారజాతిధర్మకర్మములు దేశాభివృద్ధికి భంగకరంబులని కాంగ్రెసువారు వానిని నిర్మూలించి స్వరాజ్యము సంపాదింపఁ బ్రయత్నించుచున్నారు. సర్వవిధములను బ్రచారముచేయుచున్నారు. నిర్బంధశాసనంబుల సనాతనులను హింసింప మొదలిడిరి. మలబారుదేవాలయశాసనమునకు సనాతనులు లొంగకపో హఠాత్తుగా నెవరికిఁ దెలియకుండ మధురమీనాక్షిదేవాలయమునందుఁ బంచములను బ్రవేశపెట్టిరి. అచటి సనాతను లది తెలిసికొని ధర్మధ్వంసకుల శిక్షింపఁజేయుటకుఁ బ్రయత్నించిరి. కాని కాంగ్రెసువా రౌత్సుక్యముతో రక్షించెడి శాసనము కావించిరి. సనాతనులు ధర్మరక్షకు సనాతనుఁడే యిఁక దిక్కని ధర్మాగ్రహ మొనరించిరి. ఈధార్మికులఁ గాంగ్రెసువారు హింసించిరి. ఎన్నిబాధలఁ బెట్టినను సనాతనులు పట్టు విడువరైరి.

మరల శ్రీరంగమందు డాక్టరు రాజన్ కాంగ్రెసుమంత్రిగారు దేవాలయములోనికిఁ బంచ మని ప్రవేశపెట్టుచున్నట్లు తెలిసికొని బాలురు వృద్ధులు స్త్రీలుఁ బురుషులు నడ్డుగా నిలిచిరి. కాంగ్రెసు వారు స్త్రీలనికూడఁ జూడక విచ్చలవిడిఁ గొట్టిరి. నెట్టిరి. రాళ్ళు రువ్విరి. అల్లరిచేసిరి. ఎన్ని పనులఁ జేయవలెనో యన్నిటిని జేసిరి. సనాతనులు విడువక పడరానిపాట్లు పడియైనను ధర్మరక్షణము చేయుచున్నచో దేవతానుగ్రహమునకుఁ బాత్రులై యైహికాముష్మికసుఖంబులం గాంచఁగలరని విశ్వసించుచున్నారము. ప్రయ త్నించినచో సనాతనధర్మవిరోధు లెట్లు లొంగకుండఁ బోదురు ? ధర్మరక్షణ మెట్లు కాకుండును ? ఎట్లు స్వరాజ్యము లభింపకుండును ? అప్పుడు భారతభూమి పుణ్య భూమియగును. మనము ధార్మికవీరులము కాఁగలము. ధర్మరహిత స్వరాజ్య మసిపత్రవన నరకము. ధర్మసహితస్వరాజ్యము సర్వసుఖసంభరిత స్వర్గము. ఇదియే వాంఛనీయము, ఇదియే సంపాదనీయమని హెచ్చరించుచున్నారము.

కాలికట్ జమీందారు జామొరిన్ గారు హిందూరిలిజియస్ ఎండోమెంటు బోర్డువారిపై దేవాలయములనుగురించి వేసిన దావాలో న్యాయమూర్తులగు బి. సోమ య్యగారు ద:వా న్యాయ్యమైనదనియు వారందులోఁ దెల్పిన దేవాలయములు వారి పాలనక్రిందనే యుండఁదగినవనియు నితరుల కిందుఁ బాల్గొన నవకాశము లేదనియుఁ దీర్పుచెప్పిరని తెలియుచున్నది. యతోధర్మ స్తతోజయః.

---

## —• కాంగ్రెసు వైఖరి •—

... హిందువులకొఱకై యేర్పడిన హిందూమహాసభ కాంగ్రెసును హిందువు లకుఁ బ్రతికూలసంస్థయే యని తలంచుచున్నది. కాంగ్రెసు ముస్లింలీగుల సంప్రతింపు లకుఁ దా మెంతమాత్రము బాధ్యులు కాఁజాలమని ఘోషించుచున్నారు. సనాతనహిం దువులుగూడ నదేవిధముగఁ బ్రకటించుటలో నాశ్చర్యము కనఁబడదు ... కాంగ్రె సధ్యక్షుఁడై చిరకాలమునుండి కాంగ్రెసుసభ్యులుగా నుండి యిప్పు డసహ్యాత పుట్టి 4 అణాల సభ్యత్వముగూడ వదలుకొన్న యస్. శ్రీనివాసయ్యంగ్గారు ... కాంగ్రెసు నుండి మతసాంఘికవిషయములను దొలఁగించినఁగ్గాని శ్రేయస్సు గలుగదని చాటించు చున్నారు. ... ఇప్పుడు సనాతనహిందువులుగాని హిందూమహాసభవారుగాని ముస్లిం లీగువారుగాని యిందు సభ్యులుగాఁజేరుటకు వీలులేదు. వీరందఱును జేరినఁగ్గాని దీనికి సర్వతోముఖత్వము గలుగనేరదు. కాంగ్రెసునకు హరిజనసమస్యతోఁగాని హిందూ మహమ్మదీయ కలహాల పరిష్కారముతోఁగాని యేమిసంబంధము గలదు ? ... సత్వర స్వరాజ్యసంపాదనకై జాతిమతవిచక్షణతల జోలికిఁ బోక యందఱిని దగ్గఱకుఁజేర్చు కొని కార్యక్రమంబునకుం గడంగుటయే కాంగ్రెసునాయకుల ముఖ్యకర్తవ్యము. వీరు సత్వరమే దీనికిఁ బూనుకొననిచో ... రాజకీయరంగమునుండి విరమించుకొని గాంధిగారు వచించినట్లును నెహరూగ్గారు సనాతనులను గూర్చి చెప్పినచొప్పునను నేహిమాలయారణ్యములఁ బడిపోవుటయో సంభవింపఁగలదు. (దివ్యవాణి)

## —♦ మధుర సనాతనుల యహింసాయుద్ధము ♦—

(అఖిలభారతవర్ణాశ్రమ స్వరాజ్యసంఘము వర్కింగుప్రెసిడెంటు
రావుసాహెబు నటేశయ్యరు, బియేబియలుగారు)

మధురసనాతనుల యహింసాయుద్ధమున నిది సప్తమదినము. ధర్మపద్ధతులపై నుపవాసప్రార్థనము మిగుల నుత్సాహకరముగ జరుపఁబడుచున్నది. అనుకొన్నదానికంటెఁ బ్రజలలో నిది తీవ్రప్రబోధము గావించుచున్నది. రమారమి 300 స్త్రీ పురుషులిందుఁ బాల్గొనుచున్నారు. బాలబాలికలుగూడ దీనివల్ల నుత్సాహపూరితులయియున్నారు....భరతవర్షమునకుఁ బునఃప్రతిష్ఠ గలుగఁజేయుసమర్థతగల యువతీయువకులు బయలుదేఱుదురను సూచనలు విస్పష్టముగఁ గనఁబడుచున్నవి. ఈయహింసాసంగ్రామమునకుఁ బ్రథమవిజయమే కాంగ్రెస్సుమంత్రివర్గము రాజీనామాలై యున్నవి. ఇఁకఁ గ్రమక్రమముగా మన మభిలషించు ధర్మవిజయము తప్పక కలుగును. ఎల్లచోట్లను బ్రజలు పులివాతనుండి తప్పించుకొన్నట్లు భావించుచున్నారు. ఈ 27 మాసములకుఁగా నిప్పుడు స్వాతంత్ర్యవాయువును బీల్చుట కవకాశము కలుగుచున్నది. ఇప్పుడు గుసగుసలు పోయి ప్రజలు బహిరంగముగఁ దమ హృద్గతాభిప్రాయములను వెల్లడించుచున్నారు. అనేక ప్రదేశములనుండి ప్రశంసావాక్యములు వినవచ్చుచున్నవి. మునుపటివలెనే దేశమున శాంతియు సౌఖ్యమును దృప్తియుఁ జేకూరుఁగాక !

సార్వభౌమునకును వైస్రాయిగారికిని మదరాసు గవర్నరునకును వారి సలహా మంత్రులకును పంపిన తంత్రీవార్త.

సనాతనులు తమ రాజభక్తిని మరలఁ దెలుపుకొనుచున్నారు. కాంగ్రెసు మంత్రుల రాజీనామాలు సంతసము గల్గించినవి. 1914 సం॥ లో వలె మిత్రమండలి విజయమునకై దేవాలయమునఁ బ్రార్థనలు సలుపఁగోరుచున్నారు. మదరాసు మంత్రివర్గము మతధర్మములను ధిక్కరించి దేవాలయములను భ్రష్టపఱచినది. 300 సనాతనులుపవాసదీక్ష వహించి పదిదినములుగ నీశ్వరారాధనఁ జేయుచున్నారు. భ్రష్టముకాఁబడిన దేవాలయములకు సంప్రోక్షణఁజేసికొని యథావిధముగ దేవతారాధన సలుపుకొనుట కార్డరు నొసఁగుటకుఁ బ్రార్థన. విక్టోరియామహారాణిగారి నీతిని బరిపాలింప సవినయముగ విన్నపము.

---

## —♦ మహాభారతచరిత్ర నిరాకరణము ♦—

(కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు)

... గాథావిశేషములు

అను శీర్షికక్రింద నార్యజాతి, అనార్యజాతి యని ... తెగ వ్రాసినారు. ఈ వ్రాఁతవలన నార్యులు ననార్యులుఁ గలిసిపోయిరనియు మిశ్రజాతి యేర్పడిన దనియు స్థిరపఱచినారు. ఆర్యమిశ్రజాతులు స్వజాత్యున్నతికై పెనఁగులాడుటయే భారతయుద్ధమునకుఁ గారణమైనదని ... హేతువు లిట్లు వ్రాసినారు. ఆర్యజాతి

స్వల్పసంఖ్యాకలదియై యార్యేతరజాతి బహుళమగుటచే నార్యు లనార్యుల నుద్వాహ [illegible] మిశ్రజాతి కలిగినదట. ఇదియెట్టి శోధనమో, దీని కుదాహరణముగాఁ బరాశరపృషతాదులు వ్యాసద్రుపదాదులం గనుటయని చెప్పిరి. ఇటఁ బరాశరపృషతు లార్యజాతియనియు సత్యవత్యాదు లనార్యజాతియనియు వ్యాసద్రుపదులు మిశ్రజాతియనియు నీయయ్యగారి యభిప్రాయము ... దుర్యోధనాదు లార్యజాతిలోనివారనియుఁ బాండవు లనార్యజాతిలోనివారనియుఁ జెప్పినారు ... వ్యాసుఁడు మిశ్రజాతిలోని నిషాదుఁడనికదా వీరి వాదము. కౌరవులు ధృతరాష్ట్రుని కొడుకులు పాండవులు పాండురాజు కొడుకులు. వా రిరువురును నిషాదునకుఁ బుట్టినవారే. వారిలో భేద మెచటనుండి వీరు కనిపెట్టినారో తెలియదు. ... [illegible] పలుకఁజొచ్చినా, రిది యేటియుక్తియో తెలియకున్నయది ... ఆర్యులు ననార్యులుఁ [illegible] పురుషజాతి క్షీణింపఁగా నియోగపద్ధతి ... సంతానముం బడసిరఁట. భారతయుద్ధమునకుఁ బూర్వ మట్టిపోరాటములు జరిగినట్లు మనము వినము. భారతయుద్ధమందే భరతవర్షమునంగల పురుషజాతి క్షీణించినదని తెలియుచున్నది. భారతయుద్ధమైనపిమ్మటనే నియోగపద్ధతి యేర్పడినదని మనము వీరిమాటంబట్టి తెలిసికొనవలసివచ్చినది. యుద్ధమునకుఁ బూర్వమే ధృతరాష్ట్రాదులు పుట్టియున్నారని మన మెఱుఁగుదుము ... భారతములోఁ దొంటినుండియు నీపద్ధతి యున్నట్లనేక నిదర్శనము లున్నవి. కావున భారతయుద్ధమైనవెనుకఁ బురుషజాతి క్షీణింపఁగ నీ నియోగపద్ధతిం బుట్టించినారని చెప్పుట తప్పు. పిమ్మట ననులోమప్రతిలోమముల విషయమును గ్రీతస్వయందత్తాదుల విషయమును జెప్పి వారిని సంఘములోఁ గలుపుకొని [illegible] యేర్పడి [illegible] వర్ణధర్మము లనుట వివేకి లక్షణము కాదని పెద్ద లనకమానరు. బ్రాహ్మణునికి శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు నిషాదుఁడు, వ్యాసుఁ డట్టివాఁడని తెగించి వ్రాసినారు. ఇటఁ బరాశరుఁడు బ్రాహ్మణుఁడనియు సత్యవతి శూద్రియనియుఁ గదా బడిపంతులుగారి యభిప్రాయము...సత్యవతి శూద్రస్త్రీయగుట యెట్లు? వీరే భారతవిమర్శనము...లో "బృహద్రథుని సాపత్న్యసోదరియగు మత్స్యగంధి శంతనునిభార్య పాండవులకుఁ బ్రపితామహి" అని వ్రాసిరి. ఆ వ్రాసినప్పుడు విజ్ఞానము లేకపోయినదికాఁబోలు. ఇప్పటి విజ్ఞానములో శూద్రస్త్రీనిఁ జేసినారు. సత్యవతి యుపరిచరవసు వీర్యమున నుద్భవించిన సుక్షత్రియకన్యగాని శూద్రకన్య గాదు. దాశరాజుకూఁతురని చెప్పుటచే నిట్లువ్రాసిరేమో? దాశరాజున కామె దత్తపుత్రికగాని కన్నపుత్రిక కాదు. అయినను దాశదేశముల కధిపతియని యున్నదికాని యతఁడు శూద్రుఁడని యెందును లేదు. ఇట్టిచో

శ్లో. అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః ...

అని ప్రసిద్ధిగాంచి బ్రహ్మసూత్రములు రచించి వేదములను విభజించి పురాణములు రచించి లోకోపకారము గావించి ... న వ్యాసుఁడు నిషాదుఁడని వ్రాయుటకు

ఖడ్గంలవలె 100 యోజనముల మేర యెగిరినట్లును నాకర్షణశక్తిచే నొకని మేనిబలము మఱియొకఁ డాకర్షించినట్లును బాణహతిం జేసి పెద్ద రాక్షసకళేబరము దివ్యపురుషుఁ డైనట్లును నిప్పు గోఁతిని కాల్పకున్నట్లును గ్రోఁతి యింతలో స్థూలసూక్ష్మరూపముల నొందినట్లును పక్షులు మనుష్యులవలె మాటలాడినట్లును ... వేనవేలు రామాయణ ములో నద్భుతములు విరుద్ధములు నున్నవి. అవి వీరి కెట్లు నచ్చినవో ? ... ప్రతిగ్రంథ మందు నిట్టివి కలవు. ఇవియన్నియు ... తప్పక నమ్మవచ్చును. భారతములో నక్షహృద యమునాట విన్నయప్పు డెంతో విచిత్రముగా నున్నతోఁచును. ఈనడుమ రాజ మహేంద్రవరమున కొక వెడఁగుబ్రాహ్మణుఁడు వచ్చినాఁడు. అతఁ డత్యద్భుతగణిత మును బ్రదర్శించుటయే కాక చిన్నచిన్న యాకులుగల యొక రావియూసిరిక కొమ్మం దెచ్చిన నది చేత నొకపరి ముట్టి యీకొమ్మ నిన్నియాకు లున్నవని నిమేషములోఁ జెప్పినాఁడు. లెక్కింపఁగా నతఁడు చెప్పినది సరియైనది. ఎల్లరు నద్భుతంపడిరి. ఇట్లే మనకుఁ దెలియని విషయములచ్చెరువుగానే కానిపించును ... "భారతయుద్ధమైనవెనుక స్త్రీలలో వ్యభిచార మెక్కువయై సంకరసంతాన మెక్కువయైనది." దీనికిఁ బ్రమా ణము చూపలేదు. నియోగము వ్యభిచారమని యూహించియుందురు. స్మృతికర్తలు ద్వాదశవిధసంతానములఁ దమగ్రంథముల కెక్కించిరఁట. ఇట్టిసంతానము యుద్ధమైన పిమ్మట లేనేలేదు. యుద్ధమునకుఁ బూర్వమే ధృతరాష్ట్రాదుల పుట్టువులు ... భగవ ద్గీతలలో నాఁటి జాతిభ్రంశవిధానము సూచింపఁబడినదఁట. ...

శ్లో. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవత్యుత,
అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః

... (కులక్షయమైనఁ గులధర్మములు చెడును. ధర్మము చెడినఁ గుల మధర్మ భూయిష్ఠమగును. అధర్మమువలనఁ గులస్త్రీలు దుష్టలగుదురు. స్త్రీలు దుష్టలైన వర్ణసంకరమగును) ఇట్లుచెప్పుటచేత నాఁటి జాతిభ్రంశవిధానము సూచింపఁబడు చున్నదా ? ఇట్లుకాఁగలదుకావున నిది దోషమని చెప్పుచున్నది. అది నాఁటి జాతి భ్రంశవిధానమును జెప్పుచున్నదనుట తప్పు. నాఁడు వితంతూద్వాహములు తప్పుగా నెన్నఁబడుటలే దనియుఁ గన్యలు పెండ్లికాకముందే బిడ్డలను రహస్యముగాఁ గనుట కూడఁ దప్పుకాదనియుఁ బి. వి. మన్యంగారు ధర్మశాస్త్రవచనము వెళ్ళఁబెట్టినారు.... అది వితంతూద్వాహ ... మనుట తత్పక్షావలంబనతత్పరత.

శ్లో. తయో రుత్పాదయాపత్యం సంతానాయ కులస్య నః
మన్నియోగా న్మహాబాహో ! ధర్మం కర్తు మిహార్హసి.

నా నియోగమున నట్లుచేయుమని సత్యవతి కోరఁగా వ్యాసులు "అసంశయం పరోధర్మ స్త్వయా మాత ! రుదాహృతః" నీవుచెప్పినది ... ధర్మమేయని యంగీకరించి నట్లు కలదు. అప్పటి ధర్మమును నిందించుట కిప్పటివారి కధికారము లేదు. అది విధవా వివాహము కాదు. అనంతర మాయిద్దఱును భార్యాభర్తలు కారు. అట్లు ప్రవర్తించుట

యిప్పుడు తగదు. గురువుప్రోషితుఁడై యున్నప్పుడు గురుపత్ని ఋతుమతియైన ఋతువు వ్యర్థముకాకుండ శిష్యునితోనైన సంగమింపవచ్చును. అది దోషముకాదు. అట్లే శ్రాద్ధాదులందు మాంసభక్షణమును. అది తప్పని నిందింపవచ్చునా ? యుగభేదముంబట్టి యాచారభేదము లేర్పడుచుండును. కన్యలు పెండ్లికాకముందు బిడ్డలఁ గనవచ్చుననుట తప్పు. అప్పుడు నిది యంగీకరించిన ధర్మముకాదు. దీనిఁగూర్చి భారతమే చెప్పుచున్నది. అట్టివి రెండుమూడుమాత్రమే మనము వింటిమి. అటఁ గన్యాత్వదోషము లేకుండ మహాతపస్వులు వరంబు లొసంగియున్నారు ... వారు భూమిని దలక్రిందులు సేయుటకైన సమర్థుల ... తప్పే కానియెడల "తతోహ మంతర్భవనే పితృవృత్తాంత రక్షిణీ"అని కుంతి చెప్పునా ?

శ్లో॥ నూనం తస్యైవ దేవస్య ప్రసాదా త్పునరేవతు
కన్యాహ మభవం విప్ర!

అని పలుకఁగా వ్యాసులు

శ్లో. అపరాధశ్చ తే నాస్తి కన్యాభావగతా హ్యసి,
దేవా శ్చైశ్వర్యవంతోవై శరీరాణ్య విశంతివై.
మనుష్యధర్మో దైవేన జాతం తత్త్వ మోహో న విద్యతే.

అని ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్లున్న విషయములో ... తప్పుకాదని వ్రాయుట సాహసము ...

వీరికిఁ గానీనులం బుట్టించుట ... ఇప్పుడు నుండఁదగునని యభిప్రాయము కానోపు ... నియోగ మప్పుడు చెల్లునని చెప్పుచుండఁగా వ్యాసుఁడు ధర్మవిరుద్ధముగ కిష్టపడెనని వ్రాయుట ధర్మశాస్త్ర వాసనయైనఁ దెలియకయే ... సాంఘికదోషములఁ గప్పిపుచ్చుటకు దేవతామహిమ లారోపించినారఁట ... కృష్ణబలరాములు సాక్షాద్విష్ణువని పెక్కుపురాణములలో నున్నను భారతములో విష్ణుని వెండ్రుకలని యున్నదఁట. ఇందు వీరికిఁ గలిగిన సందేహ మేమో తెలియదు. కేశములని చెప్పుటచేత నీచముగాఁ దోఁచెనేమో ? అవి శ్రీమహావిష్ణువు కేశములుగాని యన్యములుగావు. కేశములకే యంతశక్తి యున్నదని గ్రహింపరాదా ? ... కృష్ణబలరాములు సాక్షాన్మహావిష్ణువని పెక్కుపురాణములు చెప్పుచున్నప్పు డెందఱో మహామహు ... లంగీకరించిన విషయమ ... అట్టివిషయమున నెందుకుఁ బనికిమాలిన...ట్టియూహాలు ? వారి మహాత్వమునకు లోపము వాటిల్ల నేరదనుట జగద్విదితమే. మఱియుఁ బూతన శకటాసురాదులు వ్యక్తులుగావనియు రోగములనియుఁ జెప్పుచున్నారు. ఇప్పుడు రోగముల కా పేళ్ళు పెట్టి యుందురు. లేదా ? పూతనాదులే గ్రహము ... లై మనుష్యుల నావేశింపవచ్చును. తొల్లిదధీచిపుత్రుఁడు పిప్పలాదుఁడు దేవసంహారార్థము తపశ్శక్తివలన నొకకృత్తిం బుట్టించెను. కార్యము తీఱినవెనుక దానిని స్నానఘట్టముల నాశ్రయించి స్నాతలు వేయు మట్టిని దిని జీవించునట్లు నియమించిరి. ఇప్పటికి "పిప్పలాదా త్సముత్పన్నే కృత్తే ! అని మట్టిని వేసియే స్నానముచేయుట స్నాతలకెల్ల దెలియును గాని యీరిఫార్మరుగారికిఁ దెలియ...దు...పూతనాదులును నిప్పుడు రోగములక్రింద మాఱి

ప్రజల నాశ్రయించి యుండవచ్చును ... కృష్ణునిచే సంహరింపఁబడినను దదాత్మలు గ్రహములు ... కావచ్చు రోగములు కావచ్చు... అవి కృష్ణునకు సోఁకినవే యనుకొందము. ...ఇందుఁ దప్పేమి ? ... మహావిష్ణువైనచో...రోగములువచ్చునా యని వీరికి లఘుశంక కలిగినదికాఁబోలు! ...మనుష్యావతారముగదా ! మనుష్యధర్మము [illegible] సమాధానము చెప్పుకొనరాదో. ఇట్లే రామావతారాదులును ...

[illegible]గా నొకజాతి మనుష్యులఁట. నేఁడును ... వా రుత్తరమధురా ప్రాంతమున [illegible] మనుష్యులఁట. వీరికి వ్యభిచారదోషము వైధవ్యము లేవఁట. [illegible] అనంతుఁడు లోనగువారీజాతివారే యని తెలియుచున్నది. తక్షకాదులు కశ్యపప్రజాపతి సుతులనియూ నుత్తమసంగ్జులనియూ మన మెఱుంగుదుము. జరత్కారుఁడను బ్రాహ్మణోత్తముఁడు శేషుని చెల్లెలగు జరత్కారువును బెండ్లియాడినాఁడు ... వీరువ్రాసినట్లు నీచజాతియని యెచ్చటను లేదు. అర్జునాదులకు నీచసంబంధముగలిగించుటకు వీరిట్లు కల్పించినారు. ఆనాగులెవరో ? మధురాపురప్రాంతమందున్న యీనాగులెవరో ? వారికిని వీరికిని ముడిపెట్టినారు. ఇది వదలుముడి ...ముట్టిన వీడిపోవును ... జనమేజయుఁడు తక్షశిలకు నేగి సర్పయాగము చేయలేదఁట. తండ్రిని జంపినారను కసచే ... నాగులను సంహరించి వచ్చెనఁట. “ పెండ్యాల వెంకయ్యగారు లేరు, మేడపాడు లేదు, సుబ్రహ్మణ్యశాస్త్రులు పుట్టనే లేదు. ” అని వ్రాసిన నెంతప్రమాణముగా నుండునో యిదియు నంతప్రమాణముగానే యున్నది ... ద్రౌపది దుశ్శాసనుఁడు బట్టలొలుచునప్పుడు కృష్ణుని స్మరించుటయు, కీచకుఁడు పరాభవించినపుడు సూర్యుని బ్రార్థించుట లోనగు గాథ లన్నియు సందర్భశూన్యములని వ్రాసిరి. ... ద్రౌపదీవస్త్రాపహరణగాథ జరుగలేదని వీరి యభిప్రాయము. సంగ్రహాధ్యాయములో నాసిషయము చెప్పకపోవుట యితరస్థలములలో ...మూడునాలుగుసారులే చెప్పుట లోనగునవి కారణములనిరి. కట్టిన బట్ట విప్పివేయుట పరిభవములలో నెక్కువపరిభవమని యొప్పుకొనిరి. అట్టిపని మానముగలవారికిఁ జెప్పుకొనుటయు సిగ్గులోనిదే కావునఁ గేశగ్రహణాదికము చెప్పిన నంతయు నవగతమగునని యావిషయము నంతగాఁ బాండవులుగాని పాంచాలిగాని చెప్పుకొనకుందురు. అయినను

శ్లో. స్మృత్వాథ కేశగ్రహణంచ దేవ్యా
వస్త్రాపహారంచ రజస్వలాయాః (క. ప)
రజస్వలాం ద్రౌపదీ మానయన్ యే
యేచా ప్యకుర్వంత సద స్యవస్త్రాం (శ. ప)

ఇత్యాదిస్థలములందుఁ బాండవు లావిషయమును స్మరించుచునే వచ్చినారు. ఇంతమాత్రము చాలదా ? ... వేయిసారులు చెప్పవలయునా ? ...

“ద్రౌపదీమానరక్షకుఁడు” అను బిరుదము కృష్ణునకుఁ జెల్లదఁట. పోనిండు. వీ రాబిరుదము పీఁకివేయనిండు. అంతమాత్రఁ గృష్ణునకు లోపము వచ్చినప్పుడు చూచు

కొందము. ద్రౌపది యేకవస్త్రయై రజస్వలగా నుండుటకూడ సత్యముగాదఁట. ధార్తరాష్ట్రుల కపఖ్యాతిఁదెచ్చుటకుఁ గల్పించినట్లు చెప్పుచున్నారు ... ద్రౌపది దుశ్శాసనునితో ... "ఇదం త్వకార్యం కురువీరమధ్యే రజస్వలాం యత్పరికర్షసే మాం" అని పలికిన ట్లున్నది.

శ్లో. తతో దుశ్శాసనో రాజా ద్రౌపద్యా వసనం బలాత్
సభామధ్యే సమాక్షిప్య వ్యపాక్రష్టుం ప్రచక్రమే,
ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః.

ఇత్యాదులు భారతమున ననేకస్థలములందు ద్రౌపదీవస్త్రాపహరణగాథ కాన్పించుచుండఁగా జరుగలేదని వ్రాయుట యెట్టిదో తెలియదు. ఇటుల సర్వభారతప్రతుల యందు నున్నది. ... భాస భారవి క్షేమేంద్రుల పుస్తకములలో లేదఁట. ప్రల్లాభొట్ల ఋచ్చయ్యగారు వ్రాసిన పుస్తకములోను లేదు. మఱియొక యల్లయ్య భారతయుద్ధమే వ్రాయఁడు. అవి ప్రమాణములుగా స్వీకరింపవచ్చునా ? శ్లోకార్థము కాని మఱియొకఁడు నకులుఁడు సహదేవుని మేనత్తకొడుకని వ్రాయును. అది మనకుఁ బ్రమాణమా? భారతము ప్రమాణమా ? "ద్రౌపది కృష్ణుని ప్రార్థించినఁ బ్రార్థించియుండునుగాని కృష్ణుఁడు ద్రౌపది కాయాపదలోఁ దోడ్పడుట కల్ల" అని కొంత యంగీకరించినారు. కృష్ణుఁ డప్పుడు ద్వారకలో లేక సాల్వునితో యుద్ధము చేయుచు సముద్రతీరమున నున్నాఁడఁట ... ద్వారకలో నున్న ద్రౌపదిమొర విని రక్షించి యుండునుగాని సముద్రతీరమందుండుటచే వీలులేకపోయినదని వ్రాయుచున్నారు ... కృష్ణుఁ డొక్కకన్ను, ఒక్కచెవి గల సామాన్యుఁడు గాఁడు. సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్, అట్టి మహాపురుషుఁడు మహావిష్ణువు. అతనికిఁ జేయరానిపను లేమియుండును ? సమయ మేమి ? అసమయ మేమి ? అతని విరాడ్రూపప్రదర్శనము లోనగునవి యొక్కమాఱు స్మరించి దురభిప్రాయమును బోఁగొట్టుకొని పునీతు లగుదురుగాక.... సాంఘిక దురాచారము లను పేరఁ గొన్ని ... వ్రాసిరి ... వారు వ్రాసిన వన్నియు నభూత కల్పనలు. కలమాడినట్లు నడచినవి. మద్యపానము ద్యూతము వ్యభిచారము నప్పటికి దోషములు కావని బ్రూహించినారు. అవి యప్పుడును దోషములే. తదభ్యాస మప్పుడును నింద్యమే. అప్పుడు కొందఱ కాయభ్యాసమున్నదే యనిన నిప్పుడు శాస్త్రులనిపించుకొనువారు రిఫార్మరులై వర్ణసంకరులగుట యెట్టిదో యదియు నట్టిదే. సన్యాసులు కూడ జూదమాడువారని సన్యాసివేషమున విరటు నాశ్రయించినట్లు భారతమున లేదు. తెనుఁగులోఁ బ్రమాదమున నట్లు పడినది. శ్లో॥ కంకో నామ ద్విజో భూత్వా,– వినష్ట సర్వస్వ ముపాగతం ద్విజం,– యుధిష్ఠిరస్యాస మహం పురా సఖా వైయ్యాఘ్రపద్యః పునరస్మి విప్రః " ఇత్యాదులచే ధర్మరాజు కంకుఁడను విప్రుఁడైన ట్లున్నది. తిక్కన ప్రమాదమును బట్టి సన్యాసియని నిర్ణయించి "అప్పుడు సన్యాసులుగూడ జూదమాడుదురు " అనిరి ... యాదవులు కల్లుద్రాఁగుట నిజమే ... కాలముతీఱి యిప్పటివారు ధర్మములను విడిచినట్లే వారును జేసిరి. కావున నశించిరని గ్రంథములే సాక్ష్యమిచ్చుచున్నవి. ... మిశ్రజాతీయులకు నుత్తమజాతీయులకు నంతఃకలహములు విశేషించి యున్నవనుటకు రాజసూయమున నర్ఘ్యమునిమిత్తము శిశుపాలవధమే నిదర్శనమఁట. కాఱులు పేలెడు శిశుపాలుని గృష్ణుఁడు సంహరించెను. ఇట జాతియేమో వైరమేమో

తెలియదు. కృష్ణుని మిశ్రజాతిలోనివాఁడందురు కాఁబోలు ! అట్లన్న శిశుపాలుఁ డతని మేనయత్తకొడుకే. అతఁడుమాత్ర మెట్లుత్తమజాతిలోనివాఁడగు ? “ శంతనునినాఁటే యుత్తమక్షత్రబీజము నీచక్షేత్రములయందుఁ బ్రవేశించెను ” అనిరి. సత్యవతి నీచక్షేత్ర మని మఱియు నిటుఁ జెప్పినారు...నిషాదుఁడు ద్వైపాయనుఁడు. ఇది వీరు రుజువు చేయఁ గల్గినచో సత్యవతిని బల్లెతగా నిరూపించినచో నావ్రాఁత యంతయుఁ దప్పని నే నొప్పుకొందును. లేదా వారివ్రాఁత నీచమని లోకము గ్రహించుఁగాక ... ధృతరాష్ట్రుఁ డశ్వమేధము చేసినట్లు చెప్పిరి. శ్లో. అశ్వమేధశతై రీజే ధృతరాష్ట్రో మహామఖైః. ఇది వీరి కాధారముకాఁబోలు ... శతైః, అనుటచే 300 లకుఁ దక్కువ కాని యశ్వమేధములు ... చేసినట్లు చెప్పవలయును. అట్లు చేయుటకు గ్రుడ్డివాని కధికారము లేదు. అతఁడుచేసినవి తుల్యయజ్ఞములు. శ్రౌతయజ్ఞములు కావు. స్మార్తయజ్ఞములని నీలకంఠాచార్యులు లోనగు వ్యాఖ్యాతలు నిర్ణయించియున్నారు. కురువంశమున ధర్మరాజుమాత్ర మొక్కయశ్వమేధము చేసెను. ... ధృతరాష్ట్రుని పుత్రులు 100 గురని భారతము ఘంటాపథముగాఁ జెప్పుచుండ నీయన దుర్యోధన దుశ్శాసన వికర్ణ చిత్రసేనులు 4 రు మాత్రమే పుత్రులనియుఁ దక్కిన 96 గురు దత్తాదులనియు ... సెలవిచ్చినారు. వ్యాసుఁడు మాంసపేశిని 100 ముక్కలు చేయుట లోనగునది యంతయు నసత్యమే యని వీరు చెప్పినమాటకు లోకము ఛీయనక మానదు ... వీరిమదికి శంతనుఁడు దుష్టుఁడుగాఁ గాన్పించుచున్నాఁడఁట. అన్నయగు దేవాపిని ... రాజ్యభ్రష్టుఁగావించి తాను రాజయ్యెనఁట ... ఇట భారత ... ము ...

శ్లో. ప్రతీపస్య త్రయః పుత్రా జజ్ఞిరే భరతర్షభ !
దేవాపి శ్శంతనుశ్చైవ బాహ్లీకశ్చ మహారథః,
దేవాపిశ్చ ప్రవవ్రాజ తేషాం ధర్మహితేప్సయా ...
శంతనుశ్చ మహీపాలో బభూవ ...

శ్లో. సాక్షా ద్ధర్మా వయం పుత్ర స్తత్ర జాతో యుధిష్ఠిరః,
మాతరిశ్వా దదౌ పుత్రం భీమంనామ మహాబలమ్,
పురుహూతా వయం జజ్ఞే కుంత్యామేవ ధనంజయః.

అని ఋషులు భీష్మాదులతోఁ జెప్పినట్లున్నది. ఇట్టిసంగతిలోఁ గుంతికిఁ గర్ణార్జునులుమాత్రమే పుట్టిరనియు ... యమమరుత్తులు కుంతి జపించినమాత్రముననే వచ్చి ధర్మజభీముల నిచ్చిపోయి (రనియు న) నిరి ... “ ధర్మాజ్జాతో యుధిష్ఠిరః ” అనుటచేతం గాక వీ రిట వ్రాసిన ధర్మజశబ్దముచేతను బుట్టినట్లే యున్నది. పుట్టలేదని యవివేకియైన నన సాహసింపఁడు ... శతశృంగము తిబేతులోని (దనియుఁ బాం)డవులటఁ బుట్టినా(రనియు నం)దువలన వారి కాభాష వచ్చిన (దనియున)నిరి ... తిబేతు భాషవచ్చిన ... అంతమాత్ర నాయాచార మలవడునా ? ...గయాజుడ్డిన్‌టోగ్లక్ సితియుఁ గొంద ఱింగ్లిషుదొరల స్థితియు నుదాహరించినారు. అంతమాత్ర వీరు మ్లేచ్ఛులు హూణులు నైరని తలంపవచ్చునా ? ధర్మరాజాదులు 16, 15, 14, 13 సం॥ ల వయస్సున హస్తిపురికి వచ్చిరి.

అంతమాత్రనే తిబేతుదేశీయు లైరా ? ... వారి యాచారములు పట్టువడునా? హస్తిపురికివచ్చిన 15, 16 సం॥లకుఁ గదా ద్రౌపదీవివాహము ! జ్ఞానమువచ్చినవెనుక

ఇంత కాలము భారతదేశమందున్న వారికిఁ దిబేతాచారము లంటుకొనియే యుండవలె నందురా? ...దుర్యోధనుఁడు "పెక్కండ్రకొక్కతె వనితం బెండ్లియాడుట యుక్తమా" అనఁగా ధర్మరాజు

శ్లో. సూక్ష్మో ధర్మో మహారాజ! నాస్య విద్మో వయం గతిం
పూర్వేషా మానుపూర్వ్యేణ యాతం వర్త్మానుయామహే.

అనెను. దీని కీయయ్యగారు ధర్మము సూక్ష్మమైనదనియు దీనిగతి మే మెఱుఁగ మనియు మాపూర్వులు వెళ్ళినదారినే మేము పోవుచుంటి (మనియు న)ర్థము వ్రాసెను. మాపూర్వులనుట తప్పు. పూర్వులు వెళ్ళినదారిని మేముపోవుచుంటి మని చెప్పక ... మాపూర్వులనఁగా: పాండవుల తండ్రులు తాతలు లోనగువారుకదా! వారిలో నెవరు గాని తిబేతుదేశమందుండి వారి యాచార మవలంబించిన ట్లొకగ్రంథమందైన మనము చూడఁగలమా ?... ఇది పాండవులను నీచులనుగాఁ జేయుటకుఁ గల్పించిన కల్పనగా సత్యము. ఒకతె నేగురు పెండ్లియాడుట వారి కాచారము లేదు. లేకపోయిన ధర్మరాజుఁ డాయభిప్రాయముతో ననునా ? ... ధ్వనించుచున్నదనిరి. అట్లు ధ్వనించుట లేమి కాని యీ...వ్రాయసకాని యవివేకిత్వము ధ్వనించుచున్నది. ఇట్లువ్రాసిన మన్నంగారే కురువంశములో నెవరు నొకతె ననేకులు పెండ్లియాడలేదని ... వ్రాసిరి. ...మఱియు, కుంతి చాల గుట్టుగల స్త్రీయనియు ... వ్యభిచారముచేఁ దాను మున్గురిఁ గని సవతిచేఁ గూడ నట్లు కనిపించి కౌరవులలో భాగస్వాములఁగాఁ దీసికొనివచ్చి పెట్టియుండుననియు రాజ్యభాగమునిమిత్త మిట్లుచేసెననియుఁ జెప్పుచున్నారు. ఇవి ... స్మరించుటకైనఁ దగవనియు, నూర్ధ్వమునుండి వచ్చినవి కావనియు నిశ్చయింపవలసియున్నవి ... జన్మకర్మాదులు కౌరవాచారవిరుద్ధములు భారతీయాచారవిరుద్ధములుగ నుండుటచేతనే బాహ్లీక సోమదత్త భూరిశ్రవసులు కుంతిసోదరిసుతులు మాద్రియన్న శల్యుఁడుఁ బాండవులలోఁ జేరక కౌరవులలోఁ జేరిరి మొదలైన సంగతులు వ్రాసిరి. ఒక్కశల్యుఁ డెట్లు కౌరవులం జేరెనో తెలిసికొనఁగలిగినవా రన్నియు నట్టివేయని గ్రహింపకపోరు. వైదిక ఋషులకుఁ గూడఁ బాండవులపై గౌరవము లేదఁట. వారు తమవేదములలో వారి పేళ్లు వ్రాయకుండుట కారణమనిరి. ఋషులు వేదములు చేయలేదు. అందులోఁ గౌరవుల పేళ్ళును లేవు. పాండవులపేళ్ళును లేవు. ఈమాటలు నీటిలోని మాటలు. మఱియుఁ గొంద ఱశ్వమేధకర్తలం జెప్పి నిషాదుఁడగు వ్యాసుఁ డధ్వర్యుఁడుఁ జేయ సంకరుఁడగు ధర్మజుఁ డశ్వమేధము చేసెఁ గావున నందు వీరిపేళ్ళు లేకపోయె ననిరి. దీని కేమిసమాధానము వ్రాయవలెనో కల మాడకున్నది. దుష్టవాక్యము లనువదించుటంజేసి చిత్తము తత్తరించుచున్నది. పరమేశ్వరుఁడు నాకు మాత్ర మీదోష మంటఁగట్టకుండుఁగాక...

ఉ. జేనెఁడుపొట్టకై తన ప్రసిద్ధమతంబును మంటఁబెట్టి దు
ర్మానుల దుర్మతంబ పరమంబని పల్కుచు నందుఁ జేరి నా
నానృతపాతకంబులకునై యిహముం బరముం జెడంగఁ గ
గానక యింతలో మడిసి కష్టుఁడు భ్రష్టుఁడు దుర్గతిం బడున్.

ఉ. శ్రీకరజానపాటికులసింధుసుధాకర ! సంస్కృతాంధ్రభా
షాకలనాసమార్జిత విశాలయశోభర ! కోమలాశుధా
రాకవితావధానవిసరన్మకరందరసప్రవాహవా
శ్యీకరమాధురీ పరవశీకృతభూవర ! పత్రికాధిపా ! 1

ఉ. పాపము ! దేహమందు నొకవంక వయఃపరిణామఘోరసం
తాపము వేపుచుండఁగ క్షణక్షణవర్ధిత తీవ్రరోగబా
ధాపరిపాక మొక్కయెడ దారసుతాదుల కార్తిఁజేయ మీ
రీగతిని దివానిశము లిట్లు శ్రమించుట భాషకైకదా ! 2

ఉ. ప్రాసలులేనివైఖరిని బద్యములన్ రచియించుచున్ రసా
భాసముఁజేయుచున్న పలుభావకవుల్ ప్రభవించి యాంధ్రభా
షాసతి కెంతయో హృది విచారముగొల్పెడుకాలమందు నాం
ధ్రీసతి నిట్టు లెన్ను భవదీయప్రయత్న మమోఘమౌఁగదా ! 3

ఉ. ఆరయ మీకవిత్వ మది యంతయుఁ జూడఁగ సత్కవీంద్ర ! మం
దారమరందమట్టుల మనంబున కెంతయు భోగ్యమయ్యె. వా
గ్ధార భగీరథాంఘ్రినిపత ల్లహరి విచలన్నభోధునీ
పూరమహోద్భటీరయముపోలిక నున్నది నిశ్చయంబుగన్. 4

చ. అరసితి స్వప్నకారవ్యవహారము పేరిటి గ్రంథముం గవీ
శ్వర ! భవదీయమైన ప్రతిభాతిశయం బటఁ దెల్లమయ్యె. సం
బరమును జెందినాఁడను. సెబాసు ! బళాబళి ! వాక్ప్రసూనసుం
దర రసవత్పదాంతకవితా లతికాసహకార మీపెచూ ! 5

ఉ. స్కాందపురాణమధ్య విలస ద్వరనాగరఖండమెల్ల మా
కందమరందసౌరభ వికస్వర దివ్యకవిత్వధార స
ద్వందిత ! ఆంధ్రభాష ననువాదముఁజేసిన పుణ్యమూర్తి. వా
నందముగల్గె ఇట్టికవనంబు పురాకృతపుణ్యలబ్ధమౌ. 6

తే. చూచి తారోగ్యభాస్కరస్తోత్రమును గ
వీంద్ర ! పద్యంబు లన్నియు హృదయమునకు
నచ్చియున్నవి. మీకు సన్తాపమేల ?
సూరభగవానుఁ డాయురుద్ధారకుండు. 7

గీ. అభినవసరస్వతీ పత్రికాధికార !
శ్రీమనోహరపట్టాభిరామశాస్త్రి !
భాస్కరీయప్రసాద సౌభాగ్యగరిమ
ఆయురారోగ్యవృద్ధిచే నలరుమయ్య. 8

తే. ఓయి! నీ వేగి మరలఁ బదుర్వినాథు
బ్రహ్మవిదుఁడైన వాల్మీకి పావనాశ్ర
మమ్మునకుఁ దోడికొనిపోయి యమ్మహర్షి
కీతుల నామాటగా వచియింపవలయు. 31

చ. మునికులచంద్ర! యీనృపతిముఖ్యు వినీతు నతిప్రశాంతు నా
ర్యనుతచరిత్రు నిర్మలు విరక్తు ననాదృతనాకభోగు మో
క్షనిరతు నిశ్చలాత్ము గతకల్మషు నర్మిలిమీరఁ దత్త్వబో
ధన మొనరించి యెంతయును ధన్యునిగా నొనరింప వేఁడెదన్. 32

చ. అనుచుఁ బురందరుం డనుప నచ్చటువాసి నృపాలు చెంతకున్
జని యల జేని నాకుభవుసన్నిధికిన్ గొనిపోయి యెంతయున్
వినయముతోడ దేవవిభు విన్నపమున్ వచియింప మౌనియున్
మనమున సంతసించి నృపు మన్ననఁజేసి సమాదరోక్తులన్. 33

వ. కుశలప్రశ్నపూర్వకంబుగా ననామయం బడుగుటయు నరిష్టనేమి
యిట్లనియె. 34

తే ధర్మతత్త్వజ్ఞ! బ్రహ్మవిద్వర; మహాను
భావ! మృదుభావ! నాకుసంభవ! భవత్క
టాక్షమున నేఁ గృతార్థుఁడ నైతిఁజుమ్ము
ఇంతకంటెను గుశల మిం కేమి వలయు? 35

తే. దేవ! యొకప్రశ్న మడుగ మదిన్ దలంతు
నది యవిఘ్నమ్ముగాఁగ నా కానతిమ్ము,
ప్రబలభవబంధదుఃఖంబుఁ బాసి నేను
ముక్తిగాంచుట యెటు లింక మునివరేణ్య! 36

వ. నావుడు వాల్మీకి యిట్లనియె.

ఆ. రాజచంద్ర! నీకు రామాయణంబెల్లఁ
దెలియఁజెప్పువాఁడఁ దేటపడఁగ,
వినుము, తెలిసికొనుము, మన మట్లె నిలుపుము,
బ్రతికియుండి ముక్తిఁ బడయు దీవు. 38

వ. వసిష్ఠరామసంవాదరూపంబగు మోక్షోపాయవృత్తాంతంబు నుడి
వెద, నాకర్ణింపుమని వచించు గురునిం గని రాజన్యుం డిట్లనియె.

ఆ. రాముఁడనఁగ నెవ్వఁ డేమి వృత్తమువాఁడు ?
ఎవనివాఁడు ? మఱియు నెట్టివాఁడు ?
స్వామి ! యతఁడు బద్ధుఁడా ? ముక్తుఁడా ? తెల్పు
తత్వవిద్వరేణ్య ! దయ తలిర్ప. 40

వ. అనిన నద్దేశికోత్తముం డిట్లనియె. 41

ఉ. మానవనాథ ! శ్రీహరి రమారమణీరమణుండు కేవల
జ్ఞానమయుండు నిర్గుణుఁడు శాపమిషన్ ధృతరాజవేషుఁడై
తానొక జీవమాత్రుని విధంబున లోకమునన్ జరించి య
జ్ఞానము తెచ్చిపెట్టుకొనె సర్వజగత్ప్రభుఁడయ్యు నొయ్యనన్. 42

ఆ. అన నృపాలుఁడనెఁ జిదానందుఁడగు రమా
పతికి శాప మేమికతనఁ గలిగె ?
హరికి శాపమొసఁగు నంతటివా రెవ్వ ?
రెఱుఁగఁజెప్పు మన మునీంద్రుఁ డనియె. 43

సీ. అఖిలలోకేశ్వరుండైన శ్రీహరి వికుం
ఠమునుండి సత్యలోకమున కొక్క
తఱి నేగుదెంచి తత్రత్యులౌ పరమేష్ఠి
ముఖ సుపర్వులచేతఁ బూజితుఁడయి
నిష్కాముఁడై యెట్టినెనరుఁ జూపకయున్న
నలువ కుమారు సనత్కుమారుఁ
గని నీవు నిష్కాముఁడ ననుగర్వమున నన్
సరకుసేయవు గాన శరవణభవుఁ

తే. డనఁగ జనియించి యధికకామార్తుఁడ వగు
మనుచు శపియించె సర్వజ్ఞతను త్యజించి
మనుజుఁడై కొంతకాలంబు మను మటంచు
హరికిఁ బ్రతిశాపమిచ్చె నయ్యజసుతుండు. 44

క. తన పత్నిని జంపిన వె
న్నునిపయిఁ గోపించి 'నీవునున్ నావలె భా
ర్యను బాసి విరహమును గను'
మని భృగుముని శాపమిచ్చె హరికి నృపాలా ! 45

క. నిందితకితవాకృతి న
న్నందించిన భంగమునకు నబలావిరహా
బందెదవు నీవు నని యల
బృందాసతి శాపమొసఁగె విష్ణునకు నృపా! 46

ఆ. మును పయోష్ణితీరమున దేవదత్తుని
పడఁతి శ్రీనృసింహు భయదవేష
మరసి మృతిని గాంచ హరి కల్గి యమ్ముని
పతిని బాయుమంచు శాపమిచ్చె. 47

వ. ఇట్లు, 48

ఆ. భృగుమహర్షిచేత బృందావనితచేత
ధీరుఁడగు సనత్కుమారుచేత
దేవదత్తుచేత దేవుండు విష్ణుండు
శాపమంది మనుజజన్మ మెత్తె. 49

ఆ. శాపకారణంబు సర్వంబు నుడివితి,
మున్ను నన్నడిగిన ముక్తిసాధ
నము వచింతు నింక నరనాథ! సకలమ్ము
సావధానమానసమున వినుము. 50

వ. అని బ్రహ్మవిద్వరేణ్యుండగు ప్రాచేతసుండు కొండొకతడవు ధ్యాన
నిమీలితలోచనుండై మరల నిట్లనియె. 51

మ. దివియందున్ భువియందు నాకసమునన్ దిఙ్మండలంబందు లో
న వెలిన్ బూర్వమునన్ బరంబునను బూర్ణవ్యాపకుండై యెవం
డవభాసాత్మత నాకుఁ దోఁచు నల సర్వాధారుఁ డీశాస్త్రమున్
వివరింపంగల శక్తి నా కిడి నినున్ విశ్రాంతుగాఁ జేయుతన్. 52

తే. భవమునన్ జిక్కితిన్ ముక్తిఁ బడయవలయు
ననెడు దృఢనిశ్చయముగలాఁ డగుచుఁ గేవ
లాజ్ఞుఁడున్ దజ్జ్ఞుఁడున్ గానియట్టి నరుఁడు
అధిప! యీశాస్త్రము వినంగ నర్హుఁడుసుమి. 53

తే. అట్టియధికారసంపత్తి నమరువాఁడ
వగుట నాబోధ నీహృదయమునఁ గలుగు

మోహ మంతయుఁ ద్రోలఁగించి ముక్తిపదముఁ
గరతలామలకముఁ జేయుఁగాత నీకు. 54

వ. తొలుతఁ బూర్వరామాయణరూపంబు లగు ధర్మతత్త్వ జ్ఞానానుష్ఠా నేశ్వరప్రపత్త్యాది జ్ఞానాధికారప్రాపక కథోపాయంబుల విచారించి తదర్థానుష్ఠానప్రాప్తాధికారుండై వక్ష్యమాణంబులగు షట్ప్రకరణంబులను మోక్షోపాయంబుల నెఱుంగు ప్రాజ్ఞుండు పునర్జన్మంబు నొందఁడు. మున్ను నేను కథోపాయంబుల రచించి వినయసంపన్నుండును ధీమంతుండును మదీయ శిష్యుండును నగు భరద్వాజునకు సముద్రుండు యాచకునకు రత్నంబు నొసఁగునట్లు సమాహితచిత్తుండనై యనుగ్రహంబున నొసంగుటయుఁ బిదప నతండు మేరుగిరిగహనంబునఁ బరమేష్ఠిసన్నిధి నవి గానంబుసేయ నద్దేవుం డతనికిఁ బ్రీతుండై వరంబుఁ గోరుమన నమ్మునివరుండు లోకంబు సంసారం బుత్తరించు సదుపాయం బానతిమ్మన నవ్విభుండు "వత్సా! యియ్యర్థంబున నీవు త్వదీయగురుండగు వాల్మీకిం బ్రార్థింపుము. అతనిచేఁ బ్రారంభింపఁబడిన వసిష్ఠరామసంవాదరూపంబగు నుత్తరరామాయణంబును వినిన మనుజుండు సేతువుచేత సింధువుంబోలె సంసారంబు సంతరించు"నని నుడివి యతనిం గూడి మదాశ్రమంబున కేతెంచి నాచే నర్ఘ్యపాద్యాదుల నర్చితుండై మధురభాషణముల నిట్లనియె. 55

చ. మునివర! రామసచ్చరితమున్ రచియించితి, పూర్వ భాగ మ
త్యనఘముఁ గర్మబోధకము, నవ్వలిభాగము జ్ఞానబోధకం
బును, విడువంగఁ జెల్ల, దది ముక్తినిదానము, నావచేత వా
ర్థినివలె దీన లోకము తరించును సంసృతిసంకటంబులన్. 56

క. దీనిన్ నీకు వచింపఁగ నేనే వచ్చితిని గాన నిఖిలజనహితం
బౌనీశాస్త్రము నర్పుము మానివరా! యని మదాశ్రమమునుండి వెసన్

వ. చతురాననుండు తిరోహితుం డగుటయు నేను తదీయాగమనజనిత విస్మయ పారవశ్యనిమగ్నుండనై కొంతతడ వుండి క్రమంబుగ స్వస్థచిత్తుండనై భరద్వాజుం గని "ఓయీ! యిది యేమి? భగవంతుండగు పద్మగర్భుం డేమిసెప్పె" ననియడిగిన నతం డిట్లనియె. 58

కృ:- ఇఁకఁ జదివెదు సంగతులు వినుఁడు. మనకుఁ జేతనైనవఱకు గ్రహింపఁగలము. రోగములు 2 విధములు. మొదటివి యొంటఁబుట్టునవి. రెండవవి యంటువ్యాధులు. వ్యాధి పుట్టునంత నిర్దుష్టముగ మనము సంచరింపఁజాలము కావుననే మానవదేహము లప్పుడప్పుడు వ్యాధిబాధితము లగుచుండుచుకాని యారోగ్యనియమము లెఱిఁగి సంచరించుచుండిన నిట్టివ్యాధులు సంభవింపకుండ నుండఁగలము. దేహగేహోపకరణాదులు పరిశుభ్రముగ నుంచుచో నంటువ్యాధులను సోఁకకుండఁ దప్పించుకొనఁగలము. శరీరవికారములను విరేచనాదికములను గమనించి తెలివి కలవారు తమ కాపాదింపనున్న రోగము నెఱిఁగి తన్నివారణ మొనరించుకొనఁ గలరు. విషూచి మారి దగ్గు గజ్జి మొదలగునవి దుర్వాయువ్యాపనమువలనఁగలుగుచుండును. ఇట్టి వ్యాధులుగలవా రూపిరివిడుచునపుడును వారిశరీరములనుండియు నీవ్యాధుల బీజము లణురూపమున బయలువెడలి గాలిలోఁ గలసి సమీపవర్తుల నంటును. ఇట్టిరోగాణువులు తఱుచుగ నూలుగుడ్డలఁ జేరి శరీరముల కంటుచుండును. కావుననే మనవారు సందడిగలచోటుల సంచరించినపుడెల్ల వస్త్రములు మార్చుట వాడుకయైనది. అట్టిరోగముల వ్యాపింపఁజేయు రోగాణువులు నూతనగోమయముచే నశించుచుండును. గోమయమునకు రోగాణువుల నశింపఁజేయు బలము వెలికివచ్చినది మొద లొక జాముసేపటికంటె మిగిలియుండదు. కావుననే మనవారు చూడుచుండఁగ వేసినది సువర్ణముతో సమ మనుచుందురు. గోవు విసర్జించినది మొదలు కాలవ్యవధి యైనకొలఁది దీనిశక్తి తగ్గిపోయి యామద్వయానంతరము దానినుండియే దుర్వాయువు వెడలుచుండును. కావున నీకాలములోపలనే దానిం దీసివైచుచుండవలెను. కంటికిఁ గానరాని సన్నని పురుగులును నంటురోగముల వ్యాపింపఁజేయు విషాణువులును గోమయోదకపు గాటు సహింపలేక నశించుచుండును. అందుచే మనవా రహరహమును నావరణముల గోమయోదకము చల్లి శుచిగావించుచుందురు. అంటుజాడ్యములుండు చోటఁ దఱుచగఁ గ్రొత్తగోమయోదకమునం దడిపిన ప్రాఁతపీడుచ లట నట నుంచుటయు నా ప్రదేశముల గోమయోదకముచే సమ్మార్జన మొనరించుచుండుటయుఁ దద్వ్యాధివిముక్తులకు ముందుగ గోమయోదకస్నాన మొనరించి పిమ్మట మంచినీటిస్నానము చేయించుటయు నారోగ్యప్రదములు. అట్టివా రుపయోగించిన పాత్రలు వస్త్రములు శయ్యాదికములు నిట్లు శుద్ధిచేయుటచే నంటువ్యాధుల వ్యాపనము తగ్గును.

జగ:- మన తాతలనాఁటినుండియు వచ్చుచున్న యలవాటుప్రకారము రోగాలప్రమ కాకపోయినను దినదినము గోమయము నీవు చదివినలాగు వాడుచున్నాము. కాని యీవివరా లెవ రెఱుఁగుదురు? వినియుండినఁ జూచినావా? విన్నదానికే నాచారానకు సరిపోయినది.

కృ:- ఇన్ని సంగతులు మన మెఱిఁగియున్నను లోకమున వ్యాధిని సంపూర్ణముగ నివారణ మొనరింప మానవశక్తి చాలదు. కాని భగవంతునిపై భారముంచి చేతనైనంత ప్రయత్న మొనరించి ఫలిత మాదయామయునకు వదలుట ప్రాజ్ఞలక్షణము.

కాని యవిచారముగఁ గానున్నది కాకమానదని మిన్నకుండుట కాదు. కావున మన కనువైనవఱకుఁ బ్రయత్నించుచుండినఁ గొంతవఱకైనఁ గార్యకారియగు చుండుట నిశ్చయము. సర్వప్రయత్నముచే మన కీశ్వరుఁ డనుగ్రహించినబుద్ధి నుపయోగించుచు నా దయామయుని మాహాత్మ్యమున కానందించుచుండుట శ్రేయస్కారి.

జగ:- మన యొంటితోపా టింటినిగూడ నెప్పుడును శుభ్రము చేయుచుండవలెననియు నట్లు చేసినఁగాని మనకు సుఖముండదనియుఁ గదా నీవు చదివినావు? అట్లయిన సూర్యోదయాది యస్తమయమువఱకు నొళ్ళు శుభ్రపఱచుకొనుచుండిన సరి. ఇఁకఁ గృష్ణా రామా యని యేమియు లేదన్నమాట. ఇంతేనా ?

కృ:- వినుఁడు. వినినపుడును బనిలో దిగి చేయుచుండినపుడును సెద్దియేని భారముగఁ దోచుచుండును కాని మనస్ఫూర్తిగ నాయాపను లొనరింప నుత్సాహముతో మొదలిడినఁగదా యవి కడు సులభముగ నెఱవేఱుననియు సంతసము నాపాదించుననియు ననుభవపూర్వకముగ ధ్రువమగుట ! దేహముతోపాటుగ నింటి శుభ్రతయుఁ విచారించుచుండనిచోఁ గార్యభంగము కలుగుట నిశ్చయము. వారమున కొకతూరి యభ్యంగన మొనరించుకొనునట్లు కనీసము నెల కొకసారియైనఁ దప్పక యింటి బూజును గదలింపకుండ నుంచెడు గృహోపకరణములను బరిశుభ్రములగునట్లు తుడుచుచు 6 నెలలకుఁగాని సం॥ మునకుఁగాని యొకసారి గోడలకు వెల్లవేయించుకొనుచుండుట పరమావశ్యకము.

క. ఆఁయ గాలి జలము నాహారమ్మును జంతువితతి ప్రాణమ్ముల కా
ధారములు. వానిశుభ్రత లారోగ్యముకొఱవారి కవసరముచుమీ!

జీవరాసులెల్ల బ్రతికియుండుటకు 1 గాలి 2 నీరు 3 ఆహారముమాత్రమే యాధారములని యెల్లరు నెఱుఁగుదురు. అవి పరిశుభ్రమైనవి కానిచో జంతువులుకూడ నారోగ్యము కలిగియుండుట కవకాశము లేదు.

జ:- మంచిగాలి మంచినీరు మంచితిండి కలవారు రోగములు లేకుండ నెక్కువ కాలము బ్రతుకఁగలరా యేమి? ఇఁకఁ జావు బ్రతుకు మన చేతిలోనే యున్నట్లు కనఁబడుచున్నది. అంతేకాదూ? ఇది నమ్మఁదగనిదిగా నున్నది.

కృ:- సర్వసముఁడగు భగవానుఁడు సర్వావయవములతోపాటు దీర్ఘాయుష్యము నిచ్చుచున్నాఁడనియు నెల్లరకు నొకశే రీతి నిచ్చువాఁడనియు నది మన కర్మలచే దినగండము నూఱేండ్లాయువుగా నేర్పడుచుండుననియు మన వర్తనలచే నట్టి గండముల గడపుచు నకాలమృత్యువు వాతఁ బడకుండ నుండనగుననియుఁ గొంచె మాలోచించినఁ దెలిసికొనఁగలము. జంతుజాలముల కన్నిటికి నాయాజాతులకుఁ దగిన ట్లవయవనిర్మాణ మొనరించి పరమపిత హెచ్చుతగ్గు లొనరించెనని నమ్ముట కెంతమాత్రము సందేహము లేదు. రూపభేదములును గతిభేదములును మాతాపిత్రాది సంబంధముచేఁ గలుగుచుండుట యెల్లరు నెఱిఁగిన యంశమే. ఓరుగాలి యందు దీప మునిచి స్వామీ నీమహిమచేనిన నిలుచునా? ఆదీపమునకే తగు

మాత్రమే గాలి తగులునట్లు కాపాడుచుఁ జమురుపోయుచుండిన నఖండముగ నిలుచుచుండుటను జూచుచుండలేదా? చేనున జొన్నలు విత్తిన కర్షకుఁడు పొలమెల్ల సరిబల మొనర్చినను స్థలాదిభేదములచేఁ బెంపుకుంపు లగుచుండునట్లు చేతనైనంతవఱకు నాయుర్వృద్ధికరములగు మార్గము లరసి తెలిసికొని తన్నియ మాతిక్రమణ మొనరింపక యా దయామయుపై భారముంచి మెలఁగుచుండిన దినదినము మనము గనుచుండు మరణములు పెక్కులు కలుగవనియే నా నమ్మకము.

జ:- నిజమేసుమీ! మా పుట్టింటి గ్రామమున నిప్పటి కిరువదేండ్ల నాఁ డొక లోఁతు నూతిలోఁ బూడికదీయుచుండిరి. అచట నొక విధమగు విషవాయువు బయలు దేఱి యడుగున మన్నుత్రోడుచున్నవాఁడు మరణించెను. పైనున్నవా రెన్ని కేకలు పెట్టినను సంగతి తెలియనందున మఱియొకఁడు చప్పునఁ గ్రిందికి దిగి పోయి పైవారి కేమియుఁ దెల్పకమున్న యసువులఁ బాసెను. ధైర్యమొనరించి మూడవవాఁడు నట్లాచరించి మరణమునందెను. అంతట నెల్లరు భీతిల్లిపోయిరి. అచటికి దీపముల దింపిన మధ్యనే యారిపోవుచుండెను. అంత నచ్చట విష వాయువు చేరినదని యెఱిఁగి యాపని విరమించిరి.

కృ:- కనుకనే జీవించియుండుటకు మంచి గాలి పరమావశ్యకమని ముందుగ నెఱిఁగి యుండవలెను. ఇది మొదటివిధి. రెండవది నీరు. ఇది లేకున్న మన మొకటి రెండు దినములు బ్రతుకఁగలము కాని త్రావు జలమును బీల్చు గాలివలెఁ బరి శుభ్రముగ నుండనిచో దానియందుఁగల మాలిన్యముకొలఁది నదియు నారోగ్య భంగ మొనరించుచుండును. కాన నిర్మలోదకపానమే యొనరించుచుండవలెను. మూఁడవది యాహారము. ఇది లేకయుఁ గొన్నిదినములు జీవింపవచ్చును. కాని యయ్యదియు నిర్మలమైనదిగా నుండుట పరమావశ్యకము. ప్రాణసంరక్షణమున కాహారముకంటె నీరును నీరెంటికంటె గాలియు ముఖ్యావశ్యకములని తెలిసికొనఁ గలిగితిమి. ఇంతియే కాక నిద్రయు ధరించు వస్త్రములును జేయు పనులును నారోగ్యమునకు సంబంధము కలిగియుండును. మఱియు నపుడపుడు పుట్టి వ్యాపించుచుండెడి యంటురోగములును నాయుర్భంగ మొనరించును. కావునఁ బైన వివరించిన విషయము లెల్లరు నెఱిఁగియుండుట ప్రాణసంరక్షణమున కావశ్యకములు. అందువలన నా యావివరములఁ గొలఁదిగనైనఁ దెలిసికొనఁ బ్రయత్నించెదము.

జ:- ప్రతివారును బ్రతికియుండుట కిన్నివిషయములు తెలిసియుండవలెనని నే నెన్నఁడును ననుకొనలేదు. ఇప్పుడు వినుచు ననుకొనుచున్నాను. వానిని గుఱించి కొంచెము నాకుఁ దెలిసెడిలాగు చెప్పఁగలవా?

కృ:- మన కన్నిటికిని గల్పవృక్షమువంటి యుపన్యాసమంజరి చేతనున్నంతవఱకుఁ గొఱఁతయే లేదు. దానియం దిట్టి యంశములం గూర్చి వేఱువేఱుగ బోధలు పొందుపఱుపఁబడియున్నవి. తెలిసికొనఁదగిన యంశముల నొక్కొక్క దానిం గూర్చి సంగ్రహముగ నుడివెద. ఆకర్ణింపుఁడు. గాలి భూమిపైన నేఁబదిమైళ్ల

యెత్తువఱకు వ్యాపించియుండునని తద్విజ్ఞానదక్షులు తెలిపియుండుటచే భూలోకము వాయుసముద్రమున మునిఁగి యాకసమునఁ దిరుగుచు మన కనులకు నక్షత్రములవలెఁ గనఁబడు గ్రహములంబలె నొప్పారుచున్నదని చెప్పనగును. భగవన్నిర్మాణమువలన సకలపదార్థములును బరిశుభ్రమైనవే యైనను నొకదాని నొకటి చేరకుండుటచే మలినము లగుచుండును. చేఁపలు మొదలగు జలచరములు నీటియందు మసలుచుండునట్లు మన మావాయుసముద్రమున మసలుచున్నాము. మనముండు నిండ్లయందును దేనిచేతను నింపఁబడని కడవయందును గాలి నిండియుండును. వట్టికడవను నీళ్ళయందు ముంచినయపు డందుండు వాయువు వెలుపలికి వెడలిపోవుచు బుడబుడధ్వని చేయుట మన మెఱిఁగియున్నాము. మనము కొంచెమాలోచించినపుడు కడవయందున్న వాయువు నీటిచే వెడలనడపఁబడుచుండుటచే నాధ్వని కలుగుచున్నదని గ్రహించఁగలము. గాలి కంటికిఁ గానరానిదగుటచేఁ జక్కఁగ యోచింపకుండిన మన మట్టి వాయుసముద్రమున మెలఁగుచున్న వివరముం గనిపెట్టఁజాలము. ప్రతినిమిషమును మన మూపిరిఁ బీల్చుచు విడుచుచున్న విషయము తెలిసియున్నను బైట మన చుట్టు నున్న గాలి ముక్కులనుండి లోపలికిఁ బోవుచు మరల వెలుపలికి వచ్చి మన నావరించియున్న గాలిం గలియుచున్నదని తెలిసికొనఁజాలకుండుట గొప్ప వింత. ఇట్లూపిరి విడుచుచుండుట (1 జంతుశ్వాసము) వలనను దీపములు వెలుగుట లేక యగ్ని మండుచుండుట (2 వస్తుదహనము) వలనను నంట్లుతోమఁబడు బోళ్లందును జలదారులందును వలె నేవస్తువును మురిగి నశించుట (3 భూతవిచ్ఛేదము) వలనను నెడతెఱపిలేకుండ మన నావరించియున్న గాలి మలినమగుచుండును. ఇట్లు నిరంతరాయముగ మలినమగుచుండు గాలి నట్లు కాకుండ నాఁపుటకుఁగాని పైన వివరించిన 3 కారణములలో నొక దానినేని మాపుటకుఁ గాని కొంతవఱకునైనఁ దగ్గునట్లు చేయుటకుఁ గాని మనము శక్తిగలవారము కాము. జీవదయాపరుఁడగు పరమేశ్వరుఁడు సృష్టియం దట్టి పదార్థములను శుభ్రపడుమార్గములను నిర్మించియున్నాఁడు. ఇట్లనివార్యములగు 3 మార్గముల మలినమగు గాలి మరల 3 మార్గముల శుభ్రమగుచుండును. గాలికి వ్యాపనస్వభావము కలదు. తనయందుఁ గలసిన దుర్గంధమును బోగవలెఁ గడుదూరము వ్యాపింపఁజేయుటచే దాని బలము తగ్గించుట. ఉదా. కడుపుమురిగిన శిశు వెపుడేని యపానవాయువు విసర్జించిన వెంటనే మన కసహ్యముగ నుండునంతటి దుర్వాసన వచ్చి కొన్ని నిమిషములలోఁ బోవును. ఇది యెల్లరకు ననుభవముగల సంగతి. ఇట్టి నింద్యోదాహరణము నిడ సాహసించినందుకుఁ జదువరులు మన్నింతురని ప్రార్థించుచున్నాను. ఆబైలుదేరిన దుర్వాయు వేమైనది? అంతటను వ్యాపించి తనయందుఁ గలిగిన దుర్వాసనాబలమును దగ్గించినది. అకారణకరుణాళుఁడగు సృష్టికర్త వాయువునం దట్టి వ్యాపనస్వభావము లేకుండ నొనరించినచో భూలోకమున నొకజంతువేని బ్రతుకఁజాలనంతగ దుర్వాయువు ప్రబలుచుండెడిదే.

# వధూశాంబరీ విడంబనము

ఉ. ఉజ్జయినీపురంబు మెఱయున్ మణిహర్మ్యశిఖావిహారి యో
షిజ్జన మొక్కచో జలము చేఁదికొనం దలవాంచఁ దన్ముఖో
ద్య జ్జలజాభియాతికి భయంపడి దేవ నదీరథాంగముల్
పజ్జ ముడుంగఁబాఱు పృథుపద్మకుడుంగములం దడంగఁగన్. 1

ఉ. ఆపుర మేలుఁ బూర్ణకరుణాభరణుండగు విక్రమార్కుఁ డు
ద్దీపితమంత్రశక్తిఁ గడిదేఱిన భట్టి యుపాయ మాత్మ బా
హాపరిపాలితంబటు సమగ్రశుభప్రతిపాదిగా బుధ
స్థాపక దానలక్ష్మి యను దాది యశోరుచికన్యఁ బ్రోవఁగన్. 2

ఉ. ఆతని కొక్క మంత్రిగలఁ డద్భుతశీలుఁడు పుష్పహాస వి
ఖ్యాతుఁ. డతండు నవ్విన లతాంతపు వాన యొసంగు. నిస్తులా
స్తోకతరాద్భుతక్రియలు చూచినయప్పుడు మానసైక శో
కాతిశయంబు బల్మిని దదాస్యము హాస్యము గాన దెన్నఁడున్. 3

తే. గీ. అంత నొకనాఁడు విక్రమార్కావనీంద్రుఁ
డంతిపురమునఁ గదళిక యనెడు పేర
తనరు మోహపురాణియుఁ దానుఁ గూడి
పొత్తుల భుజింపఁగా నొక్క బోనకత్తె. 4

తే. గీ. ఒరపు దనరారఁ జేఁపల యూర్పుఁగూర
ఇడినఁ గదళిక చే యెగనెత్తి యాస్య
మవలగాఁ ద్రిప్పి యిదియేమి యారగింప
వనెడు పతిఁ జూచి రాని జంకెనలు నిగుడ. 5

ఉ. ఎన్నఁడు నిన్నెకాని పరు నెన్నఁడుఁ గన్గొన, గండుమీల ని
ట్లెన్నికలేక యింటి భుజియింపఁగ వచ్చుఁ బతివ్రతాత్వ సం
పన్నిధినైన నా కనుచుఁ బల్కినఁ బళ్ళెరమందుఁ ద్రుళ్ళి య
క్కన్నులకల్కిమాటకుఁ బకాపక నవ్వె విపక్వమీనముల్. 6

కం. నవ్వినఁ గనుఁగొని పొదివిన
నివ్వెఱచేతులను వార్చి నృపవరుఁ డంతన్
నివ్వటిలుసందియంబున
జవ్వాదు మనంబుతో హజారముఁ జేరెన్. 7

తే. గీ. చేరి మంత్రుల రావించి చిన్నఁబోవు
మొగముతోడుత నద్భుతంబును వచించి
ఏలనవ్వెనో యడికినమీలు తెల్పుఁ
డనుచు గద్దించి యడుగ నయ్యలఘుమతులు. 8

కం ఇదియేమొ యిపుడు తెలియదు
కద ! తగ వివరించిచూడఁగాఁ దోఁచినచో
పదపడి చనుదెంచియు విని
చెదమన వారలకు నృపతి సెలవిచ్చుటయున్. 9

కం. పనిచినఁ జనువారలలో
ఘనబుద్ధియనంగఁ బేరుగల మంత్రి గృహం
బున కరిగి హాస్యహేతువు
కననేరక వగలఁ బొగులఁగా నట్టియెడన్. 10

కం. బాలసరస్వతి యతి మతి
శాలినియగు మంత్రితనయ చనుదెంచి యిదే
మాలోచనయని యడిగి త
దాలాపము లెల్ల విని మహాద్భుతమతియై. 11

వ. తన్మత్స్యహాసంబునకుం బూర్వంబునం బ్రవర్తిలిన కదళికా విక్ర
మార్కుల వాక్యంబు లామ్రేడితంబుగా విని యంజనముఖంబున
నిక్షేపంబునుం బోలె మనీషాబలంబునం దత్కారణం బెఱింగి
యయ్యా! ఈయాశ్చర్యంబు వధూశాంబరీవిడంబనంబునం బొడ
మినయది, పాముజాడ పామునకుం గాని పరులకుం దెలియఁబడని
తెఱంగున నంగనలకుం గాని యిత్తెఱంగుఁ గనుంగొన మీకుం
గొలఁదిగా, దీగుట్టు బయలుగావించినం బాపంబు ప్రాపించుఁగావున
విజనాంతరంబున నుపాయంబున భూనాయకున కేఁ దెలిపెదనని
యజ్జనకునివెంట వసనాచ్ఛాదితాందోళికారోహణంబునం జని తెర
మఱుఁగునం గూర్చుండి యక్కురంగనయన యనుప్రసంగంబు దిగిచి

తే. గీ. తనదు కథలకుఁ గదలికాతరళనయన
ఆవిగాఁగల్గు నంతఃపురాబ్జముఖులు
పుష్పహాసప్రముఖ మంత్రిపుంగవులును
వచ్చియుండుటఁ దెలిసి యవ్వామనయన. 13

మ. సభవారెల్లను సద్దుమాని వినుఁడీ సర్వంసహామండల
ప్రభుతోఁ దెల్పెద. విక్రమార్కనృపచంద్రా ! సావధానంబుగా
శుభదం భీకథఁ జిత్తగింపవలెనంచుం దెల్పఁజొచ్చెన్ సుర
ర్షభకేళీవనికామరందరసవాచాప్రాచురీచాతురిన్. 14

కం. గంధవతీనామకము వ
సుంధర నొకపురము కరము శోభిలు భాస్వ
త్సైంధవచయాంతిపత్రిత
బంధుర మణిసౌధ కేతుపట పటలంబై. 15

కం. ఆనగరరత్న మేలున్
మానధనుండనఁగఁ బరఁగు మానవపతి. త
త్సూనుం డభిమానధనా
ఖ్యానవనీయుండు వెలయు నధికప్రజ్ఞన్. 16

తే. గీ. అతఁడు జనకుని వెనుకఁ బట్టాభిషేక
మవధరించి నిజామాత్యు లాప్తకోటి
అనుదినంబును విన్నవించిన వివాహ
మొల్లనని నిస్పృహుండయి యుండె నంత. 17

కం. చనవరు లందఱు నొకనాఁ
డనఘా ! కల్యాణ మొల్లనను కారణ మే
మని యడిగిన వారలదెస
గనుఁగొని యభిమానధనుఁ డకల్మషఫణితిన్. 18

కం. ఇట్టిది యడుగనె తగ. దీ
పట్టున మీ కెఱుకలేక పలుమాఱు మొఱల్
పెట్టెదరు గానఁ దెలిపెద.
గటిగఁ గామినుల నమ్మఁగారాదు మదిన్. 19

కం. పురుషజన వంచనార్థము
సరసిజసంభవుఁడు తనదు సామర్థ్యముచే
నిరుపమముగ నిర్మించెను
తరుణుల మాయోపజీవితారణగతులన్. 20

తే. గీ. జవ్వనము రాకమునుపె విశ్వప్రపంచ
మంతయును వృద్ధత మొనర్చి యడఁచికొందు.
రేమియెఱుఁగనికరణి నహీనబాల్య
చేష్టఁ బ్రకటింతు రవని రాజీవముఖులు. 21

సీ. చిన్నారిచన్నులకన్న మున్నుగఁ దోఁచు
లోకపరిమోహణలోలచింత
కలికిచూపుల వాఁడికన్న మున్నుగ మించు
గురుజనోజ్జ్వల తృణీకరణపటిమ
కటితటీచక్రింబుకన్న మున్నుగఁ జేరు
అనృతవాక్యస్థాపనాత్మశక్తి
చెన్నారు మైమిన్నకన్న మున్నుగఁ బొల్చు
జనవిస్మయప్రద సాహసంబు
గాఢచాతుర్యధుర్యతకన్న మున్న
పొడము గంభీర జారసంభోగవాంఛ
కమలముఖులకు యౌవనాగమముకన్న
మున్నుగాఁ గల్గుఁ బాపసమూహ మెల్ల. 22

కం. టెక్కులు గలవాఁడైనన్
చక్కనివాఁడైన రతులఁ జతురుం డైనన్
దక్కరు మగనికి నిక్కం
బక్కట! జారునికిఁ దక్కినటువలె యువతుల్. 23

కం. మగువలు గరగరనై తగు
మగవానిం జూచి వీఁడు మగఁ డైనఁగదా
తెగు దుఃఖం బనుకొంచున్
దిగఁగాఱుదు రెపుడు నెమ్మదిన్ వగ మిగులన్. 24

ఇట్లు విచారించి ప్రవేశపెట్టితినని యాయనతో నేను జెప్పితినా యని విశ్వనాథము వెడఁగుప్రశ్న వేయక మానఁడు. కాని పరమమిత్రులైన పండితులకే చెప్పయుండెను. వారు వారిమిత్రులతోఁ బ్రస్తావవశమునఁ బ్రసంగించుటయుఁ బరంపరగాఁ బలువురకుం దెలియనయ్యెను. అట్లాత్మజుం బ్రవేశపెట్టి మేనమామతోఁ మిత్రత్వమును వృద్ధిచేసెను. వానికి వశముగాని కార్యములఁ దానొనరింతునని పూనుకొనియెను. కవులూరు నరసింహారావుగారు కడకు వాని కీలప్రోలు హనుమదర్చకత్వమున కీయవలసిన వేతనము నేఁడాది దీయలేదఁట. ఇచ్చునట్లు లేదఁట. వీరిమీఁద దావా వేయించి రాఁబట్టుటకు విశ్వనాథము వేడ్కపడియెను. మేనమామచేత వారికి రిజిష్టరుత్తర మిప్పించెను. నరసింహారావుగారనినఁ జిరకాలము రివిన్యూయినస్పెక్టరుపని చేసి సమర్థుఁడనిపించుకొనిన సజ్జనుఁడు. దేవబ్రాహ్మణులయందు భక్తివిశ్వాసములుగల ప్రాజ్ఞుఁడు విద్వత్ప్రియుఁడు. విఖ్యాతులైన వీరు విశ్వనాథము నోటీసునకు నెఱపుఁ జెందక తుడిచిపాఱవేసిరి. ఉడుతయూఁపుల కేపె కదలలేదు. తనశక్తి తనకుఁ దెలియక ఘనకార్యములకుఁ గడంగుటయుఁ గడకుఁ బోరగిలఁబడుటయు విశ్వనాథమునకు వేడుక. మామ కింతలో మగశిశువు పుట్టెను. విశ్వనాథము పెట్టుకొన్న విస్తృతాశ తీఱెను. నీమేనమామ బిడ్డ నీకొడుకుకుఁ దల్లి యగుఁగదా, తల్లికి మగనిఁ జేయుట తగునా యని తత్త్వజ్ఞను లెత్తిపొడిచిరి. ఎట్టకేలకు విశ్వనాథము విరమించుకొనియెను. కాని యబ్దమునకే యామగశిశువు మరణించుటయు మరల మామబిడ్డనే తనబిడ్డనికిఁ గట్నము కాంక్షింపక పోఁగానాభరణముల నిమిత్త మవ్వానికే 600 ల కట్నము మర్పించి విశ్వనాథము వివాహము కావించెను. స్నాతకవ్రతములోఁ జాలసారులు సీతారామశాస్త్రి న్నని చెప్పించి ప్రీతినందెను. ఉపనయనములో నొక్కింత యంకురించి 14 వ యేటనైన వివాహములోఁ బరిపూర్ణమైన శాస్త్రిత్వమునకుఁ బాత్రమై పరిష్కృతము (ప్రమాథి, 1939) 17 యేండ్లప్రాయములో విశ్వనాథము పెద్దకొడుకు వెలయుచున్నవాఁడు. మొదలలో మాయన్నకొడుకు లక్ష్మీనారాయణచే లాల్యమానుఁడగుచు వాని మేనమామ మేళ్ళచెఱువు శేషాచలమునొద్దఁ జిల్లర మంత్రములు చెప్పుకొనుచున్నాఁడు. తండ్రికిఁ బేరుతెచ్చె విశ్వనాథము. వీఁడును విశ్వనాథమునకుఁ బేరుతెచ్చును. వీనిచరిత్రమును విలిఖింపఁదలఁచిన వలసినంత కలదు కాని డింభకుఁడు. శ్లో॥ ... డింభస్య దుర్విలసితాని ముదే గురూణామ్.

వీనితరువాత విశ్వనాథమున కాఁడుపిల్ల. దానిపేరును సీతారామమ్మ. చదువుకొనుచున్నది. అస్మదాత్మజతోపా టదియు నస్మత్సమీపమునఁ బాట పద్యము చెప్పికొనుచుఁ బ్రమోదము గలిగించుచున్నది. దానిని సత్తెనపల్లితాలూకా గణపవరగ్రామవాసి రాళ్ళభండి వెంకయ్య కుమారుఁడు సుబ్బారావు కిచ్చి విశ్వనాథము వివాహము చేసెను. అల్లున కైదువందలరూపాయల కట్నము మర్పించెను. అక్కడఁగూడఁ బ్రభవసిద్ధమైన ప్రతారణ కొంత ప్రచరించెను. శతపంచకరౌప్యములకును స్వార్జితమైన చవిటి మాగాణి యొకటి సరిపెట్టఁజూచెను. తుదకు వియ్యము కయ్యముగా మాఱకుండుటకు నాదియం దనుకొన్న యైదువందలరూపాయలు నబ్దమునకుఁ గాఁబోలు నర్పించుకొనియెను. అల్లుఁడు సుబ్బారావు వాంగ్గేయవిద్య నభ్యసించుచున్నాఁడు. ప్రవేశపరీక్ష ప్యాసుకానున్నాఁడు. విశ్వనాథము ననంతరాత్మజ యన్నపూర్ణ. అబ్దపంచకప్రాయ.

దానితరువాతఁ దనుజుఁడు. వాఁడుపుట్టిన మూఁడవదినమో యేడవదినమో పాలు

నఁట. అట్లని యవ్వాని కా పేరు పెట్టిరి. పెద్దకొడుకు పెండ్లిలోఁ బెద్దశాస్త్రి లయ్యెను గాని చిన్నకొడు కప్పుడే యవధాను లయిపోయెను. అయ్యా యవధానిఁ జేసిన నమ్మ రావును గావించినది. వేదశాస్త్రములు వెళ్ళఁజదివిన మాతాత యవధానిత్వ శాస్త్రిత్వ ముల కాశపడక యప్పయ్యగా నేయుండిపోయెను. ఆ పేరే యస్మ త్పితృ కనిష్ఠపితృవ్య లాత్మజుల కమర్చుకొనిరి. ఆయప్పయ్యల మనుమలయిన యప్పయ్య లవధానులు రావులు నగుట కానందమే కాని యయ్యావి యపార్థములు కాని నాఁ డంతకు మిక్కిలియానంద మందఁగలను. తలిదండ్రులు బిడ్డల నెత్తుకొని ముద్దాడునపుడు బంగారపుఁగొండయనియు నాపాలిటి వేల్పనియు నన్నేలెడి దొరయనియు వారివారి ప్రేమాతిశయముచే నెన్నియో పేరులఁ బిలుచుకొందురు. దానికేమికాని, పురుడుగూడ వెళ్ళకపూర్వమే పోయి మాదలకు నష్టసంతానుఁడైన నాయన్నకొడుకు లక్ష్మినారాయణతో నీకుఁ గొడుకు పుట్టెనని వాకొనివచ్చెనఁట. అపుత్రకుఁ డగుట వాఁ డాత్మవంశజులలో నెవరికేని మగ పిల్లఁడు కలిగినఁ బెంచుకోవలెనని యదివఱకనియున్న ననియుండుఁగాక. అయినను నంతతొందర యేల ? ఈశిశువు జాతక మెంతయు మంచిదనియుఁ గరణికముఁ జేయు ననియు మునసపుగిరిఁ జేయుననియుఁ బ్రహర్షమును బట్టలేక బాజాలులలోఁ బలుకు చుండునఁట. అల్పసంతోషముగాక యది యేమగును ? ఇట్టివాఁడగుటనే యెన్నఁడో చన్న మాయన్న బుద్ధకేతిగాఁడని పొగడియుండెను. పిన్నతనమునఁ గొన్న బిరుదు పెద్దయైకూడ సార్థకముచేయుచున్నందులకుఁ జాల విచారమయ్యెడిని. అందని ద్రాని పండ్ల కఱ్ఱులుసాచినట్లు విశ్వనాథము కొనసాగని గొంతెమకోరిక లెన్నియో పెట్టుకొను చుండును. నా మేనయల్లుఁడు మేళ్ళచెఱువు కామయ్యకుఁగూడ సంతానము లేకయుం డుటయు వానికొక పెద్దపిల్లవానినే దత్తుచేసి నాబిడ్డ నాదత్తునకు నీవే కన్యాదానము చేయుమనియు దాని నీబిడ్డఁగానే భావించుకొనుమనియు లక్ష్మినారాయణను నిర్బం ధించెనఁట. అది యట్లు జరుగలేదు. తనమేనమామ చేబియ్యము నరసింహముకుఁ దను జొఁడు మరల జనియించెను. అందువలన నాత్మజున కవ్వాని యాస్తి యాగతమగుట యాఁగిపోయెను. తమ్ముఁడు రామకృష్ణయ్యకుఁ దనయులు దక్కకునికిఁ దదీయమైన యాస్తి తన తనయులకే దక్కునని తద్దయుఁ దలంచెను. వాని కిప్పుడు పుట్టిన పట్టి వర్ధిల్లుచుండుట నదియు వ్యర్థమయ్యెను. తన కిపుడుపుట్టిన పిల్లవాఁడు లక్ష్మినారాయణ కొడుకని పదపడి పాటలుపాడుచున్నాఁడు. వీఁడీమువచ్చును, వాఁడు తీసికొన వచ్చును. ఇం దెవ్వరికి నీర్ష్య లేదుకాని ముందుముందుగనే చెప్ప కానిపోని కబురులకే కడు వింతయయ్యెడిని. మత్పితృపరంపరలో కెల్ల లక్ష్మినారాయణ ప్రవర్తన లావు మంచిది. అదియంతయు నవ్వాని చరిత్రలోనే యస్మల్లిఖితము. అందు నాయన్న రామ లింగయ్య 40 రూపాయలు నా కీయనుండెనని వాకొంటిని. అది యాలకించి తండ్రిచేసిన ఋణము తాఁదీర్చుట తగవని 40 రూపాయలు నా కిచ్చివేసెను. ఇంతకంటెను మంచి తన మేమికావలయును ? మఱియు, 3,4 గేండ్లనుండి విశ్వనాథము పెద్దకొడుకు సీతా రామశాస్త్రికి విశేషప్రేమమైఁ దనయింట నన్నముపెట్టి మేనమామచేఁ జిల్లరలు చెప్పించుచున్నాఁడు. ఇట్టిప్రేమ చూపుచుండుటచేతనే యిపుడు పుట్టిన కొడుకును విశ్వనాథము వీనికొడుకును జేసెను. మా తండ్రి పినతండ్రుల దగ్గఱనుండియే దారులు మాఱినవి. మాఱిన పినతండ్రి పరంపర మరల

విశ్వనాథము ననుజుఁడు రామకృష్ణయ్య. వానితాతయైన మాపినతండ్రి పేరు వానికిఁ బెట్టిరి. నాయన చినప్పయ్య నర్సారావుపేటలో నుంచి ఫిఫ్తుఫారము వఱకో ఫోర్తుఫారమువఱకో రామకృష్ణయ్యచేత రాజకీయవిద్యఁ జదివించెను. వీనికిని వీని యన్న విశ్వనాథమునకును నరసరావుపేటచదువే పరిణయములకు బాసటయైనది. పాలపర్తి సంజీవరావను నర్సారావుపేట డిస్ట్రిక్టు మునసబుకోర్టు క్లార్కు సుత సుబ్బమ్మ నిచ్చి వీనికి వివాహము గావించెను. తత్ప్రియత్నమో స్వప్రయత్నమో కాని రామకృష్ణయ్య ట్రైనింగు ప్యాసై సత్తెనపల్లితాలూకాలో బోర్డుస్కూలు మేష్టరుగాఁ బోయి ప్రవేశించెను. ప్రవేశమెక్కడనో యైనను బహుకాలము పనివినక మును పే జానపాటికి సమీపస్థమును స్వపౌరోహిత్యగ్రామమును నగు కోటనెమలిపురికి మార్పించుకొనియెను. తాలూకాబోర్డు మెంబరైన తద్గ్రామవాస్తవ్యుఁడు బ్రహ్మరెడ్డి గారి యాశ్రయబలమువలనఁ బాఠయితృత్వమును పౌరోహిత్యమును నుభయము నిర్వర్తించుకొనుచుఁ జిరకాల మాయూరనే జరుపఁగలిగెను. తాలూకాబోర్డులు తీసివేసిన తరువాతఁ దగిన యాశ్రయము లేమిని బల్నాడు తాలూకాలోని తుమ్మలచెఱువుకు మార్పఁబడియెను. అదియు మాయూరికి 3 క్రోసులదూరమే యగుటను నయోమార్గము కూడ నలరుటను జానపాడు కోటనెమలిపురి పనులు చక్కఁగా నవరించుకొనుచు సంవత్సరచతుష్టయము జరిపెనుగాని కడకు గాదెవారి పల్లెకుఁ ట్రాన్స్ఫరు చేయఁబడియెను. అటకరుగకుండుటకనేకధా ప్రయత్నించెనుగాని యది ఫలింపదు. అదియైనను నిఁక 2 క్రోసులే యధికమగుటఁ గష్టముమీఁదనైనను గార్యములు యథాప్రకారముగనే యగుచున్నవి. వీనికి సంతాననష్టి చాలనైనది. అది చక్కఁజేసికొనుటకై భార్యాభర్తలిరువురును బహుశ్రమలు పడిరి. కాశికిఁబోయిరి. రామేశ్వరమునకుఁ బోయిరి. భార్య మఱియుఁ బరమేశ్వరిని బరిచరించెను. జపించెను. తపించెను. శర్వాణికి సహస్రనామార్చనమే సలుపుచు వచ్చెను. తన్నామావళిని గష్టమనక కంఠస్థమే కావించెను. అది తెలివి కలది. మంచిది. చదువఁగలది. తత్తపము ఫలించెను. తనూజుఁడు కలిగెను. మూడేండ్లవాఁడయ్యెను. ముదము గూర్చుచుండెను. అఖిలగృహభారము నన్నమీఁదనే యుంచి రామకృష్ణయ్య గ్రామాంతరములనే కాలము చాల గడపుచున్నాఁడు. అంతయో యింతయో యనుజు నార్జితమే యన్నకుటుంబమునకుఁ జెందెఁగాని యన్నది యంతగా ననుజునకుఁ జెందిన ట్లగపడదు. అట్టివిషయములనే యన్నదమ్ములకు భేదభావ మంకురించినది. విభక్తులఁ గావించినది. విభక్తుఁడయియు విశ్వనాథముతో విరోధింపక రామకృష్ణయ్య ప్రేమించుచునే యున్నవాఁడు. వాని కొడుకు పెండ్లిలో 116 లర్పించినాఁడు. వాని మిత్రులే వీనిమిత్రులు. వానిశత్రువులే వీనిశత్రువులు. అవ్వానివలె నంతగా నధిక ప్రసంగి కాకపోయినను నాశయము లన్నియు నవియే. అందువలననే యన్నయరుగు నధ్వమందలి యర్హానర్హత లంతగా విచారింపక యనుసరించి నడచుచును శక్యమైనంతవఱకు సాహాయ్యముగూడ సలుపుచును విభీషణుఁ దలఁపింపక కలశకర్ణుఁ దలఁపించుచున్నవాఁడు.

చినప్పయ్య సంతానములో నవ్వాని తరువాతిది యాడుపిల్ల. దాని పేరు మహాలక్ష్మి. అది యమ్మచచ్చునాఁటి కైదేండ్లలోపలిదే. అంతచిన్నపిల్ల యనేకశ్రమలుపడి యబ్బయే యవనించెను. అతిబాల్యమననే యతనిచేఁ గృతవివాహయయ్యెను. ఎకరమో నెకరమునరయో యిచ్చెను మాగాణి. కాని దాని పతితోఁ గాఁపురముఁజేయు ప్రాయంపు టద్దు ముద్దుఁ జూచుకొను భాగ్యముమాత్రము పడయలేక పోయెను.

మఱియుఁ దద్భర్త పార్వతీశము చేతఁదండ్రిమీఁద దావావేయించి జనకస్థలపుటాస్తిగూడ సంపాదించిపెట్టిరి. తండ్రికొడుకుల కెడలు వాపిరి. ఆపార్వతీశమునకుఁ బక్షవాతము రాఁ బంచత్వమొందునను భయముచే ననుజపేర నాస్తియంతటికిని వుయిలువ్రాయించి రిజెష్టరుచేయించిరి. కాని శశిరేఖమీఁదవేసిన దావాఖర్చు లైదువందలైనవని విశ్వనాథము లక్ష్మీదేవమ్మ తనచేతికిచ్చిపోయిన 500 లరొక్కమునకు లెక్కఁజెప్పి సరిపుచ్చుటయు బావమఱఁదుల భావములు భేదించినవి. తరువాతఁ బుట్టింటియాస్తి రాఁ బట్టిపెట్టినందులకు విశ్వనాథము వీని పెరటితోఁగూడిన శరణమంతయుఁ దత్ప్రతిఫలముగాఁ దన కిమ్మనుట మొదలగు కారణములచేఁ దద్దయు విరోధము తటస్థించెను. పరికృత మారోగ్యముతప్పి యాతత్కారమైనప్పటికి నొకరినొకరాదరించుటకును నొకరియింట నొకరు భోజనమును గావించుటకును దూరమయిరి. అన్నలుమొదలైన యాత్మబంధువులపై నంతస్సునఁ బ్రేమ యున్నను మహాలక్ష్మి మగనితోపాటుగనే మనుచున్నయది కాని తదాజ్ఞ దాఁటి తాఁ బ్రవర్తించుటయు లేదు. అవ్వారి యభీష్టప్రకారమనర్థమ్ము లాచరించి యప్రతిష్ఠపా లగుటయు లేదు. రామకృష్ణయ్య పైవిషయములకు బాధ్యుఁడు గాకున్నను నన్నతోపాటంత విరోధముతోఁ జూడకున్నను ననుజాభావుకులయం దగపఱుపఁదగిన యనురాగముపట్ల మాత్ర మన్ననే యనుకరించు చున్నవాఁడు. విగతవ్రీడుఁడగు విశ్వనాథ మహాంధువుతచే సర్వజ్ఞంమన్యుఁడు సర్వశ్రేష్ఠంమన్యుఁడు నగుట కాక సంప్రాప్తప్రజయంమన్యుఁడుగూడ నగుటకే చాల విచారము కాని నిజముగానే విజయమందుచో నేను నానందమొందుదును. శ్లో॥ సర్వత్ర జయ మన్విచ్ఛేత్, పుత్రాదిచ్ఛే త్పరాజయం॥ తన్మాతులు కూఁతురు తత్తనయునకుఁ దల్లిగాక యిల్లాలైన నైనది కాని పినతండ్రి పుత్రునకుఁ బుత్రుఁడైన వీఁడు నాకును బుత్రుఁడే యగుచున్నవాఁడు. వానియందు నాకుఁ బుత్రభావమే పూర్ణముగా నున్నయది. ఈండియు ధృతరాష్ట్రునకుఁ బితయైన వేదవ్యాసులు ధార్తరాష్ట్రుల చరిత్రంబోలెఁ దథ్యము వ్రాసితినని పండితులు భావింపకపోరు. సత్యరతులు సవిమర్శదృక్కులుఁ గాక సానూయులైనచో క్షంతవ్యుఁడ.

శ్లో॥ కావ్యం కర్తు మ థాభినందితుమపి స్వప్నే ప్యసీశా అపి
ప్రాజ్ఞాః కేచన దూషయంతి కవితాం స్వచ్ఛందచారా ముహుః,
దూరాదేవ నమోనమో నమ ఇదం తేభ్యోపి, కిం కుర్మహే ?
శక్తా నైవ వయం, బలీ స యమునాభ్రాతా స్తివా నాస్తివా ?

శ్లో॥ గంగాతరంగకమనీయజటాకలాపం
గౌరీనిరంతర విభూషిత వామభాగం
నారాయణప్రియ మనంగమదాపహారం
వారాణసీపురపతిం భజ విశ్వనాథం.

శ్లో॥ నైవ వ్యాకరణజ్ఞమేవ పితరం నభ్రాతరం తార్కికం
మీమాంసానిపుణం నపుంసకమితి జ్ఞాత్వా నిరస్యాదరాత్,
దూరా త్సంకుచితేవ గచ్ఛతి పున శ్చండాలవ చ్ఛాందసం,
కావ్యాలంకరణజ్ఞ మేవ కవితా కాంతా వృణీతే స్వయం.

# అభినవసరస్వతి

| సంపుటము ౩౧ | ప్రమాది నామసంవత్సరము పుష్యమాసము | సంచిక ౧౦ |
| --- | --- | --- |


## —♦ కృతివిమర్శనము ♦—

శతకప్రబంధ హరిహరస్తోత్రరత్నాకరము—

ఇయ్యది యాయాయిగ్రంథములలోని హరిహరస్తోత్రము లొక్కచోఁ జేర్చి కూర్పఁబడిన యొకపాటి పుస్తకము. అట్లు చాగంటి రామచంద్రరావుగారిచేఁ గూర్పఁబడి రాయవరపు రామారావుగారిచే హిందూపురము శ్రీరామముద్రాక్షరశాలయందు ముద్రింపింపఁబడియెను. కాని ముద్రాక్షరశాలయందుఁ బ్రూఫ్‌రీడరులే లేమినో సంపాదక ముద్రాపయితలు శ్రద్ధతీసికొనమినో యచ్చుతప్పు లగ్గలముగా నున్నయవి. సంస్కృతాంధ్రోభయభాషాపండితులు సరిచేసికొని చదివెదరేమో కాని సామాన్యులకు శక్యముగాని స్ఖాలిత్యములు గలిగియుండుట చాల విచారకరము. ముఖపత్రముమీఁది గ్రంథనామములోనే శతకప్రబంధమని యుండుటకు మాఱుగాఁ బ్రభందమని పడుట కంటెను విచారకరమైన విషయ ముండదు. భాషాభిమానులగు సంపాదకప్రభృతులు భవిష్యత్ప్రబంధప్రచురణములయందైనను బద్ధశ్రద్ధ ప్రకటింతురుగాక. ఇందుఁజేర్పఁబడిన స్తోత్రములుమాత్ర మెంతయు నింపుగా నున్నయవి. అందుఁ గొన్ని యడుగున నవలోకింతురుగాక.

ఉ. కాయజసంహరాయ శశిఖండధరాయ నమశ్శివాయ కా
లాయ హరాయ భీషణబలాయ కపాలధరాయ దేవదే
వాయ యమాంతకాయ దృఢవజ్రపినాకత్రిశూలదండహ
స్తాయ మునీంద్రయోగివరదాయ శివాయ నమోనమో నమః.

(వీరభద్రవిజయము)

సీ. హాలాహలంబను నల్లనేరెడుపండు
మిసిమింతుఁడుగఁ గాక మ్రింగినాఁడు
పెనువ్రేలి కొనగోర బిసరుహాసను మోము
కెందమ్మి విరిఁబోలె గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని
ఎఱ్ఱచిచ్చరకంటఁ జుఱ్ఱినాఁడు
మెఱుఁగుఁగోఱలు దుల్ల మృత్యుదేవత నోరు
దట్టించి యఱకాలఁ దన్నినాఁడు

త్రిపుర దైత్యావరోధనారీవిలాస
దంతతాటంకముల క్రెగ్గు దలఁచినాఁడు
దక్షపురిసానికూఁతుల దగిలినాఁడు
విశ్వలోకకుటుంబ భీమేశ్వరుండు.

(శ్రీనాథుని భీమఖండము)

సీ. అతులసౌదామినీలతల కెంజిగిమించు
లతలమీఱెడు జటావితతివాని
అకలంకహరిణాంకశకలకోటీరంబు
దండమిన్నేటి పూదండవాని
వనజాప్తచంద్రపావకనివాసైకపా
త్రములైన విషమనేత్రములవాని
లలితకుండలిత కుండలిఫణామణిరాజి
జిగి ధరించిన గళయుగమువాని
అసదృశానందమయ సుధారసము మిసిమి
పసపులను నుద్గమించిన పసిమిచాయ
కన్నుఁ జిఱునవ్వువెన్నెల కలిమిచెలువు
చూపు ముఖచంద్రబింబంబు సొగసువాని.

(సానందోపాఖ్యానము)

ఈగ్రంథము వలయువారు తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురము పోష్టునకుఁ జేరిన గెద్దనాపల్లికరణము చాగంటి రామచంద్రరావుగారిపేర 0-8-0 ల పోష్టు-చీట్లు పంపినఁ బంపఁబడును.

---

## ——♦ మన మతము ♦——

(నాదెళ్ళ రామకృష్ణశాస్త్రిగారు, కొవ్వూరు)

యానాది యెఱుకుల బుడబుక్కల మహమ్మదీయాదు లందఱికి నొక మతమనియు... సభలనియు నుండి వాండ్రవాండ్ర విధులను సక్రమముగ నిర్వర్తించుకొనుచున్నారు. వాండ్రవాండ్ర కట్టుబాట్లకు బద్ధులై యుండుచున్నారు. మనకు మతాలున్నవి. సభలున్నవి. సంఘసంస్కర్త లున్నారు. అన్నియుఁ జక్కగానే యున్నవి. అంగడిలో నన్నియు నున్నవి, అల్లునినోట శనియున్నదన్నట్లుగఁ గార్యదీక్ష లేక పోవుటవల్లనే మన మతము నశించి పోఁబోవుచున్నది... యానాదియెఱుకలాదులను జూడుఁడు. వారి మతపుఁదీర్మానాలను జూడుఁడు. వాండ్రలో నెవ్వరైన మతమును దిరస్కరించి యేపనియైనఁ జేసినయెడల వెంటనే... పెద్దలందఱు నొకచోటఁ గూడు

టయు మతతిరస్కారిచేసిన పనినిగూర్చి చర్చించుటయు జరిగిన తరువాత వాని వెలివెట్టుటయో తాహతుకుఁ దగ్గట్టు జరిమానా వేయుటయో యిదియుఁ గాకపోయినఁ గఠినప్రాయశ్చిత్తముచేసి యింకను నెక్కువైన కట్టుదిట్టములతోఁ దిరిగి మతములోనికిఁ జేర్చుకొనుటయో మనము సామాన్యముగాఁ జూచుచునే యున్నాము. మాలమాదిగెలఁ జూడుఁడు. వాండ్రి స్పర్శ వీండ్రికు గిట్టదు, వీండ్రి స్పర్శ వాండ్రికు గిట్టదు. వారి బావిలోని నీరు వీరుముట్టరు, వీరిబావిలోని నీరు వారు ముట్టరు. వాండ్రికున్న పట్టుదలఁ జూడుఁడు. వాండ్రుచేసెడి మతప్రచారము మనముగూడఁ జేయలేమనియే తోఁచును. వాండ్రిలోఁ బీచర్సనెడివాం డుంద్రుదురు. ఆపీచర్లు ప్రతివారియింటికి వచ్చుటయు మతోన్నతినిగూర్చి నచ్చఁజెప్పుటయు. ఈవిధముగా వారు ప్రతి సం॥ము కొన్నివేలమందిని దమ మతములోనికిఁ బ్రవేశింపఁజేసికొనుచున్నారు. వారిమతములోఁ బ్రవేశించినవారి కుద్యోగాలు గవర్నమెంటు స్కాలరుషిప్పులుగూడ నిచ్చుట కలదు. వారాదివారమునాఁడు మంగళస్నాన మాచరించి...ఉతికినబట్టలను ధరించి చర్చికి వెళ్ళి భగవత్ప్రార్థన సల్పుకొనుచు నుందురు. మహమ్మదీయులను జూడుఁడు...ప్రతిమహమ్మదీయుఁడుఁ ద్రికాలములయందు వారి మతాచారప్రకార మల్లాహో, అక్బరని ప్రార్థన చేయునే. వారి మతవిధిప్రకారము వారి ధర్మశాస్త్రమైన ఖురాను సంపూర్ణమైనఁగాని మఱొకగ్రంథము నాక్షేపింపఁడు. క్రైస్తవులు సైతము వారి ధర్మశాస్త్రమైన బైబిలును ముట్టినఁగాని మఱొకగ్రంథమును ముట్టరు. మనవాం డ్రక్షరాభ్యాసమే యేబిసిడిలు చేయుట యెంతయు నీచము. చివర కెఱుకుల యానాదులు సైతము ప్రతిలక్ష్మీవారము తమ కులపుఁబెద్ద లందఱితో నొకచోట సమావేశమై తమ మతాచారముల ప్రకారము జాతరలని సల్పుచుందురు. వాండ్రికున్న మతాసక్తి కడుంగడుఁ బ్రశంసనీయము. ఈ నాఁటి మనవాండ్రను జూడుఁడు. వీండ్రను నాయనా ! మీగోత్రమేమిరా యని యడుగఁగా నాకుఁ దెలియదు, మా నాయనగారి నడిగివత్తునని పరుగెత్తును. నాయనగారి నడుగఁగా నిన్నమొన్న నుపనయనమైన నీకే జ్ఞప్తి లేకపోయిన 40 వత్సరముల్క్రింద నుపనయనమైన నాకు జ్ఞప్తియుండునాయని యనును. పైఁజెప్పిన జాతులన్నియు వారివారి మతానుసారముగఁ ద్రికాలములయందును భగవంతుని ప్రార్థనలు సల్పుకొనుచుండ మనము హీనపక్షమొకతూరియైనను ప్రార్థన సల్పుచుంటిమా? అగ్నికార్యము చేయుచుంటిమా? వైశ్వదేవము చేయుచుంటిమా? అన్నియు హుళక్కియై పోయినవి. ఇతరజాతు లన్నియు వారివారి మతవిధులను సక్రమముగ నిర్వర్తించుకొనుచున్నపుడు మన నిత్యవిధులకుఁ దిలోదకములిచ్చి యితరమతస్థుల ననుకరింపఁజూచుచున్నాము. వారు మీకిది కూడదన్నప్పటికిఁ బెడచెవిని బెట్టి వారి ప్రాపే రాజాధిరాజ ప్రాపని తలఁచుకొనుచున్నాము. వారి కాలితాఁకులే శ్రీకృష్ణుని సత్యభామ తన్నినట్లుగఁ బోల్చుకొనుచున్నాము. వారిజాత్యుద్ధరణయే మన పురోవృద్ధికి మార్గదర్శకమగునని యోచించుచున్నాము. కాని మనయీ నిష్కళంకమైన సనాతనమతము నామమాత్రావశిష్టమయియే యున్నదని యించుక యోచించకున్నాము. ఇట్లువినీతిపరులై ధర్మాధర్మవివేచనజ్ఞానశూన్యులై ప్రవర్తించుట కడుంగడు లజ్జాకరము. కనుక నోమతసంస్కర్తలారా ! జ్ఞానచక్షువును దెఱవుఁడు. వెనుకముందుల నించుక పరికింపుఁడు. సనాతన మతస్థాప

నశై దీక్షను బూని...పత్రికారాజములను ప్రోత్సహింపుఁడు. మనకు మతమే శరణ్యమను నభిప్రాయము ప్రపంచమునఁ జాటుఁడు. అప్పుడే మనము గౌరవమును నిలువఁబెట్టు కొన్నవార మగుదుము.

---

## —♦ యాదగిరి విశేషములు ♦—

శ్రీయాదగిరి లక్ష్మీనరసింహస్వామి యుత్సవము మార్గశిరశుద్ధైకాదశీశుక్రవార మారంభింపఁబడియెను. పండితపరిషత్కార్యముగూడ నాఁడే ప్రారబ్ధము. అందుఁ బ్రథమ మనుముల లక్ష్మణశాస్త్రిలుగా రుపాసనావిషయిక మంత్ర మంత్రార్థము లందఱికిం దెలియున ట్లుపన్యసించిరి.

ద్వాదశీ శనివారము పగలు గం॥ 3 లకుఁ దదధ్యక్షులును శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపండితులును నగు బ్రి॥ మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిలుగారి ప్రారంభోపన్యాసము బహుశ్రావ్యమై ప్రవిష్టసభ్యులఁ బరమానందభరితులఁ గావించినది. ఆగ్నకాలమున నఖిలమహర్షులు నొకచోఁ జేరి బ్రహ్మసత్రమను పేరఁ బ్రహ్మవిచారశీలురై యానంద మనుభవించినట్టులే ప్రతివత్సరము నేతదుత్సవాగతులగు పండితులు తమతమ విజ్ఞానము విశదీకరించుచు నజ్ఞుల విజ్ఞులఁ గావించు టవసరము. అట్టిపండితులు వేదవేదాంగవిదులై యుండిన 'జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభి ర్ఋణవా జాయతే' యను శ్రుతిరీతి దేవతలకును ఋషులకును పితరులకును బ్రాహ్మణుఁడు జన్మించుటతోనే ఋణపడియుండుటచే యజ్ఞాదు లొనర్చి దేవఋణమును బ్రహ్మచర్యమున ఋషిఋణమును సంతానము గని పితౄణమును దీర్పఁగలుగుదురనియు యజ్ఞములు ద్రవ్యతపోయోగాదిప్రయుక్తములై యనేకభేదములు కలవనియు నందు హవ్యాదిద్రవ్యసాధ్యహవనయజ్ఞమే ప్రాముఖ్య మనియుఁ దద్ద్వారమున దేవలోకదుర్భిక్షము తొలఁగి దేవతలు తృప్తులై వృష్ట్యాదులచే సుభిక్షముఁ బ్రసాదించుటే కాక సృష్టికిని యజ్ఞాదులే హేతువనియు నట్టియజ్ఞముల నాజ్యాదిహవనద్రవ్యముల విధిగా వీతిహోత్రుని ద్వారమున నమరుల కందఁజేసిననే యజ్ఞసిద్ధియగుననియు లోకసామాన్యమగు సామ్యము లుదాహరించుచు నుపన్యసించిరి. బ్రహ్మచర్యేణ ఋషిభ్య యను శ్రుతిచే ఋషిఋణము బ్రహ్మచర్యముచేఁ దీర్పఁదగిన దనియు నాబ్రహ్మచర్యముననే వేదాధ్యయన మిమిడియున్నదనియు నధీతిబోధాచరణ ప్రచారణైరను వాక్యముప్రకార మట్టి వేదవేదాంగముల నభ్యసించుట యితరులకు బోధించుట తదుక్తవిధుల నాచరించుట యొరులొనర్పఁ బ్రోత్సాహపఱచుచుఁ బ్రచార మొనర్చుట యను కృత్యములు బ్రాహ్మణున కావశ్యకములనియుఁ బ్రబోధించిరి. పుత్ర పౌత్రాది సంతానవంతుఁడై పితౄణవిముక్తుఁడగుననియు యాత్మజిజ్ఞాసగలిగి వైరాగ్యవంతుఁడై శమదమాదు లలవఱచుకొని తీర్థయాత్రాదుల సలుపుచుఁ జిత్తశుద్ధిద్వారమున స్వమతాచార్యానుమతి నతిక్రమించక ముముక్షువై ముక్తుఁడుగాఁగలఁడనియు దివ్యోపన్యాసమును ధీవికాస ముద్దీపింపఁ జేనుఁగున వివరించిరి. అపిదపఁ దర్కశాస్త్రపండితులగు శ్రీమ దుభయవేదాంతప్రవర్తక వంగిపురము నరసింహాచార్యులుగారు ముముక్షువు మోక్షాధికారస్వరూపము భగవత్స్వరూపము తత్త్వత్రయజ్ఞానము మున్నగు విషయముల శాస్త్రక్రమానుపురస్సరముగా నుపన్యసించి పండితసభ్యులఁ బరితుష్టులఁ గావించిరి.

# అభినవసరస్వతి

| సంపుటము ౩౧ | ప్రమాది నామసంవత్సరము<br>పుష్యమాసము | సంచిక ౧౦ |
|---|---|---|

## — కృతివిమర్శము —

శతకప్రబంధ హరిహరస్తోత్రరత్నాకరము—

ఇయ్యది యాయాయిగ్రంథములలోని హరిహరస్తోత్రము లొక్కచోఁ జేర్చి కూర్చఁబడిన యొకపాటి పుస్తకము. అట్లు చాగంటి రామచంద్రరావుగారిచేఁ గూర్పఁబడి రాయవరపు రామారావుగారిచే హిందూపురము శ్రీరామముద్రాక్షరశాలయందు ముద్రింపింపఁబడియెను. కాని ముద్రాక్షరశాలయందుఁ బ్రూఫ్రీడరులే లేమినో సంపాదక ముద్రాపయితలు శ్రద్ధతీసికొనమినో యచ్చుతప్పు లగ్గలముగా నున్నయవి. సంస్కృతాంధ్రోభయభాషాపండితులు సరిచేసికొని చదివెదరేమో కాని సామాన్యులకు శక్యముగాని స్ఖాలిత్యములు గలిగియుండుట చాల విచారకరము. ముఖపత్రముమీఁది గ్రంథనామములోనే శతకప్రబంధమని యుండుటకు మాఱుగాఁ బ్రభందమని పడుట కంటెను విచారకరమైన విషయ ముండదు. భాషాభిమానులగు సంపాదకప్రభృతులు భవిష్యత్ప్రబంధప్రచురణములయందైనను బద్ధశ్రద్ధ ప్రకటింతురుగాక. ఇందుఁ జేర్పఁబడిన స్తోత్రములుమాత్ర మెంతయు నింపుగా నున్నయవి. అందుఁ గొన్ని యడుగున నవలోకింతురుగాక.

ఉ. కాయజసంహరాయ శశిఖండధరాయ నమశ్శివాయ కా
లాయ హరాయ భీషణబలాయ కపాలధరాయ దేవదే
వాయ యమాంతకాయ దృఢవజ్రపినాకత్రిశూలదండహ
స్తాయ మునీంద్రయోగివరదాయ శివాయ నమోనమో నమః.
(వీరభద్రవిజయము)

సీ. హాలాహలంబను నల్లనేరెడుపండు
మిసిమింతుఁడుగఁ గాక మ్రింగినాఁడు
పెనువ్రేలి కొనగోర బిసరుహాసను మోము
కెందమ్మి విరిఁబోలె గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని
ఎట్టిచిచ్చురకంటఁ జుట్టినాఁడు
మెఱుఁగుఁగోఱలు దుల్ల మృత్యుదేవత నోరు
దట్టించి యఱకాలఁ దన్నినాఁడు

త్రిపుర దైత్యావరోధనారీవిలాస
దంతతాటంకముల కెగ్గు దలఁచినాఁడు
దక్షపురిసానికూఁతుల దగిలెనాఁడు
విశ్వలోకకుటుంబ భీమేశ్వరుండు.

(శ్రీనాథుని భీమఖండము)

సీ. అతులసౌదామినీలతల కెంజిగిమించు
లతలమీఱెడు జటావితతివాని
అకలంకహరిణాంకశకలకోటీరంబు
దండమిన్నేటి పూదండవాని
వనజాప్తచంద్రపావకనివాసైకపా
త్రములైన విషమనేత్రములవాని
లలితకుండలిత కుండలిఫణామణిరాజి
జిగి ధరించిన గళయుగమువాని
అసదృశానందమయ సుధారసము మిసిమి
పసపులను సుద్దమించిన పసిమిచాయ
కన్నుఁ జిఱునవ్వువెన్నెల కలిమి చెలువు
చూపు ముఖచంద్రబింబంబు సొగసువాని.

(సానందోపాఖ్యానము)

ఈగ్రంథము వలయువారు తూర్పుగోదావరిజిల్లా పెద్దాపురము పోష్టునకుఁ జేరిన గెద్దనాపల్లికరణము చాగంటి రామచంద్రరావుగారి పేర 0-8-0 ల పోష్టుచీట్లు పంపినఁ బంపఁబడును.

---

## మన మతము

(నాదెళ్ళ రామకృష్ణశాస్త్రిగారు, కొవ్వూరు)

యానాది యెఱుకుల బుడబుక్కల మహమ్మదీయాదు లందఱికి నొక మతమనియు...సభలనియు నుండి వాండ్రవాండ్ర విధులను సక్రమముగ నిర్వర్తించుకొనుచున్నారు. వాండ్రవాండ్ర కట్టుబాట్లకు బద్ధులై యుండుచున్నారు. మనకు మతాలున్నవి. సభలున్నవి. సంఘసంస్కర్త లున్నారు. అన్నియుఁ జక్కగానే యున్నవి. అంగడిలో నన్నియు నున్నవి, అల్లునినోట శనియున్నదన్నట్లుగఁ గార్యదీక్ష లేక పోవుటవల్లనే మన మతము నశించి పోఁబోవుచున్నది... యానాదియెఱుకలాదులను జూడుఁడు. వారి మతపుఁదీర్మానాలను జూడుఁడు. వాండ్రలో నెవరైన మతమును దిరస్కరించి యేపనినైనఁ జేసినయెడల వెంటనే...పెద్దలందఱు నొకచోటఁ గూడు

టయు మతతిరస్కారిచేసిన పనినిగూర్చి చర్చించుటయు జరిగిన తరువాత వాని వెలి పెట్టుటయో తాహతుకుఁ దగ్గట్టు జరిమానా వేయుటయో యిదియుఁ గాకపోయినఁ గఠినప్రాయశ్చిత్తముచేసి యింకను నెక్కుడైన కట్టుదిట్టములతోఁ దిరిగి మతములోనికిఁ జేర్చుకొనుటయో మనము సామాన్యముగాఁ జూచుచునే యున్నాము. మాలమాదిగెలఁ జూడుఁడు. వాండ్రి స్పర్శ వీండ్రికు గిట్టదు, వీండ్రి స్పర్శ వాండ్రికు గిట్టదు. వారి బావిలోని నీరు వీరుముట్టరు, వీరిబావిలోని నీరు వారు ముట్టరు. వాండ్రికున్న పట్టుదలఁ జూడుఁడు. వాండ్రుచేసెడి మతప్రచారము మనముగూడఁ జేయలేమనియే తోఁచును. వాండ్రిలోఁ బీచర్సనెడివాం డుండురు. ఆపీచర్లు ప్రతివారియింటికి వచ్చుటయు మతోన్నతినిగూర్చి నచ్చఁజెప్పుటయు ఈవిధముగా వారు ప్రతి సం॥ము కొన్ని వేలమందిని దమ మతములోనికిఁ బ్రవేశింపఁజేసికొనుచున్నారు. వారిమతములోఁ బ్రవేశించినవారి కుద్యోగాలు గవర్నమెంటు స్కాలరుషిప్పులుగూడ నిచ్చుట కలదు. వారాదివారమునాఁడు మంగళస్నాన మాచరించి...ఉతికినబట్టలను ధరించి చర్చికి వెళ్ళి భగవత్ప్రార్థన సల్పుకొనుచు నుందురు. మహమ్మదీయులను జూడుఁడు...ప్రతిమహమ్మదీయుఁడుఁ ద్రికాలములయందు వారి మతాచారప్రకార మల్లాహో, అక్బరని ప్రార్థన చేయునే. వారి మతవిధిప్రకారము వారి ధర్మశాస్త్రమైన ఖురాను సంపూర్ణమైనఁగాని మఱొకగ్రంథము నాక్షేపింపఁడు. క్రైస్తవులుసైతము వారి ధర్మశాస్త్రమైన బైబిలును ముట్టినఁగాని మఱొకగ్రంథమును ముట్టరు. మనవాం డ్రితరాభ్యాసమే యేబిసిడిలు చేయుట యెంతయు నీచము. చివర కెఱుకుల యానాదులు సైతము ప్రతిలక్ష్మీవారము తమ కులపుఁబెద్ద లందఱితో నొకచోట సమావేశమై తమ మతాచారముల ప్రకారము జాతరలని సల్పుచుందురు. వాండ్రికున్న మతాసక్తి కడుంగడుఁ బ్రశంసనీయము. ఈనాఁటి మనవాండ్రిను జూడుఁడు. వీండ్రను నాయనా! మీగోత్రమేమిరా యని యడుగఁగా నాకుఁ దెలియదు, మా నాయనగారి నడిగివత్తునని పరుగెత్తును. నాయనగారి నడుగఁగా నిన్నమొన్న నుపనయనమైన నీకే జ్ఞప్తి లేకపోయిన 40 వత్సరములక్రింద నుపనయనమైన నాకు జ్ఞప్తియుండునాయని యనును. పైఁజెప్పిన జాతులన్నియు వారివారి మతానుసారముగఁ ద్రికాలములయందును భగవంతుని ప్రార్థనలు సల్పుకొనుచుండ మనము హీనపక్షమొకతూరియైనను బ్రార్థన సల్పుచుంటిమా? అగ్నికార్యము చేయుచుంటిమా? వైశ్వదేవము చేయుచుంటిమా? అన్నియు హుళక్కియై పోయినవి. ఇతరజాతు లన్నియు వారివారి మతవిధులను సక్రమముగ నిర్వర్తించుకొనుచున్నపుడు మన నిత్యవిధులకుఁ దిలోదకములిచ్చి యితరమతస్థుల ననుకరింపఁజూచుచున్నాము. వారు మీకెది కూడదన్నప్పటికిఁ జెడచెవిని బెట్టి వారి ప్రాపే రాజాధిరాజ ప్రాపని తలఁచుకొనుచున్నాము. వారి కాలితాఁకులే శ్రీకృష్ణుని సత్యభామ తన్నినట్లుగఁ బోల్చుకొనుచున్నాము. వారిజాత్యుద్ధరణయే మన పురోవృద్ధికి మార్గదర్శకమగునని యోచించుచున్నాము. కాని మనయీ నిష్కళంకమైన సనాతనమతము నామమాత్రావశిష్టమయియే యున్నదని యించుక యోచింపకున్నాము. ఇట్లవినీతిపరులై ధర్మాధర్మవివేచనజ్ఞానశూన్యులై ప్రవర్తించుట కడుంగడు లజ్జాకరము. కనుక నోమతసంస్కర్తలారా! జ్ఞానచక్షువును దెఱువుఁడు. వెనుకముందుల నించుక పరికింపుఁడు. సనాతన మతస్థాప

నకై దీక్షనుబూని... పత్రికారాజములను బ్రోత్సహింపుఁడు. మనకు మతమే శరణ్యమను నభిప్రాయము ప్రపంచమునఁ జాటుఁడు. అప్పుడే మనము గౌరవమును నిలువఁబెట్టుకొన్నవార మగుదుము.

---

## —♦ యాదగిరి విశేషములు ♦—

శ్రీయాదగిరి లక్ష్మీనరసింహస్వామి యుత్సవము మార్గశిరశుద్ధైకాదశీశుక్రవార మారంభింపఁబడియెను. పండితపరిషత్కార్యముగూడ నాఁడే ప్రారబ్ధము. అందుఁ బ్రథమ మనుమూల లక్ష్మణశాస్త్రిలుగా రుపాసనావిషయిక మంత్ర మంత్రార్థము లందఱికిం దెలియున ట్లుపన్యసించిరి.

ద్వాదశీ శనివారము పగలు గం॥ 3 లకుఁ దపస్యత్తులును శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపండితులును నగు బ్రి॥ మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిలుగారి ప్రారంభోపన్యాసము బహుశ్రావ్యమై ప్రవిష్టసభ్యులఁ బరమానందభరితులఁ గావించినది. ఆర్షకాలమున నఖిలమహార్షులు నొకచోఁ జేరి బ్రహ్మసత్రమను పేరఁ బ్రహ్మవిచారశీలురై యానంద మనుభవించినట్లే ప్రతివత్సరము నేతదుత్సవాగతులగు పండితులు తమతమ విజ్ఞానము విశదీకరించుచు నజ్ఞుల విజ్ఞులఁ గావించు టవసరము. అట్టిపండితులు వేదవేదాంగవిదులై యుండిన 'జాయమానోవై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణవా జాయతే' యను శ్రుతిరీతి దేవతలకును ఋషులకును బితరులకును బ్రాహ్మణుఁడు జన్మించుటతోనే ఋణపడియుండుటచే యజ్ఞాదు లొనర్చి దేవఋణమును బ్రహ్మచర్యమున ఋషిఋణమును సంతానము గని పితౄణమును దీర్పఁగలుగుదురనియు యజ్ఞములు ద్రవ్యతపోయోగాదిప్రయుక్తములై యనేకభేదములు కలవనియు నందు హవ్యాదిద్రవ్యసాధ్యహవనయజ్ఞమే ప్రాముఖ్యమనియుఁ దద్ద్వారమున దేవలోకదుర్భిక్షము తొలఁగి దేవతలు తృప్తులై వృష్ట్యాదులచే సుభిక్షముఁ బ్రసాదించుటే కాక సృష్టికిని యజ్ఞాదులే హేతువనియు నట్టియజ్ఞముల నాజ్యాదిహవనద్రవ్యముల విధిగా వీతిహోత్రుని ద్వారమున నమరుల కందఁజేసిననే యజ్ఞసిద్ధియగుననియు లోకసామాన్యమగు సామ్యము లుదాహరించుచు నుపన్యసించిరి. బ్రహ్మచర్యేణ ఋషిభ్యయను శ్రుతిచే ఋషిఋణము బ్రహ్మచర్యముచేఁ దీర్పఁదగినదనియు నాబ్రహ్మచర్యముననే వేదాధ్యయన మిమిడియున్నదనియు నధీతిబోధాచరణప్రచారణైరను వాక్యముప్రకార మట్టి వేదవేదాంగముల నభ్యసించుట యితరులకు బోధించుట తదుక్తవిధుల నాచరించుట యొరులొనర్పఁ బ్రోత్సాహపఱచుటఁ బ్రచార మొనర్చుట యను కృత్యములు బ్రాహ్మణున కావశ్యకములనియుఁ బ్రబోధించిరి. పుత్రపౌత్రాది సంతానవంతుఁడై పితౄణవిముక్తుఁడగుననియు యాత్మజిజ్ఞాసగలిగి వైరాగ్యవంతుఁడై శమదమాదు లలవఱచుకొని తీర్థయాత్రాదుల సలుపుచుఁ జిత్తశుద్ధిద్వారమున స్వమతాచార్యానుమతి నతిక్రమించక ముముక్షువై ముక్తుఁడుగాఁగలఁడనియు దివ్యోపన్యాసమును ధీవికాస ముద్దీపింపఁ దెనుఁగున వివరించిరి. అపిదపఁ దర్కశాస్త్రపండితులగు శ్రీమ దుభయవేదాంతప్రవర్తక వంగిపురము నరసింహాచార్యులుగారు ముముక్షువు

౧౩ ఆదివారము పగలు గం. 10 సమయమున బ్ర. మోసూరి రామనాథఘనపాఠిగారు వేదస్వరోచ్చారణ శిక్షావ్యాకృతిప్రమాణపూర్వకముగా నిరూపించి పరీక్షార్థాధ్యాయులకుఁ బదక్రమముల నిరాఘాటముగఁ బఠించుటే కాక ప్రత్యక్షరోత్పత్తిస్థాన దేవతాంగుళిన్యాసాది విషయముల వివరించుచు సాహిత్యపరుని సత్కవితవలెను సంగీతవిదుని స్వరకల్పనవలెను వర్ణక్రమము కల్పించి వైదికవిద్యాప్రభావమును బ్రకటించిరి. గం. 3 ల సమయమున బ్ర. మక్కపాటి సోమసుందరసిద్ధాంతిగారిచే జ్యోతిశ్శాస్త్రోపయోగమును వారా ద్యుత్పత్తిని యోగశాస్త్రమునకు సమన్వయించుచు నుపన్యసింపఁబడినది. ౧౪ సోమవారము పగలు 10 గంటలసమయమున బ్ర. గౌరిభట్ల రామకృష్ణశాస్త్రిగారు స్వరచితములగు శ్లేషచిత్రిత మృదుమధురపద్యముల లక్ష్మీనృసింహస్థానవర్ణనము గావించి శ్రావ్యముగఁ జదివి సభ్యుల సంతుష్టుల సలుపఁగలిగిరి. 3 గంటలకు బ్ర॥ వ్యాకరణశిరోమణి వట్టెము నరసింహశాస్త్రిగారు సరళ సహజస్వభావము ప్రకటించుచుఁ బురుషార్థచతుష్టయమునఁ బ్రథమమగు ధర్మము ప్రతిమానవునకుఁ బరమానుష్ఠేయమనియు నర్థకామపురుషార్థము లనుష్ఠింప నవసరము లేకయే యలవడుననియు మోక్షము స్వవర్ణాశ్రమోచితకర్మల ననుష్ఠించి చిత్తశుద్ధినంది భక్తిజ్ఞానవైరాగ్యసోపానముల నారోహించుచోఁ బ్రాప్తించుననియు నిత్యకర్మలు స్నానసంధ్యాజపహోమదేవార్చనవైశ్వదేవములను నాఱువిధములనియుఁ దత్తదాచరణమువలన బాహ్యశుద్ధియే కాక యంతశ్శుద్ధియు నలవడుననియు సంధ్యావందనార్ఘ్యప్రదానవిధుల వేఱువేఱుగా వివరించుచు వంట చేయుట విసరుట తడుపుట యిల్లలుకుట తఱుగుట యను పంచసూనలు ప్రతిగృహస్థునకును గల్గునుగానఁ దద్దోషనివృత్తికై వైశ్వదేవ మవశ్యాచరణీయమనియు నిత్యకర్మల నీశ్వరార్పణముగ నొనర్చి నిశ్శ్రేయస్సు నందవలయుననియుఁ బ్రతిపాదించిరి. సభాధ్యక్షులగు దక్షిణామూర్తిశాస్త్రిగారు బలపఱచుచుఁ దత్కర్మానుష్ఠానములవల్ల ఫలము లేదనువారి సంశయము తొలంగునట్లు శాస్త్రమువలనను సామ్యముల వలనను నిరూపించిరి. వ్యాకరణశిరోమణి శ్రీమద్ గోవర్ధనము రామానుజాచార్యులుగారు సహజగంభీరవాక్చాతుర్యమున వైదికగ్రంథసమన్వయమునకే కాక శబ్దశాస్త్రము సర్వమునకుఁ బ్రాముఖ్యమనియు వేదాంగమగుటచే వేదమువలె విద్యార్థుల కవశ్యపఠనీయమనియు శాబ్దికజ్ఞానము లేనిచో, శ్లో॥ స్వజన శ్శ్వజనో మాభూత్సకలం శకలం సకృ చ్ఛకృచ్చైవ యనునట్లపశబ్దము లుచ్చరింపఁబడుననియు విపులముగ హేతువులఁ గనఁబఱచుచు నుపన్యసించి సభ్యులచేతను సభాధిపతులచేతను శ్లాఘింపఁ బడిరి. ౧౫ మంగళవారము పగలు శ్రీ వంగిపురము నరసింహాచార్యులుగారు దేవాలయావశ్యకతా దేవార్చామాహాత్మ్యములఁ గూర్చి యుపన్యసించుచు ననంతుని మహిమఁ దెలియ నకించనుఁడగు జీవున కశక్యమని పరవ్యూహవిభవాంతర్యామ్యర్చావతారముల స్వరూపములు సశాస్త్రీయముగ నిరూపించుచు భగవాను నిర్హేతుకమగు నపారకృప నవిశేషముగ శ్రీరాముని శరణాగతశరణ్యత నుదాహరించి యర్చావతారమున నఖిలాభీష్టముల ననుగ్రహించుటయే కాక సర్వవిధాపరాధముల క్షమించునని సభ్యుల సంతోషవార్ధి నోలలాడించిరి. దక్షిణామూర్తిశాస్త్రిగా రీవిషయములనే బలపఱచుచుఁ బ్రస్తుతమైన పరీక్ష్యముల శంకించి సమాధానరూపముగ సనాతనుల స్వధర్మనిర్వహణకై పురికొల్పి యాస్తిక

మహాజనుల యవసరకర్తవ్యమును నిరూపించిరి. ఉత్సవమునఁబట్ల నున్నతాధికారముగల బ్ర॥ సీతారామశాస్త్రిగారును మ. శ్రీ. రామదయాళుప్రభృతులగు కమిటీవారును సర్వవిధముల శ్లాఘ్యతరములగు కట్టుబాటులతో గతవత్సరోత్సవమున కేవిధమునను గళంకము కలుగకుండఁ బ్రాఙ్నిర్ణయప్రకారము ప్రాచీనపండితుల సత్కరించుటే కాక నవీనులఁగూడఁ బరీక్షింపించి పరీక్షకులు నిర్ణయించిన ప్రకారము సన్మానించి కడుం గడుఁ బ్రశంసితులైరి.

రాళ్ళబండి రాఘవశాస్త్రి,
యాదగిరిదేవస్థానసభా సహాయకార్యదర్శి.

---

## వేదపారాయణము చేయని సంస్కృతవిద్యార్థులకు అన్నమిడుట మానివేసిరి

...మధుర మీనాక్షి దేవాలయమునందు...శరన్నవరాత్రములు ... ప్రారంభించిరి. అందు వేదపారాయణ లలితాసహస్రనామ సప్తశతీ పారాయణాదులను గావించుటకే ధార్మిక బ్రాహ్మణుఁడును రాకపోయెను. ఆలోపమును దీర్చుటకై ప్రధానోద్యోగి, ఆర్ ఎస్ నాయఁడుగారచటనుండు రామేశ్వరదేవస్థాన సంస్కృతపాఠశాలా విద్యార్థులను బంపవలసినదిగాఁ బాఠశాలాధ్యక్షుల (ప్రిన్సిపాలు)ను గోరిరి. హిందూ రిలిజియస్, ఎండోమెంటుబోర్డువారి సూచనలుగూడఁ బ్రిన్సిపాలునకుఁ జేరెను. అమీఁదఁ బ్రిన్సిపాలుగారు విద్యార్థుల నందఱిని శ్రీమీనాక్షి దేవాలయమునకుఁ బోయి వేదపారాయణాదులఁ గావించిరావలసినదిగా నాజ్ఞాపించిరి. శ్రుతిస్మృతిసదాచారవిరుద్ధముగాఁ బంచములు ప్రవేశించినందున ధార్మికులచే బహిష్కరింపఁబడిన గుడిలో మేము...వేదపారాయణాదులఁ గావింపఁజాలమని వారు చెప్పిరి. విద్యార్థులు చెప్పిన సమాధానము న్యాయ్యమైనందున వారి పోషకులు సమ్మతించి మిన్నకుండిరి. అంత దేవస్థానోద్యోగులు విద్యార్థులకు 45 గురకన్నము పెట్టుట మానివేసిరి. ఆనాఁడు రాత్రి 10 గంటల వఱకుఁ బస్తుండిరి. ఈవిషయము...కే. ఆర్. వెంకటరామయ్యార్ బియేబియల్ లోనగు మహామహులు ప్రిన్సిపాలుకడకు వచ్చి విచారించి యీపాఠశాల యీదేవస్థానమునకుఁ గాని హిందూ రిలిజియస్, ఎండోమెంటుబోర్డునకుఁ గాని వారి నిర్ణయములకుఁ గాని సంబంధింపదనియు వారు చెప్పినరీతి మీరాచరించుట యన్యాయమగును గాన యథాప్రకారము బీదలగు నీవిద్యార్థుల కన్నపానీయాదులొసంగ ననుగ్రహింపవలసినదనియు ననేకవిధములఁ జెప్పిరి కాని ప్రిన్సిపాలుగారున్నగువారు వినకపోయిరి. అంత ధార్మికవరేణ్యులును దయాళువులును నగు కే, ఆర్ వెంకటరామయ్యార్ గారే తమ గృహమునం దప్పుడు వంటచేయించి విద్యార్థులకు మృష్టాన్నము పెట్టినటులఁ దెలియుచున్నది. ధర్మధ్వంసకుల దౌష్ట్యము నానాఁటికిఁ బెరిఁగిపోవుచున్నది. (దివ్యవాణి)

---

## ధర్మనిర్ణయము, పండితులే సమర్థులు

(తాడేపల్లి సత్యనారాయణశాస్త్రిగారు)

నేఁడు ధర్మము తెలియక యల్లాడువారెందఱో కలరు. అనేకములగు నుపన్యాసములు వినుటచే ధర్మమెద్దియో నిర్ణయించుకొనలేని స్థితిలోఁ జాలమంది కలరు.

ఇక్కాలపుఁ బండితులలోఁగూడ ధర్మనిర్ణయముచేయలేనివారు కనిపించుచున్నారు... మతవిషయకసందేహములఁగూర్చి ప్రశ్నించువో... సరియైన సమాధానముల స్రప్రమాణముగ సెలవిచ్చు........ వారిసంఖ్య స్వల్పమైనది. పూర్వపువారియం దుండెడి వర్చస్సు నాచారసంపత్తి యనేకశాస్త్రపరిచయము సన్నగిలఁజొచ్చినది... పూర్వికుల కుపాసనాబల ముండెడిది. అందువలన శాస్త్రమునందే కాక యెక్కుడు సమర్థులై యుండిరి. నేఁడు సాహిత్యశిరోమణి విద్వాంసులతో సరిపోవుచున్నది. రాజపోషణలేమి యిట్టిస్థితికే కారణమనవచ్చును. ఇంక ననేకములుకూడఁ గలవనవచ్చును. నేఁ డుపాధ్యాయవృత్తివలన జీవనముచేయుచున్నవారైనను మతవిషయములందుఁ బరిశ్రమ గావించుట లేదు. కొందఱుమాత్రమే మతవిషయముల నెఱింగియున్నారు. ధర్మమం దాసక్తి లేకపోవుటయని యూహింపవలసివచ్చుచున్నది. పాండిత్యమునకు భంగకరములు కాఁజాలవుకదాయని ప్రశ్నింతురేమో? పాశ్చాత్యపద్ధతులుకూడ నిక్కాలపువారిలోఁ గొందఱియందుఁ గన్పించుచున్నవి. కట్టు జుట్టు మొదలగునవి పూర్వమువలె నున్న నేమిహాని సంభవించుననియో మార్చివైచుచున్నారు. పాశ్చాత్యపద్ధతులవల్ల హాని లేకపోవచ్చును. ఏహానికలదని మనసాంప్రదాయముల వీడుట? అర్థము లేకున్నది. సంస్కృతకళాశాలలవల్లఁ గొంత యాచారసంపత్తు నశించుచున్నది. గురువులయొద్ద విద్యనభ్యసించుచున్నకాలమున విద్యార్థులకుఁ బొగత్రాగుట మొదలగు స్వేచ్ఛాప్రవర్తనము లుండుటకు వీలులేకుండెడిది. ఋజుప్రవర్తనము లేనిచో విద్య నేర్పరనెడు భీతి యుండెడిది. నేఁ డది శూన్యమగుటచేఁ జెడ్డయలవాట్లెన్నియో విద్యార్థిదశయందుఁ బుట్టి విడనాడకున్నవి. కళాశాలవిద్యార్థులలోఁ బొగత్రాగువా రనేకులు కలరు. నేఁటి యుపాధ్యాయులఁ గొందఱియం దాచారసంపత్తికూడఁ దఱుగే యనవచ్చును. గురువునందుఁగల లక్షణములు కొన్నియైనను శిష్యునకు సంక్రమించునందురు. కళాశాలలో మతధర్మముల బోధించుట కొకరిని నియమించిన విద్యార్థులు వేఱుగ శ్రమపడ నవసరములేకపోవును. కళాశాలయందు నేర్చు విద్యలోనే విమర్శనజ్ఞానమున్నదని కొందఱందురు. అట్లైచో... కళాశాలలోఁగల బల్లలయొక్కయుఁ గుర్చీలయొక్కయు మహిమమే విమర్శనజ్ఞానమునకుఁ గారణముకావలెను.

పండితులే యిట్లు సత్సాంప్రదాయముల వదలుచున్న నిదియే ధర్మమని భ్రమపడక తప్పదు. నేఁడు సంస్కృతకళాశాలలయందున్న పండితు లందఱుఁ బట్టుఁబట్టిన భవిష్యద్దశకు మహోపకారము కల్గక మానదు. ధర్మము నభివృద్ధి నొందించుటకుఁ గాని క్షీణింపఁజేయుటకుఁ గాని పండితులు కారకులు. కనుకఁ బండితమహాశయు లందఱు మనసాంప్రదాయములయం దుండి యాచారాదిసంపత్తు లభివృద్ధిచేసి యిష్టదేవతాకటాక్షమును సంపాదించి ముందువారలకు మార్గదర్శకులై సనాతనహిందూమతమును గాపాడెదరుగాక యని ప్రార్థించుచున్నాను... నేఁటి యార్యసామాజికులు గావించు ప్రచారములు కొన్ని శ్రుతిస్మృతివిరుద్ధములుగ నున్నవి. (1) వర్ణవ్యవస్థ వృత్తులవలనఁ గలిగినదనుట (౨) శ్రీకృష్ణుఁడు పరమాత్ముఁడు గాఁడనుట (౩) వేదాధికారము సర్వులకుఁ గలదనుట. ఇత్యాదులకు సమాధానము లుపన్యాసములమూలముగను బత్రికామూలముగను బ్రకటించి మతవిశ్వాసమును, ఆస్తికత్వమును గోల్పోవకుండ భారతీయులను రక్షించెదరుగాకయని కోరుచున్నాను.

---

కరీమునగరముజిల్లా, పరకాలతాలూకా వెంకటరావుపల్లె దొరవారైన
బీరవోలు రామచంద్రారెడ్డిగారి కొమార్తె

## వివాహాశీర్వచనము

మ. సిరులం జేయుచు నేలుఁగావుతను శ్రీసీమంతినీ సంగత
స్థిరవత్సుండు సమస్తభూత భువన క్షేమంకరుండైన శ్రీ
హరి వైవాహిక వేదికాస్థితిని ముత్యాల్బ్రాల దీపించు మా
"సరళా దేవి" "జనార్దనప్రభువు" లశ్రాంతంబు వర్ధిల్లఁగన్. ౧

చ. వరల సరస్వతీ రమల వైభవమున్ లలితా మహత్త్వమున్
వరుసగనుంట నామగత వర్ణములందునఁ జేర నిచ్చమై
'సరళ' యటంచుఁ బేర్పడెను సంపద సద్గుణముల్ గలట్టి మా
సరళను జేతఁబట్టి శుభసంతతి నొందు జనార్దనప్రభూ ! ౨

సీ. అల శచీదేవితో నాఖండలుని మాడ్కి
సరళతో వైభవ స్ఫురణ నెఱపు.
కలికి భారతితోడఁ గమలజన్ముఁడు వోలె
సరళతో సత్య సంగరముఁ జొనుపు.
అల లక్ష్మితోడ నబ్జాక్షుని కైవడి
సరళతో శిష్టరక్షణము సలుపు.
శైలరాట్కన్యతో శశిశేఖరుని భంగి
సరళతో నైశ్వర్య నిరతి జరుపు.
గీ. అర్క చంద్రాన్వయంబుల కధికమైన
కూచుకుళ్ళ కులంబునకున్ జనించి
తీవు, తద్గౌరవం బింక నెచ్చఁజేసి
ఆయు వారోగ్య మొందు జనార్దనేశ ! 3

చ. వరులగు కూచుకుళ్ళ కుల వార్ధి శశాంకులు బీరవోలు వా
రిరువురు వియ్యమందు టది యేరికి హర్షముఁ జేయఁబోదు ? భా
స్కర శశిరాంశు వంశముల సఖ్యము వియ్యము మున్ను జానకీ
తరుణి వివాహవేళఁ గద! తద్విధ మియ్యది శ్లాఘ్యమయ్యెడున్. ౪

చ. చతురకవిత్వ మూని కవి శాబ్దికుఁడంచుఁ బ్రసిద్ధినొంది సం
తతము నిజాంప్రభుత్వమున దాతల దేశముఖాంకు లందఱున్

గృతులుగఁజేసి వారిదగు కీర్తిని సత్సభలందుఁజాట స
మ్మతిగల నా శుభోక్తిఁ దమ మాన్యత హెచ్చు జనార్దనప్రభూ!

విద్వాన్, జయంతి భట్టాభిరామశాస్త్రి.

---

శ్రీ ర స్తు.

కం. సిరియు జనార్దన దేవుఁడు సిరి యాయు వనామయంబు చేకూర్చి సదా
సరళా జనార్దన వధూవరులను రక్షింతురుగాక వారని ప్రేమన్. 1

ఆ. వె. లలిని పార్వతియును లక్ష్మి సరస్వతుల్
హరుఁడు హరి విరించి కరుణఁ బెంచి
స్వపథ మనుసరించి సరళా జనార్దన
యుగళిఁ బరమమైత్రి నుంతురుగాత. 2

కం. అమ్మా! సరళాదేవీ! కొమ్మా నాయాశిషములు. కులమునకుం బేర్
తెమ్మా. జనార్దనునకుం గొమ్మవుగానైతి. నీకుఁ గొదవేమమ్మా? 3

సీ. రామచంద్రునివంటి భూమీశునకు నేక
పుత్రికవై రహిం బుట్టినావు.
ఖ్యాత పుల్లాంబికా గర్భంపుశుక్తికి
ముత్యంబునాఁ బేరుమోసినావు.
శ్రీజనార్దనువంటి క్షితిపతి పతిగాఁగ
ఎంతయుం బ్రేమ వరించినావు.
అందచందములలో నల రతీదేవికి
తులితగా వెలయంగఁ గలిగినావు.
సరళ మైనది నీసర్వసరణిగూడ.
అభినవసరస్వతి కదమ్మ యరయ నీవు.
మఱియు విరళించి యిద్దాని మనఁగదమ్మ.
అమ్మ ! సరళమ్మ ! నాదీవనమ్ము కొమ్మ.

సీ. సత్యశీలాదిక సద్గుణంబులపట్ల
విరళ మాసరళ యోధరణినాథ !
నిజసత్కులాచారనిరసనాకర్ణన
తరళ మాసరళ భూసురవిధేయ !
అనుపదస్వాంతసీమార్చ్య మానాపీత
గరళ మాసరళ యోకాశ్యపీశ !

స్వకులానుసరణ సత్సరణి గమించుచో
సరళ మాసరళ యోపురుషవర్య !
అట్టిసరళమ్మ నీచేతఁ బెట్టినాఁడు
రామచంద్రావనీమనోరమణుఁ డిపుడు
ఏలుకొనుమయ్య చక్క నీబాల లీల
కూచుకుళ్ళజనార్దనకువలయేశ ! 5

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

శా. శ్రీయు యశంబు నాయువు నశేషసుఖంబు లొసంగి మిమ్ము భ
ద్రాయితమూర్తి విష్టపములన్నిటియందు మరీచికారవ
న్యాయముగాఁ జెలంగు పరమాత్ముఁడు మీ యనుకొన్న రూపరే
ఖాయుతుఁడై నిరంతరముఁ గంటికి ఱెప్పవితానఁ బ్రోచుతన్. 1

ఉ. పువ్వును దావినా మెలఁగఁబోలును దంపతులన్న భావమున్
మువ్వురుమూర్తులున్ వలపుఁబూని యురోవపురర్ధజిహ్వలన్
బువ్వులబోండ్లఁ దాల్చి పరిపూర్ణముగం బ్రకటించి, రట్టిచో
నెవ్వఁడు పూను వాఁడు కృతకృత్యుఁడనంజను నోజనార్దనా ! 2

చ. సరళయటంచుఁ బేరుననె చాటుటకాదు సమస్తనీతులన్
సరళయె, తావకీనగుణసంపదయున్ రుచిరంబె యంచుఁ గొం
దఱు చెలికాండ్రు చెప్పఁగ జనార్దన ! నే వినియుంటి. మీర లి
ర్వురు భువి వాక్కు నర్థమును బోలి చరింతురుగాక నిత్యమున్. 3

తే. గీ. తల్లిదండ్రుల కల్లారుబెల్లముగను
పెరిఁగి పుట్టింట మేలనిపించుకొంటి
వమ్మ. మెట్టినయింట నీ వటులె మెలఁగి
కులసతీత్వము నిలఁబెట్టుకొనుము సరళ !

సీ. నీచిఱునవ్వువెన్నెలతేట కేవేళ
సెలవులే హద్దులై చెలఁగుచుండ
నీపల్కుజుంటితేనెలు నీమనోహరు
చెవికె యాతిథ్యముచేయుచుండ
తలవాకిలిని దాఁటవలయుట పాముప
డగమీఁద నడుగిడుటగుచునుండ
అలుక యేమిటికైన మొలచిన నయ్యది
హృదయంబునందె జీర్ణించుచుండ

తే. గీ. తల్లి ! పూసలలోపలి దారమునఁగ
మెలఁగఁజగుఁ బిన్న పెద్దలఁ గులసతీమ
తల్లియనఁ బున్నెముల కల్పవల్లియనఁగ
వరుఁడు మేలన వన్నెయు వాసి యొసవ.

గార్లపాటి రాఘవరెడ్డి.

## —♦ ప్రస్తుతపు సత్కవుల పరితాపము ♦—

ఉ. నన్నయతిక్కనాది కవినాథులు పూర్వము భారతాది వి
ద్వన్నుత గ్రంథజాలముల భాసురరీతి రచించి సర్వలో
కోన్నతి నందినారలని యూరక వ్రాయుట పిష్టపేషణం
బన్నిటికంటె నూత్నవిషయం బది యేదొ విచార్య మీరయెడన్. 1

చం. అరయ నుపాసనాబలమహత్త్వముచేఁ బ్రతిభాప్రకర్షవి
స్ఫురణము గల్గి నైకవిధసుందర కావ్యములన్ రచించు ధీ
గరిమ గలట్టి ప్రాక్కవులకంటె రసోచితరీతి నెన్నియ
క్షరముల కన్ని లక్షల నొసంగిన భోజుఁడె వంద్యుఁడౌఁగదా! 2

ఉ. కారణ మేమనంగ బహుకావ్యరసోచితశైలి నిర్మలో
దార సుధాసమాన కవితా విగళన్మకరందవాహినీ
ధారల మాధురీరుచికిఁ దన్మయుఁడౌచు యథోచితంపు స
త్కారములం గవుల్ వడిన కష్టమెఱింగిన దాతయౌట యే. 3

ఉ. అట్టి రసజ్ఞుఁడైన వసుధాధిపుఁ డిప్పుడు కంచుకాగడాల్
వెట్టి పరీక్షఁజేసినను వెత్తికినం బగుఁగాని కంటఁ గ
న్పట్టు నె? వట్టి మాట. కవిభాగ్యమ దంతటితోడఁ బోయె. ఇ
ప్పట్టున నేను సత్కృతిని వ్రాసినమాత్రము లాభమున్నదే ? 4

చం. సరసతగల్గినట్టి కవిచంద్రులుగూడ వివేకులయ్యు మ
త్సరమున లోనఁ గుంది పరసత్కవిసత్కృతి భావవైఖరీ
గరిమ నెఱుంగలేరు. కలికాల మదిట్టులు గాలుచుండె. ఎ
క్కరణి మదీయ నూత్నకృతి గౌరవమందునొ తోఁచకుండెడిన్. 5

ఉ. ఆరయ నాకుఁ బూర్వజనురార్జితపుణ్యవిశేషలబ్ధ సం
స్కారపరీమళంబుననొ కాక హయాననదైవమంత్రసం
ధారణవల్లనో బహుబుధప్రవరార్చనచేతనో మహా
ధారగలట్టి సత్కవిత దా లభియించె విచిత్రవైఖరిన్. 6

చం. కలమును బట్టుకొన్నఁ దురగాననమంత్రసదానుభావనా
బలమున వ్రాయుచుండుదును భాసురరీతి నిసర్గధోరణీ

లలితములైన పద్యములు లక్షలకొద్ది. మఱేమిలాభ మీ
కలియుగమందు ? నేఁబడిన కష్ట మెఱింగెడి దాత లుండిరే ? 7

ఉ. కాలము సూడ నిద్ది కలికాలము గావున దీని నమ్మఁగాఁ
జాలరు కాని పూర్వమున సత్కవు లందఱుఁగూడ నేమహా
కాళినొ పూజచేసి బహుళకమ్రకవిత్వము నొంది గొప్పగ్రం
థాళిని వ్రాసినారమని నమ్మినవా రిది నమ్మకుందురే ? 8

చం. అదియునుగాక పూర్వకృతు లన్నఁ బురాకవులన్న గౌరవా
స్పదములుగాఁగ నెన్నుదురు పండితపామరు లెల్లఁగూడ. అ
య్యది పరిపాటియయ్యె జగమందున. నూత్నకవిత్వమన్న స
ద్హృదయముగూడఁ గుంటువడు. దీనికి హేతువు కాలమేకదా ! 9

ఉ. కాలముగాదు, పూర్వకవికావ్యము లన్నియు గొప్ప గొప్ప భా
వాలకుఁ దావలంబులని పల్కుదురా? అది పాటిగాదు. సు
శ్రీలు సెలంగునట్టి కవిశేఖరు లెన్నటికైనఁగాని యే
మూలనొ యుందురంచు భవభూతిమహాకవి చెప్పలేదొకో ? 10

ఉ. కావున నేను జెప్పునది, కాలముచేతనె మంచి చెడ్డ సం
భావనఁజేయఁగూడ. దది పామరపద్ధతి ప్రాజ్ఞవీనవా
చావిషయజ్ఞుఁడై రసవిచారణఁ జేయఁగలట్టివాఁడె మే
ధావి. యశస్వి. సత్కవి. ప్రధానుఁడు. మిక్కిలి వందనీయుఁడున్. 11

ఉ. కాలము మాఱిపోయె. కలికాలము చూడఁగ రానురాను బా
పాలకుఁ దావలంబగుటఁ బాడయిపోయెను. దానధర్మ స
త్యాలన దాఁగుకొన్నవి. వృథాశ్రమయౌనుగదా మదీయ మీ
లీల దివానిశంబు మృదురీతిఁ గృతుల్ రచియించు టారయన్ ! 12

ఉ. రాయలు దాటిపోయె. కవిరాజుల భాగ్యపురేఖ మాయమై
పోయె. తదీయ దివ్యమహిమోన్నతిచాటెడు రాజు తిర్గి లేఁ
డాయె. కవుల్ దరిద్రులగు చాశ్రయ మెచ్చుట లేక లోన హా
హాయని కుందుటాయె కవులాటయుఁ బ్రాకృతకర్మ మేచుఁడీ. 13

ఉ. ధోరణి సంతతంబు హృది దొర్లుచునుండును. వ్రాయఁబోవ సం
సారపు బాధ లేమియును సాఁగఁగనీయవు. ఊరకున్న మం
దారమరందతుల్య కవనంబును జూచినయప్పుడెల్ల నే
నారయఁ దీర్పరాని హృదయవ్యథచేతఁ దపించుదుం జుఁడీ ! 14

చ. మునివర! రామసచ్చరితమున్ రచియించితి పూర్వభాగ మ
త్యనఘముఁ గర్మబోధకము, నవ్వలిభాగము జ్ఞానబోధకం
బును, విడువంగఁ జెల్ల దది ముక్తినిదానము, నావచేత వా
ర్ధినివలె దీన లోకము తరించును సంసృతి సంకటంబులన్. 59

చ. అని యజుఁ డానతిచ్చిచనెనంచు వచించి మహాత్మ! నాకునున్
ఘనకృపతోడఁ దెల్పుమిఁకఁ గంజదళాక్షుఁడు రామచంద్రుఁడున్
జననుతవర్తనుల్ త దనుజన్ములు, తత్పితరుల్, వసుంధరా
తనయయు, నన్యు లేగతిని దాఁటిరి సంసృతిసంకటంబులన్ ? 60

క. అనియడుగు భరద్వాజుని ఘనభక్తికి సంతసించి, కమలాసను నా
జ్ఞను మస్తకమ్మునన్ జేకొని యిటు నుడువంగఁబూనుకొంటి నృపాలా!

వ. వత్సా! మోహానిరాకరణసమర్థం బగు పరమార్థంబు నుడివెద నా
కర్ణింపుము. తొల్లి శ్రీరామచంద్రుండును భరతలక్ష్మణశత్రుఘ్ను
లును గౌసల్యాసుమిత్రలును, సీతయు, దశరథుండును, గృతాస్త్రవి
రోధు లనురామమిత్రులును, వసిష్ఠవామదేవులును, ధృష్టి, జయంత,
భాస, విజయ, విభీషణ, సుషేణ, హనుమ, దింద్రజిత్తు లనునష్ట
మంత్రులును, బోధపారంబు గాంచి రాగరహితసమచిత్తులై ప్రారబ్ధ
మాత్ర మనుభవింపుచు సంసృతిం దగులువడక జీవన్ముక్తులై మెలం
గిరి. నీవును వారల తీరున స్మార్తలౌకికకర్మంబులు నిర్వర్తించుచు
ననాసక్తుండవై చరియింతువేని సంసారసంకటంబునుండి ముక్తుఁడ
వయ్యెదవు. 62

క. ఘనసంసారాంభోనిధి మునిఁగిన నరుఁడైనఁ దత్వమున్ దెలియునెడన్
గనఁ డెట్టిశోకదైన్యము లనవరతముఁ దృప్తచిత్తుఁడై యుండుఁజుమీ.

వ. అనిన విని భరద్వాజుండు 64

క. మును జీవన్ముక్తస్థితి నినకులతిలకుండు రాముఁ డెనసినమార్గం
బును దెల్పి నన్ను సుఖిగా నొనరింపఁగదయ్య దేశికోత్తమ! యనుడున్.

వ. నే నిట్లంటి 66

ఉ. ఆకృతిలేని యాకసమునందు భ్రమంబునఁ జేసి నైల్య మా
లోకితమైనకైవడిని లోకము బ్రహ్మమునందుఁ దోఁచు భ్రాం

త్యాకలనంబుచే, నెఱుకనంది పునస్స్మృతి లేకయుండ నా
లోకము విస్మరించుచొ వెలుంగును ముక్తి యనంగ సన్మతీ! 67

తే. అమలవర్తన! దృశ్యనాశమునఁగాని
యొనయఁగారాదు తన్ముక్తి యెవరికేని
యెన్నఁడేనియుఁ, గావునఁ దన్నిమిత్త
మాత్మబోధంబు సాధింపనగును నీకు. 68

క. ఆయాత్మజ్ఞాన మిమ్మై యాయతశాస్త్రమునఁ గలుగు; నటుగావున శ్ర
ద్ధాయుక్తి దీని విన నది పాయక నీకొదవు, పొందఁబడ దితరములన్.

తే. కనుల కగపడునట్టి యాకసపు నీలి
మము విచారణచే నసత్య మగురీతి
దృశ్యముగఁ దోఁచుజగమెల్ల దీనివలన
ననఘ! మిథ్యగ ననుభవమునకు వచ్చు. 70

చ కనఁబడునట్టి దెల్లయును గల్లయటం చెఱుకన్ ఘటించి నీ
మనమునుండి దృశ్యమును మార్జనముం బొనరింప నిర్వృతిన్
గనెదవు, గాని శాస్త్రచయగర్తములం బడు దేని సౌఖ్యమున్
గనుగొనలే వొకింతయును గల్పశతంబులకైనఁ బుత్రకా! 71

వ. అశేషవాసనాపరిత్యాగంబ మోక్షంబని పెద్దలచే నుడువంబడు. అయ్యది విమలచిత్తైకలభ్యంబు. శీతసమయాపాయంబున హిమంబు రూపుమాయుతెఱంగున వాసనాక్షయంబునఁ జిత్తంబు సత్వరంబుగ నశించు. ముక్తాహారంబంతర్నివిష్ట సూక్ష్మతంతువువలన నిలచియుండురీతి భూతపంజరంబగు దేహంబు వాసనాబలంబున నిలచియుండు. అట్టివాసన శుద్ధమనియు మలినమనియు ద్వివిధంబు. అజ్ఞానరూపయు నహంకారశాలినియుఁ బునర్జన్మకారిణియు నగునది మలినవాసన నాఁబడు. వేఁచిన విత్తనంబులపగిదిఁ బునర్జన్మాంకురశూన్యమై దేహధారణైకస్థితియై తత్వజ్ఞానరూపయగునది శుద్ధవాసనయనంబడు. విజ్ఞానసంపన్నులగు జీవన్ముక్తులయం దియ్యది త్రిప్పి విడిచిన చక్రంబునందలి భ్రమణంబురీతి దేహపాతపర్యంతమాత్రవర్తిని యగుఁగాని పునర్జన్మకారిణి కాదు. శుద్ధవాసనులై

జన్మానర్థభాజనులు గాక జ్ఞాతజ్ఞేయులగు పండితోత్తములు జీవ
న్ముక్తు లనంబడుదురు. 72

క. జీవన్ముక్తిపదము ము న్నేవిధమున రామచంద్రుఁ డెలమిఁ గనియె నీ
కావిధముఁ దెల్పెదను విను మా వత్స! జరామరణభయాపహమగుటన్.

క. ఈ మంగళకరమగు శ్రీ రామకథను మెఱఁగినన్ భరద్వాజమునీ!
నీమది కెఱుఁగందగినది యేమియు మిగులంగఁబో దిఁకెన్నటికేనిన్.

## —♦ శ్రీరాముఁడు తీర్థయాత్రచేయుట ♦—

శా. రాజీవప్రతిమానలోచనుఁడు శ్రీరాముండు పిత్రాననాం
భోజాతార్కుఁడు దేశికోత్తము పదాంభోజాంతికంబందు వి
ద్యాజాలంబు సమస్తముల్ గఱచి, ధీరాగ్రేసరుండై గుణ
భ్రాజిష్ణుండయి వచ్చె గేహమునకున్ బ్రాజ్ఞాళి లక్షింపఁగన్.

వ. అంత నక్కుమార శేఖరుం డకుతోభయుండై. 76

ఉ. భ్రాతలఁగూడి యాడుచును బాడుచుఁ గేళిసరోవరంబులం
దీఁతలు వేయుచున్ మదకరీంద్రహయా ద్యధిరోహణక్రియా
చాతురిఁ జూపుచున్ నిగమశాస్త్రపురాణరహస్యచర్చలన్
బ్రీతినొనర్చుచున్ వివిధరీతులఁ గేళివిలాసలోలుఁడై. 77

వ. కాలంబుఁ గడపుచు నిజజనకుంను సకలజనరంజకుండై ధరాపాల
నంబు సేయుచుండ నొక్కనాఁడు. 78

మ. తనచిత్తంబునఁ బుణ్యతీర్థముల సందర్శింపఁగాఁ గోరికల్
జనియింపన్ బితృపాదుఁ జేరి నఖకింజల్కంబులన్ గ్రాలు త
ద్ఘనపాదాంబుజయుగ్మముం దరుణచక్రాంగంబు క్రొందమ్మిజం
టనుబోలెన్ గ్రహియించి పల్కెనిటు విన్నాణంబు దీపింపఁగన్.

మ. జనకా! పుణ్యమునీశ్వరాశ్రమములున్ సత్ క్షేత్రముల్ తీర్థముల్
వనముల్ దేవగృహంబులుం గనఁ జనన్ వాంఛింతు, నీ నాఁడు ప్రా
ర్థన కంగీకృతిఁ జూపఁగావలయు, మున్ ధాత్రిన్ నినున్ వేఁడి యే
రును వైఫల్యముఁగాంచరం చనుకుమారున్ జేఁడు మన్నించుచున్.

క ఎన్నఁడు నెద్దియు నడుగని
చిన్నికొడుకు తలఁపు వెస వసిష్ఠునితోడన్

విన్నపముచేసి కూరిమి
నన్నా! చనిరమ్మటంచు నానతియిచ్చెన్. 81

వ. అంత నొక్కశుభముహూర్తంబున. 82

మ. అనుగుందమ్ములు భూసురోత్తములు సౌహార్దంబునం బొల్చు రా
ట్తనయుల్ గొందఱు వెంబడింప నిజమాతల్ మంగళాలంకృతా
త్మునిఁ గావించి కవుంగిలించుకొని ముద్దుల్వెట్టి దీవింప బ్రా
హ్మణులున్ స్వస్త్యయనంబొనర్చుచు నమోఘాశీస్సులన్ జేయఁగన్.

సీ. సంతసంబునఁ బ్రజల్ సకలవాద్యవిశేష
శుభనినాదంబుల నభము నింప
కనుదమ్మిదల సోయగపుఁదేనె గొనురీతిఁ
బురవిలాసినులు సాదరతఁ జూడ
వలిమలపయి మంచువడువున మెయినిండ
జనపదాంగనలు లాజలను గురియ
విశతి సంప్రీతులై వివిధమంత్రంబుల
నుర్వీసురేంద్రు లాశీర్వదింప

తే. దశరథవసిష్ఠు లమితవాత్సల్య మొప్ప
శిరము మూర్కొని దీవించి సెలవొసంగ
రామచంద్రుండు జగదభిరామలీలఁ
దీర్థయాత్రకునై బయల్దేఱె నెలమి. 84

వ. ఇట్లు వెడలి, నిజకోసలమండలంబు గడచి జీర్ణారణ్యంబుల నతిక్రమించి

ఉ. స్నానములున్ జపంబులును సాధుసపర్యలు దేవతార్చనల్
ధ్యానములుం బొనర్చుచు సురాయతనంబులు పుణ్యతీర్థముల్
మౌనివరాశ్రమంబులును భూమిధరముల్ వివిధంబులౌ నర
ణ్యానులు నద్ధితీరములు సానుజుఁడై తిలకించి వేడుకన్. 86

సీ. మందాకినీవారి మజ్జనం బొనరించి
యమునా పవిత్రతోయములఁ గ్రుంకి
చంద్రభాగా పయస్స్నానంబు గావించి
యలసరస్వతి నీరమందు మునిఁగి

సీ. గజకర్ణముల కింత గల్గినఁ గల్గనీ
కలికినెమ్మదికి నిల్కడలు లేవు
కమఠ చూపున కింత గల్గినఁ గల్గనీ
కాంతనెమ్మదికి నిల్కడలు లేవు
చలదళంబుల కింత గలిగినఁ గల్గనీ
లలన నెమ్మదికి నిల్కడలు లేవు
కాఱుమించున కింత గల్గినఁ గల్గనీ
పడఁతి నెమ్మదికి నిల్కడలు లేవు
జలదముల కింత గలిగినఁ గలుగనిమ్ము
కమలనేత్రల మదికి నిల్కడలు లేవు
కావున వధూటికల యిచ్చకంబులెల్ల
విశ్వసించిన మగవాఁడు వెఱ్ఱివాఁడు. 25

క. బిసరుహనయనలు మాయా
గ్రసనల్. పఱివారి పొందు గారాదె కదా!
అసమాన మనీషాఢ్యులు
వసియింతురె యాఁడుప్రతిమ వ్రాసిన యింటన్? 26

క. కావున వివాహవిచ్యుతి గావించితి ననుచుఁ బలుకఁగా వారలయో!
దేవా! సర్వజ్ఞుఁడ విటు లీవాక్యము లాడవచ్చునే యివ్వేళన్. 27

తే. ఎంచిచూచిన నూట వెయ్యింట నొకతె
కాక సతులెల్ల జారసంగమసుఖైక
పరతఁ జెందిన వాన లేకరణిఁ గురియు?
పంట లేచందమునఁ బండుఁ బార్థివేంద్ర! 28

క. ఇలు వరుసయు మానుషమున్
కల రాజులయిండ్లఁ గన్యకలు పుట్టునెడన్
తెలిసిన వరించి మఱి వా
రల నగరికిఁ దెచ్చి పెనుపరాదా చాలన్? 29

వ. అని నిర్బంధించిన నయ్యభిమానధనుం డియ్యకొని సమన్వయమాన్యులగు రాజన్యుల కన్యాజనంబులం బ్రతీక్షించుచుం బుట్టిన యప్పుడ సూతికాగృహంబులు సొచ్చి బాలికాచతుష్టయంబుం బరిగ్రహించి నిజగేహంబునకుం దెచ్చి వియచ్చరపథావరోధి సాలనికరంబగు నంతఃపురంబున వేఱువేఱ గృహంబుల నునిచి క్రమక్రమం

బున సుమనసేనయు మంజువాణియు మణిమంజరియు మకరందయు
నను నాకంబు విడి పోషింప నొక్క దాదిం గట్టడసేసి కొంతకా
లంబునకు జవ్వనంబు నివ్వటిల్లిన నవ్వేలుపులకుం గ్రమంబున నను
దినంబునుం గామోపభోగంబులం బ్రమోదం బావహిలం జేయుచు
నప్రమత్తుండై యుండె అంత 30

క. ఆకామినులధిపతిరతి నేకట దీఱని మనోభవేషువితానం
జేకత నొందఁగఁ బరసురతాకాంక్షాయత్తచిత్తలై నెవ్వగలన్. 31

సీ. మగవారిఁ జేయక మము నాఁడువారిఁగా
నీరీతిఁ బుట్టింపనేల యనుచు
పుట్టించెబో, సాధుపురుషుతోడుతఁ గూర్ప
కీక్రూరుతోఁ గూర్పనేల యనుచు
కూర్చెబో, పరిపాటి కొంపలోఁ గూల్పక
యీదుర్గమునఁ ద్రోయనేల యనుచు
త్రోచెబో, దయఁజూచి ఖేచరత్వమొసంగ
కీ మానుషం బీయనేల యనుచు
వార లేలుఁ బవళ్ళు దుర్వారఘోర
కోపమునఁ బల్కెడు దురాపశాపములఁ బ
యోరుహాసనుఁ డేమిగాకునికి, పలుకు
టువిద తాటంకకరణ మహాత్మమహిమ. 32

తే. వార లీరీతినుండ దుర్వారచోర
గతులఁ బ్రీతిలేనివాఁ డొక్క కన్నగాఁడు
కార్యసాధకుఁడను పేరు గలుగువాఁడు.
వాఁడు తత్పురి కాళికావసతిఁ జేరి. 33

కం. ఈరాజునగరి కలిమి కు
బేరుని బొక్కసము. కన్నఁబెట్టిన ధన మ
వ్వారిగ దొరకున్. మద్గృహ
దారిద్ర్యం బపుడుగాని తలఁగదటంచున్. 34

కం. రే లెవ్వరుఁ గనకుండఁగఁ గాళీదేవిం బెకల్చి కడ నుంచి తదా
భీలస్థానము మొదలుగఁ బాలిమితో నేలమాలె త్రవ్వఁగఁ దొడఁగెన్

కం. పగలెల్లం గాళిక మె
చ్చుగ బిలముఖమున నమర్చుచున్ వాఁడొక నా

బంగరువనములలో నరపతి
నగ రంటఁగఁ ద్రివ్వఁ దెగువ నాటుకొనంగన్. 36

తే. ఇదె సొమ్ము ధనమున్న గృహమని తెంచి యచట
నిర్గమద్వార మెడలించి నెమ్మి వెడలి
దైవవశమున మదనసేనావధూటి
మొకయున్నచోట నిలిచి విభ్రాంతుఁడగుచు. 37

ఉ. పానుపుమీఁదఁ గెందలిరుబాకు వజీరుని బోహాఁవైభవ
శ్రీనిధియైన యమ్మదనసేనఁ గనుంగొని పొంగి నాకుఁ దే
కానుకఁజేసె నీనృపతికామిని నాదగు భాగ్య, మెంత సౌ
ఖ్యమ్మన నదేల దీని బిగువారెడుకౌఁగిటఁ జేరఁగల్గినన్ ? 38

వ. అని తలపోయు వాని పొలు పద్దిరపాటునఁ జూచి విస్మయం
బనుపమలీల వొట్టిన భయంబును జల్లసేయ వాని నె
ల్లను గడఁద్రోచి యీపురుషలాభము దైవము గూర్చెనంచు నిం
చిన తమి యాన నమ్మదనసేన మనోభవదూయమానయై. 39

చ. గ్రక్కునఁ గౌఁగిలించి తలఁకకావల, దెవ్వఁడవైన నేమి నా
చిక్కనిగబ్బిగుబ్బలకుఁ జిక్కితి, వెక్కడఁబోవవచ్చు, నా
అక్కఱఁదీర్పవచ్చిన లతాంతకృపాణివి నీవె, నీకు నే
దక్కితినంచుఁ బ్రేమ నిగుడం బువుపాన్పునఁ జేర్చి యచ్చటన్. 40

క. అనిరోధచుంబితాధర మనివారోర్ధ్వపర్యథఃక్రియావిష్కరణం
బనితరపూర్ణానందం బనఁదగు రతి నవ్వధూటి యతనిం గలసెన్.

తే. కలసి యిట్టు లలభ్యయోగంబు దొరకె
అనుచు వెఱఁగంది యిట కెట్టు లరుగుదెంచి ?
తెవ్వఁడవు నీవు ? నీకుఁ బేరేమి ? యనుచు
అడిగి యంతయుఁ దెలిసి నెయ్యమున నుఱయు. 42

కం. తను రాజు చెట్టఁబట్టిన
అనువుం జిరకాలకాంక్షితాన్యజనాలిం
గనతయును దెలిపి యది నేఁ
డోనఁగూడెన్ నిన్నువంటి యొఱపటికతనన్. 43

తే. రాజకులవర్యుఁ డాత్మభార్యాచతుష్క
నిలయముల వరవెంబడి నిద్రసలుపు.

ఆతఁ డిటు రానిదినములయందు వచ్చి
ఇచట సంభోగ మొసఁగి న న్నేలుకొనుము. 44

వ. అని ప్రార్థించినఁ గార్యసాధకుఁ డమందానందముం జెంది చం
దనగంధీ ! అనుబంధినై తేఁగద నీతారుణ్యవిస్ఫూర్తికై,
అనగమ్యస్థం బిది, ఇందు రా వెఱతు, ఉండన్ వచ్చుఁ గాళీనికే
తనసీమన్ దిన మీవు మత్కృతబిలద్వారంబునన్ వచ్చినన్. 45

చం. అన విని పొంగి యా మృదుతరాంగి తరంగితసంభ్రమాప్తి నా
యన వెనువెంటఁ దత్కృతబిలాధ్వగతిన్ ఘనసాధ్వసప్రదం
బనఁజను కాళికాగృహగుహాంతరభాగముఁ జేరి చీఁకటుల్
పెనఁగొనఁ దూర్పుమూల రతిలీలల జారునిఁగూడి వేడుకన్. 46

కం. బిలమార్గంబునఁ గ్రమ్మఱ
నిలయము సేరంగఁ జని ఘనీకృతమోహా
కుల మొరు లెఱుఁగనికైవడి
అల చోరుని విడక యాలతాంగి మెలంగెన్. 47

తే. మహిప ! అంతట నయ్యభిమానధనుని
రెండవ సుపాణి మరుని కూరిమిపటాణి
మంజువాణి మనోవ్యథ మగకఅపున
పడినగతి నుండఁ దత్పురప్రాంతసీమ. 48

తే. ఏటిదరి నొక్కసన్న్యాసి యింపునింపు
మఠము గావించుకొని శాస్త్రి మంత్రతంత్రి
వేదవేదాంతవిద్బ్రహ్మ వేతృగరిమ
ఇతని కెనలేదనఁగ వార్తకెక్కి వెలయు. 49

తే. త్రిషవణస్నానములు నిష్టదేవపూజ
గ్రంథపారాయణముఁ బరబ్రహ్మచింత
భైక్షభుక్తి హరీతకీభక్షణంబు
అజినశయనంబుఁ గల్గి యయ్యతి వాసంగు. 50

కం. ఆసమయంబున భృగుఁడను
భూసురుఁ డొకఁ డొక్కకార్యమునకై తమితో
ఆసన్న్యాసికి నంతే
వాసిత్వము మెఱయఁగా ధురీవంబున మెలఁగున్. 51

వివాహక్రియల రచ్చలం జెప్పి రద్దుచేయ నవ్వృత్తిపై నాఖరు కద్దాని కసహ్యత జనించెను. తండ్రికని దత్తాశిధవేయ యగుటయుc దిజ్జామాతను దవ్వులc దవీమెను. కాలము కొంత గడచెను. సదాశివయ్య సంపద సన్నగిలcజొచ్చుటయు సుబ్బమ్మ స్వీకీకను హెర్చి సుంత యోగించెను. బాల్యముc దది బాలికాపాఠశాలకుc బంపcబడియెను. బాగుగాc జదివెను. పరీక్షలు ప్యాసయ్యెను. శ్రీమద్భాగవతాది ప్రవచనములcగూడc బ్రజ్ఞ గడించెను. పండితులతో భాషింపcగలిగెను. తద్విద్వత్త్వమే తన్మాతృప్రబోధకులు మేష్టరుపనికి దరఖాస్తు పెట్టించెను. పదంపడి ప్రభుత్వము వారిచే బంతులమ్మ కావింపcబడెను. వరుసగాc బరగ్రామములకుc బంపcబడెను. ఇయ్యుద్యోగముతోనే యుత్తర మండలముల కేగెను. ఆఖరు కన్యారాష్ట్రమున కేగి యరిగెను హనుమకొండలో 60, 70, హోర్సుల జీతము తీసికొనుచు నిల్లు వాకిలి తోcట దొడ్డి యేర్పఱచుకొనెను. జనకుని చరమదశలో సంతతిసహితముగా సంరక్షించెను. అట్లు సదాశివయ్య హనుమకొండ మను నాత్మజ యంతికమునకుc జేరి జాతకలేఖనాదికము సమకూరు స్వార్జితము సహకారిగాc బుత్రపుత్రికాసహితముగం బుత్రిచేc బోషింపcబడి 90వ వయసునడి నొక పుత్రునియు మఱియు నొక పుత్రికయు నుద్వాహము లొనరించి యూర్ధ్వలోకమునకుc జనినవాcడు.

ఆయన యగ్రిమాత్మజ సుబ్బమ్మ హనుమకొండనే యుండుచున్నది. పెత్తీవాcడై విడిచియో విడువcబడియో విశేషించి వేఱుగానే విహరించినను మగcడైన సుబ్బయ్య మంచిగనో చెడ్డగనో మధ్యమధ్య మగువను గలియుట మానినవాcడు కాcడు. అది వెజ వాడలోc బిల్లలకుc జదువుcజెప్పునపుడు వచ్చి కొట్టుచుc జెట్టతనము ప్రకటించుచు వచ్చెను. అనంతరము హనుమకొండబాలికాపాఠశాలోపాధ్యాయురాలై యభివృద్ధికి వచ్చుటను నద్దానిచేతనే యాత్మానుజ లక్ష్మమ్మ పతిసుతాదిసహితముగం బరిపాల్యమానయగుటను నట కరిగి యబద్ధమో యథార్థమో మంచిని బ్రకటించుచు మనcగలిగెను. భార్యాభర్తలిరువురును బరస్పరముc గలసియున్న యక్కాలమున భగవానుc డొక పట్టిని బ్రసాదించెను. సుబ్బమ్మ సుతునకు సోమేశ్వరరావని పేరు పెట్టుకొనెను. సుమారు వాcడిపుడు (1939) షోడశవత్సరప్రాయమువాcడు. యావనాంగ్లేయవిద్యలు రెండు నవ్వానిచేc జదువcబడుచున్నవి. ప్రకృతము ప్రవేశపరీక్ష పఠించుచున్నాcడు. పితపైc బ్రేమించుచుc బితృత్వము నభిలషించుచున్నాcడు పెత్తతండ్రికి వీనిపై వ్యామోహము లేకపోcగాc బైపెచ్చు ప్రత్యక్షమునc బడనే పడcడుకదా, పరోక్షమునc బరుషములుగూడc బలుకుచుండును. అవ్వానికిని నాస్తి యంతయో యింతయో యలరుచున్నది. విభక్తసోదరులు వీనిc బోషించుమిషతో స్వాయ మనుభవించుటకు సంకల్పించియున్నారు. ఆయ్యాస్తి యాత్మజునకుc జెందింతయును నాశవెత్తిమగcడను విరాగము చే సుబ్బమ్మకు నుంతయుc గలుగలేదు. తండ్రి తన్నాత్మత్తున నుద్వాహితcగావించుటయే బహుకాలభర్తృసుఖము పడయమికిc బ్రబలకారణము గానc బడcతులకు బాల్యవివాహములు పనికిరావను భావ మద్దాని హృదయమం దారూఢమైనది. స్వయంవరములకును ప్రౌఢావివాహములకును సమ్మతి సూచించుచున్నది. అట్లు చేయకున్నను వనుజల నా ద్వాదశాబ్దము మాత్ర ముంచి యభిమతవరుల కర్పించినది. ఇయ్యది యెంతయు నిత్యారి గాకున్నను సతీపతులకు సార్వకాలికసంబంధము సంభవింపమి నంతయో యింతయో యపవాద కగ్రమయినయది.

సదాశివయ్య సంతానములో సుబ్బమ్మ తరువాతిది మహాలక్ష్మియే. అయ్యయద్దాని నవగతకంఠసూత్రిగనే 5, 6 సం॥ లుంచి యాత్మీయగ్రామబ్రాహ్మణులచే నగ్గలము దూష్యమాణుఁడై మంగళసూత్రధారణము మరలఁ జేయించెను. క్రమక్రమముగా యౌవనము వచ్చుటయు భార్యాభర్తలఁ గలిపెను. అత్తింటి కనిపెను. అదియును బాలికాపాఠశాలం బఠించినదే. వరుసగా నాచదువు వృద్ధిచేసికొనియెను. అక్కసుబ్బమ్మకంటెను నధికురాలయ్యెను. ఇంకను రాజకీయపాఠశాలల నుపయోగించు దాని చదు వైహికసాధకమే కాని భక్తి జ్ఞానవైరాగ్యములను బోధించు దీని చదు వాముష్మికసాధకము. నవనాగరకులగునన్యరాజకీయోద్యోగులవలె నది యంత పూర్వాచారపరాయణ కాదు కాని యిది వేదశాస్త్రవిదులవలె విశేషించి పూర్వాచారపరాయణ. భగవద్భక్తురాలు. భారతభాగవతాదులు పఠించుటయే కాక ప్రవచనముగూడఁ బచరించుచును ధవుఁడుగూడఁ దాదృశుఁడే యగుటఁ దత్సహితముగా సత్సేవ సల్పుచును దీర్ఘక్షేత్రములం దిరుగుచును మహాలక్ష్మి మంచిపేరు తెచ్చుకొనెను. ఆభార్యాభర్తలిరువురును ననంతవరముస్వాములవారి కాంతరంగికశిష్యులు. గుంటూరు బ్రాడీపేటలోఁ గ్రొత్తగాఁ గట్టఁబడిన స్వాములవారి మేడలోఁ బొద్దుటిపూట పురుషమధ్యమునఁ బ్రతాప హనుమచ్ఛాస్త్రిగారును ద్వియామములకు స్త్రీసమక్షమున మహాలక్ష్మియు మనోహరముగాఁ బురాణము చెప్పుచుందురు. ఇట్టి సత్ప్రవర్తనముతో నిది యిరువురు మువ్వురు బిడ్డలఁ గనియెను. అందుఁ దొలిబిడ్డ మగవాఁడు. పేరు కృష్ణమూర్తి. వాఁడు సుమారు ద్వాదశాబ్దముల ప్రాయమువాఁడు. బ్రహ్మచర్యార్హమగు భైక్షాన్నభక్షణముతోఁ గొల్లూరులో స్మార్తమంత్రములును గావ్యములును జదువుచున్నాఁడు. ఆటుతరువాతిపిల్లలాడుబిడ్డలు. పరిణయార్హప్రాయము ప్రాప్తించినది. వరనిశ్చయవిషయమున భార్యాభర్తల భావములు భేదించినవి. ఇదియిట్లుండ నిరువురుబిడ్డలలో నొకరిత పాపము పరలోకమున కరిగినది. మతిద్వైధ మొకవంకను సుతామరణ మొకవంకను సతీపతుల సంతపింపఁజేయుచున్నది. రామస్వామి యేమాత్రమో చదువుకొని శాస్త్రిశీర్షిక సంపాదించెను. వైశ్వదేవ మొనర్చెను. గుంటూరుబ్రాడీపేటలోఁ గొలఁది స్థలము సంపాదించి యొకపాటి గృహనిర్మాణముగూడ నొనరించి యందుండెను. భార్యాభర్తలు పరస్పరానుకూల్యముతోనే ప్రవర్తించుచున్నట్లు బంధువులము భావించుచుంటిమి. అట్టి వార లాత్మజను హనుమకొండలో స్కూలుఫైనలు చదువు ననుజున కిత్తమని సతియు నన్యులకిత్తమని పతియు భిన్నభావములు పెట్టుకొని పెనఁగులాడవలసెను. పతి స్వగృహమునుండి బయలుదేఱెను. ప్రక్కనుండు గరికెపాటి లక్ష్మీకాంతముగారియింటఁ బ్రవేశించెను. ఇల్లు తీసి పందిరి పెట్టినట్లు తనయిల్లు విప్పి తత్సామగ్రితో లక్ష్మీకాంతముగారి స్థలములో సూక్ష్మమైన గృహమొకటి సృష్టించెను. ఆయింత యొద్దనున్న యర్థము వ్యయమగుటయు యనమదలలోని యాత్మీయమైన పంటవలఁతి నమ్మఁజూపెను. మహాలక్ష్మి మగఁడు మతిస్వాస్థ్యములేక మైనరుసూను నాస్తి మందిపాలుచేయఁజూచుచుండెఁగాన జను లెవరును గొనఁగూడదని గెజెటులోఁ బ్రకటింపించి యతని ననునయపూర్వకముగా నాత్మవసతిఁ జేర్చెను. కాని కలసిమెలసి యుండక కాషాయవసనములు గట్టి భిక్షాన్నభోక్తయగుచుఁ బిచ్చి సుబ్బయ్య తమ్ముఁడగుటను బ్రకటించుచున్నవాఁడు. ఈశ్వరుఁ డీకుటుంబమున కెప్పటికి మంచి ప్రసాదించునో యెఱుఁగఁబడదు.

—• చతుర్థాంశ •—

చినప్పయ్యతరువాత మా పినతండ్రికి సదాశివుఁడు పుట్టెను. కాని ప్రస్తుతాని యేడాదిలోపలనో మా పినతల్లి చినవెంకమ్మ చనిపోయెను. మేనత్త పప్పు సోమయ్య భార్య సుబ్బమ్మ కాబోలు సంరక్షింపుచుండఁ గా నొంచిన నట. తరువాతఁ దండ్రియే తంటాలుపడి తన్నుఁగన్న తల్లితోపాటు తల్లియైయుండి పెంచి పెద్దచేసికొనియెను. ఈతనియుద్యోగ మొనరించెను. కాని సుపుత్రయోగ్య సేవయు సదాశివునకు సంప్రాప్తింపదు. వృద్ధమాతృఁడు. ఆయనఁగాఁగోడలును నబ్బలేదు కాఁటి యు నయము నిడియు నయ్యను నన్నులకుఁ జెప్పుచుండ కాలము సయుక్తము పట్టెను. అట్టిపట్లనే యొకమాటు నేను జినప్పయ్యతో నవుచుండు జెలిమిని బాప మాటను బహిష్కరించితిని. అట్టివాఁడయ్యు నన్ను చిన్నయప్పయ్య పెండ్లికి పెద్దయన్న వెంకటరామయ్యతోపాటు ప్రతిఘటించక తాకట్టుపత్రముపై వ్రాలుపెట్టి సహాయ మొనరించెను. పెండ్లి పేరంట్రములు లేక యిల్లే వీఁడు పెడిగిపెడిగి పిచ్చివాఁడయ్యెను. ఆత్మీయగ్రామము గృహము విడిచి యట నట నటించెను. పరపగా సన్న్యాసియుఁడే యయ్యెను. అట్లయ్యు నస్మద్గ్రామమున కరుదెంచుచుండుటయు నన్ను చిన్నప్పయ్య యెన్నియో బుద్ధులు చెప్పి యింట భద్రము చేయుచు వచ్చెను. పినతండ్రి తనయుఁడగుటఁ బ్రేమ విడలేక మంచిమార్గమునకుఁ దెత్తమని మాయన్న వెంకటప్పయ్యగూడ మఱిమఱి యత్నించెను. ఎవరెంతయత్నించినను నివ్వాఁడితరవస్త్రభిక్ష సేవగించక చరించి చరించి జాడలేకుండఁ జనియెను. రమారమి వింశతివత్సరముల ప్రాయముననే వీనిచరిత్ర ముగిసెను. విస్మరింపఁబడియెను.

—• మాతులుఁడు (మేనమామ) •—

ఆ. గౌరిపెద్దివంశకలశాబ్ధికిం జంద్రమామ నాదు మేనమామ. మఱియు
అప్పయాభిధానుఁ డల్ల భరద్వాజమానిగోత్రపద్మభానుఁ డతఁడు.

పరంపరాగతమగు నరసరావుపేటతాలూకాలోని నకరకల్లే నా మేనమామ ధామము. ఈయన పరంపరాగతమగు పౌరోహిత్య మున్నను వ్రాఁతపూఁతలలోనే చేతనైనంత పాటుపడి జీవితము గడపెనఁట. పౌరోహిత్యము తండ్రి పట్టాభిరామయ్యయుఁ దదనంతరము తనయులును నోసరించుచు వచ్చిరఁట. ఏసందర్భములోనో సమయమునకు వారు లేక వేనియింటికార్యమునకో తానే పోవలసిరాఁ దత్స్థలప్రాప్త తండులాదికము మూటగట్టుటయే తెలియమిని స్వగృహమునకుఁ జేరులోపలనే ముడియూడిపోయి పుడమిపై నవి పడిపోయెనఁట. అన్యవ్యవహారము లంతగా లేని యక్కాలమునం దప్పులిచ్చువారి పత్రము లన్నియు నకరకంట నాయననే వ్రాయుచు యశమార్జించెనఁట. ఇట్లని మాయమ్మ యీయనచరిత్ర చెప్పుచుండెడిది. అస్మత్ప్రంచవర్షప్రాయముననే యీయన యమరపురి కరుగుటచే నంతకెక్కువ యవిదితము. ఆయన రాజమ్మయను నామెను బ్రథమము పెండ్లాడెనఁట. ఆయమ యెవరియింటిదియో యెవరిబిడ్డయో యెఱుఁగను. ఆకె సంతతిపడయక మునుపే స్వర్గతయగుటయు మా మేనమామ మరల మా మేనయత్త పుల్లమ్మను బెండ్లాడెను. ఆమె కక్కడిపేరో యిక్కడిపేరో జానకమ్మయనికూడ జనులు వాడుచుండిరి. ఆభార్యయందే యాత్మజుల మువ్వురను నాత్మజల ముగురను నాయన కనియెను. అందుఁ బెదయగు [illegible] మా యక్క పెనిమిటి.

సదాశివయ్య తరువాతివాఁడు. ఈయన లౌకికవైదికముల రెంటను నేకాలఁగూడ ప్రవేశము కలవాఁడు. జాతకముహూర్తభాగములు చదివి జాతకములు వ్రాయుటయందును ముహూర్తములు పెట్టుటకును సమర్థుఁడై యుండెను. మా పెద్దయన్న యాంజనేయులును నీయనయు జ్యోతిశ్శాస్త్ర మొకచోటనే చదివియుండిరఁట. నకరకంటి వైశ్యగృహములలోని సకల శుభాశుభకార్యములును జాలకాల మీయన చేయించి సన్నుతి గన్నవాఁడు. లైసెన్సుగుమాస్తాగానుండి లౌకికమునఁగూడ లబ్ధప్రతిష్ఠుఁడైనవాఁడు. ఆత్మజను బదులిచ్చి యన్న కోటయ్యయే యీయనకు వివాహము విధించెను. వివాహిత నర్సారావుపేట తాలూకా బల్లికురవగ్రామనివాసి యనుపకుతికె వెంకటభట్ల తనూజ మహాలక్ష్మి. అది కొంతకాలము కాంతుతోఁ గాఁపురముచేసి తనయ నొక్కరితమాత్రము కని తనువు విడిచెను. ఆ తనయ పేరు సుబ్బమ్మ. దానినే బదులిచ్చి తండ్రి మరల వివాహము చేసికొనియెను. చేసికొనినఁ జేసికొనియెఁ గాని యవ్వివాహాతురతచే "పితా పుత్రం" అను పెద్దల వాక్యము ననుసరించి చదువుసంధ్యలు గలవానికిఁ గాకున్నను సర్వసామాన్యనకైనను నీయక యున్మత్తున కొసంగెను. అతని నివాసము గుంటూరుతాలూకాలోని యనమదల. పేరు దెందుకూరు సుబ్బయ్య. బట్టయూడఁదీసికొని పరుగులెత్తువంత యున్మత్తుఁడు గాకున్నను బనికిమాలినవాఁడు. ధనమును భద్రపఱచుకొనలేనంత పనికిమాలినవాఁడు గాకున్నను వదరుబోతు. అట్టివాని కాత్మజ నిచ్చి యతని యనుజ లక్ష్మమ్మ నర్ధాంగి నాచరింపకొనియెను. అది యౌవనవతి యైన యనంతర మంత తెలివికలది కాదని కలిసిమెలసి వర్తింపకయే కాలము గడపెను. అది యత్యంతము ననుచితమని యగపడినప్పు డెల్ల నే ననఁజొచ్చితిని. ఏమేమియో బోధించితిని. బోధింప బోధింప బుద్ధి మరల్చుకొని కాంత లక్ష్మమ్మతోఁ గాఁపురముచేసెను. అది యీకాలపు టింతి గాదని యెక్కువ మక్కువఁ జూపకున్నను దాంపత్యధర్మము తప్పక నడపెను. అది యనూయికురాలే కాని యాఁడుది యాచరింపనగు పాకము మున్నగు పనిపాటలు పచరింపఁగలిగినదే. భోగము మెఱుఁగులు పోనరించుకొనకున్నను గుల స్త్రీగుణములకుఁ గొదవలేనిదే. ఇట్టిదానితో నీయన 20, 30 ఏండ్లు కాఁపురముచేసి యెద్దురు బిడ్డల నెనయఁగలిగెను. లైసెన్సుగుమాస్తాపనిచేసియుఁ బౌరోహిత్యము పచరించియు బహుకాలము భార్యాపుత్రులఁ బరిరక్షించుచు నకరకంటనే సుఖముండెను. ఈయన యీభార్యవలనఁ గన్న సంతతిలో మహాలక్ష్మి పెద్దది. దానిని దల్లి యాంతరంగికాంగీకారముతో మేనమామ దెందుకూరు రామస్వామి తండ్రికిఁ దెలియకుండ నెత్తుకొనిపోయి తాఁ బెండ్లాడెను. ఉడిగిన నిచ్చుట కంగీకరింపమిఁ గాఁబోలు నట్లుజరిగెను. ప్రథమమునఁ బరిణయాతురుఁడై దెందుకూరివారి పిల్లను దెచ్చుకొనినను బిమ్మటఁ దత్కుటుంబ మంతయుఁ బిచ్చిదనియే సదాశివయ్యయభిప్రాయము. అందువలననే యంగీకరింపకపోవచ్చును. అట్లువారు చౌర్యమున స్వతనూజఁ గొనిపోయి పెండ్లాడుటయు సదాశివయ్య తదనంతరమున సుత మెడలోని సూత్రముం ద్రెంపివేసెను. వ్యాజ్యములలో దిగెను. ఆవ్యాజ్యములతోనే యాఖరు కాస్తిని గోల్పోయెను. అత్తరుణముననే పెత్తనముగూడ వచ్చుటయు భార్యాపుత్రుల పోషణము భరమయ్యెను. అగ్రతనుజాతయగు సుబ్బమ్మ యండకుఁ జేరెను. దానిని దారుణ్యము వచ్చుటతోడనే తండ్రి ధవునితోఁ గలపినను దాంపత్యధర్మము తక్కువయ్యెను. వీఁడు వెఱ్ఱివాఁడు. అది యాందచందములుగల యభినవ యువతి. ఇట్టిదంపతుల కిఁక నెట్లుపొసఁగెడిని?

## కృతివిమర్శము

భిషఙ్మణి - ఇది యొక యనుభవవైద్యశాస్త్రము. తాత్పర్యసహితాంధ్ర పద్యమయము. గుంటూరుజిల్లా గురిజాల గ్రామవాస్తవ్యుఁడును దండకపంచకారణ్యాపర్యటన సైంధవపరాభవనాటకాది గ్రంథకర్తయుఁ జతుర్విధకవితాభిషజుఁడును నగు భిషఙ్మణి పిన్నెలి నరసింహముగారిచే రచింపఁబడినది. 1933, వెల రు 3-0-0. ఇందు రోగోత్పత్తి స్ఫోటకరోగలక్షణాసాధ్యాలబ్ధప్రతినిధిపదార్థాది సప్తచత్వారింశదుత్తరత్రిశత (347) విషయములనుగూర్చి వివరముగా వ్రాయఁబడినది. పూర్ణచంద్రోదయము సిద్ధమకరధ్వజము మొదలైన ఘనౌషధములు చేయు విధమును వానివలనఁగలుగు గుణములును మాత్రభస్మములు చేయు పద్ధతిని వానివలనఁగుదురు రోగములును సులభశైలిలోఁ జక్కని పద్యములను వైద్యవిషయమగుట నింకను సులభముగాఁ దెలియుటకుఁ దాత్పర్యమును వ్రాసిరి. గ్రంథకర్త వైద్యభాగమున లోకమున కెక్కుడుపకారము గావించెనని మా యభిప్రాయము.

ఆశీర్వచనపద్యరత్నమాల — ఇది గద్వాలరాణిగారికి ధాత్రీమాఘమాసములో సమర్పించినది. ఏతద్గ్రంథకర్తయుఁ బిన్నెలి నరసింహముగారే.

ఇందీకవి చాల శ్రమపడి ద్విపద మత్తేభవిక్రీడితాటవెలఁది తేటగీతి ద్విగుణ సంయుక్తకందగర్భితసీసపద్యాది రచనరూపమునఁ జతుర్విధకవితను సముపయోగించెను. మచ్చున కిందలి శ్రీ సీతారామభూపాలునిగూర్చిన పద్యము దిగువఁ దిలకింతురుగాక. ఈపద్య మీకవి రాజుగారిప్రతికృతి తీసి యాకాకితమున లిఖించెను.

సీ. ఆత్మతృప్తిగ వివాహము మహీరాజ్యంబు
వరియించికొనిన ధ్రువవ్రతుండు
సంతాన మెఱుఁగని సామ్రాజ్యమున దివ్య
కన్యకాద్వయమును గన్నతండ్రి,
ధారేశువలె దానధారేశుఁడై కీర్తి
వెలయఁజేసిన జగద్విఖ్యాతుండు
ఘన నిజాంప్రభు కృప గల్గి ప్రజానురం
జనము గావించిన వినయధనుఁడు
అఖిల సామ్రాజ్యమును నిజార్థాంగి కొసఁగి
వేడుకను జూడఁ దనువును విడిచి స్వర్గ
సుఖములను జూరఁగొన్నట్టిసారమూర్తి
గద్దువాల సీతారామఘనయశుండు.

**కుమతిశతకము** - గ్రంథకర్త గాళ్ళభండి రాజయ్యగారు. చింతిరాల. నిజాం రాష్ట్రము. 1938. ఈకుమతిశతకము సుమతిశతకమునకు బదులుగా వ్రాయఁబడినది

గలరని పద్యద్వయము క్రిందఁ బ్రకటీకరిష్యమాణము.

కం. పడుచులను జూచి కోరకు,
చెడుమాటల నెప్పుడేన్ వచింపకు, మింటన్
పడియుండుము, ధరలో నె
క్కుడుకీర్తి నీకు సతముఁ గూడుర కుమతీ !

కం. అప్పిచ్చువారియెడ నీ వెప్పటికిని దప్పువెదకి యేమాత్రంబున్
ముప్పుగలిగింపఁబోకుము, త్రిప్పులువెట్టకుముఋణముతీర్పుము కుమతీ!

మకుటము సుమతికి బదులు కుమతియని యున్నను నిదియు నీతిబోధకమే. ధారగూడ బాగుగనే యున్నది.

నీలకంఠేశ్వరశతకము — ఏతద్గ్రంథకర్తయు రాళ్ళభండి రాజయ్యగారే.

శా. శ్రీలక్ష్మీపతి వాఙ్మనోహరుఁడు గౌరీకాంత యింద్రాదులున్
భూలోకంబున సంస్తుతింపఁగ ఋషుల్ పూజింపఁ బ్రఖ్యాతిగన్
వాలాయంబుగఁ జింతిరేలనగరిన్ వర్ధిల్లితో భక్తరా
ట్పాలా! భూధరఖేల! చంద్రధర! దేవా! నీలకంఠేశ్వరా !

అనియిట్లు చింతిరాలగ్రామస్థితుఁడగు శివు సంబోధించి శతకమంతయు వ్రాయఁబడినది.

శా. ఛందశ్శాస్త్ర మెఱుంగ, నా కితరశాస్త్రజ్ఞానమా సున్న, నీ
యందొప్పారిన భక్తిచే శతక ముద్యత్ప్రీతితో వ్రాసెదన్,
సందేహంబులు గల్గుచో సవరణల్ సల్పన్ నుతింతున్ సుధీ
బృందంబున్, దయఁ బ్రోవవే ననుఁ గపర్దీ ! నీలకంఠేశ్వరా !

అనుపద్యమునఁ గవి స్వాహంభావనిరాసమును జాటి స్వసద్భావమును బ్రశంసనీయముఁజేసికొనెనాఁడే కాని పద్యములు హృద్యములై ప్రౌఢములుగానే యున్నవి. పురాతనప్రతిష్ఠితమైనను నీనీలకంఠేశ్వరలింగము నడుమ నైవేద్యదీపారాధనములు లేక ఖిల్లమైన నిలయమున శిలగం బడియుండుటచే రాజయ్యగారు రచితపునరాలయనిర్మాణప్రతిష్ఠాపురస్సరంబుగా స్వచరిత్ర సక్కవిగేయము సల్పియున్నవారు. స్వామికిఁ గల భూమిని సర్కారువారు జప్తుఁజేయఁగా సాధింపఁ బోరాడుచు నిత్యనైవేద్యదీపారాధనలు నిర్వర్తింపఁజేయుచున్నారు. అట్టి యవ్యాజభక్తి యానీలకంఠేశ్వరుపై నలరారుటచేతనే యాత్మజుఁ డధికామయగ్రస్తుఁడై యౌషధసేవచే నారోగ్యము వడయలేక యలమటగలిగించునవసరమునఁ బరమేశ్వరు నీపద్యశతకమునఁ బరితుష్టుఁజేసి ప్రాప్తమనోరథుఁడు కానయ్యెను. ఆయాయంశము లన్నియు దిగువపద్యములవలనఁ దెలియనయ్యెడిని.

మ. వినుతింపందగు నీదునామమున నుర్విన్ సంభవంబైన నా
తనయుం డెంతయు బాధకంబయిన మూత్రవ్యాధితో నుండ నా
వనటం గుందుచు భక్తి నీశతకమున్ వ్రాయంగ లో నెంచితిన్
నను రక్షించెదవన్నకోర్కి ధృతచంద్రా ! నీలకంఠేశ్వరా !

మ. ఖిలమైపోయిన శావకాలయము భక్తిన్ బాగుచేయించి యా
నలసంవత్సరమందు నిన్ను మరలన్ స్థాపించి నిత్యంబు ని
ర్మలచిత్తంబునఁ గొల్చుచుంటిని వలంపన్ నిత్యనైవేద్యమున్
తొలగంజేయక శ్రద్ధతో; సుజనబంధూ! నీలకంఠేశ్వరా!

శా. ఏకాలంబునఁగట్టిరో గుడిని నిన్నేనాఁడు స్థాపించిరో
ఏకాలంబున నీకు మాన్యమిడిరో యేలాటిపుణ్యాత్ములో
ఈకాలంబున కీర్తులయ్యె. ఇటుపై నేలాగుగానుండునో?
ఆకర్తృత్వము నాకొసంగితివి దేవా! నీలకంఠేశ్వరా!

శా. నీమాన్యంబులు పేరిలోఁ గలయఁగా నే నెంతయత్నించినన్
స్వామీ! నీదయ రానికారణమునన్ సర్కారువా రేచి యా
భూముల్ వేలమువేసినన్ విడువకే పోరాడుచున్నాఁడ. నీ
వేమాడ్కిం దగ నిల్పుకొందువో కృపాబ్ధీ! నీలకంఠేశ్వరా!

మ. ఎఱుఁగన్ యాచన. నీపాలంబునకు నీ క్తైనెట్లో జీతంబులో
పరిపూర్ణం బ్రతివత్సరంబు మొదలే, సాంగంబుగాఁ గాంచుచో
దరియున్ డొంకయుఁ గానరాదుకద! నీధైర్యం బదేదో కృపన్
పరిపాలింపుము నీదుమాన్యముల దేవా! నీలకంఠేశ్వరా!

ఈయన చింతిరాలకుఁ బోలీసుపటేలు. అందునసే జీతమని యుదాహరించెను. ఈ శతకస్తుతినుండి యీయన కుమారుఁడు నీలకంఠేశ్వరుఁడు సారోగ్యుఁడై యిప్పు డేక్యై చదువుచున్నాఁడు.

## —— శ్రీ శ్రీ మదనగోపాలస్వామి - జటప్రోలు ——

సీ. భవదాలయేక్షణభాగ్యంబుకతన నా
యక్షులు సాఫల్య మందనయ్యె
భవదాలయద్వారభాజ్మంగళారావ
మస్మచ్ఛ్రవోమల మపహరించె
భవదీయవిగ్రహపరిసరాగమనంబు
మత్పాదయుగి కొల మాయఁజేసె
భవదీయ పదయుగ ప్రణతి మత్కాయ మం
తయును పావిత్ర్యంబు దాల్పనయ్యె

గీ. సురభివంశీయరాజన్యవిరచితోరు
భవన! జటప్రోలు మదనగోపాలదేవ!
మితరిసంపత్కుమారనిమిత్త మత్కృ
తైత దాగమనప్రాప్త మీసుకృతము.

కం. ఏతదతఃప్రాక్తనసుకృతశ్రీతోపాటుగను సురభి శ్రీరత్నాంబా
మాతయు నేతద్వేళకె యేతెంచెను, నాసుభాగ్య మేమనవచ్చున్?

సీ. స్థానమా సురభివంశజ సన్నృపాలుర
రమణీయమగు పూర్వరాజధాని
కాలమా శ్రీధర్మ కల్పవల్లీచిహ్న
రాణి రత్నాంబయు రానయినది
దేవుండా నిజభక్త భావానుగుణ పూర్ణ
ఫలదుండౌ మదనగోపాలమూర్తి
మిత్రకుమారుండా మేదినీశ నియుక్తి
సత్రిత్య దేవాలయాధికారి

గీ. దాన నిప్పు డీ దేవతాదర్శనంబు
ఘనతరాముష్మికప్రాప్తికారణంబె
కాక యైహికభాగ్యపుం గారణంబు
నయ్యెనని పొంగుచున్నాఁడ నాత్మ నేను.

---

## —• గద్వాల సంస్థానము •—

ఈ సంస్థానము 800 సం॥ లకుఁ బూర్వము నిర్మింపఁబడినది. దీని పరిమాణము 808 చదరపు మైళ్ళు. ఇది ఓరుగల్లు ... విజయనగరము విజాపురము గోల్కొండ మహారాష్ట్రరాజులకు సామంతసంస్థానముగా నుండి 200 సం॥ లకుఁ బూర్వ మాసఫ్ జా స్వతంత్రుఁడైన పిదప హైదరాబాదు రాజ్యమునకు లోఁబడియెను ... ఈసంస్థానమువారు నిజామునకుఁ గప్పమిచ్చుట తక్కఁ దక్కిన వ్యవహారములలో స్వతంత్రులు. సివిల్ క్రిమినలధికారములుగూడ వీరికిఁ గలవు. ఈసంస్థానాధిపతులు రెడ్లు. పాకనాటిశాఖీయులు. సంస్థానాధీశులగు ... సీతారామభూపాల ... వారు 1924 ... తమ 36 వ యేట నకాలమృత్యువువాతఁబడి పాలితులనే కాక యాంధ్రలోకము నంతటిని దుఃఖవార్ధిని ముంచిరి ... మహారాజాగారికిఁ బురుషసంతతి లేదు. ఇరువురు పుత్రికలు. శ్రీ వరలక్ష్మీదేవి శ్రీలక్ష్మీదేవి యనువారలు (అందు వరలక్ష్మీదేవికుమారులే వర్తమానప్రభువులు. కాని మైనరు) రాణీ యాదిలక్ష్మీదేవి విద్యావతి, వివేకవతి ... సంస్థానాధీశుల ప్రజానురాగముఁ బండితసన్మానముఁ గవిపోషణము గాయకాదరణము లలితకళల ప్రోత్సాహము లోకవిఖ్యాతి నందియున్నవి ... ఈసువాసన విస్తరించుచున్నదన్న నతిశయోక్తి కాదు ... శ్రీ గద్వాల చెన్నకేశవస్వామివారి కరుణాకటాక్షవీక్షణంబులవలన నీసంస్థానము నవీనోన్నతిని బడసి ప్రకాశించును గాక.

(రెడ్డిరాణి)

## ——♦ సనాతనధర్మవిజయధ్వజము ♦——

(శ్రీ ప. వ. తోతాద్రి మఠాధీశ్వరుల సంస్కృతోపన్యాసము.)

అనువాదకుఁడు:— సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి.

సరసులారా! చూడుఁడు! పలువురు గోవునువలెఁ గుక్కనుగూడఁ బ్రేమతోఁ బోషించుచున్నారు. (ఇంతియగాదు) కుక్కయం దత్యధికప్రేమను వహించుచుండు వనుగూడఁ జాలచోట్లఁ జూచుచున్నాము. ఇంతమాత్రమున ధేనుశ్వానముల యుపయోగ పద్ధతినిగూడ స్వేచ్ఛమెయి మార్పఁజాలుదురా? ఏమాశ్చర్యము! కుక్కకుఁ బ్రదక్షిణ మొనర్తురా? దానిక్షీరములఁ గ్రోలుదురా? దానిపురీషాదికమును బవిత్రముగఁ దలంతురా? ఎవఁడుగూడఁ గుక్కకు గడ్డివేయఁడు; ఆవుకుఁ గుక్కయాహారము నీయఁడు. తా మధిష్ఠించు మోటారు మొదలగు శకటములలో నున్నతస్థానమం దుంచఁబడినను శునకముల శాస్త్రీయ సంస్కారములయం దుపయోగించుట లేదు గదా!

ఆయావస్తువుల నుపయోగించువిధానము నియతస్వభావముగలదిగా నుండఁ వగును. ప్రేమనుదెల్పుపద్ధతియున్న నది వేఱు. చిరంతనములగు ధర్మముల నశింపఁజేసి ప్రేమను బ్రకాశింపఁజేయు ప్రయత్నమనేకానర్థములకుఁ గారణ మగును. "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" "స్వేస్వేకర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః" అని గీతాచార్యుఁ డనుగ్రహించిన శాసనము సర్వులకును శిరోభూషణముగాఁజేసికొనఁ దగినది.

భగవదాజ్ఞా రూపములగు శ్రుతిస్మృతులలోని మార్గముల నుల్లంఘించుట గొప్ప యుపద్రవములకు హేతువగునని యనుభవజ్ఞులు వాకొందురు. "శ్రుతిస్స్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే । ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోఽపి నసంశయః" అని యాభగవానుఁడే స్వయముగఁ జెప్పినాఁడుగదా! లౌకికదృష్టితోఁగూడ సహృదయు లిద్దానిని విచారింతురుగాక. రాజకీయాధికారమును నిర్వహించుటకు గ్రామసేవకుఁడు మొదలు న్యాయాధికారి వఱకు నుచ్చనీచస్థానభేదముచేత ననేకపురుషు లాయాస్థానములయందు నియమింపఁబడుచున్నారు. వారందఱు మనుష్యభావముచే సమానులయ్యు యోగ్యతనుబట్టి యుద్యోగములందు భేదము గల్గియేయున్నారు. ఇయ్యది ప్రత్యక్షసిద్ధమే. ఇట్టిస్థితిలో దయను వెల్లడింపఁదలఁచు పెద్దలు గ్రామసేవకునకు న్యాయాధిపతి యుద్యోగము నిప్పింపఁగోరుదురా? అందుకు సమర్థులగుదురా? సర్వత్ర సమదృష్టి యవసరమని ఘోషించెడి పెద్దలు మొదట గ్రామసేవకుని (వెట్టివాని) న్యాయాధిపతిపదమునం దభిషేకింతురుగాక!

"క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు" ఏతద్వచనానుసారము భగవానునిచేతనే (సకారణముగ) నీచయోనులఁ బుట్టింపఁబడినవారి కున్నతి చేకూర్పఁ బ్రయత్నించుట కుక్కతోకకున్న వక్రతను సరిఁజేయ ప్రయత్నించుటవంటిదే యని నిశ్చయింపఁదగినది.

"శిరస్సు కిరీటమును ధరించుట పాదములు పర్యటనక్లేశ మనుభవించుట" యనునియమమేల? ఇఁకనుండి శిరస్సు పర్యటన ఖేదమును పాదములు కిరీటధారణానందము ననుభవించుఁగాక" యని విపర్యాసముఁజేయుటకుఁగూడ నిపుణులైజనులు ప్రయ

శ్రీపాణనూరి నంబాడువాన్ నందనార్ ప్రభృతిప్రాచీన భక్తశిరోమణుల యొక్క చరిత్రల విచారించినను సందత్యాచార మిసుమంతయును గానరాదు. వారు మనస్సునందు సైతము స్వజాతినియమముల నుల్లంఘించియుండలేదు. వారు నిజవర్ణోచిత పద్ధతియందుండియే నిరుపమానమగు భక్తిసంపదను వెల్లడించిరి.

శ్రీలోకసారంగమహాముని యనుల్లంఘ్యమగు భగవానునియాజ్ఞ నొందఁదల్చి శ్రీపాణనూరిని దేవాలయములోఁ బ్రవేశపెట్టె ననువిషయము సత్యమే. అట్లే యిపుడు గూడ భగవదాజ్ఞను సంపాదింపఁగల భక్తశిఖామణు లున్నచో వారి నడ్డగింప నెవరు సమర్థులగుదురు? "శ్రీపాణనూరి దేవమందిరమునఁ బ్రవేశించి "నాయమృతమయుని జూచినకన్ను లన్యమును జూడఁగోరవు" అని తాను జెప్పినరీతిగ భగవంతునితో నైక్యమొందె" నను ప్రసిద్ధచరిత్ర నెఱిఁగిన మహాత్ము లిపుడు గూడ నట్టి భక్తాగ్రేసరుల సేవింప మిక్కిలి ప్రయత్నింతురుగాక! అట్టిమహాప్రభావసంపన్నులగు భక్తాగ్రణు లగుపడినచో నెవ్వరుగూడఁ బ్రయాసపడ నవసరములేకయే పరమాత్మ వారి నత్యాదరమున స్వీకరించుటయుగాక శిరమునఁగూడఁ దాల్చుననుట నిస్సంశయము.

ధార్మికుల యాచారముల ధ్వంసముఁజేయ మిక్కిలి పట్టుదలను వహించి వక్రభావముతోఁ బ్రయత్నించుచున్న నేఁటి నవనాగరకుల సాహసకృత్యములు గొప్ప లోకసంక్షోభమునకుఁ గారణములగునని యెఱిఁగిన సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁ డచంచలమగుకృపతోఁ దనధర్మరక్షాదీక్షితత్వము నీసమయమునందు వెలిపుచ్చుఁగాతమని దోసిలొగ్గి వేడుచున్నాము. సనాతన ధర్మజీవాతువులగు సహృదయులెల్లరు నిట్లే ప్రార్థించుచు నుత్కృష్టమగు శ్రేయస్సు నందుదురుగాక !

"ధర్మో రక్షతి రక్షితః"

---

## —♦ స్త్రీ విద్య ♦—

(చంద్రభట్ల సూర్యనారాయణమూర్తిగారు. విజయనగరము)

... పురుషార్థముల...విద్యలు పురుషులే పఠింపఁదగినవారు...ఇట్టివిద్యల నభ్యసించుటకుఁ బురుషులు విశేషముగ శ్రమపడవలసియున్నారు...స్త్రీలచే నిట్టివిద్యల నభ్యసింపఁజే...యు...ట వారి నెన్నటికిని సుఖపెట్టుటకుఁ గాఁజాలదు. పురుషులకు మోక్షము ప్రధానమయినట్లే స్త్రీల కెందుకుఁగాదని...ప్రశ్నింపవచ్చును...కాదని యెవరును దెల్పియుండలేదు_అట్లెచ్చటనైనను...చెప్పియున్నచో నది యవివేకమేయని యొప్పికొనక తప్పదు. నిజముగా మోక్షవిద్య యిప్పటికిని నిలిచియున్నదనిన లౌకికవిద్యల నేమియు నెఱుంగని స్త్రీలలో మాత్రమే నిలిచియున్నదని యొప్పికొనవలయును. చదువురాని స్త్రీలే యేకాదశిమున్నగు దినములం దుపవాసముఁ బండుగుదినములందుఁ బూజలు వ్రతములు మున్నగునవి గావించి సదాచారసంపన్నలయి నేఁటికిని విరాజిల్లుచున్నారు. దైవభక్తి...మున్నగునవి యథాశాస్త్రీయముగ నింకను...స్త్రీలందు నిలిచియుండుట లోకవిదితము. ధర్మశాస్త్రము లెచ్చటను స్త్రీల కక్షరాభ్యాసమును విధించియుండలేదు. నిషేధించియు నుండలేదు. పురుషులకుమాత్ర మట్లుగాక యక్షరస్వీకారము పంచమాబ్దమున జరిగించవలెనని విధించుచున్నవి. కాన స్మృతికర్తల యభిప్రాయము

పురుషులే సకలశాస్త్రపారంగతులు కావలయుననునదియై యున్నదని తేలుచున్నది. స్త్రీల కక్షరాభ్యాసము విధించకపోయినను నిషేధించియుండలేదుగాన వారేల నేర్చు కొనఁగూడదను ప్రశ్న జనించక మానదు...స్త్రీశూద్రులకు వేదాధికారము లేదుకావున నందలి సారమును వారు తెలిసికొని తరించుటకై నే నీభాగవతమును రచించుచున్నా నని గ్రంథకర్త...నుడివియున్నాఁడు...ఉపనయనాధికార మున్నవారికే వేదాధి కారము కలదు...స్త్రీశూద్రులకు వేదాధికారము లేదని ధర్మశాస్త్రము లెల్ల ఘోషించు చున్నవి. దీనినిబట్టి పురుషులవలె స్త్రీలు చదువరాదనియు నక్షరస్వీకారము విధికాద నియుఁ దెలియవచ్చుచున్నది. నిషేధము లేదు కావున నక్షరస్వీకారమును జేసి భాగవతాది భక్తిరసప్రధానగ్రంథములఁ జదివికొనినఁ జదువుకొనవచ్చును. చదివికొనకపోయినను వారి నిత్యవిధులకు భంగము వాటిల్ల నేరదు. స్త్రీ వివాహమగునంతకుఁ దండ్రియధీనము నను బిమ్మట భర్తయధీనమునను నటుపిమ్మటఁ గుమారుని యధీనమునను నుండవలయు నని శాస్త్రములెల్ల ఘోషించుచున్నవి. వారిని బోషించవలసిన బాధ్యత పైముగ్గురియం దును గలదు. స్త్రీలు కుక్షింభరణమునకు నేవిధమగు నిక్కట్టులకు లోనుగాకుండ... పూర్వులు పైనియమముల విధించిరి...

ఇట్లు చేయుటలో స్త్రీలయెడ మన పూర్వులకుఁగల దయార్ద్రహృదయము వెల్లడి యగుచున్నది ... నవనాగరికులు స్మృతికర్తలు స్త్రీలయెడ ననాదరభావము కలిగి యున్నారనుట హాస్యాస్పదము ... స్త్రీలు చదివికొని రచ్చకెక్కి స్వేచ్ఛావిహా రిణులయి ధర్మోపన్యాసము లొనర్చుట కెచ్చటను దావీయఁబడి యుండలేదు. వారట్లు సంచరించినచో నది వారి కీడుకొఱకే యగును. చదువురాని భార్యలకుఁ గలిగెడి శిశువులు విజ్ఞానవంతులు కాఁజాలకున్నారని ప్రతివాదు లొక యసత్యప్రచారమును గావించుచున్నారు ... చదువురాని స్త్రీలే తమ స్తన్యము నిచ్చి శిశుపోషణయం దేమఱక సకలోపచారము లొనర్చుచున్నారు. పాశ్చాత్యవ్యామోహమున నేఁడులాడు వనితలు తమ యౌవనమునకును సౌందర్యమునకును భంగము కలుగునను నభిప్రాయ ముతోఁ దమ స్తన్యమును దమ శిశువుల కిడుట మానివేయుచున్నారు. అందులకు బదులుగ నాచారవిహీనలయి మాంసాహారలయి యొప్పుచున్న యేపరాంగనలచేతనో పాలిప్పించుచున్నారు. అందువలననే యిప్పటి శిశువులు పితృమాతృభక్తులు లేనివారయి యనాచారపరులయి తిరుగాడుచున్నారు ... మహాభాష్యముల వ్రాసినవారును షడంగ వేదులును ... చదువురాని స్త్రీలకుఁబుట్టినవారే ... చదువురాని స్త్రీలకుజనించిన స్మృతికర్తల మేధావత్వమున కేమిలోటువాటిల్లినది? ... సత్యముఁ బరికించినఁ జదువు రాని స్త్రీలకు జనించినవారే విజ్ఞానులగుచున్నారని తెలియఁగలదు. పతిభక్తి దైవభక్తి శిశుపోషణమున్నగునవి చదువురాని స్త్రీలకడ నున్నట్లు చదివికొనిన స్త్రీలందుఁ దఱు చుగాఁ గానరావు ... స్త్రీలందఱును జదివికొనినఁగాని విజ్ఞానులగు శిశువులఁ బడయఁజాలరనుట ... లోకమును మోసగించుట ... కావున స్త్రీలను జదివింప వలెనను ... వారు తమ యభిప్రాయమును మార్చికొని పాతివ్రత్యము మున్నగు స్త్రీధర్మముల వారికి బోధించి ... మేలు చేకూర్చెదరుగాక ... చదివికొనిన స్త్రీలకు వంధ్యాత్వము కలుగవచ్చునని సుప్రసిద్ధాంగ్లవైద్యులగు డాక్టరు హెర్బర్టుస్పెన్సరుగారు ... తమ యభిప్రాయము ... నిచ్చియున్నారు ... మేధాశక్తిని విజృంభింపఁజేయుట

వలన వారికి ... వంధ్యాత్వము సంభవించుచున్నది. మఱియు నీయభిప్రాయమునే డాక్టరు సాధక్, ఏలక్ దొరగారు ... తాము వ్రాసిన ... గ్రంథములోఁ దెల్పియున్నారు ... ఇంగ్లాండులో సగముభాగము తల్లులకు బిడ్డలకుఁ బాలిమ్మటకూడఁ దెలియదు ... విద్య నేర్చుపరిశ్రమలో మేధాశక్తి యెక్కువగును. జననేంద్రియపుష్టి ... తగ్గిపోవును. స్తన్యాభివృద్ధి లేకపోవుటయే కాక జీర్ణశక్తి మొదలగు బలముకూడఁ దగ్గిపోవును ... బిడ్డలయందుఁ బ్రేమకూడ నుండదు ... వేలకొలఁది శిశువు లిండియాలోఁ బుట్టఁగనే పోవుటకు స్త్రీలకు విద్యలేమియే కారణమని స్త్రీవిద్యాభిమానులు చెప్పుచున్నారు. ఇది వాస్తవము కాదు. పురాణవిద్యాపారంగతలైన మేధావతులగు స్త్రీలే శరీరదుర్బలత్వము కలిగియుండురని పైని నిరూపించియే యున్నాను. అట్టిదుర్బలలకు దుర్బలసంతానము కలుగును...కాన దుర్బలసంతానకారణము స్త్రీలకు విద్యాసంపర్కముండుటకాని విద్యలేమి కాదని స్పష్టమగుచున్నది. ఈతరమువారు బలహీనులగుటకును వీరి తాతలు ముత్తాతలు బలవంతులగుటకును, గారణ మింగ్లీషు నభ్యసించుట పూటకూటియిండ్ల భుజించుట ప్రయోజనములేని నవలలఁ జదువుట సినిమాలు చూచుట మున్నగున వగునని పలువు రభిప్రాయపడుచున్నారు...మఱియు నింకొకవిషయముఁ బరికింపుఁడు. పీష్వాల కాలమున పురాణవిద్య లేదు. పురాణవిద్య నెఱుంగని సాధ్వీమతల్లులకుఁ బీష్వాలు జనించియుండిరనుట నిర్వివాదాంశము. వారు ఢిల్లీపాదుషాలఁగూడఁ బాదాక్రాన్తులుగఁ జేసికొనఁగల్గిరి. ఆసేతుహిమాచలము హిందూపతాకము నాడించి ప్రతిభావిశేషము ప్రకటించిన మేధావంతులును దృఢకాయులును నైయున్నారు. కాన స్త్రీలు పురాణవిద్యాపారంగతలయినఁగాని శిశువులు విజ్ఞానులు కారనియు దృఢకాయులు కారనియుఁ జెప్పుచున్న స్త్రీవిద్యాభిమానుల వాద మెంతసమంజసముగ నున్నదో చదువరులు గ్రహించెదరుగాక.

---

## — భామతి —

(సరిపల్లె విశ్వనాథశాస్త్రి యమ్యే గారు)

... వాచస్పతిమిశ్రులను మహావేదాంతి యాజన్మబ్రహ్మచారికి ముప్పదేండ్లు గురుకులవాసము చేసి ... భామతియను కన్యకం బెండ్లియాడి యామెతో గంగాతీరమున నాశ్రమ మొకటి కల్పించుకొని శిష్యవర్గమునకుఁ బగలెల్లఁ బాఠములు చెప్పుటలోను రాత్రియంతయు వేదాంతసూత్రములకు భాష్యము వ్రాయుటలోను నూఱేండ్లు నిండినవి. ఒకనాఁటి నిశాంతమున వ్రాసికొనుచుండ దీప మాఱిపోయినది. ఎవరక్కడ నని ముమ్మారు పిలిచిన శిష్యు లెవ్వరును లేరని గ్రహించి యర్ధాంగి వచ్చి దీపము వెల్గించుచుండ నీ వెవ్వరవని ప్రశ్నించెనట. తాళిగట్టినదానవని యామె సమాధానమిచ్చి తనగతి యేమనియు సంతానములేకున్న విభువంశము నిలువదనియు విచారము సూచించినదఁట. అంత నామహాత్ముఁడు వెంటనే తా రచించి ముగింపనున్న భాష్యమునకు భామతియను నామం బిడి విద్యాసంతతి శాశ్వతముగ నుండుననమందహాసము చేసి తృప్తినడి యామె నిత్యకృత్యమునకై వెడలిపోయినదఁట ...

---

—♦ ఆర్యస్వాత్వ మహావిప్లవము, ధార్మిక సత్యాగ్రహ ప్రయత్నము. ♦—

(ధర్మోపన్యాసకేసరి పుల్య, ఉమామహేశ్వరశాస్త్రిగారు, ముంగండ అగ్రహారము)

ఇప్పటికైనను గతిసంస్కారణముల స్వరూపము మీకు గోచరించలేదా? ఇప్పటికైనను మీరు కనులుదెఱచి మీకర్తవ్యమున మీరు ప్రవర్తించి యాత్మసంరక్షణమునకుఁ గడంగఁదలంచరా? ఇప్పటికైనను మీ సర్వస్వాపహరణము నొనర్చు పరప్రభుత్వవిధాన మహామోహమును వీడరా? కలిశాసనాస్త్రముల పరంపరచే మీమతము మంటఁగలియుచుండ మీజాతులు క్షీణించుచుండ మీ మానము మన్నుగలియుచుండ మీ ధనము దగ్ధమగుచుండ మీ ధర్మములు ధరణిపాలగుచుండ మీ హక్కులు హతములగుచుండ మీ దేవతలు దేవలోకముల కేగుచుండ మీ కులములు కూలిపోవుచుండ మీ కులస్త్రీలు కులటలు కాఁబోవుచుండఁ బదకుఁ గొలఁదికాలమున మీ ప్రాణములకుఁ గూడ నపాయము వాటిల్లనుండ సుతరామరాజ్యమను నరకములో నొప్పు స్వరాజ్యమను సురాలహరిమీఁది మహామోహమును వీడనేరక వచ్చియున్నట్టియు రానున్నట్టియు విప్లవపరంపరను విమర్శించుకొనక మిన్నుమన్నులంగానక మీని నన్నిటిని మన మ్మూల లెన్నక యున్న యాత్మీయముల నన్నిటిం గోలుపోవుచు మున్నుదిన్న మహా హాలవలె నుదాసీనులై యెంత కాలమిటులు మనఁదలంచితిరో కదా? అయ్యయ్యో! మీ మర్దశం దిలకించిన నెట్టివానికి మనస్సైన నమ్మగాకుండునే? కట్టా! ఇట్టి చెట్టయిక్కట్టుకాలమునఁగూడ నెట్టిచెయిదమునకైనఁ గడంగనీయని దట్టపూద యము నెట్టులాజెగజెట్టి పెట్టెనో కదా! హా హా! మహామోహమదమున కెట్టికట్టి కలదో! మహోదయులారా! ప్రపంచమున నేప్రభుత్వవిధానమైనను దేశీయుల జాతిమత మానధన ప్రాణరక్షణమునకే యేర్పడినది కాని వీని హరణమున కేర్పడినదని యెంతురా? ఏమానవునకైనను స్వజాతిమతమానధన ప్రాణములమీఁద నభిమాన ముండుట సహజముగాఁ జూపట్టును గాని వాని హరణముమీఁదఁ జూపట్టదే? సర్వసంగ పరిత్యాగియగు సన్న్యాసికిఁగూడఁ బ్రపంచభావ మున్నంతవఱకు దేహధర్మములగు క్షుత్పిపాసాదులు తప్పుటలేదే? అట్టివాని యుపశమనమునకై కొంతయత్నము దప్పుట లేదే? ... అట్టిసన్న్యాసి కోటి కొక్కఁడు లభించుట కష్టమే? ఇట్టిదశలో శ్రేయంబవళ్ళు ద్వైతవాసనలలో నిండియుండి సర్వసంకల్పసంయుతులమై యర్థకామపూరణమునకై పాటుపడుచున్న మన కాత్మరక్షణమునకు యత్నింపక యుదాసీనులమగుట యాత్మహత్యాదోషభాజనము కాదా? పశుపక్ష్యాదు లాత్మరక్షణమున నప్రమత్తములై ... చరించుచుండ విజ్ఞానాధికులనుగా నిర్మించినందుల కా ... సర్వకార్యప్రమత్తులై ... ఆత్మద్రోహమునకుఁ బాల్పడుట? ఇయ్యది యార్యమానవలక్షణమే నా? సిద్ధి దైవాధీనమైనను యత్నము మానవాధీనమే కదా! అర్థకామములకై యత్నించుచుండుట లేదా యందురా? ప్రాప్యాంశమున నౌదాసీన్యము నప్రాప్యాంశమున యత్నము ననర్థావహములగుటచేఁ బ్రాప్యాప్రాప్య విచారణను వీడి మహామోహ విశేషమున వాని నవలంబించుటయే ప్రమాదమనియు నట్టియత్నము కూడదనియు ధీమంతు లందురు. ప్రకృతము న్యాయశాస్త్రనిర్ణయములగు నన్నిహక్కులలోను న్యాయశాస్త్రవాసనావిరహితులగు మ్లేచ్ఛభాషావిదగ్ధుల బుద్ధులుమాత్రమే నిర్ణాయకము లగుచున్నవి. అట్టులే యార్యధర్మాధర్మనిర్ణయములుకూడ ననార్యమతదుగ్ధులగు మానవుల మేధావిశేషముల ... మెజారిటీని నాశ్రయించి జరుగుచున్నవి. ఈవిధానమున కంతకును

కొంతకాలమునుండి కలిపురుషుఁడే మానవరూపమును వహించి నాయకత్వముతో నన్నివిధములఁ బాటుపడుచున్నాఁడు. కొన్నిలక్షల జనమును కొన్నివందల వార్తాపత్రికలును వీనికి సహకారులై పని చేయుచున్నవి. ఈనాయకుఁడును వీని యనుచరులు నార్యజాతి నుదయించినను స్వజాతిహితవేషభాషాచారవిద్వేషులై మ్లేచ్ఛమతలంపటులై మ్లేచ్ఛజాతిని దమకు జన్మ లభించనందులకు వగచుచుఁ గర్మ మ్లేచ్ఛత నార్జించుచు నార్యజాతిమతధర్మముల నిర్మూలించుటకు రేయింబవళ్ళుఁ బాటుపడుచున్నవారు. ఆర్థికస్వాతంత్ర్యసంపాదనమునకుఁ గా నేర్పడి పనిచేయుచున్న యఖిలభారతదేశీయ రాజకీయమహాసభను స్వానుచరులతోఁ గూడఁ గలిపురుషుఁ డాక్రమించి ... మతధర్మ నిర్మూలకములగు సంస్కరణాభాసముల నీ రాజకీయసంస్కరణములలోఁ గలిపి యార్యలోకమున సార్వజనికచండాలత్వము నాపాదింప నస్పృశ్యతానివారణాదులను శాసింపఁజేయుచు నార్యవివాహాది పవిత్రకర్మముల నున్మూలించు దుశ్శాసనపరంపరను స్వానుచరుల ద్వారమునఁ జేయించి వర్ణసంకరమును ... చేయించుచున్నాఁడు. విస్తరించనేల ? నిఖిలభువనచక్రనిర్మాణ నిఖిలావననిలయనచాతురీధురీణుఁడై భక్తలోకపరిత్రాణమునకై వివిధరూపములతో వివిధాలయముల వివిధశక్తిపరివృతుఁడై విలసిల్లుచున్న యాసర్వేశ్వరుని ... స్వాలయములనుండి వెడలనడఁప నిరంతరదీక్షతో సాహసించి పనిచేయుచున్న యాకలిపురుషునకు బౌద్ధమతపునరుద్ధారణదీక్షితునకు వర్ణాశ్రమధర్మనిర్మూలనోపక్రమణసాహస మాశ్చర్యజనక మెట్లగును ? ఇట్టిమహాధర్మవిప్లవమునకు ఫలములుగా భారతదేశమున నిప్పు డెన్ని విప్లవము లుదయించుచున్నవో గోచరించుట లేదా ? ఏప్రభుత్వమైనను బ్రజల జాతిమతమానధనప్రాణరక్షణమునకే యావశ్యకము కాని వాని భక్షణమున కావశ్యక మగునా ! అట్టిరక్షణ మేమతస్థులకైనను స్వస్వమత న్యాయశాస్త్రసంరక్షణమూలముననే జరుగును ... ఇన్ని దుశ్శాసనము లుదయించి యిన్ని విప్లవములు గలుగుటకు న్యాయశాస్త్రనిర్మూలనమే కారణముకాదా ? ఇట్టి దుర్దశలో నాత్మరక్షణమునకై వలయు రాజ్యాంగవిధానము నేర్పఱచి యట్టివిధానము ప్రభువులఁ గోరి వారి ద్వారమున నాత్మరక్షణ మొనర్చుకొనుటలో నుపేక్ష ...ధార్మికధనికులకు విపరీతబుద్ధి కాదా ? ఇప్పుడైన నాత్మవినాశహేతువగు నీవిపరీతబుద్ధిని విడనాడి ధార్మికధనికు లాత్మరక్షణమున కనువగు విధానము నేర్పఱచుకొని యట్లు వెంటనే కర్తవ్యమునకుఁ గడంగ నాసర్వేశ్వరుఁ డనుగ్రహించుఁగాక. పాపము శాంతించుఁగాక.

---

## —♦ సముద్రయానము ♦—

(శ్రీశృంగేరి ... స్వాములవారు)

సముద్రయానము హిందూధర్మశాస్త్రములచే నిషేధింపఁబడియున్నది. ఇట్టి నిషిద్ధాచరణమును నిచ్ఛాపూర్వకము గాక యొకసారి చేసినవారికిఁ బ్రబలప్రాయశ్చిత్తముచేఁ బారలౌకికమగు పరిశుద్ధత యొదవుననియు నీలోకంబున సంవ్యవహారయోగ్యత గలుగదనియు శాస్త్రములచే సిద్ధాంతింపఁబడియున్నది. దీనికి ... ... విచారము చేసినచో ... కారణము గలదని కనుగొనుట యసాధ్యము కాదు.

శ్లో. శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజం (భగవద్గీత)

అని బ్రాహ్మణునికి సహజములగు కర్మలు 9 ... శమమన ... ప్రతివిషయము నందును దోషముగలదని పెక్కుమారులు విచారముచేసి యావిషయములనుండి మనస్సును మరలించి యాత్మవిషయముగానే నిలుచునట్లు చేయునట్టి యభ్యాసము. దమమనఁ గర్మేంద్రియ జ్ఞానేంద్రియ ... ముల విషయముల పొంతకుఁ బోనీయక నిరోధించునట్టి యభ్యాసము. తపంబనునది శారీర వాఙ్మయ మానసికములని 3 విధములు ... శౌచము నార్జవము బ్రహ్మచర్యము నహింస దేవబ్రాహ్మణులయున్నగువారిని బూజించుట ... శారీరతపస్సు. ఎట్టిసందర్భమునందునను నెవ్వారికిని నుద్వేగము గలుగకుండునట్లు సత్యముగాను ప్రియముగాను నుండు భాషణము వేదశాస్త్రాధ్యయనము ... వాఙ్మయతపస్సు. తృప్తి చిత్తశుద్ధి వాఙ్నిర్బంధము సంశయములేమి ... మనస్సు నిరోధించుట ... మానసిక తపస్సు.

శౌచము ... 2 విధములు. వర్ణాశ్రమానుసారముగా శాస్త్రోక్తరీతిని మృత్తికా జలాదులచే నంగములను శుద్ధిచేసికొనుట బాహ్యశౌచము. కామక్రోధాది వికారములను ఎడబివర్తించుట యాభ్యంతర శౌచము. క్షాంతియన ... ఎవరివలనను నెట్టికష్టం బొదవినను బ్రతీకారమును జేయక సహించియుండుట. ఆర్జవమన ... వీసంబంధమును నెవరియెడలను వక్రభావమును బొందకుండుట. జ్ఞానమన వేదశాస్త్రార్థముల నెఱుంగుట. విజ్ఞానమనఁ దెలిసిన శాస్త్రార్థము ... స్వానుభవమునకుఁ దెచ్చికొనుట. ఆస్తిక్యమనఁ బ్రపంచమునకంటె భిన్నుఁడై ప్రపంచమునకుఁ గారణభూతుండగు భగవంతుఁ డొకఁడు గలఁ డను నమ్మకము. ఇవ్విధంబున బ్రాహ్మణునికి 9 గుణములు సహజములనియు ననుష్ఠేయములనియుఁ జెప్పఁబడియున్నందున వీనిలో నేయొకగుణమైన ... లోపించినను బ్రాహ్మణుఁడని చెప్పకొనఁదగఁడు ... వీనిప్రచారముగల దేశమందునను సాజనుల నడుమను నిరంతరముగా వసియించి ... నచో నివి నిలుచుం గాని ... బొత్తిగాఁ బ్రచారములేని దేశమందు ... ను నీగుణముల ... నెఱుంగని జనుల సహవాసముచేతను ... సంపూర్ణముగా నెడలిపోయి బ్రాహ్మణ్యమే లేనట్లగును. అట్టిబ్రాహ్మణుఁ డెట్టిప్రాయశ్చిత్తమును జేసికొనినను విడిచిపోయిన గుణములు వెండియు వచ్చుట కవకాశము లేకుండుటచే వాని సహవాసము తక్కినవారి ... గుణములను బోఁగొట్టవచ్చునను కారణముచే సంఘమునుండి వెలివేయఁబడవలయునని శాస్త్రములలోఁ జెప్పఁబడియున్నది...ఈకారణముచేతనే సముద్రయాన మంత...పాతకమను సంశయము శాస్త్రతాత్పర్యంబని...చెప్పవచ్చును. సురాపానంబును మహాపాతకంబ... దీనివలన నితరుల కెట్టికష్టమును ... లేదు. పానముచేయువానికి ... కలిగెడు కష్టమును నత్యల్పము ... ఇట్టికృత్యమును మహాపాతకములలోఁ జేర్చి మరణాంతప్రాయశ్చిత్తము శాస్త్రమందుఁ జెప్పఁబడియున్నది. ... విచారించిన నన్నివిధముల పాపములను జేయుటకు సురాపాన ... మే మూలకారణము కావచ్చును గనుక ... మహాపాతకంబని చెప్పియుండుట యుక్తమ ... ఒకబ్రాహ్మణుఁడు పండితుండును నాచారశీలుండును ననుష్ఠానపరుండును నై యుండెను. ఇతఁ డొకనాఁ డేదో గ్రామమునకుఁ జనుటకై యింటినుండి యొంటరిగా బయలుదేరెను. దారియందు దుష్టులు కొందఱు చనుచుండిరి. వారు ... నిరపరాధియగు నీబ్రాహ్మణుని కష్టగావింపఁదలఁచి బలాత్కారముగాఁ బట్టుకొనిరి. బ్రాహ్మణుఁడు ... విడిచిపెట్టుండని ... వేడుకొనెను.

మేముచెప్పినట్లు నడతువేని విడిచిపెట్టుదుమని వారు చెప్పిరి ... బ్రాహ్మణుఁడు ... వినిరొదననియెను. అప్పుడు వారు ... మాలదా ... నితో సంగమించిన విడిచిపెట్టెదమనిరి. ఈమాటను విని యట్లు నడచుకొనుటకంటెను ... ప్రాణములను బోఁగొట్టుకొనుటయే మేలని యాబ్రాహ్మణునికిఁ దోఁచి వారిమాట నిరాకరించెను. పిదప వారాచండాల స్త్రీ ... శిశువు మెడ విఱిచి చంపిన నిర్బంధమునుండి తప్పింతుమనిరి. ఈమాట యాబ్రాహ్మణునికి ... కఠోరముగా నుండినందునఁ దన కుత్తుకనే విఱిచి ... వేయవచ్చునని క్రిందఁ గూర్చుండెను. పిమ్మట ... మద్యముం దెచ్చి ... దానిం ద్రాఁగితివేని విడిచిపెట్టెదమనిరి. బ్రాహ్మణుఁడు ...ప్రాయశ్చిత్తానుష్ఠానముచే శుద్ధుఁడనగుదునుగాక యని యోజించి సురాపానము చేసెను ... మదకరపదార్థము సేవించుటచే ... బుద్ధిభ్రంశము గలిగి పిదపఁ దాను నిరాకరించిన స్త్రీసంగమము శిశుహత్య ... స్వయముగానే కావించెను ... ఈ యితిహాసమును బర్యాలోచించిన యెడల సురాపానము సకలపాపములకు మూలభూత ...ంబని యెవరు నమ్మకుందురు ? దీని నెఱింగిన మహనీయులు సురాపానము మహాపాతకంబని యెట్లు చెప్పియున్నారో యట్టులే బ్రాహ్మణునికి సహజగుణముల నన్నిటిం బోఁగొట్టి సురాపానాది మహాపాతకసహస్రమును నిర్లక్ష్యముగాను నిర్లజ్జతోను జేయునట్టి మనోవృత్తిని గలుగఁజేయఁదగిన సముద్రయానము ప్రబలదోషంబని ... శాస్త్రమున ... నిరోధించియున్నారని చెప్పందగు ... ధర్మశాస్త్రంబున సముద్రయానమునుండి నిషేధింపఁబడిన వారు బ్రాహ్మణక్షత్రియవైశ్యులను వర్ణత్రయమువారే కాని నాలుగవవర్ణమువారికి నిర్బంధము లేదు ... 3 వర్ణముల సంఖ్య మూడింట నొకపాలనియు 4 వ వర్ణమువారి సంఖ్య మూటిలో 2 పాళ్ళనియుఁ జెప్పవచ్చు ... ఈసందర్భమున సముద్రయాన ద్వీపాంతరవాసములను సలుపకున్న హిందూదేశముయొక్క యున్నతి కవకాశము లేని...చో ... నాల్గవవర్ణము ... వారిని ... ద్వీపాంతరములకుఁ బంపి ... విద్యాభ్యాసమును జేయించి ... వారిమూలముగా దేశోన్నతికి వలయు ప్రయత్నముల జరిపిన యెడల ... వారు ... త్రైవర్ణికుల ... వారికి సహాయులై నిలువవచ్చును ... దీనిచే నైకమత్య మధికమై దేశ మున్నతస్థితికి రావచ్చును గావున నట్లు జరిగించుటచేతనే యుద్దేశము సిద్ధించునపుడు చిరకాలమునుండి యాచరణలో లేని కార్యము నిప్పుడనుష్ఠించి ... పూర్వపు మహనీయులచే నధర్మమని చెప్పఁబడినదానిని ధర్మంబని స్థాపించుట ... చే నధికమగు ప్రయోజన మేమి ? ... బ్రాహ్మణులు మొదటినుండియుఁ గాయిక వ్యాపారములందు విశేషముగాఁ బ్రవర్తింపక మానసికవ్యాపారములనే యధికముగాఁ జేయుచుండినందున విద్యావంతులై యున్నారనియు దీనివలనఁ గలిగియుండు బుద్ధికౌశలముచే నేభాషయందైనను నేవిషయమునైనను నెంతసూక్ష్మముగా నున్నను ... గ్రహించుటయందు బ్రాహ్మణులకుండు సౌలభ్య మితరుల కుండదు కావున బ్రాహ్మణులే దేశోన్నతికై ... యత్నములను జేయవలయునుగాని యితరులచేఁ జేయించుట కవకాశము లేదనియుఁ గొందఱభిప్రాయపడునట్లు తెలియవచ్చెడు. ఈయభిప్రాయము నొకేవిధముగా నందఱు నంగీకరింపరు ... కావున ... బ్రాహ్మణుని కధర్మంబని ధర్మశాస్త్రమునందుఁ జెప్పఁబడియుండు ... సముద్రయానము చేయుట ... విచారపరులకు ... యుక్తమైనది కాదు.

---

కృష్ణవేణీ దివ్యకీలాలములఁ దోఁగి
సరయూజలంబుల జలకమాడి
బాహుదా సలిలావగాహం బొనర్చి శ
తద్రూనదీ కబంధముల నాడి
తే. మఱియు నేణి వితస్త చర్మణ్వతియు వి
పాశ నిర్వింధ్యయును నిరావతియు ననెడు
పుణ్యనదులను సేవించి భూరిమోద
కలితుఁడై దీనజనకృపాలలితుఁ డగుచు. 87
క. వారాణసి, శ్రీగిరి, ధర్మారణ్యము,పుష్కరము ప్రయాగయు,గయ,కే
దారము,నైమిశమనియెడుభూరిక్షేత్రములఁగాంచి మోదము నం దెన్.
వ. వెండియు రఘుకులాలంకారుండగు శ్రీరామచంద్రుండు, మానససరో
వరంబును, గ్రమసరోవరంబును, నింద్రద్యుమ్నసరోవరంబును,
హయగ్రీవతీర్థంబును, నగ్నితీర్థంబును, వివిధ నదీనదహ్రదంబు
లును వీక్షించి, స్వామియగు కార్తికేయుని సేవించి సాలగ్రామ
మూర్తియగు విష్ణుమూర్తిని భజించి, చతుష్షష్టిహరిహరస్థానంబులఁ
దిలకించు, నానాప్రదేశచిత్రంబుల నాలోకించి చతుస్సముద్రతటం
బులం గాంచి, వింధ్యమందరాది పర్వతవిశేషంబులం గనుఁగొని,
సప్తకులగిరులం జూచి మహాత్ములగు బ్రహ్మర్షి రాజర్షుల పావనా
శ్రమముల దర్శించి దేవబ్రాహ్మణాయతనంబు వీక్షించి పరమా
నందకలితాంతరంగుండై. 89
తే. అమరకిన్నరమానవు లభినుతింప
ధరణితల మెల్లఁ దిలకించి పురము సేరె
సకలకకుబంతములయందు సంచరించి
శివుఁడు కైలాసమునకు వేంచేయునట్లు. 90
వ. అంత. 91

—♦ శ్రీరాముని దైనందినవ్యవహారము. ♦—

ఉ. లాజలు జాజులున్ బురవిలాసవతుల్ తనమీఁదఁ జల్లఁగా
రాజును గన్న యా జలధిరాజు తెఱంగున రాజు పొంగఁగా
రాజగృహంబుఁ జేరె ద్విజరాజమనోజవిరాజమానుఁ డ
వ్యాజి తనూజముఖ్యుఁడు జయంతుఁడు స్వర్గముఁ జేరు తీరునన్. 92

కం. జనకునకు వసిష్ఠునకున్
జనులకున్ సకలబంధుజనములకున్ బ్రా
హ్మణులకుఁ గులవృద్ధులకును
బ్రణామములు సలిపి రామభద్రుం డంతన్. 93

కం. తలిదండ్రులు స్నేహితులున్
గులవృద్ధులు ద్విజులు తన్ను గురువత్సలతన్.
బలుమఱు కౌఁగిటఁ జేర్పఁగ
నలఘుతరానందమంది యందఱఁ దనిపెన్. 94

కం. రాముని ప్రియకథనమ్ముల
నామోదంబంది గృహమునం దెల్లరు వం
శీమధుర రవములంబలె
వ్యామోహితులగుచు దెసల భ్రమరించి రొగిన్. 95

వ. ఇట్లు సంతుష్టస్వాంతజనసంతానకృత కలకోలాహలాకులంబగు రామా
గమనమహోత్సవంబు దివసాష్టకపర్యంతంబు జరిగె. 96

శా. ఆనందంబుగఁ గాలమున్ గడపె నం దారాముఁ డాప్తాళికిన్
నానాతీర్థమహత్త్వముల్ నుడువుచున్ నానాజనాచారముల్
నానాదేశవిశేషముల్ దెలుపుచున్ నానావిధానూన వి
ద్యానైపుణ్యముచేఁ దదీయహృదయాహ్లాదంబు హెచ్చించుచున్.

వ. వెండియు నక్కుమారుండు నిత్యమ్మును 98

సీ. వేగినంతనె లేచి విధ్యుక్తమౌ విధా
నమున సంధ్యోపాసనమ్మొనర్చి
ఆవల సభ కేగి యమరేంద్రవైభవం
బున నున్న జనకు దర్శనముచేయు
అట వసిష్ఠాదిసంయములతో నిష్టక
థాగోష్ఠి నొకజాముదాక నుండు
పిమ్మటఁ దనతండ్రి వీడ్కొని సేనతో
నాఖేటకాసక్తి నడవి కరుగు.

తే. అచ్చట ననేక దుష్టసత్త్వాళి దునిమి
సదనమున కేగుదెంచి సుస్నాతుఁడగుచు

సకలహితులనుగూడి భోజన మొనర్చి
హాయిగా మిత్రపాళితో రేయి గడపు. 99

చ. అమలినభావుఁ డాతఁ డట సానుజుఁడై నిజవైనికక్రియా
క్రమ మిటు లొప్పఁగా సుఖముగా దివసమ్ములు పుచ్చె కాచకా
ర్యముల మనోజ్ఞమై సుజనరంజనమందునఁ జంద్రికాభమై
అమృతపుఁ దేటతీరున సుఖాస్పదమౌ నిజవర్తనంబునన్. 100

సీ. అంత ధర్మము నించుకంతయుఁ దప్పక
పంక్తిరథుండు భూపాలనంబు
నొనరఁ గావించుచు నూనషోడశవర్షుఁ
డగు రామునకును దదనుజులకును
బరిణయంబునకునై ప్రత్యహ మాలోచ
నంబులు మంత్రివర్గంబుతోడఁ
జలుపుచు నత్యంతసమ్మోదమున నుండ
నఖిలప్రజాళియు హాయి నుండఁ

తే. దీర్ఘయాత్రల ముగియించి తిరిగివచ్చి
నదియె మొదలుగ శ్రీరాముఁ డనుదినంబు
నంతకంతకుఁ గార్శ్యంబునందఁజొచ్చె
శరదృతువునందుఁ జొక్కుంపుసరసువోలె. 101

## —♦ శ్రీరాముని కార్శ్యవర్ణనము. ♦—

క. వెడదలగు నిడుదకనులన్
గడునొప్పెడు నతనిమోము క్రమముగ వెల్లం
బడెఁ బాకమెనసి విరియం
బడి తేటుల నడరు ధవళపద్మమురీతిన్. 102

క. చెక్కిటఁ జెయిఁజేరిచి తా
నొక్కెడఁ బద్మాసనమున నుండి మనమునన్
నెక్కొను నెవ్వగ వ్రేఁగున
నొక్కపనియుఁ జేయకుండ నూరకయుండున్. 103

క. చిత్తం బెంతయు ఖేదా
యత్తముగా నతికృశాంగుఁ డగుచేమియు నో
రెత్తి వచింపక యొక్కఁడఁ
జిత్తరుబొమ్మగతి నురక చిరము వసించున్. 104

తే. పరిజనులు మాటిమాటికిఁ బ్రార్థనంబు
సేయఁ బ్రత్యుత్తరం బేమి యీయకుండఁ
జిన్నవోయినమోముతోఁ జేవ దక్కి
యాహ్నికాచారములు మాత్ర మతఁడు దీర్చు. 105

మ. కొడుకా! నీమదిఁ గల్గు దుఃఖమును నాకున్ జెప్పవే యంచుఁ దా
దొడపై నుంచుక బుజ్జగించి నృపుఁ డెంతో కూర్మి నిండారఁ ద
న్నడుగన్ దండ్రి! యొకింతచింతయును లేదంచున్ వినమ్రాత్ముఁడై
నుడువున్ మెల్లన, మాఱువల్కఁడు పయిన్ దోరంపు దుఃఖంబునన్.

ఉ. అన్నవిధంబుఁ గాంచి పొగులందుచు లక్ష్మణుఁడున్ రిపుఘ్నుఁడున్
విన్నదనంబు నందుచును వెల్వెలఁబారుచుఁ జిక్కిపోవుచున్
జెన్నుదొలంగియుంట ధరణీరమణుండు సతీసమేతుఁడై
ఖిన్నతఁ జెందె నందులకుఁ గేవలహేతు వెఱుంగ నేరమిన్. 107

వ. అంత సర్వవిదుండు సర్వకార్యజ్ఞుండగు వసిష్ఠుంగని రామభద్రుని విషాదకారణం బెఱింగింపు మనుటయు నమ్మునిపుంగవుం డించుక యాలోచించి రాజా! యిందుకుఁ గారణంబు గలదు. నీవు చింతింప వలవదని ధైర్యంబు సెప్పి మరల నిట్లనియె. 108

ఆ. భూరిశోకఖేదమోదముల్ ప్రాజ్ఞుల
నల్పకారణముల నంద వధిప!
సర్గమో లయంబొ సమకూరకయె మహా
భూతములు వికారములను గనునె? 109

వ. అనిపలుకు గురుని వచనంబు లాలకించి ధరణీశ్వరుండు సంశయఖేదంబులు మనంబునఁ బెనంగొనఁ గించిత్కాలంబు మౌనంబువహించె. అంతిపురంబులఁ గౌసల్యాది రాజకాంతలు రామనిర్వేదంబునకుఁ జింతామగ్నమానసలై తత్కారణం బెఱుంగుటకై తదీయచేష్టితంబుల సావధానలై కనిపెట్టుచుండిరి. అట్టియవసరంబున, 110

సీ. ముదముతో యతికన్న మున్న మేల్కాంచి గోమ
యంబున మఠమెల్ల నలికివైచు
తపసి యేటికిఁబోవుతఱి నంటి వెంటనె
నడచు నాతని కమండలువుఁ దాల్చి
సన్న్యాసి దేవపూజకుఁ బూనుచో నుప
కరణముల్ దొలిచి శీఘ్రమున నొసఁగు
సంయమీశ్వరుఁడు భిక్షకుఁబోవునెడ గోచి
యును నార్ద్రపటఖండ మొసరఁ దాల్చు
పారికాంక్షికి నజినంబుఁ బఱచి రాత్రి
పరమశుద్ధాంతరంగుఁడై పదము లొత్తు
ఎలమి నమ్మౌని కలలోనఁ బిలిచెనేని
స్వామి! పనియేమియనుచు హస్తములు మోడ్చు. 52

క. ఈరీతి నుండ నాతని
మేరకు నొకనాఁడు మిగుల మెచ్చి యతీంద్రుం
డో రీ! అలరితి, ఇచ్చెద
గారవమున, అడుగు మేమి కావలె ననినన్. 53

తే. అతఁడు ప్రణమిల్లి పల్కె. సంయమివరేణ్య!
విన్నప మొనర్ప వెఱతు నావెఱ్ఱితనము.
ముద్దుగాఁజూచు కరుణాసముద్రమూర్తి
వగుటఁ దెల్పెద నాకోర్కె యాదరింపు. 54

ఉ. మాపొరుగింటి శూద్రుని కుమారిక పిన్నటనాఁటనుండియున్
నాపయిఁ బ్రేమఁగన్నది. అనంతర మొక్కఁడు పెండ్లియాడి వాఁ
డీపురిలోన నిల్వెడలనీక పరుం డటు సేరకుండ సం
జ్ఞాపరుఁడౌచు దాని ననిశంబును నేలెడు సంయమీశ్వరా! 55

సీ. ఉదుటుతో నారాక కెదురుచూచుచు ముద్దు
గాఱఁగా నది నిల్చు కడపఁజూచి
ననుఁ జూడఁగోరి క్రొన్ననతీవ నడయాడు
విధమున నది కుల్కు వీధిఁజూచి
నీటికై వచ్చుట నెపముగ నాతోడ
పలుకుచు నది చెందు బావిఁజూచి

తమవారి మొఱఁగి తత్తరము హత్తఁగ వచ్చి
అది నన్నుఁ గలయు పూఁబోదలఁజూచి
ఏను భరియింపలేక మీకృప సమాశ్ర
యించియున్నాఁడ. నన్ను నీడేర్పవయ్య.
ఆర్తరక్షణ మఖిలపుణ్యమగదయ్య!
కూర్మి నెటులైన నను దానిఁ గూర్పవయ్య! 56

తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యయ్యతికులేంద్రుఁ
డౌర! మన్మథు నిజమాయ కడ్డ మెవ్వ
రంబుజాసనముఖులలో ననుచు నతని
చేరువకుఁ బిల్చి యొక వేరు చేతి కిచ్చి. 57

కం. ఇది త్రొక్కినఁ జనవచ్చున్
మదిఁదలఁచినచోటి కభ్రమార్గంబున. అ
మ్మదవతిఁ గలసెదు. పోపొ
మ్మెద సందియ మెడలి రాత్రి కేగు మటన్నన్. 58

మ. భృగుఁడా రేయిఁ దదౌషధాప్తిమహితాంఘ్రిద్వంద్వుఁడై పోయి య
భ్రగతిం దద్గృహసీమ డిగ్గి మరుబాబాఁ బోలు నాబాలతో
అగణేయాదృతిఁ గూడి క్రిమ్మఱి యతం డాకైవడిన్ రేలు త
న్మృగనేత్రామణి బొందుఁ బాయక యతిప్రీతాంతరంగంబునన్. 59

కం. అమ్మూలికపై దానివిధమ్మది వ్రాసి నవసంధిఁ దగడు పొదివి ప్రా
ణమ్మువలె దాఁచికొని మఱి యెమ్మెయిఁగర్జముల దాని నేమఱకుండెన్.

కం. అంతనొకనాఁ డతండు పురాంతికనదిఁ జేరనరిగి యమ్మూలికఁ ద
త్ప్రాంతమున నుంచి దైవాక్రాంతమతిన్ డిగ్గి యొడలు కడిగికొనంగన్.

తే. రాజశుద్ధాంతపుషితమరాళ మొకటి
అరుణపద్మదళభ్రాంతి నచటనున్న
మూలిక గ్రహించి యవరోధమునకుఁ జనియె
భృగుఁడు తదభావమునకు నెవ్వగలఁ బొగిలె. 62

ఉ. అంతట నమ్మరాళము విహారమనోరతి మంజువాణి గే
హాంతరసీమ వైచినఁ దదౌషధముం గొని యవ్వధూటి వి
భ్రాంతతఁ జెంది దానిపయి బంగరురేకున వ్రాసియున్న య
త్యంతపరిస్ఫుటాక్షరచయంబుఁ బఠించి ప్రమోదమగ్నయై. 63

కం. ఇది త్రొక్కినఁ జనవచ్చుఁ గా
మదిఁదలఁచినచోటి కభ్రమార్గంబున నం
చొదవిన యాలిపి యున్నది
కద! దేవునికరుణ మెచ్చఁగావలె ననుచున్. 64

వ. తలంచి బహుకాలాభిలాషితంబగు పరపురుషసంగమం బనుభూతం
బైనభంగిం బొంగి మనోరథపరంపరాక్రమిత దినావసానమై నిశాసమ
యంబున రాజకుంజరుండు మణిమంజరీమందిరగతుండగుట యెఱింగి
యక్కురంగనయన తన ముంగిట నిల్చి పదాంగుష్ఠంబుల నయ్యౌ
షధమూలం బవలంబించి కాళికాగృహంబున కరుగవలయునని
తలంచి నిరాధారంబగు గగనాంగణంబున కెగిరి దైవవశంబునం
గాళీనికేతనద్వారంబున మొగులుతగులు దిగనాడి యరుగుదెంచిన
మెఱుంగుతెఱంగున వ్రాలి కేళికాగతుల మెలంగు నవసరంబున

క పరనగరరాజసుతుఁ డొ
క్కరుఁ డప్పురమునకు నాత్మకార్యంబునకై
అరుదెంచియునికి నిజతా
మరసేక్షణఁ దలఁచి యతఁడు మన్మథవశుఁడై. 66

తే. నిదురగానక యొకచోట నిలువలేక
వీధిఁ గ్రుమ్మరుచుండి యవ్వేళ నటకు
వచ్చి మరులచ్చివంటి యమ్మచ్చెకంటి
మెచ్చి మరులెచ్చి యంటిన మెలఁతతోడ. 67

తే. పలుకరించి తదాకారభాషణాది
కముల శుద్ధాంతకామినిగాఁగఁ దెలిసి
అళికి తలఁకిన నాతని తల పెఱింగి
ఆన్నృపాంగన వేగ డాయంగ నరిగి. 68

ఉ ప్రేమగనంబడం బలుకరించినవాఁడవు, పోదురా యరో!
నామగవాఁడ! లెస్స నిను నమ్మితి, రమ్మని పిల్చి కాళికా
ధామమునం బ్రతీచికడఁ దాను నతండుఁ బ్రసూనబాణసం
గ్రామవినోదకేళి సరిగాఁగఁ బెనంగి యనంతరంబునన్. 69

తే. తనచరిత్రంబు నుడివి యాతని విధంబు
తెలిసి యిఁకమీఁద రాత్రులు దినదినంబు

ఇచ్చటికి రమ్ము, తఱియైన నేను వత్తు.
అనుచు నొడంబాటుచేసి యువ్వనిత సనియె. 70

క. చని నాఁడు మొదలుగాఁ బ
ర్విన తమితో సజ్జయైన వేళల నృపనం
దను పొందు నడుపుచుండెన్
ఘనతర మునిదత్తమూర్తికా మహిమమునన్. 71

తే. దేవ ! అభిమానధనుని తృతీయభార్య
యైన మణిమంజరీహంసయాన తనదు
ప్రాయమెల్లను గోర్కులపాలుచేసి
ఉపపతిక్రీడకై కోరుచున్నయంత. 72

కం. ధరపై నిగమావతియను
పురమునఁ గ్రూరుఁడను నామమున నొకశూద్రుం
డరివరనికరభయంకర
కరకరవాలాంకుఁడై జగన్నుతిఁ గాంచున్. 73

క. అతనికిఁ జపల యనంగా
కాతరమృగనయన యొకతె గలఁ దది మదిలో
నీతి గణింపక జార
వ్రాతములకు హృదయమిచ్చి వర్తిల్లుచునున్ 74

తే. అతఁ డది యెఱింగి కామినీహత్య కళికి
యాలిఁ దోడ్కొని పరభూమి కరుగుబుద్ధి
గంధవతిచెంత కేగ వేరఁ గతిపయప్ర
యాణముల నంత నచ్చపలాబ్జనయన. 75

ఉ. వీఁ డిక నెన్ని దేశముల వెంబడిఁ ద్రిప్పునొ ? ఏమిచేయ ను
న్నాఁడొకో ? కాదటంచు జతనంబునఁ గన్నుమొఱంగిపోయినన్
వాఁడిమి వెంటనే వెదకవచ్చుఁగదా ! ఎటులైన నీతనిన్
పోఁడిమిమాన్చికాని మఱి పోఁదగదంచు విచారఖిన్నయై. 76

క. పెదవులు తడపుచుఁ బదములు
గదిగొనఁగా నొక్కచోటఁ గూర్చుండి యదా

(2) పగటివేళలందు విషవాయువుల నెల్ల చెట్లుఁబీల్చుచు నున్నను బ్రతికియుండుటకును నిప్పు రగులుకొనుటకును ముఖ్యాధారమగు ప్రాణవాయువు విడుచుచుండును. అందువలననే మనము చెట్లక్రింద నుండునప్పుడు నిండుగల హాయిగఁ దోఁచుచుండును. ఇట్టి సృష్టిచిత్రముల నెఱుంగుట మనకెట్టియానందము గలిగించి యాదయామయుని మహిమకెట్టి యాశ్చర్యము పుట్టించుచుండునో యది యనుభవవేద్యము. చూచితిరా ? మనకుఁగల యీ యల్పజ్ఞానమునకే యిట్టి యానందము కలుగుచున్నది. సృష్టిరహస్యముల నెఱిఁగిన పండితవర్యుల కెట్టియానందము కలుగుచుండునో మన మూహింపఁజాలము. చెట్లవలనను మన కొక యుపాయము కలదు. పగటివేళల వాని విషవాయువుల హరించి ప్రాణవాయువులను గావించి మన కుపకరించుచుండినను రాత్రులందు మరల విషవాయువుల వెలిగ్రక్కుచుండును. అందువలన రాత్రులందు చెట్లక్రిందఁ బండుకొనరాదని తెలిసినవారనుచుందురు.

(3) మహావాయుచలనము చేతను వాయువు శుభ్రపడుచుండును. వాయువునం దప్పుడప్పుడు కలుగుచుండు గొప్పగొప్ప చలనములచే మనకడనున్న గాలి యంతయు నొకసారిగ స్థలాంతరమునకుఁ ద్రోయఁబడి మన ముందు తావులకుఁ బరిశుద్ధవాయువు చేరుచుండుటయుఁ గలుగుచుండును. ఇట్టిచలనములనే గాలిదుమారములనియును గాలివానలనియును వాడుచుందుము. అట్టి తరుణములందు మనము చాటుగ నొదిగియుందుము. కావున నావాయువు వేగమును బలమును దెలిసికొనఁజాలము. చిరకాలమునుండి లోఁతుగ వ్రేళ్ళుపాఁతి పెరిఁగిన చెట్లును బెఱికివేయఁబడిన మొలకలవలె వ్రేళ్ళతోఁగూడ దూరముగ నూడిపడియుండుటయు సామాన్యములగు పుడకలవలె విఱిగిపడియుండుటయుఁ జూచినప్పుడు మన మీవాయువు వేగమును బలమును గొంతవఱకైన నూహింపఁగలిగియుందుము. అట్టి తరుణముల నది గంటకు నూఱుమైళ్ళు సాధారణముగ నరుగుచుండునన దీని వేగమునుగూడఁ గొంతవఱకుఁ దెలిసికొనఁగలము. ఇట్టిమహావాయుచలనమువలన మిక్కిలి దూరమందున్న సముద్రారణ్యప్రదేశవాయువులు గ్రామములకును నందం దపరిశుభ్రతచే మలినమైన వాయువు సముద్రారణ్యప్రదేశములకును మాఱుచుండును. మొత్తముమీఁద ముత్తెఱఁగుల మలినమగుచుండు గాలి మరల నిట్లు ముత్త్రివిధములఁ బరిశుభ్రత నందునట్లు భగవన్నిర్మాణ మేర్పడియున్నది.

జగ:- ఏమీ ! ఆ 3 విధాలు నీ 3 విధాలు మరలఁ గొంచెములోఁ దెలియునట్లు చెప్పు; నాకు సరిగాఁ దెలియలేదు.

కృ:- (1) జంతుశ్వాసమువలనను (2) వస్తుదహనమువలనను (3) భూతవిచ్ఛేదమువలనను వాయువు మలినమగుచుండును. మరల నటులనే (1) వ్యాపనస్వభావమువలనను (2) చెట్లు పీల్చుటవలనను (3) మహావాయుచలనమువలనను వాయువునం దేర్పడిన మాలిన్యము నశించుచుండును. మఱియుం (1) ప్రాణవాయువు

(2) నవాచారవాయువు (3) అంగారక్షారవాయువు నని గాలియందు 3 విధములు చేరియుండును. ఇవింట నొకపాలు ప్రాణవాయువును 4 పాళ్లు నవాచారవాయువును వేయింట నొకపాలు మాత్ర మంగారక్షారవాయువుఁజేరి యుండుననియుఁ బండితులు నుడివియున్నారు. మనము పీల్చునది ప్రాణవాయువు. మనము బ్రతికియుండుటకును నిప్పు మండుటకును నిది యావశ్యకము కాని నవాచారవాయు వధికముగా నుండి యీప్రాణవాయువు బలమును సదా తగ్గించుచుండు ననినచో దేశమునఁ గల సర్వ పదార్థములు నొక్కసారి దహనమైపోవును. మనము విడుచునది యంగారక్షారవాయువనఁబడును. నీటియం దడుగున మట్టికి చేరుచుఁ బైభాగము తఱచు శుభ్రమగుచుండునట్లు వాయువునందును మలినభాగ మడుగునకు దిగి నేలనంటును. నిర్మలవాయువు పైకిఁ దేలుచుండును. ఇందువలన ధారాళమగు వాయుప్రచారము లేని నేలఁ బరుండి యచటివాయువు నాఘ్రాణించుచుండుటచేఁ దలనొప్పి జలుబు మొదలగు వికారములు కలుగుచుండును. ఇండ్లయందలి దుర్వాయువు కొంతవఱకచటఁ గలుగుచుండు నుష్ణతచేఁ దేలికయై పైకిఁ బోవుచుండ నిండ్లవెలుపలి మంచిగాలి చల్లదనముచే బరువై క్రిందిభాగము నావరించుచుండును. కావునఁ బైకి లేచిన మలినవాయువు వెలుపలికిఁ బోవుటకును జల్లగాలి యిండ్లలోనికి రా వీలుండుటకును నిండ్ల పైభాగమునను దిగువభాగమునను దగుమాత్రము గవాక్షము లుంచికొనుట యారోగ్యప్రదము. ఏపదార్థముచే నావరింపఁబడియున్న భాగమునను గాలి నిలుచు నవకాశ ముండదు. కావున వాసగృహములను ముఖ్యముగఁ బడకటిండ్లను వస్తుబాహుళ్యముచే నావరింపఁబడకుండ నుండునట్లు జాగ్రత్త వహించుకొను టావశ్యకము. ఎట్టి తరుణములందును బొత్తుగ వాయుప్రసారనిరోధ మొనరించి పరుండరాదు.

ఒక లాంతరు వెలుఁగుచుండిన నందుఁ బ్రాణవాయువు దహనమై యటనుండి వెడలు దుర్వాయువు పూర్ధ్వరంధ్రములనుండి వెడలిపోవుచుండఁ గ్రిందిరంధ్రములనుండి మరలఁ బ్రాణవాయు వచటికిఁ జేరుచుండును. మన మీరంధ్రముల నొకించుక మూసియుంచిన లాంతరులోఁ గల ప్రాణవాయువు లెల్ల దహనమై దీప మాఱిపోవును. అటులనే మనమును గాలి యెంతమాత్రము రా నవకాశములేని గదియందుఁ దలుపులు మూసికొని నిద్రించితిమేని ప్రాణాపాయమగును. చెన్నపురియం దొక నిషేకంబున వాయుప్రసారములేని యొకగది ననేకదీపములచే నలంకరించియుంచినందునఁ దెల్లవాఱునప్పటి కందుఁ బరుండిన దంపతు లిరువురును మరణించిరని ధనకోటిరాజాగారిచే రచింపఁబడిన సుఖాధారప్రకాశికయను గ్రంథమునం దేను జదివియున్నాను. ఆగదియందలి ప్రాణవాయు సంతతియు వ్యయమై యాదంపతులును దీపములును బోవుటకలిగినది.

ఆ. గాలి రానియింటఁ గ్రాలు రోగంబులు,
వెలుఁగు రానియింట వెజ్జు దిరుగు,

కాన పీలు గలిగి గాలి వెల్గులు వాఱ
కట్టి యిల్లు సుఖము గాంచవలయు.

సరియైన వాయుప్రసారములేని యింటియం దుండువా రెప్పుడు నేదియో నొక వికారముచే బాధ నందుచుందురు. తగినంత వెలుతురురాని యింటియం దుండువారికిఁ దఱుచుగ వైద్యసాహాయ్య మవసరమగుచుండును.

జగ:- కావలెనుజుమీ నీవన్నట్లు. నీవు కాఁపురానకు రాకమునుపు మన యింటి కిటికీ లన్నియు బిగించి తంటాలుపడుచున్నాను. నే నెప్పుడును వలకొప్పి విసరు మొదలగు బాధలఁ బడుచుండెడిదానను. నీమాటలు విని కిటికీ లన్నియుఁ దీసియుంచుట యారంభించిన తరువాత నాకావికారాలు కనఁబడుటలేదు.

కృ:- ఈవిషయ మెప్పుడును నిజమే. సరియైన వెలుతురును గాలియుఁ దగులనిచో శరీరమునకుఁ దగినంత విశ్రాంతి యుండదు. ఇండ్లలోని తేమ పోరాదు. తేమ గల ప్రదేశముల నివసించుటచేఁ బలురోగములు పుట్టును. ఎండవలనను దుర్వాయువులు నశించును. వెలుఁగులేనిది మనకుఁ గన్నులున్న ప్రయోజనము లేదు. అర్ధరాత్రిమున నిద్రమేల్కొనినపు డింట దీపము లేనిచో మనయింటివాకిలి యెచట నున్నదికూడఁ గొన్ని తరుణముల మనము కనుఁగొనఁజాలము. అదియును గాక నిద్రావస్థం దక్క విశేషకాలము చీఁకటియం దుండఁజాలము. అట్లుండిన నేమియుఁ దోఁచక చీకాకు కలుగుటే కాక యారోగ్యభంగము కలుగును. పెక్కుసారులు నేరము లొనరించిన దొంగలను సర్కారువారు చీకటికొట్లయం దుంచి జ్ఞానోదయ మొనరింపఁ జూచుచున్నారు. వెలుఁగుతోపాటుగ నెండయు మన యారోగ్యమున కత్యావశ్యకము. ఏదేని యొక చెట్టుపైన మనము పందిలి వేసి దాని క్రిందతగులనట్లొనరించిన నది యాకులు రాలి నశించును. అటులనే శరీరములకు నెండయు వెలుఁగును దగుమాత్రము సోఁకుచుండనిచో మనము రోగగ్రస్తులమగుదుము. వలసినంత యెండయు గాలియుఁ దగులుచుండుటచేతనే బీదవారి పిల్లలు దృఢగాత్రులై యారోగ్యముతో నుందురు. గాలియు నెండయుఁ దగినంతగఁ దగులని భాగ్యవంతుల పిల్లలు బక్కటిల్లి బలహీనులై యుందురు. ఇట్టివిషయాలు మన మెఱిఁగియుండుట మనకొఱకే కాక కుటుంబక్షేమార్థము నవసరము. మనదేశపు స్త్రీజనులలోఁ బెక్కండ్ర కీవిషయము తెలియకుండున శిశుమరణము విశేషముగఁ గలుగుచున్నదని దొరతనమువారు జనన మరణముల లెక్కలను బట్టి నిశ్చయించియున్నారు. మన సోదరీమణులెల్లరు నిఁక నెంతకాలమున కీయంశముల నెఱిఁగి క్షయకారణము నివారించుకొనఁగలరో యని నేను జింతిలుచున్నాను.

జగ:- చూచినావా ? చెట్లవలన మంచి గాలి వచ్చుచుండును. ఇంటిచుట్టుఁ జెట్లుండిన గాలికొట్టుట కేమిలోటు నుండదుకదా !

కృ:- చెట్లవలన గాలి రాదుకాని చల్లదనము కలుగును. ధారాళవాయుప్రసారమునకుఁ జెట్లడ్డమై తన్నిరోధము నొనరించుచుండును. గాలి తగులుటచేఁ

చెట్లకొమ్మ లూఁగుచుండును. అట్లు కొమ్మ లూఁగుచుండుట చూచి గాలి కొంతబలముగా వీచుచున్నదియుఁ దెలిసికొనఁగలము.

జ:- ఒక గాలినిగుఱించియే యిన్నిసంగతులు చెప్పితివి. ఇన్ని జ్ఞాపకముండునా? ఉన్న నట్లు జరుపుకొనఁగలమా? అద ట్లుంచు. నీటినిగుఱించికూడ నంతగ్రంథ ముండదా? కానీ విందును. చేతనైనఁ జేయుదము. లేకున్న నెప్పటట్లే.

## నీరు

కృ:- ఆచరణమువలన నన్నివిషయములు నభ్యస్తములగును. అభ్యాస మెట్టిదుష్కర కార్యమును సుకరముగ నొనర్చును. గాలికంటె నీరుంగూర్చి మన మధికముగ నెఱిఁగియుండు టావశ్యకము. దైవతంత్రమువలననే జలమునకు లోకవ్యాప్తి కలుగుచున్నది. విచారించిన మనకది తెలియుట కల్గు. సూర్యకిరణములవేఁడిమిచే సముద్రజలమును భూమిపైజలమును మఱఁగి యావిరిరూపము దాల్చి నీళ్ళయందుఁ బడిన చెత్తవలె గాలిపైకెగసి తేలుచుఁ దెట్టెగట్టును. ఆయావిరి తెట్టెనే మబ్బని వాడుచున్నారము. నీళ్ళు కాఁచునప్పు డావిరి మూఁత నంటియుండి వేగముగఁ దెఱచినప్పుడు వెలుపలనుండు చల్లగాలి తగిలి యామూఁతనుండి జలబిందువులు రాలుచుండుట దినదినమును జూచుచుందుము. మూఁత నంటియుండు వేఁడిగల యావిరికిఁ జల్లగాలి తగులఁగనే బిందురూపమై క్రిందఁబడుచుండులాగుననే సూర్యరశ్మిచే నావిరి రూపము నంది గాలి పై కెగసి మేఘమైనదియుఁ జల్లగాలి తగిలినంతనే బిందురూపముం దాల్చి భూపతనమగుచుండును. దానినే వానయని వాడుదుము. ఇది కాలపురుషుఁడను నేతము నెత్తువాఁ డొనరించిన చిత్రమనియు మిగుల నిమ్నప్రదేశములనుండు నుదక మత్యున్నతములగు పర్వతాగ్రవృక్షములకుఁ జేర్చి వానిం బెంచుచుండుననియుఁ దెలిసికొని మన మానందించఁదగును.

జగ:- బడిలోఁ జదువుకొన్నప్పు డీమాటలు చెప్పినట్లు జ్ఞాపకముకాని మరల బొక్కా తెలవనికారణముచేత నంతయు గుంటఁబెట్టి గంటవాయించిన ట్లయ్యెను.

కృ:- బాల్యమప్పుడు బోధింపఁబడు విషయము లన్నియు మనము పెద్దవారమైనప్పు డనుభవమునకుఁ దెచ్చికొని సుఖపడుటకొఱకే పాఠశాలలందు నేర్పుదురు. కాన మరలఁ దలంపునకుఁ దెచ్చికొని సుఖమొందుచు నొరుల కావిషయములఁ జేతనైనంతవఱకుఁ దెల్పి వారికిని సుఖము నాపాదించుట విధి.

జగ:- (కొంచెము విచారముతో) 14 ఏండ్లదాననై యిచటికి వచ్చిననాఁటినుంచి రెండుపూటలు నాపొయ్యి మెడకుఁ గట్టుకొని యిల్లు దిద్దుకొనే సరిపోయినది. ఎటువచ్చియు నీరెండేండ్లనుంచి కొంచె మద్దముపడుటకును గూర్చుండుటకును నసులుబడిగా నుండుచున్నది.

కృ:- మీరుగనుక నంతచిన్నయీడుననే కాపురమునకు వచ్చి చేదోడు లేకుండ నిల్లు దిద్దుకొని నలువురిలోను జగదంబగారు కావలదాయని పేరు తెచ్చుకొన్నారు.

## మేనమామ పుత్రపౌత్రులు

సదాశివయ్యసంతానములో మహాలక్ష్మిత్రయిపాత సత్యవర్ధనము. వీనికి హూణ భాషయు నరయఁ జెప్పింపఁబడినందున [illegible] రావుగా వ్యవహారికులు వాడుచున్నారు. మ్లేచ్ఛభాషలో వీఁడు మెట్రిక్యులేషను ప్యాసై పోలీసుశాఖను బోయి ప్రవేశించెను. సూపరెంటెండెంటాఫీసు రైటరుగా సుస్థిరుఁడయ్యెను. సక్రమముగాఁ సబిన్స్పెక్టరుద్యోగముగూడ సంప్రాప్తించిన సంపాదింపవచ్చును. ఆసఫాబాదులో నవ్వాఁడు ప్రస్తుతము పనిచేయుచున్నాఁడు. నెలకు నలువదిరూపాయలు కాఁబోలు జీతము. వివాహమైనది కాని పెండియుఁ గానలసివచ్చినది. అవ్వివాహము హనుమకొండపోలీసు సూపరెంటెండెంటాఫీసురైటరుగా నున్నప్పుడే యైనయది. కాజీపేటలోఁ గాఫీహోటలు పెట్టి యవ్వ డుండుచున్న యువతి యొకతె స్వభోజనశాలభుజించు సబిన్స్పెక్టరుల ద్వారమున వీని విధము విని పిలిచి పిల్లనిచ్చి పెండ్లి చేసినది. పెట్టుపోతలలోఁ బ్రీతి చూపినది. కాని యావిడ స్వైరిణి. కాంతుఁడు కరీమునగరముతాలూకాలోని మానెకొండదాపు మహీసురుఁడు. అమాయికుఁడు. అవసరితము నయ్యమాయికు నండనుండక యాయమ యిచ్చవచ్చినట్లు విహరించుచుండును. అక్కఱగలిగినప్పు డాయనయంతికమున కరిగి యయ్యక్కఱ తీఱునంతవఱకు నుండుచుండును. ఒక్కొక్కప్పుడు తానున్నచోటికే రప్పించుకొని యుంచుకొనుచుండును. ఇట్లు రమ్మన్నవచ్చుచును బొమ్మన్నఁ బోవుచును నీయమ కాయన వశుఁడై వర్తించుటయు నొకయాఁడుపిల్ల యుద్భవించినది. పెద్దపెరిఁగినది. పెండ్లియీడు వచ్చినది. తల్లి యాపిల్లకుఁ దగినంత చదువుకూడఁ జెప్పించినది. ఇక్కడిచదువు చాలక మదరాసునకే పంపించినది. మానినీపాఠశాలలో నుంచినది. నవనాగరకను జేసినది. సత్యవర్ధనమునకు సమర్పింపకమునుపే సతీపతులకుజవాబుసవాబులు నడచినవి. పరస్పరానురాగములు ప్రబలినవి. పదపడి పరిణయము జరిగినది. బాగుగానే యున్నది. అత్తమామల యెడలను వదినెమఱఁదండ్రయెడలను వలసినంతప్రేమ చూపుచు నవ్వధు వవ్వారి కానందము కలిగించినది. కాని జనని స్వైరిణియగుటఁ గడకుఁ గరీమునగరము నాటకపుఁ గంపెనీలో వెలవెలందులచేతంబోలె వేషము వేయించినది. పాడించినది. ఆడించినది. ఆవృత్తాంతము సత్యవర్ధనరావు శ్రవణములఁ బడియెను. అత్తింటి కరిగెను. ఆగ్రహపడియెను. అత్త క్షమాపణ చెప్పినను ననుగ్రహింపకపోయెను. రజస్వల కాకపోయినను రమణిని దమయింటికి రమ్మనియెను. అంతకుఁబూర్వ మత్యంతానురాగముగలది యైనను నాకె రాకుండుటయుఁ బలాత్కారముగాఁ బట్టుకొనిపోయెను. చెఱసాలలో నుంచినట్లు స్వగృహమం దుంచెను. అత్తనుగాని యావిడ బంధువులఁగాని యాత్మవసతి నడుగుపెట్టనీకపోయెను. ప్రౌఢతోడంబోలె భార్యతోఁ బ్రవర్తింపఁ బ్రయత్నించెను. అత్త యంత నాత్మజ యవివాహితయే యనియు సత్యవర్ధనరావు చౌర్యముననే భార్యఁ గావించుకొనెననియుఁ బ్రభుత్వమువారికడఁ బరమాసత్యమును బ్రకటించి వారంటు జారీచేయించెను. పోలీసుద్యోగియై యుండియుఁ జాల ననుచితము సలిపితివని సర్కారువారు మందలించుటయు సత్యవర్ధనము సత్యము నివేదించెను. కాని యయువతి యాత్మజచేతఁగూడ నవివాహితనని యనిపించెను. అయినను యథార్థమును గ్రహించి యవ్వారతని శిక్షింపక సివిలుసూటు వేసికొమ్మని

న్యాయాధిపతులు సత్యవర్ధనమునకు సతిగాఁ దివ్యాసించిరి. కాని సత్యవర్ధనము స్వాధీనము చేసికొనుటకు తగిన యుపాయము నగపడజాలదు. పోరాడి పొనరించుకొనుట కాతనికిని రోతపుట్టెను. ఇంత తెగిపోయిన యింటిని గట్టిగాఁ బట్టుపట్టి కైవసము చేసికొన్నను గాఁపురము చేయుట కష్టమని సంధిచే స్వవ్యవహారవ్యయము చతుశ్శతరూప్యములు గైకొని సంత్యజించెను. మరలఁ బరిణయము జరుపుకొనుటకు మనసుపెట్టెను. వీఁడు మైనరువెళ్ళకమును పే మాత నప్పు సుబ్బమ్మ యాజ్ఞలు పెట్టుట కంగీకరింపక యామెను నసుజాలను దీసికొని వేఱుగానుండ మొదలుపెట్టెను. అయ్యా సదాశివయ్యా సుబ్బమ్మ పగ్గలనే సుఖముండుచు నయ్యుభయక్షేమములను నారయఁ గలిగెను. అప్పటికే వీఁ డంతరయో యింతరయో యార్జింప నారంభించుటచే నబలయగు నప్పు సంరక్షణ కక్షీణింపక యమ్మను నర్భకులను నవనించుచు వేఱుగానుండుట విశేషమే కాని ప్రకృత మాపద్ధతి పరిత్యజించినాఁడు. పునర్వివాహాతురతమై ధనమును గూర్చుకొనుటకై తానొక్కఁడే యుండుచున్నాఁడు.

జనని లక్ష్మమ్మ చరమసంతానసహితముగా మహాలక్ష్మి మందిరమున మనుచున్నది. అదియు నంత యర్థసమృద్ధి కలది కాకుండుటచే నే బ్రాహ్మణగృహస్థు నింటనో యింత యుడుక వేసిపెట్టుచును మఱికొంతకాలము మగపోఁబుట్టువుల మందిరముల మనుచును నెట్లో యీ దేహయాత్ర చేయుచున్నది. భర్త సదాశివయ్య యాస్తి కొంత పరులు కొట్టుకొనిపోకుండ నన్న రామస్వామి యడ్డపడియుండి యిటీవల నిద్దాని పేరఁ బెట్టెను. అది నకరకంటిలో నొక గృహమును బది పండ్రెండెకరములు భూమియు. అంతరయో యింతరయో యద్దానిపై వచ్చు నర్థముఁగూడ నిది జీవికగాఁ బెట్టుకొని యెట్లో బ్రతుకుచున్నది.

సదాశివయ్య సంతానములో సత్యవర్ధనము తరువాతిది పద్మ. దానిని నల్లగొండ జిల్లా జనగాము తాలూకాలోని నర్మెట్ట గ్రామనివాసి బ్రహ్మభట్ల యయోధ్యరామయ్య కిచ్చి పరిణయము జరిపిరి. అయోధ్యరామయ్య యిటీవల నాకునూరుకు నివాసము మార్చుకొనెను. మేనత్త యాస్తి కొంత రాఁ దానచట నుండుటకుఁ దలపెట్టెను. వ్యవసాయము పెట్టుచును దీయుచును వలసినంత యాదాయము పంటపలంతివలనఁ బడయలేక కాఁబోలు జ్యోతిషము కొంత నేర్చి జాతకములు వ్రాయుచును బ్రశ్నలు చెప్పుచును బర్యటించుచున్నాఁడు. మంచిరోజులు వచ్చినవి కాఁబోలు మహాదాశ్రయ మొకటి దొరకినది. తాండ్ర నరసింహారెడ్డి దేశముఖుగారు తత్కుటుంబమునకుఁ బట్టు తండులము లన్నియుఁ దామే యిచ్చుటకుఁ దలపడినవారఁట. వీరు వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారి ద్వితీయకుమారులు. వెంకటకృష్ణారెడ్డిగారి చరిత్ర విదితము కాని విద్వాంసులు వేయింటి కొక రుందురు. అనేకక్రతువులు చేయించియు పంబడిపూడి యనంతరామశాస్త్రులుగారి ననేకసంవత్సరములు స్వస్థానమం దుంచుకొని సకలపురాణములను శ్రవణించియుఁ గాశీగయాప్రయాగాది పుణ్యక్షేత్రములు తా సేవించుటయే కాక క్షితిసురసహస్రముచేత సేవింపించియుఁ బలుబ్రాహ్మణకుటుంబములఁ బరిరక్షించియు దంపతిపూజలఁ దన చేతిమీఁదుగా నొనరించియు వివాహోపనయనములు విప్రుల కెందఱికో విత్తమిచ్చి కావింపించియు విమలయశఃకన్యోద్వాహితుఁడై వేల్పుల విందు లందుకొనుచుఁ ద్రివిష్టపమునఁ దేజరిలుచున్న దివ్యపురుషుఁడాయన. ఆయన పెద్దకుమారుఁడగు నరసింహారెడ్డి దేశముఖుగారు లక్షల కొలఁది ధన

మార్జించి బహుప్రాసాదనిర్మాణముచే జనవాపురమును బ్రసిద్ధముచేసి బ్రాహ్మణుల యందు భక్తివిశ్వాసములతోఁ బ్రవర్తిల్లి పరలోకగతుఁడగుటయు వీరిపుత్రుఁడు వేంకటకృష్ణారెడ్డిదేశముఖుగారు విద్వద్బ్రాహ్మణుల విశేషించి సన్మానించుచు విఖ్యాతులగుచున్నవారు. ఇట్టికుటుంబమున జన్మించిన చిన నరసింహారెడ్డిదేశముఖుగారే యయోధ్యరామయ్యకిపు డాశ్రయమైనవారు. వీరును విద్వాంసులయెడల విశేషాదరము చూపువారు, విరాగులు. వర్షాశనములిచ్చి కనుమతీసుతులఁ బరితృప్తులఁ జేయుచుందురు. పట్టి పరిణయమని పఱతెంచిన మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారికిఁ బంచాశద్రౌప్యము లిచ్చి పంపించిరి. వైశ్వదేవమని వచ్చిన మిత్తింటి పద్మనాభశాస్త్రిగారికి ముప్పదిరూపాయ లప్పనముచేసిరి. అట్టి నరసింహారెడ్డి దేశముఖుగారి యభిమానమునకుఁ బాత్రుఁడై యయోధ్యరామయ్య స్వయోషిత్సంతానసంరక్షణమున జాగరూకుఁడై యున్నవాఁడు. ఈదంపతులకు నిరువురుబిడ్డలు. భర్తక్రింపను వత్తక్రింపను నణఁగిమణఁగి పద్మమ్మ పాతివ్రత్యమును బరిపాలించుచున్నది. ఇదియును జదువుకొన్నదే కాని యూచదు వక్కలదియుం బోలె నంతగా వంతుకెక్కదు.

దీనితరువాతివాఁడు శ్రీరాములు. వానికిని వయసు వచ్చినది. అవ్వాఁడును హనుమకొండలోనే యాంగ్లేయవిద్య నభ్యసించెను. అక్కయు నన్నయు వేఱై యొకరును స్వవిషయము నరరింపకున్నను సంభావనలకుఁ జనియు జనకునాఁటినుండియు నున్న గణపత్యర్చనము గావించియు, ట్యూషను జెప్పియు స్వార్జితముతోనే చదివెను. అక్క సుబ్బమ్మ యనుగ్రహించి యన్నాదిక మమర్చుచున్నను నిన్న మొన్నటి హిందూమహమ్మదీయ కలహములలో డెందము చలించుటయుఁ జదువుచున్న స్కూలుఫైనలు చాలించి రెండవయక్కయైన మహాలక్ష్మి యండఁజేరెను. వీనికి నూఁకునిచ్చువిషయములోనే మహాలక్ష్మికిని మగనికిని మదులు భేదించినవి. మగఁడు మరల మార్గమునకు వచ్చుచున్నాఁడు. నకరకంటిలోని భూమియు గృహము నమ్మియైనను నాత్మజ కాఱువందలరూపాయల యాభరణములు పెట్టుచో నీశ్రీరాముల కిచ్చుటకిష్టపడినాఁడు. అందులకు బదులుగా 8 వందలరూపాయలు విలువగల గుంటూరులోని తనయింటికానుకొనియున్న ఖాళీస్థలము దానవిక్రయాధికారము లేకుండఁ దద్దంపతుల పేర రిజిష్టరుచేయింపుటకుఁ దలంచినాఁడు. క్రమముగా నన్నియుఁ గావచ్చును. శ్రీరాము లీదేశముననే స్థిరపడవచ్చును. ప్రకృతము గుంటూరులో నొకటిరెండు చోట్ల ట్యూషనులు చెప్పికొనుచు మామ రామస్వామియింటనే యునుచున్నవాఁడు.

ఇవ్వానితరువాతి దిందుమతి. ఇదియు నేఁడెనిమిది క్లాసులవఱకును జదువుకొన్నది. పద్మమ్మను బరదేశమం దిచ్చి తండ్రియే దారిపెట్టుటచేఁ దత్పుత్రులును పన్మార్గమే త్రొక్కి మంథెనతాలూకాలోని కుందవరమను గ్రామమునకుఁ గొనిపోయిరి. గణపతిశర్మయను గాశ్యపీసురయువకున కిచ్చి కల్యాణము గావించిరి. ఆతఁడా స్తికలవాఁడఁట. అయ్యది యటు లుండుఁగాక. ఆయనయు హనుమకొండలోనే యాంగ్లేయ విద్య నభ్యసించెను. స్కూలుఫైనలు ప్యాసయ్యెను. ఇందుమతిని బెండ్లాడినపిదపనే యిరువదోముప్పదో వేతనముగల రాజకీయోద్యోగము తా జతపడినది. సుదతియుఁ దానును సుబ్బమ్మయింటనే సుఖముండుచున్నారు. భార్యాభర్తలే కాక వదినెమఱఁదులును నప్పచెల్లెండ్రును నన్యోన్యానురాగముతో నవినాభావసంబంధముతో నలరుచున్నారు. గణపతిశర్మ కడు బుద్ధిమంతుఁడుగనే కనుపట్టుచున్నాఁడు.

ఇందుమతి తరువాతివాడు కృష్ణయ్య. ద్వాదశవర్షవయస్కుడు. మామ రామస్వామి సామీప్యమునను మఱికొందఱ సామీప్యమునను సంస్కృతమును స్మార్తమంత్రములను జదువుచున్నాడు.

వీనితరువాతిది లలిత పదివర్షవయస్క. తల్లిపోషణమువలనే తద్బాలయుం గృష్ణాంమును బాగు పెరుగుచున్నారు. ఈబిడ్డ యొక్కరితమాత్ర మింతవఱ కవివాహిత. వాళ్లొడుకున కిత్తుమని వాళ్లనుచున్నారు. మేనమామ పరంపరయనియు దీని సూనునకుం బెండ్లిచేసినం బరంపర తెగిపోకుండం బ్రవృద్ధమగుననియు నేనును నెంచితినిగాని ప్రకృతపరిస్థితులు కొన్ని బాధకములుగాం బరిణమించుననీ విరమించుకొనవలసివచ్చినది. తల్లి లక్ష్మమ్మదగ్గఱనే తనయ పెరుగుచున్నను నది యబలయగుట నస్వతంత్రయే కాక యసమర్థురాలుగూడ. సర్వస్వతంత్రుడైన జ్యేష్ఠభ్రాత చాల దూరముండుచు జాబులకే జవాబీయడు. ఇదివఱ కీరువురుచెల్లెండ్రకును దానే పెత్తనము గట్టుకొని తద్వివాహము చెప్పించిన యక్క సుబ్బమ్మయాత్మజుం డెక్కువచ్చుచుండుటచే మరల నీవ్యయము భరింపలేక తాటస్థ్యము వహించినది. ఈయుపాకారణములచే నెంతకాలమునకో కాని యీవిషయము తేలక స్తంభింపవలసివచ్చినది. అన్నలు నప్పలు నమ్మయందఱు నొకటిం గూడినం గాని యది తేలదు. తేలినను నత్తవారియింటిదియని యుల్లం దరుగుట కిల్లిచటనో యీసకించబడదు. ఆపిల్లకే చూచించి యుండవలసినంత యవసర మమ్మదాత్మజున కిప్పట్టునం గన్పట్టదు. ఇంకం గొంతకాలము నిచ్చుటకు వచ్చుచున్నవారు. విషయ మిటు లున్నదికనుక నింక నీవిషయము విడుతము.

మా మేనమామకు సదాశివయ్యతరువాతికొడుకు నారాయణ. ఆయన మాయన్న రామలింగయ్య యీడువాడో యంతకుం బెద్దవాడో యవిదితము. చిన్నయన్న యప్పయ్యవదినెయే నారాయణభార్య. మా పల్లిగుంత మేనత్తకొడుకు వీరయ్య పెండ్లమును నారాయణ యప్పయ్యల యత్తయు నప్పసెల్లెండ్రు. వీరయ్యయు నారాయణయు నప్పసెల్లెండ్ర కొడుకులు. పెత్తల్లికొడుకు వదినెకూతురు నారాయణకును గూతురైనను గూతురు పెండ్లికూతురను వాడుకనుబట్టి తల్లివరుస గల పిల్లను జేసికొనుట తప్పుకాని కూతురువరుసపిల్లను జేసికొనవచ్చుననియు దూరపువరుసయనియు నారాయణ యాపిల్లను జేసికొనుటకును వారలిచ్చుటకును నలుగురు నంగీకరించుటచే నాండ్లైపోయినవి. అట్లాకన్యను నారాయణ చేసికొనుటయే న్యాయవిరుద్ధమైనదగుం గాని యాకె చెల్లెలి నమ్మదగ్రజుండు చేసికొనుటంత గర్హ్యము కానే కాదు. మా మేనత్తకొడుకు వీరయ్య పెండ్లమును మాయక్కయుం దోడికోడండ్రు. అక్కతోడికోడలి చెల్లెలిబిడ్డ యన్నకుం గోడలగుచున్నది. అక్కబిడ్డల ననేకులు పెండ్లాడుట యందఱు నెఱింగినదియే. అక్కసెల్లెండ్ర కూతుండ్రనే యనేకులు వివాహమాడుచున్నప్పు డక్క తోడికోడలి యక్కసెల్లెండ్ర కూతుండ్రం బెండ్లాడుటలో నాశ్చర్యమేమున్నది? మాతులకన్యాపరిణయమునే మన ప్రాచీనులు కొన్నిదేశముల నిషేధించియున్నారు. నిషిద్ధమైన యామాతులకన్యాపరిణయముతోపాటు భగినీసుతాపరిణయముగూడం బరిపాటియైపోయినది. నారాయణతలిదండ్రులు మాకు మేనత్తమేనమామలు. మాతలిదండ్రులు నారాయణకు మేనత్తమేనమామలు. అన్యోన్యము మేనత్త మేనమామ కొడుకులైన యప్పయ్య నారాయణలు పడ్డకులైన వారు. అయిన నైరికాని వారు బావమఱదులుగానే ప్రవర్తిలిరి కాని యన్నదమ్ములుగా వ్యవహరింపరు. ఆవారి

# అభినవసరస్వతి

సంపుటము ౩౧ } ప్రమాది నామసంవత్సరము ఫాల్గునమాసము { సంచిక ౧౨

## కృతివిమర్శము

దివ్యవాణి— ఇది సనాతనపక్షమున నూతనముగా బయలువెడలిన వారపత్త్రిక. పాంచజన్యాదులవలెఁ బ్రారంభశూరయే యగునేమోయని పలువురు భావించిరికాని సార్ధసంవత్సరము సక్రమముగా జరిపినది. బాలారిష్టములు 12 ఏండ్లుండునని భయపడ నవకాశము లేనంత పరిష్కృత పడసినది. సికింద్రాబాదు స్థిరవసతి చేసినది. ముస్త్యాల వెంకట కృష్ణయ్యగారు మున్నగు మర్చెంటుల మహాశ్రయమున మనఁగలిగినది. విపక్షపత్త్రికల విదల్చివేయుచున్నది. సనాతనమతవిషయములు సహస్రములుగా సంతరించుచున్నది. బహువిషయములు ప్రకటించుచున్నది. ప్రాచీనాచారప్రచురణముతోనే పరితృప్త కాక ప్రధన ప్రభుత్వవిషయప్రచురణముగూడ బాగుగా సాఁగించుచున్నది. అనేకులమనంబులు హరించుచున్నది. ఇంతలోనే యింతదగుటకు శిష్టశ్రేష్ఠు లందఱకును జిరపరిచితుఁడైన చివుకుల అప్పయ్యశాస్త్రిగారి సంపాదకత్వమే చాలినంత సద్ధేతువు. ఆయన సనాతనమతసముద్ధరణమున బద్ధకంకణుఁడు. వర్ణవ్యవస్థా రజస్వలావివాహఖండనాది వర్ణాశ్రమవ్యవస్థాపకగ్రంథములు వ్రాసి వాసికెక్కినవాఁడు. గర్గభాగవతాది ఘనగ్రంథకర్త. మహాకవి. ఇట్టి దిట్ట గనుకనే దేదీప్యమానముగా దిగ్దేశములను దివ్యవాణిని దింపుచున్నాఁడు. అయ్యది యనుపద్రవముగా మనుటకు ముద్రాక్షరశాలనే మున్ను కొన్నవాఁడు. అనేకైశ్వర్యవంతుల యభయహస్తముల నందుకొనుచున్నాఁడు. కాని పత్త్రికం బరిగ్రహించి పఠించుచున్న పలువురును జందాలు పంపుటకు శ్రద్ధాళువులు గాకుండుట చాలవిచారకరము. ఇదియే హిందూదేశమునకున్న పరమదౌర్భాగ్యము. ఎంతయభిమానములవారైనను నిచ్చుట వచ్చువఱకే పుచ్చుకొనుట పత్త్రిక. గ్రాహకు లెల్లరును గరమభిమానించి తమచందాలఁ ద్వరితంబ పంపుచు దివ్యవాణి స్థిరస్థాయినిగాఁ జేయ నూఁత యొసఁగుదురుగాత

కల్పవల్లి— ఇయ్యది పక్షపత్త్రిక. ప్రత్తిపాటి రామకృష్ణయ్యగారిసంపాదకత్వముతో నర్సారావుపేటనుండి యిది నడపఁబడుచున్నది. దివ్యవాణి ధీమత్పత్త్రికటీయమాణ యగుటనంతర మొకకొంత యగపడినను ననేకాంశములలో నద్దాని ననుకరించుచు నిద్దియు నిక్కాలమున సనాతనులఁ బ్రోత్సాహపఱచుటకుఁ జాలియున్నది. ఇద్దానికిని ముద్రాక్షరశాల ముఖ్యసహాయమై ముందంజ వేయించుచున్నది. కనుకఁ గల్పవల్లికిని గండములు గడచినవనియే గర్వించుచు సనాతనమతావలంబు లందఱును జందాదారులగుటకును నాచందాల నభిమానపురస్సరముగా ననుపుటకును నగ్గలము ప్రోత్సాహితులు. చిన్న యచ్చుకూటమొకటి యున్నదికనుక 15 దినములకు సరిగనే ప్రత్తిపాటి రామకృష్ణయ్యగారు పత్త్రిక ప్రచురించుచున్నారు. పండితవ్యాసములు ప్రచురమగుచున్నవి. సనాతనమనంబుల హరించుటకుఁ జాలియున్నది కాని గ్రాహకుల యౌదాసీన్యము

గూడ ఘనమయియే యున్నది. సాహిత్యశిరోమణి దమ్మాలపాటి శేషగిరిరావుగారీపత్రికకు గౌరవసంపాదకులు. వారివలననే యిది వన్నెకెక్కుచున్నదన్నను ననవచ్చును.

## —♦ గృహలక్ష్మి ♦—

ఇది యొక మాసపత్రిక. గృహిణులు గ్రహించి కలకాలము మెలఁగఁదగిన క్రమపద్ధతి యంతయు నిందుఁ గడు నుడువఁబడుచుండును. 12 సం॥ల నుండి ప్రకటీక్రియమాణము. పత్రికాసంపాదకులు ప్రఖ్యాతులైన కేసరిగారు. అమృతాంజనమును యశశ్శేషులైన కాశీనాధుని నాగేశ్వరరావుగారు దేశదేశముల విఖ్యాతముగావించినట్లు లోధ్రియను నౌషధమును వీరు లోకవిఖ్యాతమును గావించిరి. యశోధనార్జనమున కట్లది వ్యాప్తమును గావించుచు మదరాసు రాయపేటలో మహామందిరమును నిర్మింపించిరి. కేసరికుటీరమను పేర నయ్యది వాసిం గాంచఁగలిగెను. అదియే గృహలక్ష్మి కార్యస్థానము. గృహలక్ష్మియన గృహమందుండెడి లక్ష్మి. ఆయమ గృహిణి(భార్య)యే... భార్యలేనివాని బ్రదుకు నిరర్థకం, బదియె శోభ యింటి కంతటికిని. అట్టిగృహలక్ష్మికిఁ జేయు బోధయే యిది యగుటఁ గేసరిగారీపత్రికను గృహలక్ష్మినా రచింపఁజేయుచుఁ బ్రతి సం॥ పతివ్రతయైన ప్రాజ్ఞురాలి కొక్కతెకు బంగరుకడియమును బహూకృతి చేయుచున్నారు. గృహలక్ష్మియెడలఁగల కృతజ్ఞతను జూపుచున్నారు. ఆబహూకార మీ సం॥ చేబ్రోలు సరస్వతీదేవిగారికిఁ జేసినారు. ఈసరస్వతి మాసరస్వతీపాఠకులకుఁ జిరపరిచిత. మాసరస్వతికే కాదు. సరస్వతీరామాయణమును జదివియున్న సంఖ్యావత్కవులును సంఖ్యకు మించియుందురు. కాఁబట్టి యట్టిసరస్వతి కీమార్చి షష్టతేది మదరాసున జరిగిన కేసరికంకణప్రదానసమయమున నే నంపిన పద్యములను మాపాఠకులకుఁ జూపెట్టుచు నీపత్రికాప్రశంస యింతతో ముగించుచున్నవారము.

క. గృహలక్ష్మి సంపాదకు
బహుమతిగా నీవు నొక్క బంగరుకడెమున్
మహి ధరియించెద వంచని
బహుదినముల కీసువార్త వడె శ్రీమంతులన్.

క. బిడ్డ! సరస్వతి! ఇది చెవిఁ
బడ్డది. మన్మనము పోయి ప్రమదాంబుధిలోఁ
పడ్డది. ఎన్నాళులకును
బిడ్డకిక నేమిచేయవలయునొ యెఱుఁగన్? ౨

మ. మదియోజించితె వ్రాయనా నెదియు, నమ్మాడ్కిన్ విచారించి వ్రా
యుద మేనో భవదంఘ్రిఁ గేసరి స్వకీయోద్యోగ ముద్యోగమై
పొదలం గంకణభూష పెట్టుసమయంబుం గూర్చియన్నన్ గుణా
స్పద! ఈతీరు ఘటిల్లె. నేమియిఁక నే వ్రాయం దలంపూనుదున్? ౩

క. రామాయణరమణీయత భూమిం బ్రోచుటయు రసికపురుషవ్రజముల్
నీ మృదుకవితామాధురి వేమారులు జుఱ్ఱి కాన్క వెట్టఁగడంగెన్.

ఉ. కావున నొక్క కేసరియె కా, దొక వైదికుఁడెంబె కాదు, నీ
కవిథ మెల్లరున్ సరసు లిత్తురు సొత్తుల నోసరస్వతీ
దేవి! సరస్వతింబలె నుతింతురు. నీ కవితారసంబె యీ
భూవలయంబునం దగునుఁ బో యిఁక స్తన్యము పూఁపసాలికిన్. 5

క. గృహలక్ష్మిసంపాదకుఁ
డహరీశుఁడు యమునఁబోలె నాగృహలక్ష్మి
సహితముగా విహితముగా
ఊహాగహనము బ్రోవఁగలఁ డుడుకాత్మజ! మనుమా. 6

---

♦ శ్రీశ్రీ రాజరాజేశ్వరీదేవిగారి, అక్షరాభ్యాససమయాశీస్సు ♦ –

ఈరాజరాజేశ్వరీదేవిగారు శ్రీశ్రీ కొల్లాపురమహారాజ వెంకటరత్నాంబబహదరు గారి దౌహిత్రి. ఈయమ కీమాఘ బ ౨ (25_2_1940) అక్షరాభ్యాస మాచరింపఁబడి యెను. ప్రతిసం॥ పడయు తత్సంస్థానబహుకారమునకుఁగా నేనప్పు డప్పురమునకుఁ జనియుండి యాస్థానపక్షమున నాహూతుఁడనై యయ్యక్షరస్వీకారమహోత్సవ మవలోకించితిని. ఆ జటప్రోలుసంస్థాన యువరాజులగు శ్రీ జగన్నాథరావు బహదరుగారు స్వస్రేయయగు రాజరాజేశ్వరీదేవిని సరసఁ గూరుచుండఁబెట్టుకొని యత్యంతానురాగ పూరితముగా నక్షరస్వీకృతి చేయించిరి. అప్పట్ల వారు చూపిన దేవబ్రాహ్మణభక్తియుఁ బూర్వాచారపరాయణతయు నభినందనీయములు. ఇట్టివారగుటనే యీవృక్షసంస్థానపాలకులు పేరుప్రతిష్ఠలతోఁ బెంపువహించుచున్నవారు. ఆ యక్షరస్వీకార మాసంస్థానకవు లగు వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు బియేగారిచే నాచరింపింపఁబడెను. ప్రభువు లవ్వారిని బహుమూల్యాంబరాలంకృతులం గావించిరి. సుబ్బారాయుఁడుగా రారాజదౌహిత్రి కాశీస్సు లిచ్చిరి. ఆపద్యముల దిగువఁ దిలకింతురుగాక.

ఉ. శ్రీరతనాంబికాసతికిఁ జెన్నలరారెడు మన్మరాలవై
నారి సరస్వతీసుత కవారితమోదము గూర్చుబాలవై
వారని ముద్దులన్ గులుకు భాగ్యసుయోగ్యకళావిశాలవై
శ్రీరహిమీఱునీకు నిలఁ జేకుఱుఁగాతఁ జిరాయురున్నతుల్.

గీ. శ్రీసరస్వతీమాతకుఁ జిన్నిబిడ్డ
రాజరాజేశ్వరీదేవి రాణమిగులఁ
దల్లి ధీశక్తి కెనవచ్చు తనయ యనఁగ
వఱలుఁ జదువుల శ్రీ సరస్వతి యనంగ.

ఉ. శ్రీసతి భాగ్యవిస్ఫురితి శచీసతి యున్నతభోగలక్ష్మి వా
ణీసతి వాక్చమత్కృతిని నిచ్చలు నీకొనఁగూర్తురిగాక, బల్
వాసియు వన్నెయుఁ గలుగ భద్రమొసంగెడు వాక్కులక్షరా
భ్యాసమునుండి నీరసనపై నటనం బొనరించుఁగావుతన్. 7

---

—♦ ఉపనయనమహోత్సవము ♦—

అమలునాఁడు 25_2_40 రామసుబ్బారాయుఁడుగారి యాత్మజు నుపనయన ముహూర్తం బగుటయు

సీ. ఆశ్రితవాత్సల్య మాచరణం బెట్టి
పెనభూపతులకుఁ బరాపట్టుగుటనో
తండ్రితాతలనాఁటి దైవతబ్రాహ్మణ
భక్తి తానును వ్యక్తపఱచుటనో
రాజులుం గవిరాజు లీజగంబున నొక్క
తరగతియనెడి తాత్పర్యమునసో
ప్రత్యేకమైన తత్పరమోత్తమత్వంబె
యిట్లు ప్రేరేచిన హేతువుననో
రాజ జటప్రోలుసంస్థానరాజతనయుఁ
డల జగన్నాథరావుబహద్దరపుడు
వచ్చి యవ్వారియింటికి వడకభిక్ష
పెట్టె నూతాఁటు లాతేని ప్రేమ యేమొ ?

అట్లుకుమారరా జరుదెంచి కుమారబ్రహ్మచారికి గురుభిక్ష పెట్టుటయుఁ గవిరాజును నవరత్నహారము నవనీపతికిఁ గానుకవెట్టెను.

శ్రీరాజా జగన్నాథరావు బహద్దరుగారికి
శ్రీ రామసుబ్బారాయఁడుగారు కానుకవెట్టిన నవరత్నహారము.

క. శ్రీరాజ్ఞి రత్నమాంబిక
ధారాళవదాన్యతను, నితాంతభవత్స
త్కారమునఁ గాదె సలిపెద
మీరీతిఁ గొడుకువడుగు నిట మేము నృపా ! 1

ఉ. శ్రీరమణాకృతుల్ నృపతిసింహులు బీదలయిండ్ల కొక్కెడన్
వారనిప్రేమఁ దార గనవత్తురు తద్బహుపూర్వపుణ్యవి

స్వాంతతఁ దాము నట్ల నృపచంద్రమ ! పిచ్చుకగుంటవీరాడ భా
గీరథియట్లు నావసతికిన్ జనుదెంచితి; నేను ధన్యుఁడన్. 2

ఉ. ఇంతకు మించుభాగ్య మొకఁ డేదియు లేఁ; డిఁక నాదు సంశయం
బింతయు లేదు; వేఱె వచియింపఁగ నేల ? భవత్కటాక్షముల్
చింత లడంచు; సంపదలు చేకురఁ జేయు; మదీయగేహ మ
త్యంతము పావనంబు; సుగుణాభరణా ! యిఁక నేమికావలెన్ ? 3

ఎట్టిమహావ్రతంబులు మఱెట్టిజపంబు లొనర్చినాఁడనో ?
ఎట్టివిశేషకార్యములు నే నొనరించితినొక్కొ పూర్వమం ?
బిట్టుల నాగృహంబునకు నెంతయుఁ బ్రేముడి సింగరాంబనే
పట్టపుదేవిఁ జేసిన నృపాలుఁడు వచ్చెను. హెచ్చె భాగ్యముల్. 4

ఉ. రాజగురుండనంచుఁ గవిరాజుల కెల్ల సఖుండనంచు వి
భ్రాజితులైన ప్రాక్కవుల పక్కనఁ గైతముఁ జెప్పువాఁడనం
చోజను లేఖలన్ నడపుచుందుఁ గవీంద్రులతోడనంచు మీ
రోజన నేసి వచ్చుట నహో ప్రభుచంద్రమ ! భాగ్యవంతుఁడన్. 5

ఉ. రాకొమరుండవంచు ననురాగముఁ ద్యాగముఁ జూపుదం చెదన్
ప్రాకటభక్తిరక్తి గురుపైఁ గలవాఁడవటంచు సాత్త్విక
శ్రీకమనీయభావములచే నలరారెడువాఁడవంచు మీ
రాకను గోర, వచ్చితివి రాజవరా ! గురుతృప్తి హెచ్చఁగన్. 6

ఉ. భర్తవు మాకు, భూసతికి భర్తవు, శ్రీమతి యిందిరాంబకున్
భర్తవు, కీర్తికాంతకును భర్తవు, శ్రీ జటప్రోలురాజ్యభూ
భర్తవు, నాశ్రితావళికి భర్తవు, మత్ప్రియకావ్యకన్యకా
భర్తవు, నీవ; నీ వలన భారము మమ్మెటు సేరు నోప్రభూ ! 7

మ. పదిరెండేడులనుండి మీదు కృపకున్ బాత్రుండనై నేఁ బదిం
బదిగం జేయుచునున్న వాఁడఁ గవితావ్యాసంగ మీరీతిగన్
ముదితస్వాంతముతోడ మీరు మిగులం బ్రోత్సాహముం జేయ; నా
కిదియే చాలును జన్మజన్మముల కో పృథ్వీశ ! వేయేటికిన్ ? 8

మ. నవరత్నోజ్జ్వలహార మిచ్చెద జగన్నాథక్షమానాథ ! నే
కవినౌటన్; గొన వచ్చు రా దనకు మీకౌన్కన్; గవుల్, మేదినీ
ధవు లన్యోన్యము బందుగుల్; కుదిరె బాంధవ్యంబు మీతోడ నా;
కవగీర్ణాదృతి దీనిఁ దాల్పఁగద వయ్యా ! రాజచూడామణీ ! 9

ఈ సంబాధమం దేడము గానక యేను

తే. రాజచంద్రమ ! పట్టాభిరామశాస్త్రి
పరికృతభవదీయదర్శన ప్రముదితాత్ముఁ
డగుచు వడుగును దీవించి వ్రాయుపద్య
మొకటి విన నాజ్ఞ యీఁగోరుచున్న వాఁడు.

అని యనుటయు సభిపు నంతరంగ వేములగు నమాత్యులు మిర్యాల్యాపురము రామకృష్ణ రావుగారు, మద్దాలి ఉమామహేశ్వరరావుగారు మంచిది చదువుఁడనిరి. అప్పుడు.:

శ్లో. శ్రీవేంకటేశ్వరః పాయాత్ ప్రచ్ఛితరమోదకః పరః
సావిత్ర్యా వాహానకరం సాక్షరం వేంకటేశ్వరం.

సీ. త్వజ్జననంబు భూస్థలి నగ్రగణ్యమై
రహించు తద్బ్రహ్మకులమునందు.
త్వన్మూలపురుషుఁ డధ్వరము లే కావించి
పేరుపొందిన వాజపేయయాజి.
త్వజ్జనయిత్రి సత్కవయిత్రి పరమప
వితి మహాలక్ష్మి విద్వదీడ్య.
త్వజ్జనకుండు విద్వద్రాజవిహితుండు
సుకవివీరుఁడు రామసుబ్బరాయఁ.
డీదృశార్యపరంపర నీది కాన
తత్పరంపర పేర్ నిల్పఁ దలఁపుమోయి !
వడుగుకుట్టీఁడ ! వేంకటేశ్వరుఁడ ! నీవు
అట్లగుంగాతమను తాత యాశిషములు.

అని యాశీర్వచించితిని. ఇట్టియాశీర్వచనపద్యము లీకఁగొన్నియుఁ బరమమిత్రులు వ్రాసిపంపినవి పఠితములు. విస్తరభీతిని వానిలోని పద్యషట్కముమాత్రము పరికృతము ప్రకటీక్రియమాణము.

(ధూపాళి వేంకటసుబ్రహ్మణ్యసోమయాజులుగారు)

గీ. ఆశ్రమంబుల మేరువూ సనఁగఁదగిన
బ్రహ్మచర్యాశ్రమంబును బడసినావు
దీని విధులెల్లఁ బాటించి జ్ఞానివగుము
హాయిగా రామసుబ్బరాయకవితనయ !

గీ. బ్రహ్మచర్యాశ్రమంబులోఁ బడయఁదగిన
విద్య నేర్పుటకొఱకుఁ బవిత్రములగు

నాయురారోగ్యభాగ్యంబు లనవరతము
గూర్చుఁగాత గాయత్రి నీకు దయతోడ.

(అచ్యుతుని వేంకటాచలపతి రావుగారు)

గీ. గురుని బ్రహ్మోపదేశంబు గొని సకాల
సతుల నిత్యసంధ్యావందనము లొనర్చి
భక్తియుక్తి గాయత్రీజపంబు సల్పి
బ్రహ్మచర్యాశ్రమఫలంబుఁ బడయుమయ్య.

(గంధం నరసింహాచార్యులుగారు)

క. వడుగా! వేదాధ్యయనము
లడుగంటెనటంచు నెంచి యాశ్రమధర్మం
బడుగంటనీక సరియగు
పడుచును జేపట్టి జగతి భాసిల్లు మొగిన్.

(చేబ్రోలు రాజగోపాల సరస్వతులు.)

చ. లలిఁ గవితావధానస విలాస మెఱింగినవాఁడు తండ్రి; ము
ద్దులఁ గురిపించు నల్లికలతోఁ దులకించెడు సాధ్వి తల్లి; నీ
కలవడియుండెఁ గావ్యకళ లారయఁ జిన్నట నుగ్గుపాలతోఁ;
బళిర! తలంప నీదగద భాగ్యవిశేషము వేంకటేశ్వరా!

శా. సత్సాంగత్యము సాధుసేవ దయయున్ సౌజన్యసంపత్తి ని
త్యోత్సాహంబును ధర్మమార్గగతి ధీరోదారభావంబు, వి
ద్వాత్మైవాపరతంత్రతల్ గలిగి విశ్వప్రేమ తత్త్వంబుతో
వత్సా! వర్ధిలుమయ్య వర్షశతముల్ వాగ్దేవి వాదోడుగన్.

---

## — ♦ శ్రీ త్యాగరాయారాధనమహోత్సవము ♦ —

తే. అక్షరాక్షరమందును నగ్గలముగ
భక్తిరస ముట్టిపడునట్లు బహుళకృతులు
గానశాస్త్రంబునకుఁగల కట్టుదిట్ట
ముల రచించిన త్యాగరాయలను దలఁతు.

క. ధ్యేయుఁడుగాతలకాతఁడు. గేయంబులు తత్ప్రణీతకృతు లెల్లెడ. ఆ
రాయలయారాధన సుబ్బాయలు చేయించి, కొనుత బహుశ్రీలన్.

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఉ. మాటపసందు తెల్గుదెసుమాయని చాటఁగఁ దేనెవెల్లువల్
తేటలు దేరఁ బల్కులఁ గుదించిన గేయము లల్లి మంజు క
ర్నాటక గానభారతి ననంతపరిష్కృతగాత్రిఁ జేసె. ఆ
మేటిని త్యాగరాజనియమిన్ స్మరియింపని తెల్గు లుందురే?

ఉ. బత్తికిఁ దోడు సత్కవనశక్తియు నైగమయోగసార సం
పత్తియు నాగమోన్నత నిబంధనయుక్తియు ముక్తిరక్తియున్
చిత్తమునందుఁ బాదుకొనఁ జేసిన త్యాగయ గానబీజముల్
విత్తిన చేలపంటలగుపించెడి. చూడుఁడు తెల్గుసోదరుల్!

ఉ కొత్తలుగాదు మాదు తెలుఁగుల్ తమ దక్షిణగానరాజ్యమం
దెత్తినబావుటా వెలుఁగులే మఱి యిట్టు లనశ్వరమ్ములై
మొత్తములై చరాచరము మోహితమొంబొనరించిమించు లో
కోత్తర పావనీన సుమహాకృతుల్ స్మరియింత్రు త్యాగయా!

హరి రామలింగశాస్త్రి, శతావధాని.

ఈ సం॥ పుష్య బ ౯, ౧౦, ౧౧ ల యందు మాయూర... మహారాజశ్రీ గొట్టు ప ర్తి సుబ్బారావుపంతులు హైకోర్టువకీలుగారి యాజమాన్యమునను బుధప్రముఖుల యాదరాభిమానములను శ్రీసద్గురుత్యాగరాజారాధన మహోత్సవము కావింపఁబడెను. ప్రతివత్సరమందువలె నీ వత్సరమందుఁగూడ బూర్గుంపాటి యాంధ్రవాఙ్మయ సేవక సమితితరఫునఁ గొందఱు కవులును బండితులును నాహ్వానింపఁబడిరి. మొదటిరోజు సూర్యోదయము శ్రీత్యాగరాజస్వామి పూజాదికము నిర్వర్తింపఁబడి రెండుగంటలు లగ్గాయతు జరిగిన యాంధ్రవాఙ్మయ సేవకసమితివారి కవితాప్రశంస సందర్భములో నాసమితివ్యవస్థాపకులైన యింద్రకంటి వెంకటరమణమూర్తిగారు సమితివిషయములను ముచ్చటించి తాము రచించిన త్యాగరాజతారావళిని భక్తిరసప్రధానమైన యీశ్వర శతకమును బఠించి శ్రోతల నానందింపఁజేసిరి. పిమ్మట నాం, వా, సే, సమితి యుపాధ్యక్షులగు గొట్టుపర్తి సుబ్బారావుపంతులుగారు తాము రచించినపద్యములను జదివిరి. తరువాత నాం, వా, సే, సమితి గౌరవసభ్యులును శ్రీ నారాయణతీర్థాశ్రమస్థాపకులును సంగీతసాహిత్యప్రచారకులును నగు పుచ్చా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంగీతసాహిత్యముల యవినాభావసంబంధము శాస్త్రీయముగను యుక్తియుక్తముగను దెల్పుచు సాహిత్యపరులకు సంగీతము సంగీతవేత్తలకు సాహిత్యము నత్యంతమైన యవసరమనియు నీనాఁడు మన యాంధ్రదేశమున నట్టి యుభయశాస్త్రవిద్వాంసు లరుదైనారనియు నట్టివారు తయారుకావలెననియుఁ బ్రబోధించిరి.

5 గంటలు లగ్గాయతు పాపట్ల హనుమచ్ఛాస్త్రిగారిచేఁ గొదమసింగము లక్ష్మణాచార్యులు మార్దంగికశిరోమణి ముత్తేవి రంగాచార్యులుగార్ల పక్కవాద్యములతో గానము చేయఁబడినది. పిమ్మట నాం, వా, సే, స, గౌరవసభ్యులును బ్రకృత దురాచారములవల్లఁ గలిగెడి యనర్థములను నార్యవిజ్ఞానమునందలి విశేషములను నిరూ

నందశాస్త్రిగారును నాం, వా, సే, స, గౌరవసభ్యులు చిలుకూరి శ్రీరాములుగారును వెంకటరమణమూర్తిగారును హనుమచ్ఛాస్త్రిగారి గానము శాస్త్రీయమైనదిగాను మిక్కిలి రసోచితముగాను నుండినదని పద్యములతోఁ బ్రశంసించిరి. రాత్రి పాణియం సీతారామభాగవతులుగారిచే రుక్మిణీకల్యాణహరికథాకాలక్షేపము గావింపఁబడినది.

రెండవదినము సూర్యోదయము సచ్చిదానందశాస్త్రిగారిచే భగవద్గీతాభాష్య కాలక్షేపమును బిమ్మట నడుసుమిల్లి నారాయణదాసుగారిచే సీతాకల్యాణ హరికథా కాలక్షేపములు గావింపఁబడినవి. 3 గంటలు లగాయతు ... పుచ్చా వేంకటసుబ్రహ్మణ్యముగారు నాదోత్పత్తినిగూర్చియు సర్వశాస్త్రములకు సంగీతశాస్త్రమునకుఁ గల సంబంధమును శాస్త్రములకును శరీరమునకును శరీరమునకును వీణకును గల పరస్పర సంబంధమును నిదర్శనములును యుక్తులను శ్లోకములును నుదాహరించుచుఁ బ్రబోధించిరి. 5 గంటలు లగాయతు గానవిశారద పంచనదేశ్వరశాస్త్రిగారియొక్కయు శ్రీరంగాచార్యులుగారియొక్కయుఁ బక్కవాద్యములతోఁ బోలవరపు రామచంద్రరావు పంతులు బి యే బి యల్ గారి వేణుగానము నోటిపాట కావింపఁబడినవి. రాత్రి బుద్ధవరపు కురంగేశ్వరరావుపంతులు బి యే బియి డి గారిచే రామదాసుకథ నిరవధిక రసోచితముగ భక్తిపారవశ్యముతోఁ జెప్పఁబడినది.

ఆదివారము సూర్యోదయము ... శ్రీసుబ్బారావుపంతులుగా రుత్సవమున కరుదెంచిన కవిగాయకపండితులకు సాలుల నొసంగి చందనతాంబూలాది సత్కారములఁ గావించిరి. (వీ రీయుత్సవములో సాలువలిచ్చినట్లు వేరును గొనకుఁ గొల్లాయపంచెలు కూడఁ గోవిదుల కిచ్చినట్లు కన్పటదు) ... సాయంకాలము 5 గంటల లగాయతు పిరాట్ల శంకరశాస్త్రిగారిచే గానము చేయఁబడినది. పిమ్మటఁ బిరాట్ల శివరామశాస్త్రిగారి కుమారుఁడు ప్రత్యేకముగా హిందూస్థానగానము పాడెను. తరువాత (సుబ్బారావుగారు సనాతనధర్మబోధకములగు పత్రికలు తఱచు లేనేలేవనియుఁ బ్రకటితములైనవి కొలఁదికాలముననే యాఁగి పోవుచున్నవనియు నెన్నికష్టములువచ్చినను సహించుచు 31 సం॥లనుండి యవిచ్ఛిన్నముగా నభినవసరస్వతిని జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు సుమారు 70 సం॥ లవా రయ్యు నడపుచుండుట యెక్కువపనియనియు నవ్వా రీయుత్సవమున కరుదెంచుట మాపుణ్యవిశేషమనియు నుపన్యసించి యాపూటనే యరుదెంచిన శ్రీశాస్త్రులుగారిని రాంకవాలంకృతులం గావించిరి) సుబ్రహ్మణ్యశాస్త్రిగారు శాస్త్రీయగానవిధానమును దెల్పుచు సాహిత్యమందలి యర్థమును సంగీతము యొక్క రాగతాళములలో మేళవించి భావప్రకటనము రసోచితమగునట్లు గానము చేసిననే కాని సంగీతప్రయోజనము పూర్తికాదనియు నేఁటికాలమున సంగీతవిద్వాంసులలోఁ జాలమందికి సాహిత్యము సాహిత్యపరులకు సంగీతముఁ గొఱతగానున్నదనియు ముచ్చటించుచు నీసమావేశము సంగీతసాహిత్యపరిషత్తుగా నేర్పఱుపఁబడి శాస్త్రములకుఁ బ్రాముఖ్య మొసంగఁబడుఁగాక యని ప్రోత్సాహపఱిచిరి. ... పిమ్మట ... కురంగేశ్వరరావు ... గారు త్యాగరాజస్వామివారి జీవితకథాగానము చేఁ గాలక్షేపమును గావించిరి.) అది యనిర్వాచ్యమై యాసూర్యోదయము సభాస్తారుల సంతోషసాగరమున ముంచుటయు జానపాటి పటాభిరామశాస్త్రులుగారు తన్మయులై

సీ. భక్తిరసంబులోపల ముంచినావుపో
రహిఁ గురుంగేశ్వరరాయ ! మమ్ము
ధర్మరహస్యముల్ తగఁ దెల్పినావుపో
శ్రీకురుంగేశ ! సుశ్లోక ! మాకు
చీవాట్లు పెట్టి మా చెట్ట నెట్టితివిపో
వరకురుంగేశ్వర ! కరుణ నీవు.
ధ్యేయవస్తువును మాధిరి నిల్పితివిపో
ఓకురంగేశ్వరయోగి ! వేగ
స్వీయ తన్మయతను మాయందఱకుఁగూడ
కలుగఁజేసి చిత్సుఖంబు కరమొ
సంగినావుపో కురంగేశ్వరా ! కృత
జ్ఞులము. కొనుము మేముసలుపు నతులు.
ఆ. పొంగి పొరలిపోయెఁబో నాదు నానంద మోగుణోజ్జ్వలుండ! ఒక్క
కౌఁగిలింపనిమ్ము కలసిపోయెదను నీలోన నేను తీఱులోఁ దమింక. [మా. అ.

అను పద్యములు చదివి రావుగారిని బిగ్గఁ గౌఁగిలించుకొని యాగ్గించిరి)
ఈయుత్సవమునకుఁ బురజనులును బంధువులునే కాక యితరగ్రామములనుండి పెక్కుఁ గొందఱు అరుదెంచుచుండెడివారు. వీరి యందఱకు స్నానపానాది సదుపాయము లొనర్చి (అన్నసత్రమే సాగించి) న శ్రీ సుబ్బారావు పంతులుగారు ప్రశంసనీయులు. మఱియు నీ యుత్సవమునే ... పంతులుగారు సంగీతసాహిత్యపరిషత్తుగా నేర్పఱచి శాస్త్రముల నుద్ధరించుటకు మార్గదర్శకులుగా నుందురుగాకయని కోరఁబడుచున్నారు.

ఇట్లు సింగరేణి కాలరీసువాసి.

---

## —♦ గురుకులాశ్రమము ♦—

(...అవధానిశిరోమణి, మహోపాధ్యాయ ... మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులు గారు)

గుంటూరునుండి మాచెర్లకేగు రైలుమార్గమున బెల్లముకొండ స్టేషనునకొక మైలుదూరములోఁ జౌటపాపాయపాలెమను నొక యగ్రహారము గలదు. ఆయగ్రహారమువారలగు బ్రహ్మశ్రీ ముదిగొండ వెంకటరామశాస్త్రిగారిచే స్థాపితమైన గురుకులాశ్రమమును ... నేను జూచి పరమానందము నొందితిని. ఆయాశ్రమమునకుఁ జుట్టును సుమారు 2 మైళ్ళదూరము పర్వతపంక్తి ప్రహరిగోడవలెఁ గాన్పించుచు నాశ్రమగర్భితమగు నగ్రహారము సనాతనధర్మదేవతకుఁ బ్రకృతిమాత కట్టించిన దుర్గమా యను నూహను జూపఱకుఁ గలుగఁజేయుచుండును. అచ్చటి క్షేత్రము లన్నియుం సారవత్తరము లయ్యుఁ బర్వతప్రాంతమం దుండుటచే వర్షాకాలమునఁగూడఁ బాడము లకు మన్నంటనీయక సర్వసస్యాంకురములతోపాటు ధర్మాంకురములనుగూడఁ బెంచఁ జాలిన ధర్మక్షేత్రము లనఁదగియున్నది. ఆయగ్రహారమునఁగల గృహము లన్నియుఁ జేటలో వెలగకాయలవలె విస్పష్టముగా నగపడుచు విశాలరమణీయములై పరిశుద్ధములై

అప్పటి చాతుర్వర్ణ్యముగాని తక్కుజాతులుగాని యన్యోన్యవైమనస్యం బున్నట్లెచటను గానరాక ... పరస్పరసాహాయ్యమునకు హృదయపూర్వకముగఁ బాటుఁబడుచున్నట్లగపడుచుండును. 2 గజముల లోఁతునఁ గమ్మస్వాదకమువంటి మంచినీరు దొరకుటచే బావులు ... సులభసాధ్యము ... పర్వతములుండుటచేఁ బచ్చికకును గడ్డికిని లోటులేదు. కావున నాయగ్రహారప్రాంత మంతయుఁ దృణకాష్ఠజలసమృద్ధమై యొప్పుచుండును. ఆయగ్రహారమునకుఁ దూర్పుగా నొక ఫర్లాంగుదూరములో ... ఎకరము వైశాల్యముగల గుట్టభూమిపై నీగురుకులాశ్రమము నెలకొల్పఁబడియున్నది. ఆయాశ్రమములో నోంకారమందిరముగుడి శ్రీ శంకరాచార్యాలయ మొకటి ... చుట్టును ఫలపుష్పవృక్షములతోడను లతామండపములతోడను నెంతయు నొప్పుచుండును. చుట్టును బరిధ్వంసాభావమువలె సాదియాస్యా ననంతమగు సజీవావరణవిశేషముండుటచే నితరపశువులకు దుష్ప్రవేశమయి యుండును. ఓంకారమందిరమున కుత్తరముగ నా యావరణములోనే జ్ఞానవాపియను నొక పుష్కరిణి యింద్రనీలాలవంటి నీరముచే నిండుకొని యవగాహనోత్సుకత నుదయింపఁజేయుచు దర్శనమాత్రముననే యుభయపాపనివారకమై యాగంతువుల నాకర్షించుచుండును. ఓంకారమందిరమునకుఁ బశ్చిమమున నొక ప్రవచనమందిరము క్రొత్తగఁ గట్టఁబడియున్నది. ఓంకారమందిర జ్ఞానవాపీ ప్రవచనమందిరములు మూడును ఫలవృక్షలతాలంకృతములై యొకయావరణముననే యున్నవి. కాన నాప్రదేశమున విచ్చలవిడిగా రవిచంద్రాతపములు ప్రవేశించనేరవుకాని నేల యంతయు సర్వదా వివిధవర్ణరంగవల్లీసమంచితముగ నొనర్పఁజాలినంతవఱకుమాత్రము ప్రవేశించుట కోంకారమందిరేశ్వరుని యభ్యనుజ్ఞ నొందినవారియనట్లు ప్రేక్షకులకుఁ బొడకట్టుచుండును. జ్ఞానవాపిమాత్రము తనలో సూర్యాచంద్రములకుమాత్రమే సంపూర్ణావగాహనస్నానమున కభ్యనుజ్ఞ నొసంగుటంజేసి యచ్చటి జలము హంసోదకమని పిలువఁబడును. పై యావరణమునకుఁ బశ్చిమముగా సుమారు నూఱుగజముల దూరమున 3 గృహములుఁ బర్ణశాలలుఁ గలవు. వానిలో నొకటి యుపాధ్యాయులు విద్యార్థులు వసించుటకును రెండవది యగ్నికార్యము లొనర్చుకొనుటకును మూడవది భుజించుటకును నుపయోగపడుచు నెపుడుచూచినను గోమయానులిప్తములై రంగవల్లీశోభితములై యుత్తమమగు శాస్త్రసమ్మతపరిస్థితి వెలిపుచ్చుచుండును. ఆవరణాంతర్గత ప్రవచనమందిరము విద్యార్థుల పాఠప్రవచనముల కుపయోగించుచుండును.

అచటనున్న విద్యార్థులు తొమ్మండ్రును యథావిధిగ సక్రమముగ నష్టవర్షోపనీతులయి విధివిహితములగు నజినదండాదులను ధరించిన శుద్ధవైదికబ్రహ్మచారులే. ఆబ్రహ్మచారులరుణోదయముననే మేల్కాంచి శౌచస్నానాద్యాచారపూతాంతర్బహిర్దేహులై పరాపేక్ష లేకయే తమ యగ్నికార్యముల మంత్రాదిలోపము లేనట్టుల నిత్యమును బ్రాతస్సాయంకాలములయందు నిర్వర్తించుకొనుచుందురు. తొమ్మండ్రును బారుతీర్చి యగ్నికార్యముల నొనర్చుకొనుచున్నపుడును బ్రవచనమందిరమున వేదముల నభ్యసించునపుడును జూచినవారికి సిద్ధాశ్రమము మున్నగు నాశ్రమములందలి తొల్లింటి విద్యాభ్యాసపద్ధతి చక్షుః ప్రత్యక్షవిషయ మగును. అప్పటి బ్రహ్మచారులకును నిప్పటి బ్రహ్మచారులకును భేదమేమనఁగా, ఇప్పటివారు 'విదధతే వన్యైశ్శరీరస్థితిః'యను శ్లోకపాదమునఁ జెప్పినట్లు వన్యములగు కందమూలాదులచేత శరీరస్థితి నిర్వర్తించుకొనకుండుటయే. ఉదారస్వభావులగునట్టియు మూర్తీభవించిన వైరాగ్యరూపులయినట్టియు ... శ్రీపుష్ప

జీయమై ఫలపుష్పవృక్షములతోఁ గూడిన యొక ఉద్యవనసహితమగు పెద్దమందిరమును దానముసంగిరి. అందువలన వర్షములచే శరీరస్థితిజరుపుకొనుట కీవిద్యార్థుల కవకాశము దొరకనుగాన నైన నేఁజెప్పిన భేదముగూడ నుండఁబోదని చెప్పవచ్చును. శ్రీ పుష్పగిరి వారుచూపిన యౌదార్యమును జక్రవర్తులుగూడఁ జూపలేదనుటలో నతిశయోక్తి లేదు. ఇచట నన్నిటికంటె మఱియొక గొప్పవిశేషమును నేను జూచి యానందసముద్రమగ్నుఁడనైతిని. అది యేదనఁగా, విద్వాంసులుగూడ దేవభాషలో దైనందినవ్యవహారము ననర్గళముగా నడపుటకు వెనుకంజవేయుట నాయనుభవములో బహుస్థలములలోనే కాంచియుంటిని. ఈయాశ్రమమున శిక్ష్యమాణుఁడగు సప్తహాయన బ్రహ్మచారియును మృదుమధురమై కర్ణపేయమైన గీర్వాణవాణీమయమగు సంభాషణముతోనే దైనందినవ్యవహారమును నడపుచుండును. అందుకుఁ గారణ ముపాధ్యాయులు బాలురకుఁ జెప్పు పాఠములను బామరభాషలో బోధింపక మొదటినుండియు నమరభాషలోనే బోధించుచు బాలకులతో నిత్యకృత్యవ్యవహారమునుగూడఁ బవిత్రమగు దైవభాషలో నొనర్చుచుండుటయే కాని వేఱొండు కాదు. ఈపద్ధతి మన దేశమున నరుదు. ఎన్నియో వేల మైళ్ళదూరముననుండి మన భారతభూమికి దిగుమతి చేయఁబడిన యాంగ్లభాష 2 సం॥ లభ్యసించిన మాత్రముననే మన బ్రహ్మచారులకు సర్వవ్యవహారములందును సంభాషణార్హ మగుచుండ సృష్ట్యాదినుండియు యేషాం బ్రాహ్మీ సరస్వతీయనునట్లు మన రసనాగ్రములం దనుక్షణము మెలఁగుచు వివిధధర్మామృతస్తన్యముల మనకు బెంచిన పెంచుచున్న పెంచఁగల సంస్కృతభాషామాత సర్వవ్యవహారములందును మన కేల సాయమొనర్పదు ? కావున నీగురుకులబ్రహ్మచర్యాశ్రమము నందువలెఁ బ్రతివిద్వాంసుఁడును దయయుంచి యీయాశ్రమవిద్యాభ్యాసపద్ధతినే తలఁబ్రాలుగా నుంచుకొని తమతమ విద్యార్థులకు విద్యగఱపఁ బ్రయత్నించినచో నచిరకాలముననే మనయార్యవంశక్షేత్రము లన్నియును సురభాషాలతామండపమండితములై పరమానందభాజనములై ప్రకాశించితీరును. నేను హరిద్వారమునఁగల గురుకులబ్రహ్మచర్యాశ్రమ ఋషికులబ్రహ్మచర్యాశ్రమముల 2, 3 మాఱులు చూచియుంటినిగాని తదపేక్షయా చాటపాటాయపాలె మగ్రహారములోని యీయాశ్రమము బహువిధముల నాకు నచ్చినది. మఱియు నీయాశ్రమస్థాపకులగు ముదిగొండ వెంకటరామశాస్త్రిగా రప్రతిగ్రహీతలగు దాతలు; న్యాయవేదాంతపండితులు. కావున వీరియాశ్రమపద్ధతి భారతభూమికంతకు నాదర్శప్రాయమైయుండఁజాలినదని నాహృదయపూర్వక నిశ్చయము. వీరిసంకల్ప మిట్లు కార్యరూపమును ధరించుట కాపలనాడు సత్తెనపల్లి తాలూకాలలోని ధర్మవీర లంకా వెంకటనారాయణగారు మున్నగు సంపన్నోదారబ్రాహ్మణగృహస్థుల తోడ్పాటే ముఖ్యకారణము. ఇట్టి శ్రోత్రియబ్రాహ్మణవిత్తమునమాత్రమే యీపవిత్రసంస్థ నిరుపమానముగ నడచుచున్నది. ఇట్టియాశ్రమములే యచ్చటచట నెలకొల్పఁబడవలె. పండితులేమి, పామరులేమి, మాత్సర్యమును విడిచి యిట్టికార్యములకుఁ దోడ్పడవలె. అప్పుడుగాని సనాతనధర్మవృక్షము దృఢమూలము కానేరదు. నేఁడీయాశ్రమము యాత్రికులకు సేవింపఁదగిన తీర్థక్షేత్రస్థానములలో నొకటియని నాకుఁ దోఁచినది. నాకుఁదోఁచినంత వ్రాసితిని. ఇం దతిశయోక్తి లేదు. ప్రతిసనాతనధర్మపరుఁడును దీనిని గమనించి యానందింపఁగలఁడని నేను నమ్ముచున్నాఁడ.

—♦ విశ్వామిత్రాగమనము. ♦—

శా. విశ్వారాధ్యుఁడు లోకపావనుఁడు సంవిన్నేత్రుఁ డవ్యక్తతః
శ్శశ్వద్దీప్తుఁడు క్రోధసంహృత హరిశ్చంద్రావనీనాథ స
ర్వైశ్వర్యుండు కృపాపరికల్పిత త్రిశంకుస్థప్రతిస్వర్గుఁ డా
విశ్వామిత్రుఁడు వచ్చె నచ్చటికిఁ బృథ్వీనాథు వీక్షింపఁగన్. 111

కం. చను దెంచి ద్వారపాలుర
గని "గాధితనూభవుండు కౌశికుఁ డిమ్ముగ్
గనవచ్చె" ననుచుఁ జెప్పుఁడు
జననాథున" కనిన వారు సత్వరగతులన్. 112

వ. రాజసదనంబున కరిగి వృత్తాంతంబు యాష్టీకున కెఱింగింప నతం
డును ససంభ్రముఁడై యాస్థానంబున రాజమండలపరివృతుండగు
భూమీశుం గని కైవారంబు నేసి యిట్లనియె. 113

శా. దేవా! ద్వారమునందు బాలరవిసందీప్తుండు జ్వాలారుణ
శ్రీవిస్ఫారజటాకలాపుఁడు తపశ్శ్రీమన్ని జాంగప్రభా
సౌవర్ణీకృతకేతువీతిగజభాస్వద్ద్వారదేశుండు స
ద్భావుం డాకుశికాత్మజుండు నిలిచెన్ ద్వద్దర్శనాకాంక్షియై. 114

మ. అని యాష్టీకుఁడు విన్నవించువచనం బాలించెనో లేదో య
జ్జననాథుండు సమంత్రిబంధునృపుఁడై సౌవర్ణపీఠంబునుం
డి నిమేషంబున లేచి సంతసమునన్ డెందంబు నిండన్ నయం
బొనరన్ బ్రస్థితుఁడయ్యె నమ్మునికిఁ బ్రత్యుత్థానమున్ జేయఁగన్.

వ. అంత వసిష్ఠవామదేవులును, సామంతనృపులును, మంత్రులును
వెంట రాఁ బాదచారియై ద్వారముకడ కేగి యట. 116

సీ. ఏదేనిపనిఁబూని యిల కేగుదెంచిన
కమలబాంధవురీతి నమరువాని
బ్రహ్మతేజంబుతోఁ బరిమిళితంబైన
క్షాత్రతేజంబునఁ గ్రాలువాని
నరసి తపంబున బిరుసైన వెంజడ
లంసభాగమున వ్రేలాడువాని
బహుకాలమునసుండి సహవాసమునఁ జేసి
నునుపైన కుండి కైఁ దనరువాని

తే. కాంతమున్ శాంత మప్రతిఘాత మగుచు
నూర్జితంబగు మేనుచే నొప్పువాని
పేశలంబు ప్రసన్నంబు భీమమైన
నైజతేజంబుచేతఁ జెన్నారువాని. 117

కం. ఉన్నతధవళభ్రూయుగు
సన్నుతకరుణారసప్రసన్నేక్షణ దీ
వ్యన్నేత్రు మౌనిఁ గని పతి
సన్నతుఁడై దూరమంద చాఁగిలిమ్రొక్కెన్. 118

కం. ఋభుపతిఁ గనుఁగొనవచ్చిన
విభావసునిరీతి ధరణివిభునకు మునియున్
శుభకరమధురోక్తులఁ బ్ర
త్యభివాదన మాచరించె నాశీస్సులతోన్. 119

తే. అంతట వసిష్ఠముఖ్యధరామరాళి
స్వాగతోక్తుల నమ్మునిచంద్రు నాద
రమునఁ బూజించుటయును ధరావిభుండు
హర్షవికసితలోచనుండయి వచించె. 120

కం. తలవనితలఁపుగ మాకున్
గలిగిన మీదర్శనంబు కలిమిన్ రవిచే
జలజాకరములవలె మే
మలఘుతరానుగ్రహంబు నందితి మనఘా ! 121

కం. మొదలున్ దుద నెఱుఁగని దే
య్యది, నాశన మెఱుఁగ దెద్ది యలయానందం
బుదయార్కతేజ! మా కిపు
డుదయించెన్ మిమ్ముఁగనుట నురుసుగుణఖనీ ! 122

క. భవదీయాగమనంబున
కవనీసుర ! మేము లక్ష్య మైనకతమునన్
వివరింప నగ్రగణ్యుల
మవుదుము నిక్కముగ ధన్యు లందఱిలోనన్. 123

వ. ఇట్లుపచారవాక్యంబులు పలుకుచు సంయమీంద్రుని సభాస్థానము
నకుఁ దోడికొనివచ్చి. 124

తే. బ్రహ్మతేజఃప్రపూర్ణుఁడై ప్రజ్వరిల్లు
నమ్మహాత్మునకున్ సువర్ణాసన మిడి
హర్షవికసితవదనుఁడై యవనివిభుఁడు
స్వయముగా నర్ఘ్యపాద్యముల్ సంతరించె. 125

చ. మునివరుఁ డర్ఘ్యపాద్యముల మోదమునన్ విధివృష్టకర్మచేఁ
గొని నృపుఁ డంత భక్తి వలగొన్న సగౌరవభాషణంబులన్
వినుతియొనర్చి నేమమును విత్తసమృద్ధియుఁ బృచ్ఛచేసి యా
ననమున మొల్కలెత్తు చిఱునవ్వునఁ జూచి యనంథతీథవున్. 126

వ. సబహుమానంబుగా ననామయం బడిగె. అంత నెల్లరును బరస్పర సత్కారంబులను గుశలప్రశ్నంబులను బ్రహృష్టమానసులై యుండఁ బంక్తిరథుండు విశ్వామిత్రుని మరల యథావిధిఁ బూజించి గోవు నొసంగి వినయవినమితగాత్రుండై సాంజలిబంధముగా నిట్లనియె.

— ♦ దశరథుఁడు విశ్వామిత్రుని బహూకరించుట ♦ —

క. వఱపున జోఱున వర్షము
గురిసినచందమునఁ, జూపు గ్రుడ్డికిఁ దగఁ జే
కుఱుభంగి, నమృతభాండము
దొరకినగతి మిమ్ముఁగనుట దొరకొనె మాకున్. 128

సీ. అనపత్యునకుఁ బ్రియాంగనయందు బహుకాల
మునకు సత్పుత్రుండు పుట్టినట్లు
స్వప్నంబునందుఁ గన్పట్టిన ధనము మే
ల్కొన్నయప్పుడు గనుగొన్నయట్లు
చిరకాలమునుండి కరముఁ గోరినవస్తు
వెట్టకేలకు లభియించినట్లు
అతిదూరదేశంబునందుండి యిష్టాప్త
బాంధవుల్ తమయంత వచ్చినట్లు

తే. నష్టమైనధనంబు పునఃప్రలబ్ధ
మైనయట్టులు బ్రహ్మలోకాధివాస
మబ్బినట్టులు తావకీనాగమనము
మోదవారాశిలో మమ్ము ముంచె ననఘ ! 129

క. చచ్చినమనుజుఁడు మరలన్
వచ్చినయటు, లాకసమున నడచినగతి, మా
కెచ్చుగ మోదముఁగూర్చెను
సచ్చరితా! నీదురాక స్వాగతమె కదా! 130
ఆ. నీదుకోర్కి యెద్ది? నీకునై నే నేమి
చేయవలయుఁ దెల్పు మోయమీంద్ర!
పరమపాత్ర మీవు ప్రాప్తించితివి నాకుఁ
బుణ్యతీర్థమట్లు భూసురేంద్ర! 131
క. రాజర్షిశబ్దమునఁ గడు రాజిల్లితి తొల్లి; యిపుడు రమణీయతప
స్తేజమున బ్రహ్మఋషివై రాజిల్లెదు పూజ్యపాదరాజీవయుగా!
క. గంగాస్రవంతిలో మునుఁగంగాఁ గల్గెడు ముదంబు గలిగెడు నిముఁగా
నంగా నాదు మనములోనం గాటపుఁదాపముల నణంచుటచేతన్.
క. కామభయరాగవిద్వేషామయము లనంగ నెఱుఁగనట్టిఁడ నీనీ
వేమో పనివడి నాకడ కేమెయి నరుదెంచు టెంచ నిది యద్భుతమా.
క. ఏను బవిత్రుఁడనైతిని నానిలయము పరమపావనంబయ్యె, సుధా
స్థానమగు చంద్రబింబములోన మునిఁగినట్టులయితి లోకస్తుత్యా!
క. నీరాక నాకు సాక్షాన్నీరజసంభవునిరాక, నిరవద్యతఁ జె
న్నారితి, జన్మము సఫలతచే రాజిల్లె, జీవితము సుజీవిత మయ్యెన్.
క. నినుఁగాంచి నీకుఁ బూజల నొనరించి నమస్కరించియున్న కతనఁ జం
ద్రునిఁగన్న జలధిపోలిక మునివర! నాలోన నే నిముడఁజాలఁజుమీ.
క. మీకార్యం బెయ్యదియో, యేకతమున మీర లిచటి కేతెంచితిరో,
ఆకార్యమైనదియుచుమి మాకున్ బూజ్యుండ వీవు మౌనివరేణ్యా!
క. అడుగం దగు నియ్యది, యిది
యడుగం దగదంచు సందియం బందకు మో
జడదారితేఁడ! మీకొఱ
కిడరానివి కలవె యెందు నినవంశ్యులకున్? 139
చ. అని మధురంబుగా వినయ మచ్చుపడన్ వచియించు మానవే
శునియుచితానులాపముల శ్రోత్రసుఖంబుగ నాలకించి య
మ్మునివృషభుండు చాలగఁ బ్రమోదమునంది ప్రహృష్టరోముఁడై
మనుజవరేణ్యుతో ననియె మంజుల ధీర గభీర భాషలన్. 140

హృదయేశ ! ఎచటి కేడ్చెదో
కద ! నాకుం దప్పి వశముగాదని పలుకన్. 77

తే. అతఁడు చోరభయంబున నవ్వధూటి
మేనిసొమ్ములు తన యొడిలోన డాఁచి
నీరపాత్రంబు గైకొని నెమకఁజనియె
హ్రదనదీకూపముఖ్యంబు. లంతలోన. 78

మ. ఒకశూద్రుం డభిరామనాముఁ డొక యుద్యోగంబుపై వచ్చి య
మ్ముకురాస్యం గని యొంటినున్న దిది యేపోయంచు మాటాడ నిం
చుక శంకించినఁ జేరఁబిల్చి తన యస్తోకవ్యథం దెల్పి య
వ్వికచాంభోరుహగంధి వానిమది యువ్విళ్ళూరఁగాఁ జేయుచున్.

తే. నీకు నామీఁదఁ గోర్కి జన్మించెనేని
కాఁపురమునకు నుండెదఁగాని యిటకు
వచ్చు జలములు గొనుచు నావరుఁడు, వాని
మొఱఁగిపోయిన వెదకుచు నరుగుదెంచు. 80

తే. కూలికీలారికంబందుగొంటువాని
చెనకి నిర్జించిపోవ నీచేతఁగూడ
దట్టుగావున నిట్లు సేయంగవలయు
అని యుపాయంబుఁ జెప్పినయంతలోన. 81

ఉ. క్రూరుఁడు నీళ్ళుగొంచు నటకుం జనుదెంచినఁ దత్ప్రఫుల్లనీ
రేరుహనేత్ర దప్పి యొకరీతి నడంచినయట్లు చేసి యీ
ఊరికిఁబోయి నేఁడిచట నుండుదమాయని ముప్పురున్ రయో
దారత నేగి గంధవతిఁ దద్దయు మెచ్చుచు వచ్చుచున్నెడన్. 82

క. ఆరమణియునభిరాముఁడుఁగ్రూరునినిరువంకఁబెట్టుకొనియ యొయ్యయీ
ఊరికి దొర లేఁడా యీచోరుని దండింప ననుచు స్రుక్కక కూయన్.

క. ఆమాట విని తలారు ల
దేమని గద్దింప నాపృగేక్షణ రొదగా
నామగఁ డితఁ డని యయ్యభి
రాముని వెసఁ జూపి నిబ్బరంబునఁ బలికెన్. 84

తే. ఆలు మగఁడును నియ్యూరి యఱుత నిలిచి
చలిదిభుజియింప నాసొమ్ము సంగ్రహించె.

గొట్టుసేయక వీనిఁ జూపట్టుకొనుచు
ఇచ్చటికిఁ దెచ్చితిమి, పట్టుఁ డిప్పు డితని ౮౬

వ. అనిన విని యన్నగరరక్షకు లాక్షేపపూర్వకంబుగా నతనిం బట్టుకొని బాధించి యొడిలోని యాభరణములం గనుంగొని దొంగయగునని నిశ్చయించి యభిమానధనున కెఱింగించి మూడుత్తరువులు గైకొని నిజకామినీకుహనసంజనిత విస్మయాదత్తప్రత్యుత్తరుండగు నతని వధియించి యమ్మండనంబు లిచ్చినం జపలాభిరాములు సంపూర్ణకాములై యథేచ్ఛ నరిగిరి. ఆమాంత్రికుండును నన్యాయహాతుండయ్యెం గావునం బిశాచంబై యాచారవంతులం గని తలంగం బాఱుచు మాంత్రికులం గని గడగడ వడంకుచు నాయుధహస్తులం జూచి యేచిన భయంబునుం బొందుచు భైరవాజ్ఞావశుండై యాహారంబుఁ గొనం గానక వెఱచినవారి వెంటం బడి తదీయజనప్రకల్పితరాత్రికాననంబుల నుద్దండతరజఠరానలంబున శృంగాటకంబులఁ గాఁపుగణితలగ్గలంబుగా బగ్గుచం దరికొన బలియర్పించుపాంగళ్ళవలనం గొంతకొంత సంతసించుచు నిడుములకుం గడగానకయప్పట్టణంబున నెట్టుకొనియున్నవాఁ డగుటం జేసి యతం డొక్కనాఁడు,

క. నరపతికిం గానుకగా
విరిపొట్లము గొనుచు నొకఁడు వీథిం జనుచో
గురుతరమగు సురుచిర త
త్పరిమళముల వెంటనంటి పాయక చనియెన్. ౮౭

ఉ. భూపతి యంత నవ్విరులపొట్లముఁ గైకొని కొల్వుదీఱి క్రీ
డాపరమైన బాళి నిగుడన్ వెస నంతిపురంబుఁ జేరి కో
మ్మా! పువుబోణి! యంచు మణిమంజరి కిచ్చి తదీయమన్మథో
ద్దీపితకేళిఁ దేలి పొడతెంచు రవిం గని లేచిపోయినన్. ౮౮

క. ఆకమలనయన పరసుర
తాకాంక్షల్ నిగుడ నెవ్వఁడైనను మగవాఁ
డీకడకు వచ్చి కోరిక
నా కొనగూరుచునెయని మనంబునఁ దలఁపన్. ౮౯

క. మాంత్రికుం డప్పుడు తన యా
కారముతో నిలిచి యళుకుగాంచిన దానిన్

చేరంగ నరిగి వెఱవకు
మోరమణీ! వినుము మన్మహోదంతంబున్. 90
చ. అని నిజభార్య చేసిన యుపాయమునం దన కట్లు సంభవిం
చిన యశరీరతాస్థితులు చెప్పి యిఁకన్ జఠరానలంబుచే
తను నెరియందొడంగె వనితా! ఇపు డన్నము పెట్టితేని నీ
పనిచిన పంపుఁ జేసెద, శుభంబగు నీకని మ్రొక్కి వేఁడినన్. 91
క. అమ్మగువ చపలఁ గూరిచి యమ్మా! భువి నాఁటదానవైనన్ నీవే
అమ్మహితసాహసము నాకిమ్మా నాకోర్కు లెల్ల నీడేఱుటకున్. 92
క. అనిమెచ్చి క్రూరునిం గనుఁ
గొని వాహనమగుచు నన్నుఁ గొని చనఁగలవా
మనమునఁ దలఁచినచోటికి
దినదినమున్ నీకు మంచితిండి ఘటింతున్. 93
తే. అనిన నిను మోఁచికొనుట భాగ్యంబుగాదె,
బ్రతికితి నటంచు వాఁ డొడఁబడినఁ జూచి
అబల బోనంబు వాని కాహార మిచ్చి
తోయజానన యద్దమరేయి వేళ. 94
క. పతి మకరందాగ్రహాసం
గతి గాంచుట దెలిసి గగనగమనక్రూరో
ద్ధతవాహనయై విజన
క్షితిఁ దలఁచుటఁ జనియెఁ గాళిగేహముఁ జేరన్. 95
క. చని వాహనంబు డిగి య
వ్వనితామణి పథికుఁడైన వైశ్యుని నొకనిన్
కని తనవర్తన మంతయు
వినిపించి తదీయకథలు విని మోదమునన్. 96
తే. అతఁడుఁ దానును గేళిగేహంబులోన
దక్షిణాపుమూల రతికేళిఁ దనివి నొంది
అనుదినము నాతఁ డటువచ్చు నట్లుచేసి
పోయి యాలీల మెలఁగె నప్పొలఁతి మఱియు 97
క. అంత నల విక్రమార్కుఁ డ
నంతరకథ యడుగ మంత్రినందన నవవా

సంతసమయప్రమోదా
క్రాంత వికస్వర పికస్వరంబునఁ బలికెన్. 98

తే. మానవాధీశ ! అయ్యభిమానధనుని
వాలుగవకొమ్మ కమ్మకుందనపుబొమ్మ
పెన మకరంద యిచ్ఛావిహార మంద
సందు గాన కమందచంచలత నొందె. 99

సీ. నిలనీని వంటవార్పుల నత్తమామల
పోరను లేని కాఁపురము గలిగె
ఎచటనుండిన నింట. నేమనువారు లే
కింపు సొంపుఘటిల్లు నిల్లు గలిగె
రేలు పగల్ పట్టి పాలార్ప కొకవేళ
తగనెంచి చనుదెంచు మగఁడు గలిగె
వలసినయట్టు లవ్వారిగా సారక
స్తూరికాముఖ్యవస్తువులు గలిగె
ఎన్ని గలిగిన నేమి నాయిచ్ఛలోని
ఆస గడతేర జారవిహారసుఖము
సంభవించ దటంచుఁ గాంతావిశేష
పరవశస్వాంత యగుచుఁ దాపంబుఁ జెంద. 100

మ. ఒకనాఁ డాత్మనిశాంతసౌధ లసమానోద్యానవీథీసము
త్సుకయై పోయి తదంతరంబున మణిస్తోమాత్తధామాతిరం
జకమై యుప్పరమంటు చప్పరమునన్ సౌవర్ణడోలావిలో
లకుఁడై నిల్చిన యొక్కసిద్ధుఁగని చాలన్ విస్మయంబందుచున్ 101

క. జారవిహారంబున కే
కా రెడు నాకోర్కెఁదీర్పఁగా వచ్చినయ
మ్మారుఁడె యితఁడని యచ్చెలి
చేరంజని చూపు వలపుచేతలఁ దెలుపన్. 102

క. నిలిచిన నతఁ డాసతికి
గలకోర్కె యెఱింగి మమ్ముఁ గామింపకుమీ
ఇలఁ జూడఁగవచ్చిన సి
ద్ధుల, మతనునితూపు మనసుఁ దూఱదు మాకున్. 103

## మేనమామకొడుకు నారాయణ చారిత్రము

నారాయణకుఁ జదువుసంధ్య లంతగా సంప్రాప్తింపవు. అన్నదమ్ము లవిభక్తులుగా నున్నప్పుడు వ్యవసాయము చేయుచుండెడివాఁడు. విభక్తులైన పదపడి విప్రగృహములలో మాత్రము వివాహాదులు చేయించుచు నా ద్రవ్యమునుండియు నాత్మభాగమున వచ్చిన యల్పిష్ఠభూమిని బండు పంటనుండియుఁ గుటుంబభరణము చేసికొనుచుఁ గొడుకులను బిడ్డలను గని దారిద్ర్యముతోనే తంటాలుపడియెను. అయినను నతిథుల నాదరింపకయు బంధుగులకు విందుచేయకయు సంతానమును జక్కఁగా సంరక్షించుకొనకయు నుండియెఱుఁగఁడు. అందువలన నప్పు లధికమయ్యెను. ఆస్తి యప్పులకు సరిపోయెను. ఇంతలో నెక్కుడనో పడిపోయి పదచలనము చేయఁజాలక బహుకాలము పండియుండెను. అట్టిస్థితిలోనే యఱువదిదెబ్బది సం॥ లు బ్రదికి పెక్కండ్రు బిడ్డలకుఁ బెండ్లిపేరంట్రములుగూడఁ జేసెను. వీని కన్నిటికిని వెలఁది నరసమ్మ తెలివితేటలును ధీమత్త్వమునే బలుకారణము. అది పదిపండ్రెండు సం॥ లు భర్త పదచలనము చేయలేక పడియుండ శయనముపయిననే సకలోపచారములను సలుపుచు సంరక్షించినది. అప్పో సప్పో తెచ్చి యర్భకుల నందఱను బెంచినది. అతిథుల నాదరించినది. చుట్టపక్కముల పెట్టుపోఁతలలోఁ గూడ నెట్టిలోపములు లేకుండ నెల్లవిధులను నిర్వర్తించుకొనినది. మంచములో నుంచియే మగనిని మనుపుచు బిడ్డల పెండ్లిపేరంట్రములదగ్గఱనుంచి నరసమ్మయే జరిపినది. స్వసంబంధిబంధువులనే కాక భర్తృసంబంధిబంధువులఁగూడఁ బరమప్రేమమైఁ బలికించి ప్రతిష్ఠవడసినది. పతివియోగానంతరము సుతుఁడు నుంత సంసారనిర్వాహణమున సమర్థుఁడగుటయుఁ బరమార్థమే పరమప్రయోజనముగా భావించుచున్నది. దేవబ్రాహ్మణులను సేవించుచున్నది. సిరిసెనగండ్ల సీతారామయ్యగారిచేఁ జేయఁబడు వెల్లముకొండమీఁది మల్లికార్జున మహాకైంకర్యములో మధ్యమధ్యఁ బాల్గొని జీవితశేషమును బావిత్ర్యవంతము గావించుచున్నది. ఈదంపతుల కిరువురు కొమరులు. అం దాద్యుఁడు పెదతండ్రికిఁ బెంపుడుకొడుకుగా నుంపఁబడియెను. ద్వితీయుఁడు త్రిపురాంతకము. నారాయణకుటుంబమునకు నాథుఁడు వాఁడే. వివాహోపనయనాది పంచదశస్మార్తకర్మమంత్రములను బాగుగాఁ బఠించి తత్క్రియాకారయితృత్వమునఁగూడ దక్షుఁడై తనపౌరోహిత్యముననే కాక తక్కుటి తాదృక్కార్యములఁగూడ ధన మార్జించుచు మనుచున్నవాఁడు. వీనికిని సిరిసెనగండ్ల సీతారామయ్యగారే పరమగురువులు.

సీతారామయ్యగారు వీండ్రకే కాదు, వేలమందికి మేలైన మార్గమును మిక్కిలి బోధించుచుఁ జక్కఁపఱచుచున్న సత్పురుషులు. విరాగులు. తపస్వులు. దైవతకార్యములనే తనువును వినియోగించుచున్న ధన్యులు. దైవతకార్యోపయోగియైన ధనమునే తప్ప నన్య మణుమాత్రము కొననొల్లని కోవిదులు. నిరంతరముఁ బరమార్థమే పని వారికి. యోగాభ్యాసమే యుద్యోగము. తీర్థక్షేత్రపర్యటనమే స్వార్థము. ధాత్రి కోటి సమృద్ధముగా నున్నను సీతారామయ్యగారు చీటికి మాటికి నవ్వారివలన నర్థము గ్రహింపఁడు. బోధగురువుకాని బాధగురువు కాదు. అబ్దమబ్దము యాదగిరికిఁ గూడ నాయన యరుదెంచును. పండితసమ్మానమును బచరించు భాస్కరరాయని సీతారామయ్యఁ । పండితు లీయనకును నేమో యీయనెంతురు. కాని కడకు రె లుఱరు

గూడ గ్రహింపఁడు. యాదగిరి దేవస్థానద్రవ్యము గొనిపోయి బెల్లముకొండ దేవస్థానమున ఖర్చుపెట్టఁ బ్రీతిపడఁడు. భాస్కరరాయుని సీతారామయ్యగారు పఠితెంచి బెల్లముకొండకు భక్తిమై నర్పించు నూటపదియాఱులు పరిగ్రహించుటకే శంకించిన సిరిసెనగండ్ల సీతారామయ్యగారి వైరాగ్యము శంసాపాత్రము. సీతారామయ్యగారు స్థిరవిరాగులే కాక సిద్ధపురుషులు. ఆయన చేతిమీఁదుగా నింత విభూతి పెట్టిన నఖిలమును సిద్ధించును. అనామయముగలుగును. తపస్సే కాదు తదనామయసాధకము; ఔషధము కూడ. ఆయన యగదంకారుఁడును. అగదంకారుఁడే కాదు. ఆగమవిదుఁడును. అనేక దేవాలయములలో నిఘనశిలావిగ్రహములు సీతారామయ్యగారి చేఁబ్రతిష్ఠింపఁబడినవి.

ఆసీతారామయ్యగారి యాజకత్వముతోనే త్రిపురాంతక మిటీవలఁ ద్రిపురాంతకోత్సవవిగ్రహములు ప్రతిష్ఠించి కల్యాణోత్సవాదికమునకుఁ గావలసినంత ఖర్చుపెట్టెను. అట్టిపట్ల నవ్వాని కాయూరి యర్యజను లత్యంతము తోడుపడిరి. అటువంటివారి యాశ్రయముతోఁ ద్రిపురాంతక మిట్లు తెలివితేటలుగలవాఁడై తండ్రినాఁటి దారిద్ర్యమును దవులఁ దఱిమి సంసారనిర్వహణమును జక్కఁగా నల్పుకొనుచున్నాఁడు. అక్కబిడ్డ సుందరమ్మయే యవ్వాని యర్ధాంగి. ఈదంపతుల కింకను సంతతి సాగలేదు.

నారాయణ నందనలలోఁ బెద్దది సుబ్బమ్మ. దానిని సత్తెనపల్లితాలూకా గుజ్జర్లపూడి గ్రామవాసి తూములూరు సుబ్బయ్య కొడుకు శాస్త్రిల కిచ్చి పెండ్లిచేసిరి. అది సంతానవతియై యలరారుచున్నది. దీని రెండవబిడ్డయే త్రిపురాంతకము భార్య. పెద్దబిడ్డ లక్ష్మీనరసమ్మ. మగఁడు మారేపల్లి వెంకటేశ్వరులు మరణించెను. దానికి నొక తనయుఁడుఁ దనయయు. ఆతనయు ప్రాయ మాఱువర్షములు. వీఁడు పేరున వెంకటసుబ్బయ్య. సుబ్బమ్మ సుతుఁడు రాముఁడు మూఁడవవాఁడు. ద్వాదశవర్షవయస్కుఁడు. ఉపనీతుఁడై వీఁడు త్రిపురాంతకమువద్దనే దేనినో చదువుచున్నాఁడు. వీనితరువాత వెంకటేశ్వరులు. నేఁడవ్వాఁడు నిజామురాష్ట్రమునకుఁ జేరిన నల్లగొండజిల్లా మిరియాలగూడెము తాలూకా నెనిమిలేడు నామక గ్రామములో మకరాల రాంబాయమ్మచే మనుపఁబడుచున్నవాఁడు. తన్మాననికి దత్తపుత్రుఁడు. తజ్జననీజనకులైన సుబ్బమ్మ శాస్త్రిలుగూడ బాయమ్మకు బాసటగాఁ బుత్రుఁ బోషించుచు నెనిమిలేడులోనే మనుచుండిరి కాని శాస్త్రిల సహోదరు లిరువురును శత్రువులచే సమకాలమున సంహరింపఁబడుటయు జననీజన్మభూములను సంరక్షించువారు లేక స్వస్థానమునకుఁ జనుదెంచిరి. ఈదంపతుల యేనవగర్భము నరసింహము. ఏను వత్సరములవాఁడు. వాని తరువాత వర్షద్వయవయస్కయై రాజేశ్వరియను స్త్రీశిశువు రాజిల్లుచున్నది.

నారాయణసంతానములో సుబ్బమ్మ తరువాతిది లక్ష్మమ్మ. దానిని మేనయత్త దత్తపుత్రునకు ధారవోసిరి కాని యచ్యుతరామయ్యయను నాఖ్యామాత్రమే యవ్వాని దివ్వెళ నవనిని నిలిచియున్నది. అట్లది బాలవిధవయై వరినువునింటి పనిపాటలకు బాసటగాఁ బ్రవర్తించుచున్నది. ఇదియు సిరిసెనగండ్ల సీతారామయ్యగారికి శిష్యురాలై బెల్లముకొండ మల్లేశ్వరమందిరమం దాయన యాచరించు నన్నప్రదానకార్యములో శ్రావణకార్తికమాసాదులం జని సాయపడుచును ద్రిపురాంతకాది దివ్యస్థలములలో శివరాత్రికి సీతారామయ్యగారు పెట్టు క్షితిసురాన్నసత్రములలోఁ జేతనైనపనులు చేయుచును శరీరమును సార్థకపఱచుచున్నది. జన్మసాఫల్యము నల్పుచున్నది

దానితరువాతిది సుందరమ్మ. జంగమేశ్వరపురవాసి లంకా కొండయ్య కొడుకు లక్ష్మయ్యకు దానినిచ్చి వానిచెల్లెలి నన్నుకు దత్తుఁడైన యాత్మజునకు నారాయణ పెండ్లిచేసెను. కాని యది యౌవనమురాకమును పే యసువులు విడిచినది.

పదవది పార్వతి. దీనికి దేవరపల్లి సుబ్రహ్మణ్యమను జూలకల్లు గ్రామవాస్తవ్యుఁడు సూత్రధారణము కావించెను. ఆతఁడును నర్ధాంగి యౌవనవతి కాకపూర్వమే యంతమందెను.

నారాయణ నలువురు కొమరితలలోను సుబ్బమ్మయొక్కర్తమాత్రము సుతసుతాలతను క్షేమం బ్రాఁకించి సుఖించుచున్నది కాని తక్కిన మువ్వురిలో నిరువు రిహాసుఖదూరలు నేక యిహదూరయు నై జననీజనకాదులకు సంతాపకారిణులుగా స్వకర్మచేఁ జేయఁబడిరి.

సుబ్బయ్య కనిష్ఠమాతులుఁడు (చిన్నమేనమామ). ఆయనభార్య లక్ష్మమ్మ. అవ్వారి కుమారుఁడు సుబ్బారాయుఁడు. ఆయనగూడ నన్నచేఁ దమ్మునకు దత్తుఁ డన్నట్లు జ్ఞాపకము. ఆపరంపర యంతటితోనే యాఁగిపోయినది.

—♦ కొమార్తెలు ♦—

నాకు నిరువురుకొమరితలు. అందుఁ బెద్దదాని జననము శుక్ల సం॥ మార్గశిర బ ౬. తజ్జననమునకు సుమారొక సం॥ మునకుఁ బూర్వము నేను రెండవసారి కాశీయాత్ర కావించివచ్చుటచే మాయన్న యప్పయ్య యర్ధాంగి హనుమాయమ్మ కాశియన్నపూర్ణ పేరు పెట్టుమని చెప్పుటయుఁ బెద్దబిడ్డ నట్లు పిలుచుకొనుచుంటిని. ఏకొలఁదిపామరులో నా మొదటిభార్య పేరఁ బిలిచినను నన్నపూర్ణాభిధానమే యందఱును వాడుచున్నవారు. తద్బాలిక ప్రకృతము (ప్రమాధి సం॥) దశవర్షప్రాయ. సతీజనముగూడఁ జదువను వ్రాయను నేర్చియుండుట జ్ఞానదాయకమగుటఁ బాఠశాలకుఁ బంపఁబడుచున్నది. చదువుట వ్రాయుట సామాన్యముగా సాఁగుచున్నది. దీనిని జానపాటికిఁ గ్రోశద్వయదూరస్థమగు చినయగ్రహారమునఁ జిరకాలస్నేహితులును దర్కాలంకార వేదాంతశాస్త్రజ్ఞులును జ్యోతిశ్శాస్త్రవిదులును వాస్తుప్రకరణమున వాసికెక్కినవారును ననుజద్వయముతో నవిభక్తులును నఱువదియొకరములషుమారు భూస్వాములును నగు లంకా సాంబశాస్త్రిలుగారి ప్రథమకుమారున కిచ్చి బహుధాన్య సం॥ చైత్ర బ 3 (18-3-1939) మొదలుకొని పంచాహ్నదీక్షతోఁ బరిణయము గావించితిని. వరుఁడు పత్యమానస్వాధ్యాయుఁడు. పందొమ్మిది వత్సరముల ప్రాయమువాఁడు. వందలు వేలు వరదక్షిణలడుగు నెఫ్ఫ్యె బియేల కీ సమర్థుఁడఁ గామి నిట్టి శిష్టకుటుంబమునఁనే పట్టెని ప్రవేశపెట్టితిని.

శ్లో. యయోరేవ సమం విత్తం। యయోరేవ సమం కులమ్
తయోర్మైత్రీ వివాహశ్చ। నతు పుష్టవిపుష్టయోః.

విత్తవిషయమైన విపుష్టత విచారింపక సంబంధముసలిపిన సాంబశాస్త్రిగారి సంప్రదాయజ్ఞత సంకీర్తనీయము. తజ్జులలోఁగూడ దక్షిణాకామత తలయెత్తుచున్న తరుణమున యద్విధాభిలాషయు వ్యక్తము చేయక యస్మదాచరిత యత్కించి ద్వార

పూజాపరస్పర కన్యాదానమునే కన్నకొడుకుచే గ్రహింపించిన యవ్వారి యౌచిత్యజ్ఞత యభినందనీయము. అస్మదంతరంగంబు లణుమాత్రమేని యవ్విషయము స్పృశింపకున్నను నాత్మీయస్నుషను హైమకాంచ్యాదులచే నలంకరించిన వారి యౌదార్య మభివర్ణనీయము. పాణిగ్రహణ మైనదాది నానందనకు నానాఁటికిం బ్రవృద్ధమగు నాథుని మీఁది యనురాగము సాధుశ్లాఘ్యము. భవుఁడన్నను దత్సంబంధులన్నను దద్బాలిక చూపు ననురాగము వినయము విధేయత మున్నగు వివిధగుణములను వీక్షించినకొలఁది పడఁతులకుఁ బ్రాచీనులు విధించిన బాల్యవివాహములు పతులమీఁది ప్రేమబంధము ప్రౌఢలగులోపల బాఢమగుటకే యని రూఢ మైనది. మంగళసూత్రధారణ మగుటతోడనే మత్పుత్రిక మా మీ యని మాటలాడుటకు మనసువెట్టినది. జానపాటివారుగా నుండిన యస్మచ్ఛబ్దార్థమును స్వల్పకాలములో లంకావారుగా మార్చివేసి యస్మదాదుల కధికాశ్చర్యమును నానందమును గలిగించినది. లంకావారనిన లావుగా భావించినది. పట్టిగనైనను బుట్టింటి యత్తింటితరతమవాదముపొసఁగిన నత్తింటి పక్షముకా నారంభించినది. ఏలబహూకులు? ఈలంకపై నీఁగ వాలనీయదు. భర్తృపక్షమునఁ బరుషము పడనీయదు. ఒక్క నాబిడ్డయే యిక్కరణి వర్తించెడినని యేననను. ఎనిమిదితొమ్మిదిపదియేండ్ల వయసున వివాహితలగు చెల్లెలుపిల్లలు నిట్లే వర్తించుట యెంతయు నీక్షించుచున్నవారము. పతిమీఁది ప్రేమబంధ మిట్లు ప్రవృద్ధమొనరించు బాల్యవివాహములు పనికిరావని రజస్వలావివాహముల రచ్చకెక్కించుటకు రాజకీయ రంగములఁ గఠినశాసనములఁ బ్రవేశపెట్టు కాంగ్రెసుప్రముఖుల కార్యక్రమమే గర్హ్యమనుట కంటెఁ గాలపరివర్తనమును లోలోఁ దలంచుకొని యాకాలచక్రమును గ్రమ్మఱఁద్రిప్పుటకు గరుడధ్వజా కటాక్షమునే కాంక్షింతము. వాని కటాక్షమువచ్చువఱకుఁ గాంగ్రెసువారు మనలఁ గష్టపెట్టుచునే యుందురు. ప్రకృత మనుసరామః. పదియేండ్ల ప్రాయపు మదాత్మజ యుదంత మింతకన్నను లిఖితవ్య మేమియు నుండమిఁ బవిత్రచరిత్రగా నబ్బాలికం బరిరక్షించుటకు భగవానుఁడు ప్రార్థ్యమానుఁడు.

ఇంకొకబిడ్డ యీప్రమాది సం॥ వైశాఖ బ ౧౩ (17-5-1939) ప్రభవించినది. తల్లికి స్తన్యసమృద్ధి లేమిని డబ్బపాలతో నబ్భగవానుఁ డాబిడ్డను బోషించుచున్నాఁడు. చిన్నకొడుకునకుం బోలె నీచిన్నబిడ్డకును జింతలపాటి సుబ్బమ్మయే వచ్చి పురుడు పోసినది. రాధాకృష్ణమూర్తియని వానికిఁ బెట్టినట్లే దమయంతియని దీనికిని పేరుపెట్టినది. కాని రాధాకృష్ణనామము రాధాకృష్ణదైవముపైఁగల భక్తిని బ్రకటించినట్లు దమయంతీనామము దైవభక్తిని బ్రకటించుటకుఁజాలదు. దమయంతి యానాఁడు తద్దయుఁ బతివ్రతయైనను నీనాఁడు భోగినీగృహభూములను నవనాగరకభవనములను నామమాత్రావశిష్టయయియే నవయుచున్నయది. కాని ప్రకటీక్రియమాణ పాతివ్రత్యయై పరఁగుట కానము. నాగరకతా స్ఫోరక మైనను నాపేరంతగా నాకు రుచింపక మత్పితృపరంపరలో నిప్పటికి లేని మాతృదేవత పేరఁ బేరందేవమ్మయని పిల్చుకొనుచుంటిని. పేరమనూరమ లేరికిని ప్రీతిజనకలు ప్రకృతము కాకున్నను పేరమాంబికాగర్భశుక్తిముక్తాయమానునకు బిడ్డగూడఁ బేరమాంబికయగుట ప్రీతిజనక మైనది. పేరమ పేరందేవమ్మలమూలభూత మైన పేరు పేరంటాలు. కాని దాని మనవారు మఱియు మోటందురు. కావునఁ బేరందేవి యని బృందారకభాషం బొందుపఱిచితిని.

జగ:— ఈమాటల కేమిలే. నీటిసంగతికూడఁ గొంచెము సాఁగిపోయి, కొంచ మనిపించుచున్నది.

కృ:— పైనఁజెప్పినచొప్పునఁ బల్లములనుండు నెత్తైనప్రదేశములం బడి మరలఁ బల్లములకుఁ బ్రవహించుచుండును. కాలువలు వాఁగులు నేర్పడుట కీవాననీరే యాధారము. ఇట్టివాననీరు చెఱువులం జేరును. కొంతభూమియం దింకి మన మట్టితావుల బావులం ద్రవ్వింప నూటనీరగును అట్లింకనిది భూమిపైఁ బ్రవహించి నదులుగ నేర్పడును. వాననీరంతయును నిర్మలమైనదే. అయినను భూపతనమైన వెనుక నెట్టిపదార్థముతో మిళితమగునో యట్టిగుణముకల దగును. చవిటినేలలంబడి యుప్పనీరగును. మురుగుడుగుంటలం బడి మురికినీరగును. మంచినేలలోఁ బడినది మంచినీరగును. గాలియందుఁజేరియుండు మలిన పదార్థము వానకుఁ దడిసి బరువై భూపతనమునంది నిర్మలమగును. ఇందుచేతనే వర్షానంతరమున సూర్యకాంతి నిర్మలముగఁ బ్రకాశించును. వాయువు నిర్మలమైనవెనుకఁ బడు వాననీరు పరిశుభ్రముగ నుండును. కావుననే మేఘోదకము నపేక్షించువార లున్నతప్రదేశముల విశాలములగు పళ్ళెరముల నుంచెదరు. ఇది వైద్యు లుపయోగించెదరు కాని జనసామాన్యమున కనువుపడదు. ఇట్టినీ రుత్తమము. ఊటనీరు మిగుల మంచిది. లోఁతుగల బావులం దూరిన జల మారోగ్యకరము. కనుకనే యిట్టి మంచినీటిబావులకు సమీపమున మురికినీరు నిలవకుండునట్లు తెలిసినవారు మిగుల జాగ్రత్త పుచ్చుకొనుచుందురు. ఊటనీరు రెండవపక్షము. నదీజలము మూడవపక్షము. ఇది ప్రవహించెడు భూమితత్త్వము దీనియందు సంక్రమించుచుండును. దూరదేశసారమిందుఁ జేరుచుండుఁగావున నుత్తమమే యని కొంద ఱనుచుందురు కాని నదీజలము సంవత్సరమున నాలుమాసములు కాలుష్యముతో మిళితమై యుండును. వర్షములు నిలిచిపోయిన యనంతరము 2 మాసములకుఁ దేఱుకొనును గాని నదీతీరస్థులు నిరంతరము నందుఁ గలుపుచుండు కల్మషము దిగువనుండు వారి యారోగ్యమునకు భంగకరము గాకుండుననుట విశ్వాసార్హముగ లేదు. గాలికివలెనే నదీజలమునకును వ్యాపనమువలన మాలిన్యము తఱుచుండవచ్చును. నిశ్శేషమగునని తలంచ నవకాశము లేదు. నదులంచలి యిసుకనేలలం దీయఁబడు చెలమలలోని నీరు నదీజలముకంటె నారోగ్యకరము.

జగ:— గొప్పనదులలోఁ గొండలుకూడఁ గొట్టుకొనిపోవునట్లుండునే; మనము తెచ్చుకొనెడి బిందెఁడు నీళ్ళలో నేమాత్రము మురికివచ్చును? చీమంత కలయునని యనుకొన్నను నది మన కేమిహాని చేయఁగలదు?

కృ:— సామాన్యముగా నదు లెండిపోవునప్పుడు వానినిండ నిసుకతిన్నెలు మనము చూచుచున్నాము. నది నిండి ప్రవహించునప్పు డెంతనీరుండునో యంత దనుక యిసుక దిగఁబడినదని దానినిజూచినప్పుడు తోఁచకమానదు. ఇట్టియిసుక నది నిండ నెవరు తెచ్చిపెట్టిరి? నదియందు దొరలుచుండు రాళ్ళొకదాని నొకటి

యొరసి రాలిన పొడియే యీయిసుక. ఎగువభాగముల నిట్లు దొర్లిదొర్లి యరఁగిపోయిన గుండ్రాళ్లును నీయిసుకతిన్నెలవలె నదినిండ గోచరించుచుండును. సముద్రమునకు నీటివేటు పోఁగా మిగిలి యడుగునఁ జేరినయిసుకయే యింత బహుళముగ మన కగపడుచుండ నీక నీటిలోఁ గలసి యెంతయిసుకయున్న నితరకాలుష్యము నీటియంతటను గలసి యనుక్షణముఁ బ్రవహించుచుండునో యది యుదకమునఁ దెలిసికొనవలసినదే కాని మఱియొండువిధమున వలనుపడదు. ఏటిపొంగిపొరలునప్పుడు బిందెఁడునీట నొకచిల్లగింజ యరగఁదీసి నీరు తేర్చి యానీటినే నదీతీరవాసులు వాడుకొనుచుందురు. అబిందె యడుగున నెంతమడ్డి పేరుచుండు? తటాకోదకము నదీజలమున కనంతరపుఁదరగతియగు నాలవ స్థానము నలంకరించును. నిత్యము మనకిచట నీవాల్గవతరగతి నీరే పానీయమగుచున్నది. కావుననే తటాకోదకము నెవరైనను స్నానముచేసియు వస్త్రములుతికియు మలినపఱుపకుండ భటుని గాపలియుంచుదురు. మనవారిలోఁ గొందఱందును లోఁబడి నడచుకొనక తమకుఁగల యధికారావకాశములను బట్టి భటుని వశపఱచుకొని స్నానాదికముల నొనరించుట మన మప్పుడప్పుడు చూచుచున్నాము. ఇట్లు నియమము నతిక్రమించుటచే నెవరికిఁ జెఱుపుకలుగునదియుఁ దలంపఁజాలరు. నీతిబాహ్యులు స్వప్రవర్తనాఫలము గననేరక యిక్కట్టులపాలఁ బడుచుండునట్లు మనవారును స్వయంకృతాపరాధమగు నిట్టి మలినీకృతజలపానముచే సంభవమగుచుండు సిలుగులఁ దొలఁగించుకొనఁజాలరు. మనము స్నానమాచరించునట్టియు మఱికిగడిగినట్టియు నుదకమును మనమే పానమొనరించుచున్నామని వినుట లజ్జాకరము. తటాకమునం దధికజలము కలదుకావునను జలమునందలి మాలిన్య మధికముగ నడుగంటి పైనఁ దేటనీరు నిలచుచుండుఁ గావునను దినదినము నట్టికాలుష్య మందుఁ జేరుచుండినను నది తోడనే యారోగ్యభంగము గావింపఁజాలకున్నను గాలక్రమమున నపాయకరమగుటకు సంశయములేదు తటాకమునందు మాలిన్యముఁ జేర్చుట సుకరముగాని యది తీసివేయుట దుష్కరము. ఎవరికివారు సూక్ష్మమని కలిపిన మాలిన్యము దినదినముఁ బెరిఁగి క్రమముగా నుదకమునంతను జెఱచును. వేసవికాలమున నీరు తఱుగుచుండుటయు మాలిన్యము పెరుగుచుండుటయుఁ గలుగుచుండును. ఈసంగతి మన మెఱిఁగియుండియు నట్టిపను లొనరించుట కడునింద్యము. దీనింబట్టియే చాకిరేవుల కడ నీరు నెపుడును స్నానపానాదులకు వాడరాదనియు నెంతనిర్మలోదకమునైనను వడియఁబోయనిది త్రాగరాదనియు మనవారు నిర్ణయించియున్నారు. వడియఁబోసియుఁ జిల్లగింజగాని పొకచెక్కగాని యరగఁదీసినగంధము కల్పియుఁ బటికపొడిఁ జేర్చియు మఱికినీటిని శుభ్రపఱచవచ్చును. నీటిని శుభ్రపఱచుట కిటీవల నింకనొకసాధనము నమర్చియున్నారు. నీరు బాగుగఁ గాఁచినచో దానియందలి విషవికారములు గంటికిఁ గానరాని సన్నపురుగులును నశించును. కాఁచినయుదకము చల్లారినవెనుక వడియఁబోసి త్రాగుట మేలు.

తే. పుడమిఁ గనిపెట్టకయ తోఁచిన నడిచిన నడవ
నడిచియంబోయని జలము ద్రావంగఁ ద్రావ
నిజముకానట్టిమాటలు నెఱప నెఱప
ముప్పు తప్పక వాటిల్లు నెప్పుడైన.

అనియు నార్యవచనము కలదు. ఇది మనము ముఖ్యముగ జ్ఞాపకమం దుంచుకొనవలసిన విషయమైయున్నది. ఉప్పగ నుండు నీరును మురికినీరును బుచ్చుకొనుటకుఁ గాని వంటచేయుటకుఁ గాని వాడఁ గాదు. కంచిపప్పుడమకు నీరు మాత్రము పచనాదిక్రియలందు వాఁడఁదగును. లోఁతైన బావులయందలి జలమునకుఁ గాఠిన్యము కలియ నవకాశము తక్కువగుటచే నవి యారోగ్యప్రదములని చెప్పుదురు. సముద్రోదకమున నావిరి దింపి మంచినీరు గావింపవచ్చుననియు నది మిగుల నారోగ్యకరమనియు వినియున్నాను.

జగ:—మనకంటికి నిర్మలముగాఁ గనఁబడెడి దెల్ల మంచినీరని యనుకొనవచ్చునా ?

కృ:— నీటిని మన మెట్టివర్ణముగల పాత్రయం దుంచుదుమో యావర్ణమునే కలిగియుండిన నిర్మలమనవచ్చును. నీరును బాత్రమును నిష్కల్మషము లైనవో బాత్రయందు నీరున్నవిధము తెలియరానట్లుండును. సమీపవస్తువులెల్ల నీటియందుఁ బ్రతిఫలించుచుండును.

కాన నట్టి ప్రతిబింబముచే నీటికి వర్ణమున్నట్లు తోఁచుట కలదు. ఒకనగరమునం దొకప్పుడు వాంతిరోగము ప్రబలియుండెను. అప్పు డొకయిల్లాలు తమయింట నిట్టిబాధకలిగినఁ దత్సంబంధములగు గుడ్డలను నితరమాలిన్యమును దమయావరణమందుఁగల యొకగుంటయందుఁ గప్పిపెట్టెను. ఈరోగ మాపట్టణమున నివృత్తియైన కొంతకాలమున కీయింటిపొరుగువారి కెల్లరికిని గలరా యకస్మాత్తుగాఁ గలిగెను. అప్పు డాచుట్టుప్రక్కల నెచ్చట నీరోగము లేనికారణమునఁ బ్రభుత్వమువా రీవిషయముంగూర్చి గట్టి విమర్శన గావించిరి. ఆయిల్లాలు కప్పిపెట్టిన మాలిన్యముకల గుంట వాననీటిచే నిండి యామాలిన్యరస మాయింటి బావిలోనికి జాఱుటచే నారోగ మంకురించెనని నిశ్చయించిరి. వాంతి బహుఘోరమగు నంటురోగమగుటచేఁ దత్కారణ మంతలోఁతుగ విమర్శించుట కలిగినది. అట్లుకాక సామాన్యమాలిన్యము కలియుచుండిన యాయుదకము పానమొనరించువారికి సాధారణవ్యాధు లంకురించియుండిన నీమూల మెఱుఁగుట దుష్కరమై మందులతోడను బథ్యములతోడను బ్రయాప్రయాసలకు లోనై కుదకాయింటనుండుట కనుమానము కలిగెడిది. కావున నాపత్తులు కలిగినప్పుడు తొలఁగించుటకుఁ బ్రయత్నించుటకంటెఁ జేతనైనంతవఱకు మన మట్టి యాపత్కారణముల నరసి తెలిసికొని తన్నివారణ మొనరించుకొనుట మిక్కిలి శ్రేయోదాయకము. ఈమాటలు నేను వినియుండుటచేతనే మనబావివద్దఁ బల్లములు పూడ్పించి వాడుకనీరు దూరముననుండు నరటిచెట్లు పీల్చున ట్లొన

రించితిని. తటాకములందును దిగుడుబావులందును మడుఁగులు పిడుచుటయును నొడలు కడుగుటయుఁ గడు నింద్యములు. ఆమాలిన్య మంతయును నీటియందుఁ జేరి కొంచెముకొంచెముగ మన దేహమున కెక్కి యారోగ్యమును భంగపఱచుట నిస్సంశయము. గ్రామవాసు లనేకులు వాపీజలపాన మొనరించుచుందురు. అచటనచటఁ దిరుగుచుండుటచే మలినములైన పాదములతో నొకటిరెండు మెట్లు నీటిలోనికి దిగి జలగ్రహణ మొనరించి త దుదకపాన మొనరించుచుందురు. కొందఱు కక్కుర్తిగలవార లందు వస్త్రప్రక్షాళన మొనరించుటయుఁ గల్గుచుండును. ఇందువలన నట్టిదిగుడుబావుల నీరు ద్రావువారిలోఁ బెక్కండ్రకు నారాయణమూర్తి ప్రత్యక్షమగుచుండును.

జగ:- ఏమిటే మహాచమత్కారముగా మాటలాడుచున్నావు ? ఎవరో దిగుడుబావుల నీరు త్రాగుటయేమి ? అందుఁ జాలమందికి నారాయణమూర్తి ప్రత్యక్షము కావుటయేమి ? వింతగా నున్నదే?

కృ:- అత్తగారూ ! నారాయణమూర్తియన్న మీకుఁ దెలియలేదా ? అది మాదేశపు వాడుకమాట. ఆబాధ లీవైపున లేవు. అందువలన మీరీమాట విననే లేదని తోఁచుచున్నది. ఆదేశమున నారికురుపులచే నలమటఁ జెందువారల కెల్లరకును నారాయణమూర్తి ప్రత్యక్షమయ్యెననుచుందురు. అనుభవించెడువారికే యా బాధ తెలియును. చెప్ప నలవికాదు. ప్రావృట్కాలమున నుఱుము లారంభమైన తోడనే యీకురుపులు బైలుదేఱును. తఱుచుగఁ గాళ్ళయం దంకురించును. కాని దాని కొక స్థలనియమము లేదు. నాలుకయందులేచి బాధపడువారును గలరు. ఈబాధాపీడితులు కొంద ఱాఱుమాసములవఱకు సర్వార్థములుఁ దమ మంచములకడనే నివృత్తికావించుకొనవలసినంత దుస్థితి ననుభవించెదరు. ఇది యొకసారితోఁ గడముట్టదు. మరల నుఱుములు తటస్థించునాఁటి కిది మొలకరించుచుండుట వాడుక.

జగ:- నారికురుపు లేమిటమ్మా ? ఎప్పుడును వినలేదు. చూడను లేదు. కొంచెము వివరముగాఁ జెప్పుదూ !

కృ:- అత్తగారూ ! అనుభవపూర్వముగఁ దెలియని విషయము లన్నియుఁ వింతగ నుండుట స్వాభావికమే. పాఱుడునీరును గూపోదకమును దటాకజలమును బానమొనరించుదేశములవారి కీబాధలు లేవు. వాపీజలపానమొనరించువారి కెల్లరకు నిది యనుభవమే. అన్నికురుపులవలె నారికురుపు గడ్డతేలి మొనచిట్లును. దానినుండి నెత్తురుకాని చీముకాని రాక నారి(తెల్లనిదారమువంటి పురుగు) బైలుదేఱును. అది బైలుపడినకొలఁది నొకపుల్లకుఁ జుట్టి యాకురుపు కంటఁగట్టియుంచుదురు. తెగిన బాధ మెండగును. దాని నెఱిఁగినవారు నేర్పుగ దినమున కొక జానెఁడు మూరెఁడు చుట్టుచుఁ దెగకుండ సాంతముగ లాగివైచెదరు. ఇట్లు సాంతముగ వెలువడుటకుఁ గొన్నిమాసములు పట్టును. అది ముగిసినవెనుక మఱియొకస్థలమున మొలకెత్తుటగాని యంతట సమసిపోవుటగాని మరల నొకేసారి పెక్కుచోట్లఁ గురుపులుగ నంకురించుటగాని కలుగుచుండును.